జ్ఞాన యోగం

# మలయాళ సద్గురు గ్రంథావళి-17(బ్రహ్మచర్య,గృహస్థాశ్రమ,సన్యాస,శ్రీనిర్యాణ)



ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్

www.freegurukul.org

# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్ధికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్థం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ మలయాళ సద్గురు గ్రంథావళి

## పదునేడవ సంపుటము

బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమ ధర్మము, సన్న్యాసయోగము,
శ్రీనిర్వాణనిలయము

ప్రకాశకులు
శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము
శ్రీవ్యాసాశ్రమము
చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్
2001

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంథాలు పాఠకలోకానికి సుపరిచితాలే. ఈ గ్రంథాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు. ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది.

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంథాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి. అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి. జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి.

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంథాలుగా ముద్రింపబడివున్నాయి. వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంథ రాశిగా ''శ్రీమలయాళసద్గురు గ్రంథావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు. ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు.

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది. ఇంచుమించు ఆగ్రంథాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా

లుంటాయి. ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి.

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు. ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది.

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంథ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము.

శ్రీ వ్యాసాశ్రమం

ప్రకాశకులు





# తొలిపలుకు

శ్రీమలయాళ సద్గురు గ్రంధావళిలో ఇది పదునేడవ సంపుటం ఇందులో ఈ క్రింద పేర్కొన్న గ్రంధాలు క్రోడీకరించడమైంది

1 బ్రహ్మచర్యము, 2 గృహస్థాశ్రమ ధర్మము, 3 సన్న్యాసయోగము మరియు 4 నిర్వాణనిలయము

శ్రీసద్గురు స్వాములవారు బ్రహ్మచర్యాన్ని గురించి పలు గ్రంధాలలో సందర్భానుసారంగా ప్రస్తావించి వున్నారు అయినా బ్రహ్మచర్యానికి గల ప్రాముఖ్యాన్ని దృష్టిలో పెట్టుకొని సాధకుల కోరిక మేరకు 'బ్రహ్మచర్యం' అన్న పేరుతో ప్రత్యేకంగా ఒక గ్రంధమే వ్రాశారు ఇందులో బ్రహ్మచర్యానుష్ఠానానికి సంబంధించిన అంశాలనన్నింటినీ సమగ్రంగా నిరూపించారు

విస్తృత వ్యాప్తి పొందిన శ్రీవారి రచనలలో 'గృహస్థాశ్రమధర్మము' ఒకటి ఇందులో గృహస్థాశ్రమానికి గల ప్రాశస్త్యం అనేక విధాల నిరూపించడమైనది సీత, సావిత్రి, దమయంతి మున్నగు పతివ్రతల పవిత్ర చరిత్రలను రామాయణాది గ్రంధాలనుండి ఉదాహరిస్తూ గృహస్థజీవనంలో నారీమణులకు గల ప్రాముఖ్యాన్ని ఈ గ్రంధంలో చక్కగా ఉగ్గడించారు పంచాగ్నివిద్య మొదలైన అతి ముఖ్యాంశాలను గూడ విశదీకరించారు గృహస్థులందరూ మిక్కిలి శ్రద్ధతో పఠించదగిన గ్రంధమిది

నాలుగాశ్రమాలలో మూడవదైన వానప్రస్థాశ్రమాన్ని గురించి విడిగా గ్రంధం వ్రాయకున్నా ఈ గ్రంధంలోనే వానప్రస్థుల లక్షణాలను గూడ సందర్భానుసారంగా నిరూపించారు

ఈ గ్రంధం పీఠికలో శ్రీసద్గురు దేవులు గోగర్భంలో తాము తపస్సుచేసే కాలంలో తమకు గలిగిన సమాజ సంస్కరణాభిలాషనూ, అందుకై ప్రయత్నించిన విధానాన్నీ కూడా పేర్కొని వుండడం గమనార్హం.

'సన్న్యాసయోగం' లో స్త్రీలకు కూడ సన్న్యాసాధికారం కలదని శ్రీవారు అనేక ప్రమాణాలతో నిరూపించారు ఇందలి 'సులభాజనక సంవాదం',

'చూడాలోపాఖ్యానం' చాలా ముఖ్యమైన ఘట్టాలు సన్న్యాస విషయంలో జిజ్ఞాస గల పురుషులుగూడా గ్రహించవలసిన ధర్మాలు ఈ పుస్తకంలో వున్నాయి

చివరిదైన 'నిర్వాణనిలయము'లో నిర్వాణస్థితిని పొందిన మహాత్ముల స్వరూపస్వభావాలను అనేక ప్రమాణాలతో శ్రీస్వాములవారు చాలా చక్కగా విశదీకరించారు సన్న్యాసులు ఏ విధంగా వుంటే లోకపూజ్యతను పొందుతారో ఆ విషయాలన్నీ సప్రమాణంగా ఇందులో నిర్దేశించడం జరిగింది

బ్రహ్మచర్యం మొదలైన ఆశ్రమాల క్రమాన్నీ, చివరి లక్ష్యమైన నిర్వాణస్థితినీ దృష్టిలో పెట్టుకొని ఈ నాలుగు గ్రంధాలనూ నిర్దిష్ట క్రమములో క్రోడీకరించడం జరిగింది

భారతీయ జీవన విధానంలో బ్రహ్మచర్యాదులైన నాలుగాశ్రమాలు ఎంతో ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్నాయి శాస్త్రోక్తవిధి ననుసరించి ఆశ్రమధర్మాలను శ్రద్ధతో పరిపాలించేవారు మానవ జీవితలక్ష్యమైన నిర్వాణస్థితిని పొందగలరనడంలో ఏ మాత్రం సందేహం లేదు.

అందుకే శ్రీమలయాళ సద్గురుస్వాములవారు చతురాశ్రమాల స్వరూపాలను విపులంగా వివరిస్తూ పై గ్రంథాలను రచించారు లోకానుగ్రహకాంక్షతో శ్రీవారు రచించిన ఈ గ్రంధాలు ప్రజలలో బహుళ వ్యాప్తిని పొందివుండడం ఆనందదాయకం

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవాల సందర్భంలో శ్రీమలయాళ సద్గురు స్వాములవారి రచనల నన్నింటినీ క్రోడీకరించి "శ్రీమలయాళ సద్గురు గ్రంధావళి" అన్న పేరుతో ఇరువది సంపుటాలుగా ప్రచురించే సదవకాశం లభించడం శుభావహం. ఆత్మోన్నతిని ప్రసాదించే ఈ గ్రంధావళిని భక్తులు ఆదరంతో పఠించి కృతకృత్యులై శ్రీసద్గురు దేవుని అనుగ్రహానికి పాత్రులగుదురుగాక!

శ్రీవ్యాసాశ్రమము సముద్రాల లక్ష్మణయ్య

**14-11-2000.**

# విషయ సూచిక

## 3. సన్న్యాస యోగము

## (313-424)



## 4.శ్రీనిర్వాణ నిలయము

## (425-580)



### ప్రథమ పటలము



### ద్వితీయ పటలము



### తృతీయ పటలము





# బ్రహ్మచర్యము

## భూమిక

ప్రజ్ఞానిధులారా! బ్రహ్మచర్యమును గురించి ఒక గ్రంథమును వ్రాయవలయునని ఈ యుపాధితో చాలాకాలమునుండి యనేకులు తెలుపుచుండిరి. ఇదివరలో వ్రాయబడిన శుష్కవేదాంత తమోభాస్కరాది గ్రంథములలో అచ్చటచ్చట ఆ విషయమును గురించి కొంచెము కొంచెముగా వ్రాయబడినది అయితే "బ్రహ్మచర్యము"ని ప్రత్యేకముగా నొక గ్రంథము వ్రాయబడి యుండలేదు నిర్వాణనిలయము వ్రాయునప్పు డిక వేదాంత విషయమై గ్రంథమును వ్రాయుట లేదనియు, ఇది కట్టకడపటి గ్రంథమనియు కొందఱికి తెలుపబడియుండెను అయితే దానికిముందుగా అనేక బ్రహ్మనిష్ఠులున్ను, ముముక్షువులున్న ఈ బ్రహ్మచర్య విషయమై ప్రత్యేకముగా నొక గ్రంథమును రచించిన బాగుండునని తెలుపుచుండిరి ఈ బ్రహ్మచర్య గ్రంథమునకు సంబంధించిన కొన్ని విషయములు అప్పుడే వ్రాసిపెట్టినందుచేతను, ఈ పుస్తకము యధార్థభారతిలో నెలనెలకు కొంత కొంత ముద్రించవచ్చునని తలంచడమైనది. అదికొందఱు తెలిసికొని వారందఱున్ను ఇట్టి యుత్కృష్టమయినదియు, విరక్తులకు అత్యవసరమైనదగు ఈ పుస్తకము మాసపత్రికలో ముద్రించుచూ వచ్చిన ఎప్పుడో పత్రికలో చదివినది పూర్ణముగా మనస్సులో నిలుచుటకు సాధ్యము కాదనియు, ప్రత్యేకము గ్రంథ రూపముగా నుండిన సామాన్యజనులకు గూడ జ్ఞాపకములో నుంచుటకు సాధ్యపడునని తెలుపుటచేత పుస్తక రూపముగా ముద్రించడమైనది

మన పూర్వీక ఋషులేగాక శ్రీ యేసుక్రీస్తు మొదలయిన ప్రవక్తలంద ఱును ఈ బ్రహ్మచర్యమును గురించి యెంతో విస్తారముగా తెలిపియు న్నారు. త్రిమత కర్తలగు శ్రీశంకర, శ్రీరామానుజ, శ్రీ మధ్వాచార్యులున్ను బ్రహ్మచారులే వీరిలో శ్రీరామానుజులు వివాహము చేసికొనినను సంతానో త్పత్తికి ముందుగానే మహావిష్ణుభక్తులై పరమత్యాగులై సన్న్యసించిరి. శ్రీగౌతమబుద్ధ దేవులు వివాహితులై

ఇది అనాదిదైయైనను ఆధునికులు నూతన ధర్మమని తలంతురు గృహస్థులుగూడ వంశోద్ధారకులగు సంతానములను కనవలసియుండిన గృహస్థ బ్రహ్మచర్యమునైనను తప్పక యనుష్ఠించవలయు లేనిచో అల్పాయువులు, ప్రజ్ఞాహీనులు, రోగగ్రస్తులు, దుష్టగుణపూరితులగు సంతానములే గలుగుచుందురు మనుస్మృతి, భవిష్యత్తు మహాపురాణమునుండి మాత్రమే బ్రహ్మ చర్య నియమము గ్రహించడమైనది ఇక గౌతమధర్మ సూత్రము మొదలగు గ్రంధములలో గల బ్రహ్మచర్యము వ్రాయబూనిన గ్రంధము పెరుగునని తలంచి దీనిలో చేర్పలేదు. అవన్నియు మనుస్మృతిని అనుసరించియే యున్నవి. దానికన్న నెక్కువ యేమియు కనుపించుట లేదు ఈ విషయమై ఆయుర్వేదకర్తయగు ధన్వన్తరి మహర్షి తెలిపినది చూడుడు.

ఒకప్పుడు ధన్వన్తరి మహర్షి తనయాశ్రమమున గూర్చుండి శిష్యులకు ఆయుర్వేదమును చెప్పుచుండెను పాఠములజెప్పి పూర్తియైన తర్వాత, ఓ గురువర్యా! దేనిని సేవించిన సర్వరోగములు నాశనమై మానవులు ఆయురారోగ్యములు గలిగి సుఖించెదరో అట్టి దానిని తెలియజేయుడు అని శిష్యులు కోరిరి

ఇట్లు ప్రార్థించిన శిష్యుల ప్రార్థనలను విని ధన్వన్తరి మహర్షి అత్యన్త ప్రసన్నుడై, ఓ వత్సలారా! మీరు నిష్కల్మషమనస్కులై వినుడని యిటుల చెప్పదొడంగెను -

**మృత్యువ్యాధిజరానాశి పీయూషం పరమౌషధమ్ ।**
**బ్రహ్మచర్యం మహద్యత్నం సత్యమేవ వదామ్యహమ్ ॥**

బ్రహ్మచర్య వ్రతము అమృతస్వరూపమై మరణమును, రోగమును, వృద్ధావస్థను నాశనము చేసెడిదై యున్నది ఇది నిజము, మఱియు,

**ఓషధయో భూతభవ్యం అహోరాత్రే వనస్పతిః ।**
**సంవత్సరః సహర్తుభిః తే జాతా బ్రహ్మచారిణః ॥**

ఓషధులు, వనస్పతులు, భూతభవిష్యములు, దివారాత్రములు,

ఋతువులతో సంవత్సరము, ఇవన్నియు బ్రహ్మచర్యవ్రతగాములే ఈ విషయమై విశేషార్థముతో ఈ గ్రంథమున వ్రాసియుండు భాగమున చూడ గలరు

యథా పయసి సర్పిస్తు గూడశ్చేక్షౌ రసో యథా ।
శరీరేషు తథా శుక్రం నృణాం విద్యాద్భిషగ్వర: ॥ (సుశ్రుతము)

ఏలాగున క్షీరమున ఘృతము, చెరుకున రసము సర్వత్ర వ్యాపించి యున్నదో, ఆలాగున శరీరమంతటను మానవులకు శుక్లము వ్యాపించియు న్నది. ఈ సత్యమును వైద్యకోవిదుడు బాగుగా తెలిసికొనవలయును పాల నుండి వెన్న తీసిన పిప్పి యెట్లు నిరర్థకమగునో, అట్లే శరీరమునుండి శుక్లము నష్టమయిన అతని జీవితము నిస్సారమగును

పురాకల్పే కుమారీణాం మౌంజీబన్ధనమిష్యతే ।
అధ్యాపనం చ వేదానాం సావిత్రీవచనం తథా ॥

పూర్వ కాలమున బాలికలు ఉపనయనమునొంది వేదములను బోధించుటకున్ను, గాయత్రీ మన్త్రమును జపించుటకున్ను అధికారిణులై యుండిరి అని మనుస్మృతి దీనిని ఆధారముచేసి కొనియే ఆర్యసమాజస్థులు కన్యా గురుకులము నిర్మించి బాలికలచే వేదాధ్యయనము చేయించుచున్నారు

ఓం తత్సత్

ఇట్లు

మీ చరాచర సుఖాభిలాషి

శ్రీ మలయాళస్వామి



# బ్రహ్మచర్యమ్

బ్రహ్మచర్యం ప్రవక్ష్యామి బ్రహ్మప్రాప్తికరం నృణామ్ ।
ఆయురారోగ్యమైశ్వర్యం మనస్స్వాస్థ్యం శివాత్మకమ్ ॥ 1

నేను బ్రహ్మచర్యమును గూర్చి చెప్పుచున్నాను అయ్యది సకల జనులకును బ్రహ్మప్రాప్తిని (మోక్షమును) గలుగజేయును ఆయుస్సును, జ్ఞానసంపత్తును, మనస్సుకు నిలకడను కలిగించును మఱియు ఆ బ్రహ్మచర్య మనునది శివస్వరూపము అనగా మంగళరూపము, పరమశివమైనది

తద్భేదం త్రివిధం వక్ష్యే స్థూలం సూక్ష్మం చ కారణమ్ ।
వ్యాయామః ప్రథమః ప్రోక్తః మనోనైర్మల్యకం తథా ॥ 2
ఆత్మశుద్ధిస్తృతీయా చ మోక్షస్సిద్ధ్యతి తేఽనఘ ।
త్రివిధం బ్రహ్మచర్యం చ సాధనీయం సదా జనైః ॥ 3

ఆ బ్రహ్మచర్యము 1 స్థూలము, 2 సూక్ష్మము, 3 కారణము అని మూడు విధములై యున్నది అందులో 1 స్థూలబ్రహ్మచర్యము వ్యాయామము, 2 సూక్ష్మబ్రహ్మచర్యము మనోనిర్మలత, 3 ఆత్మశుద్ధి, ఇది కారణబ్రహ్మచర్యము ఆత్మపరిశుద్ధతను గాంచినప్పుడే కారణమగు మూలావిద్య (కారణ శరీరము) నశించును గాన నిది కారణ బ్రహ్మచర్య మనబడును. ఓ పాపరహితుడా! ఈతృతీయ బ్రహ్మచర్యము చేతనే (ఆత్మజ్ఞానముచేతనే) ముక్తి (పరమపదము - నిర్వాణము) లభించును ఇచ్చట 1 వ్యాయామ పదముచే ఆసనాదులు 2 మనోనైర్మల్యక పదముచే ప్రాణాయామాదులు గ్రహించవలెను. ఈ మూడు విధములైన బ్రహ్మచర్యములు పరస్పరము సంబంధించి యుండుటచేతను త్రివిధ శరీరములను శుద్ధములుగ జేయునవి యగుటచేతను ఎల్లప్పుడు [illegible] సాధించవలయును అందుచే వారికి మోక్షము సులభము. వ్యాయామము

శరీరపరిశ్రమ పరమగు పనియని గూడ గ్రహించవలయును దీని వలన జీవనోపాయ మేర్పడగలదు ఆరోగ్యమున్ను సిద్ధించును ఇదే నిజమగు వ్యాయామమని గ్రహించుకొనవలయును

యోగాసనం చ వ్యాయామే ప్రాణాయామశ్చ మానసే ।
పరమాత్మ స్వరూపస్య విదుర్జ్ఞానం తృతీయకే ॥ 4

ఇక మూడు విధములగు బ్రహ్మచర్యముల స్వరూపమును నిరూపించుచున్నారు.. వ్యాయామ బ్రహ్మచర్యములో యోగాసనాదులున్ను, మానస బ్రహ్మచర్యములో ప్రాణాయామాదులున్ను, ఆత్మశుద్ధిరూప బ్రహ్మచర్యములో పరమాత్మ స్వరూపజ్ఞానమున్ను చేరుచున్నవి

పునశ్శృణు మహాప్రాజ్ఞ ఆహారః కరుణా దృఢా ।
బ్రహ్మాత్మభావనం చేతి ఋషీణాముత్తమం మతమ్ ॥ 5

ఓ మహాప్రాజ్ఞా! ఆహారము, కరుణ, బ్రహ్మాత్మభావనము, (బ్రహ్మమే తానని తలంచుట) అని బ్రహ్మచర్యము మరల మూడువిధములు. దీనిని వినుము బ్రహ్మాత్మ భావనరూప బ్రహ్మచర్యము ఉత్తమోత్తమమని ఋషుల మతము

ఆహారస్సత్త్వజనకం కరుణా భక్తివర్ధినీ ।
బ్రహ్మభావనయా స్వస్మిన్ స్వయం బ్రహ్మాత్మనిశ్చయః ॥ 6

సత్త్వగుణాభివర్ధకమగు సాత్త్వికాహారము సేవించుటయు బ్రహ్మచర్యమే యగును భక్తిని వృద్ధిచేయు కరుణయు బ్రహ్మచర్యమే ఇది ద్వితీయ మనబడును తృతీయమగు స్వాత్మయందు బ్రహ్మభావనయు బ్రహ్మచర్యమే, దీనిచే తాను ఆ బ్రహ్మమే యను నిశ్చయజ్ఞానము కలుగును

గార్హస్థ్యం నైష్ఠికం చేతి వైధురం చేతి తత్త్రిధా ।
ఆజన్మనైష్ఠికం ప్రోక్తం గృహిణామృతుకాలజమ్ ॥ 7

గార్హస్థ్యం ప్రాప్తవాన్యస్తు భార్యయా నాశతో యది ।
బ్రహ్మచర్య ముపాదత్తే తద్వైధురమితీరితమ్ ॥ 8

నైష్ఠికము, గార్హస్థ్యము, వైధురము అని ఆ బ్రహ్మచర్యము మూడు విధములుగా నున్నది పుట్టుక మొదలగు మరణపర్యన్తము ఏలాటి దోషములు లేక నాచరింపబడు బ్రహ్మచర్యము నైష్ఠికము, ఇందులకు దృష్టాన్తము, శ్రీశుక-అంజనానన్దన, భీష్మాదులు ఋతుకాలమునందు మాత్రము విషయములయందు ప్రవర్తించి ధర్మబద్ధుడై బ్రహ్మచర్యము ననుష్ఠించుట గార్హస్థ్య బ్రహ్మచర్యము ఇటుల నాచరించినవారు శ్రీ రామ, జనకాదులు ఏ గృహస్థుడు భార్య పరలోకగతురాలైన పిమ్మటగాని లేక భార్య యున్నప్పుడే విరక్తుడయిగాని బ్రహ్మచర్యము నాచరించునో అది విధుర బ్రహ్మచర్యము విశ్వామిత్ర, యాజ్ఞవల్క్యాదులు దీనికి దృష్టాన్తభూతులు

భూయస్తత్త్రివిధం వక్ష్యే మనోవాక్కాయ సంభవమ్ ।
క్రియారూపం కాయికం చ వాగ్రూపం వాచికం తథా ॥ 9
సంకల్పం మానసం ప్రోక్తం తస్మాద్దోషత్రయం త్యజ ।
దోషత్రితయహీనేన బ్రహ్మచర్యం ప్రతిష్ఠితమ్ ॥ 10

ఇకను ఆ బ్రహ్మచర్యము మానసికము, వాచికము, కాయికము అని మూడు విధములుగా నున్నది వాటి స్వరూపము జెప్పుచున్నాను వినుము 1.మానసిక బ్రహ్మచర్యము- మనస్సున నేలాటి విషయసంకల్పములు లేకుండుట, 2. వాచిక బ్రహ్మచర్యము- వాక్కుతోను విషయాభిలాష ప్రయుక్తాలాపములు లేకుండుట 3 కాయికబ్రహ్మచర్యము- శరీరముతో సంబన్ధము లేకుండుట అందఱికిని ఈ త్రివిధబ్రహ్మచర్యము అనుష్ఠేయము అటుల లేక తద్విషయమును తలంచుటయు, మాట్లాడుటయు, తత్క్రియ సల్పుటయు జేసెనేని మానసిక వాచిక కాయికరూప త్రివిధ దోషములు వాటిల్లును ఈ మూడు దోషములు లేక ఆచరింపబడు బ్రహ్మచర్యమే సుదృఢతర ప్రతిష్ఠితను గాంచును

బ్రహ్మచర్యం దృఢం యస్య సాగరో గోష్పదాయతే ।
బ్రహ్మచర్య విహీనస్య గోష్పదం సాగరాయతే ॥ 11

బ్రహ్మచర్యవ్రతదార్ఢ్యము గలవానికి సాగరము గోష్పదజలమువలెను, ఆట్టి

వ్రతము లేనివానికి గోపాదజలము సముద్రమువలెను కనుపించును అనగా మనోబల దుర్బలభేద మీలాగున నుండును

బ్రహ్మచర్యవతో భీమస్సింహోఽపి శునకో భవేత్ ।
బ్రహ్మచర్యస్య హీనే తు శ్వా భీమస్సింహవద్భవేత్ ॥ 12

బ్రహ్మచర్యవంతునికి సింహము కుక్కవలెను, బ్రహ్మచర్యవ్రతహీనునకు శునకమునహో సింహమువలెను భయంకరముగా గోచరించును ఇదియు మనోదార్ఢ్యమును గురించి తెలుపుచున్నది

భజతో బ్రహ్మచర్యం స్యాన్మేరుః ప్రత్యన్తపర్వతః ।
బ్రహ్మచర్యేణ రిక్తస్య భవేత్పాదన్సురాచలః ॥ 13

బ్రహ్మచర్యనిష్ఠునకు దుర్గమమగు మహా మేరుపర్వతము చిన్నగుట్టవలెను, బ్రహ్మచర్యవ్రత రహితునకు చిన్నగుట్ట సహా మహోన్నతమేరు పర్వతమువలె దుర్గమముగ దోచును

బ్రహ్మచర్యేణ యుక్తస్య దగ్ధకాననభూతలః ।
దావో దీపాయతే దీపో భవేద్రిక్తస్య దావవత్ ॥ 14

బ్రహ్మచర్యవ్రతము గలవానికి భూతలమున నరణ్యమును దహించుచు మహోజ్జ్వలమై వచ్చుచుండెడి దావాగ్ని దాటదలంచినచో ఒక చిన్న దీపమువలెను, అట్టి బ్రహ్మచర్య వ్రతరహితునకు దుర్బలహృదయత్వముచే దీపము సహితము గొప్ప దావానలమువలె నుండును

గాఢాన్ధకారభరితం వనం తద్బ్రహ్మచారిణః ।
విహర్తుం యోగ్యముద్యానం రాకాయామివ కల్పతే ॥ 15

ఉద్యానం చంద్రికోపేతం బ్రహ్మచర్యస్య హానతః ।
కాళరాత్ర్యా యుతమివ కాననం హి భయప్రదమ్ ॥ 16

బ్రహ్మచర్య వ్రతశీలునకు గాఢాన్ధకారముతో గూడిన మహారణ్యములో సంచరించుట, మంచివెన్నెలలో పుష్పోద్యానములో విహరించునటుల నుండును.

బ్రహ్మచర్య వ్రతహీనునకు చంద్రికాసమేత పుష్పవనము కాళరాత్రితో గూడిన ఘోరారణ్యము వలె భీతిని గలుగజేయును

దీవ్యమానస్య తేన స్యాద్బలవానర్భకోపమః ।
దుర్బలోఽపి భవేద్వీరః యస్య తన్న చ విద్యతే ॥ 17

అస్ఖలిత బ్రహ్మచర్యము గల ధీరునకు మహాబలసాయుధ శత్రువు గూడా దుర్బలుడగు బాలుడువలెను, బ్రహ్మచర్య వ్రతహీనునకు బాలుడుగూడ మహాయోధుడగు శత్రువువలెను కనుపించును

బ్రహ్మచర్యమవాప్తస్య సుకరశ్చిత్త నిగ్రహః ।
భవేద్రిక్తస్య తేనాసౌ కష్టాత్కష్టతరో ధ్రువమ్ ॥ 18

బ్రహ్మచర్య మహిమ గలవానికి మనోనిగ్రహము బహుసులభముగా నుండును అట్టి బ్రహ్మచర్యవ్రతము లేని వానికి మానసేన్ద్రియ నిగ్రహము మహాకష్టతరముగా గోచరించును

బ్రహ్మచర్యే స్థితస్య ద్వే శీతోష్ణే సహ్యతాం గతే ।
తద్వర్చసా వియుక్తస్య యాతో వర్షాతపౌ న తామ్ ॥ 19

బ్రహ్మచర్య వ్రతనిష్ఠ గలవానికి బ్రహ్మవర్చస్సు గల్గును శీతోష్ణహిమాదులు గూడ దేహారోగ్యమునకు భంగమును గలుగజేయవు ఆ బ్రహ్మచర్యము లేనివాడు సామాన్య వర్షాతప హిమాదులనున్ను సహించనివాడై రోగగ్రస్తు డగును

భజతో బ్రహ్మచర్యం హి జీర్యతే యచ్చ భుజ్యతే ।
[illegible]ఽపి మృదు స్తస్య జీర్యతే యస్య నాస్తి తత్ ॥ 20

బ్రహ్మచర్యనియమము గలవాని కెట్టి యాహారమైనను జీర్ణించును ఆ బ్రహ్మచర్యవ్రతహీనునకు శుద్ధాహారము మృదువైన దైనను జీర్ణించక బాధను గలుగజేయును

యస్యాస్తి బ్రహ్మచర్యం తద్భూతాదిర్యాతి మిత్రతామ్ ।
ప్రాకృతోఽపి భవేత్తేన రిక్తస్య భయకారణమ్ ॥ 21

బ్రహ్మచర్యవ్రతశాలికి మహాభయంకర భూతప్రేత పిశాచాదులుగూడ ప్రియమును గలుగ జేయు మిత్రునివలె కానుపించును అట్టి బ్రహ్మచర్య రహితునకు సామాన్య జనులుగూడ ఘోరశత్రువులవలె గోచరింతురు ఇక పిశాచాదుల విషయము చెప్పనేల?

వార్ధక్యామప్యవస్థాయాం సంయమీ యౌవనే యథా ।
తద్వ్రతేన విహీనస్స్యాత్ వార్ధక్య ఇవ యౌవనే ॥ 22

బ్రహ్మచర్యవ్రత నియమము గలవాడు వార్ధక్యావస్థ యందున్ను యౌవనమునందువలె సకలావయవ పటుత్వముతో గూడినవాడై ప్రజ్ఞాశక్త్యాదులు గల్గి విహరించును అట్టివానికి ఇన్ద్రియమాన్ద్యాది దోషములు గలుగవు బ్రహ్మచర్యవ్రత రహితునకు యౌవనము నందున్ను, బ్రహ్మచర్య వర్చస్సు, బలమున్ను లేకపోవుటచే, వార్ధక్యదశలో గల్గు దోషము లన్నియు సంభవించును

బ్రహ్మచర్యమహిమ్నైవ భీష్మో పరశుధారిణమ్ ।
జిగాయ లంఘయామాస హనూమానపి సాగరమ్ ॥ 23

బ్రహ్మచర్య మహిమవల్లనే భీష్మాచార్యులు తన గురువగు సాక్షాద్విష్ణ్వంశ సంభూతుడైన పరశురాముని సులభముగా జయించెను అవ్విధముననే ఆంజనేయస్వామియు తన దృఢతమ నైష్ఠిక బ్రహ్మచర్య తేజోమహిమచేతనే దుష్కర దుర్గమ దుర్లంఘ్యసాగరమును గోష్పదమునువలె దాటి అచ్చటి మాయావి రాక్షసులను దునుమాడెను కనుకనే శ్రీవాల్మీకిమహర్షియు "గోష్పదీకృతవారాశిం మశకీకృత రాక్షసం" అని శ్రీ హనుమంతుని స్తోత్రము జేసెను.

సార్వభౌమాయమానం హి సర్వేష్వపి వ్రతేష్విదమ్ ।
రుగ్ణానామపి సర్వేషాం నాస్తీతో దివ్యమౌషధమ్ ॥ 24

ఈ బ్రహ్మచర్యవ్రత మనునది సర్వవ్రతములలోను సార్వభౌమపదవి నధిష్ఠించియున్నది. అనగా ఈ వ్రతము లేనిదే తక్కిన వ్రతము లన్నియు నిష్ఫలములు. రోగగ్రస్తులకును నిదియే దివ్యౌషధము దీనికన్న వేరొక యౌషధము లేదు అనగా వ్యాధిపీడితులుగూడ బ్రహ్మచర్యవ్రతము చక్కగా ననుష్ఠించిరేని

తదోజస్సుచే ఆరోగ్యవంతు లగుదురు

విన్నైతద్యోగినాం యోగనిష్ఠా వా దైవతం న హి ।
ఇదం స్త్రీణామపి ప్రజ్ఞాం శాన్తిం చ జనయేద్ధ్రువమ్ ॥ 25

యోగీశ్వరులందిరికిని నిదియే పరమయోగనిష్ఠ. ఇదియే పరమ దైవము మరియొకటొండులేదు అని తాపసవర్యులందరు తెలిసికొనియున్నారు ఈ బ్రహ్మచర్యము పురుషులకు వలెనే స్త్రీలకును ఆవశ్యకము ఇయ్యది స్త్రీలకు గూడను ప్రజ్ఞయు శాన్తియు తప్పక కలిగించును ఈ విషయములో సందేహము లేదు

కలౌ యుగే బ్రహ్మచర్యం తచ్ఛక్యం న బ్రువంతి యే ।
తే జ్ఞేయాః పాపినః ప్రాజ్ఞ! కలిదూషితబుద్ధయః ॥ 26
యే త్వన్య సాధ్యతామస్మిన్యుగేఽపి ప్రవదంతి భో ।
కృతత్రేతాదియుగతోఽద్యైవ జాతానవేహి తాన్ ॥ 27

ఓ ప్రజ్ఞావంతుడా! యెవరు కలియుగమున బ్రహ్మచర్య మసాధ్యమని పలుకుచున్నారో వారలు కలిప్రేరిత కల్మష హృదయులు ఎవరు ఈ కలియుగమునందు కూడ ఈ బ్రహ్మచర్యము సాధ్యమని నొక్కివక్కాణించు చున్నారో, అట్టి వారందరు కృతత్రేతాది యుగములో నుండి యిప్పుడే పుట్టిన వారని సందేహములేక ముమ్మారు నమ్ముడు ఈ కలియుమునగూడ అనేక నైష్ఠిక బ్రహ్మచారులను మనము గాంచుచున్నారము



# బ్రహ్మచర్య వ్రతలక్షణము

## భవిష్యత్ పురాణము

### అధ్యాయము - 4

కృతోపనయనస్యాస్య వ్రతాదేశనమిష్యతే ।
బ్రహ్మణో గ్రహణం చైవ క్రమేణ విధిపూర్వకమ్ ॥ 1

ఉపనీతునకు ఈ బ్రహ్మచర్య వ్రతానుష్ఠానము విధింపబడుచున్నది అటులనే క్రమముగా శాస్త్రరీతిగా వేదాధ్యయనము గావించవలయును

యత్సూత్రం చాపి యచ్చర్మ యయా చాస్య చ మేఖలా ।
వసనం చాపి యో దండస్తద్వై తస్య వ్రతేష్వపి ॥ 2

బ్రహ్మచారికి సూత్ర మేదియో అనగా యజ్ఞోపవీత మెట్టిదియో, యేది చర్మమో, మొలత్రాడు ఏదియో, వస్త్రమేదియో, దండమెద్దియో అది యంతయు చెప్పబడుచున్నది.

సేవేతేమాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌ వసన్ ।
సన్నియమ్యేంద్రియగ్రామం తపోవృద్ధ్యర్థమాత్మనః ॥ 3

బ్రహ్మచారి గురుకులము నందుంటున్నవాడై ఈ నియమములను ఆచరింప వలయును ఇంద్రియములను చక్కగా నియమించి తాను తపస్సును వృద్ధి చేసుకొనవలయును

బృందారకర్షిపితౄణాం కుర్యాత్తర్పణమేవ హి ।
నరాణాం చ మహాబాహో నిత్యం స్నాత్వా ప్రయత్నతః ॥ 4

ఓ మహాబాహో! శరీరశుద్ధియందు ప్రయత్నపరుడై నిత్యము స్నానముజేసి బ్రహ్మచారి, దేవ, ఋషి, పితృ, నరులకు తర్పణము చేయవలయును

పుష్పం తోయం ఫలం చాపి సమిదాధానమేవ చ ।
నానావిధాని కాష్ఠాని మృత్తికాం చ తథా కుశాన్ ॥ 5

హోమమున కుపయుక్తములగు సమిధలను, దర్భలను, మృత్తికను, పుష్పము, జలము ఫలము వీటిని నానావిధ కాష్ఠములను బ్రహ్మచారి గ్రహించ వలయును

వర్జయేన్మధుమాంసం చ గంధమాల్యరథాన్(సాన్) స్త్రియః ।
శుక్లాని చైవ సర్వాణి ప్రాణినాం చైవ హింసనమ్ ॥ 6

సురాపానము, మాంసము, గంధము, పుష్పమాలికలు, రథములు, స్త్రీలు, ఇ౹ను ఆడంబరముగల వస్తువులు, ప్రాణులను హింసించుట - వీటినన్నిటిని వదలి పెట్టవలయును

అభ్యంగమంజనం చాక్ష్ణోరుపానచ్ఛత్రధారణమ్ ।
సంకల్పం కామజం క్రోధం లోభం గీతం చ వాదనమ్ ॥ 7

నర్తనం చ తథా ద్యూతం జనవాదం తథాఽనృతమ్ ।
పరివాదం చాపి విభో దూరతః పరివర్జయేత్ ॥ 8

అభ్యంగస్నానము (నూనె అంటుకొని శిరఃస్నానము జేయుట) కండ్లకు కాటుకను ధరించుట, చెప్పులను వేసికొనుట, గొడుగును పట్టుకొనుట, కామ సంకల్పములు, క్రోధము, లోభము, గానము, వాద్యములను వాయించుట, నర్తనజేయుట, జూదము, జనులతో వృథా ప్రసంగము, అసత్యము, ఇతరుల నిందజేయుట, ఓ రాజా! బ్రహ్మచారి వీటిని దూరముగా విడనాడవలయును.

ఏకశ్శయీత సర్వత్ర న రేతస్స్కన్దయేత్ క్వచిత్ ।
కామాద్ధి స్కన్దయన్ రేతో హినస్తి వ్రతమేవ తు ॥ 9

బ్రహ్మచారి ఎక్కడైనను తానొంటరిగానే పరుండవలయును కామసంకల్పము గలవాడై రేతస్సును పోగొట్టుకొనినచో, వాడు తన బ్రహ్మచర్యవ్రతమునే పాడుచేసుకొనిన వాడగును.

సుప్తః క్షరన్ బ్రహ్మచారీ ద్విజశ్శుక్ర మకామతః ।
స్నాత్వాఽర్కమర్చయిత్వా తు పునర్మామిత్యృచం జపేత్ ॥ 10

కామాభిలాష లేకనే, స్వప్నమునందు స్ఖలన దోషము గల్గెనేని స్నానముజేసి, సూర్యభగవానునకు అర్ఘ్య పాద్యాదుల నొసగి పరిశుద్ధుడై పునర్మామ్, అను ఋఙ్మన్త్రమును జపించవలయును అటులయిన ఆ దోషము పోవును

మనోరపి తథా చాత్ర శ్రూయతే పరమం వచః ।
ఉదకుంభం సుమనసో గోశకృన్మృత్తికాం కుశాన్ ॥ 11
ఆహరేద్యావదర్థాని భైక్ష్యం చాపి హి నిత్యశః ।
గృహేషు యేషాం కర్తవ్యం తచ్ఛ్రుణుష్వ నృపోత్తమ ॥ 12

మనుమహర్షియు బ్రహ్మచారి ధర్మముల విషయమై చెప్పిన పరమ వాక్యములు గలవు బ్రహ్మచారి తనకు వలసిన జలపాత్ర, పుష్పములు, గోమయము, మృత్తిక, దర్భలు, వీటిని గ్రహించవలయును ప్రతి దినము భిక్షాటనము చేయవలయును కాన ఓ రాజసత్తమా! ఎవరి గృహములయెడ భిక్షను గైకొనవలయునో, ఆ నియమముల వినుము

స్వకర్మనిరతా యే వై తథా వేదేషు యే రతాః ।
యజ్ఞేషు చాపి రాజేన్ద్ర! యే చ శ్రద్ధా సమన్వితాః ॥ 13
బ్రహ్మచార్యాహరేద్భైక్ష్యం గృహేభ్యః ప్రయతోఽన్వహమ్
గురోః కులే నభిక్షేత స్వజ్ఞాతికులబంధుషు ॥ 14

ఓ నృపసత్తమా! యే పుణ్యాత్ములగు గృహస్థులు యజ్ఞముల యందును, వేదము లందును, భక్తిశ్రద్ధ విశ్వాసము గలవారై స్వకర్మలను అనగా వేదోక్తగృహస్థ ధర్మముల నాచరించుచు నుందురో అట్టి పవిత్ర గృహముల నుండి బ్రహ్మచారి నియమోపేతుడై ప్రతిదినమును భిక్షను గైకొనవలయును. అట్లయిన తాను పతితుడు కాడు. గురువుల గృహమునందును, తన దాయాదులయొక్కయు, బంధువులయొక్కయు, తన వంశము యొక్కయు ఇండ్లకడ భిక్షను తీసికొనరాదు.

అలాభే త్వన్యగోత్రాణాం పూర్వం పూర్వం వివర్జయేత్ ।
సర్వం చాపి చరేద్గ్రామం పూర్వోక్తానామసంభవే ॥ 15

భిక్షాచరణ విషయములో మఱికొన్నిటి నియమములను జెప్పుచున్నారు.

ఇతర గోత్రస్థుల గృహములలో భిక్ష దొరకక పోయిన గురుగృహము వదలి దాయాదులు మొదలయిన పూర్వము జెప్పబడినవారి గృహములనుండి భిక్షను స్వీకరింపవచ్చును దానిలో గూడ లభించక పోయినప్పుడు ముందు ముందు ఇండ్లను వదలి ఇతర గృహముల కడ భిక్షను తీసికొన వచ్చును అచ్చోటెచ్చటను (ఎవరి గృహముల వద్దను) భిక్షను జేయుటకు సంభవించకపోయిన గ్రామ మంతయు సంచరించవచ్చును

**అన్వ్యవర్జ్యం మహాబాహో ఇత్యాహ భగవాన్ విభుః ।**
**వాచం నియమ్య ప్రయతస్త్వగ్నిం శస్త్రం చ వర్జయేత్ ॥ 16**

గ్రామమంతయు చరింపవచ్చును కాని చతుర్థ వర్ణము నుండి భైక్ష్యాచరణ గావింపవలదు ఇకను భిక్షాటన సమయమున వాఙ్నియమము గల్గి ప్రయత్న పరుడై యుండవలయును మరియు అగ్నిని, శస్త్రమును వదలవలయును

**చాతుర్వర్ణ్యం చరేద్భైక్షమలాభే కురునందన ।**
**ఆరాదాహృత్య సమిధః సన్నిదధ్యాద్గృహోపరి ॥ 17**

ఓ కురువంశజా! భిక్ష లభించక పోయిన నాలుగు వర్ణములలోను భిక్షను గైకొననగును మఱియు హోమార్థము సమీపమునుండి సమిధలను తీసికొని ఇంటిలో భద్రపరచుకొనవలయును

**సాయం ప్రాతస్తు జుహుయాత్తాభిరగ్నిమతన్ద్రితః ।**
**భైక్ష్యాచరణమకృత్వా న తమగ్నిం సమిధ్య వై ॥ 18**

ప్రాతఃకాలముననను, సాయంకాలము నందును అలసుడుగాక బ్రహ్మచారి ఆ సమిధలచే అగ్నిని హోమించవలయును మఱియు భిక్షను తీసికొనక ఆ యగ్నిని హోమించకూడదు

**అనాతురస్సప్త రాత్ర మవకీర్ణ వ్రతం చరేత్ ।**
**వర్తనం చాస్య భైక్ష్యేణ ప్రవదన్తి మనీషణః ॥ 19**

ఆ నియమ మొకవేళ తప్పినచో తాను ఆతురుడు గాక ఏడురాత్రులు అవకీర్ణవ్రతమును చేయువలయును. అవకీర్ణ వ్రతమనగా వ్రతమును

నశింపజేసికొనినవాడు, ఆ వ్రతమును తిరుగా రక్షించుకొనుటకై శాస్త్ర విహితప్రాయశ్చిత్తాది నియమముల నాచరించుట, అటులనే ఇచ్ఛోటను గ్రహించవలయును. బ్రహ్మచారికి వృత్తి భిక్షాచరణయే యని శాస్త్రజ్ఞులు చెప్పు చున్నారు.

తస్మాద్భైక్ష్యేణ వై నిత్యం నైకాన్నాదీ భవేద్వ్రతీ ।
భైక్ష్యేణ వ్రతినో వృత్తిరుపవాససమా స్మృతా ॥ 20

కనుకనే నిత్యము గూడ, బ్రహ్మచారికి భిక్షాటనమే ముఖ్యధర్మము అయినను బ్రహ్మచర్య వ్రతశాలి నిత్యము ఒకరి గృహముననే భోజనము చేయు స్వభావము గల్గి యుండకూడదు బ్రహ్మచారికి భైక్ష్యవృత్తి ఉపవాసముతో సమానమగును

దైవత్యే వ్రతవద్రాజన్ పిత్రే కర్మణ్యథర్షివత్ ।
కామమభ్యర్థితోఽశ్నీయాత్ వ్రతమస్య న లుప్యతే ॥ 21

ఇకకొన్ని విశేషధర్మములను జెప్పుచున్నారు ఓరాజా! బ్రహ్మచారి యితరులచే మిక్కిలి ప్రార్థింపబడినవాడై దేవతా సంబంధ కార్యములయందు వ్రతునివలెను, పితృకర్మలయందు మహర్షివలెను భుజింపవలయును అట్లయిన వీని భైక్ష్య వ్రతము చెడదు

బ్రహ్మచర్యపద వివరణము-బ్రహ్మణి చరతీతి బ్రహ్మచారీ, తస్యభావః బ్రహ్మచర్యం పరబ్రహ్మయందు చరించువాడు బ్రహ్మచారి, వానిభావము బ్రహ్మ చర్యము బ్రహ్మవిచారమందుండువాడు బ్రహ్మచారి యని గ్రహించ వలయును "యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః । ఆత్మన్యేవ చ సన్తుష్టః" అను శ్రీభగవద్గీతా వచనానుసారముగా ఎవడు పరబ్రహ్మాత్మ తనయందే (పరమాత్మయందే) రమించుచున్నాడో, సన్తుష్టుడగుచున్నాడో, ఆత్మానందముచే సంతృప్తిని బడయుచున్నాడో అట్టివాని స్థితియే బ్రహ్మచర్యము. ఇందులకు శ్రుతి-"ఆత్మరతిరాత్మ క్రీడ ఆత్మ మిధున ఆత్మానందః"- ఆత్మయందే ఆసక్తుడగుట, ఆత్మయందే రమించుట, ఆత్మలోనే సంబంధపడి యుండుట,

ు త్మవిషయ కానందము నొంది యుండుటయు- ఇదియే యుత్తమ బ్రహ్మచర్యము, పరమకాష్ఠ

**బ్రహ్మభావే మనశ్చారో బ్రహ్మచర్యం పరం తథా ।**

బ్రహ్మ భావమందు మనస్సును సర్వదా చరింప జేయుటయే బ్రహ్మ చర్యము. బ్రహ్మణి చరతీతి బ్రహ్మచారీ, తస్యభావః బ్రహ్మ చర్యం

వేదాధ్యయనము, ఉపనిషద్గీతాపఠనము, గాయత్రీ మన్త్రజపము గావించుచు తద్వ్రతనిష్ఠుడై సకల విషయముల యందు విరక్తుడై గురుకులవాస సత్యకథన భైక్ష్యాచరణాది ధర్మముల నాచరించుటయు బ్రహ్మచర్య మగును గురుకుల వాసమొనర్చి వేదాధ్యయన కాలములోనుండు నియమము బ్రహ్మచర్య వ్రతమనబడును బ్రహ్మపాప్తికొఱకు ఆచార్యుని వద్దయుండి బ్రహ్మ విచారము చేయుకాలమున నుండు నియమము బ్రహ్మచర్యవ్రతమని గూడ గ్రహించనగును 'బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః' అని పతంజలిమహర్షి వచించెను బ్రహ్మచర్య దృఢత్వము వలన వీర్యలాభము గల్గును వీర్యలాభము వలన బ్రహ్మతేజస్సున్ను, బ్రహ్మప్రాప్తియున్ను సిద్ధించును

**న తపస్తప ఇ త్యాహుంర్బ్రహ్మచర్యం తపోత్తమమ్ ।**
**ఊర్ధ్వరేతా భవేద్యస్తు న దేవో న తు మానుషః ॥ 22**

కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతాదిరూప తపస్సు మాత్రము తపస్సు కాదు, బ్రహ్మచర్యమే యుత్తమమగు తపస్సగును అట్టి బ్రహ్మచర్య వ్రతనిష్ఠ గలవాడు కేవల మనుజుడు కాడు భగవత్స్వరూపు డనియే గ్రహించవలయును అథర్వవేద సూక్తిని వినుడు- "బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యుముపాఘ్నత" బ్రహ్మచర్యేణ= వేదాధ్యయనము చేతను, బ్రహ్మవిజ్ఞానము చేతను, తపసా= తపస్సుచేతను, బ్రహ్మచర్య వ్రతానుష్ఠానము చేతను, మృత్యుం = జనన మరణ రూప దుఃఖమును, ఉపాఘ్నత= నిత్యమును నిశ్శేషముగను నశింప జేయుచున్నారు వేరు ఉపాయము లేదు

"బ్రహ్మ ప్రాప్తికరం నృణామ్" బ్రహ్మచర్యమే అందఱికిని బ్రహ్మప్రాప్తిని కలుగజేయునని చెప్పుటచే బ్రహ్మచర్యము లేక మఱియొకటి బ్రహ్మపదమును పొందింపజాలదు. వృక్షమూలమును శాఖాపుష్పఫలాదు లన్నియు ఎటుల నాశ్రయించి యున్నవో అటులనే ఈ బ్రహ్మచర్యాశ్రమము నాశ్రయించియే గృహస్థాశ్రమాదు లన్నియు నిలబడియున్నవి.



# నైష్ఠిక బ్రహ్మచర్యము

గార్హస్థ్యం నైష్ఠికం చేతి వైధురం చేతి తత్త్రిధా ।
ఆజన్మనైష్ఠికం ప్రోక్తం గృహిణామృతుకాలజమ్ ॥ 1

గార్హస్థ్యం ప్రాప్తవాన్యస్తు భార్యాయా నాశతో యది ।
బ్రహ్మచర్య ముపాదత్తే తద్వైధురమితీరితమ్ ॥ 2

బ్రహ్మచర్యము 1 నైష్ఠిక బ్రహ్మచర్యమనియు, 2 గృహస్థబ్రహ్మచర్య మనియు, 3 విధుర బ్రహ్మచర్యమనియు మూడు విధములు వానిలో పుట్టుక మొదలు మరణపర్యన్తము ఏలాటి విషయదోషములు లేక ఆచరింపబడునది నైష్ఠిక మనబడును 2 ఋతుకాలమునందు మాత్రము ధర్మబద్ధుడై ధర్మపత్నితో చేరుట గృహస్థ బ్రహ్మచర్య మనంబడును 3 భార్యావియోగము గల్గిగాని, లేక భర్తృవియోగము గల్గిగాని, లేక భార్యాభర్తలకు ఆత్మశుద్ధిగల్గి విషయములలో విరక్తి గల్గి బ్రహ్మచర్య మవలంబించుటగాని విధుర బ్రహ్మచర్య మనంబడును

నైష్ఠిక బ్రహ్మచారులు శుకసనకాదులు పురుషులలోను, గార్గి సులభాయోగినులు స్త్రీలలోను ఉండిరి గృహస్థబ్రహ్మచారులలో జనక, చూడాలా, శిఖిధ్వజ, మదాలసాదు లుండిరి. విధుర బ్రహ్మచర్యములో యాజ్ఞవల్క్య మైత్రేయీ విశ్వామిత్రాదులుండిరి. వానప్రస్థ సన్న్యాసులు ఆయా ఆశ్రమముల స్వీకరించిన పిమ్మట బ్రహ్మచర్యవ్రతము గలిగిన వారగుటచే వీరి పేర్లు ప్రత్యేకముగా చెప్పనవసరము లేదు కలియుగమున శ్రీ రామకృష్ణపరమహంస, శారదాదేవులు

వివాహితు లయినను నైష్ఠిక బ్రహ్మచారులలో చేరినవారే వివాహము లేని స్త్రీ పురుషులు నైష్ఠిక బ్రహ్మచారులలో అనేకులు గలరు ఈ యుగమున గృహస్థబ్రహ్మచారులలో శ్రీ గాంధి కస్తూరీ బాయిలు విఖ్యాతిని బడసినవార్లు. ఇకను పెక్కంద్రు ఉండవచ్చును వీరుగూడ విధురబ్రహ్మచారులలోనే చేరుదురు విధుర బ్రహ్మచర్యములో శ్రీ గురునానక్, శ్రీ కృష్ణచైతన్యాదులున్ను, మరి అనేకులు గలరు

బ్రహ్మచర్య వ్రతమందుగాని, నిష్కామ కర్మయోగమందుగాని, భక్తియోగమందుగాని, ధ్యానయోగమందుగాని, జ్ఞానయోగము నందుగాని మఱి యేయే పుణ్యవ్రతముల నాచరించువారలుగలరో, యేయే దీక్షలు ఆచరించువారు గలరో, యేయే తవసుల జేయువారు గలరో- వారందఱికిని యమ నియమములు తప్పక యుండవలయును ఇది సప్తభూమికలనంబడు జ్ఞానసౌధమునకు పునాదివంటిది ఆలాగున అష్టాంగ యోగమునకు ఇదిన్ని పునాదివంటిది పునాది దృఢముగా లేనిచో సౌధములు ఎంత సుందరముగా నిర్మించినను నేలాగున గాలివానలచే కూలిపోవునో, ఆలాగున యోగమార్గమందుగాని, జ్ఞానమార్గమందు గాని విఖ్యాతిగాంచిన వారుండిన యీ యమ నియమములపై నాధారపడియే యుండిరి, యుంటున్నారు, ఇకపై నుండగలరు పాదద్వయము దృఢముగా నుండిన మాత్రమే మానవుడు సుఖముగా సంచరించగల్గును ఆలాగున ఈ యమ నియమములలో దార్ఢ్యము గల్గిన మాత్రమే జ్ఞానమార్గములో గాని, యోగమార్గములో గాని అతడు స్వయముగా విహరింప గల్గును కావుననే అష్టాంగ యోగాది సర్వశాస్త్రములలోను నీ రెండింటిని నేత్రములుగా వర్ణించడమైనది వీని యందు నిర్మలమగు ననుష్ఠానము లేనిచో అతి సూక్ష్మమగు జ్ఞానమార్గమందుగాని యోగవీధుల యందుగాని నేత్రరోగము గలవాని స్థితియే గల్గును. అందువల్లనే సర్వసాధకులకున్ను వీనిని మొట్టమొదటనే చెప్పుచున్నారు



## 1. యమము

అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం క్షమా ధృతిః ।
దయాఽఽర్జవం మితాహారః శౌచం చైవ యమా దశ ॥

(1) అహింస, (2) సత్యము, (3) అస్తేయము, (4) బ్రహ్మచర్యము, (5) క్షమ, (6) ధృతి, (7) దయ, (8) ఆర్జవము, (9) మితాహారము (10) శౌచము అను నీ పదియున్ను యమ మనబడును దీని యర్థము సుగ్రాహ్య మగుటచే విస్తరించ బూనలేదు

## 2. నియమము

తపస్సన్తోష ఆస్తిక్యం దానమీశ్వరపూజనమ్ ।
వేదాన్తవాక్యశ్రవణం హ్రీర్మతిశ్చ జపో వ్రతమ్ ॥

(1) తపము (2) సన్తోషము, (3) ఆస్తిక్యము (4) దానము, (5) ఈశ్వరపూజనము (6) వేదాంత శ్రవణము (7) లజ్జ, (8) మతి (9) జపము, (10) వ్రతము - అను నీపదియు నియమ మనంబడును ఈ అర్థముగూడ విశద మగుటచే వివరింప తలంచలేదు వివరముగా తెలిసికొన తలంచుకొన్నవారు ఓంకారాది గ్రంథములలో చూచుకొనవచ్చును

నైష్ఠిక బ్రహ్మచర్యము ఎనిమిది విధములు

శ్రవణం కీర్తనం కేళిః ప్రేక్షణం గుహ్యభాషణమ్ ।
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృతిరేవ చ ॥

ఏతన్మైథునమష్టాంగం ప్రవదన్తి మనీషిణః ।
విపరీతం బ్రహ్మచర్యమనుష్ఠేయం ముముక్షుభిః ॥

1 విషయ సంబన్ధ మాటలను వినుట, 2. వాక్కుతో విషయములనుగూర్చి మాట్లాడుట, 3 స్త్రీలతో ఆటలాడుట, 4 దుష్టభావనతో స్త్రీ పురుషులు పరస్పరము చూచుకొనుట, 5 ఆ విషయమై స్త్రీపురుషులు రహస్యముగా మాట్లాడుట, 6 ఆ విషయమై ప్రవర్తించుటకు సంకల్పించుట, 7. ఆ విషయమై ప్రవర్తించుటకు

స్థిరముజేసికొనుట, 8 విషయములలో ప్రవర్తించుట- యీ ఎనిమిది విధములగు దోషములు లేనిదే పవిత్రమగు బ్రహ్మచర్యమనబడును మఱియు శాస్త్రాన్తరమున జెప్పినది జూడుడు -

బ్రహ్మచర్యవ్రతం సారం వ్రతానాముత్తమం వ్రతమ్ ।
బ్రహ్మచర్యం తపస్సారం బ్రహ్మచర్యం మహత్ఫలమ్ ॥

క్రియాసు సకలాస్వేవ బ్రహ్మచర్యం వివర్ధయేత్ ।
బ్రహ్మచర్యప్రభావేన తప ఉగ్రం ప్రవర్తతే ॥

బ్రహ్మచర్యాత్పరం నాస్తి ధర్మసాధనముత్తమమ్ ।
మహావ్రతమిదం లోకే తన్నిబోధ సదా ద్విజ ॥

1 సారము లన్నిటిలోను బ్రహ్మచర్యవ్రతమే మిక్కిలి సారవంత మైనది వ్రతములన్నిటిలో నీ బ్రహ్మచర్యవ్రత ముత్తమము బ్రహ్మచర్యము తపస్సార మగును. బ్రహ్మచర్యము మహాఫలమును గలుగజేయునది. 2 ప్రతి సాధనలోను, వ్రతములలోను బ్రహ్మచర్యవ్రతమును వృద్ధి పరచవలెను బ్రహ్మచర్యవ్రత ప్రభావముచేతనే ఉగ్రమైన తపస్సు నాచరించుటకు సాధ్యమగును, 3 బ్రహ్మచర్యముకన్న నుత్తమమైన ధర్మసాధనము ముల్లోకములందు మఱియొకటి లేదు లోకములో దీనిని మహావ్రతమని దెలియదగినది ఇది పురుషుల కెట్టిదో స్త్రీలకున్ను ఆలాగుననే యుండును శ్రీ కృష్ణభగవంతుడు ఆత్మ సంయమ యోగమనంబడు ఆరవ అధ్యాయమున బ్రహ్మచర్యవ్రతము గల్గి యుండియే యోగసాధన చేయవలయునని విధించిరి

ప్రశాన్తాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః ।
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥

ప్రశాన్తమయిన అన్తఃకరణము గలవాడును, భయము లేనివాడును, బ్రహ్మచర్య వ్రతమందుండువాడును, మనస్సును విషయముల పైకి పోనీయక నాయందే యుంచబడిన చిత్తము గలవాడును, నేనే పరమ గతియని నమ్మకము గలవాడునై యుండవలయును ఇచ్చట నేనని ప్రయోగించిన స్థలమున శ్రీ

కృష్ణభగవానునియందని గ్రహించేది లేక తన యిష్టదేవతయందైనను, పరబ్రహ్మమందైనను తనయాత్మలో పరమాత్మభావన గల్గియుండవలయు ననియు గ్రహించవలెను బ్రహ్మచర్యమును గురించి మనుమహర్షి చెప్పినది జూడుడు -

**ఆయుస్తేజో బలం వీర్యం ప్రజ్ఞా శ్రీశ్చ మహద్యశః ।**
**పుణ్యం చ మత్ప్రియత్వం చ లభ్యతే బ్రహ్మచర్యయా ॥**

బ్రహ్మచర్యముచే పూర్ణాయువు, బ్రహ్మతేజస్సు, దేహేంద్రియములకు బలము, ఓజస్సు, అమానుషప్రజ్ఞ, జ్ఞానసంపద, గొప్పయశస్సు, మహాపుణ్యము, భగవత్ప్రీతి- ఇవి యన్నియు గలుగును మఱియు శాస్త్రాన్తరమున చెప్పినది జూడుడు-

**మాత్రా వా న దుహిత్రా వా న స్వస్రైకాన్త శీలతా ।**
**బలవన్తీంద్రియాణ్యత్ర మోహయన్త్యపి కోవిదాన్ ॥**

బ్రహ్మనిష్ఠుడైనను తల్లితోగాని, తోడబుట్టువుతోగాని, కుమార్తెతోగాని ఏకాన్తమున నుండగూడదు ఇంద్రియములు మిక్కలి బలవత్తరము లయినవి. ఋషులకు గూడ మోహమును గలుగజేయును అదేరీతిగా బ్రహ్మచర్య వ్రతనిష్ఠ గల స్త్రీయు తండ్రితోగాని, సోదరులతోగాని, కన్న పుత్రునితోగాని యేకాంతమున నుండరాదు అనగా అట్టి వారలనుగూడ నమ్మరాదని విధించుచుండగా యౌవనస్థితిలో నుండు పురుషులున్ను, యౌవనవతులగు స్త్రీలున్ను పరస్పరము విహరించుటయు, ఒకే ప్రదేశమున నుండుటయు ఎంత అపాయకరము అని తెలిసికొనుట కొరకు నీలాగున చెప్పడమైనది. ఎట్టి హీనుడైన పురుషుడైనను కన్న తల్లి, సోదరి, పుత్రికలయందు నీలాటి దుష్టసంకల్పము కల్గియుండునా? ఉండడుగదా! ఆలాగున నెట్టి నీచురాలైనను తండ్రి, సోదరుడు, కుమారునియందు చెడ్డ సంకల్పము గల దగునా? అట్టి వారినిగూడ నమ్మరాదనియు, మాయాశక్తి అత్యధిక మహిమ గలదనియు, ఏ సమయములో ఎట్లు జరుగునో యని భయము గల్గుటకు శాస్త్ర మీలాగున తెలుపడమైనది. అట్టి వారితో సహా యుండరాదని చెప్పునప్పుడు ఇతరులను గుఱించి మరల జెప్పవలయునా? అని యూహార్థము.

అంగారసదృశా నారీ ఘృతకుంభసమః పుమాన్ ।
అస్పర్శాద్దృఢతామేతి తత్సంపర్కాద్విలీయతే ॥

అగ్నికుండ వంటిది స్త్రీయనియు, నేతికుండవంటివాడు పురుషుడనియు గ్రహించవలెను నిప్పుకుండములో నేతికుండ పెట్టకుండు వరకే నెయ్యి కరగక యుండును అగ్ని సంపర్కముచే నేయి కరుగునట్లు స్త్రీ సమీపమున పురుషుని మనస్సుగూడ కరిగిపోవును కావున నిప్పుకుండ సమీపమున నేతికుండ యే కాలమున కరుగదో అట్టి కాలమునమాత్రమే స్త్రీ సమీపములో నుండిన మనస్సు విషయరూపముగా మారకుండును హఠయోగమున తెలిపినది జూడుడు

ఏవం సంరక్షయేద్బిన్దుం మృత్యుం జయతి యోగవిత్ ।
మరణం బిన్దుపాతేన జీవనం బిన్దుధారణాత్ ॥

ఎవడైతే అభ్యాస బలముచే శుక్లమును సంరక్షించుకొనునో అట్టివాడు మృత్యువును సుఖముగా జయించుచున్నాడు శుక్రపతనము వలన మరణమున్ను, వీర్యధారణము వలన చిరజీవితమున్ను కలుగుట వలన, వీర్యమును సంరక్షించుకొనవలయును వీర్యపతనమువల్లనే మానవుడు నిర్వీర్యు డగుచున్నాడు ఇది ప్రత్యక్షానుభవమేగదా! బ్రహ్మచర్యదార్ఢ్యములేనివాడు యౌవనావస్థ ఆరంభించుటకు ముందుగానే వార్ధక్యావస్థను పొందునదేగాక దంతములు కదులుటయు, రాలిపోవుటయు, చెవి వినరాకుండుటయు, దృష్టితగ్గి పోవుటయు కలుగుచుండును నోరు ఎల్లప్పుడు దుర్వాసన గల్గియుండును జిహ్వ రుచిని తెలిసికొనకపోవును ఎప్పుడున్ను శరీరము జ్వరపీడితమువలె నుండును శరీర సంధులన్నిటిలోను నొప్పిపుట్టును దేనిని నూహించుటకును శక్తి యుండదు జీర్ణశక్తియు బాగుగా నుండదు ఈ లాటి ఆపత్తు లెన్నియో గలుగుచుండును ఇక గర్భోపనిషత్తున చెప్పినదిచూడుడు

మంత్రం ॥ షడ్విధో రసో, రసాచ్ఛోణితం, శోణితాన్మాంసం, మాంసాన్మేదో,
మేదసోఽస్థీన్యస్థిభ్యో మజ్జా, మజ్జాయాశ్శుక్లః ॥

రసములు ఆఱువిధములు -కటు, ఆమ్ల, లవణ, కషాయ, తిక్త,

మధురములు వీటినుండి రక్తమున్ను, రక్తమునుండి మాంసమున్ను, మాంసమునుండి మేదస్సు, మేదస్సునుండి ఎముకలున్ను, ఎముకల నుండి మజ్జయు (మూలుగ), మజ్జయందుండి శుక్లము గలుగుచున్నది

**మంత్రం॥ శుక్లశోణిత సంయోగాదావర్తతే గర్భో హృది వ్యవస్థాం నయతి ॥**

శుక్ల శోణితముల చేరిక వలన గర్భము గలుగుచున్నది అది హృదయ స్థానమును పొందియుండును దీని వలన శుక్లశోణితములు శుద్ధముగా లేనిచో వాని వలన గలిగెడు సన్తానములు నిర్వీర్యములై దుర్బలములై యుండును సప్తధాతువుల పరిణామ సారమే శుక్లము 90 రక్తబిందువుల వలననే ఒకబొట్టు శుక్లమేర్పడునని ప్రాక్ పాశ్చాత్య వైద్యకోవిదులు చెప్పుచున్నారు అనగా 90 నెత్తురుబొట్లు శరీరము నుండి జారిపోయిన ఎంత దుర్బలమో ఒక బొట్టు శుక్లము పతనమైన అంత నిస్తేజస్త్వము గలుగును ఇది యొకటి గ్రహించిన బ్రహ్మచర్య ప్రభావమును విజ్ఞులు తెలిసికొనగలరు

తైలము నశించిన దీపమువలెను పెట్రోలు నశించిన విమాన మోటార్ల వలెను, క్రూడాయిల్ నశించిన యంత్రము వలెను, శుక్లము నశించిన మానవునియొక్క జీవితము నిష్ప్రయోజన మగును. సప్తధాతువుల పరిణామము చెప్పునప్పుడు ఐదవది ఎముకలనియు, 6వది దానిలోపల గల మూలుగనియు అట్టి మూలుగనుండి శుక్లమేర్పడు చున్నదనియు తెలిసికొన్నాము బాయిలర్ లోపలనుండు నూనె యేలాగున స్టీమై యంత్రమును నడుపుచుండునో, ఆలాగున మానసిక కాయిక యంత్రమున ఈ శుక్లమే ఓజస్సుగామారి నడుపు చున్నట్లు తెలియందగినది

మైధునస్యాప్రవృత్తిర్హి మనోవాక్కాయకర్మణా ।
బ్రహ్మచర్యమితిప్రోక్తం యతీనాం బ్రహ్మచారిణామ్ ॥

మనోవాక్కాయకర్మలచే స్త్రీ సంబంధ విషయముల నుండి నివృత్తి యేది గలదో అదే బ్రహ్మచర్యము ఇది యతులకును బ్రహ్మచారులకును సంబంధించినది

సర్వేషాం వ్రతినాం మూలం బ్రహ్మచర్యముదాహృతమ్ ।
విశేషాచ్ఛివభక్తానామేవం భూయో విధాస్యతి ॥

మానవున కెన్ని విధములగు వ్రతానుష్ఠానములు గలవో వాటికన్నిటికి బ్రహ్మచర్యమే ముఖ్యమూలమని ఋషులమతము అనగా వ్రతము లన్నిటిలోను బ్రహ్మచర్యము లేనిది లేనేలేదు అంతేగాక భగవద్భక్తులకు నీ బ్రహ్మచర్యవ్రతము తప్పక యుండవలయు ననియే పదేపదే శాస్త్రము నిర్ణయించుచున్నది

తావద్విద్యా ప్రభవతి తావద్జ్ఞానం ప్రవర్తతే ।
తావత్సునిర్మలా మేధా సర్వశాస్త్రవిధారిణీ ॥

తావజ్జపస్తపస్తావత్తావత్తీర్థనిషేవణమ్ ।
తావచ్చ గురుశుశ్రూషా తావద్ధి తరణే మతిః ॥

తావత్ప్రబుద్ధో భవతి వివేకస్తావదేవ హి ।
తావత్సతాం సంగరుచిస్తావత్ పౌరాణలాలసా ॥

యావత్సీమన్తినీలోలనయనాన్దోళనం న హి ।

ఎంతకాలము స్త్రీలయొక్క విషయభావనతో గూడిన నేత్రము తనయందు పడలేదో, అంతవరకే విద్యయు ఆత్మజ్ఞానమున్ను ప్రవర్తించును అంతవరకే సర్వశాస్త్రములను గ్రహించదగిన తీక్ష్ణమైన నిర్మలమైన మేధాశక్తి యుండును. ఎంతవరకు విషయభావముతో చలించుచుండు స్త్రీలయొక్క చపలమైన చూపు తనయందు ప్రసరించలేదో అంతవరకే జపము, తపము, తీర్థయాత్రలు జరుగుచుండును. అంతవరకే గురుశుశ్రూషయు, సంసార సాగర తరణబుద్ధియు నిలిచియుండును అంతవరకే ప్రబుద్ధతయు (సదా జాగ్రత్త), వివేకజ్ఞానమున్ను సుస్థిరముగా నిలుచును అంతవరకే సత్పురుషులతో సంసర్గప్రీతియు, శాస్త్ర శ్రవణమందు సంతోషమున్ను స్థిరముగా నుండును

తావత్తపోఽభివృద్ధిస్తు తావద్దానం దయా దమః ।
తావత్స్వాధ్యాయవృత్తం చ తావచ్ఛౌచం ధృతం వ్రతమ్ ॥

యావత్త్రస్త మృగీదృష్టిం చపలాం నావలోకయేత్ ।
తావన్మాతా పితా తావద్భ్రాతా తావత్సుహృజ్జనః ॥

తావల్లజ్జా భయం తావదాచారస్తావ దేవహి ।
జ్ఞానమౌదార్యమైశ్వర్యం తావదేవ హి భాసతే ॥

యావన్మత్తాంగనాపాశైః పాతితో నైవ బన్ధనైః ।

ఎంతవరకు భయపడిన చపలనేత్రముగల ఆడుజింకయొక్క దృష్టి వంటి దృష్టి గల స్త్రీని చూడలేదో అంతవరకే తపోభివృద్ధియు, దాన బుద్ధియు, భూతదయయు, ఇన్ద్రియనిగ్రహము నిలకడ గల్గియుండును అంతవరకే వేదాధ్యయన వార్తయు, శౌచము, ధైర్యము, వ్రతనిష్ఠయు నిలిచియుండును అంతవరకే మాతృ భక్తియు, పితృభక్తియు, భ్రాతృ ప్రేమయు, బంధుజనులయెడ ప్రీతియు, మైత్రియు నుండును అంతవరకే సిగ్గున్ను, పాపభీతియున్ను, స్వధర్మాచరణయు స్థిరత గల్గియుండును అంతవరకే జ్ఞానము, ఉదారబుద్ధియు, ఐశ్వర్యమున్ను శోభించుచుండును, పై జెప్పబడిన వన్నియు ఎంతవరకు మదించిన స్త్రీలనెడి పాశరూపబన్ధములచేత బన్ధితుడుకాడో అంతవరకు నిలిచి యుండును

బ్రహ్మచర్యం సదా సత్యం జప్యన్ జ్ఞానం చ రాక్షస ।
నియమో ధర్మవేదిత్వమార్షో ధర్మః ప్రచక్షతే ॥

బ్రహ్మచర్యము, సత్యవచనము, దివ్యమంత్రజపము, ఆత్మజ్ఞానము నియమపాలనము, ధర్మముల తెలిసికొనుట - అనునవి యేవిగలవో, అదంతయు ఆర్షధర్మమని జెప్పబడును

యదా సర్వే ప్రముచ్యన్తే ఇతి స్వితి చ వాజినః ।
కామబన్ధనమేవేదం వ్యాసోఽప్యాహ వదేవదే ॥

కామబన్ధనమేవేదం నాన్యద స్తీహ బన్ధనమ్ ।
కామబన్ధనముక్తో హి నేహ భూయోఽభిజాయతే ॥

ఎప్పుడైతే సర్వకామ సంకల్పములనుండి విడువబడునో, అప్పుడే మోక్షము

గల్గును అని వేదవిదులు వచించిరి ఈ అర్థమునే (కామబన్ధనమే బన్ధమని) శ్రీవేదవ్యాసమునీన్ద్రుడు కూడ పదేపదే చెప్పెను ఈ లోకమున జీవికి కామబన్ధనమే సంసార బన్ధన మగును కాని మఱియొక బన్ధనము లేదు ఈ కామబన్ధనమునుండి ముక్తుడయినవాడు మరల జన్మించడు అనగా ముక్తుడగును

బ్రహ్మచర్యరతా ఊర్ధ్వరేతసో బ్రహ్మచింతకాః ।
బ్రహ్మలోకం వ్రజన్త్యన్యే నిస్తపస్కా న యాన్తి తమ్ ॥

బ్రహ్మచర్యనిష్ఠులగు ఊర్ధ్వరేతస్కు లయినవారు బ్రహ్మధ్యానము గల్గి బ్రహ్మలోకమును పొందుదురు బ్రహ్మచర్యమనెడు తపస్సు లేనివారలు ఆ బ్రహ్మలోకమును పొందజాలరు

విషయాసంగరూపో యః పాప్మాఽసావాసురత్వతః ।
విద్యేచ్ఛాం ప్రతిబధ్నాతి సోఽయమాదౌ నివర్త్యతామ్ ॥

విషయాసక్తి యేదికద్దో అది మహాపాపస్వరూపము అది అసురస్వభావము అట్టిది బ్రహ్మవిద్యను ప్రతిబన్ధించును కావున మొట్ట మొదట విషయాసక్తిని నివర్తించవలయును శ్రీ కృష్ణభగవంతుడు మూడవఅధ్యాయమున దీనినే చెప్పెను

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥

ఈ కామక్రోధములు రజోగుణము వలన గలుగుచున్నవి ఇవి మహాశనుడగు అగ్ని వంటివి ఇవి మహాపాపస్వరూపములు ఇవి ఆత్మజ్ఞానమునకు పరమశత్రువులని ఎఱుంగుము.

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్య వైరిణా ।
కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ ॥

ఎంత నిండింప జూచినను సముద్రమువలె నిండనిదియు, తృప్తి లేనిదియు, కామరూప మయినదియు, జ్ఞానికి సర్వకాలములయందును మహాశత్రువు

అయినదియు నగు కామముచేత జ్ఞానము ఆవరింపబడియున్నది

**తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥**

కావున ఓ యర్జునా! ఇంద్రియము లన్నిటిని నియమములో నుంచి మహాపాప స్వరూపమున్ను, జ్ఞానమునున్ను విజ్ఞానమునున్ను నశింప జేయునదియునగు ఈ కామమును త్యజింపుమా (చంపుమా) మనుమహర్షిగూడ నీలాగుననే వచించెను

**న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।**
**హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥**

కామము విషయభోగములచేత ఎన్నటికిని శమించదు భోగము అనుభవింపగా అనుభవింపగా అంతకంతకు వృద్ధినొందుచునే యుండును ఎట్లనగా సమిధలచేతను, ఘృతముచేతను అగ్నిహోత్రుడు అంతకంతకు వృద్ధి నొందునట్లుండును

**ఇన్ధనేవ యధా వహ్నిర్వర్ధతే హ్యుత్తరోత్తరమ్ ।**
**భోగేన కామరూపాగ్నిః ఉత్తరోత్తర వర్ధతే ॥**

కట్టెలచేత నిప్పు అంతకంతకు వృద్ధి గాంచునట్లు విషయభోగములచే కామాగ్నియు అంతకంతకు అభివృద్ధిని పొందుచుండును

## యజుర్వేద మంత్రము

**తదేవ శుక్రం తద్బృహ్మ తా ఆపః స ప్రజాపతిః ॥**

అదియే వీర్యము అదియే ఈశ్వరుడు అదియే జీవనము. అదియే సృష్టికర్త

భీష్ముడు ధర్మరాజున కుపదేశించినది చూడుడు.-

బ్రహ్మచర్యస్య చ గుణం శృణుధ్వం వసుధాధిపాః ।
ఆజన్మ మరణాద్యస్తు బ్రహ్మచారీ భవేదిహ ॥

న తస్య కిఞ్చిదప్రాప్యమితి విద్ధి నరాధిప ।
బహ్వ్యః కోట్యస్త్వృషీణాం చ బ్రహ్మలోకే వసన్త్యుత ॥

సత్యే రతానాం సతతం దాన్తానా మూర్ధ్వ రేతసామ్ ।
బ్రహ్మచర్యం వహేద్రాజన్ సర్వపాపాన్యుపాసితమ్ ॥

ఓ ధర్మరాజా! బ్రహ్మచర్య వ్రతము యొక్క గుణమును వినుము, ఈ ప్రపంచమున జన్మించినదాది మరణ పర్యన్తము బ్రహ్మచారియై యుండువానికి లభ్యముగాని సుగుణములే యుండవు అనగా సకల సుగుణములు గల్గియుండును బ్రహ్మచర్యవ్రత మహిమచేతనే అనేక మహర్షులు, కోట్ల కొలదిగ మనుష్యులు ఆనందస్వరూపుడగు పరమాత్మ సాన్నిధ్యమునకు చేరి యగణితమైన సుఖమును పొందిరి, పొందుచున్నారు పొందగలరు

సముద్రతరణే యద్వదుపాయో నౌః ప్రకీర్తితా ।
సంసారతరణే తద్వత్ బ్రహ్మచర్యం ప్రకీర్తితమ్ ॥

సముద్రమును దాటుటకు నౌక యెటువంటిదో ఆలాగున సంసార సముద్రమును దాటుటకు బ్రహ్మచర్యవ్రత ముత్కృష్ట సాధనము

యే తపశ్చ తపస్యన్తి కౌమారాః బ్రహ్మచారిణః ।
విద్యా వేదవ్రతా స్నాతా దుర్గాణ్యపి తరన్తి తే ॥

ఏ బ్రహ్మచారులు బ్రహ్మచర్య వ్రతరూప తపస్సును ఆచరింతురో, ఎవరు వేద విద్యావ్రతులై పవిత్రు లగుదురో వారు అతి కఠిన మైనట్టియు అత్యద్భుతము లయినట్టియు కార్యములను చేయగల్గి ఈ దుస్తరమైన సంసార సాగరమును అనాయాసముగా దాటగలరు

బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభో భవత్యపి ।
సురత్వం మానవో యాతి చాన్తే యాతి పరాం గతిమ్ ॥

బ్రహ్మచర్యవ్రతమును పాలించినచో వీర్య లాభము గల్గి మానవులకు దేవత్వము ప్రాప్తమై సాధన చతుష్టయసంపత్తి పరిపూర్ణత నొంది పరమగతి లభ్యమగును

**బ్రహ్మచర్యం పాలనీయం దేవానామపి దుర్లభమ్ ।**
**వీర్యే సురక్షితే యాన్తి సర్వలోకార్థసిద్ధయః ॥**

బ్రహ్మచర్య వ్రతమవశ్యము పాలించవలయు, ఈబ్రహ్మచర్యవ్రతము దేవతలకుగూడ దుర్లభము కాబట్టి వీర్యమును సురక్షిత మొనర్చినచో సకలార్థసుఖములు సిద్ధించును

**చిరాయుషః సుసంస్థానాః దృఢసంహననా నరాః ।**
**తేజస్వినో మహావీర్యా భవేయుః బ్రహ్మచర్యతః ॥**

విధిగా బ్రహ్మచర్య వ్రతమును పాలించువారు ఆయురారోగ్యవంతులై సుందర శరీరులై దృఢముగా కర్తవ్యదీక్ష గలవారై, తేజః ప్రపూర్ణులయి మహాపరాక్రమశాలురై యుందురు

**ప్రాణభూతం చరిత్రస్య పరబ్రహ్మైక్యకారణమ్ ।**
**సమాచరన్ బ్రహ్మచర్యం పూజితైరపి పూజ్యతే ॥**

బ్రహ్మచర్యము సచ్చరిత్రకు ప్రాణము వంటిది పరబ్రహ్మైక్యమునకు కారణభూతము. కాబట్టి దానిని పాలించు మనుష్యుడు మహా పూజ్యు లయినవారిచే పూజింపబడును.

జనులారా! ఒకప్పుడు ధన్వన్తరిమహర్షి తనయాశ్రమమున కూర్చుండి శిష్యులకు ఆయుర్వేదమును చెప్పుచుండెను పాఠములు చెప్పుట పూర్తి అయిన తరువాత, ఓ గురువర్యా, దేనిని సేవించిన సర్వరోగములు నాశములై మానవులు ఆయురారోగ్యములు గల్గి సుఖించెదరో అట్టి దానిని తెలియజేయుడు అని శిష్యులు ప్రార్థించిరి ఇట్లు ప్రార్థించిన శిష్యుల ప్రార్థనలను విని ధన్వన్తరి మహర్షి అత్యంత ప్రసన్నుడై, ఓ వత్సలారా! మీరు నిర్మలమనస్కులై వినుడని ఇట్లుచెప్పెను-

మృత్యువ్యాధిజరానాశి పీయూషం పరమౌషధమ్ ।
బ్రహ్మచర్యం మహద్యత్నం సత్యమేవ వదామ్యహమ్ ॥

బ్రహ్మచర్యవ్రత మమృత స్వరూపమై మరణమును రోగమును వృద్ధావస్థను నాశనము జేసెడిదై యున్నది ఇది నిజము ఇది మహాయత్నముతో కూడినది మఱియు

శాన్తిం కాన్తిం స్మృతిం జ్ఞానమారోగ్యం చాపి సన్తతిమ్ ।
య ఇచ్ఛతి మహద్ధర్మం బ్రహ్మచర్యం చరేదిహ ॥

ఈ ప్రపంచమున శాంతి, కాంతి, స్మృతి, జ్ఞానము, స్వాస్థ్యము, ఉత్తమసంతానము గోరువారెల్లరు సర్వోత్కృష్ట ధర్మమైన బ్రహ్మచర్యవ్రతమును తప్పక పాలించవలయును

బ్రహ్మచర్యం పరం జ్ఞానం బ్రహ్మచర్యం పరం బలమ్ ।
బ్రహ్మచర్యమయో హ్యాత్మా బ్రహ్మచర్యైవ తిష్ఠతి ॥

బ్రహ్మచర్యవ్రతమే సర్వోత్తమమైన జ్ఞానము బ్రహ్మచర్యవ్రతమే అపరిమితమైన బలము. ఆత్మ, బ్రహ్మచర్యవ్రతమయమై యున్నది అది బ్రహ్మచర్యవ్రతమహిమ చేతనే మనుష్య శరీరములో నివసించుచున్నది అది నిశ్చయము ఇంతేగాక

బ్రహ్మచర్యం నమస్కృత్య చాసాధ్యం సాధయామ్యహమ్ ।
సర్వలక్షణహీనత్వం హన్యతే బ్రహ్మచర్యయా ॥

బ్రహ్మచర్యవ్రతమయుడైన భగవత్స్వరూపమునకు నమస్కరించి ప్రార్థించి అసాధ్యమయిన రోగములనుగూడ సాధ్యపరచుకొనుచున్నాను. కాన పరమపవిత్రమగు నీ బ్రహ్మచర్య వ్రతమును పాలించినచో సకల అశుభములు దూరమగును

బ్రహ్మచర్యేణ విద్యా విద్యయా బ్రహ్మలోకమ్ ।

బ్రహ్మచర్యవ్రత పాలనచేత బ్రహ్మవిద్యయు, బ్రహ్మవిద్యచేత

బ్రహ్మలోకమును మనుష్యుడు పొందుచున్నాడు (హఠయోగప్రదీపిక)

**చిత్తాయత్తం నృణాం శుక్రం శుక్రాయత్తం చ జీవితమ్ ।**
**తస్మాచ్ఛుక్రం మనశ్చైవ రక్షణీయం ప్రయత్నతః ॥**

మనుష్యుని వీర్యము చిత్తమునకు ఆయత్తమైనది వీర్యమునకు జీవనము వశమై యున్నది కాబట్టి మనస్సును, వీర్యమును ప్రయత్నపూర్వకముగా రక్షించవలయును.

"ధాతుక్షయాత్ స్రుతే రక్తే మందస్సంజాయతేఽనలః" అనగా ధాతువు (వీర్యము) నష్టమైన రక్తముచెడి, బలహీనమగును. అందువలన జఠరాగ్ని (ఆకలి) మందగించును ఆకలి మందగించిన మనుజుని యారోగ్యమునుగూర్చి చెప్పవలసిన యగత్యము లేదు ఇది ఆయుర్వేద సిద్ధాన్తము.

**ఓజశ్చ తేజో ధాతూనాం శుక్రాన్తానాం పరం స్మృతమ్ ।**
**హృదయస్థమపి వ్యాపి దేహస్థితి నిబన్ధనమ్ ॥**

**యస్య ప్రవృద్ధౌ దేహస్య తుష్టి పుష్టి బలోదయాః ।**
**యన్నాశే నియతో నాశో యస్మింస్తిష్ఠతి జీవనమ్ ॥**

**నిష్పాద్యన్తే యతో భావా వివిధా దేహసంశ్రయాః ।**
**ఉత్సాహప్రతిభా ధైర్యలావణ్య సుకుమారతాః ॥**

అనగా రసమనెడి ధాతువునుండి వీర్యమనెడి ధాతువు వరకును నుండు ఏడు ధాతువులకును సంబంధించిన యే తేజస్సైతే కలదో దానిని ఓజస్సందురు ఓజస్సు ముఖ్యముగా హృదయ మందుండును అయినను దాని ప్రకాశము దేహము నందంతటను వ్యాపించియుండును ఓజస్సు వృద్ధి నొందుటచేతనే సన్తుష్టి, పుష్టి, బలోత్పత్తియు నేర్పడగలదు ఓజస్సు నశించుటచేతనే మృత్యువు సంభవించును ఈ ఓజస్సనెడి పదార్థమే జీవనమునకు నాధారము. దీనిచేతనే ఉత్సాహము, ప్రతిభ, ధైర్యము, లావణ్యము, సౌకుమార్యము సంప్రాప్తించును

సిద్ధే బిన్దౌ మహారత్నే కిం న సిద్ధ్యతి భూతలే ।
యస్య ప్రభావాన్మహిమా మమాప్యేతాదృశోఽభవత్ ॥

దేని ప్రభావముచేత నేనిట్టి మహిమ గలవాడనై యుంటినో అట్టి వీర్య బిందువనెడి మహారత్నమును సంపాదింపగా భూతలమున సాధ్యము గాని దెయ్యది? అని పరమశివుని వాక్యము

ఇక మనుస్మృతియందు జెప్పిన బ్రహ్మచారి నియమములను జూడుడు ఇదే ప్రకారము భవిష్య మహాపురాణములో చెప్పినది పైన వ్రాయబడి యున్నది దానికిని దీనికిని కొద్దిభేదమే గలదు మనుస్మృతి ధర్మశాస్త్రము లన్నిటికి మూలము సామాన్యముగా విద్వాంసులు దీనినెఱింగియున్నారు అందువలననే దీనినిగూడ నిందు చేర్పడమైనది

సేవేతేమాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌ వసన్ ।
సన్నియమ్యేన్ద్రియగ్రామం తపోవృద్ధ్యర్థ మాత్మనః ॥

నిత్యం స్నాత్వా శుచిః కుర్యా ద్దేవర్షి పితృతర్పణమ్ ।
దేవతాభ్యర్చనం చై వ సమిదాధానమేవ చ ॥

వర్జయేన్మధుమాంసం చ గంధం మాల్యం రసాన్ స్త్రియః ।
శుక్లాని యాని సర్వాణి ప్రాణినాం చైవ హింసనమ్ ॥

అభ్యఙ్గమంజనం చాక్ష్ణోరుపానచ్ఛత్రధారణమ్ ।
కామం క్రోధం చ లోభం చ నర్తనం గీతవాదనమ్ ॥

ద్యూతం చ జనవాదం చ పరివాదం తథాఽనృతమ్ ।
స్త్రీణాం చ ప్రేక్షణాలంభముపఘాతం పరస్య చ ॥

ఏకశ్శయీత సర్వత్ర న రేతస్స్కన్దయేత్క్వచిత్ ।
కామాద్ధి స్కన్దయన్ రేతో హినస్తి వ్రతమాత్మనః ॥

స్వప్నే సిక్త్వా బ్రహ్మచారీ ద్విజశ్శుక్రమకామతః ।
స్నాత్వాఽర్కమర్చయిత్వా త్రిఃపునర్మామిత్యృచం జపేత్ ॥

బ్రహ్మచారి గురుకులమున నివసించుచు నింద్రియ నిగ్రహముతో పాటు తపోవృద్ధికై యీ నియమములను పాలింపవలెను స్నానముజేసి శుచియై నిత్యము దేవర్షి పితృతర్పణమును జేయవలెను అగ్ని కార్యమును, దేవతార్చనమును నాచరించవలెను మద్యమాంసములను, సుగంధ వస్తువులను, పుష్పమాలికలను ధరింపరాదు ఉద్రేకమును గూర్చు రస పదార్థములను సేవింపరాదు. స్త్రీని వర్జింపవలెను ఏ ప్రాణిని హింసింపరాదు అభ్యంగనము, నేత్రములకు అంజనమున్ను విడనాడవలయు చెప్పులు గొడుగులు ధరింపరాదు, కామ క్రోధలోభాదులను పరిత్యజింపవలెను నాట్యము, గానము, వీణాది వాద్యములను విడువవలెను జూదము, నిరర్థక వాదము, అసత్యము, పరనిందలను ఆచరింపరాదు స్త్రీలను చెడుబుద్ధితో జూచుటయు స్పృశించుటయు కూడదు పరుల కపకారము చేయరాదు సర్వత్ర యొంటరిగా శయనింపవలెను ఇచ్ఛా పూర్వకముగా నెన్నడును రేతస్ఖలనము జేయరాదు అట్లు నష్టపరచినవాడు తన వ్రతమును చెరచుకొనిన వాడగును స్వప్నమందొక వేళ వీర్యనష్టమైనయెడల అట్టిబ్రహ్మచారి స్నానము జేసి ప్రాతఃకాలమున సూర్యునికి ఎదురుగా నిలిచి పూజింపవలెను తర్వాత జపాదులను జేసికొనవలయును

ఇట్టి నియమము లేనిచో బహిర్దృష్టి గలిగి విద్యాతపస్సులు నశించిపోవునని దయతో ఋషులు తెలిపిరి ఇకను గౌతమస్మృతి మొదలగు అనేక గ్రంధములలో బ్రహ్మచర్యమును గురించి తెలుపబడియున్నది అవి యన్నియు ఇంచుమించుగ మనుస్మృతి ననుసరించి యుండుటచే గ్రంధవిస్తారముచే చేర్చలేదు

**ఓజస్సర్వశరీరస్థం స్నిగ్ధం శీతం స్థిరం సితమ్ ।**
**సోమాత్మకం శరీరస్య బలపుష్టికరం మతమ్ ॥**

ఓజస్సు దేహమందంతటను ప్రకాశించుచుండును ఇయ్యది స్నిగ్ధము, శీతలము, స్థిరము, శుభ్రము, తేజో రూపమై, ప్రశాంతమై, శరీరమునకు, కాంతియు, శాంతియు, బలము నొసంగును మఱియు సుశ్రుతమున

**యధా పయసి సర్పిస్తు గుడశ్చేక్షౌరసో యధా ।**
**శరీరేషు తధా శుక్రం నృణాం విద్యాద్భిషగ్వరః ॥**

పాలలో నేయివలెను, చెఱకునందు రసమువలెను, జీవుల దేహమందంతటను శుక్లము వ్యాపించి యున్నది విద్వాంసుడు దీనిని బాగుగా గ్రహించవలెను వెన్న తీసిన పిదప పాలుఎట్లు సారహీనమైన దగుచున్నదో, రసమును తీసిన పిమ్మట చెఱకెట్లు పిప్పియై పోవుచున్నదో, అటులనే వీర్యము గూడ నష్టమైనచో శరీరము తేజోహీనమై నిర్వీర్యమై దుర్బలమై పోవుచున్నది

**ఇన్ద్రియేషు చ సర్వేషు వాగుపస్థౌ మహాబలౌ ।**
**ఆదౌ తయోర్జయే యత్నం కుర్యాద్యోగీ విశేషతః ॥**

మానవుని యిన్ద్రియ సమూహములో గుహ్యేన్ద్రియ జిహ్వేన్ద్రియములు మహాబలిష్ఠము లైనవి వానిని జయించుట మహాకష్టము అందువలన యోగిగాని, బ్రహ్మచారిగాని ఈ రెండింటియొక్క విజయమునకై విశేషమగు యత్నము జేయవలెను ఈ రెండు ద్వారములు ప్రకృతి ద్వారములు ఈ రెండింటిని జయించినవాడు ప్రకృతి ద్వారమును మూసినవాడును, మోక్షద్వారమును తెరచిన వాడగును ప్రకృతి ద్వారమెంతవరకు మూయబడలేదో, అంతవరకు బ్రహ్మరంధ్రము, ముక్తి మార్గము తెరువబడదు

ఇక బ్రహ్మచారులు గాని సన్న్యాసులు గాని సరియైన వ్రతానుష్ఠానము లేనిచో కేవలము వేషధారులేగాని యిసుమంతయు ప్రయోజన ముండదని మనువు జెప్పినది జూడుడు

**యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః ।**
**యశ్చ విప్రోఽనధీయానస్త్రయస్తే నామ బిభ్రతి ॥**

ఏలాగున కఱ్ఱతో జేయబడిన యేనుగును, చర్మముతో కుట్టబడిన జింకయు నామమాత్రములై యుంటున్నవో, ఆలాగున అధ్యయన తపస్సులు లేని బ్రహ్మచారియు, సన్న్యాసియు, బ్రాహ్మణుడున్ను నామధారులే యగుదురు పరాశరముని తెలిపినది గాంచుడు -

**అవ్రతా హ్యనధీయానా యత్ర భైక్ష్యచరాః ద్విజాః ।**
**తం గ్రామం దణ్డయేద్రాజా చోరభక్తప్రదో హి సః ॥**

బ్రహ్మచర్యవ్రత పాలనరహితులును, శాస్త్రము నధ్యయనము చేయనివారును అగు బ్రహ్మచారులు గాని సన్న్యాసులు గాని బ్రాహ్మణులు గాని భిక్షాన్నాదులచే జీవించుచున్నట్లయిన అట్టివారికి అన్నము పెట్టెడువారినేగాక ఆ గ్రామస్థులనుగూడ రాజు దండించవలెను ఏలన చోరులకు సహాయము చేయువా రెటుల శిక్షార్హులో ఆలాగున సోమరులై దిమ్మరులై యుండువారికి సహాయము చేయువారు కూడ శిక్షార్హులు ఈ ప్రమాణమును జూచిన పూర్వకాలము బ్రహ్మచారులపై, సన్న్యాసులపై, బ్రాహ్మణులపై రాజశాసన మేలాగున నుండెనో గోచరించును

**అన్నం పుంసాఽశితం త్రేధా జాయతే జఠరాగ్నినా ।**
**మలం స్థవిష్ఠో భాగస్స్యాన్మధ్యమో మాంసతాం వ్రజేత్ ॥**
**మనః కనిష్ఠోభాగస్స్యాత్తస్మాదన్నమయం మనః ।**

మానవులు భుజించెడు అన్నపానాదులు జఠరాగ్ని వలన మూడుభాగములై మారుచుండును మలమూత్రములు స్థూలభాగముగాను, మధ్యమభాగము మాంసముగాను, కనిష్ఠ భాగము మనస్సుగాను మారుచుండును

కావున మనస్సు శుద్ధము కావలసియుండిన ఆహారము శుద్ధముగా నుండవలయును ప్రాణాపానముల శక్తివలన నేర్పడిన జఠరాగ్ని ఆహారపానీయము లను రసరక్త మాంసాది సప్త ధాతువులుగా మార్చుచుండును దీనివలననే స్థూలసూక్ష్మ శరీరము లేర్పడును కనిష్ఠభాగములో గల పృధివీతత్త్వము అహంకారముగాను, జలతత్త్వము చిత్తముగాను, అగ్నితత్త్వము బుద్ధిగాను, వాయుతత్త్వము మనస్సుగాను, ఆకాశతత్త్వము అంతఃకరణముగాను మారుచుండును పృధివీతత్త్వము కఠిన మగుటచే అహంకారము కఠినముగా నుండును, జలతత్త్వము చిత్తమగుటచే చిత్తమునకు చింతనాశక్తియు, అగ్నితత్త్వము బుద్ధియగుటచే బుద్ధికి అన్నిటిని తెలిసికొనెడిశక్తియు, వాయుతత్వము మనస్సగుటచే మనస్సుకు చలనస్వభావమును గలుగుచున్నవి నాలుగు భూతములు వ్యక్తములుగాను, ఆకాశ మవ్యక్తముగాను నుండునట్లున్ను, బుద్ధ్యాదులు నాల్గున్ను వ్యక్తము లగుటయు, అన్తఃకరణము అవ్యక్త మగుటయు

సంభవించుచున్నవి

ఆహారము స్వభావముగా సాత్త్వికముగా మాత్రముండిన చాలదు సత్యార్జిత ధనముచే శుద్ధమయిన పదార్థములను, యుక్తముగా నియమిత కాలములో మాత్రము భుజించినప్పుడే సాత్త్వికాహార మగును అదియు జాలదు సత్త్వగుణమున్ను సత్త్వగుణ విశిష్ట దైవోపాసనయు నుండవలయు. వస్తువు మాత్రము శుద్ధమయి యుండినను, వచ్చిన మార్గ మశుద్ధ మయినను, మనస్సుగూడ శుద్ధముగా లేకపోయినను, అది సాత్త్వికాహారముగా పరిగణింపబడదు పై జెప్పబడిన ప్రమాణములో ఆహారము పెట్టువాని స్వభావము గూడ ఆహారముతోగూడ వచ్చునని తెలిపెడు విషయము మీరు జ్ఞప్తిలో నుంచుకొన వలయును, 'పరాన్నేన తు' అను శ్లోకమును చూచుకొనవలయు.

ఆత్మసమ్మితమాహారమాహరేదాత్మవాన్ యతిః ।
అత్యన్త క్షుధితస్యాపి సమాధిర్నైవ జాయతే ॥

ఆత్మనిష్ఠాపరుడగు సన్న్యాసి శుద్ధమగు నాహారము మితముగానే భుజింపవలయు నిండా ఆకలితో గూడిన వానికిని, మిక్కుటముగా భుజించిన వానికిన్ని, సమాధియందు మనస్సు నిలకడతో నుండదు ఇక భారతములో శాంతి పర్వమున చెప్పినది చూడుడు -

ఏకాన్తినో హి పురుషా దుర్లభా బహవో నృప ।
యద్యేకాన్తిభిరాకీర్ణం జగత్స్యాత్కురునన్దన ॥

అహింసకైరాత్మవిద్భిః సర్వభూతహితే రతైః ।
భవేత్కృతయుగప్రాప్తిరాశీఃకర్మవివర్జితైః ॥

ఇది భీష్ముడు ధర్మరాజున కుపదేశించిన భాగము

ఏకాంత మందుండి బ్రహ్మనిష్ఠ జేయువారు అనేకు లుండరు. అట్టివారు దొరకుట దుర్లభము ఎప్పుడైతే అట్టి యేకాన్త బ్రహ్మనిష్ఠులచే లోకము వ్యాప్తమగుచుండునో అప్పటినుండి కృతయుగధర్మము జరుగుచుండును.

మరియు ఎప్పుడు జీవకారుణ్య పరులున్ను, ఆత్మవేత్తలున్ను సకల ప్రాణికోట్లకు, మేలుగలుగజేయు స్వభావము గలవారున్ను, సకామకర్మములను త్యజించిన, వారున్ను ఏర్పడుదురో అప్పటినుండి కృతయుగము ప్రారంభ మగుచున్నది.

పైజెప్పిన లక్షణములు గలవారు పూర్వము లోకములో ఎక్కువ మంది యుండుటచేతనే అది పుణ్యయుగమని చెప్పబడినది అట్టి పుణ్యాత్ములు ఎప్పుడు తగ్గిపోయిరో, వారి వలన ధర్మబోధ లెప్పుడు లేకపోయెనో అప్పటినుండియే కలియుగధర్మము వ్యాప్తమయినది దీనినొకదానిని గ్రహించిన బ్రహ్మనిష్ఠులు సాధుపురుషులు లోకమున కెంత యుపయోగకరమో తెలిసికొనవచ్చును

**ఫలస్య కారణం పుష్పం ఫలం పుష్పవివర్జితమ్ ।**
**జ్ఞానస్య కారణం కర్మ జ్ఞానం కర్మవివర్జితమ్ ॥**

ఫలమునకు పుష్పమున్ను, పుష్పమునకు వృక్షమును ఎట్లు కారణముగా నుంటున్నవో, ఫలము పక్వమగునప్పుడు పుష్పము లేనిది యగునో, అలాగున ఆధ్యాత్మిక జ్ఞానమునకు పుణ్యకర్మము, నిష్కామకర్మము కారణ మగును పూర్ణజ్ఞానావస్థలో కర్మయోగము లేకపోయినను, కర్మయోగముచేతనే అట్టిస్థితి గలిగినదని విజ్ఞులు తెలిసికొనవలయును.

ఓహో! కర్మజ్ఞానయోగముల గురించి ఎంత పరమరహస్య ముపదేశించడ మైనది జ్ఞానులకు కర్మతో సంబన్ధములేదని వాదించువారు ఇట్టి సత్యమును తెలిసికొనెదరుగాక! గీతాశాస్త్ర మంతయు దీనిని గురించియే చెప్పుచున్నది

**మితాశనో భవేన్నిత్యం భిక్షుర్మోక్ష పరాయణః ।**
**కామదర్పాదయో దోషా న భవన్తి మితాశినః ॥**

మోక్షమందాసక్తిగల భిక్షువులు (ముముక్షువులు) ఎల్లప్పుడున్ను నియమిత కాలములో నియమప్రకారముగాను మితముగాను భోజనము జేయు స్వభావముగలవారై యుండవలయును అట్టివారికి కామ, క్రోధ, మోహ, మద, దర్పాది దోషము లుండవు

సాధకులు ఇట్టి యుత్కృష్టశాస్త్రములను ఉత్తమ గురువులదగ్గఱ శ్రవణము

జేయకపోవుటచేతనే మితాహారులు కాకపోవుచున్నారు. అందువల్లనే వారికి ఇన్ద్రియనిగ్రహ మలవడుట లేదు

**బ్రహ్మచర్యమమానిత్వ మహింసా సత్యమార్జవమ్ ।**
**వేదాన్తశ్రవణం ధ్యానం భిక్షోః కార్యాణి నిత్యశః ॥**

సన్న్యాసులయినవారికి నిత్యమున్ను చేయవలసిన కార్యములగురించి యతిధర్మ సంగ్రహమందు తెలిపినది గాంచుడు (1) బ్రహ్మచర్యము, (2) అమానిత్వము, (3) అహింస, (4) సత్యము (5) ఋజుత్వము, (6) వేదాంత శ్రవణము (7) బ్రహ్మధ్యానము- ఇవి యెల్లప్పుడు అనుష్ఠానములో నుండవలయునని శాస్త్రములు శాసించుచున్నవి ఈ బ్రహ్మవిద్యయందు నెవరెవరి కధికారము గలదో, యా విషయమై శాస్త్రమేమి జెప్పినదో చూడుడు-

**బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థోఽథవా పునః ।**
**విరక్తస్సర్వకామేభ్యః పరివ్రాజ్యం సమాహితః ॥**

బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, వానప్రస్థుడైనను, అట్లుగాక మఱియెవడైనను సమస్త కామాది కోరికల నుండి విరక్తి గలవాడైనచో అట్టివాడు పరివ్రాజక స్థితిని పొందవచ్చును

**జ్ఞానయజ్ఞోడుపేనైవ బ్రాహ్మణోవాఽన్త్యజోపి వా ।**
**సంసారసాగరం తీర్త్వా ముక్తిపారం హి గచ్ఛతి ॥**

బ్రాహ్మణుడైనను, అన్త్యజుడైనను, మఱి యెవడైనను ఆత్మజ్ఞానమనెడు తెప్పచేతనే సంసార సాగరమును దాటి ఈ లోకమునందే మోక్షమనెడు తీరమును జేరగలడు

**ప్రతిగ్రహసమర్థోఽపి ప్రసంగం తత్ర వర్జయేత్ ।**
**ప్రతిగ్రహేణ హ్యస్యాశు బ్రాహ్మం తేజః ప్రణశ్యతి ॥**

బ్రహ్మనిష్ఠుడు దానాదులను పట్టుటలో తగిన సమర్థత గలవాడైనను అట్టికార్యములలోగల ఆసక్తిని విడువవలయును పరవస్తువు గ్రహించుటచే

వీనియొుక్క బ్రహ్మతేజస్సు త్వరలో నశించిపోవును ఇక బ్రహ్మచారి నిర్విఘ్నముగా తపస్సిద్ధి పొందుటకు తగిన స్థలమును గురించి కొంచెము దెలిపెద

## కాశీఖండము

**పుణ్యక్షేత్రం నదీతీరం గుహా పర్వతమస్తకమ్ ।**
**తీర్థప్రదేశాస్సిన్ధూనాం సంగమః పావనం వనమ్ ॥**

**ఉద్యానాని వివిక్తాని బిల్వమూలం తటం గిరేః ।**
**దేవతాయతనం కూలం సముద్రస్య నిజం గృహమ్ ॥**

**సాధనేషు ప్రశస్తాని స్థానాన్యేతాని మన్త్రిణామ్ ।**
**అథవా నివసేత్తత్ర యత్ర చిత్తం ప్రసీదతి ॥**

పుణ్యక్షేత్రము, నదీతీరము, గుహలు, పర్వతోపరిభాగము, తీర్థప్రదేశములు, నదులు సముద్రములో కలియు ప్రదేశము, పవిత్రవనము, విజనప్రదేశములగు ఉద్యానవనములు, బిల్వవృక్షమూలము, పర్వతప్రాన్త ప్రదేశము, పుణ్య దేవాలయములు, యజ్ఞము జేయు స్థలము, సముద్రతీరము, శుద్ధమయిన, స్వగృహముండిన అదియు- ఈ స్థలము లన్నియు దివ్యమన్త్రానుష్ఠానము గల సాధకులకు ప్రశస్త ప్రదేశములు అదియును గాక యే ప్రదేశమందు తన మనస్సునకు సంతోషము కలుగుచుండునో అట్టి స్థలమెచ్చటయినను అచ్చోట నుండి తపోధ్యాన యోగాదులను జేయవచ్చును.

**సమే శుచౌ శర్కరవహ్నివాలుకావి వర్జితే శబ్దజలా శ్రయాదిభిః ।**
**మనోఽనుకూలే నతు చక్షుపీడనే గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్ ॥**

మిట్ట పల్లములు లేనిదియు, శుభ్రమైనదియు, వేడిని గలుగజేయు గులకరాళ్లున్ను నిప్పున్ను ఉష్ణమును గలుగజేయు నిసుకయున్ను లేనిదియు, మంచి పక్షుల ధ్వని గలదియు, మంచి జలాశయము గలదియు, మంచి వాతావరణము గలదియు, మంచి వృక్షములు గలదియు, దుష్టజంతువులచే గాని, దుష్ట మనుష్యులచేగాని బాధాకరము కానిదియు, మనస్సును ప్రసన్నముగా

జేయునదియు, నేత్రమునకు బాధను గలిగించెడు నికృష్ట నీచ మాలిన్యమును గలుగజేసెడు వికార భయంకర ప్రదేశములు లేనిదియు, శుద్ధమగు గుహయు, ఎక్కువగాలి బాధ లేని ప్రదేశము నగు స్థలమును ఆశ్రయించవలయును అట్టి స్థలమున

**త్రిరున్నతం స్థాప్య సమం శరీరం హృదీన్ద్రియాణి మనసా సన్నివేశ్య ।**
**బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్స్రోతాంసి సర్వాణి భయావహాని ॥**

సిద్ధాసన పద్మాసనాదులలో ఆసీనుడై హృదయము, కంఠము, శిరస్సు కొంచెము ఎత్తుగా నుంచినవాడై, మనస్సు మొదలగు ఇన్ద్రియములను హృదయములో పరమాత్మ ధ్యానమందు నిశ్చలము చేసినవాడై, పరమాత్మను తెలిపెడు ఓంకారమనెడు తెప్పను ఆశ్రయించినవాడై, జననమరణ భయములకు కారణములయిన నదులన్నిటిని జ్ఞాననిష్ఠుడు దాటవలయును ఈ యర్థమునే గీతయందు శ్రీ కృష్ణభగవాను డుపదేశము జేసెను

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్ ॥**

**తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః ।**
**ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగమాత్మవిశుద్ధయే ॥**

**సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।**
**సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥**

పరిశుద్ధమగు ప్రదేశమున మిక్కిలి ఎత్తుగా నుండనిదియు, మిక్కిలి పల్లముగా నుండనిదియునగు స్థలమున దర్భాసనము, కృష్ణాజినము, వస్త్రము ఇవి ఒక దాని పై నొకటి గలదియు, కదలనిదియు నగు ఆసనము వేసికొని, మనస్సును నిశ్చలమయిన దానినిగా జేసి చిత్తము యొక్కయు ఇన్ద్రియముల యొక్కయు వ్యాపారమును నిరోధించిన వాడగుచు, ఆత్మశుద్ధికొరకు ధ్యానయోగము నభ్యసింపవలయును శరీర శిరః కంఠములను సమముగాను, నిశ్చలముగాను ధరించిన వాడగుచు, సుస్థిరస్వభావము గలవాడై తన భ్రూమధ్య

మందు దృష్టి నిలిపి ఇతర దృశ్యములను దేనిని చూడని వాడుగా నుండవలయును పిమ్మట నుపనిషత్తునందు జెప్పిన ప్రకారము,

**జపేచ్చ ప్రణవం నిత్యం జితాత్మా విజితేన్ద్రియః ।**
**పఠేదుపనిషద్వాక్యం వేదాన్తార్థాంశ్చ చిన్తయేత్ ॥**

అట్టి పవిత్రమయిన పుణ్యప్రదేశములో నుండి మనస్సును నింద్రియములను ఏకాగ్రపరచినవాడై నిత్యమున్ను ఓంకారమును జపించుచు నుపనిషత్తులను పారాయణము జేయుచు వేదాన్తార్థమగు పరబ్రహ్మమును చింతించవలెను

బ్రహ్మనిష్ఠు డుండవలసిన స్థితిని గురించి యీలాగున నుపదేశించడమైనది

**నానమాన సహాయేషు నివసేద్యోగవిత్క్వచిత్ ।**
**వసేత్సమానశీలేషు సుశీలేషు తపస్విషు ॥**

ధ్యానాయోగా ద్యనుష్ఠానములు చేయువాడు తన స్వభావమునకు భిన్న గుణము గలవారితో ఒకానొకప్పుడును నుండరాదు తన స్వభావమున కనుగుణమున్ను, మిక్కిలి మంచిశీలమున్ను, తపస్సున్ను గలవారితో మాత్రమే కలిసియుండలయు లేనిచో, మనస్సున అశాంతి గలుగుటయేగాక కలహము గూడ పుట్టవచ్చును

**ముహూర్తమపి నాసీత దేశే సోపద్రవే యతిః ।**
**ఉపద్రుతే తు మనసి సమాధిర్నైవ జాయతే ॥**

బ్రహ్మనిష్ఠుడు ఒక ముహూర్తకాల మయినను మనశ్శాంతి భంగకరమగు స్థలమున నుండరాదు మనశ్శాంతికి భంగము గలిగెడు ప్రదేశమున నుండిన మనస్సు సమాధియందు నిలకడతో నుండదు.

**యత్తీర్థమనుసంప్రాప్య చిత్తమస్య ప్రసీదతి ।**
**తత్ర తిష్ఠేన్నరో విద్వాన్ మోక్షమార్గే వ్యవస్థితః ॥**

ఏ ప్రదేశమందుండిన, ఏ తీర్థస్థలమందుండిన సాధకునకు మనస్సున శాంతియు, ప్రసన్నతయు గల్గునో మోక్షమార్గమందు ప్రవర్తించెడు విద్వాంసుడు ఆలాటి స్థలములోనే యుండవలయును

స్థలము మాత్రము పుణ్యవంతమైనను, పుణ్యతీర్థమైనను తన యనుష్ఠానమునకు అనుకూలము లేనిచో అట్టి స్థలమును తప్పక విడువవలయును, అట్లుగాక దేహబాధాకరమగు స్థలము పుణ్యప్రదేశమని తలంచి జీవితమును వ్యర్థపరుచుట ప్రజ్ఞావంతుల స్వభావము కాదు కనుకనే పై శ్లోకమున 'విద్వాన్' అని ప్రయోగించిరి

**నిగృహీతేన్ద్రియగ్రామో యత్ర యత్ర వసేద్యతిః ।**
**తత్ర తత్ర కురుక్షేత్రం నైమిశం పుష్కరం యథా ॥**

ఇన్ద్రియసమూహమును నిగ్రహించిన యతియగు వాడు ఎచ్చటెచ్చట నుండి బ్రహ్మనిష్ఠ సల్పునో ఆయా స్థలములు నైమిశారణ్యము, పుష్కరతీర్థము, ప్రయాగ మొదలగు ప్రదేశములవలె పుణ్యభూము లగును

ఇప్పుడు ప్రపంచములో కనుపించెడు పుణ్య భూములు పుణ్యతీర్థములు, పుణ్యక్షేత్రములు ఒక కాలములో మహాత్ములు తపమొనరించిన ప్రదేశములని గ్రహింపనగును అన్నిటికిన్ని శ్రద్ధయే ముఖ్యగుణమని గ్రహించవలయును.

**నాస్తి శ్రద్ధాసమం పుణ్యం నాస్తి శ్రద్ధాసమం సుఖమ్ ।**
**నాస్తి శ్రద్ధాసమం తీర్థం సంసారే ప్రాణినాం నృప ॥**

శ్రద్ధకు సమానమైన గొప్పపుణ్యము మఱి యొకటి లేదు. శ్రద్ధకు సమమైన సుఖమున్ను వేఱొకటి లేదు. ఈ సంసారమందు ప్రాణికోట్లకు శ్రద్ధకు సమమగు పుణ్య తీర్థము మఱియొకటి లేదు

**న ప్రమాదోఽత్ర కర్తవ్యో విదుషా మోక్షమిచ్ఛతా ।**
**ప్రమాదే జృంభతే మాయా సూర్యాపాయే తమో యథా ॥**

మోక్షేచ్ఛ గల విద్వాంసుడు ఎప్పుడున్ను అప్రమత్తుడై యుండవలయును.

ప్రమాదము గలవాడైనచో సూర్యు డస్తమించునప్పుడు తమస్సు లోకమున నావరించునట్లు ప్రమాదము గల్గిన వెంటనే ఆత్మను మాయ ఆవరించును

నైవజన్మని సర్వస్మిన్ విద్యాఽసా సులభాఽపి తు ।
శిష్యలక్షణ సంపూర్ణ జన్మన్యేవ హి లక్ష్యతే ॥

అన్ని జన్మములయం దీబ్రహ్మవిద్య సులభము గాదు శమదమాది శిష్యలక్షణములు సంపూర్ణముగా నున్న జన్మమునందే ఈ బ్రహ్మవిద్య కనబడుచున్నది.

వేధా ద్వేధా భ్రమం చక్రే కాన్తాసు కనకేషు చ ।
తాసు తేష్వప్యనక్తో హి నరో నారాయణో భవేత్ ॥

సృష్టి కాలములో బ్రహ్మదేవునిచే రెండు విధములగు భ్రమలతోనే జీవులను సృష్టించడమైనది ఆ భ్రమలెవ్వి యనగా కాన్తయందును, కనకమునందును కలుగు భ్రమలని తెలియందగినది అట్టి స్త్రీ యందును, ధనమందును ఈ లోకమున ఎవడు ఆసక్తి లేనివాడై యుండునో అట్టివాడు నరుడు కాడు నారాయణుడే యని గ్రహించుకొనవలయు.

క్షురధారాసు సంలగ్నం యథా స్వాదయతే మధు ।
సుఖం స్వలం మహద్దుఃఖం సంసారేఽస్మిన్ తథా సుఖమ్ ॥

విషయసుఖ మెట్టిదో ఈ శ్లోకమందు వర్ణించడమైనది వాడిమియగు మంగలి కత్తి యొక్క అంచుపైన గల తేనెను నాకునప్పుడు మొదట మధురము కనుపించినను వెంటనే నాలుక యెటుల తెగునో, ఆలాగున ఈ విషయ సంబన్ధ సుఖమంతయు యల్ప మగును. మహత్తరమగు దుఃఖమున్ను గలిగియుండు విషయము జ్ఞాపకముంచుకొనవలయును.

పతత్యసౌ ధ్రువం భిక్షుర్యస్య భిక్షోర్ద్వయం భవేత్ ।
ధీపూర్వం రేత ఉత్సర్గో ద్రవ్య సంగ్రహామేవచ ॥

ఏ సన్న్యాసియైన వానికిగాని, నైష్ఠిక బ్రహ్మచారికిగాని ఈ క్రింద

నిరూపింపబడు రెండు దోషములు గలవో వారు నిశ్చయముగా పతితు లగుదురు అవి యేవి యనగా (1) సంకల్ప పూర్వకముగా పలువిధమయిన క్రియలచేత రేతస్సు నష్టపరచుటయు. (2) స్వార్థముకొఱకు ధనమును సమకూర్చుటయు నగును అందువలన భ్రష్టు లగుదురు ఈ ప్రమాణము వలన బుద్ధిపూర్వకముగా గాక స్వప్నములో శుక్ల నష్టము గలిగిన దానివలన దోషము గలుగదనియు, ప్రజోపయోగము దైవకార్యము కొఱకు ధనమును సమకూర్చిన బంధము గలుగదనియు గ్రహించదగినది



# ఛాన్దోగ్యోపనిషత్

## పంచమః ఖండః.

మూ॥ తద్య ఏవైతం బ్రహ్మలోకం బ్రహ్మచర్యేణానువిందంతి తేషామేవైష బ్రహ్మలోకస్తేషాగ్ సర్వేషు లోకేషు కామచారో భవతి.

ఈ బ్రహ్మతత్త్వమును ఎవరు స్త్రీ విషయ తృష్ణను వర్జించుట యనెడి బ్రహ్మచర్య సాధనముతో గూడి శాస్త్రాచార్యోపదేశము ద్వారా తెలిసికొనుచున్నారో, ఆలాగున బ్రహ్మచర్య సాధన విశిష్టులై శాస్త్రాచార్యోపదేశము ద్వారా వస్తు తత్త్వము తెలిసికొందురో, వారికే ఈ బ్రహ్మస్వరూప సాక్షాత్కారము కలుగుచున్నది వారికే సమస్త లోకములయందును యథేష్ట సంచార సామర్థ్యమున్ను సంభవించుచున్నది ఇక్కడ 'బ్రహ్మచర్య సాధనముచేతనే' తెలిసికొనినవారు అని అవధారణార్థమును తెలియజేసెడి ఏవకారమున్నందున స్త్రీ విషయ తృష్ణను వర్జించినవారికే ఈ విద్యయందు నధికారమును, ఫలసిద్ధియును గలుగుచున్నది కాని ఇతరులకు సంభవింపదని తెలియదగియున్నది

మూ॥ అథ యద్యజ్ఞ ఇత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవ యో జ్ఞాతా తం విన్దతేఽథ యదిష్టమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవేష్ట్వాత్మానమనువిన్దతే ॥

అనంతరము ఏ పురుషార్థ సాధనమును యజ్ఞమని చెప్పుచుందురో ఆ సాధనము బ్రహ్మచర్యమే యని తెలియ వలయును కనుకనే ఏ పురుషుడు బ్రహ్మచర్యమనెడి ముఖ్యసాధనముతో గూడి యేవస్తుస్వరూపమును తెలిసికొనుచున్నాడో, ఆ పురుషుడు ఆ వస్తుతత్త్వమును సాక్షాత్కారానుభవమును పొందును. అనంతరము ఏ సాధకమును ఇష్టమైన ఉపాస్య విషయమునుగా చెప్పుచుందురో అదియును బ్రహ్మచర్యమే అయియున్నది కనుకనే బ్రహ్మచర్యమనెడి ముఖ్య సాధకముతో గూడియే ఈశ్వరోపాసన చేసినవాడు స్వస్వరూపమును ప్రత్యక్షముగా తెలిసికొనుచుండును

మూ॥ అథ యత్సత్రాయణమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవ సత ఆత్మనస్త్రాణం విందతేఽథ యన్మౌనమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవాత్మానమనువిద్య మనుతే.

అనంతరము ఏ సాధనమును అనేక యజమానులతో గూడి సత్రమనెడి పేరు గలిగి యుండెడి యాగమునుగా చెప్పుచుందురో అదియును ఆ బ్రహ్మచర్యమనెడి సాధనముతో గూడియే స్వస్వరూపముయొక్క రక్షణమును పొందుచుండుట ప్రసిద్ధమై యున్నది అనంతరము మౌనము అని దేనిని చెప్పుచుందురో అదియును బ్రహ్మచర్యమే అయినది కనుకనే బ్రహ్మచర్య మనెడు ముఖ్య సాధనముతో సంపన్నుడైన పురుషుడే స్వస్వరూపమును శాస్త్రాచార్యోప దేశము వలన బ్రహ్మస్వరూపాభిన్నముగా తెలిసికొని ధ్యానము చేయుచుండును.

మూ॥ అథ యదనాశకాయన మిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తదేష హ్యాత్మా వ నశ్యతి యం బ్రహ్మచర్యేణానువిందతేఽథయదరణ్యాయన మిత్యాచక్షతే, బ్రహ్మ చర్యమేవ, తదరశ్చహ వై ణ్యశ్చార్ణవౌ బ్రహ్మ లోకే తృతీయస్యామితో దివితదైరంమదీయగ్ సర స్తదశ్వత్థస్సోమ సవన స్తదపరాజితా పూర్బ్రహ్మణః ప్రభువిమితగ్ హిరణ్మయమ్.

అనంతరము అశనములేకుండ ఉపవాసము చేయుచుండుట యనెడి ఏ పరమార్థ సాధనమును చెప్పుదురో అదియును బ్రహ్మచర్యమే యయినది కనుకనే; ఏ ఆత్మస్వరూపమును బ్రహ్మచర్యముతో కూడిన యుపవాస

వ్రతముచేత తెలిసికొనుచుందురో, ఆ పారమార్థికాత్మ స్వరూపము ఎల్లప్పటికిని నాశనమును పొందక నిత్యమై యుండును అనంతరము అరణ్యావాస వ్రతమనెడి ఏ పరమార్థ సాధనమును చెప్పుదురో అదియును బ్రహ్మచర్యమే యయినది ఈ భూలోకము మొదలుకొని మూడవదియైన ద్యులోకమునందు అర యనియును, చణ్య యనియును సముద్రములు రెండు యుండియున్నవి అచ్చటనే అన్నరస సారభూతముగా మదకర మైనందున సంతోషమును గలుగజేయుచుండెడి సరస్సు కలదు అక్కడనే అమృతమును స్రవించుచుండెడి అశ్వత్థమనెడి వృక్షమును కలదు అక్కడనే బ్రహ్మచర్య సాధన సంపన్నులు కానివారికి పొందశక్యము కానట్టి, హిరణ్యగర్భు డనెడి పేరుగలిగిన బ్రహ్మయొక్క పట్టణమును, బ్రహ్మలోక ప్రభువైన హిరణ్యగర్భునికి వాసయోగ్యముగా నిర్మింపబడియున్న స్వర్ణమంటపమును కలదు

మూ॥ తద్య ఏవై తావరం చణ్యం చార్ణవౌ బ్రహ్మలోకే బ్రహ్మచర్యేణాను విన్దన్తి తేషామేవైష బ్రహ్మలోకస్తేషాగ్ సర్వేషు లోకేషు కామచారో భవతి ॥

ఆ ప్రకారము ప్రసిద్ధ గుణవిశిష్టమైన బ్రహ్మలోక మందుండెడి అరమనియు, చణ్యమనియు జెప్పబడుచుండెడి ఈ ప్రసిద్ధములైన సముద్రములను, జ్ఞానసహకారియై యుండెడి బ్రహ్మచర్య మనెడి ముఖ్య సాధనానుష్ఠానముతోనే యే పురుషులు తెలిసికొనుచున్నారో, వారికే ఈ ప్రసిద్ధమైన బ్రహ్మస్వరూప ప్రాప్తియు, వారికే సమస్తలోకములయందును యథేష్ట సంచార స్వాతన్త్ర్యమును సంభవించును. స్త్రీవిషయ తృష్ణను వర్జించియుండుట యనెడి బ్రహ్మచర్యము మిక్కిలి దుర్లభము. ఇది లేక జ్ఞానము సంభవింపదు ఇందునకు ప్రమాణ మేమనగా, శ్రు॥ "పరాఞ్చిఖాని వ్యతృణత్స్వయం భూస్తస్మాత్పరాఙ్పశ్యతి నాంతరాత్మన్" అను శ్రుతియు, "ధ్యాయతో విషయాన్ పుంసస్సంగ స్తేషూపజాయతే" అనెడి గీతాశాస్త్రమున్ను శాస్త్ర్యాదిబాహ్యావిషయ తృష్ణచేత హరింపబడి యుండెడి చిత్తము గలవానికి ప్రత్యగాత్మ వివేక జ్ఞానము కలుగుట దుర్లభమని తెలియజేయుచున్నవి

## నవమః ఖండః

మూ॥ అథ హేంద్రోఽప్రాప్యైవ దేవానేతద్భయం దదర్శ యథైవ ఖల్వాయ మస్మిన్ శరీరే సాధ్వలంకృతే సాధ్వలంకృతో భవతి సువసనే సువసనః పరిష్కృతే పరిష్కృతః ఏవమేవాయమస్మిన్నన్ధేఽన్ధో భవతి స్రామే స్రామః పరివృక్ణే పరివృక్ణోఽస్యైవ శరీరస్య నాశ మన్వేష నశ్యతి నాహమత్రభోగ్యం పశ్యామీతి ॥

దైవసంపత్తుతో గూడి యుండెడి ఇంద్రుడు గురూపదిష్టమైన వాక్యమును మననము చేయుచు దేవతలను గూర్చి పొందకయే ఈ ఉదశరావమందు దృష్టమైన స్వానుభవము నాలోచించి, ఈ ప్రత్యక్ష విషయమై యుండెడిదేహము సుష్ఠుగా నలంకరింపబడి యున్నప్పుడు ఈ ఛాయాత్మయును బాగుగా అలంకరింపబడి యున్నదియును, దేహమందు మంచివస్త్రమును ధరించి యుండగా నీ ఛాయారూపమును మంచి వస్త్రమును ధరించి యున్నదిగాను, లోమనఖాది నికృన్తనముచేత శరీరము పరిశుద్ధమై యుండగా ఛాయాత్మయును పరిశుద్ధమై యున్నదిగాను ఏ ప్రకారము అగుచున్నదో, ఆ ప్రకారముగానే యీ పరిశుద్ధమైన శరీరము చక్షురింద్రియ సామర్థ్యము లేనిదై యున్నప్పుడు ఈ ఛాయాత్మయును రూపదర్శన సామర్థ్యము లేనిదిగాను, శ్రోత్రాద్యవయవ విహీనమై యున్నప్పుడు అంగవైకల్యము కలదిగాను, హస్తపాదాద్యవయవములు ఛేదింపబడి యున్నప్పుడు ఛిన్నమైన హస్తపాదాదులు కలిగి యున్నదిగాను అగుచుండుట ప్రసిద్ధముగదా! యీ శరీరముయొక్క నాశము ననుసరించి ఈ ఛాయారూపమున్ను నష్టమై పోవుటయే సిద్ధము గనుక, నేను ఈ దేహాత్మ స్వరూపదృష్టియందు ఫలమును చూచుట అప్రసిద్ధము అని అనర్థరూపదోషమును స్వానుభవరూపముగా ఆలోచించిన వాడాయెను.

మూ॥ స సమిత్పాణిః పునరేయాయ తగ్ంహ ప్రజాపతిరువాచ మఘవన్య చ్ఛాన్తహృదయః ప్రావ్రాజీస్సార్థం విరోచనేన కిమిచ్ఛన్ పునరాగమ ఇతి సహోవాచ యథైవ ఖల్వాయం భగవోఽస్మించ్ఛరీరే సాధ్వలంకృతే సాధ్వలంకృతో భవతి సువసనే సువసనః పరిష్కృతే పరిష్కృత

ఏవమేవాయమస్మిన్నద్దేఽన్ధోభవతి స్రామే స్రామః పరివృక్ణే పరివృక్ణోఽస్యైవ శరీరస్య నాశమన్వేష నశ్యతి నాహమత్ర భోగ్యం పశ్యామీతి

ఆ ప్రకారము సంయమముతో గూడిన యింద్రుడు సమిధలు మొదలుగాగల ఉపహారములను హస్తముతో గ్రహించినవాడై మరల గురుసమీపమునకు వచ్చిన వాడాయెను. సర్వజ్ఞుడయిన ప్రజాపతి శిష్యుడై వచ్చిన యింద్రుని జూచి ఓ యింద్రుడా, విరోచనునితో గూడి సంతుష్టచిత్తుడవై ఏ హేతువుచేత తూష్ణీం భావముతో గురుకుల వాసమును విడిచి వెళ్ళితివి? ఎందుకొఱకు మరల వచ్చిన వాడవైతివి? అని ప్రశ్నవేసెను ఆ యింద్రుడు నీ వాక్యమును విని ఓ స్వామీ! ఈ మాచేత, వస్తుస్వరూపముగా గ్రహింప బడియున్న ఛాయారూపము, ఈ శరీరము సుష్ఠుగా అలంకరింపబడు చుండగా బాగుగ నలంకరింపబడి యున్నదిగానే చూడబడుచు, శుభ్రమైన దుకూల వస్త్రమును ధరించి యున్నప్పుడు శుభ్రవస్త్రమును ధరించినదిగానే తెలియబడుచు, లోమనఖాది నికృన్తముచేత శరీరము పరిశుద్ధమై యున్నప్పుడు పరిశుద్ధమై యున్నదిగానే ఏ ప్రకారము అగుచున్నదో, ఈ ప్రకారముగానే ఈ శరీరము రూపదర్శన సామర్థ్యము లేనిదై యున్నప్పుడు ఈ ఛాయాత్మయును చక్షురింద్రియ సామర్థ్యము లేనిదిగాను, శ్రోత్రాదీన్ద్రియములయొక్క వైకల్యము గలిగి యున్నప్పుడు అంగవైకల్యము గలదిగాను, హస్తపాదాద్యవయవములు తెగగొట్ట బడియున్నప్పుడు తానును ఛేదింపబడినదిగాను అయియుండుట సంభావితమై యున్నది కనుక ఈ శరీరము యొక్క నాశమునసుసరించి ఈ ఛాయాస్వరూపమున్ను నష్టమై పోవుటయే సంభవించును కనుక నేను ఈ దేహాత్మ స్వరూప ఛాయాదృష్టి యందు ఫలము చూచుట అప్రసిద్ధము అని ఉత్తరమును చెప్పిన వాడాయెను

మూ॥ ఏవమేవైష మఘవన్నితి హోవాచైతం త్వేవతే భూయోఽనువ్యాఖ్యాస్యామి వసాపరాణి ద్వాత్రింశతం వర్షాణీతి సహాపరాణి ద్వాత్రిగ్ శతం వర్షాణ్యువాస తస్మై హోవాచ ॥

ఓ యింద్రుడా! ఈ ఛాయాత్మ ఈ ప్రకారమే శరీరనాశము ననుసరించి నష్టమైపోవును. ఈ హేతువువలన నీకు ఈ అపహత పాప్మత్వాది ధర్మవిశిష్టమైన వస్తుతత్త్వమును మఱియును వివరణముచేసి చెప్పెదను ఇది వఱకు నివసించియున్న వానికంటె ఇతరమైన ముప్పదిరెండు సంవత్సరములను బ్రహ్మచర్య నియమముతో శుశ్రూష చేయుచు నివసింప వలసినది అని ఆజ్ఞాపించెను ఆ యింద్రుడును గురువుయొక్క ఆజ్ఞప్రకారముగా ముప్పది రెండు ఇతరములయిన సంవత్సరములు బ్రహ్మచర్య నియమముతో శుశ్రూష చేయుచు నివసించెను ఆ ప్రకారము బ్రహ్మచర్య వ్రతముతో శుశ్రూష చేయుచుండి నిష్కల్మషుడైన యింద్రుని కొఱకు సర్వజ్ఞుడయిన ప్రజాపతి మరల యుపదేశ వాక్యమును చెప్పుచున్నాడు.

## దశమః ఖండః

మూ॥ యఏష స్వప్నే మహీయమానశ్చరత్యేష ఆత్మేతి హో వాచై తదమృతమభయమేతద్బ్రహ్మేతి సహశాన్త హృదయః ప్రవవ్రాజ సహాఽ ప్రాప్యైవ దేవానేతద్భయం దదర్శ తద్యద్యపీదగ్ శరీరమంధం భవత్యనన్ధస్స భవతి యది స్రామమస్రామో న వైషోఽ స్య దోషేణ దుష్యతి ॥

ఏ ఆత్మస్వరూపము పూర్వగ్రంథములో అపహత పాప్మత్వాది గుణవిశిష్టముగా నిరూపించి ఉపదేశింపబడినదో; ఇదియే స్వప్నావస్థయందు స్థూలశరీరసంబంధమైన అంధత్వాది ధర్మ విలక్షణమై బహూకరింపబడుచు ప్రవర్తించుచున్నది గనుక ఈ స్వప్నసాక్షియే కేవలాత్మ స్వరూప మగుచున్నది అని ఇదియే అమృత స్వరూపమును, భయరహిత మైనదియును గనుక ఇదియే బ్రహ్మస్వరూపమును అయినది అని సర్వజ్ఞుడైన ప్రజాపతి ఉపదేశము చేసిన వాడాయెను ఆ యింద్రుడు ఈ ఉపదేశవాక్యమందు నిశ్చయబుద్ధితో ప్రసన్నమైన అంతఃకరణము గలవాడై గురుసమీపమును విడిచివెళ్లెను ఆ ప్రకారము నిశ్చయించుకొని వెళ్ళుచుండెడు ఇంద్రుడు దేవతలను గూర్చిపొందకయే, గురూపదిష్టమైన వాక్యార్థమును మననము చేయుచు ఆ స్వప్నావస్థకు ఆశ్రయమై

యుండెడు ఈ స్థూలదేహము చక్షురింద్రియ సామర్థ్య లోపముచేత రూపదర్శన యోగ్యత లేనిదిగా ఏర్పడి యున్నను ఆ స్వప్నద్రష్ట అంధత్వము లేనివాడుగానే అగును స్థూలశరీరమునకు శ్రోత్రాద్యవయవలోపము కలిగియున్నను ఈ స్వప్నద్రష్ట అవయవలోపము కలిగియుండడు ఈ స్థూల శరీరముయొక్క ఏ విధమైన దోషము చేతను, స్వప్నద్రష్ట దోషయుక్తమైయుండుట అసంభావితమై యున్నది

**మూ॥ న వధే నాస్య హన్యతే నాస్య స్రామ్యేణ స్రామో ఘ్నంతి,త్వేవైనం విచ్ఛా దయంతీ వాప్రియవేత్తేవ భవత్యపి రోదితీవ నాహమత్ర భోగ్యం వశ్యామీతి ।**

ఈ బాహ్యస్థూల శరీరముయొక్క హననముచేత ఈ స్వప్నాభిమాని వధింపబడడు ఈ స్థూలశరీరముయొక్క అంగవైకల్యముచేతను అంగవైకల్యము కలదియును గాదు ఇంకనేమన్న, ఇతరులను కొట్టుచున్నట్లున్ను, ఆక్రమించి తరుముచున్నట్లున్ను, అప్రియవాక్యములను బలుకు చున్నట్లున్ను, ఇంతియ కాదు, రోదనము చేయుచున్నట్లున్ను తెలియబడుచున్నది కనుక ఈ స్వప్నసాక్షి యందును గురూపదిష్ట వాక్యార్థమైన అపహత పాప్మత్వము మొదలుగాగల ధర్మానుభవమును తెలిసికొనజాలను అని ఈ సంశయరూపమైన అనర్థమును చూచిన వాడాయెను అని పూర్వమంత్రములోని పదత్రయముతో అన్వయము

**మూ॥ స సమిత్పాణిః పునరేయాయ తగ్ హ ప్రజాపతిరువాచ మఘ వన్యచ్ఛాంత హృదయః ప్రావ్రాజీః కిమిచ్ఛన్ పునరాగమ ఇతి స హోవాచ తద్యద్యపీదం భగవశ్శరీరమంధం భవత్యనన్దన్న భవతి యది స్రామమస్రామో నైవైషోఽన్య దోషేణ దుష్యతి.**

ఆ యింద్రుడు సమిధలను ఉపహారముగా హస్తమందు ధరించినవాడై మరల శుశ్రూషకొరకు గురుసమీపమునకు వచ్చి బ్రహ్మచర్యవ్రతముతో నివసించి యుండెను ఆ ప్రకారము నియమముతో వచ్చి శుశ్రూష చేయుచుండెడి ఇంద్రుని సర్వజ్ఞుడైన ప్రజాపతి చూచి ఓ ఇంద్రుడా! ఏ హేతువువలన నిశ్చయబుద్ధితో

ప్రసన్నచిత్తుడవై విద్యాసమాప్తి చేసికొని వెళ్ళితివి? ఏమి కోరినవాడవై మరల శుశ్రూషార్థమై వచ్చితివి? అని ప్రశ్నవేసెను ఆ ఇంద్రుడు ఈ వాక్యమును విని ఓ స్వామి! ఆ స్వప్నదృష్టాంతోపన్యాసపూర్వక వాక్యశ్రవణమువలన ఈ స్థూలశరీరము రూపదర్శన సామర్థ్యములేక అంధమైనది అయియున్నను ఆస్వప్నద్రష్ట అంధుడు కాడు స్థూలశరీరము అంగవైకల్యము కలిగియున్నను ఈ స్వప్నాభిమాని అంగవికలుడు గాడు ఈ స్థూల శరీరము యొక్క దోషముచేతను దోషయుక్తుడు గాడు

మూ॥ న వధేనాస్య హన్యతే నాస్య స్రామ్యేణ స్రామో ఘ్నం తి త్వేవైనం విచ్ఛాదయంతీవా ప్రియవేత్తేవ భవత్యపి రోదితీవ నాహమత్ర భోగ్యం పశ్యామీత్యేవమేవైష మఘవన్నితి హోవాచై తంత్వేవ తే భూయోఽనువాఖ్యాస్యామి వసావరాణి ద్వాత్రిగ్ంశతం వర్షాణీతి సహావరాణి ద్వాత్రిగ్ శతంవర్షాణ్యువాస తస్మై హోవాచ.

ఈ స్థూలశరీరముయొక్క హననముచేతను ఈ స్వప్నాభిమాని హననము చేయబడడు ఈ శరీరముయొక్క అవయవ విచ్ఛేదముతో విచ్ఛేదసంబంధము కలవాడును గాడు ఇంక నేమన్న ఈ స్వప్నాభిమానిని నితరులు ఘాతచేయుచున్నట్లును, ఆక్రమించి తరుముచున్నటులును, అప్రియమైన నిందావాక్యములను సంభాషించి ధిక్కారము చేయుచున్నట్లును, రోదనము చేయుచున్నట్లును, అనుభవ విషయ మగుచున్నది కనుక నేను ఈ స్వప్నాభిమాని యందు మీ చేత ఉపదేశింపబడిన అపహత పాప్మత్వామృతత్వాది లక్షణవిశిష్ట స్వరూపానుభవ విషయమును గ్రహించి చూచినవాడను గాను అని స్వానుభవమును విజ్ఞాపన చేసెను. (ఈ వాక్యమును సర్వజ్ఞుడైన ప్రజాపతి విని) ఓ యింద్రుడా! ఈ నీదృష్టికి విషయమై యుండెడి స్వప్నాభిమాని ఈ ప్రకారము హననము, ఆక్రమణము, రోదనము మొదలైన వానితో సంబంధించి యున్నదిగానే తోచును. ఈ సంశయ నివృత్తి కొఱకు నాచేత ఉపదిష్టమైన అపహతపాప్మత్వాది ధర్మ విశిష్ట శుద్ధాత్మ స్వరూపమునే మరల వివరణచేసి బోధించెదను ఇతర మ్మైన ముప్పదిరెండు సంవత్సరములు విద్యాగ్రహణ ప్రతిబంధక

చిత్తమాలిన్యమును పోగొట్టుకొనుటకొఱకు బ్రహ్మచర్య నియమముతో నివసించి యుండవలసినదని యాజ్ఞాపించెను ఆ యింద్రుడు (గురువుయొక్క ఆజ్ఞాప్రకారమే) ఇతరములైన ముప్పది రెండు సంవత్సరములును బ్రహ్మచర్య నియమముతో గురుకుల వాసము జేసి శుశ్రూష చేయుచుండెను ఆ ప్రకారము మరల ముప్పది రెండు సంవత్సరములు గురుకులవాసముచేసి బ్రహ్మచర్యమును ఆచరించుటతో నిష్కల్మషుడైన యింద్రుని కొఱకు సర్వజ్ఞుడైన ప్రజాపతి విద్యోపదేశము చేయుచున్నాడు

# ఏకాదశః ఖండః

మూ॥ తద్యత్రైతత్సుప్తసమస్తస్సంప్రసన్నః స్వప్నం న విజానాత్యేష ఆత్మేతి హోవాచై తదమృతమభయమేత ద్బ్రహ్మేతి సహ శాంత హృదయః ప్రవవ్రాజ సహాప్రాప్యైవ దేవానేతద్భయం దదర్శ నాహాఖల్వయమేవగ్ సంప్రత్యాత్మానం జానాత్యయ మహమస్మీతినో, ఏవే మాని భూతాని వినాశమేవాపీతో భవతి నాహామత్ర భోగ్యం పశ్యామీతి ॥

ఏ వస్తురూప స్థితియందు, ఆ ప్రకారము స్థూల సూక్ష్మ శరీరాభిమానియై వ్యావహారిక ప్రాతిభాసిక సంజ్ఞ కలిగియుండెడి జీవతత్త్వము, సుషుప్తియనెడి విలీనావస్థను పొంది సమష్టి స్వరూపుడై జాగ్రదాది విషయ వాసనలను వర్జించి నిర్మలుడై యుండునో, అట్టి స్వరూపస్థితియే ఆత్మ స్వరూపమై యున్నది. ఇదియే మరణధర్మ రహిత మైనదియు, జన్మజరాదుఃఖములు మొదలుగాగల అనర్థరూప భయశూన్యమైనదియు గనుక ఇదియే అద్వితియాపరిచ్ఛిన్న పరిపూర్ణ బ్రహ్మ స్వరూపము అని సర్వజ్ఞుడైన ప్రజాపతి మరల ఉపదేశ వాక్యమును విని, నిశ్చయ బుద్ధితో ప్రసన్న హృదయుడై, గురుకులవాసమును విడిచి వెళ్లిన వాడాయెను ఆ ప్రకారము నిశ్చయజ్ఞానముతో స్వస్థానమునకు పోవుచుండెడి యింద్రుడు, దేవతలను పొందకయే, మార్గమధ్యమున ఉపదేశవాక్యమును అనువదించి చెప్పిన వాడాయెను ఆ ఇంద్రుడు ఈ వాక్యమును మననము చేయుచు, ఈ దేహేంద్రియ సంఘాతాభిమానియైన జీవుడు, ఆ సుషుప్తి సమయమున, నేను

ఈ యాత్మస్వరూపము అయియున్నానని స్వస్వరూపమును తెలిసికొనుట లేదు ఈ ప్రకారమే ఈ బాహ్యవిషయమైన భూతములను తెలిసికొనుటయును లేదు ఆత్యంతిక నాశమునే పొందినవాడు అగుచున్నాడు గనుక, ఈ సుషుప్త్యవస్థయందు నేను అపహతపాప్మత్వాది లక్షణస్వరూపానుభవమును తెలిసికొనజాలను, అని ఈ సంశయరూపమైన అనర్థమును ఆలోచించిన వాడాయెను

మూ॥ స సమిత్పాణిః పునరేయాయ తగ్ం హ ప్రజాపతిరువాచ మఘవన్య చ్ఛాంత హృదయః ప్రావ్రాజీః కిమిచ్ఛన్ పునరాగమ ఇతి సహోవాచ నాహఖల్వయం భవ ఏవగ్ం సంప్రత్యాత్మానం జానాత్యయ మహమస్మీతినో ఏవేమాని భూతాని వినా సమేవాపీతో భవతి నాహ మత్రభోగ్యం పశ్యామీతి ॥

ఆ యింద్రుడు సమిధలు మొదలయిన యుపహారములను హస్త మందుంచుకొనినవాడై, మరల గురుసమీపమునకు వచ్చెను. ఆ ప్రకారము సంశయగ్రస్తుడై తిరిగివచ్చిన యింద్రుని సర్వజ్ఞుడైన ప్రజాపతి చూచి ఓ యింద్రుడా! ఏ హేతువు వలన నిశ్చయబుద్ధితో ప్రసన్నుడవై గురుకుల వాసము విడిచిపోయితివో, ఏమికోరినవాడవై తిరిగివచ్చిన వాడవయితివి? అని ప్రశ్న వేసెను. ఆ యింద్రుడు ఈ వాక్యమును విని ఓ స్వామీ! మీచేత దృష్టాంతముగా నిరూపింపబడిన ఆ సుషుప్తి సమయమందు ఈ జీవుడు నేను ఈ యాత్మ స్వరూపము అయితిని అని స్వస్వరూపమును తెలిసికొనుట లేదు. ఈ భూతములను తెలిసికొనుటయును సంభవింపదు కనుక నాశమునే పొందినవాడు అగుచున్నాడు ఇందువలన నేను ఈ సుషుప్త్యవస్థయందు అపహత పాప్మత్వాది ధర్మవిశిష్ట స్వరూపప్రాప్తిరూప ఫలమును తెలిసికొనజాలను అని తనయొక్క సంశయమును విజ్ఞాపనము చేసెను.

మూ॥ ఏవమేవైష మఘవన్నితిహోవాచ ఏతం త్వే వతే భూయోఽనువ్యాఖ్యా స్యామి నో ఏవాన్యత్రైతస్మాద్వసా పరాణి పంచ వర్షాణీతి సహాపరాణి పంచ వర్షాణ్యువాస తాన్యేకశతగ్ం సంపేదుః ఏతత్తద్యదాహురేక

**శతగ్ హవై వర్షాణి మఘవాప్రజాపతౌ బ్రహ్మచర్యమువాస తస్మై హోవాచ ॥**

ఓ యింద్రుడా! ఈ సుషుప్త్యభిమాని అజ్ఞానావృతుడైనందున స్వపరవిజ్ఞానము లేనివాడే అగును ఈ మూడుపర్యాయములలో అమృతాభయా ద్వితీయ బ్రహ్మమాత్రముగా బోధింపబడి యుండెడి అపహతపాప్మత్వాది ధర్మోప లక్షితాత్మ స్వరూపమునే మరల చెప్పెదను ఈ ఆత్మస్వరూపమును బోధించుటకంటె, మరియొక్క పరమార్థసాధనమున్ను సంభవించుటయే లేదు. ఇతరమైన ఐదు సంవత్సరములును విద్యాగ్రహణ ప్రతిబంధకచిత్త మాలిన్యము నివర్తించుట కొఱకు బ్రహ్మచర్య వ్రతము నాచరించి శుశ్రూష చేయుచుండ వలసినది అని ప్రజాపతి ఆజ్ఞాపించెను ఆ ఇంద్రుడును ఇతరములైన అయిదు సంవత్సరములును బ్రహ్మచర్య వ్రతనిష్ఠుడై గురువుల యొక్క సమీపములో శుశ్రూష చేయుచుండెను ఆ ప్రకారము బ్రహ్మచర్య వ్రతనిష్ఠచేత చిత్తశుద్ధిగలిగి విద్యా గ్రహణయోగ్యుడైన యింద్రుని కొఱకు సర్వజ్ఞుడైన ప్రజాపతి ఉత్తర మంత్రములో జెప్పబడెడి ప్రకారము అవస్థాత్రయ సంబంధరహితమై యుండెడి యాత్మతత్త్వమును ఉపదేశము చేసినవాడాయెను

వి ॥ బ్రహ్మోపదేశమునకై ప్రజాపతి దగ్గఱకు విరోచనుడు, ఇంద్రుడు వెళ్ళిరి ఉభయులకున్ను ఏక కాలములోనే అపహత పాప్మత్వాది ధర్మవిశిష్ట ఆత్మ స్వరూపమును బ్రహ్మదేవు డుపదేశించిన వాడాయెను అసుర గురుడగు విరోచనుడు దేహాత్మ బుద్ధితో నుండిపోయెను. మలిన బుద్ధిగలవా డగుటచే ఇంద్రునివలె దేహాదిత్రయ విలక్షణమగు ఆత్మను మననము జేయుశక్తి లేకపోయిన వాడాయెను ఇంద్రుడు దేవతాంశము గలవాడగుటచే మనస్సు కొంత నిర్మలమై యుండుటచే మూడు దేహములలోను దోషమును కనుగొని దేహత్రయాతీత శుద్ధాత్మను శాశ్వతస్వరూపముగా కనుగొనగలిగెను కట్టకడకు 5 సంవత్సరములు బ్రహ్మచర్యవ్రతము సల్పి గురుకులమున నుండిన చాలునని చెప్పుటకు కారణమేమన, అప్పటికే మలవిక్షేపములు నశించిపోయి యుండి నందుచే ఆవరణ మనెడు ఒక దోషము మాత్రము నశించవలసి యుండవలసి నందుచే అట్లు

చెప్పడమైనది దీని వల్ల 101 సంవత్సరములు మానవుడు బ్రహ్మచర్య వ్రతమును సల్పి బ్రహ్మసాక్షాత్కారము నొందుటకు కాలము గలదా యని సందేహింప పనిలేదు. మానవులకన్న దేవతలకు ఆయుఃప్రమాణము ఎక్కువగా నున్నందుచే వారి కది సరిపోయినది. ఈ విషయమును విస్తారముగా తెలిసికొన తలంచువారు ఛాందోగ్యోపనిషద్భాష్యమందుగాని, ఆత్మ పురాణమున గాని కనుగొనవచ్చును.



# గృహస్థ బ్రహ్మచర్యము

**మనుస్మృతి:-**

**వేదానధీత్య వేదౌ వా వేదం వాఽపి యథాక్రమమ్ ।**
**అవిప్లుత బ్రహ్మచర్యో గృహస్థాశ్రమమావసేత్ ॥**

మూడు వేదములను గాని, రెండువేదములను గాని, తుదకు తన శాఖావేదమునుగాని, గురునికడ బ్రహ్మ చర్యము, తప్పక యభ్యసించి యావల గృహస్థాశ్రమమున ప్రవేశింపవలయును

**సేవేతేమాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌ వసన్ ।**
**సన్నియమ్యేన్ద్రియగ్రామం తపోవృద్ధ్యర్థమాత్మనః ॥**

బ్రహ్మచారి గురుకులమున వసించుచు, ఇంద్రియములను నిరోధించి, యహాముష్మికమునందలి తపోఽభివృద్ధికై ఈ నియమముల ననుసరింపవలయును

**వేదమేవ సదాఽభ్యస్యేత్తపస్తప్స్యన్ ద్విజోత్తమః ।**
**వేదాభ్యాసో హి విప్రస్య తపః పరమిహోచ్యతే ॥**

తపంబు జేయగోరు మానవుడు వేదమునే యెల్లప్పు డభ్యసింపవలయును. విప్రునకు వేదాభ్యాసమే యీలోకమున ముఖ్యమని జెప్పబడినది. (ఇక ఈ

విషయమై విస్తారముగా తెలియ గోరువారు గృహస్థాశ్రమ ధర్మము అను గ్రంథమున జూడనగును)

ఋతుకాలాభిగామీ యః స్వదారానిరతశ్చ యః ।
స సదా బ్రహ్మచారీ హి విజ్ఞేయస్స గృహాశ్రమీ ॥

ఋతుకాలమందు మాత్రము స్వభార్యయందు చేరు గృహస్థుడు ఎల్లప్పుడును బ్రహ్మచారి యనియే గ్రహించదగినది ఆలాటి నారీమణియు బ్రహ్మచారిణియే యని యనందగును

మృతే భర్తరి సాధ్వీ స్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా ।
స్వర్గం గచ్ఛత్యపుత్రాపి యథా తే బ్రహ్మచారిణః ॥

ఏ సాధ్వీమణులగు స్త్రీలు భర్త మరణించిన పిమ్మట బ్రహ్మచర్య వ్రతము ననుష్ఠించుచున్నారో, అట్టివారు సన్తానము లేనివారైనను మరణానన్తరము స్వర్గలోకమును పొందుచున్నారు, అంతియే గాదు బ్రహ్మచర్యవ్రతము సల్పెడు నైష్ఠికబ్రహ్మచారులు ఏ బ్రహ్మలోకమును పొందెదరో, అట్టి బ్రహ్మలోకమును ఈ నారీమణులు గూడ పొందెదరు

కాయేన మనసా వాచా నారీణాం పరివర్జనమ్ ।
ఋతౌ భార్యాం వినా స్వస్య బ్రహ్మచర్యం తదుచ్యతే ॥

మనోవాక్కాయ కర్మాదులచే పరస్త్రీలతో సంసర్గము లేకుండటయు, ఋతుకాలములో మాత్రము స్వపత్నితో జేరుటయు గృహస్థ బ్రహ్మచర్య మనబడును ఇతరాశ్రమస్థులు సర్వదా త్రికరణములచే బ్రహ్మచర్య మనుష్ఠించవలయును ఆలాగున మనోవాక్కాయములచే పరపురుషచింత లేనిదై, ఋతుకాలమునందు మాత్రము ఉత్తమ సన్తానాభిలాషగలదై పతితో చేరు స్త్రీయు బ్రహ్మచారిణియే యగును తక్కిన మూడాశ్రమములలో నుండు స్త్రీలు ఎల్లప్పుడు బ్రహ్మచర్య వ్రతము గలవారై యుండవలయును

నివృత్తిమార్గే దాంపత్యం సానుకూలం భవేద్యది ।
పూర్వస్మిన్ పుణ్యపుంజేన నాస్తిచే త్ప్రవ్రజేత్పుమాన్ ॥

దైవ విషయమందు భార్యాభర్తలు అనుకూలవంతులై యుండవలసి యుండిన పూర్వజన్మములో నుభయులున్ను గొప్పదైన పుణ్యము చేసిన వారలై యుండ వలయును ఆలాగున అనుకూలపడనిచో సన్న్యసించుటయే పురుషునికి గతియని శాస్త్రము తెలుపుచున్నది

**ఆత్మశుద్ధివిహీనస్య సకలం కర్మ నిష్ఫలమ్ ।**
**తత్సర్వం విద్ధి శుద్ధాత్మన్ వ్యంజనం తామ్రకే యథా ॥**

ఆత్మ శుద్ధిలేని జపో ధ్యాన భజన, ప్రార్థన పుణ్య కర్మలన్నియు నిష్ఫలములే ఓ శుద్ధాత్ముడా ! అదెటులనిన వినుము, కళాయిలేని పాత్రలో వండిన పప్పు పులుసువలె చిలుముబట్టి వ్యర్థమై పోవునట్లుండును

**శుద్ధిద్వయం మహత్కార్యం దేవానామపి దుర్లభమ్ ।**
**కౌపీనశుద్ధిః ప్రథమా వాక్యశుద్ధి రనన్తరా ॥**

శుద్ధిద్వయము మహత్తైనకార్యము ఇది దేవతలకు సహ దుర్లభము వానిలో మొదటిది కౌపీన శుద్ధి రెండవది వాక్శుద్ధియని గ్రహించవలెను అనగా గుహ్యేంద్రియ జిహ్వేంద్రియ నిగ్రహము గలవానికి ముక్తి ద్వారము తెరవబడును ఈ రెండు ద్వారములు ఎంతవరకు తెరవబడి యుండునో అంతవరకు ఎటువంటి యోగికి గాని, జ్ఞానికి గాని, భక్తునకు గాని మోక్షద్వారము మూయబడియే యుండును

వి ॥ ఈ విషయమై గురుభక్తి ప్రభావమను గ్రంథమున గల మోక్ష ప్రకృతి ద్వారముల పటమును చూడుడు

**ద్వయమేతన్న సిద్ధంచే జ్జీవితం తు నిరర్థకమ్ ।**
**యథా త్వం విద్ధి పుణ్యాత్మన్ రంధ్రపాత్రే చ పాచనమ్ ॥**

ఈ రెండింద్రియముల నిగ్రహము లేనివాని జీవితము నిరర్థకము. ఓ శుద్ధాత్ముడా! అదెట్టిదో వినుము చిల్లుపడిన పాత్ర ఎంత గొప్పదైనను, సుందరమైనను ఏలాగున వంటకమున కుపయోగపడదో ఆలాగున నుండును ఒక రంధ్రము పడినప్పుడే యుపయోగ పడనప్పుడు నవరంధ్రములు పడియుండిన మరల చెప్పవలయునా?

**స్వదారే విధివత్కృత్వా నివృత్తిశ్చాన్యతః సదా ।**
**మనసా కర్మణా వాచా బ్రహ్మచర్యమితి స్మృతమ్ ॥**

విధిననుసరించి ఋతుకాలమందు మాత్రము స్వధర్మచారిణియగు భార్యతో చేరుటయు, అన్ని కాలములలోను ఇతర స్త్రీలతో సదా మనస్సుచేతను వాక్కుచేతను కర్మముచేత విషయ నివృత్తి గలిగియుండు టేదిగలదో, ఇదియే గృహస్థ బ్రహ్మచర్య మగును

**పరదారపరిత్యాగాత్స్వదార పరితుష్టితః ।**
**ఋతుకాలాభిగామిత్వా ద్బ్రహ్మచారీ గృహీరితః ॥**

పరస్త్రీలను పరిత్యజించి స్వభార్యయందు మాత్రము సంతుష్టి గలిగియుండు వాడును, ఋతుకాలములో మాత్రము స్వభార్యయందు ప్రవర్తించువాడును నెవండో అట్టివాడు గృహస్థాశ్రమి యయినను బ్రహ్మచారి యనంబడును ఆలాగున నుండు పుణ్యవతియగు నారీమణియు బ్రహ్మచారిణియే యగును

**ఋతావృతౌ స్వదారేషు సంగతిర్యా విధానతః ।**
**బ్రహ్మచర్యం తదేవోక్తం గృహస్థాశ్రమవాసినామ్ ॥**

శాస్త్రమున విధింపబడిన రీతిని ఋతుకాలమున తన ధర్మపత్నితో కేవల సంతానార్థమై సంపర్కము జేయుపురుషుడు గృహస్థాశ్రమమున నుండినను అతడు బ్రహ్మచారియే యనంబడును అట్టి నారీమణియు బ్రహ్మచారిణియే

**మంత్రము ॥ ఓషధయో భూతభవ్య మహో రాత్రే వనస్పతిః ।**
**సంవత్సరః సహర్తుభిస్తే జాతా బ్రహ్మచారిణః ॥**

ఓషధులు, వనస్పతులు, భూత భవిష్యములు, దివారాత్రములు, ఋతువులతో సంవత్సరము, ఇవన్నియు బ్రహ్మచర్య వ్రతగాములే

వి॥ పాఠకులారా! బ్రహ్మచర్య వ్రతముచేతనే పై జెప్పబడిన ఓషధ్యాదు లన్నియు కృతత్రేతాది యుగములలో నుండినట్లే యిప్పుడు గూడ నున్నవి. మానవుడొకడు మాత్రము అట్టి విధిని అతిక్రమించి నడుచుటే దీనావస్థనొందుటకు

హేతువు మల్లి మొల్ల పున్నాగాది ఓషధులు వసన్తాది ఋతుకాలము రాగానే సంవత్సరమున కొకతూరి మాత్రమే పుష్పించుచుండును

పదునొకండు మాసములు బ్రహ్మచర్య వ్రతపాలనము జేసి రసమును తమలో నిలిపికొనినందుచేతనే ఋతుకాలము వచ్చునప్పుడు విశేష పుష్పములిచ్చుటకు శక్తిమంతము లగుచున్నవి ఆలాగున మామిడి, పనస మొదలగు ఓషధులు పదునొకండు మాసములు రసములను తమలో బ్రహ్మచర్య వ్రతముచే నిలువజేసికొని, శిశిర వసంతాదులందు ఫలమును పువ్వులను పుట్టించుచున్నవి ఆలాగున భూత భవిష్యత్తులు గూడ వాటి కేర్పడిన ఋతుకాలము ననుసరించియే పరిణామము పొందుచుండును అందువల్లనే వసంత గ్రీష్మాదు లేర్పడుచుండును ఆలాగున దివారాత్రులున్ను వాని ఘంటలగు ఋతువు ననుసరించియే మారుచుండును ఆలాగున శునకాది జంతువులుగూడ ఋతుకాలము వచ్చునప్పుడు మాత్రమే సంతానోత్పత్తి గలుగ జేయుచుండును తక్కిన ఋతువులలో బ్రహ్మచర్య వ్రతము సల్పుచు శరీరమున శక్తిని నిలువజేయుచుండును అందుచేతనే గవాశ్వగజ శునకాది సర్వజంతువులున్ను కృతయుగములో నున్నట్లు ఇప్పుడు గూడ ఆయుస్సు, బలము, రూపము గల్గియున్నవి ఈ లాగున మానవుడుగూడ ఋతుకాల ధర్మము ననుసరించి స్త్రీ పురుషులు కలియుచుండిన, కృతత్రేతాది యుగములలో మనుష్యుల కేర్పడిన నూరు సంవత్సరముల జీవితము గల్గి దృఢమైన బల , ఆరోగ్య, ప్రజ్ఞా, ఓజస్సులతో గూడ నుండవలసినవారే

వి ॥ ఓహో ! ఎంత పరమధర్మమును దివ్యదృష్టితో కనుగొని ఋషులు బోధించిరో దీనివలననే కనుగొనవచ్చును శుక పిక బక మయూరాది పక్షి వర్గములున్ను ఋతుకాలములో మాత్రము సంతానక్రియలలో ప్రవర్తించును తక్కిన కాలమంతయు బ్రహ్మచర్యవ్రతము సల్పుచుండును అందువలననే అవిగూడ ఆయుః ప్రమాణ పర్యన్తము ఆరోగ్యము గల్గి జీవించు చున్నవి. వాటి కన్నింటికిన్ని కృతత్రేతాది యుగములలో ఎట్టి లక్షణములు చెప్పబడినవో యిప్పుడుగూడ ఆలాగుననే యుండుటకున్ను యిదియే కారణము. శంఖ

లిఖితస్మృతి విధించినది జూడుడు

వరాన్నేనతు భుక్తేన మైధునం యోఽధిగచ్ఛతి ।
యస్యాన్నం తస్య తే పుత్రా అన్నాచ్ఛుక్రం ప్రవర్తతే ॥

ఇతరుల యన్నమును తిని జీవించు స్త్రీ పురుషులచే నేర్పడిన సంతానములు ఎవరి అన్నమును తిని యేర్పడినవో వారిగుణములే గలవారై యుందురు అంతేగాదు ఆ సంతానములుగూడా వారివేగాని వీరివి కావు ఎందుకనగా అన్నపానముల చేతనే శుక్ల శోణితములు ఏర్పడును కావున వంశోద్ధారకులగు బిడ్డలు గలుగవలసియుండిన స్వార్జితాన్నాదులనే స్వీకరించ వలెను. ఆలాగున పరుల యన్నమును తిని తపస్సుగాని, యోగముగాని చేయువారి మనస్సుగూడ అన్నము పెట్టినవాని స్వభావ మెటుల నుండునో వీరున్ను అట్టి గుణము గలవారే యగుదురు కావున పుత్రోత్పత్తికి హేతువగు కార్యములో ప్రవేశించుటకు ముందుగా స్త్రీ పురుషులు దీనిని జ్ఞాపకములో నుంచుకొన వలయును

తప్త్వా తపస్వీ విపినే క్షుధార్తో గృహం సమాయాతి సదాఽన్నదాతుః ।
భక్త్యా స చాన్నం ప్రదదాతి తస్మై తపో విభాగం భజతే హి తస్య ॥

వనమున తపమొనరించెడు తపస్వియు ఆకలిగొనునప్పుడు అన్నదాతయొక్క గృహమును పొందుచున్నాడు అట్టి తాపసికి అన్నము పెట్టినందుచే తపస్సులో సగభాగము గృహస్థునకు జెందుచున్నది దీనిచే పరాన్నము తిని తపోయోగాదులు చేయువారి పుణ్యములో సగము అన్నదాతలకు పోవుచున్నదని గ్రహించుకొనవలెను అట్టి తాపసులకు అన్నపానాదులను భక్తితో నొసగుటచే గృహస్థునికి, తపస్వికి గలిగెడు పుణ్యములో సగభాగము లభించుచున్నదని తెలియందగినది ఈ గృహస్థ బ్రహ్మచర్యమున వివాహ కాలమును గురించియు తెలియదగును. ఈ సత్యము తెలికపోయినచో బాల్య వివాహముచే గలిగెడు అనర్థమును తప్పించుకొనజాలము ఈ విషయమై ఆయుర్వేద వచనము -

ఊనషోడశవర్షాయామప్రాప్తః పంచవింశతిమ్ ।
యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థస్స విపద్యతే ॥
జాతో వా న చిరంజీవేజ్జీవేద్వా దుర్బలేంద్రియః ।
తస్మాదత్యన్తబాలాయాం గర్భాధానం న కారయేత్ ॥

( సుశ్రుతము)

పదునారు సంవత్సరములు పూర్తిగాని స్త్రీయందు ఇరువది అయిదు సంవత్సరముల వయస్సు పూర్తిగాని పురుషుడు గర్భాధానమును జేసెనేని గర్భములోనే శిశువు ఆపత్తును పొందగలుగును ఒక వేళ ప్రసవించినను ఆశిశువు చిరంజీవి కాదు అదియునుగాక ఒకవేళ జీవించెనేని శారీరేంద్రియములు పుష్టిగా పెరగక దుర్బలత్వమును పొందును అందువలన 16 సంవత్సరములు పూర్తిగాని స్త్రీయందు 25 సంవత్సరములు వయస్సు కాని పురుషుడు గర్భాధాన క్రియను జేయకూడదు ధన్వన్తరి, చరకుడు, సుశ్రుతకారుడు అనువారి ఆశయమును సరిగా తెలిసికొనకనే బాల్య వివాహమునందు ప్రమత్తులై దుర్బలులును, దీనులును ప్రజ్ఞాహీనులగు సన్తానములను కనుచున్నారు

ఇక గృహస్థ బ్రహ్మచర్య వ్రతమును సలుపక వ్రతము లాచరించక యుండిన ఇహసౌఖ్యముగాని పరసౌఖ్యముగాని గలుగదని శాస్త్రము తెలుపుచున్నది

న సౌఖ్యాల్లభతే పుణ్యం కాయక్లేశాదవాప్యతే ।
మన్థనేవ యథా క్షీరాన్నవనీతం ప్రజాయతే ॥
మర్దనా దిక్షుదండానాం రసో యద్వత్ప్రజాయతే ।
తద్వచ్ఛరీరదండేన మహాధర్మః ప్రజాయతే ॥

దేహసౌఖ్యమును గోరువానికి పుణ్యఫలప్రాప్తి గలుగదు వ్రతాద్యనుష్ఠానము చేతను, పుణ్యకర్మ గురుసేవాదుల చేతను కాయక్లేశమును సహించువానికి మాత్రమే పుణ్యము గల్గును ఎటులనగా, తరచనిచో పాల (పెరుగు) నుండి వెన్న ఎట్లు బయలుదేరజాలదో, మఱియు చెఱకును గానుగలో ఆడక పోయిన

రసమెటుల లభించదో, ఆలాగున దేహమందుండు ఆత్మను దర్శించవలసి యుండిన శరీర పరిశ్రమను బాగుగా జేయవలయును

యధా కాష్ఠగతో వహ్నిః సంస్థితోఽపి న లభ్యతే ।
మూఢైస్సర్వత్ర సంస్థోఽపి తధా త్వం నైవ లక్ష్యసే ॥

యధా తిలగతం తైలం గూఢం తిష్ఠతి సర్వదా ।
తధాత్వం సర్వలోకేషు గూఢ స్తిష్ఠసి శంకర ॥

యధా దధిగతం సర్పిర్నిగూఢత్వేన సంస్థితమ్ ।
చరాచరేషు భూతేషు తధా త్వం దేవ సంస్థితః ॥

యధా జలం ధరావృష్ఠాత్ ఖనన్నాప్నోతి మానవః ।
తధా త్వాం పూజయన్నిత్యం మోక్షమాప్నోత్యసంశయమ్ ॥

ఏలాగున అగ్ని దారుగతముగా నున్నప్పటికిని మధింపక లభించదో, అటులనే ఓ సర్వేశ్వరా ! నీవు అన్ని స్థలములలోను, అన్నిటిలోను నున్నప్పటికిని మూఢులచేత దర్శింపబడకున్నావు ఏలాగున తైలము తిలగతమై గూఢముగా నుంటున్నదో ఆలాగున ఓ సర్వేశ్వరా! నీవున్ను సర్వలోకములలోను గూఢముగా నుంటున్నావు నువ్వులను ఆడించువారు తైలమును పొందునట్లు, తపస్స్వాధ్యాయములచే మానవులు నిన్ను పొందుచున్నారు ఏలాగున దధియందు (క్షీరమందు) ఘృతము నిగూఢమై యుంటున్నదో, ఆలాగున ఓ పరమేశ్వరా! నీవున్ను చరాచర భూతముల యందుటున్నావు పెరుగును తరచువారు నవనీతమును పొందునట్లు ఆధ్యాత్మిక నిష్ఠగలవారు నిన్ను పొందుచున్నారు ఏలాగున భూమియందు జలము కనపడక యుండినప్పటికిని, వాపీకూపాదులు త్రవ్వువారు జలమును పొందుచున్నారో, ఆలాగున నీయొక్క ఆరాధన జేయువారు నిన్ను పొంది మోక్షమును పొందుచున్నారు దీనియందు సంశయము లేదు

వి॥ ఈ ప్రమాణము వలన ఈశ్వరు డుండిన లేక ఆత్మయుండిన ఏల కనుపించుట లేదని ప్రశ్నించువారికి సరియగు సమాధానము దొరకును.

**ఇహైవ నరకవ్యాధేశ్చికిత్సాం న కరోతి యః ।**
**గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి ॥**

ఇచ్చట జీవించి యున్నప్పుడే అవిద్యచే గలిగెడు నరకమనెడు వ్యాధికి చికిత్స యెవడు చేయడో అట్టివాడు నిరౌషధమయిన పరలోకమును పొంది అవిద్యావ్యాధిని ఎటుల కుదిరించుకొనును?

వి॥ ఈ మానవ జన్మములో నుండియే బ్రహ్మవిచారముచే అజ్ఞానవ్యాధిని నివారణము చేసికొనవలయును పరలోకమున నది సాధ్యము గాదు మంచి వైద్యుడుండే స్థలమున ఔషధసేవ చేసికొని వ్యాధినివారణము జేసుకొనక, ఔషధమున్ను, వైద్యుడున్ను లేని ప్రదేశమున ప్రవేశించి రోగ నివారణము జేసికొన తలంచువాడు ఎట్టివాడో, అట్టివాడే జీవించి యున్నప్పుడు మోక్షముకొరకు ప్రయత్నించనివాడై ఉండునని తెలియందగినది.

**పతివ్రతాం స్త్రియం దృష్ట్వా పాపనాశో భవేన్మమ ।**
**శుద్ధా జాతా విశేషేణ గౌరీ తుల్యా పతివ్రతా ॥**

ఈశ్వరుడు పతివ్రతా స్త్రీ యొక్క పవిత్రతను గురించి చెప్పినది జూడుడు పతివ్రతాస్త్రీని దర్శించుటచేత నాకేదైన పాపముండిన అది నశించుచున్నది అట్టి పతివ్రతాస్త్రీ మిక్కిలి శుద్ధరాలు, పార్వతీ దేవికి సమానురాలు దీని వలన పతివ్రతాస్త్రీ యొక్క మాహాత్మ్య మెటువంటిదో తెలిసికొన వచ్చును



# ఋతుకాలనిర్ణయము.



ఋతుస్స్వాభావికః స్త్రీణాం రాత్రయః షోడశ స్మృతాః ।
చతుర్భిరితరైస్సార్ధమహోభిస్సద్విగర్హితైః ॥

స్త్రీలకు స్వాభావికముగా 16 దినములవరకు ఋతుకాలము అందు మొదటి నాల్గుదినములు సజ్జన నిందితములు (వర్జనీయములు)

తాసామాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీ చ యా ।
త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః ॥

ఆ ఋతుకాలపు దినములలో మొదటి నాల్గుదినములును, పదునొకండవ, పదమూడవ రాత్రియు నిందితములు తక్కిన పది రాత్రులు ప్రశస్తములు

ఆత్యన్తికం బ్రహ్మచర్యమాశ్రమత్రయవాసినామ్ ।
స్వదారనియమాత్సమ్యక్ బ్రహ్మచారీ గృహాశ్రమీ ॥

బ్రహ్మచారి వానప్రస్థ సన్న్యాసులగు ముగ్గురికిని పూర్ణ బ్రహ్మచర్య ముండవలయును స్వపత్నియందు ఋతుకాలనియమము ననుసరించి ప్రవేశించెడు గృహస్థుడుగూడ బ్రహ్మచారియే. అట్టి స్త్రీయు బ్రహ్మచారిణియే యగును

యమస్మృతిః-

పురాకల్పే కుమారీణాం మౌఞ్జీబన్ధనమిష్యతే ।
అధ్యాపనం చ వేదానాం సావిత్రీవచనం తథా ॥

పూర్వకాలమున బాలికలు ఉపయనమునొంది వేదములను చదువుట కున్ను చదివించుటకున్ను గాయత్రీ మన్త్రమును జపించుటకును అధికారము గలవారై యుండిరి

వి॥ ఈ ఋతుకాల నిర్ణయము గృహస్థాశ్రమ ధర్మమను గ్రంధమున విస్తారముగా వ్రాసియుండుటచే ఇచ్చట సంక్షిప్తముగా తెలుపబడినది విశేషముగా

చూడదలంచువారు పై గ్రంధమున చూచుకొనవచ్చును ఆర్యసమాజస్థులు పై జెప్పిన యమస్మృతి, వేదముల నాధారము చేసికొనియే కన్యాగురుకులము నేర్పరచి బాలికలకు ఉపనయనము చేసి వేదములను చదివించి గాయత్రీ ఉపాసన చేయించుచున్నారు



# విధురబ్రహ్మచర్యము

గార్హస్థ్యం ప్రాప్తవాన్యస్తు భార్యాయా నాశతో యది ।
బ్రహ్మచర్యముపాదత్తే తద్వైధురమితీరితమ్ ॥

గృహస్థాశ్రమ మందుండి భార్య పరలోకగతురాలైన పిమ్మట బ్రహ్మచర్యవ్రతమును అనుష్ఠించుట విధురబ్రహ్మచర్య మనంబడును ఆలాగున పతి పరలోకగతు డైనచో అప్పటినుండి బ్రహ్మచర్యవ్రతమును శీలించెడు నారీమణియు విధుర బ్రహ్మచారిణి యనంబడును. ఈ విధుర బ్రహ్మచర్యము చాలవరకు వానప్రస్థ ధర్మము ననుసరించి యుండును మఱియు భార్యాభర్తలు ఉభయులున్ను ఆత్మశుద్ధిగలిగి విషయ విరక్తితో నివృత్తి మార్గములో ప్రవర్తించువారైన విధుర బ్రహ్మచారులలో పరిగణింపబడుదురు "విధురం తు ప్రవిశ్లేషః - ప్రకర్షేణ విశ్లేషః దూర స్థితత్వం, ప్రవిశ్లేషః" అని అమరనిఘంటువు అనగా భార్యాభర్తల వియోగము, లేక భార్యాభర్తల కూడిక లేకుండుట

ఏవం గృహాశ్రమే స్థిత్వా విధివత్స్నాతకో ద్విజః ।
వనే వసేత్తు నియతో యధావద్విజితేన్ద్రియః ॥

విద్యావ్రత స్నాతకుడగు విప్రు డిత్తెఱగున గృహస్థాశ్రమమును గడిపి నియమముల గొని శాస్త్ర విధిచొప్పున జితేంద్రియుడై వనమున వానప్రస్థాశ్రమముతో నుండవలయును

సంత్యజ్య గ్రామ్యమాహారం సర్వం చైవ పరిచ్ఛదమ్ ।
పుత్రేషు భార్యాం నిక్షిప్య వనం గచ్ఛేత్సహైవ వా ॥

సామాన్యముగా గృహస్థాశ్రమములో భుజించెడు కట్వామ్ల లవణాది ఆహారముల మాని కందమూలఫలములను ఆహారముగా గైకొనుచు పరిజనము నంతటిని వీడి, భార్యను పుత్రుల యధీనతలో వదలిగాని, ఆమె కిష్టమున్నచో ఆమెతోగూడగాని వనమునకు పోవలయును పుత్రులు లేనిచో తగినవారి దగ్గఱ నుంచిగాని లేక జీవనోపాయమునకు ఏర్పాటు జేసిగాని వెళ్లవచ్చును భార్యతో వనమునకు వెళ్లవలసియుండిన బ్రహ్మచర్యవ్రతముగల్గి శీతోష్ణద్వంద్వముల సహించి తప మొనర్చెడు స్వభావము గలిగి యుండవలెను వానప్రస్థము దేని కేర్పడిన దనగా గృహస్థాశ్రమములో నుండేకాలమున అంతఃకరణములోగల విషయవాసనలుగాని, దృశ్యవృత్తులుగాని యుండినచో తపస్సుచే రహిత మొనర్చుకొనుటకొఱకే ఏలన, మాలిన్యముగాని, దుష్టస్పర్శగాని, కడిగిన నశించని నూనె మొదలయిన పాత్రలు, నిప్పులో కాల్చిన ఎట్లు పై దోషములు లేనివై శుద్ధము లగునో ఆలాగున విషయాది దోషములు క్షయించుట కొరకని గ్రహించవలయును ఆలాగున మాలిన్యముగల వస్త్రములో ఎంత మంచిరంగు వేసినను ఎట్లు అంటుకొనదో, వస్త్రము శుద్ధముగా నుతికిన పిమ్మట రంగువేసిన ఎట్లంటుకొనునో అట్లే మనస్సునందు విషయవాసన యుండిన బ్రహ్మభావము నిలువజాలదు

**యథా చ మలినే వస్త్రే రంగశ్శుభ్రతరో న హి ।**
**క్షాళనే హి కృతే శుద్ధే సర్వో రంగః ప్రసజ్జతే ॥**

దీని యర్థము పైన తెల్పినదే

పూర్వకాలము మనవారలు గురుకులమున బ్రహ్మచర్యము సల్పి అధ్యయనపరులై యుండినందుచేతనే అంత పవిత్ర జన్మము గల్గియుండినది బ్రహ్మచర్య వ్రతమున కేలాటి భంగము కలగకూడదని తలంచియే ఏకాంత ప్రదేశమున వనమున పురుషులు ఆశ్రమములు ఏర్పరచి బ్రహ్మచారులను సుశిక్షితులుగా నొనర్చుచుండిరి. ఈ విషయమై రఘువంశమున కాళిదాసమహాకవి వసిష్ఠాశ్రమమును గూర్చి వర్ణించినది చూడుడు ఆలాగున గౌతమాశ్రమము, వాల్మీకి ఆశ్రమము, విశ్వామిత్ర ఆశ్రమములు మొదలయినవి శాస్త్రములో

గనందగును రఘువంశము

**వనాన్తరాదుపావృత్తైః సమిత్కుశఫలాహరైః ।**
**పూర్యమాణమదృశ్యాగ్ని ప్రత్యుద్యాతై స్తపస్విభిః ॥**

వనాన్తరములనుండి సమిధలను, దర్భలను, పండ్లను కొని వచ్చువారును, అగుపడని త్రేతాగ్నులవలన నెదురు కొనబడిన వారును అయిన ఋషులచేత నిబిడీకృత మయినదై ఆశ్రమ ముండెను పూర్యమాణ మనియు, తపస్విభిః అనియు ప్రయోగించుటచేతను తపస్సుచేయు ఋషులచే నిండియున్నదని చెప్పుట వలనను ఎందఱో బ్రహ్మచారులున్ను మునులున్ను ఉంటున్నారని గ్రహించవలయును యాజ్ఞవల్క్యమహర్షి, జనకుడొసగిన వేయి ఆవులను శిష్యులతో తోలుకొని ఆశ్రమమునకు వెళ్లేలాగున సెలవిచ్చెను అని ఛాందోగ్యోప నిషత్తులో చెప్పినదిన్ని గ్రహించనగును అప్పుడు యాజ్ఞవల్క్యాశ్రమములో ఎంతమంది బ్రహ్మచారులున్ను, తాపసులున్ను ఉండిరో యర్థమగును ఋష్యాశ్రమములో గోధనము విశేషముగా నుండెను లేనిచో అంతమంది బ్రహ్మచారులున్ను, మునులున్ను ఎట్లు పోషింపబడుదురు?

వి॥ గౌతమాశ్రమములో సత్యకాముని చరిత్రను జదివిన నెంతమంది బ్రహ్మచారులు, వాన ప్రస్థులుండిరో ఛాందోగ్యము చదివిన అర్థమగును.

**ఆతపాత్యయసంక్షిప్తనీవారాసు నిషాదిభిః ।**
**మృగైర్వర్తితరోమంథముటజాంగణభూమిషు ॥**

త్రోయబడిన తృణధాన్యరాసులుండు పర్ణశాలల ముంగిళ్లలో ఎండ తగ్గినప్పుడు, నెమరువేయుచుండెడి జింకలను గలదై యుండెను "ఆతపాత్యయ సంక్షిప్త నీవారాసు" అని యుండుటచే సంధ్యాకాలమున రాసులుగా కుప్పగా జేయబడిన నీవార ధాన్యములు గలదని తెలియుచున్నది, కుప్పగా ధాన్యరాసులు గలదని చెప్పుట వల్ల ఎంతో ధాన్యము గలదని అర్థమగుచున్నది లేనిచో నింత మందిని ఆశ్రమము ఎట్లు సంరక్షింపగల్గును? కాదంబరియందు మహాకవి బాణభట్టు తెలిపినది చూడుడు. వనమృగములుగూడ తపస్సు చేయుచుండు

మహర్షులకు సేవజేయుచుండెను శ్రీగౌతమబుద్ధుడు తపమాచరించి ఆహారపానీయములు లేక వివశుడై యున్నప్పుడు అడవి ఏనుగును కోతియు సేవజేసినటుల బౌద్ధగ్రంథములలోను, శ్రీ బుద్ధదేవుని పటములలోను కనందగును చెరకు రసముపిండి గజము శ్రీబుద్ధదేవుని నోటిలో పోయుటయు, తేనె తెట్టుతెచ్చి వానరము ఇచ్చుటయు జూడందగును జాబాలి మహర్షి ఆశ్రమవర్ణనము జూడుడు.

గద్య॥ ఆగృహీత సమిత్కుశ కుసుమ మృద్భిరధ్యయన ముఖర శిష్యానుగతై స్సర్వతః ప్రవిశద్భిర్మునిభిరశూన్యోపకంఠం, అధ్యయన ముఖరవటు జనం, భస్మలేఖాలంకృత మునిజన భోజన భూమిభాగం, ఏణకై ర్విషాణశిఖరోత్ఖన్యమాన వివిధకందమూలం, అవిచ్ఛిన్నాజ్యధారా హుతిహుతభుగ్ ఝుంకారముఖరితం, ఉపచర్యమాణాతిథివర్గం, అర్చ్యమాన హరిహరపితామహం, వ్యాఖ్యాయమాన యజ్ఞవిద్యం, ఆలోచ్యమాన ధర్మశాస్త్రం, పఠ్యమాన వివిధపుస్తకం, విచార్యమాణ సకలశాస్త్రార్థం, ఆరభ్యమాణ పర్ణశాలం, ఉపలిప్యమానాజిరం, ఆబధ్యమాన ధ్యానం, సాధ్యమాన మంత్రం, అభ్యస్యమాన యోగం, ప్రక్షాల్యమాన వల్కలం, నిర్వర్త్యమాన ముంజిమేఖలం, ఉపసంగృహ్యమాణ సమిధం, సంస్క్రియమాణ కృష్ణాజినం, శోష్యమాణ పుష్కరబీజం, గ్రథ్యమానాక్షమాలం, గృహ్యమాణ త్రిపుండ్రకం, న్యస్యమానత్రిదండకం, ఆపూర్యమాణ కమండలుం, అమ్బుపూర్ణపుష్కరపుటైః వనకరిభి రాపూర్యమాణ విటపాలవాలకం, అదృష్టపూర్వం కలికాలస్య, అపరిచిత మనృతస్య, అశ్రుతపూర్వ మనంగస్య, అతిరమణీయ మపర మివ బ్రహ్మలోకమాశ్రమ మపశ్యమ్ ॥

సమిధలు, దర్భలు, పుష్పములు, మృత్తిక- వీటిని గ్రహించి వేదాధ్యయన పరులైన శిష్యులతో గూడుకొన్న మహర్షి పుంగవులతో గూడకొన్నదియు, స్వాధ్యయనము జేయు బ్రహ్మచారులు గలదియు, విభూతిరేఖలను ధరించి మునిజనులతో అధిష్ఠింపబడిన భోజనశాల గలదియు, తమ కొమ్ముల

అగ్రభాగములచే కందమూలముల త్రవ్వి మహర్షి జనుల కర్పించుచున్న లేళ్లతో గూడినదియు, ఎడతెగని ఆజ్యాహుతిచే పరితృప్తిని బడసి ప్రజ్వలించుచున్న అగ్నిదేవుని ఝుంకారశబ్దములచే శబ్దాయమాన మయినదియు, సత్కరింపబడుచున్న అతిథి సమూహము గలదియు, పూజింపబడుచున్న బ్రహ్మవిష్ణు మహేశ్వరులు గలదియు, యజ్ఞవిద్యావ్యాఖ్యానము చేయువారితో కూడుకొన్నదియు, ధర్మశాస్త్ర రహస్యముల పరిశీలించువారితోను వివిధ పుస్తకముల పఠించువారితోను సకల శాస్త్రార్థ విచారణా చతురులతోను కూడుకొన్నదియు, ప్రారంభింపబడుచున్న క్రొత్త క్రొత్త పర్ణశాలలు గలదియు, అలకబడుచున్న ముంగిళ్లు గలదియు, పరికర బంధమును వేసికొన్న అనగా యోగపట్టికను ధరించిన అచంచలురగు ధ్యాననిష్ఠులతోను, తమ మంత్రానుష్ఠానమును సుస్థిర వైరాగ్యముతో సాధించువారలతోను, అభ్యసింపబడుచున్న యోగనిష్ఠులతోను, వస్త్రశుద్ధి గావించుచున్న ఆశ్రమవాసులతోను, ముంజ బంధనము గావించుచున్న వటజనులతోను, చేతులయందు ధరించిన సమిత్తులు గలవారితోను, కృష్ణాజినముల కస్తూరీ ద్రవ్యాదులచే శుద్ధిజేయువారితోను, ఎండబెట్టుచున్న తామరబీజములు గలవారితోను, జపమాలలకూర్చువారితోను త్రిపుండ్రముధరించిన వారితోను, త్రిదండసన్న్యాసులతోను, జలముచే నిండించుచున్న కమండలముగల వారితోను కూడుకొని విరాజిల్లుచున్నదియు, తమ తొండములతో నీళ్ళను పూరించుకొని చెట్లపాదులకు జలముపోయు గజశ్రేష్ఠములు గలదియు, కలికాలమునకు నిదివరకెన్నడును దృష్టికి గోచరించనిదియు, అసత్య దోషపరిచయ రహితమయినదియు, మన్మథవార్త తెలియని యోగిపుంగవులతో కూడినదియు, మిగుల మనోజ్ఞమయిన మఱియొక్క బ్రహ్మలోకమువలె నుంటున్నదియు నగు జాబాలిమహర్షి ఆశ్రమమును జూచితిని

**గద్య-యత్ర చ మలినతా హవిర్ధూమేషు న చరితేషు, ముఖ రాగః శుకేషు న కోపేషు, తీక్ష్ణతా కుశాగ్రేషు న స్వభావేషు, చంచలతా కదళీదళేషు న మనస్సు, గణనా రుద్రాక్షవలయేషు న శరీరేషు.**

ఇకను ఆ ఆశ్రమము ఎంత పవిత్రముగా నుంటున్నదై శాంతమై దాంతమై

యుంటున్నదో గాంచుడు అచ్చట హవిర్ధామములయందు మాత్రము మాలిన్యము కనబడును వారి సచ్చరిత్రములయందు నేమలినత యుండుట లేదు అచ్చట నున్న శుకములయందు ముఖారుణ్యము పొడసూపుచున్నది మహర్షిజనుల ముఖారవిందములయందు ప్రసన్నత శాంతత కనబడుటచే కోపప్రయుక్త ముఖరక్తత యుండుట లేదు దర్భలయందు తీక్ష్ణత యుంటున్నది వారి స్వభావముల యెడ తీక్ష్ణత్వదోషము లేదు అనగా వారలు మృదుమధురాలాపులు గనుక వారిస్వభావమున్ను అంత సౌమ్యమైనది అరటియాకులయందు మాత్రము చాంచల్య మున్నది వారి మనస్సులయెడ నిశ్చలత్వమే యుంటున్నది ఆ తపోధనులు రుద్రాక్షలను లెక్కించుచున్నారుగాని శరీరములు వచ్చుటలు పోవుటలు మొదలగునవి లెక్కించుట లేదు ఆ ప్రకారము జన్మములు మారునదిగూడ గణింపక తమవ్రతపూర్తికై దృఢవైరాగ్యము గలవారై యున్నారు

వి ॥ ఇటువంటి ఆర్ష గ్రంథములను జదువకనే కొందఱు ఇప్పుడు బ్రహ్మచారులచేతను, వాన ప్రస్థులచేతను, సన్న్యాసుల చేతను, వారి కనుకూలమగు నివాసములచేతను, గోవుల చేతను, ధాన్యాదులచేతను గూడిన గొప్ప ఆశ్రమములను జూచి నిందించుచున్నారు



# బ్రహ్మచర్యములో గల భేదములు

ప్ర ॥ బ్రహ్మచర్యమును గురించి కొంద ఱీలాగున ప్రశ్నింతురు అది యేమనగా, చాలామంది వివాహము లేనివారలై స్త్రీలున్ను, పురుషులున్ను ఉంటున్నారు స్త్రీలలో చాలమంది వితన్తువు లయినవారు గలరు కొందఱు రజస్వలలు గాకమునుపే భర్తలు మరణించినవారు గలరు పురుషులలోను నేదో కారణాన్తరముచే వివాహము లేనివారున్ను, వివాహమై కొంత కాలమునకు తర్వాత

భార్యలు గతించినవారును గలరు. వీరుగూడ బ్రహ్మచారులై యుంటున్నామని చెప్పుచుందురు వీరలలో చాలామంది గురూపదేశముపొంది సాధన జేయువారు గూడ గలరు మీబోటి వారలైతే బ్రహ్మచర్యమును గురించి చాల మహిమ గలదని వచించుచున్నారు పై జెప్పిన వారందరికిని నేలాటి మహిమయు కనుపించుట లేదు అతీన్ద్రియ జ్ఞానమున్ను, అమానుష ప్రజ్ఞయున్ను వారిలో నెవరికిని గోచరించుట లేదు దీనికి కారణమేమి?

సమాధానము ॥ అతీన్ద్రీయ జ్ఞానమును, అమానుష ప్రజ్ఞయు గలుగక పోవుటకు కారణము లనేకములు గలవు పై జెప్పిన వారందరికిని త్రికరణశుద్ధితో బ్రహ్మచర్యము గలదా? అనగా మనోవాక్కాయములలో నిజమైన బ్రహ్మచర్యవ్రత లక్షణ ముంటున్నదా? నిజమైన బ్రహ్మచర్యమునకు ఎనిమిది విధముసైన లక్షణములు గల్గియుండవలయునని యిదివరలో నిరూపించడమైనది గదా! మఱియు నొకవేళ బ్రహ్మచర్యముండునని అనుకొనుము అయితే స్త్రీపురుషులు కలియకుండు టొకటి మాత్రముం చాలదు. సంకల్పరూపముగాను, దృష్టిపూర్వకము గాను, వాగ్రూపముగాను, విషయదోష ముండకూడదు పై జెప్పినవిధముగా దోషముండిన స్వప్నములోనైన వీర్యనష్టము గల్గును మఱికొందఱికి రోగ దోషముచేతను శుక్లనష్ట మేర్పడును స్వప్నకాలములో స్త్రీ పురుషులకు సంబన్ధము గల్గినట్లుండిన తప్పకయది జాగ్రత్తలో గల విషయవృత్తి (వాసన) వల్లనే యుభయులకును ఏర్పడును పురుషులకు బిందుపతనము స్వప్నక్రియలో గల్గినచో అదియు జాగ్రదవస్థవలెనే యుండును అట్లొకవేళ నట్టి దోషము లేకున్నను బ్రహ్మచర్యవ్రతము దీనివలన పూర్తిగా జాలదు వేదాధ్యయనమున్ను, ఉపనిషద్భగవద్గీతాదుల పఠనమున్ను, దివ్య మంత్రజపమున్ను, పరిశుద్ధాహార మున్ను, ఏకాంతవాసమున్ను కొంత యోగసాధనయు గల్గియుండు నప్పుడే బ్రహ్మచర్య వ్రతము పూర్తి యగును. ఇవియన్ని యుండినను బ్రహ్మభావనగూడ నుండునప్పుడే ఆ వ్రతము పరిపూర్ణ మగును లేక పై జెప్పినవన్ని యుండినను అది స్థూలబ్రహ్మచర్యమే యగును సూక్ష్మ బ్రహ్మచర్య మనగా బ్రహ్మయందు విహరించుటయే. అనగా బ్రహ్మవిచారణ సదా సల్పుటయే యగును.

మనయొక్క ప్రతికార్యమునకున్ను బాహ్యమనియు, ఆభ్యన్తర మనియు రెండర్థములు గలవు మానవున కేలాగున దేహము, దేహియు నుంటున్నవో ఆలాగున అన్నిటికి రెండర్థములను గ్రహించుకొనవలయు ఇది బ్రాహ్మణత్వమున కున్ను, సన్న్యాసమున కున్ను, తపస్సునకున్ను, యోగము మొదలగు వాటిన్నిటికిని గ్రహించుకొనకపోయిన మోసము నొందగలము

ఇకను వినుడు విరేచనకు కషాయముగాని, లేక లేహ్యముగాని, లేక మాత్రలుగాని, చూర్ణముగాని, ఇట్లు కొన్ని దినుసులగు ఓషధులు గలవు వీనిలో కొన్ని తగ్గిపోయిన లేక సమభాగములను కలుపకపోయిన నేలాగున ఆ మందు విరేచనక్రియకు శక్తి గలది కాకపోవునో, అట్లుకాక పలాన మూలికలు పలాన ప్రకారము కలిపి పలాన ప్రకారము పక్వము జేసిన మాత్రమే ఆ శాస్త్రములో జెప్పినటుల ఆ యౌషధము పనిజేయునో, ఆలాగున బ్రహ్మచర్యమునకు సంబంధించి భవిష్యత్పురాణములో జెప్పినటుల విధి ప్రకార మనుష్ఠించిన గదా దానివలన గలిగెడు ఫలమున్ను సిద్ధించును! అదియును గాక ఔషధము విధిప్రకారము తయారు చేసినను ఔషధ సేవనకాలమందు పథ్యముగా నుండవలయు ననునదియు సరిగా జూచుకొనవలయును గదా! లేనిచో రోగమెటుల బాగుపడగలదు? బ్రహ్మచర్యవ్రతమును పాలించువాడు ఆహారానుష్ఠానములను పాటించుటతోపాటు ఇకను సూక్ష్మమగు కొన్ని నియమములలోను జాగ్రత్త పడవలయును రాత్రియందు శయనించుటకు మంచి గాలి వీచే స్థలము అనగా అనుకూల వాయువు వీచు ప్రదేశ ముండవలయును పై భాగమున అవరణములేక నక్షత్రకిరణములు దేహమునందు పడేలాగున నుండుట చాలా మంచిది. సరిగా గాలి లేనిగదిలో పరుండినను, దేహమున చెమటపుట్టించు గదిలో పరుండినను శుక్లనష్టము గలుగును అదిన్నిగాక వెచ్చని శాలువలు గాని, కంబళ్లుగాని కప్పుకొని నిద్రించినను శుక్ల నష్టము గల్గును. ఇదియుగాక సాత్త్వికాహారము అధికముగా భుజించిన గూడ నిద్రలో వీర్యనష్టము గల్గును మఱియు బ్రహ్మచర్య నియమము లన్నియు అవలంబించు వారైనను విశేష కాయ కష్టముచేతగాని, చదువుటచేతగాని, మాట్లాడుటచేతగాని, జపమాచరించుటచేతగాని శుక్ల నష్టము గల్గును ఈ సూక్ష్మ

విషయములలోను జాగ్రత్త వహించ వలయును కావుననే గీతయందు ఇట్లుపదేశించుట

**యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు ।**
**యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥**

ఉచితమైన ఆహార విహారములు గలవాడును, కాలోచితమగు అనుష్ఠానములను నెరవేర్చుటయందు నుచితమగు ప్రవర్తన గలవాడును, ఉచితమైన నిద్రా జాగరణములు గల యోగికి సమస్త దుఃఖములను పోగొట్టు యోగసిద్ధి గలుగును హఠయోగకర్తయగు మత్స్యేంద్రయోగీశ్వరుడును ఆలాగుననే వచించెను

**అత్యాహారః ప్రయాసశ్చ ప్రజల్పో నియమగ్రహః ।**
**జనసంగశ్చ లౌల్యం చ షడ్భిర్యోగో వినశ్యతి ॥**

అతిభోజనము, కేవల నిరాహారము, ఎక్కువగా మాట్లాడుట, చదువుట, అధిక కాయకష్టము జేయుట, అర్థము లేని కేవల మూర్ఖపు పట్టుదల యుండుట, ప్రాపంచిక మనుష్యుల మధ్య యందుండుట, విషయ లోలత్వము గల్గి వర్తించుట, ఈ ఆరున్ను బ్రహచర్య వ్రతమును గాని, యోగమును గాని భంగపరచును ఇక శ్రీనారాయణ గురుదేవుడు బోధించినది చూడుడు

**మితనిద్రా మితాహారో మితవస్త్ర పరిగ్రహః ।**
**మితభాషణ మేకైకం భూషణం బ్రహ్మచారిణామ్ ॥**

మితమగు నిద్రయు, నియమమగు ఆహారమున్ను, నిరాడంబరమగు శుభ్రమగు వస్త్రధారణయు, మితసంభాషణమున్ను బ్రహ్మచారు లందఱికిని ఒక్కొక్కటియు పరమభూషణమైనవి.

వి ॥ బ్రహ్మచర్య వ్రతము సల్పెడు వారందరికిని భోజన నియమము తప్పకుండవలయును రెండుసార్లకన్న అధికముగా భుజింపరాదు. రాత్రిమాత్రము ఆకలి శమించునంత మాత్రమే ఆహార ముండవలయును రాత్రి యాహారమైన తర్వాత కనీసము ఒక ఘంటగాని, రెండు ఘంటలుగాని చదువుటగాని, ఇతర

స్వల్పమైన శరీర పరిశ్రమ పనులు చేయుటగాని చేసిన తర్వాత ఒక లోటా మంచినీళ్లు త్రాగి పరుండుట మంచిది ఆలాగున తెల్లవారి నాలుగు గంటలకు గూడ ఒకలోటా చన్నీరు త్రాగుట చాలా మంచిది ఆ నీళ్లు మట్టిపాత్రలో పెట్టుకొనిన ఎక్కువ ప్రయోజనకారి

ఇక త్రిఫలయను ఒక యోగము యోగశాస్త్రమున గలదు కరక్కాయ, తాండ్రకాయ, నెల్లికాయ ఇవి చూర్ణముచేసి ఒక భాగము కరక్కాయ చూర్ణము, రెండు భాగములు తాండ్రకాయ చూర్ణము, నాలుగు భాగములు నెల్లికాయచూర్ణము శుద్ధమయిన తేనెలో లేహ్యప్రకారము కలిపి ప్రతిరోజున్ను రాత్రి భోజనానన్తరము, ఉదయము ఒక యుసిరికాయ ప్రమాణము భుజించిన బ్రహ్మచర్య రక్షణ కెంతో యుపయోగము దీని వలన శరీరములోని వేడి తగ్గుటయేగాక మలబద్ధకము గూడనుండదు దీనికి త్రిఫలయోగమని పేరు

మఱియొక విధముగూడ గలదు అది కరక్కాయ తెచ్చి పగులకొట్టి గింజలు తీసివేసి క్రొత్త మట్టిపాత్రలో కరక్కాయ మునుగునంత గోమూత్రములో నానవేసి మరురోజు ఎండబెట్టి, మట్టి పాత్రలో మిగిలియుండు గోమూత్రములో మరల నానవేసి మునుగునంత గోమూత్రమును పోయవలెను ఈలాగున మూడు రోజులు కరక్కాయ శుద్ధి చేయవలెను మూడవరోజున మిగిలియుండు గోమూత్రమంతయు దానిలో కలిసిపోవలసినదే గాని మిగుల రాదు నూతనముగా ఆవు పంచితము పోయగూడదు అట్టి కరక్కాయను బాగుగా ఎండబెట్టి చూర్ణముచేసి వస్త్రకాయము పట్టి మట్టిపాత్ర, పింగాణి, చిన్నజాడి మొదలయిన వాటిలో పెట్టుకొనవలయును పై జెప్పిన ప్రకారము భోజనానన్తరమున్ను ఉదయమున్ను ఒక యుసిరికాయ ప్రమాణమునకు ఒక వారమున కెంత పట్టునో అంత ప్రత్యేకముగ తీసికొని ఆవునేతిలో లేహ్యప్రకారము కల్పి చిన్న యుసిరికాయ ప్రమాణము భుజించవలయును ఇది చాలాసారమైనది. మల బద్ధకము ఉండునని తోచిన కొంచెము బెల్లముగూడ కలుపుకొనవచ్చును వట్టి తేనెలోగూడ కలిపి భుజింపవచ్చును తేనె, నేయి రెండున్ను కలవకూడదు ఇంకను యోగశాస్త్రములో పంచనింబకము మొదలగు కొన్ని కల్పములు గలవు అది

యంతయు అవసరమైనది గాగు సిద్ధపురుషు లందరున్ను కల్పమును సేవించువారలే.

ఎన్ని కల్పములు సేవించినను దైవ భక్తి, జీవకారుణ్యము, విషయ విరక్తి లేనిచో యేమియు ప్రయోజనపడదు శాస్త్రములో ఎవరికి తల్లి లేదో వారికి కరక్కాయ తల్లియని తెలుపడమైనది ఒక తల్లి తన కుమారుని ఎంత శ్రద్ధతో పోషించునో ఆలాగున ఒక కరక్కాయ పదిమంది తల్లుల వలె మానవుని సంరక్షించును అగస్త్యులు భోగఋషి మొదలయినవారు అరవములో అనేక కల్పములను వ్రాసియున్నారు నవనాధసిద్ధులు, దత్తాత్రేయులు గూడ యోగసిద్ధికొఱకు అనేక కల్పముల నిర్ణయించి యున్నారు

హరీతకీ మనుష్యాణాం మాతేవ హితకారిణీ ।
కదాచిత్కుప్యతే మాతా నోదరస్థా హరీతకీ ॥

మానవులకు కరక్కాయ తల్లి వలె సంరక్షక మైనది ఒకానొకప్పుడైనను తల్లి కోపము జేయవచ్చును కరక్కాయ ఉదరములో నుంటున్నదై యేవిధమైన చెఱుపును గలుగ జేయదు

హరస్య భవనే జాతా హరితా చ స్వభావత: ।
హరేత్తు సర్వరోగాంశ్చ తేన ప్రోక్తా హరీతకీ ॥

కరక్కాయ ఈశ్వరుని యందుండి పుట్టినదగుట చేతను, స్వభావముగ గోరోజన వర్ణముగా నుండుటచేతను, సమస్త రోగములను హరించున దగుటచేతను హరీతకీ అను పేరు గలిగెను

అన్నపానకృతాన్ దోషాన్ వాతపిత్తకఫోద్భవాన్ ।
హరీతకీ హరత్యాశు భుక్తస్యోపరి యోజితా ॥

భోజనానన్తరము కరక్కాయను భుజించిన , అన్న పానాదులచే గలిగెడు వాత పిత్త కఫ దోషములను శీఘ్రముగా హరించును. అన్ని వ్యాధులను హరించున దగుటచేతను 'హరీతకీ' యని ప్రసిద్ధిని బడసెను

## బ్రహ్మచర్యముచే గలిగెడు మఱియొక గొప్ప ప్రయోజనము

దృఢముగా కట్టబడిన కోటలో, శూరులై ధీరులై, యౌవనయుక్తులై, ఉత్కృష్ట ఆయుధములతో గూడిన యోధులచే సంరక్షింపబడిన సౌధాన్తరాళములో నుండు రాజునకు ఏలాగున శత్రుభయము గలుగక సుఖముగా నుంటున్నదో, ఆలాగున యీ శరీరమను నవద్వారములతో గూడియుండు కోటలోనుండు ఆత్మ యను రాజునకు సుఖముగా నుండవలసి యుండిన, బ్రహ్మచర్యముచే శరీరదార్ఢ్యము గలుగవలెను శుద్ధచైతన్యాణువులు రక్తనాళములలో దేహమంతయు నిరన్తరము సంచరించుచుండవలయును రమారమి ఒక నిమిషమునకు 15 సార్లు రక్త ప్రసారములలో నఖమునుండి శిరస్సు వరకు ఈ తేజోమయములగు శుక్లాణువులు నిరన్తరము సంచరించుచుండును ఇవి ఏరోగాణువులనున్ను శరీరములో చేరనీయవు తీక్ష్ణములగు అస్త్రశస్త్రములు గల యోధులచే కోటచుట్టున్ను ఎడతెగక సంచరించుచుండు నగరిలోనికి, దొంగలు దుర్మార్గులు శత్రువులు ఏలాగున ప్రవేశింపజాలరో, శరీరముయొక్క స్థితియు ఆలాగుననే యుండును అట్లుగాక శిథిలమయిన కోటలో, సరియగు పారాయుండు సైన్యములేనిచో శత్రువులు ఎప్పుడో ప్రవేశించి పాడుచేయునట్లు బ్రహ్మచర్యము లేనివారి దేహములో రోగాదులు ప్రవేశించి ఆత్మయను ప్రభువును నాశము చేయును విజ్ఞాన ధనము లన్నిటిని దోచుకొనగలవు కావుననే గీతలో "నవద్వారే పురే" అని వర్ణించడమైనది కావున నీ శుక్లసంరక్షణయం దెంతో జాగ్రత్త వహించవలసి యున్నారు దీనిలో గల మహిమ యటువంటిది

మఱియు పంచీకరణ శాస్త్రమున జెప్పునప్పుడు యీ శరీరము షట్కోశములతో నిర్మాణ మయినదిగా తెలుపబడినది కపిలుడు జెప్పిన షట్కోశములనగా వేదాంతశాస్త్రరీతిగా జెప్పెడు అన్నమయాది పంచకోశములు గావు. ఇది అస్థి మజ్జ, నాడులు, శుక్లముచేతను, రక్తమాంస చర్మములు శోణితములచేతను ఏర్పడుచున్నవని తెలుపడమైనది స్త్రీ యొక్కరక్తాంశముచే మాంసాదులు, పురుషుని శుక్లాంశముచే మజ్జాదులున్ను ఏర్పడుచున్నవని గ్రహించుకొనవలయును కావుననే మనువు శుక్లాంశము అధికమగు నప్పుడు

పురుష సన్తతియు, రక్తాంశము అధికరించినప్పుడు స్త్రీ సన్తతియు, రెండున్ను సమములయిన నపుంసకుడున్ను పుట్టునని తెలిపిరి ప్రజ్ఞాబలము శుక్లముచేతనే యేర్పడును కావుననే స్త్రీలకన్న దృఢబలమున్ను ప్రజ్ఞాశక్తియు ధైర్యమున్ను పురుషుల కేర్పడుట ఇది చాల రహస్యము కావున ప్రజ్ఞాశక్తిగల సన్తానములు ఏర్పడ వలసియుండిన గృహస్థ బ్రహ్మచర్య మందైనను చాల జాగరూకత గలిగి మానవులు సంచరించుకొనవలయును లేనిచో లేత విత్తనము చవిటిభూమిలో పెట్టిన వృక్షోత్పత్తివలెనే యుండును వంశోద్ధారకులు, ఆత్మోద్ధారకులు, లోకోద్ధారకులు, ధర్మస్థాపకులగు సన్తానములు పుట్టవలసి యుండిన తల్లితండ్రులు శుద్ధమయిన గృహస్థ బ్రహ్మచర్యమునైనను అవలంబించవలసి యున్నారు అప్పుడే ఆరోగ్యవంతులున్ను మాతాపితరుల యందును, దైవమందును, విశ్వాసముగల ధర్మజీవులు పుట్టుదురు

ఇదియును గాక మఱియొక సూక్ష్మ ధర్మముగూడ చెప్పెద జనము పెరుగుటచేతనే యుద్ధము లేర్పడుచున్నవి జర్మనీయు, జపానున్ను దీనికి తార్కాణములు జర్మనీ యందును, జపాన్ యందును స్థలము చాల తక్కువయని చరిత్రకారు లందరికి తెలిసిన విషయయే కాన ఇతరుల రాజ్యమునకు ఆశపడి హిట్లర్ పరదేశాక్రమణమునకు దిగెను ఆలాగున జపానున్ను చైనాపై సంగ్రామమునకు దిగినది కావున చాలామంది పురుషులున్ను, స్త్రీలున్ను బ్రహ్మచర్యము శీలించిన యుద్ధాది ఘోరకృత్యములు లేక పోవుటయేగాక ఆహారాదులున్ను జనులకు సమృద్ధిగా దొరుకును ఇది లోకమున కెంత మేలో యోచించుకొనుడు మఱియు ఎక్కువ సంతానములు గలుగుటచేత పిల్లలకు సరిగా అన్నపానాదులు దొరకకయు, విద్య జెప్పించుటకు ధనము లేకయు ఎంతో సంకటములు అనుభవించవలసి యున్నవి అట్టి విద్యావిహీనులున్ను దేహబలము లేని సంతానములు లోకమునకున్ను, మాతాపితరులకున్ను ఎంతో భారమే గాని మఱి యేమియు గలుగదని విజ్ఞులు ఆలోచించుదురుగాక!

మఱియు అధిక సంతానోత్పత్తిచేత మాతాపితరులు దుర్బల శరీరులై రోగగ్రస్తులుగూడ అగుచున్నారు ఇట్టి వారికి ఆత్మవిశ్రాన్తి యెటుల గలుగును?

ఏదైనా దాన ధర్మ పుణ్యకర్మలను గూడ చేయుటకు ఎట్టి అవకాశమున్ను దొరకక జన్మము పాడైపోవుచున్నదిగదా! వివాహ బంధముచే లోక సేవచేయుటకు కొంచెమైన అవకాశము లభింపక యుంటున్నది స్వశరీరమును పోషించుటకైనా కాలము చాలక యుండగా లోకసేవ చేయుటకు సమయమెక్కడ?

మఱియొక రహస్యముగూడ తెలిపెద ఇది పరమ గోప్యము కొన్ని సంవత్సరముల క్రిందట నీ యువకులందఱు బ్రహ్మచారు లగుటచేతను, సన్న్యాసు లగుటచేతను జన సంఖ్య తగ్గిపోవుచున్నది వీరందఱు ఈశ్వరాజ్ఞను నుల్లంఘించి వర్తించుచున్నారు వీరి కీశ్వరకృప యెటులగలుగునని గూడ వాదించువారును, ప్రశ్నించువారును నుండిరి ఏలన ఈశ్వర సృష్టిని వృద్ధిపరచునప్పుడుగదా ఈశ్వరునకు వీరిపై కరుణ గల్గును ఇట్లుండగా ఈశ్వరసృష్టిని ధ్వంసముచేయు వీరికి ఈశ్వరదయ యెచ్చట? ఈశ్వరదయ లేనప్పుడు ఇట్టివానికి మోక్ష మెచట? అని గూడ నుపన్యసించు వారున్ను, పత్రికలలో వ్రాయువారున్ను ఉండిరి

ఇప్పుడాహార పదార్థములు సరిగా దొరకకపోవుటచేతను, గృహనిర్మాణము నకు స్థలము లభింపకపోవుట చేతను, జనసంఖ్య పెరుగుటచేతను, ఇట్టి యనర్థము, ఆపద ఏర్పడినదని క్రొంచెము తెలిసికొనుచున్నారు ఇప్పడిప్పుడు జనులు ఈ సంగతిని తెలిసికొనుటకున్ను, గ్రంథములు వ్రాయుటకున్ను ప్రారంభించు చున్నారు అధిక సన్తాన నిరోధచట్టమునుగూడ అమలులోనికి తీసికొని వచ్చుటకు చూచుచున్నారు కావున బ్రహ్మచర్యముచే గలిగెడు ప్రయోజన మెట్టిదో, యిదంతయు చదివిన తెలిసికొన వచ్చును కాబట్టియే పూర్వికఋషులు బ్రహ్మచర్యము నింతగా ప్రశంసించినది ఆలాగున గృహస్థ బ్రహ్మచర్యము అంతగా శ్లాఘించినది ఈ సంసారబన్ధ కాలచక్రములో చిక్కుకొనక యుండువారు ఎంత పుణ్యజీవులు! వీరికి ఆత్మబంధవిముక్తి గలుగజేసికొనుటకున్ను, లోకసేవ జేసికొనుటకున్ను, స్వాతంత్ర్యముతో జీవించుటకున్ను ఎంతో అనుకూల ముండునుగదా! బ్రహ్మచర్యవ్రతముచే వజ్రకాయ సదృశులై యోగసాధనల నేర్చుకొనుటకున్ను, బ్రహ్మవిద్యను గ్రహించుకొనుటకున్ను, ప్రజ్ఞావంతులై జీవించుటకున్ను తగిన మేధాశక్తి గలిగి బ్రహ్మపదము నిచ్చటనే పొందవచ్చును

గదా! గొలుసుతో బంధింపబడిన గజమునకున్ను, త్రాడుతో కట్టబడిన పశువునకున్ను, బోనులో పడిన సింహమునకున్ను ఎంత దురవస్థ గలుగునో, పై చెప్పిన మూడుబన్ధములు లేని గజము, గోవు, సింహము ఎంత స్వేచ్ఛా సుఖము ననుభవించునో సంసార బన్ధము లేనివారి స్థితియు అట్టిదేయగును ఓమ్

## బ్రహ్మచర్యమును గురించిన మఱియొక పరమరహస్యము

ప్రశ్న॥ ఆహారముయొక్క పరిణామమే శుక్లముగూడను ఆహార పరిణామమైన మలమూత్రములు ఏలాగున అపానాది వాయువులచే బయటికి త్రోయబడుచున్నవో, అది యేలాగున ప్రాణులు నిగ్రహింప జాలకపోవుచున్నవో, ఆ మూత్ర పురీషాదులు సమయము వచ్చునప్పుడు తప్పక బహిర్గతములయ్యే స్వభావము గలిగి యుంటున్నవో, ఆలాగున శుక్లముగూడ కాలము ననుసరించి బహిర్గత మగుటయు స్వభావమయి యున్నది మూత్ర పురీషముల నెటుల నిరోధింపజాలమో, శుక్లముయొక్క స్థితియు ఆలాగున నుంటున్నది ఒక వేళ మలమూత్రములు బహిర్గతమగు సమయము వచ్చినప్పుడు అడ్డుపరచిన నెంత ప్రమాదకరమో ఆలాగున శుక్లముగూడ బహిర్గతముచెందు సమయమున బహిర్గత మొనర్చకపోయిన అదియు ప్రమాదకరమని తలంచెద కావున విషయ సంకల్పములు గలుగునప్పుడు అట్టి బిందువును బహిర్గత మొనర్చుటయే మంచిదని నాసంకల్పము.

సమా ॥ మీబోటివారి అవిచారణ మూలకములగు నీలాటి మాటలను విని యనేకులు మోసములో పడగలరు ఇది యెంత ప్రమాదకరమయిన కార్యము! మలమూత్రములను అపానవాయువు నాభిస్థానమందుండి కాలము ననుసరించి బయటికి త్రోయుచుండును అట్లుకానిచో దేహమున కపాయమే అది వాస్తవము ప్రాణాది పంచవాయువులు, ఏయే స్థానములలోనుండి యే యే పనులను జేయుచుండునో ఆ వివరమును శాస్త్రములో చూడుడు.

**హృది ప్రాణః స్థితో నిత్యమపానో గుదమండలే ।**
**సమానో నాభిదేశే తు ఉదానః కంఠమధ్యగః ।**

వ్యానస్సర్వశరీరే తు ప్రధానాః పంచవాయవః ॥

1) హృదయమునందు నెప్పుడును నుండునది ప్రాణవాయువు ఈ ప్రాణవాయువు నాసికాద్వారములగుండా ఊపిరిగానుండి బయటికి వచ్చుచు మరల లోపలికి పోవుచుండును. మఱియు, ప్రాణికోట్లు తినెడు వస్తువులను హరింపజేయుచుండును

2) గుదమున నుండునది యపానవాయువు ఇది మలమూత్రములను బయటకు త్రోయును

3) కంఠము నందుండునది ఉదానవాయువు ఇది తినునట్టి వస్తువులను త్రాగెడు జలమును లోపలకు పోవునటులజేసి ఆ యాహారమును రసరూపముగా జేయును

4) నాభియందుండునది సమాన వాయువు ఇది పై జెప్పిన ఉదానవాయువుచే జీర్ణింపజేసిన యన్నరసమును సకల నాడులకున్ను చక్కగా పరపి దేహమును పెరుగునటుల జేయును

5) దేహమంతయు వ్యాపించి యుండునది వ్యానవాయువు ఈ వ్యానవాయువు దేహచర్మముపై దగులునట్టి శీతోష్ణములను తెలిసికొనును ఈ ప్రాణపంచక వృత్తులలో బిందువును గురించి చెప్పబడియున్నదా? లేదు యావజ్జీవితమున్ను బ్రహ్మచర్య మనుష్ఠించు వారనేకులు గలరు కాని, జీవితమంతయు మలమూత్రములను విడువక నిలపెట్టు వారెవరును లేరు అదియున్నగాక మానవులలోగూడ యౌవనకాలము వచ్చువరకు నెవరును విషయములలో ప్రవర్తించరు కాని మూత్రపురీషములు వానికాలము వచ్చునప్పుడు దినమున కాయా సమయములలో బహిర్గతము లగుచుండును అట్లు కానిచో జీవులు మరణింతురు ఆలాగున వార్ధక్యదశలోగూడ చాలాకాలము బిందు సంరక్షణ గలిగి యుండువా రనేకులు గలరు జనులు మాత్రము గాదు పశ్వాదులు సహా ఆలాగుననే యుంటున్నవి శుక్లమటుల గాదు అది పంచప్రాణ క్రియలకు సంబంధించి యుండలేదు అది మనస్సు ననుసరించి యుంటున్నది మనస్సులో

సంకల్పము గల్గి యున్నందున మాత్రమే ఆ వీర్యము విషయములో ప్రవృత్తి గల్గియుండును హఠయోగ ప్రదీపికను చూడుడు -

**చిత్తాయత్తం నృణాం శుక్రం శుక్రాయత్తం చ జీవితమ్ ।**
**తస్మాచ్ఛుక్రం మనశ్చైవ రక్షణీయం ప్రయత్నతః ॥**

పురుషులయొక్క శుక్లము చిత్తాధీనమై యున్నది అనగా చిత్తము చలించిన యెడల చలించుచున్నది. చిత్తము స్థిరపడినచో నిలుచుచున్నది శుక్లము నిలిచిన యెడల జీవనమున్ను, శుక్లము నష్టమైన యెడల మరణమున్ను గలుగుట వలన జీవితము శుక్లాధీనమై యున్నది. కావున శుక్లమును, మనస్సును ప్రయత్నము చేత రక్షింపవలయును

**సుగన్ధో యోగినో దేహే జాయతే బిన్దుధారణాత్ ।**
**యావద్బిన్దుః స్థిరో దేహే తావత్కాలంభయం కుతః ॥**

యోగులయొక్క దేహమునందు బిందుధారణము వలన సుగన్ధవాసన గలుగుచున్నది ఎంతకాలము దేహమునందు బిందువు నిలిచి యుండునో అంతకాలము వరకును మరణ భయమెక్కడ? అనగా మృత్యుభయము లేదు

**ఏవం సంరక్షయేద్బిన్దుం మృత్యుం జయతి యోగవిత్ ।**
**మరణం బిన్దుపాతేన జీవనం బిన్దుధారణాత్ ॥**

ఇటుల బిందువు నెవడు రక్షించుచున్నాడో, అట్టి యోగవేత్త మృత్యువును జయించుచున్నాడు. బిందుపతనముచే మరణమును, బిందుధారణమువలన జీవనమును గలుగుటవలన బిందువును సంరక్షింపవలయును

వి॥ దీనియొక్క సత్యము బ్రహ్మచర్యవ్రతము గలవారికి తెలయును ఏదో కారణాన్తరముచే స్వప్నములో శుక్లనష్టము గలిగిన ఆప్రదేశమంతయు సువాసన గలిగియుండును. అట్టివారి శుక్లము పాదరసమువలె చిక్కగాను, తెల్లగానుండును గృహస్థబ్రహ్మచర్య మవలంబించు వారికిన్ని, చాలవరకు శుక్లమాలాగుననే యుండును. అట్టివారి కేర్పడెడు సంతానములే ధీరోదారోగ్య వంతులై ధర్మాత్ములై యుందురు అట్టి గృహస్థ బ్రహ్మచర్య మయినను లేనివారి శుక్లము పలుచనిదిగాను,

పసుపు వర్ణముగలదిగాను, సుగంధ వాసన లేనిదిగా నుండును ఇక ఎక్కువ విషయాసక్తి గలవారి శుక్రము నిండాపలుచనగాను, పసువు ఎరుపు కొద్ది నలుపుగలిగి దుర్వాసనతో గూడి యుండును. ఇట్టి దానివలన గలిగెడు సంతానములు అల్పాయుస్సు, రోగము, హీనగుణము గలవగును

ఈ లాగుననే బ్రహ్మచర్యముగల స్త్రీయొక్క రక్తము మంచి కాంతిగల లక్కవర్ణము గలదై యుండును వారి దేహముగూడ మంచి కాంతిగలిగి యుండుటేగాక ప్రజ్ఞాశక్తియు, విద్యాధారణశక్తియు గలిగియుండును గృహస్థబ్రహ్మచర్య మాచరించెడు స్త్రీకిన్ని చాలవరకు నీలాగుననే యుండును అట్టి దానివలన పుట్టెడు శిశువులు తేజోరూపులుగాను ప్రజ్ఞావంతులుగాను నుందురు విషయ లోలత్వము గల స్త్రీల రక్తము కాంతి రహితమై పలుచనిదై చాలవరకు నలుపు వర్ణము గలిగియుండును అట్టిదానిచే గలిగెడు సంతానములు రోగగ్రస్తులు, మతిహీనులు, అల్పాయుస్సు గలవారునై నీచ గుణములతో గూడియుందురు. బ్రహ్మచర్య వ్రతములేని స్త్రీ కయినను పురుషుని కైనను మనో నిగ్రహ ముండదు మనో బలమున్ను ఉండదు ఎటులనగా దుర్బలమగు స్తంభమునకు కట్టివేసిన పశువులు ఏలాగున వాటి యిష్టానుసారముగా స్తంభమును లాగుకొని పోవునో, దృఢమగు స్తంభమునకు కట్టివేసిన పశువు లేలాగున స్వేచ్ఛగా వెళ్లజాలక స్తంభము నాశ్రయించి యుండునో బ్రహ్మచర్యము గలవారి యొక్కయు, లేనివారి యొక్కయు మనస్థితి యీలాగున నుండునని, గ్రహించవలయును దీనికి దృష్టాంత మేమన నిండావృద్ధులకున్ను, బాలురకున్ను, మనో నిగ్రహ ముండదు బాల్యావస్థలో శుక్రమావిర్భవించ లేదు వార్ధక్యమున శుక్లము నశించిపోవును అందువలననే మనో నిశ్చలత్వము లేకున్నది. కావుననే బంధ మోక్షములకు మనస్సే కారణమని తెలుపడమైనది అమృత బిందూపనిషత్తు

మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః ।
బన్ధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥

మానవుల బంధ మోక్షములకు మనస్సే కారణము విషయాసక్తమగు చిత్తము బంధమును, విషయరహితమగు చిత్తము మోక్షమును గలుగజేయును.

కాబట్టి శుక్లము పంచప్రాణముల కధీనము గాదు మనస్సున కధీనమయి యున్నది

యతో నిర్విషయస్యాస్య మనసో ముక్తిరిష్యతే ।
అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా ॥

ఏ కారణమువలన నిర్విషయమగు మనస్సుగల వారికి మోక్షము గలుగునని చెప్పబడినదో, ఆ కారణము వలన మనస్సు నిర్విషయ మగునటుల ముముక్షువు చేసికొనవలయును మఱియొక విషయము, అదేమన బుద్ధి పూర్వకముగ గాక స్వప్నములో వీర్యనష్టము గలిగిన అదియు నొక దోషముగానే పరిగణింపబడును కాని అట్టి స్వల్పదోషము చాలామంది బ్రహ్మచారులకున్ను, సన్యాసులకున్ను గలుగుచుండును ఆ దోషనివృత్తికొరకే ఉదయము స్నాన మాచరించి సూర్యావలోకనము చేయులాగున మనుస్మృతిలో తెలుపబడిన విషయము ఇదివరలో నిరూపింపబడినది. అట్లుగాక యే సమయమున శుక్ల పతనము గలుగునో అప్పుడే స్నానమాచరించి మూడుసార్లు ప్రాణాయామమును జేసి తన యిష్టదేవతా మన్త్రమునుగాని, ప్రణవమునుగాని 108 సార్లు జపమొనర్చుట చాలామంచిది దానివలన అట్టి దోషము పోవును కాని అలాటిది దోషములోగాని పాపములోగాని చేరదు కొన్ని యోగాసనముల గూడ నేర్చుకొనిన చాలా యువయోగము ఏ స్థలములో నుండిన అట్టి విషయబుద్ధి గలుగునో, ఆస్థలము విడిచిపెట్టుటకన్న గొప్ప సంగతి లేదు ఇందువలన మీకు ఇంద్రియజయము గలుగవలసినదే కాని మఱియొక యుపాయము లేదు ఆహారదోషముచే కాలక్రమముగా ఇంద్రియనష్టము గలుగునేగాని నివాసదోషముచే మీరు చిరకాలము సంపాందించిన ఇంద్రియ నిగ్రహము తత్క్షణమే నష్టమై పోవును ఈ విషయములో ఎంత జాగ్రత్త వహించిన అంత మేలుగలుగును దీనికి సంబంధించిన విషయము లన్నియు నిదివరలోనే మీకు తెలుపబడినవి. స్వప్నములోగల యింద్రియపతనము బుద్ధిపూర్వకముగా గలిగినది కానందుచే అది అంత దోషము కాదు అబుద్ధి పూర్వకముగా నేర్పడిన దగుటచే దానివలన దోషము గలుగదు అయినను అట్టి లోపము గూడ లేనిచో చాలా మంచిది.

కావుననే హఠయోగ ప్రదీపకయం దిటుల చెప్పబడెను

**దుర్లభో విషయత్యాగో దుర్లభం తత్త్వదర్శనమ్ ।**
**దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా ॥**

శ్రీ సద్గురువు కృపలేనియెడల విషయముల త్యాగము, ఆత్మానుభవమైన తత్త్వదర్శనము, తురీయావస్థయను సహజావస్థయు గలుగుట దుర్లభము కావున శ్రీ గురుదేవుని యొక్క లేక సర్వేశ్వరునియొక్క అనుగ్రహము లేనిచో నిర్విషయము గలుగుట ప్రయాసమని మరువకూడదు ఏ ప్రకారమైనను నింద్రియనిగ్రహము చాలా ప్రయాసమైన పనియే కావుననే భీష్ములని భీష్మాచార్యులకు పేరువచ్చినది భీష్మశబ్దమున కర్థమేమన మహాభయంకరమైన బ్రహ్మచర్య వ్రతమును సలిపినవాడని భావము ఇంత ప్రయాసము దీనికి గలుగుటకు కారణమేమన సృష్టి శక్తియంతయు దానియందే నిలిచియున్నది అది లేనిచో సృష్టియే యుండదు

సామాన్యముగా శుక్లగోళము నిండునప్పుడు పతనముగలుగు స్వభావము గలదు అది అంత బాధాకరము గాదు సాధనవలన, తపస్సువలన ఆశుక్లమును ఓజస్సుగా మార్చవలయును. ఒక వేళ అబుద్ధిపూర్వకముగా నష్టమయిన అంత దోషము లేదని చెప్పుటకు కారణమేమన చెరువు నిండినప్పుడు కలుజు మార్గముగా జలము పోవుటలో చెరువునకు హానికరము లేదు గ్రామస్థులకున్ను ఏలాటి అపాయమున్ను గలుగదు

అట్లుగాక చెరువుకట్ట కొట్టివేసిన జలమంతయు నశించిపోవుటచే పైర్లు పండక గ్రామవాసు లెటుల దరిద్రు లగుదురో, ఆలాగున బుద్ధిపూర్వకముగా శుక్రనష్టము గలుగ జేయుటలో ఆత్మనష్టము దేహనష్టముగూడ గలుగును ఈ విషయములో మీరు నిండుజాగ్రత్త వహించుకొనవలయును. చెరువులో నీరుండిన పైర్లుపండి గ్రామము ఏలాగున సుభిక్షముగా నుండునో, ఆలాగున యింద్రియపతనము లేనివాని జీవితముగూడ మహదానందకరమైయుండును. గురుకృపయు, దైవకరుణము, పూర్వపుణ్యమున్ను లేనివారికి ఇది ప్రయాసమనియే తలంచవలయును. దేనికి ఎంత ప్రభావము గలదో, అది ప్రయాసముచేతనే

సిద్ధించునని మరువకూడదు ఏమన అట్టి నిగ్రహవంతుడు ప్రకృతిని దాటిపోవుచున్నాడు గదా! సృష్టియందు బ్రహ్మదేవుడు తన శక్తినంతయు దీనిలో నిమిడించుకొనినాడు లేనిచో సృష్టియే లేదుగదా! కావుననే శ్రీ దత్తాత్రేయులు సహిత మిటుల వక్కాణించిరి

ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా ।
మహాభయ పరిత్రాణా ద్విత్రాణాముపజాయతే ॥

అద్వితీయమగు పరబ్రహ్మవిచారము స్థిరమగుట కొఱకున్ను, మహా ఘోరసంసారదుఃఖము తొలగించి రక్షించుటకున్ను, పరమేశ్వరునియొక్క కరుణాకటాక్ష వీక్షణమైన అనుగ్రహముచే మాత్రము అజ్ఞానులైన జీవులకు జ్ఞానము కలుగుచున్నది శ్లో॥ మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్ " అని పంచదశి తెలుపడమైనది ఈ మాయనే ప్రకృతియని తెలిసికొనందగినది ఈ మాయయొక్క అధిపతి పరమేశ్వరుడు కావున ఈ పరమేశ్వరుని యనుగ్రహము వలననే మాయను జయించగలము ఈ విషయమై శ్రీ శంకరభగవత్పాదాచార్యులున్ను తెలిపినది చూడుడు

శ్రుత్వా తత్త్వమసీత్యేవం బోధ్యమానోఽప్యనేకశః ।
న విజానాత్యయం తత్త్వమీశానుగ్రహవర్జితః ॥

తత్త్వమస్యాది మహావాక్యములను అనేకసార్లు శ్రవణ మననములను జేసినను, గొప్ప మహాత్మునిచే అనేక విధములుగా బోధింపబడినను భగవదనుగ్రహము లేనివాడు ఈ శివజీవైక్యపరమగు బ్రహ్మతత్త్వమును పొందజాలడు

మఱియు అనుభూతి ప్రకాశము తెలిపినది జూడుడు:-

నైవ జన్మని సర్వస్మిన్ విద్యాఽసౌ సులభాఽపి తు ।
శిష్యలక్షణ సంపూర్ణ జన్మన్యేవ హి లక్ష్యతే ॥

అన్ని జన్మములయందును నీ విద్య సులభము గాదు శిష్యలక్షణములు సంపూర్ణముగా నున్న జన్మమునందే కనబడునది అనగా సాధన చతుష్టయ

సంపత్తి బ్రహ్మచర్యము, యమ నియమములు అన్నియు గలిగిన జన్మమునందు మాత్రమే ఈ బ్రహ్మవిద్య పూర్ణముగా సిద్ధించును బ్రహ్మచర్య సంరక్షణ విషయమై రెండు విషయములలో జాగ్రత్త గలిగి వర్తించిన అది యంత ప్రయాసముతో గూడినది కాదు వానిలో

1 నివాస నియమము ఏ స్థలములో నుండిన బ్రహ్మచర్య వ్రతమునకు హాని గలుగునని తోచునో తప్పక యా స్థలమును మార్చుకొనవలయును మరల బ్రహ్మచర్యవ్రత పాలనముచే గలిగెడు మహిమను గురించియు, బ్రహ్మచర్య నాశముచే గలిగిన దీనత్వమును గురించియు బాగుగా యోచించు కొనవలయును బ్రహ్మచర్య సంరక్షణచే మహోన్నత స్థితిని పొందినవారి జీవితమును గురించి అప్పుడప్పుడు జ్ఞాపకములోనికి తెచ్చుకొనుచుండవలయు

2 మీరు ఏసమయములో నే ప్రవృత్తి యందున్నప్పుడు అనగా జపముగాని, ధ్యానముగాని, పారాయణగాని, గ్రంధపఠనముగాని, విశ్రాంతిగా నున్నప్పుడు గాని, పరుండునప్పుడుగాని, మనస్సు విషయాకారమై పరిణామము పొందునో అప్పుడు ఆస్థితిలోనుండి మీరు మనస్సును స్వాధీనములోనికి, నిర్విషయములోనికి ఎంత ప్రయత్నించినను తీసికొని రాజాలరు. అత్తఱి మీరు జేయునది ధ్యానమైనను, జపమైనను, యోగాసన మైనను, వెంటనే మానివేసి మఱియొక పనిలోనికి ప్రవేశించవలయును ఆ పని వాక్కుతోను మనస్సుతోను కాయముతోను గూడినదిగా నుండవలయును అంతటితో తృప్తిని బడయక ఆ పని కొద్దిమందితో గూడినదిగా నుండిన మఱింత మంచిది అట్లైన మనస్సున మార్పు ప్రయాసము లేకనే గలుగును దీనిచే గలిగెడు ప్రయోజనము మీ అనుభవముచేతనే తెలిసికొనగలరు ఒక యింజన్ ముందుకు పోవుచున్నప్పుడు బ్రేకువేసి వెనుకకు నడుపవలసి యుండిన, ఎట్లు డ్రైవర్ నడుపగలడో మనస్సు యొక్క వేగమున్ను అట్టిదని గ్రహింపనగును ఇంకొక రహస్యముగూడ తెలిపెద

అదేమన ప్రజ్ఞావంతులకు, విజ్ఞానవంతులకు, సత్త్వగుణ ప్రధానులకు, మంచి యారోగ్యము గలవారికి శుక్లమెక్కువగానే యుండును లేనిచో నంత ప్రజ్ఞ వారికుండదు సత్త్వగుణము దాటి విశుద్ధసత్త్వములోనికి ప్రవేశించునపుడే

దానిశక్తిని స్వాధీనములోనుంచి ఆధ్యాత్మిక విషయములోనికిన్ని, దైవ భావములోనికిన్ని, ధర్మబోధలలోనికిన్ని, యున్నతాశయములతో గూడిన గ్రంధరచనలోనికిన్ని ప్రవేశపెట్టగలము ఎంత వేగముతో గూడినదియై యున్నప్పటికిన్ని ఆనకట్టయొక్క సహాయముచే జలవేగము నరికట్టి నూతనముగా నిర్మింపబడిన కాలువలద్వారా ప్రవహింపజేసి జనోపయుక్తములగు వ్యవసాయాదుల కెట్లు ఉపయోగపెట్టెదరో, శుక్లముయొక్క వేగమును నిరోధించిన ఆధ్యాత్మిక విషయములోను, ధర్మోద్ధారక విషయములోను గొప్ప కార్యము జేయగలము లోకోన్నత పురుషులందఱును ఈలాటివారలే పెట్రోలుగాని, క్రూడాయిల్ గాని, బాయిలర్ లోపల స్టీముగా మారి, యంత్రముయొక్క పనికి ఎటుల సహాయపడు చుండునో, ఆ తైలములు ఏలాగున స్టీముగా మారుటచే కనపడకపోవుచుండునో, వీర్యము తపో ధ్యానాదులచే ఓజస్సుగా మారి ఆధ్యాత్మిక కార్యముల కెంతగనో సహాయపడును యోగి పురుషులందఱు ఈ లాగున నుండువారలు కావుననే వారి శుక్లము తేజస్సుగా మారుచుండును అట్లు చేయనివారి వీర్యము పతన మొందుటకు కారణమగును అది పనిచేయని యంత్రము యొక్క బాయిలర్‌లో గల నూనె నిలిచిపోవునటుల వీరిశుక్లమున్ను పనిచేయనిచో నిలిచి విషయోన్ముఖముగా బహిర్గత మగుచుండును

ఆహార విషయములోనూ మిక్కిలి జాగ్రత్త వహించియుండవలయును శుద్ధమై మితమై భుజింపబడు నాహారము అమృతమై పరిణమించి దేహమును సంరక్షించును. అశుద్ధమై అమితమై భుజించు నాహారము విషమై పరిణమించి దేహమును శిక్షించును అనగా చెఱచును

**యదుహ వా ఆత్మసమ్మితమన్నం తదవతి తన్నహినస్తి ।**
**యద్భూయో హినస్తి తద్యత్కనీయో న తదవతి ॥**



# ఆహారభేదము

అపక్వాహారమును భుజించువారు కొందఱు తామే శ్రేష్ఠులమనియు, పక్వాహారము (పచనముజేసిన ఆహారమును) భుజించువారు తక్కువవారలనియు తలంచుచున్నారు ఆహారమును గురించి శాస్త్రములో సాత్త్వికాహారమును నిర్ణయించునప్పుడు పక్వాపక్వముల గుఱించి యేమియు ప్రత్యేకముగా వర్ణించియుండ లేదు సత్యమార్గమునుండి వచ్చినదియు, శుద్ధమయినదియు, కట్వామ్ల లవణాధిక్యము లేనిదియు సాత్త్వికాహారమని మాత్రమే తెలుపబడి యున్నది అయితే సత్యము, బ్రహ్మచర్యము, దయ మొదలయిన శుద్ధగుణములు లేనివారు అపక్వాహారు లయినను అట్టివారిని సత్త్వగుణోపేతులుగా శాస్త్రము వర్ణించియుండలేదు పక్వాహారు లయినను సత్య, ధర్మ, దయా, బ్రహ్మచర్యాది గుణములు గలవారినే సాత్త్వికులని నిర్ణయించడమైనది అట్టి సాత్త్విక గుణములు గలవారే అనేకముగా బ్రహ్మజ్ఞానులుగాను పరమయోగులుగాను, మహాభక్తులు గాను లోకములో కనబడియుండిరి కనబడుచున్నారు

శ్రీ యేసు, శ్రీ మహమ్మదు మొదలగు ప్రవక్తలను జూడుడు శ్రీ శంకర, రామానుజ, మధ్వ, గురునానక్, శ్రీ కృష్ణ చైతన్య, దయానంద సరస్వతి, రామకృష్ణ పరమహంసాదులున్ను, శ్రీ వివేకానంద , శ్రీ రామతీర్థ, శ్రీనారాయణగురు మొదలగువారున్ను, శ్రీ బుద్ధదేవుడు మొదలయిన మహనీయులన్ను శుద్ధమయిన పక్వాహారమును భుజించెడు వారే అపక్వాహారము అనగా వండని పదార్థములు మాత్రము భుజించుచు బ్రహ్మచర్య తపస్సులు లేనివారిని గురించి శాస్త్రము ఎక్కువగా నేమియు తెలిపియుండలేదు అయితే బ్రహ్మచర్య తపస్సులు గలవారికి అపక్వాహారము క్షీరము మొదలగునవి కొంతవరకు సహాయము మాత్రము జేయవచ్చును అపక్వాహారముచే మాత్రము తాను అందరికన్న గొప్పవాడనని తలంచెనేని అది వట్టి భ్రమమాత్రమే యగును

1 అట్టి అపక్వాహారమువల్ల బ్రహ్మచర్య స్థిరతగాని, ప్రబోధజ్ఞానముగాని గలుగునని నిరూపించెదరేని వానరులకున్ను, అజములకును బ్రహ్మచర్యస్థిరత యుండవలయును. జన్తువులలో కోతులు ఫలమూల పత్రాదులనే భుజించును.

అట్టి కోతులకుగల విషయవృత్తి సృష్టిలో మఱి యేజంతువునకున్ను లేదనియే చెప్పవచ్చును దీనియొక్క సత్యము తెలిసికొనవలసి యుండిన కోతులు విశేషముగా నుండెడు పెద్ద తిరుపతి, అయోధ్య మొదలగు స్థలములలోనికి వెళ్ళి చూడవచ్చును.

2 అజములు, అనగా మేకలు, గొఱ్ఱెలు మొదలయినవి ఇవి మిక్కిలి సారవంతము లయిన రసయుక్తము లయిన ఫలములను గాని కందముల గాని భుజింపవు. మంచి మూలికలవంటి ఆకులను గడ్డిని మాత్రమే తినుచుండును పైనుదాహరించిన శాఖామృగములుగాని, ఈ అజములుగాని, శుద్ధమగు జలమును మాత్రమే పానము జేయును మేకల మేపువారిని అడిగిన, వాటియొక్క బ్రహ్మచర్యము, విషయవిరక్తియు కోతులయొక్కయు, మేకల యొక్కయు నిశ్చలత్వము ఎటులనుండునో వారే చెప్పగలరు సామాన్యముగా 30 గాని, 50 గాని, ఆడమేకలుగాని, గొఱ్ఱెలు గాని గుంపుగా నుండిన ఒకటిగాని రెండుగాని పోతులు మాత్ర ముండును వందలాదులు గల మేకలు గొఱ్ఱెలు ఉండిన అట్టి అన్నింటికిని ఇది యొక్కటిగాని రెండుగాని యుండుపోతులే గర్భాధానక్రియలు సల్పుచుండును, మేకల గుంపును వెళ్ళి చూచిన ఈ సత్యమును తెలిసికొనగలరు అదేరీతిగ ఆబోతులు వట్టిగడ్డిని తిని వట్టి మంచినీటిని త్రాగుచుండును ఒక గ్రామము గాదు. చుట్టుప్రక్కల నుండు కొన్ని గ్రామములలో గల ఆవులన్నిటికిని అదొకటే సన్తానము గలుగజేయుచుండును ఇక నెవరో చెప్పిన మాత్రముచేగాని లేక యేదో గ్రంథములో చూచినంత మాత్రముచేగాని, ఈలాటికార్యము లన్నిటిని నమ్మరాదు. స్వయముగా పరిశోధన సలుపవలయును ఉత్కృష్ట శాస్త్రములను శోధింపవలయును స్వయం బుద్ధితో ఆలోచించుటకూడ జేయవలయును కావుననే ఈ శ్లోకమున నీలాగున వర్ణించడమైనది

మీనః స్నానపరః ఫణీ పవనభుఙ్మేషోఽస్తి పర్ణాశనః
నీరాశీ ఖలు చాతకః ప్రతిదినం శైలే బిలే మూషికః ।
భస్మోద్ధూలితవిగ్రహస్తు శునకో ధ్యానాధిరూఢో బకః
ఏతేషాం ఫలమస్తి కిం న హి న హి జ్ఞానం పరం కారణమ్ ॥

మత్స్యము ఎప్పుడు గంగాది తీర్థములయందే యుండును మంచి సర్పము వాయుభక్షణముచే జీవించును మేక లెల్లప్పుడు ఆకులనే భుజించును చాతకపక్షి వర్షజల బిందువులను మాత్రమే పానము చేయును. పందికొక్కులు ఎల్లప్పుడును కొండబిలములోనే నివాసము జేయును కుక్కలు దిగమ్బరులై బూడిదలోనే పరుండును కొంగలు ధ్యానపరులై మౌనముతో నుండును. గబ్బిలములు గుహలలోను దేవాలయములలోను చెట్టులలోను నిరన్తరము తలక్రిందుగా వ్రేలాడుచుండును

ఈ పై జెప్పిన వాటికన్నిటికిని నేదైన జ్ఞానముగాని, యోగసిద్ధిగాని గల్గెనా? లేదు లేదు కావున జ్ఞానమొక్కటియు, దైవభక్తి యొక్కటియు, భూతదయయు మాత్రమే ముక్తిని దైవప్రాప్తిని గలుగజేయునని వివేకవంతులు గ్రహింతురుగాక!

3 సామాన్య రసవంతములుగాని ఫలపత్రాదులను భుజించుచు వట్టి నీరును మాత్రము పానము జేయుచుండెడు కోతులకున్ను, మేకలకున్ను అంతవిషయ ప్రవృత్తి గల్గియుండగా మిక్కిలి సారవంతముగాను రసయుక్తముగాను నుండు పండ్లను భుజించుచు, ధాతుపుష్టిగల క్షీరమును గ్రోలుచు, చమురుగల బాదముకాయ, అక్రోటు, కిస్మిస్సు, కొబ్బరి, వేరుసెనగ, ద్రాక్ష, ఖర్జూరము మొదలగు వానిని తినుచుండువారికి బ్రహ్మచర్యము, ఆత్మజ్ఞానము అపక్వాహారముచే గలుగునని చెప్పుటకు నోరెట్లాడెనో దురూహ్యము అన్నములోను, గోధుమ రొట్టెలోను, కూరగాయలలోను పై జెప్పిన ఫల బీజములలో గల సారము లేదని విజ్ఞులందఱు నెఱింగియే యున్నారు ఇట్లు చెప్పుటచే అవక్వాహారము ఉపయోగకరము కాదని తలంచవలదు బ్రహ్మచర్యమునకు, మనస్స్వాస్థ్యమునకు కొంతమాత్రము సహాయము చేయును అని మాత్రము చెప్పగలను ఇక ఖర్చువిషయమై ఆలోచించిన అన్నము, రొట్టె, పప్పు, కూరగాయలు వగైరాలకన్న పై జెప్పిన పండ్లు వగైరాలకు ఖర్చు చాలా యధికము అయితే వంట చేయుపని మాత్రము ఒకటి తొలగి పోవును ఇదొకటిమాత్ర ముపయోగము కనబడుచున్నది కాని మఱియొక బాధ కూడా వచ్చుచుండును అదేమన కొన్ని స్థలములలో పండ్లు వగైరాలు దొరకవు ఆవుపాలున్ను ఆలాగుననే చిక్కవు అప్పుడు అదొక

ప్రతిబన్ధక మగును అన్నము గాని, రొట్టెగాని ప్రయాసములే కెచ్చుటను దొఱకును అయితే మంచి బియ్యపు అన్నముగాని గోధుమరొట్టెగాని శ్రేష్ఠములని తలంచపనిలేదు ఏ దేశములో నే ధాన్యము ఆ దేశ శీతోష్ణముల ననుసరించి పండుచుండునో ఆ అన్నము రొట్టెలు, ఆ దేహమునకు చాలును అనగా రాగులు (తైదులు, సోలులు) గాని, సద్దలు గాని, బరిగెగాని, సామలుగాని, జొన్నలుగాని, యేద్దైనను విరోధము లేదు శరీరమునకు కావలసిన బల, వీర్య, ప్రజ్ఞాదు లన్నియు సమానములుగానే యుండును. మొట్టమొదట ఆహారపు మార్పు గల్గునప్పుడు కొన్ని రోజులవరకు నేదో కొంతమార్పు గలిగినను గలుగవచ్చును అభ్యాసముచే మరల సమానతత్త్వములోనికి వచ్చును గోధుమలు శ్రేష్ఠములని తలంచినను ఉత్తర దేశమునకు దక్షిణ దేశీయులు వెళ్లునప్పుడు గోధుమరొట్టె శరీరమునకు పట్టక బాధపడు వారెందరో గలరు ఆలాగున మంచిబియ్యపు అన్నము పరమోత్కృష్టమని తలంచు వారుండినను, ఉత్తర దేశస్థులు దక్షిణ దేశములోనికి వచ్చునప్పుడు ఈ అన్నము పట్టక బాధపడుచుందురు ఈ రహస్యమంతయు పాదచారులై తీర్థయాత్ర చేయువారికి బాగుగా తెలియును

ఈ ఆహార విషయమై వాద ప్రతివాదములు చేసి కాలము గడుపక స్థూలమయిన ఆహారముతో తృప్తులై యుండక ధన్యులయితిమి అని నిశ్చయింపక, యికను ఒక మెట్టు పైకి వెళ్ళి చూచిన నీస్థూల దేహమును నడుపునది సూక్ష్మ దేహమని గోచరించును ఆ యథార్థములో జాగ్రత్త వహించనిచో నిదంతయు వ్యర్థమే యగును ఆ సూక్ష్మ దేహమున కాహార మిదికాదు అది సంకల్ప శరీరము. దానికి శుద్ధ సంకల్పము మాత్రమే సాత్త్వికాహార మగును అప్పుడే అది శక్తిమంతమగును అట్టిది నిర్మల సంకల్పముచేతను, జీవరాసులలో కరుణచేతను, బ్రహ్మచర్యముచేతను, దైవ భావనచేతను, జ్ఞానసాధనచేతను, పరప్రాణుల కుపకారము చేయు ప్రవర్తనచేతను, ఉత్తమ విద్యచేతను, కొంత శరీరపరిశ్రమచేతను, నియమితాహార విహారముల చేతను, తపస్సు వ్రతము మొదలగు వానిచేతను, శుద్ధపడవలసియున్నది. దీనియందు జాగ్రత్త వహింపకపోయిన సారథిలేని రథము వలెను, డ్రైవర్ లేని మోటారు వలెను,

చుక్కానిలేని పడవ వలెను ఇతని జీవితయాత్రగూడ నుండునని మరువ కూడదు మనస్సు చెడిన వానికి శరీరబల ముండినను ఏమిప్రయోజనము? యన్త్రముల యొక్క బాహ్యాభాగము లెస్సగా నుండినను, అంతరములోగల భాగములు చెడిపోయినను, సరిగా లేకపోయినను ఆ యన్త్రము దేనికిని పనికిరానట్లు, ఇట్టివారి జీవితముగూడ నుండునని మరువకూడదు ఇంతటితో మనపని పూర్తి యయినదని తలంచి ఆనందింపవలదు

ఏలన 1 స్థూలదేహము, 2 సూక్ష్మదేహము, 3 కారణదేహము అని దేహశబ్దము మూడు దేహములకున్ను సమానముగా వర్తించుచున్నది ఆలాగున (1) స్థూలశరీరము, (2) సూక్ష్మ శరీరము, (3) కారణశరీరమ్ము అని వినుచున్నారము కావున సూక్ష్మ శరీర శుద్ధివలె కారణ శరీర శుద్ధియు గలుగవలయు అది అవిద్యావిలయము మాత్రముచేతనే సిద్ధించును అవిద్య ఆత్మజ్ఞానమువల్లనే తొలగును స్థూల సూక్ష్మ దేహములకు కారణమగుట చేతనే దానికి కారణదేహమని పేరు వచ్చినది ఫల పుష్పపల్లవాదులతో గూడిన వృక్షములకు మూల మేలాగున కారణమగుచున్నదో, ఆలాగున ఈ స్థూల సూక్ష్మ దేహములకు హేతు భూతమగుటచేతనే దానికి కారణదేహమని పేరు వచ్చినది

మొదలు చెడిన వృక్షముయొక్క శాఖలను, ఉపశాఖలను, పత్రపుష్పాదులను ఎంత పోషించినను నేమి ప్రయోజనము? కావున అజ్ఞాన నివృత్తికొరకున్ను, జ్ఞానప్రాప్తి కొరకున్ను ప్రయత్నము జేయవలయును దీనియందు అజాగ్రత్త వహించిన ఇంజిన్ చెడిన యన్త్రాలయము వంటిదే యీ దేహముయొక్క స్థితిగూడ యని గ్రహించుకొనవలయును అగ్నిలో దహించి పోవున దగుటచే దేహమనియు, మట్టిలో జీర్ణమగుటచేత శరీరమనియు పేరు వచ్చినది ఈ స్థూలాగ్నిలో ఈ స్థూలదేహము దహించునేగాని సంకల్పశరీరము శుద్ధసంకల్పము చేతను కట్టకడకు నిస్సంకల్పత్వముచేతను రహితము గావలసియున్నది ఆలాగున కారణదేహము సర్వకారణ రూపమగు బ్రహ్మజ్ఞానము చేతను దహించును మఱి దేనివల్లను అది దహించునది కాదు



# ఆత్మశుద్ధి

బ్రహ్మచర్యవ్రతమునకు ఆత్మశుద్ధియున్ను ఒక ముఖ్యాంగముగ తెలిసికొనదగినది దీనిని శుచిత్వమనిగూడ సామాన్యముగా చెప్పుదురు దాని యందు మొట్టమొదటిది తానుండు స్థలము శుభ్రముగా నుండుట యగును దీనిని పంచశీలము అనిగూడ వచింతురు వానిలో 1 పై జెప్పిన తనయొక్క నివాస స్థల శుభ్రత యగును దాని నొక దానిని చూచుకొనిన అచ్చోట నుండువారు సోమరులా? లేక సోత్సాహంపరులా? అని గ్రహించు కొనవచ్చును సోత్సాహంపరు లైనచో, వారు వాసము జేసెడు ప్రదేశ మతి నిర్మలముగ నుండును అదియే దానికి గురుతు దీనినొకదానిని గాంచిన జాలును మరల అచ్చట నుండువారిని గురించి ఎక్కువ పరిశోధింప బనిలేదు ఇది బ్రహ్మచారుల నొకటిని గురించి మాత్రము గాదు యోగులకు, సాధకు లందఱికిన్ని సంబంధించినది 2 ఆత్మశుద్ధి గలిగనవారికి కనిపించిన దంతయు నిర్మలముగా నుండవలయును 3 చేయుకార్యముగూడ శుద్ధముగా నుండవలయు. లేనిచో వారికి మనశ్శాన్తియు, ప్రసన్నతయు గలుగదు. అదే ప్రకారము 4 ధరించెడు దుస్తులుగూడ అతి నిర్మలముగా నుండవలయును ఆలాగున తానుపయోగపరచెడు పాత్రాది వస్తువు లన్నియు శుభ్రముగా నుండవలయును అదేరీతిగా 5 సర్వేశ్వరుండొసగిన ఆహార మేదైనను శుభ్రముగా వండుటయును, భుజించునప్పుడు నిశ్శబ్దముగాను, నిర్మల భావముతోను నుండవలయును ధ్యానముచేయు స్థలము ఏలాగున నిర్మలముగా నుండవలయునని శాస్త్రమందు తెలుపడమైనదో అదే విధముగా భోజనము చేసెడు ప్రదేశము గూడ శుభ్రముగా నుండవలయును. అప్పుడే అతని మనస్సు ప్రసన్నత వహించి యుండును

పై జెప్పిన యన్నిటికిని మనోనిర్మలత లేనిచో నైజముగా నట్టి స్వభావ ముండదు మనస్సు శుభ్రముగా లేనిచో తన జప, ధ్యాన, యోగాదులున్ను, అధ్యయనమున్ను, తపస్సున్ను పూర్ణమగు ఫలము నీయజాలవు. ఈ విషయములో సాధకు లెల్లప్పుడును జాగ్రత్త వహించుకొనవలయును. లోకము మీ కడుపులో నేమున్నదో దానిని చూడదు. మీరు నివసించెడు స్థలమును, ప్రవర్తనమును

మాత్రమే చూచునని మీరు జ్ఞాపకములో నుంచుకొనవలయు. సామాన్యముగా విద్యావంతులు శ్రీమంతులు నివసించెడు ప్రదేశము, ధరించెడు వస్త్రాదులు చాలవరకు శుభ్రముగానే యుండును అదే ప్రకారము వారి యాహారము సాత్త్వికమై యుండిన వారి జీవితము ధన్యము. కళాయిలేని పాత్రయొక్క బాహ్యాభాగము శుభ్రవరచినను దానిలో వండిన పప్పు పులుసు మొదలయిన వెటుల నుపయోగపడవో, అట్లే హృదయశుద్ధి లేనివారి యనుష్ఠానములు గూడ సరియగు ఫలము నివ్వజాలవని వారు మరువకూడదు కావుననే శాస్త్ర మీలాగున చెప్పుచున్నది

**ఆచారహీనం న పునన్తి వేదా యద్యప్యధీతాస్సహ షడ్భిరంగైః ।**
**ఛన్దాంస్యేనం మృత్యుకాలే త్యజన్తి నీడం శకున్తా ఇవ జాతపక్షా : ॥**

నాల్గు వేదములు, వేదాంగములగు వ్యాకరణాదులు అనువాటిని అధ్యయనము చేసిన వాడయ్యును, ఆచారహీనుని ఆ వేదములు వేదాంగములు పవిత్రముగా చేయజాలవు అంతేగాదు రెక్కలు వచ్చిన పిమ్మట పక్షులు గూటిని వదలిపోవునటుల నీ వేద వేదాఙ్గము లన్నియు దేహావసాన సమయమున అతనిని వదలిపోవును

**శౌచం తు ద్వివిధం ప్రోక్తం బాహ్య మాభ్యన్తరం తథా ।**
**మృజ్జలాభ్యాం స్మృతం బాహ్యం భావశుద్ధి స్తదాన్తరమ్ ॥**

శౌచ మిరు తెగలుగ నున్నది. అది బాహ్యశుద్ధి యనియు, ఆత్మశుద్ధి యనియు పేర్లు గలది. మృత్తిక చేతను జలము చేతను గలది భాహ్యశుద్ధి యనియు, ఆత్మశుద్ధి ఆన్తరశుద్ధి యనియు తెలియనగును

**అనిమ్మల్మషచిత్తస్య సర్వతీర్థేషు మజ్జనమ్ ।**
**సరస్యాంగారకస్యేవ సదా క్షీరాభిషేచనమ్ ॥**

ఆత్మశుద్ధి లేనివాడు సమస్త తీర్థములలో స్నానమాచరించినను శుద్ధుడు కాజాలడు ఎట్లన ఆవుపాలలో బొగ్గును ఎన్ని సార్లు కడిగినను నలుపు పోయి ఎట్లు తెలుపు కాజాలదో, అతడున్ను అలాగుననే యుండును

**అన్తశ్శుద్ధివిహీనస్య బహిశ్శుద్ధిం కరోతి యః ।**
**అలంకృతస్సురాభాండ ఇవ శాన్తిం న గచ్ఛతి ॥**

ఆత్మ శుద్ధిలేనివాడై దేహమాత్రమ్మును శుభ్రపరచువాడు ఎప్పటికిని శుద్ధుడు కాడు కల్లుకుండ బయట ఎంత సుందరముగా నలంకరింపబడినను నెట్లు శుద్ధి కాజాలదో, ఆలాగున పై జెప్పబడిన వాడున్ను ఆత్మశుద్ధిని బడయజాలడు

**భావశుద్ధి విహీనానాం సమస్తం కర్మ నిష్ఫలమ్ ।**
**తస్మాద్రాగాదికం సర్వం పరిత్యజ్య సుఖీ భవేత్ ॥**

ఆత్మ శుద్ధి లేనివారి తపో, ధ్యాన, యోగ, యజ్ఞాది క్రియలన్నియు వ్యర్థములే కావున అన్తఃకరణములో గల రాగ ద్వేషాది పాప కార్యము లన్నిటిని పరిత్యజించిన సుఖమును పొందగలుగను

**మృదాం భారసహస్రైస్తు కుంభకోటిజలై స్తథా ।**
**కృతశౌచోఽపి దుష్టాత్మా చండాలసదృశస్స్మృతః ॥**

వేలకొలది టన్నుల మట్టిచేతను, కోట్లకొలది ఘటముల జలముచేతను దేహమును తోమి, గడిగి, మంచి వస్త్రాదులను ధరించినను, ఆత్మశుద్ధి లేనివాడు ఎప్పటికిని శుద్ధుడు కాడు వాడు ఘోర పాపకృత్యమును జేయు చండాలునితో సదృశుడు

**అనిర్జితేన్ద్రియగ్రామో యస్తు ధ్యానపరో భవేత్ ।**
**మూఢాత్మానం చ తం విద్యాద్ధ్యానం చాస్య న సిధ్యతి ॥**

ఇన్ద్రియముల నన్నిటిని విషయములనుండి నివృత్తి చేయక ఎవడైతే ధ్యానపరుడై యుండునో అట్టివానికి ధ్యానముచే గలిగెడు ఫలము సిద్ధించదు అట్టివానిని మూఢాత్మ డనియే తలంచవలయును

**ఆచారాల్లభతే హ్యాయురాచారాదీప్సితాః ప్రజాః ।**
**ఆచారాద్ధనమక్షయ్యమాచారో హ్యన్త లక్షణమ్ ॥**

ఆచారముచేత ఆయుస్సు వృద్ధి యగును ఆచారముచేత ప్రజలు తమ

సంకల్పము లన్నిటిని (కోరిన సంతతిని) బడయగలరు ఆచారముచేత తన ధనముగూడ అక్షయ మగును అనుష్ఠానముల కన్నిటికిని ఆచారము కట్టకడపటిది అనగా ముఖ్యలక్షణమగును

**భావదుష్టోఽమ్భసి స్నాత్వా భస్మనా చ న శుద్ధ్యతి ।**
**భావశుద్ధశ్చరేచ్ఛౌచమన్యథా న సమాచరేత్ ॥**

ఆత్మశుద్ధి లేనివాడు పుణ్య తీర్థములలో స్నానమాచరించి, భస్మముచే శరీర మంతయు పూసికొనినను, ద్వాదశత్రిపుండ్రములను ధరించినను శుద్ధుడు కాజాలడు. హృదయశుద్ధి గలవానికే బాహ్యశౌచము ఫలవంత మగును కావున ఆత్మ శుద్ధిలేని బాహ్య శౌచము బుద్ధిమంతు లెవరును చేయరాదు

**గంగాతోయేన సర్వేణ మృద్భారైః పర్వతోపమైః ।**
**ఆమృత్యోరాచరేచ్ఛౌచం భావదుష్టో న శుద్ధ్యతి ॥**

ప్రపంచములో గల గంగాది సమస్తతీర్థములతోను, పర్వతోపమ మృత్తికతోను మరణపర్యన్తము స్నాన మాచరించినను దుష్టాత్ముడు ఏ కాలమునకున్ను శుద్ధుడు కాజాలడు

**హసతా క్రియతే కర్మ రుదతా పరిభుజ్యతే ।**
**దుఃఖదాతా న కోఽప్యస్తి సుఖదాతా న కశ్చన ॥**

దుష్టుడు మహా సంతోషముతో పాపకర్మను జేయుచుండును అయితే ఆ కర్మము ఫలితమునకు వచ్చునప్పుడు దుఃఖముతో అనుభవించుచుండును. మానవునకు దుఃఖమునుగాని , సుఖమునుగాని గలుగజేయునది తన కర్మయేగాని మఱియొకడు కాడు

**స్వకర్మణా భవేద్దుఖం సుఖం తేనైవ కర్మణా ।**
**తస్మాచ్చ పూజ్యతే కర్మ సర్వం కర్మణి సంస్థితమ్ ॥**

మానవుడు స్వయముగ చేసెడు పాపకర్మఫలమే దుఃఖము ఆలాగున పుణ్యకర్మ ఫలమే సుఖము. అందువలన కర్మమునకే యాధిక్య మున్నది కావున

సుఖదుఃఖము లన్నియు తనయొక్క కర్మపై నాధారపడియున్నవి

**ఆచారేణ నరో దేవి సుఖిత్వముపజాయతే ।**
**అనాచారేణ పాపేన నాశం యాతి తథా ధ్రువమ్ ॥**

ఇది పరమశివుడు పార్వతీదేవి కుపదేశించినది ఓ దేవీ! పవిత్ర ఆచరణచే మానవుడు సుఖి యగుచున్నాడు ఆలాగున అనాచార పాపకర్మచే నాశముగూడ పొందుచున్నాడు. ఇది సత్యము

**కృషికారో యదా దేవి ఛన్నం బీజం సుసంస్థితమ్ ।**
**యాదృశంతు భవత్యేవ తాదృశం ఫలమశ్నుతే ॥**

ఓ పార్వతీ! వ్యవసాయము చేయువాడు ఎప్పుడైనను విత్తిన విత్తనము యొక్క ఫలమును ఎట్లు పొందుచున్నాడో, ఆలాగున నే విధమయిన కర్మను మానవుడు చేయుచున్నాడో దానికనుగుణమైన ఫలమును పొందుచున్నాడు

కావున కర్మయందు జాగ్రత్త వహించనిచో సుఖముగాని, జ్ఞానముగాని గలుగదని జ్ఞాపక ముంచుకొనవలయును చేదు విత్తనమునకు మధుర ఫల మెప్పుడైనా గలుగునా?

**ఆత్మానదీ సంయమ తోయపూర్ణా సత్యహ్రదా శీలతటా దయోర్మిః**
**తత్రావగాహం కురు పాణ్డుపుత్ర! న హ్యన్యథా శుద్ధ్యతి చాన్తరాత్మా ॥**

ఎట్టి తీర్థములో స్నాన మాచరించిన ఆత్మశుద్ధి గలుగునో ఆవిషయమై భీష్ముడు ధర్మరాజున కుపదేశించినది చూడుడు ఆత్మయను నది ఇంద్రియ సంయమమను జలముతో నిండినదియు, సత్యమనెడు లోతుతో గూడినదియు, మంచిశీలమను గట్టులతో గూడినదియు, దయ యనెడు అలలతో గూడినదిగా నుండును ఆత్మధ్యాన మనెడు (ఆత్మజ్ఞాన) నదిలో స్నానమాచరించిన మాత్రమే పాపవిమోచనము గల్గి అంతరాత్మ శుద్ధ మగును. ఓ ధర్మరాజా! అంతరాత్మ శుద్ధమగుటకు మఱి యేయొక యుపాయమున్ను లేదు ఇదే ప్రకారము జ్ఞానమార్గములోను ఒక శ్లోకము గలదు

**ధ్యానహ్రదే జ్ఞానజలే రాగద్వేష మలాపహే ।**
**యస్స్నాతి మానసే తీర్థే స యాతి పరమాం గతిమ్ ॥**

ధ్యానమనెడు మడుగులో రాగ ద్వేషములు లేని జ్ఞానమను తీర్థమందు నెవడు స్నానమాచరించునో అట్టి వాడు పరమ పవిత్రుడై సర్వోత్కృష్టమయిన బ్రహ్మపదమును పొందును

**యత్కర్మ సుకృతం ప్రోక్తం మనోవాక్కాయసంభవమ్ ।**
**తత్తు కర్మాన్తరం హన్తి మనోవాక్కాయసంభవమ్ ॥**

మనో వాక్కాయములచే నేదైన పాపకర్మను చేయుచుండిన, మనో వాక్కాయములచే చేయబడు పుణ్యకర్మలచే పైన తెలుపబడిన పాపకర్మ నశించును మనోవాక్కాయములచే నిదివరలో నేవేమి పాపకర్మను చేసియున్నామో మనకు తెలియదు కావున మనోవాక్కాయములచే నిరన్తరము పుణ్యకర్మనే చేయుచుండవలయు అట్టి సత్కర్మజేసి తరించుటకు కాలమును నిరీక్షించి యుండరాదు తలంచినప్పుడే చేయుచుండవలయును

**శాన్తే సముద్రకల్లోలే స్నాతుమిచ్ఛతి దుర్మతిః ।**
**తథైవ శాన్తే సంసారే జ్ఞానమిచ్ఛతి మూఢధీః ॥**

సేతుస్నానమునకు వెళ్ళినవాడు అలలు శమించిన తర్వాత స్నాన మాచరించవలయునని తలంచి పగలంతయు కూర్చొనియుండిన నేలాగున సూర్యుడస్తమించి అన్ధకారమైపోవునో ఆలాగున సంసార సంబంధములయిన పనులన్నియు శాంతించిన పిమ్మట జ్ఞానానుష్ఠానములలో ప్రవేశింపవచ్చునని తలంచువాని జీవితముగూడ వ్యర్థమైపోవును సముద్రములో జలముండువరకు కల్లోలము లెటుల శమింపవో, ఆలాగున సంసార ముండువరకు శాన్తి మానవునికి లభించదు

**యావత్స్వస్థమిదం శరీరమరుజం యావజ్జరా దూరతో**
**యావచ్చేన్ద్రియశక్తిరప్రతిహతా యావత్క్షయో నాయుషః ।**
**ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్**

సందీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః ॥

ఎంతవరకు ఈ శరీరము రోగముచే పీడింపబడక ఆరోగ్యము గల్గి యుంటున్నదో, ఎంతవరకు జరానెరాదులచే బాధింపబడక యుండునో, ఎంతవరకయితే కర చరణ కర్ణ నేత్రాదీన్ద్రియముల శక్తి క్షయింపక యుండునో, ఎంతవరకు ఆయుః క్షయము గలుగక యుండునో అట్టి సమయము లోపలనే బుద్ధిమంతుడు ఆత్మ శ్రేయస్సుకొరకు గొప్పప్రయత్నము చేసికొనవలయును అట్లుకాక వార్ధక్యాగ్నిచే శరీరము తపించునప్పుడు జ్ఞానమవలంబింప వచ్చునని తలంచి మోసపోయిన, కొట్టము కాలునప్పుడు నిప్పును చల్లార్చుట కొఱకు నూయి త్రవ్వుటకై ప్రారంభించిన వాని పని యెట్టిదో అట్టి స్థితియే పై జెప్పినవానికి గలుగును. ఈ విషయమై ఇంకను భర్తృహరి జెప్పినది జూడుడు -

ఆయుర్వర్షశతం నృణాం పరిమితం రాత్రౌ తదర్ధం గతం
తస్యార్ధస్య పరస్య చార్ధమపరం బాలత్వవృద్ధత్వయోః ।
శేషం వ్యాధివియోగదుఃఖసహితం సేవాదిభి ర్నీయతే
జీవే వారితరఙ్గ చఞ్చలతరే సౌఖ్యం కుతః ప్రాణినామ్? ॥

మనుజుల కాయుఃపరిమితి నూరు సంవత్సరములు అందుసగము(యాభై ఏండ్లు) నిద్రలో పోవును మిగిలిన యాభై యేండ్లలో పసితనము, ముసలితనము, వీటిలో ఇరువదియైదు వత్సరములు గడచును రోగములతోను నెడబాటుతోను దుఃఖములతోను నిండిన తక్కిన యిరువదియైదు సంవత్సరములు పొట్టకై సేవాదిపనుల జేయుటలోను గడిచిపోవును మఱియు నీ జీవితమన్ననో నీటియలలవలె అతి చంచలమైనది ఇట్లుండ ప్రాణికోట్లకు సౌఖ్య మెక్కడిది? అనగా జ్ఞానసంపాదనకై సమయ మెచ్చట?

ఈ నూరుసంవత్సరముల జీవితము కృతయుగమునకు సంబంధించినది త్రేతాయుగమున 80 సంవత్సరములు, ద్వాపరమున 70 సంవత్సరములు, కలియుగమున 60 సంవత్సరములు మాత్రమే యేర్పడినది ఒక వేళ గృహస్థ బ్రహ్మచర్యము, ఆహార నియమము, మనశ్శాన్తి యివి గలిగియుండిన 60 సంవత్సరములకన్న కొంత ఎక్కువకాలము జీవించినను కార్యనిర్వహణశక్తి

యప్పుడుండదు ఈలాగున కలియుగ ప్రమాణ ప్రకారము జూచిన 15 సంవత్సరములే మిగులును వానిలోనే యీ సంసార నిర్వహణ కార్యములన్నియు చూడవలయును ఇక మానవునికి దైవకార్యము చేయుటకై కాలమెచ్చట?

**భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయం**
**మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయా భయమ్ ।**
**శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కాయే కృతాన్తాద్భయం**
**సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్యమేవాభయమ్॥**

భోగపరత్వముచే రోగభయము, సత్కులమందు పుట్టిన నెప్పుడు దానికి హానికలుగునో యని భయము, ధనవంతు లయినచో రాజులచేతను చోరులచేతను భయము, గౌరవస్థితిలో నుండిన దీనత్వము వాటిల్లునేమో యని భయము, మంచి శాండో వంటి శరీరబలము గలవానికి శత్రువుచే ఓడిపోవుదునేమో యని భయము, మంచి సుందర శరీరముండిన జరానెర లెప్పుడు బాధించునో యని భయము, పండితుడైనచో ప్రతివాదులచే భయము, సద్గుణములు గలవాడని తలంచిన వానికి దుర్మార్గునిచే భయము, సౌష్ఠవ శరీరము గలిగిన మృత్యుభయము ఇవన్నియు విచారించిచూచిన మానవునకు అంతయు నేదేనొక విధమగు భయముతో గూడియే యున్నది వైరాగ్య మొకటిమాత్ర మభయమును గలుగుజేయునది

శ్రీశంకరాచార్యులున్ను ఈలాగుననే వచించిరి

**బాలస్తావత్ క్రీడాసక్తస్తరుణస్తావ త్తరుణీసక్తః ।**
**వృద్ధస్తావచ్చిన్తాసక్తః పరమే బ్రహ్మణి కోఽపి న సక్తః ॥**

బాల్యావస్థలో ఆటలచేతను, యౌవనావస్థలో నారీమణులతోను, వృద్ధావస్థలో శరీర పటుత్వము లేకపోవుటచేతను, సరిగా చూచువారు లేకపోవుటచేతను, జీవితమేలాగున గడచునోయని చింతచేతను - జీవితమంతయు నీ లాగున జరుగుచుండగా పరమాత్మ ధ్యానముచేసి జీవులు తరించుటకు సమయమెక్కడ? విశేష పుణ్యఫలముచేత మాత్రమే అన్తఃకరణములోగల పాపము నశించి

ఆత్మజ్ఞానము పొందవలయునని తలంపు గలుగును పాపముండువరకు ప్రాణికోట్లకు అట్టి సంకల్పమే గలుగదు ఒకవేళ తరించవలయునను సంకల్పము దైవకృపచే పుణ్యకర్మపరిపాకముచే గలిగినను అందరు తరించజాలరు

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥**

వేలకొలది మనుష్యులలో పూర్వపుణ్య శేషముచే నొకానొకడు మాత్రమే ఆత్మజ్ఞానముకొరకు ప్రయత్నము జేయుచుండును ఆలాగున ప్రయత్నము జేయు వేలకొలదిగ నుండువారలలో ఒకడు మాత్రమే కొసవరకు దృఢప్రయత్నము గలవాడై యుండును అట్టి దృఢ ప్రయత్నముగల వేలకొలది జనులలో ఒకడు మాత్రమే శుద్ధాత్ముడై బ్రహ్మతత్త్వమును నున్నది యున్నట్లెఱింగి ముక్తిని పొందగలుగును తక్కినవారు ఏదో కారణాన్తరముచే మధ్య మధ్య యాగిపోవుదురు అయినను అనుష్ఠించినది వ్యర్థము గాదు మఱియొక జన్మములో అది సహాయపడి యున్నత మార్గమునకు తీసికొని వెళ్లును ఇదియే గీత ఆరవ యధ్యాయమున నిరూపింపబడినది

**పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః**

ఆ యోగభ్రష్టుడు విషయసౌఖ్యములకు లోబడి యున్నవాడైనను అట్టికొరతపడిన అభ్యాసవాసనావశముచే విషయములనుండి దైవముఖు డగును అనగా వైరాగ్యవంతు డగుచున్నాడు కఠోపనిషత్తున్ను ఆలాగుననే తెలుపుచున్నది

**శ్రవణాయాపి బహుభిర్యో నలభ్యః**
**శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః ।**
**ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా**
**ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ॥**

వేలకొలది జనులలో శమదమాది గుణములు గల్గి చక్కగా నాత్మను శ్రవణము జేయువా డొక్కడైనను దొరకుట అరుదు. ఆలాగున శ్రవణార్హత గలిగినవార లనేకులలో ఒక్కడైనను దృఢప్రయత్నపరుడై మననము

జేయువాడరుదు ఈ ఆత్మను స్వానుభవము గలిగి బోధించువాడును అరుదు బోధింపబడినను, నిదిధ్యాసపర్యన్తము ఆయనుష్ఠాము గలవాడును అరుదు వాసిష్ఠముగూడ ఈలాగుననే తెలుపుచున్నది

**సహస్రేభ్యః సహస్రేభ్యః కశ్చిదుత్థాయ వీర్యవాన్ ।**
**ఛినత్తి వాసనాజాలం పఞ్జరం కేసరీ యథా॥**

వేలాదివేలు జనులలో విద్యావంతుడై వీర్యవంతుడై ధీరుడై యొకానొకడు మాత్రమే భవసాగరమునుండి లేచి సంసారవాసనయను వలను ఛేదించి బయటపడుచున్నాడు ఏలాగున ననగా బోనులో పడిన అనేక జంతువులలో నొకానొక పరాక్రమశాలియగు సింహముమాత్రమే పంజరమును చేధించి బయటపడు చుండును లేక వలలో చిక్కుకొనిన మత్స్యములలో ఒకానొక కత్తివంటి ముండ్లు గల చేప మాత్రము వలను ఛేదించి బయటపడును తక్కినవి మృత్యువువాత బడుచున్నవి శ్రీ శంకరులు ఉపదేశించినది చూడుడు

**శ్రుతేశ్శతగుణం విద్యాన్మననం మననాదపి ।**
**నిదిధ్యాసం లక్షగుణమనన్తం నిర్వికల్పకమ్ ॥**

వేదాన్త శ్రవణముకంటె మననము నూరింతలు ఎక్కువ యనియు, ఆ మననముకంటె నిదిధ్యాసనము లక్షంతలెక్కు వనియు, నిర్వికల్ప సమాధి యింతయని లెక్కలేనిది యనియు తెలియవలెను ఇప్పుడు ప్రపంచములో వేదాంతశ్రవణము జేయువారు కొంతమంది యుండినను మననము, నిదిధ్యాసమున్ను జేయువారు చాల అరుదైనందుచే వృత్తిరాహిత్యము గలుగక పూర్వమహర్షులస్థానము పొందక పోవుచున్నారని గ్రహించుకొనవలయును కఠోపనిషత్తు తెలిపినది చూడుడు -

**నావిరతో దుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః ।**
**నాశాన్తమానసోవాఽపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్॥**

నిషిద్ధమయిన పాపకర్మమునుండి విరమింపనివాడు ఈ ఆత్మను పొందజాలడు ఇన్ద్రియ చాపల్యము గలవాడు ఈ ఆత్మను పొందజాలడు

# పీఠిక

గృహస్థాశ్రమ ధర్మ రూపముగ ఈ గ్రంథము వ్రాయుటకు కారణమేమన, ఈ ఉపాధి తిరుపతి కొండలో తపమొనరించెడు కాలమున బిచ్చగాండ్ల పిల్లలు యాచనా వృత్తిలో జీవించుచు విద్యయు, సంస్కారము గూడ లేనివారలై యుండుట వలన ఈ పిల్లల జీవనము వ్యర్థమైపోవుచున్నదను తలంపు కలుగుటచేతను, వీరి జీవితములో సుఖజీవనము గడచుమార్గము లేకపోవుట చేతను, బిచ్చగాండ్ల కెప్పుడో ఒక సమయమున ఎవరో అన్నదానము చేసినప్పుడు మాత్రమే కడుపునిండుగ అన్నము దొఱకునుగాని తక్కిన దివసము లన్నియు దుఃఖముతో గడుపవలసిన వారగుటచేతను, దుర్గుణములే ఎక్కువగా గలవారగుటచేతను, వారింజూచి జాలిగలిగి ఉచిత విద్యాభ్యాసముకొఱకు రాత్రి పాఠశాల నొకదానిని ఏర్పాటు చేయడమైనది ఆ తరుణమున శ్రీ వేంకటేశ్వర దేవాలయమునకు, శ్రీహత్తీరాంబావాజీ మఠమునకు అధికారిగా నుండిన రామలక్ష్మణదాస్ బావాజీగారును, దేవస్థానము పారుపత్తెదారగు శ్రీలక్ష్మీనృసింహ రావుగారును ఈ ఉపాధియందు చాలా విశ్వాసము గలవారగుటచే రాత్రి పాఠశాలకు వేయికాళ్ళ మండపమున తగిన యేర్పాట్లన్నియు జేసిరి ఇద్దరు ఉపాధ్యాయులను గూడ ఏర్పాటు చేసినారు సాయంకాలము ఆరుగంటలనుండి రాత్రి తొమ్మిది గంటల వరకు ఎలిమెంటరీ స్కూలు రూపముగా ఏర్పాటు చేయడమైనది క్రమముగా వారము రోజులగునప్పటికి 43 మంది బిచ్చగాండ్ల విద్యార్థులు ఏర్పడిరి వారిలో శ్రద్ధతో జదువువారికి రాత్రి భోజనము దేవాలయ ప్రసాదమునుండి ఏర్పాటు గావింప నిశ్చయించిరి

ఆవిద్యార్థులకు కొన్ని సామాన్య నియమములు గూడ ఏర్పాటు చేయబడినవి అవి యేవన 1 ప్రతి దినము సకాలమునకు పాఠశాలకు రావడము, 2 సాధ్యమగు నంతవరకు శుభ్రముగా నుండడము, 3 పాఠములను ప్రతిదినము అప్పజెప్పుటయు, 4, బీడి, బాంగు, గంజాయి మొదలగు మత్తు వస్తువులను ఉపయోగించక యుండడము- అని మాత్రము ఏర్పాటు చేయడమైనది. పుస్తకములు, పలకలు ఉచితముగా నిచ్చు ఏర్పాటు నుండెను పై చెప్పిన ప్రకారము నడచువారికి వస్త్రములు గూడా ఇవ్వబడునని తెలుపడమైనది

పై చెప్పిన నియమములు ఏర్పడినప్పటినుండి క్రమముగా ఒక్కొక్కరు పాఠశాలకు రాకుండ నిలిచిపోవుటకు ప్రారంభించిరి మూడు నెలలు అగునప్పటికి నలుగురు పిల్లలు మాత్రము మిగిలిరి అందుచే ఆ యుద్యమముచే ప్రయోజనము లేదని తలంచి నిలిపివేయడ మయినది తరువాత గోగర్భ గుహాయందు తపమొనర్చెడు స్థలమున నలుగురు బీదవిద్యార్థులకు సంస్కృత శబ్దములు (శబ్దమంజరి), రామోదంతము మొదలగు నవి స్వయముగా నేర్పుటకు ప్రారంభించడ మాయెను వీరు పైజెప్పిన బిచ్చగాండ్ల విద్యార్థులకన్న విలక్షణులు, గృహస్థాశ్రమములో నుండువారు అంతకు పూర్వమే వీరికి తెలుగు సుమారుగ చదువుటకు, వ్రాయుటకును వచ్చియుండెను వీరికి భోజన పుస్తక వస్త్రాదు లన్నియు అచ్చటనే ఏర్పాటు చేయడమైనది

వీరికిని కొన్ని నియమములు ఏర్పాటు చేయబడినవి 1 ఎవరిని యాచింపకూడదు, 2. యాచకులగు పిల్లవారితో చేరకూడదు, 3 ప్రతిదిన పాఠములను మరురోజున అప్పజెప్పవలయును, 4 శుభ్రమగు వస్త్రాదులు గల్గి యుండవలెను, 5. అసత్యము చెప్పరాదు, 6 ప్రాణికోట్లయందు కరుణ గల్గియుండవలెను, 7 ఆశ్రమమునకు వచ్చెడి వారిని ఆదరించవలెను, 8. ఇతర స్థలము లోనికి వెళ్లి ఏలాటి వస్తువులను కొని తినరాదు ఈలాటి కొన్ని స్వల్ప పవిత్రధర్మములు ఉపదేశించడ మైనది ఇంతమాత్రము స్వల్ప ధర్మములైనను నిర్వహింపజాలక వారు తిరువతి యాత్రకు వచ్చెడు శ్రీమంతులు,సేట్లు చేయు దానములు తీసికొనుటకు ఆశ్రమములో నుండు ముఖ్యులకు తెలియక వెళ్ళుటకు ప్రారంభించిరి. ఆశ్రమమునకు వచ్చెడి భక్తులను రహస్యముగ డబ్బు అడిగి తీసికొని దుకాణమునకు వెళ్లి ఫలహారములను కొని తినుటకు ప్రారంభించిరి మరియు అప్పుడప్పుడు వీరికి మలేరియా జ్వరము కూడ తగులుచుండెను. అప్పుడు ఈ వృత్తియు గూడ మంచిది కాదని తలంచి ఉపేక్షించడమైనది

తరువాత దైవ కరుణవల్ల శ్రీవ్యాసాశ్రమము ఏర్పడినప్పుడు మొట్టమొదట చాలమంది విద్యార్థులను ఉచిత భోజనాదులతో చేర్చుకొనడమైనది. వారికిని పైజెప్పిన నియమములు ఏర్పాటు చేయుడమైనది. కొందరు మాత్రము

పైనియమములను సరిగా పాటింపక పోవుటచేతను, కొద్దిరోజులు ఆశ్రమ పాఠశాలలో చదువుచు చెప్పకనే ఇంటికి పారిపోవుటచేతను, దీనికారణమేమై యుండునో యని దీర్ఘముగ ఆలోచించడమైనది ఏలనన ఆశ్రమములో సకాలమున భోజనము, పవిత్రమగు సంస్కృత విద్యాభ్యాస సౌకర్యమును కలదు. ఈలాంటి పుణ్య స్థలమును త్యజించి బీద పిల్లలింటికి వెళ్లినను అచ్చట సరిగ భోజనము దొరకకయు, పశువులను మేపుట, లేక యేదైన కూలిపనికి పోవుటయో, లేక యెవరైన ధనవంతు లుండిన వారింటిలో ఏదైన పనికొరకు చేరుటయో తప్ప ఏమియు ఉన్నతిగతి, మార్గము లేకపోయినను, అదే ఆ బాలురకు సౌఖ్యముగ దోచుటకు కారణమేమై యుండునని ఆలోచించుటకు ప్రారంభించితిని

అప్పుడు ఈ క్రింది విధముగ గోచరించినది అదేమన పుణ్య సంస్కారము లేనందుచేతనే పుణ్యాశ్రమమున నిలువక పోవుటయును, ఉత్కృష్టమైన విద్యనభ్యసించక పోవుటయును, సత్య ధర్మములను ఆదరింపకపోవుటయును, దైవమందు విశ్వాసము లేకపోవుటయును జరుగుచున్నదని గ్రహించుకొనడ మైనది ఐతే పుణ్యసంస్కార జీవులను పుట్టించుటకు ఉపాయమేమి? దానికి పుణ్యాత్ము లగు తల్లిదండ్రులు కావలెను అటులైన మాత్రమే ఈ కార్యము సాధ్యమగునని నిశ్చయించుకొనడమైనది అదెట్లు సాధ్యమగునని ఆలోచనలో నుండగా ఛాందోగ్యోపనిషత్తునందు పంచాగ్ని విద్యను గురించి చెప్పునప్పుడు అట్టి పంచాగ్ని విద్యలో ఉత్తమ దంపతులు ఋతుకాలమున చేరుటయు ఒక యజ్ఞమని కనిపించినది ఆ విధానము లన్నియు ఛాందోగ్యోపనిషత్తులో కనుగొనవచ్చును.

మరియు ఉత్కృష్ట సంతానము గల్గుట కొరకు మనుస్మృతి యందు వివాహధర్మముల యొక్క ఏర్పాటు కలదు. ఆ వివాహ ధర్మములు ఎనిమిది విధములుగానున్నవి వానిలో 1 దైవము, 2 బ్రాహ్మము, 3 ప్రాజాపత్యములను మూడు విధములైన వివాహములలో మాత్రమే ఉత్తమ సంతానము ఏర్పడునని కలదు తక్కిన ఐదు విధముల వివాహములలో రాక్షస పైశాచిక వివాహములు నీచములు వానివల్ల కల్గు సంతతులు నికృష్టులై యుందురని చూడడమైనది. ఆ వివాహ ధర్మ మంతయు మనుస్మృతిని గురించి వ్రాసే స్థలమున చూడందగినది

దివ్య జ్ఞాన సమాజమును వృద్ధిలోనికి తెచ్చిన శ్రీ అనిబిసెంట్ అమ్మగారి ఉపన్యాసములో దీనిని గురించిన ఒక గాధ కలదు అదేమన ఉత్తమ సంతానము కల్గవలసి యుండిన మాతాపితరులును ఉత్తమ సంస్కారము గలవారై, దైవనిష్ఠ గలవారై, కరుణార్ద్ర హృదయము గలవారై యుండవలయునని ఉద్ఘోషించి యుండిరి మరియు ఈ యుగమున దివ్య జ్ఞానము గలుగజేసికొనుటకు కొందరు పుణ్యజీవులు భూలోకమున జన్మించుటకు దివ్యలోకమున ఉత్సుకులై యున్నారనియు, శ్రేష్ఠమగు గర్భవాసమునందే వారు జన్మింతురనియు, కావున లోకోద్ధారకులై దైవజ్ఞానసంపన్నులైన సంతానములను కోరుచుండు ప్రతి మాతాపితరులును పుణ్యప్రవర్తనము గల్గి దివ్య జ్ఞానసమాజమున చెప్పిన పద్ధతుల ప్రకారము అనుష్ఠానము కల్గియుండవలెననియు దెలుపబడెను అది విన్నప్పుడు ఏమియో యని తలంచడమైనది అందువల్ల దానియందు శ్రద్ధ యుంచలేదు ఇప్పుడు ఛాందోగ్యోపనిషత్తునందు పంచాగ్ని విద్యను చూచినపుడు అనిబిసెంట్ అమ్మగారు చెప్పినది సత్యమని బోధము కల్గినది

నూతన సంస్కారము నొందిన ఆర్య సమాజస్థులు గూడా ఈ వివాహ ధర్మమును చాలా పవిత్రమైనదిగ తలంతురు ఆర్యమతస్థులును, సిక్కు మతస్థులను ఎంతో భక్తితో వివాహ ధర్మమును జరుపుదురు దానిని చూచిన తెలిసి కొనవచ్చును మనుస్మృతియు ఈ ధర్మమునే చాల గొప్పగ దెలుపుచున్నది కావున వివాహాది కార్యములన్నియు శాస్త్రోక్తముగ అగ్ని హోత్రము, వేదమంత్ర పఠనము, బ్రహ్మనిష్ఠుల యాశీర్వాదము, వివాహవ్రతము- వీటితో కూడియుండుట మంచిదిగాని అట్లుగాని స్వేచ్ఛా విహార వివాహము అంత మంచిది కాదు. వేదవిధి ప్రకారము చేసిన వివాహములో మాత్రమే ఉత్తమ సంతానము కల్గును.

అయితే అర్థరహితమైన బాహ్యకార్య కలాపములు గాని, ఎక్కువ రోజులు వివాహముకొరకు కాలము వృధాగా వినియోగించుటగాని అవసరము లేదు. ఒక్కరోజులోనే వివాహకార్యము లన్నియు పూర్తి గావలయును. కాని అగ్ని కార్యము, వేద మంత్రము, బ్రహ్మనిష్ఠుల ఆశీస్సు మొదలగు ఆత్మశుద్ధి కార్యము లుండవలెను

అట్లయిన మాత్రమే దంపతులకు పరస్పర విశ్వాస ముండును ఏలన అగ్నిసాక్షిగాను వేదమంత్రములతోను, బ్రహ్మనిష్ఠుల యాశీర్వాదముతోను, దైవసాక్షిగాను గూడిన ఈ వివాహబంధమును అతిక్రమించ కూడదని ఒక గాఢమగు భావబంధము గలిగియుండును అట్లు గాక ఇష్టానుసారము అయినచో ఇట్టి విశ్వాసమునకు కారణము లేకపోవుట వల్ల స్వేచ్ఛావర్తనము గల్గి ఇష్టము లేనిచో ఇష్టము వచ్చినట్లు వదలిపోవుటయు తటస్థించును కావుననే ఏ మతము వారైనను వివాహ ధర్మమును ఏర్పాటు చేసికొనడ మైనది.

అయితే విధి ప్రకారము వివాహము చేసికొనిన వారందరును ఆలాగున సత్యముగా ఉంటున్నారా? అని అడుగవలదు ఉండుటకొరకే అట్లు ఆర్యులు ఏర్పాటు చేసిరి ఉండకపోయినచో దానివల్ల కలిగెడు ఫలము వారే పొందగలరు సతికి ఎంత పాతివ్రత్య ధర్మము శాస్త్రమున చెప్పబడెనో పతికి కూడా సతియందు అట్టి ఏకపత్నీ వ్రతమును చెప్పక పోలేదు కనుకనే శాస్త్రములో భార్యను అర్ధాంగి అని తెలుపుట, అనగా పురుషునియొక్క యెడమ భాగమగు అర్ధ శరీరము భార్యదనియు, స్త్రీయొక్క కుడిభాగమగు అర్ధ శరీరము పురుషునిదనియు నిర్వచించుటకు కారణమైనది

ఇప్పుడు లోకమున నూతనముగా రెండు పద్ధతులు గలవు 1 దివ్య జ్ఞాన సమాజము, 2 దివ్యజీవన సమాజము మొదటిది అనిబిసెంటమ్మగారిది రెండవది డాక్టరు శ్రీ శివానన్దస్వామి గారిది మూడవదిగా దివ్య జననమను పేరుతో గూడా ఒక సంఘముండిన బాగుండునని తలంచడ మైనది దీనికి మన గృహస్థాశ్రమ భక్తులగు పుణ్యదంపతులు పూనుకొనవలయును భావికాల సౌభాగ్యము లన్నియు భావిసంతానములపై ఆధారపడియున్నవి ఈ భూలోకోద్ధరణమునకును, ఆత్మలోకోద్ధరణమునకును తగిన బిడ్డలను కనెడు భారమంతయు గృహస్థాశ్రమములో నుండు మన పుణ్య దంపతులపై ఆధారపడి యున్నది. నియమబద్ధులగు గృహస్థాశ్రమస్థు లైనచో ఇది అంత ప్రయాసమైన పని గాదు.

ఈ దివ్య జనన సంతానమునకు 1 గృహస్థబ్రహ్మచర్యము, 2 మంత్ర దీక్ష, 3 అపరిగ్రహము, 4 నియమితాహారము అనగా నియమిత కాలములో

మాత్రము భుజించుట అను నియమములు గలవు ఆ ఆహారమును సత్యార్జన ధనముతో, శుద్ధమైన వస్తువుతో యుక్తముగా భుజించవలయును. వస్తువు మాత్రము సాత్త్వికమైన చాలదు అది వచ్చే మార్గము గూడా సత్యమైనదిగ నుండవలెను. ఇదివరలో నిట్టి నియమము పాటించని వారైనను ఇప్పటి నుండియైనను ఆచరించవలెను ఈ నియమములో దంపతు లిద్దరును సమాన భావము గలిగి యుండవలయును ఇక ఈ విషయమై చాలా ఏర్పాట్లు గలవు అవి ఇప్పుడారంభించలేదు. బాలురకు గురుకులమును, బాలికలకు కన్యాగురుకులమును, దానికి తగిన సంస్థయు, నిర్వాహకులును ఉండవలయును మంత్ర దీక్ష పొందిన పదిమాసముల కావల పుట్టిన బిడ్డలను అయిదు సంవత్సరముల వరకు మాత్రమే మాతా పితరుల దగ్గర ఉంచవలెను తరువాత వారు గురుకులమున చేర్చుకొనబడుదురు. తక్కిన పిల్లలను ఎంత ధనమిచ్చినను చేర్చుకొనరు తమతమ బిడ్డలకు కావలసిన ధన సహాయము చేసికొనవచ్చును

విద్యయు, అనుష్ఠానముమ పూర్తియగువరకు బిడ్డలను ఇంటికి పంపుట లేదు వారిని ఆశ్రమములో పోయి చూచుకొనవచ్చును ఈ మంత్ర సంస్కారము ప్రకారము వుండుటకు ప్రయాసమని ఎప్పుడు తోచునో అప్పుడు ఆ స్త్రీపురుషులు గురుకులము వారికి తెలిపి మానుకొనవచ్చును. కాని తరువాత పుట్టిన బిడ్డలను గురుకులమున చేర్చుకొనరు గురుకులమున నుండి బాలబాలికలు విద్యయు, సాధనమును పుర్తియైన తరువాత యావత్కాలము ఉండవలయునని తలంచిన ఆలాగున బ్రహ్మచర్యవ్రతముతో విరక్తాశ్రమములో నుండవచ్చును అట్లు పవిత్రముగా బ్రహ్మచర్యము సలుప సాధ్యము కాదని తోచినచో వివాహము చేసికొనవచ్చును అయితే అట్టివారు గురుకులమున నుండుటకు సాధ్యము కాదు ప్రత్యేకముగా నుండవలెను వీరుకూడా మంత్రదీక్షను పొంది గృహస్థబ్రహ్మ చర్యమును అనుష్ఠించిన వీరి సంతానమును గురుకులమున చేర్చుకొనెదరు ఇది గురుకులమున నుండెడు బ్రహ్మచారులకు, బ్రహ్మచారిణులకు సంబంధించిన దివ్యజనన సంఘమునకు సంబంధించినదిగా నుండును తక్కిన గురుకులము మామూలు గురుకులమువలె విద్య పూర్తియగు వరకుండి తరువాత వారి వారి యిష్టానుసారముగా శాస్త్రోక్తముగ పవిత్రమగు గృహస్థాశ్రమమును పొందవచ్చును.

ఇక ఈ పవిత్ర ధర్మము పూర్ణముగా నెరవేరుట కేమేమి ధర్మములు చేర్చవలసి యుండునో, అట్టివి విజ్ఞులు, దేశాభిమానులు, భారతజనోద్ధరణయందు ప్రీతి గలవారు వ్రాసి పంపిన ప్రేమతో అందుకొని మరుముద్రణమున చేర్చబడును విజ్ఞు లెల్లప్పుడును రాజహంస నీరమును త్యజించి క్షీరమును గ్రహించునట్లు త్యాజ్య విషయ ముండిన త్యజించి సారమును గ్రహించ ప్రార్థన

మరియు నీ గ్రంథము ఆమూలాగ్రముగా చదివిన తరువాత మాత్రమే వారివారి అభిప్రాయము లను నిశ్చయించుకొన వలసియుండును అట్లుగాక యేల గృహస్థాశ్రమమును గురించి యీలాగున వ్రాసిరి? సన్న్యాసాశ్రమమును గురించి ఇట్లు చెప్పిరి? ఈలాటి తలంపు గలుగువచ్చును క్రొత్తగా ఒకదేశమునకు వెళ్ళినవాడు అచట ఆరు ఋతువులతో గూడిన ఒక సంవత్సర ముండిన మాత్రమే ఆదేశ శీతోష్ణాది విషయములను తెలిసికొనుటకు సాధ్యమగును గదా! అట్లుగాక వర్ష, గ్రీష్మ, హేమంతాది ఋతువులలో నెప్పుడైనను వెళ్ళిన నిరంతరము వానగాని, లేక తీవ్రపు టెండగాని లేక అపరిమితమైన మంచుగాని ఈ దేశస్థితిగా నుండునని గ్రహించుట ఎంత ప్రమాదకరమో, ఆలాగుననే ఏ గ్రంథమునకైనా ఉండునని విజ్ఞులు తెలిసికొనియే యుందురు

లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు

ఓం తత్సత్ ఓమ్

ఇట్లు మీ చరాచర సుఖాభిలాషి

శ్రీమలయాళస్వామి





# గృహస్థాశ్రమ ధర్మము

## గృహస్థాశ్రమశుద్ధి

గృహస్థాశ్రమము శుద్ధమైన మాత్రమే ఉత్తమ సంతానము గలుగును. ప్రపంచములో శూరులై, ధీరులై, ఉదారచరితులై, ధర్మాత్ములై, ఆరోగ్యవంతులై, జ్ఞానసంపన్నులగు సంతానములు గలుగవలసియుండిన పుణ్యాదంపతు లేర్పడవలయును. సృష్ట్యారంభము నుండి నేటి వరకును భూలోకములో నేర్పడిన యవతార పురుషులు, లోకోద్ధారకులు, ప్రవక్తలు, యోగులు, రాజయోగులు, కర్మశూరులు మొదలగు వారందరు గృహస్థాశ్రమము నుండియే ఏర్పడిరి ఇకను భావికాలములో గూడ అటువంటి ధీరోదారశూరులు జన్మించవలసినచో గృహస్థాశ్రమములో నుండియే పుట్టవలసియున్నారు

దృష్టాంతముగా శ్రీరామచంద్రుడు పుణ్యాదంపతులగు కౌసల్యా దశరథులకే అయోధ్యలో జన్మించెను ఆలాగున శ్రీ కృష్ణభగవానుడు గూడ దేవకీవసుదేవులకు మధురయందు గృహస్థాశ్రమము నందే సంభవించెను శ్రీగౌతమబుద్ధుడు మాయాదేవీ శుద్ధోదనులకు కపిలవస్తునందు జన్మించెను శ్రీ యేసుక్రీస్తు గూడ జోసఫ్ మరియు మేరీలకు బెత్లెహామ్‌లో జననమొందెను. అయితే మేరీ కన్యక యైనప్పుడు పరిశుద్ధాత్మడగు దేవుని వలన ఏసు జనించినట్లు క్రైస్తవులు చెప్పుదురు కానీ మరియ అను కన్యకను జోసఫ్ వివాహమాడెను. అదేరీతిగా అరబ్బీదేశము నందు శ్రీమహమ్మదునబియును అబ్దుల్లా అమీనాలకు ఆవిర్భవించెను అట్లే శ్రీజగద్గురు శంకరాచార్యులును ఆర్యాంబా శివగురులయందు కేరళ దేశమున ఉద్భవించిరి. ఈలాగున శ్రీరామానుజాచార్యులును ద్రవిడ దేశమున కాంతిమతీదేవీ కేశవసోమయాజులకు ఆవిర్భవించిరి అదేరీతిగా కర్ణాటక దేశమున శ్రీమధ్వాచార్యులు గూడ గృహస్థాశ్రమములో ఉండిన పుణ్యాదంపతులగు

వేదవతీ మధ్యగేహులకు ఉద్భవించిరి ఈలాగున పాంచాల దేశమందు శ్రీగురునానక్, త్రిప్తాదేవీ కాళులకు ఉద్భవించిరి ఈ లాగున శ్రీకృష్ణ చైతన్యులు (గౌరాంగప్రభువు) బంగాళాదేశమున సంసారములో నుండిన పావనదంపతులగు శచీదేవి జగన్నాధమిశ్రులకు పుట్టెను అదేరీతిగా మహాశూరుడును, ధీరుడును అగు శ్రీ శివాజీయు మహారాష్ట్ర దేశమున జిజాబాయీ షహాజీలకు జన్మించెను ఈ ప్రకారముగా శ్రీ సమర్థ రామదాసుగారు ఆంధ్రదేశమున పవిత్ర గృహస్థాశ్రమ ధర్మము నవలంబించి యుండిన రాణూబాయీ సూర్యాజీపంతులకు గర్భమునందే జాతమాయెను ఆలాగున గుజరాత్ దేశమునందు పరమ పుణ్యాత్ములగు పుత్తలీబాయీ కరంచందుగార్లకు గాంధీ మహాత్ముడు ఆవిర్భవించెను

వెయ్యేల, భూలోకములో జన్మించిన సర్వమహనీయులును గృహస్థాశ్రమమునుండియే ఆవిర్భవించిరి కావున గృహస్థాశ్రమము శుద్ధియైన మాత్రమే తక్కిన బ్రహ్మచర్య వానప్రస్థ సన్న్యాసాశ్రమములు మూడును శుద్ధములు గాగల్గును

ఇదే ప్రకారముగ అత్రి అనసూయలకు త్రిమూర్త్యాత్మస్వరూపులగు శ్రీదత్తాత్రేయమునియు, కర్దమప్రజాపతి దేవహూతులకు శ్రీ కపిలమునియు అవతరించిరి ఈలాగున మహాపరాక్రమ శక్తియు తపోనిధియు నగు శ్రీ పరశురాముడు రేణుకాదేవీ జమదగ్నులకు జన్మించెను అట్లే మరుద్వతీ మృకండులకు శ్రీ మార్కండేయ మహామునియు జన్మించెను అదేరీతిగా ధ్రువుడును సునీతి ఉత్తానపాదులకు ఆవిర్భవించెను వీరందఱు గృహస్థాశ్రమములో నుండి గదా యుద్భవించిరి కావున గృహస్థాశ్రమమును పవిత్రమొనర్చే లాగున గృహస్థాశ్రమస్థులును యత్నము గలవారై యుండవలయును

ఇదివరలో లోకోద్ధారకులై ఆత్మోద్ధారకులైన మహనీయు లందఱు గృహస్థాశ్రమమునుండియే ఆవిర్భవించిరి వర్తమానకాలములో నుండు శుద్ధాత్ము లందఱును గృహస్థాశ్రమములో జన్మించినవారే ఇక భావికాలములోను అట్టి గృహస్థాశ్రమమునుండియే జన్మించవలసి యుందురు కావున సత్సంతానము గలుగవలసియుండిన, ధర్మాత్ములు జన్మించవలసియుండిన, లోకోద్ధారకులు తమ బిడ్డలుగా పుట్టవలసియుండిన, జ్ఞానాత్ములు జన్మించవలసియుండిన,

తాపసవరులు తమ కుటుంబములో జన్మించవలసియుండిన దంపతులు ఉభయులును పవిత్రముగ గృహస్థాశ్రమ ధర్మమును జరుపవలసియుందురు అటులైన వంశోద్ధారకమగు సంతానము గల్గును అందువలన వారును పుణ్యలోకమును పొందగలరు పురుషులకు చెప్పే లాగున స్త్రీలలోను మైత్రేయి, సులభ, శార్జ్గీ, విశ్వవర, కాత్యాయని, మదాలస, చూడాల, గార్గి, శాండిలి, తపస్విని మొదలగు యోగినులు, సన్న్యాసినులు, తపస్వినులు, వేదవిదుషీమణులగు నారీమణులు గూడ గృహస్థాశ్రమములోనే పుట్టి పెరిగి, తపస్వినులై జీవన్ముక్తిని పొందిరి

ధన్యా మాతా పితా ధన్యో ధన్యం గోత్రం (వంశ) సముద్భవః ।
ధన్యా చ వసుధా దేవీ యత్రస్యాద్గురుభక్తతా ॥

బ్రహ్మనిష్ఠులు భగవద్భక్తులు నేవంశమున పుట్టుదురో వారి తల్లియు, తండ్రియు ధన్యులగుదురు. వారు జన్మించిన వంశము, గోత్రము ధన్యతను గాంచును వారు పుట్టిన భూమియు పుణ్యభూమి యగును గురుభక్తి యొక్క ప్రభావము ఈ లాగున ఉంటున్నది ఇప్పుడు గూడ ప్రపంచములో ఎవరైన మహనీయు లుండినచో వారి తల్లిదండ్రులను గురించి లోకము ఆ పుణ్యాత్ముని కనిన తల్లి యొక్క కడుపెంత చల్లనిదో, ఆ అమ్మ యేమి పుణ్యము చేసినదో, యేనోము నోచినదో, లేనిచో ఇట్టి మాణిక్యము వంటి బిడ్డ ఆ తల్లి గర్భమున పుట్టునా? అని చెప్పుచున్నది గదా! ఇదియే దీనికి తార్కాణము



# గృహస్థాశ్రమోత్కృష్టత

## (మనుస్మృతి)

బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థో యతిస్తథా ।
ఏతే గృహస్థప్రభవాశ్చత్వారః పృథగాశ్రమాః ॥

బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సన్న్యాసి యని వేఱువేఱుగా

నేయాశ్రమములు జెప్పబడినవో అవి నాలుగును గృహస్థాశ్రమము వలన నేర్పడినవి

విశేషార్థము ॥ గృహస్థాశ్రమము శుద్ధమైన మాత్రమే ఈ నాలుగాశ్రమములు గూడ శుద్ధపడుటకు తగిన సంతానము గలుగునని యిదివరలో చెప్పబడిన రహస్యము భూమి శుద్ధము గానిచో నెంత శ్రేష్ఠమగు విత్తనములు విత్తినను చక్కగా పోషించినను ఎటుల పూర్ణ ఫలము నివ్వజాలదో గృహస్థాశ్రమము నట్టిదే గృహస్థాశ్రమము పావనమగుచో అచ్చట జన్మించెడు సంతానములను గూడ బాల్యకాలమునుండియే పవిత్రమార్గములో ప్రవర్తించులాగున చేయుదురు వెదురు మొదలగు వృక్షములను లేబ్రాయములో ఏలాగున వంచతలంచినను ప్రయాసము లేకనే వంచవచ్చును ముదిరిన తర్వాత నెటుల సాధ్యము గాదో, ఒక వేళ, బహుపరిశ్రమచే చక్కబరచ జూచినను ఎంత ప్రయాసకరమో, అట్లే ముదిరిన తర్వాత మానవుని గూడ చక్కబఱచుట అంత ప్రయాసకరమే

**సర్వేఽపి క్రమశస్త్వేతే యథాశాస్త్రనిషేవితాః ।**
**యథోక్తకారిణం విప్రం నయన్తి పరమాం గతిమ్ ॥**

ఈ నాలుగాశ్రమములును శాస్త్రవిధి చొప్పున నడుచుకొన్నచో, అవి యొక్కటిగాని, రెండుగాని, మూడుగాని వానికి మోక్షప్రాప్తియను నుత్తమగతిని గలిగించును

**సర్వేషామపి చైతేషాం వేదస్మృతివిధానతః ।**
**గృహస్థ ఉచ్యతే శ్రేష్ఠః స త్రీనేతాన్ బిభర్తి హి ॥**

ఈ నాల్గు ఆశ్రమముల వారిలో శ్రుతిస్మృతులందు చెప్పబడిన రీతిగ గృహస్థుడే ఉత్తము డనబడును అతడే గదా తక్కిన మూడాశ్రమములవారిని బోషించుచున్నాడు కావున నతడే శ్రేష్ఠుడు

విశేషార్థము ॥ బ్రహ్మచారి వానప్రస్థ సన్న్యాసులను పోషించి తానును మోక్షమును పొందే స్థితిలో నుండుట వలననే గృహస్థాశ్రమము శ్రేష్ఠమని చెప్పబడినది. అటుల మూడాశ్రమములను పోషింపకయు, విధిప్రకారము గృహస్థ ధర్మము నడుపకయు ఉండిన గృహస్థుడు పతితు డగును ఇట్టివారే శాస్త్రములు

గృహస్థాశ్రమమును నిందించుటకు కారణము గృహస్థుడు తాను సంపాందించిన ధనముచే పై జెప్పబడిన మూడాశ్రమములకు కావలసిన అన్న, వస్త్ర, పుస్తకాదుల సహాయ మొనర్చుటయు, తక్కిన ఆశ్రమస్థులును తాము సంపాదించిన విద్య, జ్ఞానము, తపస్సు గృహస్థుల కొసంగుటయు చేయవలయును అప్పుడు ఉభయులును పరస్పర ఆత్మోన్నతి విషయములో సహాయపడినవార లగుదురు

**యథానదీ నదాస్సర్వే సాగరే యాన్తి సంస్థితిమ్ ।**
**తథైవాశ్రమిణస్సర్వే గృహస్థే యాన్తి సంస్థితిమ్ ॥**

అన్ని నదులును, నదములును సముద్రమున చేరునటుల తక్కిన యాశ్రమముల వారందఱు గృహస్థునిపై నాధారపడియున్నవారు గాన వానిని జేరుచున్నారు

**చతుర్భిరపి చైవైతైర్నిత్యమాశ్రమిభిర్ద్విజైః ।**
**దశలక్షణకో ధర్మః సేవితవ్యః ప్రయత్నతః ॥**

ఈ నాలుగాశ్రమముల వారును, ఈ క్రింద చెప్పబడు పది తెఱగులగు ధర్మములను సేవింపవలయును

**ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచమిన్ద్రియనిగ్రహః ।**
**ధీర్విద్యాసత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్ ॥**

ధృతి, క్షమా, దమ, అస్తేయ, శౌచ, ఇన్ద్రియనిగ్రహ, ధీ, విద్యా, సత్య, అక్రోధములను ఈ పదియు ధర్మలక్షణములు

(1) ధృతిః=ధర్మకార్య నిర్వహణములో ధైర్యము, (2) క్షమా=ఓరిమి, (3) దమః=దేహేన్ద్రియ నిగ్రహము, (4) అస్తేయం=పరుల వస్తువు నపహరింపకుండుట, (5) శౌచం=బాహ్యాభ్యన్తరశుద్ధి, (6) ఇన్ద్రియ నిగ్రహః= మానసాది సర్వేంద్రియముల నిగ్రహము, (7) ధీః=నిర్మలమగు బుద్ధి, (8) విద్యా=ఆత్మజ్ఞానము, సద్విద్యాపరనమును (9) సత్యం=సత్యభాషణము, (10) అక్రోధం=కోపరాహిత్యము, దశకం = ఈ పదియు, ధర్మలక్షణం= ధర్మమునకు లకణములగును

**దశ లక్షణాని ధర్మస్య యే విప్రాస్సమధీయతే ।**
**అధీత్య చానువర్తన్తే తే యాన్తి పరమాం గతిమ్ ॥**

ఎవరు ఈ దశవిధ ధర్మముల లక్షణముల నెఱుంగుచున్నారో, యెఱింగి యనుష్ఠించుచున్నారో వారుత్తమగతి నొందుదురు

**దశలక్షణకం ధర్మమనుతిష్ఠన్ సమాహితః ।**
**వేదాన్తం విధివచ్ఛ్రుత్వా సన్న్యసేదనృణో ద్విజః ॥**

మనుజాడు ఈ చెప్పబడిన పది లక్షణములు గల ధర్మము నెఱిగి, జాగరూకుడై వీని ననుష్ఠించుచు వేదాన్తమును ఉపనిషదాదుల యర్థమును గురువు కడనుండి గృహస్థ దశయందే చక్కగా నేర్చుకొని ముత్తెఱంగుల ఋణములను దీర్చి సన్న్యాసమును స్వీకరింపవలయును

వి॥ ఆత్మజ్ఞానమునకు తగిన శుద్ధి లేని వారికి గృహస్థాశ్రమములో నుండి శుద్ధి గలుగుట కొఱకు ధర్మబద్ధమైన గృహస్థాశ్రమము ఏర్పడినది అచ్చటనే యుండి ఆత్మశుద్ధి గలిగి యుత్తముడగు గురువు వలన వేదాన్త శ్రవణము చేసి జ్ఞానమును సంపాదించిన పిమ్మట కావలసి యుండిన సన్న్యసింపవచ్చును అట్లు ఆత్మశుద్ధి లేక సన్న్యసించినచో పవిత్రమగు సన్న్యాసాశ్రమము పతన మొందును

**యథా వాయుం సమాశ్రిత్య వర్తన్తే సర్వజన్తవః ।**
**తథా గృహస్థమాశ్రిత్య వర్తన్తే సర్వ ఆశ్రమాః ॥**

ప్రాణవాయువు నాశ్రయించి జన్తువులెల్ల జీవించునట్లు, గృహస్థుని ఆశ్రయించి తక్కిన యాశ్రమస్థులు జీవింతురు

**యస్మాత్త్రయోఽప్యాశ్రమిణో జ్ఞానేనాన్నేన చాన్వహమ్ ।**
**గృహస్థేనైవ ధార్యన్తే తస్మాజ్జ్యేష్ఠాశ్రమో గృహీ ॥**

వి॥ గృహస్థుడు తక్కిన యాశ్రమముల వారిని వేదాధ్యయనము చేయించియు, అన్నపానముల నొసంగియు ప్రతిదినము వారిని పోషించు చున్నాడు కావున గృహస్థుడన్ని యాశ్రమముల వారిలో శ్రేష్ఠుడనబడును

**ఋషయః పితరో దేవా భూతాన్యతిథయస్తథా ।**
**ఆశానతే కుటుంబిభ్యస్తేభ్యః కార్యం విజానతా॥**

ఋషులు, పితృదేవతలు, వేల్పులు, భూతములు, అతిథులు - వీరందఱును గృహస్థుల కడనుండి తమకు వలసినవి కోరుచుందురు కావున బుద్ధిమంతుడగు గృహస్థుడు వారికి వలసినవి యెఱిగి యొసగవలయును

వి ॥ ఆలాగున పై జెప్పబడిన వారికి కావలసినది యొసగనిచో గృహస్థుడు పతితుడగును

**అదత్వాతు య ఏతేభ్యః పూర్వం భుంక్తేఽవిచక్షణః ।**
**న భుంజానో న జానాతి శ్వగృధ్రైర్జగ్ధిమాత్మనః ॥**

అతిథులు మొదలుకొని సేవకుల వఱకు భోజన మిడక గృహస్థుడు తాను ముందుగా భుజించెనేని అట్టివానిని జీవితాంతమున కుక్కలు, నక్కలు, గ్రద్దలు దినునని ఆ గృహస్థు డెరుగడు

**దేవానృషీన్మనుష్యాంశ్చ పితౄన్ గృహ్యాశ్చ దేవతాః ।**
**పూజయిత్వా తతః పశ్చాద్గృహస్థశ్శేషభుగ్భవేత్ ॥**

దేవతలను, ఋషులను, అతిథులను, పితరులను, గృహదేవతలను అన్నాదులచే పూజించి యూవల గృహస్థుడు మిగత యన్నమును భుజింపవలయును

**అఘం న కేవలం భుంక్తే యః పచత్యాత్మకారణాత్ ।**
**యజ్ఞశిష్టాశనం హ్యేతత్సతామన్నం విధీయతే ॥**

ఎవడు తన నిమిత్తము మాత్రము అన్నము వండి భుజించి అతిథి దేవతాదులకు పెట్టడో, అట్టి యన్నము పాపహేతువుగాన, నాతడు పాపమునే భుజించుచున్నాడు కాన గృహస్థునికి పంచయజ్ఞములలో మిగిలిన యన్నమును భుజించుటయే యుత్తమమని పెద్దలచే పరిగణింపబడినది. ఈలాగుననే భగవద్గీతయందు శ్రీ కృష్ణభగవానుడు ఉపదేశించెను

యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥

ఓ అర్జునా! అతిథి పూజాది పంచయజ్ఞములలో, ఏదైన నొక్కటైనను చేసిన తర్వాత గృహస్థుడు భుజించెడు అన్నము అమృతసదృశ మగును అట్టివాడు శాశ్వతమైన బ్రహ్మమును పొందుచున్నాడు పై యజ్ఞములలో దేనినైన నొక్కదానిని చేయని వానికి ఈ లోక సుఖమైనను లేదు ఇక పరలోక సుఖమెక్కడిది?

యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః ।
తే త్వఘం భుఞ్జతే పాపా యే పచన్త్యాత్మకారణాత్ ॥

అతిథిపూజను దైవకార్యాది పంచయజ్ఞములను జేసి మిగిలిన యన్నమును భుజించెడు సత్పురుషులు సర్వపాపములనుండి విడువబడుచున్నారు ఎవరు తాము భుజించుటకు మాత్రమే వంటచేసికొనుచున్నారో అట్టి పాపులయితే, పాపమునే భుజించుచున్నారు

వి॥ గృహస్థుడు వంట చేయుట అతిథులకొఱకు, భగవదారాధన కొఱకు అను తలంపుతో చేయవలసినదేగాని తన కడుపుకొఱకు మాత్రమే యను బుద్ధితో చేయకూడదు అతిథులకు పెట్టకయు, దైవకార్యములు చేయకయు భుజించువారు పాపాత్ములనియు, వారు భుజించునది అన్నము కాదు, పాపమే యనియు శ్రీ కృష్ణభగవానుడు ఉపదేశించెను

స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు ॥

మనజుడు తన కేర్పడిన కర్మయందాసక్తుడై ఆచరణ పరుడాయెనేని యుత్తమ సిద్ధిని పొందుచున్నాడు తనకేర్పడిన కర్మమందు ప్రవర్తించువాడు ఏ ప్రకారముగా జ్ఞానమును పొందుచున్నాడో అద్దానిని ఆకర్ణింపుము

వి॥ తన కేర్పడిన కర్మమనగా తాను బ్రహ్మచర్యాది ఆశ్రమములందుగాని, లేకయే అనుష్ఠానమందుగాని యుంటున్నాడో అట్టి కర్మయని భావము

**యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।**
**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥**

ఏ సర్వేశ్వరుని వలన సమస్త భూతములకు సంస్కారానుగుణముగ ప్రవృత్తి గలుగుచున్నదో, అట్టి ఈశ్వరుని మనుజుడు తన కేర్పడిన కర్మచే నారాధించి జ్ఞానాధిష్ఠాన యోగ్యతాసిద్ధిని పొందుచున్నాడు

వి ॥ ఎవరెవరు ఏయే ఆశ్రమములందుగాని, అనుష్ఠానములందుగాని, యుంటున్నారో వానికి సంబంధించిన అనుష్ఠానములను జేయుచు పరమేశ్వర ధ్యానము గూడ చేయుచుండిన, దానివలన నాత్మశుద్ధి గల్గి జ్ఞానమును పొందగలుగుదురు ఎట్లన ఎవరైనను ఏ ఔషధమును సేవించిన దానికి తగిన పథ్యముగూడ నుండవలయును గదా! ఆలాగున నేజాతి వారైనను వారికేర్పడినదగు ఉద్యోగమును జేయుట వారికది ధర్మము గదా! అదే యిచట గ్రహించవలయునే కాని జాతిని గుఱించి కాదు

మనుస్మృతి - గృహస్థుడు ప్రతిదినము గూడ పంచయజ్ఞపరాయణుడై యుండవలయును ఆ పంచయజ్ఞము లెవ్వియన క్రింద వివరింపబడుచున్నవి.

**పంచసూనా గృహస్థస్య చుల్లీ పేషణ్యుపస్కరః ।**
**కండనీ చోదకుంభశ్చ బధ్యతే యాస్తు వాహయన్ ॥**

గృహస్థుడు ఎంత అహింసావ్రతము నవలంబించుచున్న వాడైనను అనివార్యమైన ఐదు విధములగు హింసలు వచ్చుచుండును

అవి 1. చుల్లీ=కట్టెలు మొదలగు వాని వలన వండునప్పుడు కట్టెలలో గల చెదలు మొదలగు క్రిముల నాశము, 2 పేషణీ=విసరుచున్నప్పుడును, నూరుచున్నప్పుడును కలిగెడు ప్రాణిహింస, 3 ఉపస్కరః=ఇతర గృహకృత్యములు చేయునప్పుడు కలిగెడు ప్రాణిహింస అనగా చిమ్ముట, అలుకుట మొదలగునవి దీనిలోనిదే దున్నునప్పుడు, పారతో చెక్కునప్పుడు సస్యములలో గల క్రిములను తొలగించునప్పుడు గలుగు హింస (4) కండనీ=ధాన్యాదుల దంచునప్పుడు గలుగు ప్రాణిహింస, (5) ఉదకుంభః=నీళ్ళు ఉడకబెట్టునప్పుడు గలుగు ప్రాణినాశము,

ఇక నిల్లు కట్టుటలో నేర్పడు ప్రాణినాశము

ఈ ఐదు హింసల నివృత్తి కొఱకు పంచయజ్ఞములు విధింపబడుచున్నవి ఇవి అనివార్య మగుటచేతను, ఇవి లేక మానవులు జీవింపలేక పోవుటచేతను ప్రాయశ్చిత్తముల నొనరించుటచే ఆ దోషములు నివర్తించుచున్నవి

తాసాం క్రమేణ సర్వాసాం నిష్కృత్యర్థం మహర్షిభిః ।
పంచ క్లుప్తాః మహాయజ్ఞాః ప్రత్యహం గృహమేధినామ్ ॥

ఆ యైదు తెఱంగుల పాపములు పోవు నిమిత్తము మహర్షులు గృహస్థునకు పంచమహాయజ్ఞములను వరుసగా విధించిరి

అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణమ్ ॥
హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనమ్ ॥

1 బ్రహ్మయజ్ఞము, 2 పితృయజ్ఞము, 3 దేవయజ్ఞము, 4 భూతయజ్ఞము, 5 మనుష్య యజ్ఞము

1 బ్రహ్మయజ్ఞము = వేదోపనిషద్భగద్గీతాది పారాయణము, ప్రణవాది మంత్రజప భగవత్కీర్తన పూజాదులు వీనిలో నేదైన ఒక దానినైనను చేయక భోజనము చేయరాదు 2 పితృయజ్ఞము = తర్పణాదులచే పితరులను తృప్తిపరచుట 3 దైవయజ్ఞము = అగ్నియందు వ్రేల్చుహోమము (వైశ్వదేవము), 4 భూత యజ్ఞము = కుక్కలు, పిల్లులు, కాకులు, ఉడుతలు మొదలగు ప్రాణుల కన్నమిడుట, 5 మనుష్య యజ్ఞము = అతిథి సత్కారము -ఇది రెండు విధములుగ నగును బ్రహ్మచారులు, సన్న్యాసులు, సాధువులు, వానప్రస్థులు, తీర్థయాత్రలు జేయువారు మొదలగువారికి గౌరవభావముతో భోజనము నిడుట, రోగులు, అంగహీనులు, స్వయముగా దేహసంరక్షణ చేయుస్థితిలో లేనివారికి కబళ మిడుట

పంచైతాన్ యో మహాయజ్ఞాన్ న హాపయతి శక్తితః ।
స గృహేఽపి వసన్నిత్యం సూనాదోషైర్న లిప్యతే ॥

ఎవడీయైదు యజ్ఞములను విడువక యథాశక్తిగా నాచరించునో అతడు గృహస్థాశ్రమియై యున్నను పంచసూనాది దోషము లైదును వాని నంటవు

దేవతాతిధి భృత్యానాం పిత్రూణామాత్మనశ్చ యః ।
న నిర్వపతి పంచానాముచ్ఛ్వసన్న స జీవతి ॥

దేవతలకును, భూతములకును, అతిధులకును, పితరులకు నేగృహస్థు డన్నము నొసంగడో, కలిమికి తగినంత తానును భుజింపడో, అతడు జీవించి యుండియు జీవింపని వాడనియే చెప్పనగును అనగా జీవన్మృతుండనియే గ్రహించదగినది ఈ ధర్మము ననుసరించియే ఏ పంటలయినను పండిన స్థలములలో అచ్చటికి వచ్చిన యాచకులకు కొంచెము, కొంచెము దాన మిచ్చుటకు కారణము పండించుటలో గల ప్రాణినాశశాన్తి కొఱకే అది యేర్పడినది విత్తనమునకు దాచి పెట్టి మిగత తినిన మరు సంవత్సర మేలాగున పండించుటకు వీలున్నదో ఆలాగున గృహస్థుడిచ్చు దానధర్మములు మరుజన్మమునకు ఫలము గలుగజేయును గవర్నమెంటు వారికివ్వవలసిన పన్ను నివ్వకపోయిన భూమి నెటుల జప్తి చేయుదురో ఆలాగున విధిప్రకారము శక్తి కొలది దానధర్మములను చేయనిచో ఇప్పుడుండు ఐశ్వర్యముగూడ క్రమముగా నశించును ఒక సెంటు భూమి గలవాడు నూరు ఎకరముల భూమి గలవాని శిస్తును చెల్లింప నవసరము లేదు. కాని నూరు ఎకరముల భూమి గలవాడు ఒక సెంటు భూమి గలవాని శిస్తు చెల్లించిన చాలదు

మరియు పితృశ్రాద్ధమునకు శ్రద్ధాభక్తులతో మాతాపితరులు జీవించి యున్నప్పుడే అన్నాదు లొసగి ఇచ్చుటనే వారిని తరింపజేయవలయునని యొక యర్థము కూడ గలదు. ఒకరి వద్ద ఋణస్థులై యుండినచో అది తీర్చనిచో నేలాగున ఋణస్థులమో ఆలాగున మనము శైశవావస్థలో అశక్తులమై యున్నప్పుడు మాతా పితరులచే సుమారు 16 గాని, 18 గాని సంవత్సరములు పోషింపబడిన వారమై యున్నారము. అప్పుడు వారికి యౌవనము, శక్తియు నుండెను మరల వారు వృద్ధులైనప్పుడు శక్తిరహితులై యుందురు అత్తఱి మనము యౌవనము, శక్తియును గలవార మగుదుము బాల్యదశలో మన మశక్తులమై యున్నప్పుడెన్ని సంవత్సరములు తల్లిదండ్రులచే సంరక్షింపబడిన వారమైతిమో అన్ని సంవత్సరములు వార్ధక్యదశలో వారిని సంరక్షింపవలయును. యధార్థముగ నిదే తల్లిదండ్రుల ఋణమును తీర్చవలయునను వాక్యమున కర్థము.

ఇదివరలో గృహస్థుడు చేయవలసిన అతిథి పూజా విశేషమును గురించి తెలుపడమైనది అయితే పూర్వికులు ఎట్టివారిని అతిథులుగా నిశ్చయించిరో ఆ విషయమై పరాశరస్మృతి చెప్పిన దానిని జూడందగును.

**దూరోధ్వోపగతం శ్రాన్తం వైశ్వదేవ ఉపస్థితమ్ ।**
**అతిథిం తం విజానీయత్ నాతిథిః పూర్వమాగతః ॥**

పగలు వైశ్వదేవాంతమున గాని, సాయంకాలమునగాని, ఎప్పుడైననుగాని దూరము నుండి యలసి ఆకొని వచ్చినవాడును, తీర్థయాత్రను సల్పువాడును, పరమార్థము నుద్దేశించి ప్రయాణము చేయువాడును అతిథి యనంబడును పూర్వమెప్పుడైనను ఏదివసమునన్నైనను వచ్చినవాడగుచో నాతడతిథి గాజాలడు అతిథి శబ్దార్థము "ఆతిథి యందు వచ్చినవాడును, దానికి ముందు ఏ తిథియందు రాని వాడును ఆ తిథియందే వెళ్లువాడును అతిథి యనదగును " అనగా పంచమి, షష్ఠి, సప్తమి మొదలగు దినములు తిథి యనబడును

మఱియు ఆర్యుల కాలమందు సోమరులై తిరిగెడు బ్రాహ్మణులు గాని, బ్రహ్మచారులుగాని, సన్న్యాసులుగాని సాధువులుగాని ఉండలేదనియు, అనగా ఆ కాలమున యాచక వృత్తి నిషేధింపబడి యుండెననియు ఈ క్రింది శ్లోకముచే నర్థమగుచున్నది. అట్టి నియమముతో నొప్పు దేశమే సరియైనది అట్టి నియమము లేనందుచేతనే సోమరులై తిరుగుటకు అవకాశ మేర్పడినది

**అవ్రతా హ్యనధీయానా యత్ర భైక్షచరా ద్విజాః ।**
**తం గ్రామం దండయేద్రాజా చోరభక్తప్రదో హి సః ॥**

ఏ గ్రామమునందు బ్రహ్మచర్య వ్రతము నాచరింపకయు, వేదమును చదువకయు బ్రహ్మచారులుగాని, బ్రాహ్మణులుగాని, సాధువులుగాని భిక్షమెత్తి జీవించుచున్నారో ఆయూరి వారిని భూపాలుడు దండించవలయును ఏలయనగా ఆయూరివారలు చోరులతో సమానులగు వారికి అన్నమొసగి పోషించినవార లగుచున్నారు గదా!

గ్రంథాన్తరమున గృహస్థుని ధర్మములను గూర్చి తెలిపిన దానిని తెలిపెద.

గృహస్థధర్మా ప్రవరో మనీషిణాం బ్రహ్మాదిభిశ్చాభిహితో నగాత్మజే ।
తప్త్వా తపస్వీ విపినే క్షుధార్తో గృహం సమాయాతి సదాఽన్నదాతుః ॥

ఇది ఈశ్వరునిచే పార్వతీదేవి కుపదేశింపబడెను ఓ పార్వతీ! గృహస్థుడే మనీషులలో ధర్మాచరణలో శ్రేష్ఠుడని బ్రహ్మాదులచేతను జెప్పబడెను వనమున తపము గావించెడు తపస్వియు ఆకలి బాధ కలుగునప్పుడు అన్నదాత యొక్క గృహమునే పొందుచున్నాడు

భక్త్యా స చాన్నం ప్రదదాతి తస్మై తపోవిభాగం భజతే హి తస్య ।
గృహాశ్రమం శ్రేష్ఠమిహాశ్రమాణాం సమ్యక్చ యః పాలయతే మనుష్యః ॥

ఎవడు ఇంటికి వచ్చిన తాపసులకు భక్తితో అన్నదానమును చేయు చున్నాడో ఆ గృహస్థుడు తపస్సులో నొకభాగమును పొందుచున్నాడు గదా! ఎవనిచే విధి ప్రకారము గృహస్థాశ్రమము పాలింపబడునో అట్టి ఆశ్రమమే అన్ని ఆశ్రమములకన్నను మేలైనది

ఇహైవ భుఞ్జన్స మనుష్యభోగాన్ స్వర్గం ప్రయాతీతి న సంశయోఽత్ర ।
గృహం సదా పాలయతాం నరాణాం పాపం సమాయాతి కథం హి దేవి! ॥

అట్టి గృహస్థు డీలోకమున మనుష్యభోగముల ననుభవించుచు స్వర్గలోకమును గూడ పొందుచున్నాడు దీనియందు సందేహము లేదు అట్టి పవిత్ర భావముతో గృహస్థాశ్రమమును పాలించెడు మనుష్యులకు ఓ దేవీ! పాపమెట్లు సంభవించును?

గృహాశ్రమః పుణ్యతమ స్సర్వదా తీర్థవద్గృహమ్ ।
అస్మిన్ గృహాశ్రమే పుణ్యే దానం దేయం విశేషతః ॥

ఆలాగున అతిథి పూజాదికార్యముల నొనర్చుచుండు గృహస్థాశ్రమము చాల పుణ్యమైనది. అట్టి గృహము ఎల్లప్పుడును పుణ్యతీర్థమువంటిది. పుణ్యతీర్థములలో జనులు వచ్చి స్నాన మొనర్చి పవిత్రులై పోవునటుల అట్టి గృహమును బ్రహ్మచారి మొదలగు అనేకు లాశ్రయించి తృప్తులై పోవుచున్నారు. కావున ఇట్టి పుణ్యమగు గృహస్థాశ్రమమున విశేషముగా దానము చేయదగినది.

**దేవానాం పూజనం యత్ర హ్యాతిథీనాం చ భోజనమ్ ।**
**పథికానాం చ శరణ మతో ధన్యతమో మతః ॥**

గృహములందు దేవతార్చనయు, అతిథి భోజనము, యాత్రికులకు నాశ్రయము గలుగుచుండును అందువలననే అట్టి గృహస్థాశ్రమము ధన్యమయినదని తెలియందగును

**తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే ।**
**ద్వాపరే యజ్ఞమేవాహుః దానమేకం కలౌ యుగే ॥**

కృత యుగములో తపస్సే శ్రేష్ఠమై యుండెను త్రేతాయుగమున జ్ఞానమున కాధిక్యము గలిగియుండెను ద్వాపరయుగమున యజ్ఞమునకే యాధిక్యమును విధించిరి కలియుగమున అన్నదానమునకన్న మించిన ధర్మము గృహస్థునికి లేదు

**ఋతుకాలాభిగామీ యః స్వదారనిరతశ్చ యః ।**
**స సదా బ్రహ్మచారీ హి విజ్ఞేయస్స గృహాశ్రమీ ॥**

ఋతుకాలమందు మాత్రము స్వభార్యయందు చేరు గృహస్థుడు ఎల్లప్పుడును బ్రహ్మచారి యనియే గ్రహించదగినది అట్టి నారీమణియు బ్రహ్మచారిణియే యని యనందగును

**మృతే భర్తరి సాధ్వీ స్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా ।**
**స్వర్గం గచ్ఛత్యపుత్రాపి యథా తే బ్రహ్మచారిణః ॥**

ఏ సాధ్వియగు స్త్రీ భర్త మరణించిన పిమ్మట బ్రహ్మచర్య వ్రతము ననుష్ఠించుచున్నదో అట్టి వారికి సంతానము లేకపోయినను మరణానంతరము స్వర్గలోకము సంప్రాప్త మగుచున్నది అంతియే గాదు. బ్రహ్మచర్యవ్రతమును సల్పెడు నైష్ఠికబ్రహ్మచారులు ఏ బ్రహ్మలోకమును పొందెదరో భర్తృవియోగా నంతరము నైష్ఠిక బ్రహ్మచర్యము నవలంబించు నారీమణులు గూడ అట్టి బ్రహ్మలోకమునే పొందెదరు

వనేఽపి దోషాః ప్రభవన్తి రాగిణాం గృహేఽపి పంచేన్ద్రియనిగ్రహస్తవః ।
ఆకుత్సితే కర్మణి యః ప్రవర్తతే నివృత్తరాగస్య గృహం తపోవనమ్ ॥

రాగద్వేషములు గలవారు వనమునందుండినను వారికి దోషములే గలుగుచుండును గృహస్థాశ్రమము నందుండినను పంచేన్ద్రియముల యొక్క నిగ్రహము గలవాడు తాపసుడే యగును నిందితముగాని కర్మచేయు వాడెచ్చటనుండినను జ్ఞానియే యగును రాగరహితునకు గృహము తపోవనము వంటి పుణ్యభూమి యగును

నాశ్రమం కారణం ముక్తేః దర్శనాని న కారణమ్ ।
తథైవ సర్వకర్మాణి జ్ఞానమేవ హి కారణమ్ ॥

మోక్షము కొఱకు సన్న్యాసాశ్రమముగాని, గృహస్థాశ్రమముగాని కారణము గాదు ఆలాగున శాస్త్రములు జదువుటగాని, ఇతర కర్మలను జేయుటగాని కారణము గాదు ముక్తికి జ్ఞానమొక్కటియే కారణము.

అన్నపానాదిభిర్భక్త్యా బ్రహ్మనిష్ఠం సమర్చయేత్ ।
సర్వపాపవినిర్ముక్తః శంకరం యాతి మానవః ॥

ఏ గృహస్థుడైతే భక్తితో అన్నపానాదులు బ్రహ్మనిష్ఠులకు సమర్పించు చుండునో అట్టి మానవుడు సర్వపాపములనుండి విముక్తుడై పరమేశ్వరైక్యమును పొందుచున్నాడు

పితృదేవమనుష్యేభ్యో దత్త్వాఽశ్నీతామృతం గృహీ ।
స్వార్థం పచత్యఘం భుంక్తే కేవలం స్వోదరంభరీ ॥

గృహస్థుడు అతిథి , దేవ, పితృ కార్యములగు పంచయజ్ఞములను జేసిన తర్వాత భుజించెడు ఏ అన్నము గలదో అది అమృతమే యగును. ఎవడు కుక్షింభరుడై తన కొఱకు మాత్రము పాకముచేసి భుజించునో అతడు తినునది అన్నము గాదు కేవలము పాపమే. ఇదివరలో గీతలోను, మనుస్మృతిలోను ఇట్టి ధర్మమే యుపదేశించడమైనది.

**యస్యాన్నపానపుష్టాంగః కురుతే పుణ్యసంచయమ్ ।**
**అన్నప్రదాతుస్తస్యార్ధం కర్తుశ్చార్ధం న సంశయః ॥**

ఏ గృహస్థుడు ఇచ్చెడు అన్నపానాదుల చేత శరీరపుష్టి గలిగి తపోధ్యానాది పుణ్యకార్యములను చేయుచుండునో వాని పుణ్యములో సగము అన్నదాతకును, అర్ధభాగపుణ్యము మాత్రము అనుష్ఠించు వానికిని గలుగును దీనియందు సందేహము లేదు

**అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే ।**
**స తస్మై దుష్కృతం దత్వా పుణ్యమాదాయ గచ్ఛతి ॥**

అన్నాభిలాషతో అతిథి ఏ గృహస్థుని ఇంటికి వచ్చి అన్నమును పొందక నిందితుడయి ఆ గృహమునుండి మరలి పోవుచుండునో అప్పుడే ఆ గృహస్థుడు చేసిన పుణ్య మంతయు అతని నుండి మరలిపోవుచుండును అతిథి యేదైన పాపము చేసి యుండినచో అది యీ గృహములో నిలిచిపోవును

**పతివ్రతాం స్త్రియం దృష్ట్వా పాపనాశో భవేన్మమ ।**
**శుద్ధా జాతా విశేషణ గౌరీతుల్యా పతివ్రతా ॥**

ఈశ్వర వాక్యము - పతివ్రతాస్త్రీని దర్శించుటవలన నా పాపమంతయు నశించుచున్నది విశేషమగు పుణ్యముల చేతనే శుద్ధురాలగు పతివ్రతా స్త్రీ జన్మించును. అట్టి పుణ్యవతి పార్వతీ దేవికి సమానురాలు

**సా ధన్యా జననీ లోకే స ధన్యో జనకః పితా ।**
**ధన్యస్స చ పతిర్యస్య గృహే దేవీ పతివ్రతా ॥**

అట్టి పతివ్రతయగు మహిళయొక్క తల్లి ధన్యురా లగును, కన్నతండ్రియు ధన్యుడగును. భర్తయు ధన్యతను గాంచును. ఓ పార్వతీ! ఏ గృహమందు పతివ్రతా స్త్రీ నివసించునో ఆస్థలము గూడ పావనమగును

**పితృవంశ్యా మాతృవంశ్యాః పతివంశ్యా స్త్రయస్త్రయః ।**
**పతివ్రతాయాః పుణ్యేన స్వర్గే సౌఖ్యాని భుంజతే ॥**

ఓ పార్వతీ ! పతివ్రతా స్త్రీ యొక్క పుణ్యము వలన పితృ వంశీయులు, మాతృవంశీయులు, పతి వంశీయులు నగు మూడు తరముల వారు స్వర్గలోకమును పొంది సౌఖ్యము ననుభవించెదరు మనుజుడు, జీవించి యున్నప్పుడే పుణ్యకర్మములను జేసి తరింప వలయునేకాని పరలోకములో ఏ కార్యములను చేయుటకును అనుకూల ముండదు మనుష్యలోకము తప్ప తక్కిన లోకము లన్నియు ఇచ్చట పుణ్యాపాప ఫలములను అనుభవించుట కేర్పడినవే

ఇహైవ నరకవ్యాధేశ్చికిత్సాం న కరోతి యః ।
గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి? ॥

ఎవడు ఈ లోకమున జీవించి యున్నప్పుడే నరకమను వ్యాధికి పుణ్యమను చికిత్స జేయడో అట్టివాడు పరలోకమునకేగి ఔషధము, వైద్యుడును గల స్థలమును త్యజించి; మందును, వైద్యుడును లేని స్థలములోనికి వెళ్ళిన రోగివలె నేమి చేయం గల్గును?

యావత్స్వస్థమిదం శరీరమరుజం యావజ్జరా దూరతో
యావచ్చేంద్రియశక్తిరప్రతిహతా యావత్క్షయో నాయుషః ।
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్
సందీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః ॥

ఎంతవరకు మనుజుని దేహము రోగ పీడితముగాక యుండునో, ఎంత వఱకు జరానెరలచే బాధింపబడక యుండునో, ఎంతవఱకు ఇంద్రియముల శక్తి నశింపకుండునో, ఎంతవఱకు శరీర దార్ఢ్యము క్షయింపక యుండునో అట్టి దురవస్థ గల్గుటకు ముందుగానే ఆత్మశ్రేయస్సుకొఱకు బుద్ధిమంతులు చేయవలసిన కార్యములను జేయుచునే యుండవలయును అట్లుగాక ఉద్యోగము పోయిన తర్వాతను, ధనము పుత్రాదులకు స్వాధీనమయిన తర్వాతను, ఏమియు జేయుటకు శక్తిలేని ముదుసలి తనమున పరలోక సౌఖ్యమును గూర్చి ఆలోచించెడు వాడు కొట్టము కాలుచున్నప్పుడు దానిని చల్లార్చుటకు నీటికొఱకై నూయి త్రవ్వుటకై గడ్డపారలను వెదకువానివలె వ్యర్థుడై పోవును.

నాస్తి శ్రద్ధాసమం పుణ్యం నాస్తి శ్రద్ధాసమం సుఖమ్ ॥
నాస్తి శ్రద్ధాసమం తీర్థం సంసారే ప్రాణినాం నృప ॥

ఈ శ్లోకము నారదుడు ఒక రాజు కొఱకుపదేశించినది ఓ రాజేంద్రా! ఈ సంసారమందు శ్రద్ధకు సమమైన పుణ్యము లేదు శ్రద్ధకు సమమైన సుఖమును లేదు శ్రద్ధకు సమమైన తీర్థమును లేదు కావున నెల్లప్పుడు శ్రద్ధతో నుండుము అట్లగుచో ఈ సంసారము నుండియే తరింపగలవు

తండులస్య యధా చర్మ యధా తామ్రస్య కాలిమా ।
నశ్యతి క్రియయా పుత్ర పురుషస్య తధా మలమ్ ॥

జీవస్య తండులస్యేవ మలం సహజమన్యలమ్ ।
నశ్యత్యేవ న సన్దేహః తస్మాదుద్యమవాన్భవ ॥

ఈ వాక్యము వాసిష్ఠమున నుపదేశించబడినది దీనివల్ల పాపముచే భయపడువారికి మంచి శాంతి కల్గును వడ్లయొక్క పొట్టు దంచుటచేతను, తామ్రము యొక్క చిలుము స్ఫుటముచేతను ఏలాగున నశించుచున్నదో, అట్లు జీవుని యొక్క పాపము పుణ్యకర్మచేతను, దైవస్మరణచేతను నశించును బియ్యమునకు పొట్టును, రాగికి చిలుమును జన్మముతో గూడ వచ్చినవైనను ప్రతిక్రియచే నెటుల పోవుచుండునో ఆలాగున జీవుని పాప సంస్కారము జన్మముతో గూడ వచ్చినదైనను ఉపాయముచే తప్పక నశించును అందుచే ఎల్లప్పుడును ప్రయత్న పరుడవు గమ్ము

యధైకం చ సువర్ణాది మిళితం రజతాదినా ।
అల్పమూల్యం ప్రజాయేత తధా జీవోఽప్యహంయతః ॥

యధైవ హి సువర్ణాది క్షారాదేశ్శోధితం శుభమ్ ।
పూర్వవన్మూల్యతాం యాతి తధా జీవోఽపి సంస్కృతేః ॥

ఏలాగున అపరంజి బంగారము వెండి, రాగి, ఇత్తడి మొదలగు లోహము లతో కలిసిపోయినకొద్ది వెలలేనిది యగుచున్నదో, ఆలాగున జీవుడుకూడా శుద్ధ శివస్వరూపుడైనను, అహంకారాది ప్రకృతి గుణములతో చేరునప్పుడు

అజ్ఞానావస్థను పొందుచున్నాడు అయినను అట్టి మలినపు బంగారమును స్పుటము జేసిన ఏలాగున శుద్ధసువర్ణ మగుచున్నదో, అప్పుడేలాగున పూర్వముండిన బంగారము విలువను పొందుచున్నదో ఆలాగున జీవుడు సహితము ధర్మానుష్ఠానము, పరమేశ్వర భక్తివలన సంస్కారము నొంది శివత్వము నొందుచున్నాడు.

త్వరితం జీవితం యాతి త్వరితం యాతి యౌవనమ్ ।
త్వరితం వ్యాధిరభ్యేతి తస్మాత్పూజ్యః పినాకధృత్ ॥

జీవితము క్షణ క్షణమును నశించిపోవుచున్నది యౌవనము గూడ శీఘ్రముగ వెడలి పోవుచున్నది ఆలాగుననే వ్యాధియు శీఘ్రముగా దగ్గఱ జేరుచున్నది అందువల్ల కాలమును పోగొట్టుకొనక శీఘ్రముగా పరమేశ్వరు నారాధించ వలయును అనగా స్మరించవలయును



# గృహస్థాశ్రమ ప్రశంస

న్యాయార్జితధనస్తత్త్వజ్ఞాననిష్ఠోఽతిధి ప్రియః ।
శాస్త్రవిత్సత్యవాదీ చ గృహస్థోఽపి విముచ్యతే ॥ 1

న్యాయముగా ధనమును సంపాదించువాడును, తత్త్వజ్ఞాన నిష్ఠుడును, అతిధులను సత్కరించు స్వభావము కలవాడును, శాస్త్రజ్ఞుడును, సత్యవాదియు నగు గృహస్థుడు విముక్తు డగుచున్నాడు.

యది రామా యది చ రమా యది తనయో వినయధీర్గుణోపేతః ।
తనయే తనయోత్పత్తిః సురవరనగరే కిమాధిక్యమ్ ॥ 2

సంతోషమును కలుగజేయు భార్యయు, వినయువంతుడును, గుణవంతుడును నగు కుమారుండును, పుత్రులకు పుత్రులును వీరితో గూడిన గృహస్థాశ్రమము స్వర్గలోకముకన్నను మిక్కుట మగుచున్నది.

సవిప్రపాదోదక కర్దమాని సవేదశాస్త్రధ్వనిగర్జితాని ।
స్వాహాస్వధాకారనిరస్తరాణి స్వానన్దతుల్యాని గృహాణి తాని ॥ 3

ఎవరి గృహములు మహాత్ముల పాదోదకములచే బురద లగుచున్నవో, వేదశాస్త్ర ఘోషములచే ఒప్పుచున్నవో, హవిస్సులచే అలరారుచున్నవో ఆ గృహములే నిజమగు గృహములు అట్టి గృహములే ఆనందమును గలుగజేయుచున్నవి

సానందం సదనం సుతాశ్చ సుధియః కాన్తా న దుర్భాషిణీ
సన్మిత్రం సుధనం స్వయోషితి రతిః చాజ్ఞాపరాస్సేవకాః ।
ఆతిథ్యం శివపూజనం ప్రతిదినం మృష్టాన్నపానం గృహే
సాధోస్సంగముపాసతే హి సతతం ధన్యో గృహస్థాశ్రమః ॥ 4

ఆనందముతో కూడుకొన్నట్టి గృహము, బుద్ధిమంతులగు బిడ్డలు, ప్రియమును పలుకునట్టి భార్యయు, సన్మిత్రుడు, న్యాయార్జిత ధనము, స్వభార్యయందు రతియు, తమ ఆజ్ఞను అతిక్రమించని సేవకులు, గృహములో ప్రతిదినము అతిధి సేవనము, భగవంతుని పూజయు, శుద్ధమగు ఆహారము, ఎల్లప్పుడు సాధువులను సేవించుట -అనున వన్నియు చేకూరిన గృహస్థాశ్రమము ధన్యతను గాంచినది అట్టి గృహస్థులే పవిత్రులు

మానుష్యం వరవంశజన్మవిభవో దీర్ఘాయురారోగ్యతా
సన్మిత్రం సుసుతః సతీ ప్రియతమా భక్తిశ్చ నారాయణే ।
విద్వత్త్వం సుజనత్వ మింద్రియజయః సత్పాత్రదానే రతిః
తే పుణ్యేన వినా త్రయోదశ గుణాః సంసారిణాం దుర్లభాః ॥ 5

1) ఉత్తమమగు మనుష్యత్వము, 2) సద్గుణవంతుల వంశములో జన్మించుట, 3) సంపత్తు, 4) దీర్ఘాయుస్సు, 5) ఆరోగ్యము, 6) సన్మిత్రుడు, 7) వినయోపేత కుమారుడు, 8) మధురాలాపినియగు సతీమణి, 9) భగవద్భక్తి 10) జ్ఞానము, 11) మంచి స్వభావము కలిగియుండుట, 12) ఇంద్రియ జయము, 13) యోగ్యులకు దానము చేయవలయునను ప్రీతి - ఈ పదుమూడు గుణములు పుణ్యము లేనిచో గృహస్థులకు లభించవు

# పతివ్రతా లక్షణము

యస్య భార్యా శుచిర్దక్షా సదా భర్త్రనుగామినీ ।
నిత్యం మధురవక్త్రీ చ సా రమా న రమా రమా ॥ 6

ఎవని భార్య శుచియై, పుణ్యకర్మములో సమర్థురాలై, భర్తను అనుసరించు స్వభావము గలదియో, ఎల్లప్పుడు మధుర భాషిణియో అట్టి లలనామణియే భార్యయని చెప్పబడుచున్నది ఏతద్వ్యతిరిక్త లక్షణములు కలది భార్య కాదు దుఃఖదాయిని యగుచున్నది (లక్ష్మి లక్ష్మి గాదు, అట్టి వనితమే లక్ష్మి)

నిత్యం స్నాతా సుగన్ధా చ నిత్యం చ ప్రియవాదినీ ।
అల్పభుజ్మితవక్త్రీ చ దేవతా సా న మానుషీ ॥ 7

నిత్యము స్నానము చేయునట్టినదియు, పరిశుద్ధరాలును, కుంకుమాదులను ధరించునదియు, ఎల్లప్పుడును ప్రియమునే భాషించునదియు, మితముగా భోజనము చేయునదియు, మిత భాషిణియునగు సతి మనుష్య రూపము ధరించి యుండిన దేవతా స్వరూపిణిగా గణింపబడుచున్నది

కల్యోత్థానపరా నిత్యం గురుశుశ్రూషణే రతా ।
సుసంమృష్టగృహా చైవ గోశకృత్కృతలేపనా ॥ 8

ఏ గృహిణి తెల్లవారు జామున లేచునదియు, సర్వదా గురువులను సేవించునట్టిదియు, గృహమును గోమయముచే అలుకునదియు, గృహమును ఎప్పుడును శుద్ధముగా చేయునదియు నగుచున్నదో అట్టిదియే గృహిణి యని చెప్పబడుచున్నది

శ్వశ్రూశ్వశురయోః పాదౌ తోషయన్తీ పతివ్రతా ।
మాతాపితృపరా నిత్యం యా నారీ సా పతివ్రతా ॥ 9

తన తల్లి దండ్రుల, అత్తమామల పాదములకు మ్రొక్కి వారియందలి భక్తిచే భరితురాలగు నారి పతివ్రత యని చెప్పబడుచున్నది

భక్తిః ప్రేయసి సంశ్రితేషు కరుణా శ్వశ్రూషు నమ్రం శిరః
ప్రీతిర్యాతృషు గౌరవం గురుజనే క్షాన్తిః కృతాగస్యపి ।
అమ్లానః కులయోషితాం వ్రతవిధిః సోఽయం విధేయః పునః
మద్భర్తుర్దయితా ఇతి ప్రియసఖీబుద్ధిస్సపత్నీష్వపి ॥ 10

భర్తయందు భక్తి, ఆశ్రయించిన వారియందు దయ, అత్తమామలపై నమ్రత, తోడికోడండ్రపై అతిధులపై ప్రీతి, గురువులపై గౌరవము, అపరాధులపై గూఢ ఓర్పు- ఇవన్నియు నుండుట కులస్త్రీలకు చెడని వ్రతము మఱియు సవతులపై స్నేహము గలిగి యుండుటయు ఆచరించవలయును



# పతివ్రతా మాహాత్మ్యము

శ్రీస్కాందమహాపురాణే తృతీయే బ్రహ్మఖండే ధర్మారణ్యఖండే
శ్రీసూత శౌనకమహాముని సంవాదరూపం పతివ్రతా మాహాత్మ్యమ్ ।

శృణు సూత! మహాభాగ సర్వధర్మవిదాం వర ।
గృహస్థానాం సదాచారః శ్రుతశ్చ త్వన్ముఖాన్మయా ॥ 1

ఏకం మమేప్సితం మే తత్కథయస్వాద్య సూతజ! ।
పతివ్రతానాం సర్వాసాం లక్షణం కీదృశం వద ॥ 2

ఓసూతమహర్షీ ! మహాభాగా ! ధర్మతత్త్వజ్ఞ శ్రేష్ఠా! తమ ద్వారా గృహస్థుల సదాచారములను వింటిని ఇకనొకటి యున్నది అద్దాని నిప్పుడు చెప్పదొడంగుము. అదేమన మహాపతివ్రతల లక్షణము లెట్టివో చెప్పుము

సూత ఉవాచ =సూతుడు పలికెను.

పతివ్రతా గృహే యస్య సఫలం తస్య జీవనమ్ ।
యస్యాంగచ్ఛాయయా తుల్యా యత్కథా పుణ్యకారిణీ ॥ 3

ఎవని గృహమున పతివ్రత యుంటున్నదో వాని జన్మము సార్థకము

పతివ్రత తన శరీరచ్ఛాయ (నీడ) వలె తనను అనుసరించి యుండును అట్టి పవిత్ర స్వరూపిణి చరిత్ర పుణ్యమును కలుగజేయును

పతివ్రతాస్త్వరున్ధత్యా సావిత్ర్యావ్యనసూయయా ।
శాండిల్యాచైవ సత్యా చ లక్ష్మ్యాచ శతరూపయా । 4

మేనయా చ సునీత్యా చ సంజ్ఞయా స్వాహయా సమా : ।
పతివ్రతానాం ధర్మా హి మునినా చ ప్రకీర్తితాః ॥ 5

పతివ్రతలు అరుంధతి, సావిత్రి, అనసూయ, శాండిలి, సతి, లక్ష్మి, శతరూప, మేనక, సునీతి, సంజ్ఞ, స్వాహాదేవి అను వారలతో సమానలు అనగా పాతివ్రత్యము గల సహధర్మచారిణులు పై బేర్కొన్న పతివ్రతల వలె అట్టి ప్రభావమును పవిత్రతయును గలిగి యుందురు పతివ్రతా ధర్మములు వ్యాసమహర్షిచే ముందు పేర్కొనబడినవి.

భుంక్తే భుక్తే స్వామిని చ తిష్ఠతి త్వనుతిష్ఠతి ।
వినిద్రితే యా నిద్రాతి ప్రథమం పరిబుధ్యతి ॥ 6

పతివ్రతా ధర్మములు - ప్రభువగు భర్త భుజించిన తాను భుజించుటయు, భర్త నిలబడినచో తాను వెంబడే నిలుచుటయు, భర్త నిద్రించిన తర్వాతనే తాను పరుండుటయు, పతికన్న ముందుగానే తాను నిద్రనుండి లేచుటయు నగును

అనలంకృతమాత్మానం దేశాంతే భర్తరి స్థితే ।
కార్యార్థ ప్రోషితే క్వాపి సర్వమండనవర్జితా ॥ 7

మరియొక దేశమున భర్త నివసించుచుండినను, కార్యాంతరమున గ్రామాంతరమునకు వెళ్లినను తాను అలంకారములచే భూషితురాలు కాకుండుట.

భర్తుర్నామ న గృహ్ణాతి హ్యాయుషోఽన్య హి వృద్ధయే ।
పురుషాంతరనామాపి న గృహ్ణాతి కదాచన ॥ 8

భార్య భర్తయొక్క ఆయుస్సును కోరినట్టిదై భర్త నామధేయమును గ్రహించకుండుట, చెప్పకుండుట, పరపురుముని వర్ణనను ఎప్పుడును

చేయకుండుట - ఈ మొదలగునవి పతివ్రతా ధర్మములు

**ఆహూతా గృహకార్యాణి త్యక్త్వా గచ్ఛతి సత్వరమ్ ॥**
**కిమర్థం వ్యాహృతా నాథ స ప్రసాదో విధీయతామ్ ॥** 9

గృహ కార్యములను నిర్వర్తించుచుండినను తన పతి పిలిచిన ఆ కార్యముల నన్నింటిని విడనాడి శీఘ్రముగా భర్తను సమీపించును ఓ నాథా! ఎందులకు పిలువబడితినో అనుగ్రహించుడని తాను నుడువును.

**న చిరం తిష్ఠతి ద్వారి న ద్వారముపసేవతే ।**
**అదాతవ్యం స్వయం కించిత్ కస్మైచిన్న దదాత్యపి ॥** 10

వాకిట చాల కాలము ఉండదు వాకిట మరుగున నిలువదు తానివ్వదగని వస్తువును కొంచెము కూడ ఒకప్పుడును ఎవ్వరికి నివ్వదు

**పూజోపకరణం సర్వమనుక్తా సాధయేత్స్వయమ్ ।**
**నియతోదకబర్హీంషి యత్ర పుష్పాక్షతాదికమ్ ॥** 11

భర్త చెప్పకనే స్వయముగా సమిధలు, తీర్థము, దర్భలు, పుష్పములు, అక్షతలు మొదలుగా గల పూజా సామగ్రి నంతయు సిద్ధము చేసియుంచును

**ప్రతీక్షమాణా చ వరం యథాకాలోచితం హి యత్ ।**
**తదుపస్థాపయేత్సర్వమనుద్విగ్నాఽతిహృష్టహృత్ ॥** 12

మహా సంతోషము గలదై, కొంచెము కూడ శ్రమయని తలచనిదై, భర్త కొరకు నిరీక్షించుచున్నదై ఏయే కాలమునకు ఏదేది యవసరమో అదంతయు ఆయా కాలములలో సిద్ధము చేసి యుంచును

**సేవతే భర్తురుచ్ఛిష్టమిష్టమన్నం ఫలాదికమ్ ॥** 13

తన భర్త యొక్క ఉచ్ఛిష్టములగు అన్నము, ఫలము మొదలుగా గల వాటిని పవిత్రములని తలంచును. ఇష్టములగు వాటిని భుజించును

**హరిద్రాం కుంకుమం చైవ సిందూరం కజ్జలం తథా ।**
**కూర్పాసకం చ తాంబూలం మాంగళ్యాభరణం శుభమ్ ॥** 14

కేశ సంస్కారకం చైవ కరకర్ణాది భూషణమ్ ।
భర్తురాయుష్య మిచ్ఛన్తీ దూరయేన్న పతివ్రతా ॥ 15

పసుపు, కుంకుమ, సిందూరద్రవ్యము, కాటుక, రవిక, తాంబూలము, మాంగళ్యవంతములగు ఆభరణములు, వెండ్రుకలను సంస్కరించుట, కరకర్ణాది భూషణములు - వీటిని మంగళవతులు విడనాడకూడదు ఇట్లుల నుండుటచే తన పతి యొక్క ఆయుష్యమును వృద్ధిచేసిన వారగుదురు. అనగా సర్వదా సుమంగళులు అని భావము

భర్తృవిద్వేషిణీం నారీం నైషా సంభాషతే క్వచిత్ ।
నైకాకినీ క్వచిత్ భూయాన్న నగ్నా స్నాతి చ క్వచిత్ ॥ 16

ఏ స్త్రీ భర్తను ద్వేషించునో అట్టి స్త్రీతో సంభాషణను మానుకొనవలయును తానొంటరిగా ఒకప్పుడును ఉండకూడదు వస్త్రహీనయై యెప్పుడును స్నానము చేయకూడదు.

నోలూఖలే న ముసలే న వర్ధన్యాం దృషద్యపి ।
న యన్త్రకేన దేహల్యాం సతీ చోపవిశేత్క్వచిత్ ॥ 17

సుమంగళులు రోలు, రోకలి, పొరక, విసరురాయి, రంగులరాట్నము మొదలగు యంత్రములు, వాకిలి - వీటి మీద కూర్చుండగూడదు

వినా వ్యవాయసమయాత్ ప్రాగల్భ్యం న క్వచిచ్చరేత్ ।
యత్ర యత్ర రుచిర్భర్తుస్తత్ర ప్రేమవతీ సదా ॥ 18

ఉచిత సమయమునందు తప్ప ప్రగల్భపు మాటలను ఒకానొకప్పుడును అవలంబించకూడదు. ఏయే వస్తువులయందు తన భర్తకు ప్రీతి కలదో ఆయా వస్తువులన్నిటి యందును ప్రేమ కలిగి యుండవలయును.

ఇదమేవ వ్రతం స్త్రీణామయమేవ వరో వృషః ।
ఇయమేవ చ పూజా చ భర్తృవాక్యం న లంఘయేత్ ॥ 19

స్త్రీలకు భర్త వాక్యమును అతిక్రమింప కుండుటయే ముఖ్యమగు ధర్మము,

వ్రతము, పూజయు అగుచున్నది

**క్లీబం వా దురవస్థం వా వ్యాధితం వృద్ధమేవ వా ।**
**సుస్థిరం దుస్థ్సిరం వాఽపి పతిమేకం న లంఘయేత్ ॥ 20**

భర్త నపుంసకుడైనను, కష్టదశలో నున్నను, రోగగ్రస్తుడైనను, ముదుసలియైనను, చపలాత్ముడైనను, స్థిరమగు మనస్సు గలవాడైనను పతివ్రతా స్త్రీ పతిని తిరస్కరించకూడదు

**సర్పిర్లవణహింగ్వాదిక్షయేఽపి చ పతివ్రతా ।**
**పతిం నాస్తీతి న బ్రూయాదాయసీషు న భోజయేత్ ॥ 21**

ఘృతము, ఉప్పు, ఇంగువ మొదలగు వస్తువులు లేకున్నను లేదని చెప్పుచు భర్తను పీడింపకూడదు ఇనుప పాత్రల యందు భోజనము పెట్టకూడదు

**ఉక్తా ప్రత్యుత్తరం దద్యాన్నారీ యా క్రోధతత్పరా ।**
**సరమా జాయతే గ్రామే శృగాలీ నిర్జనే వనే ॥ 22**

ఏ స్త్రీ పతిమాటను వినక క్రోధురాలై జవాబు ఇచ్చునో ఆమె మరుజన్మములో ఆడుకుక్కగను, ఘోరారణ్యమున ఆడునక్కగను జన్మించును

**స్త్రీణాం హి పరమశ్చైకో నియమస్సముదాహృతః ।**
**అభ్యర్చ్య చరణౌ భర్తుః భోక్తవ్యం కృతనిశ్చయా ॥ 23**

స్త్రీలకు ఈ నియమము ముఖ్యము. అదేమన పతి పాదములకు పూజ చేసి నిశ్చలమతులై భోజనము చేయవలయును

**ఉచ్చాసనం న సేవేత న వ్రజేత్పరవేశ్మసు ।**
**తత్ర పారుష్య వాక్యాని బ్రూయాన్నైవ కదాచన ॥ 24**

స్త్రీలున్నతాసనముల మీద కూర్చొన కూడదు. పొరుగిండ్లకు జనకూడదు ఏ చోటునందును, ఏ సమయమునందైనను కఠిన వాక్యములను పలుకకూడదు

**గురూణాం సన్నిధౌ వాపి నోచ్చైర్బ్రూయాన్న వాహయేత్ ॥**

గురువుల సమీపమున బిగ్గరగా సంభాషింపగూడదు కార్యభారమును వారిపై మోపగూడదు.

**యా భర్తారం పరిత్యజ్య రహశ్చరతి దుర్మతిః ।**
**ఉలూకీ జాయతే క్రూరా వృక్షకోటర శాయినీ ॥ 25**

ఎవతె భర్తను విడనాడి దుష్టబుద్ధి కలదై రహస్యముగ సంచరించునో ఆమె తొఱ్ఱలో వసించు క్రూర స్వభావము గల గ్రుడ్లగూబయై పుట్టును

**తాడితా తాడయేచ్చేత్తం సా వ్యాఘ్రీ వృషదంశికా ।**
**కటాక్షయతి యాఽన్యం వై కేకరాక్షీ తు సా భవేత్ ॥ 26**

భర్త కొట్టినచో తిరిగికొట్టు నట్టి స్త్రీ ఆడపులిగా, లేక ఆడ పిల్లిగా జన్మించును దోషదృష్టితో ఇతరుని ఏనారి గాంచునో, ఆ వనిత మెల్లకన్ను కలదిగా నగును

**యా భర్తారం పరిత్యజ్య మిష్టమశ్నాతి కేవలమ్ ।**
**గ్రామే సా సూకరీ భూయాత్ వల్గులీవాథ విడ్భుజా ॥ 27**

ఏ వధువు భర్తను భుజింపజేయక తాను మాత్రము షడ్రసోపేతమగు అన్నమును తినునో, అట్టి వనిత గ్రామములో ఆడుపందిగానో, లేక మలమును భక్షించు బరిణ పురుగునో జన్మించును

**హుస్త్వంకృత్యాఽప్రియం బ్రూతే మూకా సా జాయతే ఖలు ।**
**యా సపత్నీం సదేర్ష్యేత దుర్భగా సా పునః పునః ॥ 28**

ఎవతె హుంకరించి భర్తతో అప్రియములగు వాక్యములను మాట్లాడునో, ఆస్త్రీ మూగది యగును. సవతిని ద్వేషించు స్వభావము కల స్త్రీ దౌర్భాగ్యురాలగును

**దృష్టిం విలుప్య భర్తుర్యా కంచిదన్యం సమీక్షతే ।**
**కాణా చ విముఖా వాపి కురూపాఽపి చ జాయతే ॥ 29**

భర్తను మరుగుపరచి యితరుని ఏ వనిత గాంచునో, అట్టిది గ్రుడ్డిదిగాను, వక్రముఖిగాను, రూపహీనురాలుగాను పుట్టును

బాహ్యేదాయాంతమాలోక్య త్వరితా చ జలాసనైః ।
తాంబూలైర్వ్యజనైశ్చైవ పాదసంవాహనాదిభిః ॥ 30

తథైవ చారువచనైః స్వేదసన్నోదనైః పరైః ।
యా ప్రియం ప్రీణయే త్ప్రీతా త్రిలోకీ ప్రీణితా తయా ॥ 31

భర్త ఆయాసముతో వెలుపలినుండి రాగానే చూచి త్వరిత గమనము కలదై జలము, ఆసనము నొసగి తాంబూలము నిచ్చి, విసరుట, పాదముల నొత్తుట మొదలగువాటి చేతను, మృదుమధుర వాక్యముల చేతను శ్రమమును పోగొట్టి ఏ పతివ్రత భర్తను సంతోష పెట్టునో ఆ పతివ్రత మూడు లోకములను సంతోష పెట్టిన దగును.

యమదూతాః పలాయతే తామాలోక్య పతివ్రతామ్ ।
తపనస్తప్యతే నూనం దహనోఽపి చ దహ్యతే ।
కంపంతే సర్వ తేజాంసి దృష్ట్వా పాతివ్రతం మహః ॥ 32

పాతివ్రత్యమును ధరించిన సహధర్మచారిణిని గాంచిన యమదూతలు పరుగిడుదురు సూర్యుడు తాపము నొందును అగ్నియు దహింపబడును ఇవి యవి యననేల, పాతివ్రత్య మాహాత్మ్యముచే సమస్త తేజస్సులు గడ గడ వడంకును

ధన్యా సా జననీ లోకే ధన్యోఽసౌ జనకః పునః ॥
ధన్యస్స చ పతిః శ్రీమాన్ యేషాం గేహే పతివ్రతా ॥ 33

ఎవరియింటిలో పతివ్రత నివసించునో ఆమె తల్లిదండ్రులు, భర్తయు కృతార్థు లగుదురు.

పితృవంశ్యా మాతృవంశ్యాః పతివంశ్యా స్త్రయస్త్రయః ।
పతివ్రతాయాః పుణ్యేన స్వర్గసౌఖ్యాని భుంజతే ॥ 34

పతివ్రతయొక్క పుణ్యముచేత పితృ వర్గములో చేరిన మూడు తరముల వారును, మాతృవర్గములో చేరిన మూడు తరముల వారును, పతివర్గములో చేరిన మూడు తరముల వారును స్వర్గసౌఖ్యముల ననుభవించుచున్నారు

శీలభంగేన దుర్వృత్తాః పాతయంతి కులత్రయమ్ ।
పితుర్మాతు స్తథా పత్యురిహాముత్ర చ దుఃఖితాః ॥ 35

ఏ స్త్రీలు దుష్టస్వభావము కలవారగుదురో వారల తల్లి, దండ్రి, పెనిమిటి-వీరల కులములను నశింపజేయడమేకాక తామును ఇహపరలోక సుఖములకు దూరమగుదురు

పతివ్రతాయాశ్చరణో యత్ర యత్ర స్పృశేద్భువమ్ ।
సా తీర్థభూమిర్మాన్యేతి నాత్ర భారోఽస్తి పావనః ॥ 36

పతివ్రత యెచ్చటెచ్చట పాదముల నిడునో ఆ ప్రదేశము లన్నియు తీర్థము వలె పూజనీయము లగును భూభార ముండదు ఆ ప్రదేశము లన్నియు పవిత్రము లగును

ఆపః పతివ్రతాస్పర్శమభిలష్యన్తి సర్వదా ।
గాయత్ర్యాఽఘవినాశో నో పాతివ్రత్యేన సాఽఘనుత్ ॥ 37

గంగాది జలములు పవిత్రతత కొరకై పతివ్రతా స్నానమును కోరుచున్నవి గాయత్రిచే కూడా నశించని పాపములు పాతివ్రత్యము చేత నశింపజేయబడును

గృహే గృహే న కిం నార్యః రూపలావణ్యగర్వితాః ।
పరం విశ్వేశభక్త్యైవ లభ్యతే స్త్రీ పతివ్రతా ॥ 38

లోకములో ప్రతి గృహములోను రూపలావణ్యాదులచే గర్వితులైన స్త్రీలు ఎందరు లేరు? ఈశ్వరునియందు భక్తి గల వారికే పతివ్రతలు లభించెదరు.

భార్యా మూలం గృహస్థస్య భార్యా మూలం సుఖస్య చ ।
భార్యా ధర్మఫలాయైవ భార్యా సంతానవృద్ధయే ॥ 39

గృహస్థునకు భార్యయే ముఖ్య కారణము సుఖమునకు, ధర్మ ఫలమునకు, సంతానాభివృద్ధికి భార్యయే కారణము

**పరలోకస్త్వయం లోకో జీయతే భార్యయా ద్వయమ్।**
**దేవపిత్రతిథీనాం చ తృప్తిస్స్యాద్భార్యయా గృహే ॥ 40**

ఇహ పరలోక సుఖమునకును భార్యయే ముఖ్యకారణము ఇంటిలో పతివ్రత యుండుటచే దేవతలు, పితృదేవతలు, అతిధులు తృప్తి నొందుదురు.

**గృహస్థస్స తు విజ్ఞేయో గృహే యస్య పతివ్రతా ॥ 41**

ఎవని యింటిలో పతివ్రత యున్నదో వాడే సద్గృహస్థుడని చెప్పబడు చున్నాడు

**యధా గంగావగాహేన శరీరం పావనం భవేత్ ।**
**తధా పతివ్రతాం దృష్ట్వా సదనం పావనం భవేత్ ॥ 42**

గంగలో స్నానము చేయుటచేత శరీరము పవిత్ర మగును అటులనే పతివ్రతా నివాసముచే గృహము పావన మగును

**యద్యదిష్టతమం లోకే యద్యత్పత్యుః సమీహితమ్ ।**
**తత్తద్గుణవతే దేయం పతిప్రీణనకామ్యయా ॥ 43**

తన భర్తకు ఏది యేది ఇష్టతమమగు వస్తువో దానిని భర్త తృప్తి బొందును గాక అనుబుద్ధితో సద్గుణవంతునికి దానము చేయవలయును

**వైశాఖే కార్తికే మాసే విశేషనియమాంశ్చరేత్ ।**
**స్నానం దానం తీర్థయాత్రాం పురాణశ్రవణం ముహుః ॥ 44**

వైశాఖమాసములోను, కార్తిక మాసములోను విశేష నియమములను పరలోకగత భర్తృకలు ఆచరించవలెను స్నానము, విశేషదానము, తీర్థాటనము, పురాణశ్రవణము అను వాటిని ఆదరముతో చేయవలయును.

వైశాఖే జలకుంభాశ్చ కార్తికే ఘృతదీపికాః ।
మాఘే ధాన్యతిలోత్సర్గః స్వర్గలోకే విశిష్యతే ॥ 45

వైశాఖ మాసములో జలకుంభములు, కార్తిక మాసములో ఘృతదీపములు, మాఘమాసములో నువ్వులు - దానము చేయవలయును ఇట్లు దానము చేసినవారు స్వర్గలోకములో పూజింపబడెదరు.

ప్రపా కార్యా చ వైశాఖే దేవే దేయా గలంతికా ।
ఉశీరం వ్యజనం ఛత్రం సూక్ష్మవాసాంసి చన్దనమ్ ॥ 46

సకర్పూరం చ తాంబూలం పుష్పదానం తథైవ చ ।
జలపాత్రాణ్యనేకాని తథా పుష్పగృహాణి చ ॥ 47

పానాని చ విచిత్రాణి ద్రాక్షారంభాఫలాని చ ।
దేయాని ద్విజముఖ్యేభ్యః పతిర్మే ప్రీయతామితి ॥ 48

వైశాఖ మాసములో చలవ పందిళ్ళను ఏర్పాటు గావించవలయును. మరియు దేవునికి గరిక కుండలు (కలశస్థాపనలు) స్థాపించవలయును. వట్టివేళ్ళ విసనకఱ్ఱలు, గొడుగులు, మంచి వస్త్రములు, చన్దనము, కర్పూరముతో కూడుకొన్న తాంబూలము, పుష్పములు, నీటి చెంబులు (జలపాత్రలు) ,పుష్పాలంకృత గృహములు లేక పుష్పవన యుత గృహములు, మధురములగు పానకము మొదలగునవియు, ద్రాక్షపండ్లు, అరటిపండ్లు - ఈ ద్రవ్యములను 'నా భర్తకు ఆత్మసంతృప్తి కలుగుగాక' అను దృఢసంకల్పముతో బ్రహ్మజ్ఞానులు మొదలగు ఉత్తములగు వారికి దానము చేయవలయును

ఊర్జే యవాన్నమశ్నీయాదేకాన్న మథవా పునః ।
వృన్తాకం సూరణం చైవ శూకశింబీం చ వర్జయేత్ ॥ 49

కార్తికే వర్జయేత్తైలం కాంస్యం చాపి వివర్జయేత్ ।
కార్తికే మౌననియమే చారుఘంటాం ప్రదాపయేత్ ॥ 50

కార్తికమాసములో వ్రతము గలవారలు వంకాయలు, కందగడ్డలు,

దురదకందలను భుజించకూడదు. గోధుమ అన్నమును మాత్రము భక్షించవలెను. లేక స్వయం పాకమును చేసికొనవలెను కార్తికమాసములో అభ్యంగస్నానము, తైలము పూసికొనుట, కంచములో భుజించుటలను విసర్జించవలెను. కార్తిక మాసములో మౌనవ్రతము నాచరించి మనోహరమగు ఘంటను దానము చేయుటగాని లేక చేయించుటగాని చేయవలెను

**పత్రభోజీ కాంస్యపాత్రం ఘృతపూర్ణం ప్రయచ్ఛతి ।**
**భూమిశయ్యా వ్రతే దేయా శయ్యా శ్లక్ష్ణాంసతూలికా ॥ 51**

పత్రములలో భోజనము చేయవలయును. నేతిచే నిండిన కంచుపాత్రను దానము చేయవలయును, వ్రతానుష్ఠాన సమయములో భూశయ్యను గావించుకొనవలయును మృదువగు దూదిచే నమర్చబడిన శయ్యను గుణవంతునికి దానము చేయవలయును

**ఫలత్యాగే ఫలం దేయం రసత్యాగే చ తద్రసః ।**
**ధాన్యత్యాగే చ తద్ధాన్యమథవా శాలయస్స్మృతాః ॥ 52**

తనచే విసర్జింపబడిన ఫల రసవర్గములను ఉత్తములకు నొసగవలయును. అటులనే ధాన్యములను లేక వడ్లను దానము చేయవలయును

**ధేనుం దద్యాత్ప్రయత్నేన సాలంకారాం సకాంచనామ్ ॥**

బాగుగా నలంకరించిన ధేనువును (గోవును) బంగారు తోటి యత్నముతో మహాత్ములకు నొసగవలయును

**ఏకతస్సర్వదానాని దీపదానం తథైకతః ।**
**కార్తికే దీపదానస్య కలాం నార్హంతి షోడశీమ్ ॥ 53**

కార్తికమాసములో దీపదానముయొక్క ఫలాంశములో తదితరములగు సమస్త దానఫలములు పదునాఱువపాలును గూడ ఫలమును వహింపజాలవు. కార్తిక మాసములో దీపదానము మిక్కిలి ముఖ్యముగా మహాత్ములచే పేర్కొనబడినదని యెఱుంగునది.

ఇత్యాది విధవానాం చ నియమాస్సంప్రకీర్తితాః ।

ఇటుల వితంతువుల నియమములు చెప్పబడెను



# పతివ్రతోపాఖ్యానమ్

## (శ్రీమహాభారతే ఆరణ్య పర్వణి)

**మార్కండేయ ఉవాచ :-**

కశ్చిద్ద్విజాతి ప్రవరో వేదాధ్యాయీ తపోధనః ।
తపస్వీ ధర్మశీలశ్చ కౌశికో నామ భారత ॥ 1

సాంగోపనిషదో వేదానధీతే ద్విజసత్తమః ।
స వృక్షమూలే కస్మింశ్చిద్వేదానుచ్చారయన్ స్థితః ॥ 2

ఉపరిష్టాచ్చ వృక్షస్య బలాకా సంన్యలీయత ।
తయా పురీషముత్సృష్టం బ్రాహ్మణస్య తదోపరి ॥ 3

తామవేక్ష్య తతః క్రుద్ధః సమపద్యత స ద్విజః ।
భృశం క్రోధాభిభూతేన బలాకా సా నిరీక్షితా ॥ 4

అపధ్యాతా చ విప్రేణ న్యపతద్ధరణీతలే ।
బలాకాం పతితాం దృష్ట్వా గత సత్త్వామచేతనామ్ ॥ 5

కారుణ్యాదభిసంతప్తః పర్యశోచత తాం ద్విజః ।
అకార్యం కృతవానస్మి రోగరాగ బలాత్కృతః ॥ 6

ఇత్యుక్త్వా బహుశో విద్వాన్ గ్రామం భైక్ష్యాయ సంశ్రితః ।
గ్రామే శుచీని ప్రచరన్ కులాని భరతర్షభ ॥ 7

ప్రవిష్టస్తత్కులం యత్ర పూర్వం చరితవాంస్తు సః ।
దేహీతి యాచమానోఽసౌ తిష్ఠేత్యుక్తః స్త్రియా తతః ॥ 8

శౌచం తు యావత్కురుతే భాజనస్య కుటుంబినీ ।
ఏతస్మిన్నంతరే రాజన్ క్షుధాసంపీడితో భృశమ్ ॥ 9

భర్తా ప్రవిష్టః సహసా తస్యా భరతసత్తమ ।
సా తు దృష్ట్వా పతిం సాధ్వీ బ్రాహ్మణం వ్యవహాయ తమ్ ॥ 10

పాద్యమాచమనీయం వై దదౌ భర్తుస్తథాఽఽసనమ్ ।
ప్రహ్వా పర్యచరచ్చాపి భర్తారమసితేక్షణా ॥ 11

ఆహారేణాథ భక్ష్యైశ్చ భోజ్యైః సుమధురైస్తథా ।
ఉచ్ఛిష్టం భావితా భర్తుర్భుంక్తే నిత్యం యుధిష్ఠిర ॥ 12

దైవతం చ పతిం మేనే భర్తుశ్చిత్తానుసారిణీ ।
కర్మణా మనసా వాచా నాన్యచింతాఽభ్యగాత్పతిమ్ ॥ 13

తం సర్వభావోపగతా పతిశుశ్రూషణే రతా ।
సాధ్వాచారా శుచిర్దక్షా కుటుంబస్య హితైషిణీ ॥ 14

భర్తుశ్చాపి హితం యత్తత్సతతం సాఽనువర్తతే ।
దేవతాతిథిభృత్యానాం శ్వశ్రూశ్వశురయోస్తథా ॥ 15

శుశ్రూషణపరా నిత్యం సతతం సంయతేంద్రియా ।
సా బ్రాహ్మణం తదా దృష్ట్వా సంస్థితం భైక్షకాంక్షిణమ్ ॥ 16

కుర్వతీ పతిశుశ్రూషాం సస్మారాథ శుభేక్షణా ।
వ్రీడితా సాఽభవత్ సాధ్వీ తదా భరతసత్తమ ॥ 17
భిక్షామాదాయ విప్రాయ నిర్జగామ యశస్వినీ ।

బ్రాహ్మణ ఉవాచ:-

కిమిదం భవతి త్వం మాం తిష్ఠేత్యుక్త్వా వరాంగనే ॥ 18
ఉపరోధం కృతవతీ న విసర్జితవత్యసి ।

మార్కండేయ ఉవాచ :-

బ్రాహ్మణం క్రోధసంతప్తం జ్వలంత మివ తేజసా ॥ 19
దృష్ట్వా సాధ్వీ మనుష్యేంద్ర సాంత్వపూర్వం వచోఽబ్రవీత్ ।

బ్రాహ్మణ్యువాచ :-

క్షంతుమర్హసి మే విద్వన్! భర్తా మే దైవతం మహత్ ॥ 20
స చాపి క్షుధితశ్శ్రాంతః ప్రాప్తః శుశ్రూషితో మయా!

బ్రాహ్మణ ఉవాచ:-

బ్రాహ్మణా న గరీయాంసో గరీయాం స్తే పతిః కృతః ॥ 21

గృహస్థధర్మే వర్తన్తీ బ్రాహ్మణానవమన్యసే ।
ఇంద్రోఽప్యేషాం ప్రణమతే కిం పునర్మానవో భువి ॥ 22

అవలిప్తే న జానీషే వృద్ధానాం న శ్రుతం త్వయా ।
బ్రాహ్మణా హ్యగ్నిసదృశా దహేయుః పృథివీమపి ॥ 23

బ్రాహ్మణ్యువాచ:-

నాహం బలాకా విప్రేంద్ర! త్యజ క్రోధం తపోధన ।
అనయా క్రుద్ధయా దృష్ట్యా క్రుద్ధః కిం మాం కరిష్యసి ॥ 24

నావజానామ్యహం విప్రాన్ దేవైస్తుల్యాన్ మనస్వినః ।
అపరాధమిమం విప్ర క్షంతుమర్హసి మేఽనఘ ॥ 25

జానామి తేజో విప్రాణాం మహాభాగ్యం చ ధీమతామ్ ।
అపేయః సాగరః క్రోధాత్ కృతో హి లవణోదకః ॥ 26

తథైవ దీప్తతపసాం మునీనాం భావితాత్మనామ్ ।
యేషాం క్రోధాగ్నిరద్యాపి దండకే నోపశామ్యతి ॥ 27

బ్రాహ్మణానాం పరిభవాద్వాతాపిః స దురాత్మవాన్ ।
అగస్త్యమృషిమాసాద్య జీర్ణః క్రూరో మహాసురః ॥ 28

బహుప్రభావాః శ్రూయంతే బ్రాహ్మణానాం మహాత్మనామ్ ।
క్రోధః స విపులో బ్రహ్మన్! ప్రసాదశ్చ మహాత్మనామ్ ॥ 29

అస్మిం స్త్వతిక్రమే బ్రహ్మన్! క్షంతుమర్హసి మేఽనఘ।
పతిశుశ్రూషయా ధర్మో యః స మే రోచతే ద్విజ ॥ 30

దైవతేష్వపి సర్వేషు భర్తా మే దైవతం పరమ్ ।
అవిశేషణ తస్యాహం కుర్యాం ధర్మం ద్విజోత్తమ ॥ 31

శుశ్రూషాయాః ఫలం పశ్య పత్యుర్బ్రాహ్మణ యాదృశమ్ ।
బలాకా హి త్వయా దగ్ధా రోషాత్తద్విదితం మయా ॥ 32

క్రోధః శత్రుః శరీరస్థో మనుష్యాణాం ద్విజోత్తమ ।
యః క్రోధమోహౌ త్యజతి తం దేవా బ్రాహ్మణం విదుః॥ 33

యో వదేదిహ సత్యాని గురుం సంతోషయిష్యతి ।
హింసితశ్చ న హింసేత తం దేవా బ్రాహ్మణం విదుః॥ 34

జితేంద్రియో ధర్మపరః స్వాధ్యాయనిరతః శుచిః ॥
కామక్రోధౌ వశే యస్య తం దేవా బ్రాహ్మణం విదుః ॥ 35

యస్య చాత్మసమో లోకో ధర్మజ్ఞస్య మనస్వినః ।
పరధర్మేషు చ రతస్తం దేవా బ్రాహ్మణం విదుః ॥ 36

యోఽధ్యాపయేదధీయాత యజేద్వా యాజయేత వా ।
దద్యాద్వాఽపి యథాశక్తి తం దేవా బ్రాహ్మణం విదుః ॥ 37

బ్రహ్మచారీ చ వేదాన్ యోఽప్యధీయా ద్విజపుంగవః ।
స్వాధ్యాయే చాప్రమత్తో వై తం దేవా బ్రాహ్మణం విదుః ॥ 38

యద్బ్రాహ్మణానాం కుశలం తదేషాం పరికీర్తయేత్ ।
సత్యం తథా వ్యాహరతాం నానృతే రమతే మనః ॥ 39

ధర్మం తు బ్రాహ్మణస్యాహుః స్వాధ్యాయం దమమార్జవమ్ ।
ఇంద్రియాణాం నిగ్రహం చ శాశ్వతం ద్విజసత్తమ ॥ 40

సత్యార్జవం ధర్మమాహుః పరం ధర్మవిదో జనాః ।
దుర్జ్ఞేయః శాశ్వతో ధర్మః స చ సత్యే ప్రతిష్ఠితః ॥ 41

శ్రుతిప్రమాణో ధర్మః స్యాదితి వృద్ధానుశాసనమ్ ।
బహుధా దృశ్యతే ధర్మస్సూక్ష్మ ఏవ ద్విజోత్తమ ॥ 42

భగవానపి ధర్మజ్ఞః స్వాధ్యాయ నిరతః శుచిః ।
న తు తత్త్వేన భగవన్ ధర్మం వేత్సీతి మే మతిః ॥ 43

యది విప్ర న జానీషే ధర్మం పరమకం ద్విజ।
ధర్మవ్యాధం తతః పృచ్ఛ గత్వా తు మిథిలాం పురీమ్ ॥ 44

మాతాపితృభ్యాం శుశ్రూషుః సత్యవాదీ జితేంద్రియః ।
మిథిలాయాం వసేద్వ్యాధస్స తే ధర్మాన్ ప్రవక్ష్యతి ॥ 45

తత్ర గచ్ఛస్వ భద్రం తే యథా కామం ద్విజోత్తమ ।
అత్యుక్తమపి మే సర్వం క్షంతు మర్హస్యనిందిత ॥ 46

స్త్రియో హ్యవధ్యా స్సర్వేషాం యే ధర్మమభివిందతే ।

**బ్రాహ్మణ ఉవాచః-**

ప్రీతోఽస్మి తవ భద్రం తే గతః క్రోధశ్చ శోభనే ॥ 47
ఉపాలంభస్త్వయాత్యుక్తో మమ నిశ్శ్రేయసం పరమ్ ।
స్వస్తి తేఽస్తు గమిష్యామి సాధయిష్యామి శోభనే ॥ 48

మార్కండేయ ఉవాచ:-

తయా నిసృష్టో నిర్గమ్య స్వమేవ భవనం యయౌ ।
వినిందన్ స్వస్వమాత్మానం కౌశికో ద్విజసత్తమః ॥ 49

వి॥ తెనుగు భారత పద్యములు ముందు వ్రాసి యున్నందుచే ఈ సంస్కృత భారత శ్లోకముల కిచ్చుట అర్థము వ్రాయలేదు మఱియు తెనుగులో గల దాని కన్న సంస్కృతమున నెక్కువ భావార్థముండుటచే శ్లోకములు మాత్ర మిచ్చుట వ్రాయబడినవి

# మార్కండేయుడు ధర్మజునకు పతివ్రతా మాహాత్మ్యంబు చెప్పుట

## శ్రీమహాభారతము - ఆరణ్యపర్వము

### -: కౌశికోపాఖ్యానము :-

మరియు నిజభర్తృ శుశ్రూష యందు నిత్యాసక్త యయిన పతివ్రతకు నఖిల యజ్ఞదాన తపః ఫలంబులు సులభంబులగు నొక్క యితిహాసంబు చెప్పెద నందు నీయడిగిన యర్థంబు లన్నియు దేటపడు నాకర్ణింపుము కౌశికుండను బ్రాహ్మణుండు ధర్మతపశ్శీలుండు సంతతాధ్యయన తత్పరుండయి యొక్క విశిష్ట గ్రామంబున నుండునతండొక్కనాడు గ్రామ సమీపంబునందొక్క వృక్షమూలంబున నాసీనుండై వేదంబులు గుణియించుచుండం దదీయ శాఖా గతంబైన కొక్కెరయొక్కం డాతనిపై రెట్టవెట్టిన, నమ్మహాద్విజుం డలిగి చూచుటయు నది యప్పుడే నిశ్చేతనంబై నేలం బడినం గనుంగొని యతండు

**అక్కట నా హృదయము గడు నక్కటికము లేనిదయ్యె ననిమిత్తము యీ కొక్కెర నిటు సేసితి నా కెక్కడి శాంతి యని వికల హృదయుండగుచున్.**

పెక్కుభంగుల వగచి మధ్యాహ్నం బగుటయు గృతాహ్నిక విధానుండై గ్రామంబున కరిగి, యందు శుచులైన విప్రగృహంబుల కరిగి భిక్షాచరణంబు

సేయుచు నందొక్క పుణ్యగృహంబు వాకిట నిలిచి 'భిక్షాం దేహి' యనుటయు నా యింటి యవ్వయు, నతి సంభ్రమంబున భిక్ష యిడుటకుం బాత్రశోధనంబు సేయునెడ,

ఆయెలనాగ భర్త గడు నాకట దూలుచు వచ్చె వచ్చినం
దోయజనేత్ర సంభ్రమముతో దగు పీఠము వెట్టి పాద్యముం
బాయక మజ్జన క్రియయు భక్తి నొనర్చి ప్రియోక్తు లొప్పగా
నాయన బ్రీతు జేసె రుచిరాన్న రసంబుల నింతి చెచ్చెరన్.

కుడిచిన పిమ్మటం గుసుమ కోమలి విస్తృతసంస్తరంబుగా
నొడికపు సెజ్జసేసి ప్రియుడొయ్యన యందు శయింప దమ్ములం
బిడి చరణంబు లొత్తి మదిరేక్షణ యంతటిలో దలంచె ము
న్నడరగ భిక్షకై నిలిచినట్టి మహీసురముఖ్యు నాత్మలోన్.

ఇటుల దలంచి భిక్ష గొనుచుం జనుదెంచిన నమ్మగువం జూచి కౌశికుండు రోషరంజిత లోచనుం డగుచు నిట్లనియె

అడిగిన యప్పుడ చెచ్చెర గడిపిన బోనవ్వ యేను గడు దుర్మతివై
వడతి నను నిలిపి భిక్షం బిడక కడు నవజ్ఞ సేసి తేల మదమునన్

అనిన బతివ్రతాతిలక మాతని కిట్లను నయ్య మత్ప్రియుం
డనుపమిత క్షుధాకలితుడై చనుదెంచిన భక్తి నమ్మహా
త్మునకు సపర్య సేయుచు మిమున్ మదిలోన దలంపజాలనై
తి నిదియు దప్పుగా గొనక ధీరత యొప్ప సహింపగా దగున్.

అనిన నమ్మహీదేవుం డప్పతివ్రత కిట్లనియె -

నీమగడంత యెక్కుడె మనీషులు భూసురు లింత తక్కువే
కోమలి యేల యిట్లు గడు గ్రొవ్వున గానవు లోకవంద్యులన్
భూమి సురేంద్రులన్ దివిజపుంగవుడాదిగ భక్తి గొల్చుచో
నేమిట నొక్కొ వారు గడు నెల్లిదమ్మై రిటు నీకు నిచ్చలున్.

అవమానితులై ధరణీదివిజులు గ్రోధాగ్నిశిఖల దీపించి మహా
ద్రివనద్వీపంబులతో నవని నయిన బొడవడంతు రప్రతికారుల్.

నీ వింత నెఱుంగ నొల్లవైతివిగా కేమి యనిన నయ్యంగన యిట్లనియె,

దేవతానములు భూదేవతావరులౌట
యేను దన్మాహాత్మ్య మెఱుగనయ్య
యొక విప్రు డలిగి పయోనిధి జలము ల
పేయముల్ గాగ శపింపడెట్లు
దండక విషయంబు దగ్ధంబు సేయండె
యలుక మైనొక్క మహాద్విజుండు
వాతాపి యను దైత్యవరు మ్రింగి యఱిగించు
కొనడె భూదేవుం డొక్కొరుడు గినిసి

ధరణి మఱియును బెక్కు విధంబులందు
బ్రహ్మవిదులైన బ్రాహ్మణ ప్రభుల మహిమ
వినమె యెఱిగి యెఱింగి సద్వినుత చరిత
కొఱవి గొని వెట్టినే తల గోకికొనగ.

నా తెఱంగు సెప్పెద నాకర్ణింపుము

పతియ చూవె నాపాలికి బరమదైవ
మేను వాఙ్మనఃక్రియల దద్ధితమ యెపుడు
గోరి యొనరింతు దీని మిగులగ నొండు
ధర్మవులు గాన నెందును దలచి చూచి,

నీవతి క్రోధనుండ వగుటయు నెఱుంగుదు నీ కోపంబున నొక్క కొక్కెర నిహతం బయ్యెంగాదె యిది మదీయపాతివ్రత్య మహిమంజేసి కాంచితిం గాన క్రోధంబు గొనియాడుట లగ్గుగాదని యిట్లనియె

క్రోధమోహనామకులైన ఘోరశత్రు
లిరువురెరియించుచుండుదు రెపుడు నంత

రంగమయ్యుభయంబు నడంగకున్న
గలదె యూరక బ్రాహ్మణ్య గౌరవంబు.

ఎవ్వడు సత్యంబు నెప్పుడు బల్కు హిం
సావిదూరుడు గురుజనహితార్థి
యింద్రియంబుల నోర్చి యెల్లవారలం దన
యట్లకా జూచు ధర్మాభిరతుడు
గామంబు దగులండు కర్మంబు లాఱును
సముచిత సంప్రయోజ్యత నొనర్చు
నట్టి పుణ్యాత్ముని ననఘు బ్రాహ్మణుడని
యనిశంబు గీర్తింతు రమరవర్యు

లార్జవంబు శమము నధ్యయనంబును
బరమధనము సువ్వె బ్రాహ్మణునకు
ధర్మగతికి నవియ తగు సాధనంబులు
వేదవిహితముఖ్యవిధులు నివియె.

ధర్మంబు బహుమార్గ దృష్టంబయి సూక్ష్మంబయి యుండు నీవు కేవల స్వాధ్యాయ పరుండవు గాని ధర్మ సూక్ష్మత యెఱుంగవు కావునం దడయక మిథిలా నగరంబున కరుగు మందు జితేంద్రియుండును సత్యవాదియు, మాతాపితృ భక్తుండు ను నయినవాడు ధర్మవ్యాధుండను కిరాతుండు నీకు నఖిల ధర్మంబులు నెఱింగించి సంశయచ్ఛేదంబు సేయు నాదెసం ప్రసన్నుండ వగునది వనితలకు బరిజ్ఞానంబు లేదు గావున వారెట్టి యపరాధంబు సేసినను సహింపవలయు గదా యనిన గౌశికుండిట్లనియె

నసుదూఱందగు నీకతమున నాచిత్తము ప్రశాంతి బొరసె బురంధ్రీ
జనవినుత పోయి వచ్చెద ననువమ శోభన సమృద్ధులయ్యెడు నీకున్.

ఈ తెనుగు భారతమందు కౌశికుడు గ్రామమందుండిన వాడనియు, గ్రామ సమీప వృక్షము క్రింద తపమొనర్చుచుండు వాడనియు గలదు సంస్కృత

మహాభారతమున గ్రామము పేరు గనుపించుట లేదు ఒకానొక వృక్షము క్రింద నుండి తపమొనర్చుచుండు వాడని గలదు అరణ్యమున వృక్షము క్రింద నుండి తపమొనర్చుచుండిన వాడనియే అనేకుల మతము

# శ్రీ సీతాదేవి జీవితము

## (భాస్కర రామాయణము)

ఈ పుణ్యమగు శ్రీ సీతాదేవి చరిత్రమును భాస్కరరామాయణ యుద్ధకాండమున విస్తారముగా కనందగును సంగ్రహముగ మాత్రమే ఇచ్చట తెలుపబడును ఈ పావన చరిత్రము తెలియని వారు భారతీయులలో నెవరును ఉండరనియే తలంచెద

ఇప్పుడు శ్రీ సీతాదేవి తన యొక్క పాతివ్రత్య మాహాత్మ్యముచే నగ్ని ప్రవేశము చేయుచున్న సమయమున చెప్పిన దివ్య వాక్యములే మహామంత్రములు ఇవియే దృఢవ్రతము యొక్క గుర్తులు వీటిని సంగ్రహముగా తెలిపెద

విభీషణుండు సీతను తెచ్చి రామునకు సమర్పించి యిట్లనియె

**దేవర వంపునన్ వరసతీతిలకంబగు సీత దెచ్చితిం**
**గావున నీదు దర్శనము కాంతకు నీ దగువేడ్క నావుడున్**
**భూవరుడంత దైన్యమును మోదము గోపము నొంది జాతచిం**
**తావిలమానసుండయి రయంబున జానకి బిల్వబంచినన్.**

శ్రీరాముని వాక్యము

**ఇంతి వినుము పురుష డెట్టివాడైనను బరుని యింటనున్న బడతి మగుడ**
**బ్రాకృతుండ పోలె జేకొన నేర్చునే యింత కంటె నింద యెద్ది కలదు**

**మానంబరయగ బ్రాణసమానము మానంబు సఖుండు మానమె ధనమున్**
**మానము విడుచుట కంటెను మానుగ బ్రాణములు విడువ మంచిది దలవన్.**

శ్రీసీతాదేవివచనము

పురుషులు నమ్మరేని దమ పొల్తుల చేష్టిత చిత్తవర్తనం
బరయుట దప్పుగాదు మనుజాధిప! యుక్తము కాన నీవొగిం
బరుసని వల్కు వల్క వినబాలయితిన్ సభలోన నక్కటా
శరముల బోలు వాక్యములు సైతురటే సతు లింత కోర్తురే!

నరవర! నీవు చిత్తమున నమ్మని వాడవయేని మున్ను న
న్నరయగ మారుతాత్మభవు నంపిన యప్పుడ నీ తలంపు చా
ప్పరుదుగ నాకు నేర్పడగ నాతనిచే నెరిగింతు వేని నే
నెరియుచు బ్రాణముల్ విడుతు నిప్పుడు నన్నిటు లాడగూడునే.

పరవృత్త చేష్టిత భావేంగితంబులు
సూచి తెలియు దీవు శుద్ధ చరిత !
యౌదార్య గంభీర తౌన్నత్య ధైర్యాది
గుణముల నెంతయు గొమరు మిగిలి
యాగమ లౌకిక వ్యవహారముల యందు
నరయ నీ వెఱుగని యదియు గలదె
నను నీవు దగ జిన్న నాటినుండియు జూచు
చుండుదు విట యెగ్గు లున్నవయ్య

యొగి మహీపతి యప్పటి నుండి పలుకు
ననుచితంబులు మాన్పంగ నమవు లేదె
పరుష దుశ్శ్రవభీషణ భాషణములు
నీవు దయమాలి యననెట్లు నేర్చితయ్య!

మీరింత నమ్మకున్నను గారవ మేపార నన్ను గరుణించి మహో
దారంబగు పొదబెట్టుడు ధీరమతిం జొత్తు నందు దిరమగు కడకన్.

## సీత యగ్ని ప్రవేశము చేయుట

కలగక జాతవేద సుముఖంబున నెంతయు శుద్ధురాలనై
నలువయు శూలియున్ హరియు నన్ను వెసంగొని యాడు నట్లుగా

సొలవక మీరు మెచ్చు గతి జొచ్చెద జిచ్చు మదీయ భర్త క
న్నెలవగు నంత మీద శుభశీలత ధారుణి నాశ్రయించెదన్.

అనినం దల్లడమంది లక్ష్మణుడు దైన్యాయత్త చేతస్కుడై
తనలోనం దలపోసి ఖేద మొదవన్ ధాత్రీపతిం జూచి య
జ్జనపాలాగ్రణి సన్నజేసిన నుదంచ ద్వేగ మేపార నే
చిన మంటల్ మొగి మిన్ను ముట్ట సొదపేర్చెన్ సీత మోదింపగాన్

పరమపావని యగు సీత పరగ నేడు
చెలగి నాయందు జొచ్చుట జేసి మిగుల
ననఘ శీలుండ నయ్యెద నని ముదంబు
బొందుకైవడి మిన్నంది పొదలె నగ్ని,
తదనంతరంబ

తలవాల్చి యున్న భాస్కర, కులపతికి ప్రదక్షిణించి గురుతరకీలా
కులమగు సొదచేరంగా, నలలిత గతి నేగు దెంచి జానకి యంతన్,

వినయము తోడ మ్రొక్కి యరవిందనిభానన వేడ్క వీతిహో
త్రునకు బ్రదక్షిణంబు చనుదెంచి కృతాంజలియై త్రిలోకపా
వన గత సర్వ భావన! నివారిత కల్మష! సర్వనిర్జరా
నన! సకల క్రియాధికరణ ప్రవణాభినివేశ! పావకా!

స్థిరమతులార! యో సకల దిక్పతులార! సురేంద్రులార! కి
న్నరవరులార! సర్పకుల నాయకులార! మునీంద్రులార! ఖే
చరవరులార! యక్షగణ చారణ గుహ్యక సాధ్యులార! వి
స్ఫురదిన చంద్రులార! వరభూతములార! యెఱింగి యుండుడీ!

మీరందఱు దగు గుఱిగా, గోరుచు నేనున్న దాన గురుహితమతి నా
చారిత్రం బేచందం, బేరూపము దాని మీర లెరుగుదు రరయన్.

కావున వాఙ్మనః కాయ బుద్ధీంద్రియ తదర్థంబులం జేసి నిమేష కాష్ఠా కళాక్షణ ముహూర్త యామ సంధ్యాహోరాత్ర పక్ష మాసర్త్వయన వత్సర పరిగణితంబు

లగు కాలంబులు సాక్షిగ స్వప్నాద్యవస్థలయందును జ్ఞానాజ్ఞానంబులయందును మద్వల్లభుండగు రఘునాధునకుం దప్పుట లేదు

ఛాయగతి నాదు చిత్తము, పాయక రఘునాధునందు వరగున యేనిన్
న్యాయము దప్పక దహనుడు, ధీయుక్తిన్నన్ను గాచు ధృతి యొడగూడన్

దుష్టకల్మబుద్ధినై దోషమునను జనకులాధీశునకు దప్పి సచ్చరిత్ర
మెడలి నడచుట గలిగిన నీక్షణంబ చెలగి నను నగ్ని భస్మంబు సేయుగాత!

అనుచున్ నిశ్చలచిత్తయై రఘుకులేంద్రాయత్త చింతావశం
బున దాత్పర్యము గల్గి నిర్మల లసద్బుద్ధి ప్రసాదంబు పెం
పున నభ్రంకషకీలుడై కనలుచుం భూరిప్రభుండైన య
య్యనలుం డుప్పతిలంగ జొచ్చె నిరపాయస్నేహరాగంబునన్!

అనఘ మంత్ర పూతమైన యాజ్యాహుతి, పగిది ధరణిపుత్రి పడియె నంత
తేజ మెసగ నగ్ని దేవుండు మిన్నంది, మహిత శిఖలు గలిగి మండజొచ్చె.

లోలవిలాస ఖేలన విలోచన మీనము లాననాబ్జముల్
లాలిత బాహువల్లరి మృణాళములుం బృథుకేశభార శై
వాలము నొప్ప సీత యనవద్య పవిత్ర చరిత్ర విస్ఫుర
చ్చీల కృశానునందు నరసీగతి జూడగ నొప్పె నెంతయున్.

పవడపు రాసిలోని నవ భర్మశలాకయు బోలె జారుప
ల్లవముల కుప్పలో నిడిన లాలిత చంపక దామమట్లు ర
క్త వనజ రాజహంసి యనగా నరుణాభ్రములోన నున్న యా
నవశశిరేఖ బోలె దహన స్థితయయ్యె విదేహకన్య దాన్.

అప్పుడు పతివ్రతా శిరోమణియగు సీత దహన శిఖావృతయై యున్న గనుంగొని దానవాంగనలు శోకింప, నిశాచరులు దుఃఖింప, కపులు సమాక్రందనములు సేయ, సుగ్రీవుండు బెగ్గిల, విభీషణుండు పారవశ్యంబు నొంద, నంగదుండు విన్నదనంబు సెంద, హనుమంతుడు భేదింప, లక్ష్మణుండు వగలం బొగుల, రాఘవుం డవాఙ్ముఖుండై నిర్వేదింప, సుర లనుచితంబనల, సాధ్యు

లన్యాయంబన, యక్షు లనుపేక్షణీయంబన, గంధర్వు లద్భుతంబన మహోరగంబులు తగదన, చరాచరంబులు దృశ్యాదృశ్యంబులునగు భూతంబులు దల్లడిల్ల, మహాభూతము లాక్రోశింప నక్కోలాహలంబు నొక పెట్ట నొదవిన,

ప్రమథులు చనుదేర బాలేందు ధరుడైన
మూడు కన్నుల వేల్పు మున్నుగాగ
జగముల సృజియింప జాలి యాద్యుండైన
చతురాస్యుడగు పద్మ సంభవుండు
గమనీయ వికసిత కమల ప్రతములన
వేయి కన్నులు గల వేల్పురేడు
వహ్ని కాలాసుర వరుణానిలశ్రీద
శూలహస్తులు గూడి సురుచిరముగ

గరుడ సిద్ధ సాధ్య గంధర్వ ఖేచర
యక్ష పక్షి నాగ యాతుధాను
లాదిగాగ బుష్ప కారూఢులై రాము
ధీరు జాడ వేగుదెంచి రెలిమి.

ఇంద్రాది దేవతలు రాముని స్తుతించుట

పాతివ్రత్య గుణంబు సుస్థిరమతిం బాటించి కళ్యాణ స
చ్చేతో వృత్తి దనర్చి లక్షణములం జెల్వొంది శుద్ధక్రియో
పేత ప్రక్రియయైన జానకి భవత్ప్రేమానురూపంబుగా
బ్రీతిం బుట్టిన యాదిలక్ష్మి దలపం బృధ్వీతలాధీశ్వరా!

అకట! యుపేక్షసేయ దగునయ్య రఘూద్వహా! మండుచున్న పా
వకమున దత్పతీత్వ గుణవైభవ మొప్పగ నుండునట్టి జా
నకి నిటు చూచుచుండ దగునా పిలిపింపగదయ్య సాధ్వి నూ
రక చెడ నాడనేల యనురాగ దయామృత దృష్టి చూడవే!

వనజేక్షణ! నారాయణ! నిను నీవిట మరువదగునె నిర్దయమతివై
జనక సుత నుపేక్షింతురె మనుజేశ్వర! మమ్ము నెలమి మన్నింప గదే!

అను నయ్యవసరంబున విశ్వమయుండును విశ్వైక సాక్షియు విశ్వపావనుండును నగు వైశ్వానరుండు సముత్తాలాభీలజ్వాలావళీ దహ్యమానంబులగు నింధనంబులు పాయం ద్రోచి, యుస్వేదబిందు జాలాంచితయు, నమ్లాన వదనపంకజయు, నక్లిష్ట తనువల్లికయు, నతాంత లతాంతమాలికయు, నవవసనాంగరాగయు, ననాహతదుకూలయు, ననిర్ధూత కేశకపాలయు, నకంపమూర్తియు, నవిచ్ఛిన్న హారాద్యలంకారయు, నవిపాయాన సూయాదత్తపుణ్యాంగరాగయు, గంధబంధుర మూర్తియు నయి తొంటిక్రియ నున్నం గనుంగొని కపులు నసురులును సబాష్పనయనులై నృపతి కిప్పు రంధ్రీరత్నంబు నిన్ని యెగ్గులాడ దగదన వసుమతీ దుహిత యగు సీతను రఘునాధు సన్నికర్షంబునకు నెత్తికొని తెచ్చి ముందర నిలిపి యిట్లనియె అగ్నిదేవుండు సీతామాహాత్మ్యంబు చెప్పి రాముని కొప్పించుట,

రఘుకుల దుగ్ధవారినిధిరాజ! భవత్సతి దూషిత క్రియా
లఘుచరితానుశక్తిమెయి లౌల్యము దాల్చి చరింప నేర్చునే
యఘములు జానకిం దలచి నంతనె నాశము నొందు నీకు ని
ట్లు ఘనతరాగ్రహంబున గడుం జెడనాడుట జూడయుక్తమే?

వసచెడవు మేని మెఱుగులు,
గనుగందవు క్రొవ్విరులును గముగవ ధూమ
ప్రసరమున నెట్టిబారదు,
వెస దలచీరయును నట్ల వెలయుట గంటే!

దైవము ప్రాణమిత్రుడును దాత సఖుండును జీవితార్థముల్
నీవుగ వాఙ్మనఃకరణ నిశ్చయబుద్ధి శరీరదృష్టి సం
భావిత వృత్తి నేమఱక నన్నుగ నిన్నె తలంచు నవ్య దు
ర్భావన లేదు భూమిసుత భవ్యచరిత్ర పవిత్ర భూవరా!

శుచివై జగములకు బరమ
శుచిత్వ మొనరించు నే వసుమతీ తనయా
రచిత ప్రవేశమున గడు
శుచినైతి గృతార్థ భావ సుభగుడ నైతిన్.

మందార భూజంబు మరిగిన భృంగికి
        బిచుమంద శాఖిపై బ్రేమ గలదె
లలిమానసంబున మెలగెడు హంసికి
        వెలయ బల్వలముపై వేడ్క గలదె
మలయ ద్రుమంబున మలయు భుజంగికి
        బర్బూర తరువుపై వలపు గలదె
భాస్కరోదయమున భాసిల్లు పద్మిని
        కిందుకర స్పృష్టి నెలమి గలదె.

రాజితానేక సద్గుణారామ! రామ
కర్మపాలన పరమ నీ ధర్మపత్ని
యైన సాధ్వికి సీతకు నన్యునందు
గూర్మి యేచందనమున నమకూడునయ్య?

కావున నీవు నా పలుకు గైకొనగా దగు గాదు నాక సం
భావన తోడ సచ్చరిత భాసురయైన మహీసుతన్ దిగీ
శావళి సంతసిల్లగ బ్రియం బొందవంగ బరిగ్రహింపు రా
జీవహితాన్వయాభరణ! సింధుగభీర గుణైక భూషణా!



# నలోపాఖ్యానము

## (శ్రీమహాభారతము - ఆరణ్య పర్వము)

ఇచట దమయంతి యొక్క చరిత్రవే కావలసియున్నప్పటికిని నలోపాఖ్యానమందు అది ఉండుటచే నలోపాఖ్యానమని తెలుపడమైనది ఇచట ఈ కథ సంక్షిప్తముగ వ్రాయబడును విస్తారముగ చూడ దలంచు వారు మహాభారత ఆరణ్య పర్వమున గనందగును

నిషధేశ్వరుండైన వీరసేనుని కుమారుడైన నలుండనువాడు ఎల్లప్పుడు జూదమాడుట యందు ప్రియుడై తన ప్రతాపము వలన నెల్ల రాజులను జయించి ధర్మ ప్రకారము ప్రజాపాలన చేయుచుండెను అప్పుడు విదర్భాధిపుడైన భీముండనువాడు దముని వరమున దమయంతి యను కుమార్తెను బడసెను ఆమె సౌందర్యము చేతను, గుణములచేతను దేవకన్య లందరిని తిస్కరించుచు, దేవకన్యలతో సమానలైన నూర్వురుసఖులు దన్ను గొలుచుచుండగ నానాటికి వర్ధిల్లుచుండెను అంత నలుని యొక్క రూపాది సద్గుణ విశేషంబులను విని బద్ధానురాగయై యుండెను భీమ మహారాజు చెలికత్తెల ద్వారా తన కుమార్తె యొక్క మనోరథము నెఱింగి నలుని నటకు రావించు నుపాయంబు నాలోచించి స్వయంవరమును చాటించెను అటకు పృధివింగల రాజు లెల్లరు విచ్చేయ నలుడును తన రధంబెక్కి వచ్చునెడ

**మనుజేశ్వరులెల్లను బో రన దమయంతీ స్వయంవరమునకు నొప్పం**
**జనుదెంచిరి సైన్య వ్యం, దన పుట్టిన నవనితలము తల్లడవడగన్.**

ఆ సమయంబున బర్వత నారదులను పురాణమునులు భూలోకం బెల్ల గ్రుమ్మరి యింద్రలోకంబునకుం బోయిన నింద్రుడు వారలం బూజించి భూలోకంబున కుశలవార్త యడిగి యిదియెట్లు ధర్మపరిపాలనపరులై వీరులై రణ నిహతులైన రాజు లక్షయలోక సుఖంబు లనుభవింప నతిథులై యిందులకు నింత కాలం బయ్యె రాని కారణం బేమియని యడిగిన నారదుం డిట్లనియె

వరసిద్ధ సాధ్య విద్యాధర సురకన్యకలకంటె దమయంతియ సుం
దరి దాని సున్వయంవర మరుదై వర్తిల్లుచున్నయది యిప్డు మహిన్.

అందులకు ధరణి గల నృపనందను లెల్లను ముదంబునం బోయెడువే
డ్కం దమలో గలహంబును గ్రందును లేకున్న వారు గడు నెయ్యమునన్

అనిన నింద్రుడును లోక పాలవరులును దదాలోకన కౌతుకంబున గనకరత్న రమ్య దివ్య విమానారూఢులై భూలోకంబునకు వచ్చి దమయంతి స్వయంవరంబునకు బోయెడు వాని నాదిత్యులలోన విష్ణుండును బోలె, దేజోఽధికుండైనవాని ననన్య సాధారణ రూపవిభవంబున రెండవ మన్మథుండు నుంబోలు వాని నలుంగని యంతరిక్షంబున విమానంబులు నిలిపి భూతలంబునకు వచ్చి వాని కిట్లనిరి నిషధేశా! మాకు దూతవై అభిమతంబు సేయుమని వేడ వెంటనే అట్టుల సేయుదునని చెప్పి ఏమి చేయవలెననియు, మీరెవ్వరనియు నడుగ వారు నేనింద్రుండ వీరు దిక్పాలురనియు, ఇచట జరుగుచున్న దమయంతి స్వయంవరము జూడ వేడ్కతో వచ్చినారమనియు, నీవు మమ్ము దమయంతి కెరిగించి అక్కోమలి మాయందు తనకు నిష్టపడిన వారిని వరించునట్లు చేయుమనిన నింద్రునకు నలుండు నమస్కరించి యిట్లనియె

ఎఱిగి ఎఱిగి నన్ను నేకార్థ సముపేతు, బాడి యయ్య! యిట్టి పనికి బనుప
ననిన నుత్సుకుండవై యేల చేసెద, నంటి చేయకుండ నగునె యింక.

నిన్ను నిత్య సత్య నిరతుగా నెఱింగి,యి క్కార్యమునకు వలను గలుగు టెఱిగి
పనుప వలసె దూత భావ మపేక్షించి, దేవహితము దీని దీర్పవలయు.

ఆయుధీయ సురక్షితంబైన రాజగృహంబు నెట్లు సొరనగునని శంకింప వలదు దమయంతీ నివేశంబు ప్రవేశించునప్పుడు నిన్నెవ్వరు వారింప నోడుదు రనిన శక్రువచనంబుల నశంకితుడై నలుడప్పుడ విదర్భాపురంబునకు బోయి యొక్కరుండ దమయంతీ గృహంబు సొచ్చినంత

---

## నలుండు దమయంతి యొద్దకు దేవదూతయై పోవుట:-

అపూర్వ తేజస్కుండైన ఈ నలుని దమయంతీ సహితులగు ఆ అంతః పుర స్త్రీలు గాంచి ఆశ్చర్య చకితలై తమ ఆసనముల నుండి దిగి మనములందు హర్షమొనగ అభ్యుద్గతలైరి అంత దమయంతి నలుజూచి

నీవు మహానుభావుండ వెవ్వండవు ఏమి కారణంబున నొంటరిగ ఉగ్రశాసనుండైన నా జనకునిచే సురక్షితంబగు అంతఃపురమును ఎవ్విధంబుగ జొచ్చినాడవు ఎఱిగింపు మనిన దానికి నలుండిట్లనియె

**ఏను దేవదూత నింతి నలుండను, వాడ నింద్ర దహన వరుణ యములు**
**నీ సయంవరంబు నెమ్మితో జాడంగ, వరుగుదెంచి నన్ను నబల మున్న**

**నీ యొద్దకు బుత్తెంచిరి మా యందొక్కరు నభీష్టమతి వరియింపం**
**దోయజముఖి బ్రార్థింపుము మాయందరకును బ్రియం బమర్పుము ప్రీతిన్.**

అని పంచినం దత్ప్రభావంబున నన్యులచేత నలక్షితుండనై వచ్చితి నింద్రాదులకు బ్రియంబు సేయుమనిన నవనతవదనయై, దమయంతి దొల్లి హంసచేత నలుని విని వానియందు బద్ధానురాగయై నవయుచున్న యది యపుడతని నలునిగా నెఱింగి తద్వచన శ్రవణ దుఃఖాయమాన మానస యగుచు నిట్లనియె.

**ఏ నేడ నింద్రాదులేడ వారలకు నెప్పుడు మ్రొక్కుదు నేను నీధనమ**
**భూనాధ! నీ గుణంబులు హంసచేత బొలుపుగా విని మనంబున నిల్పి యున్న**
**దాన భవన్నిమిత్తమున నిట్లఖిలధారుణీనాధ పార్థంబు రావింప**
**గానిష్ట వలపె లోకఖ్యాత కీర్తి కరుణించి పతిబుద్ధి గావింపు మిందు.**

నీవు దీని కొడంబడని నాడు, రజ్జు విష అగ్ని జలంబులం బ్రాణ పరిత్యాగంబు సేసికొందుననిన దానింజూచి నలుం డిట్లనియె

ఆ దేవతలు గొప్ప పరాక్రమశాలురు, సర్వలోక విభులు, ఐశ్వర్యవంతులు, దేవతోత్తములు నిన్ను గోరుచుండగ, వారి పాదరజంబునకు బోలని వాడను

మనుష్యుడను సంసారియగు నన్ను గోరందగునా అదియుగాక

**దేవతల కప్రియంబులు, గావించి మనుష్యులధమ గతులగుదు రిలం**
**గావున వారి కభీష్టము, గావింపుము నన్ను బ్రీతి గావుము తరుణీ!**

అనిన దమయంతి చింతించి నీ యభిప్రాయమునకు అపాయము లేని యుపాయమును గంటిని, ఇంద్రాదులు నా స్వయంవరమునకు వచ్చెదరేని వారి సన్నిధిలోనె నిన్ను వరించెద అట్లయిన నీకు దోషము లేదని పలికెను నలుండు లోకపాలుర కడుకుం జని ఈ వృత్తాంతం బంతయు నెఱిగించె అంత దమయంతీ స్వయంవరంబు ప్రవర్తిల్లిన

నలున కాని నళినదళనేత్ర వరియింవ
దట్టె చూతమనుచు నమరవరులు
నలువురును గడంగి నలరూపమున వచ్చి
రా స్వయంవరమున కతిరయమున

అంత

దమయంతి సిత పుష్పదామాభిశోభిత
హస్తయై చనుదెంచి యంబుజాక్షి
యమ్మహోత్సవ దర్శనాగత రాజన్య
నివహంబు వీక్షించి నెమ్మితోడ
నలువురు వేల్పులు నలుదొట్టి యప్పుడే
కాకారులై యున్న నందు నలుని
నేర్పరింవగ నేరకింద్రాదులను నలు
నెఱుగు నుపాయమిం కెద్దియొక్కొ

యనుచు సంశయాకులాత్మయై
సురలార నలు నెఱుంగు విధము నాకుజేయు
డాత్మరూపధరుల రగుడని వరిదేవ
నంబు సేసె దన మనంబులోన.

దేవతలు దాని పరిదేవనంబు విని కరుణించి యనిమిష లోచనంబులు నస్వేద గాత్రంబులు నొప్పు నవనీతలంబు ముట్టక యాసన్నులై నిలిచిరంత లోకపాలురును భూలోకంబునం గల రాజలోకంబు నవలోకించుచుండ బుణ్యశ్లో కుండైన నలుని ధర్మవిధానంబున వరియించి దమయంతి తదీయ స్కంధంబున సుగంధి కుసుమదామకంబు వెట్టిన

**దేవతల సాధువాదముతో విప్రాశీరవంబుతో బహుతూర్యా**
**రావంబులు సెలగెను పారావార రవంబు బోలె ననివార్యములై.**

ఇట్లపూర్వ స్వయంవరలబ్ధయైన దమయంతి నత్యంత విలాసంబుతో వివాహంబైన యా నలునకు, నింద్రుడు వాని యజ్ఞంబుల యందు నిజరూపంబు జూపను, అగ్నియు వరుణుండును వాని వలసిన చోటున యగ్ని జలంబు లుత్పాదింపను, ధర్ముండు ధర్మమునందు వారి బుద్ధి వర్తిల్లను వరంబు లిచ్చి దేవలోకంబున కరుగు వారెదురు ద్వాపరంబుతో వచ్చు కలింగని యెందులకుం బోయెదవని యడిగిన నింద్రాదులకు గలి యిట్లనియె

**అవనిలో దమయంతీ స్వయంవరంబు, విస్తరిల్లుట విని కడు వేడ్కతోడ**
**నేను దమయంతిచే వరియింపబడుదు, నని తదర్థినై యరిగెద నాసజేసి.**

అనిన నందఱు నగి నీవందుల కేలబోయెదది ముందర నివృత్తంబయ్యె నక్కోమలి యెురుల నెవ్వరి మెచ్చక నలుండను వాని వరియించె ననినం గలి కరం బలిగి యన్నలునకు దమయంతికి రాజ్య విభవపరిత్యాగంబును బరస్పర వియోగంబును జేసెదనని నిశ్చయించి వాని నక్షరతుగా నెఱింగి యక్షంబుల జొచ్చియుండ ద్వాపరంబు బనిచి నలుండు సేయుచున్న యశ్వమేధాదికానేక భూరిదక్షిణ మహాక్రతువులయు, జపహోమదానాది వివిధ పుణ్య కర్మంబులయు గారణమునం జొర నవసరంబు గానక, యంతరం బన్వేషించుచు బెద్దకాలంబుండి యెుక్కనా డతండు కృతమూత్రుండయి జలోప స్పర్శనానంతరంబునం బాదశౌచంబు సేయమఱచి సంధ్యోపాసనంబు సేసిన, నుపలబ్ధావసరుండయి, కలి నలునందు బ్రవేశించి పుష్కరుండనువాని పాలికింబోయి తన్నెఱింగించి నీవు నలునితో జూదంబాడి వాని రాజ్యంబును సర్వస్వంబును నోడిచి కొమ్మని చెప్పి

తానును వానికి విప్రవేషంబున సహాయుండయి యక్షంబుల గొని పుష్కరునితో నొక్కటం జని నలుంగాంచి నీవు మారాజుతో జూదంబాడు మనిన,

**ద్యూతార్థము తత్కితవా, హూతుడనై జూదమాడకుండుట ధర్మా**
**పేతంబని యభిముఖుడై, యాతనితో నలుడు జూదమాడ గడంగెన్.**

**కలధనము లెల్లనొడ్డుచు, నలయక జూదమున విజితుడగు చుండె నిజా**
**ప్తులు వారించిన నుడుగక, నలుడు కలిప్రేరణంబునను హతమతియై.**

ఇట్లనేక మాసంబులు దుర్వ్యసనాసక్తుండైన యన్నలుండు వివిధ వస్తువాహన నివహంబులొడ్డి పుష్కరున కోటువడంబోయిన నెఱింగి పౌరబ్రాహ్మణ ప్రధాన వరులు దమయంతీ పురస్కృతులై వచ్చి వారించి కలి సమావేశ పరవశుండైన యన్నలుచేతం బ్రతిహతులయి వలుకకుండి రంత దమయంతి చింతాక్రాంత చిత్తయై

**ఎంత యోటుపడిన నంతియ జూదంబు, నందు దగులు జలము నతిశయిల్లు**
**నేమి సేయు దాన నిది యెగ్గునకు మూల, మని లతాంగి దుఃఖితాత్మ యగుచు.**

అంత దమయంతి పుష్కరునకు జయంబును తన భర్తయైన నలున కపజయంబును గాంచి భర్త యనుజ్ఞచేత సారథితో తన కుమారుని, కుమార్తెను విదర్భకు బంపెను.

**నలుడును ధరణీ రాజ్యము, దలగగ సర్వంబు నపహృతంబైన గడుం**
**దలరి దమయతి దోడ్కొని, వెలువడియె నశేష రాజ్య విభవచ్యుతుడై!**

**పురము వెలి మూడహోరాత్రములు వసించి, యున్న నలుపాలి కెవ్వరు నోడిరరుగ**
**జనవిభుండైన పుష్కరు శాసనమున, గలికృత ద్యూత విద్వేష కారణమున.**

ఇట్లు సర్వజనసత్కారార్హుండయ్యును నలుండు విధికృతంబున నెవ్వరివలనను సత్కారంబు గానక జలంబు లాహారంబుగా దత్పుర సమీపంబున దమయంతీ ద్వితీయుండై యుండి, బుభుక్షాపీడ సహింపనోపక, హిరణ్య పక్షంబులతో దమముందట దిరుగుచున్న పక్షులం గని యవి భక్ష్యంబు లగునని

యప్పక్షులం బట్టికొన సమకట్టి తన కట్టిన పుట్టంబు వానిపై వైచిన, నవి పుట్టంబుతోన గగనంబున కెగసి నగుచు విగతవస్త్రుండైన నలున కిట్లనియె

**నీ ధనంబును రాజ్యంబు నికృతి గొన్న, యక్షముల మేము నీ వస్త్ర మపహరింప**
**బక్షిరూపులమై వచ్చి పార్థివేంద్ర! యపహరించితి మని చెప్పి యరిగె జదల.**

నలుండును వానిం జూచి విస్మయంబంది యీ యక్షంబుల దోషంబునం గాకేమి నాకిట్టి దయ్యె ననుచు దమయంతి కట్టిన పుట్టంబు చెఱగు గట్టికొనియె నట్లిద్దరు నేక వస్త్రులై యుండొరుల మొగంబు చూచి దుఃఖించుచో నలుండు దమయంతి కిట్లనియె

**ఇది దక్షిణాపథంబున, కిదియు విదర్భాపురమున కిది కోసల కి**
**య్యది యుజ్జయినికి దెరువులు, మది నిన్నిటిలోన నరుగ మన కెద్ది యగున్?**

**అడవులలో నాతో గడు, నిడుమల వడనోప వరుగు మిందుముఖీ! యి**
**ప్పుడు నీ బంధు జనంబుల, కడ కనవుడు దరుణి శోక గద్గద యగుచున్.**

**అతని కిట్టు లనియె నవనీశ నీవును, నేను జని విదర్భ నిష్టలీల,**
**నుండుదము మృగాకులోగ్రవనంబుల, కరుగనేల యిడుమలందనేల?**

అనిన విని నలుం డవనతాననుండై నీ చెప్పినట్ల విదర్భేశ్వరు రాజ్యంబును మన రాజ్యంబ యేను దొల్లి యధికైశ్వర్యయుక్తుండనై యందులకు బోయి బంధుజనులకు హృదయానందంబు సేసి యిప్పుడివ్విధంబున సర్వస్వహీనుండనై యెట్లు పోవనేర్తు ననిన దమయంతి యిట్లనియె

**అధిక దుఃఖరోగార్తున కౌషధంబు, సురచిరంబుగ భార్యయచూవె యెందు**
**నొనర భార్యా సమేతుడై యున్నవాని, కెంతలయ్యును నాపద లెఱుకపడవు.**

**అలసినను డస్సినను నా కలి తృష్ణయు నైన యెడల గడుకొని ధరణీ**
**తలనాథ పురుషునకు నిమ్ముల భార్యయ పాచు జిత్తమున దుఃఖంబుల్!**

కావున మదనుగమనంబునకు అంగీకరించవలయునని వేడగా నలుండంగీకరించి చనుచు విజనంబైన యరణ్యంబున నొక్క యెడ విశ్రమించి

మార్గశ్రమమున తన పాదంబుల యంతికంబున క్లేశపరవశయై నిద్రవోయెడు దమయంతిం జూచి మనంబున

ఏను దీని దుఃఖంబు జూడనోప, నెట కేనింబోయెద నిది నన్నుంగానక తన బంధువుల యొద్దకుం బోయి సుఖంబుగా నుండునని విచారించి పోవ సమకట్టి యక్కోమలి మేలుకొనకుండ మెల్లన దాని వస్త్రంబునం దర్ధంబు చించి తనకుం బరిధానంబు సేసికొని వెలువడి కొండొక నేలపోయి దమయంతియందు ఘనంబైన నెయ్యంబును తీగం ద్రెంపనేరక క్రమ్మరి వచ్చి,

కలి దమయంతి బావ సమకట్టు నతిం బతి వాయనోవడా
లలనను దీర్ఘ సౌహృదబలంబున నిట్టుల రెంటజేసి య
న్నలుడు విమోహరజ్జుల బెనంగి గతాగతకారియైన యు
య్యలయును బోలె మాఱడక యెంతయు బ్రొద్దు వినిశ్చితాత్ముడై.

బాలనొక్కర్తు నిక్కానపాలు చేసి
నిష్ఠురుండనై యేనెట్లు నేర్తు బోవ
ననక కలిచేత నాకృష్టుడైన నలుడు
విగత కరుణుడై దమయంతి విడిచి చనియె.

అంత దమయంతి మేలుకొని తన పతిం గానక తన వస్త్రార్ధ నికృంతనంబును జూచి లేచి నలుగడలం బరికించి భయశోక వ్యాకులిత చిత్తయై

హా మహారాజ! మహామహీ రక్షణ
దక్ష దక్షిణ బాహుదండ! దండి
తారాతి! నిషధరాజాగ్రణి! నన్నిట్లు
వీత దయుండవై విడిచి చనగ!
దగునె నీవెన్నండు ధర్మువు దప్పని
వాడవు సూనృత వ్రత రతుండ
వోడకుమని నన్ను నూరడబలికిన
పలుకిట్లు మఱువంగ బాడియగునె.

పొదలలోన దాగి పొడనూవ కిట్లేల
యున్నవాడ విట్టి యుగ్రభావ
మేల నీకు వలసె నెటబోదు నింకెట్లు
గాంతు నిన్ను నుగ్రకాననమున.

వగవగ సాంగోపాంగము
లగు నాలుగు వేదములయు నధ్యయనము పా
ల్పొగ నొక సత్యముతో నెన
యగునే యెవ్వియును బోలవటె సత్యంబున్.

ప్రాణసమానురాలవయిన నిన్నవశ్యంబును విడువనని పలికితివి సత్య ప్రతిపాలనంబు సేయుమని ప్రలాపించుచుం దన యేకాకిత్వంబునకు నబలాభావంబునకు బ్రతిపదన్యాస జాయమాన కంటక మృగ పన్నగ భయంబునకు వగవక నిజనాధు నసహాయత్వంబునకు దుస్సహక్షుత్పిపాసాశ్రమాకులత్వంబునకు వగచుచు

**అలయుచు బులుగుల యెలుగుల, కులుకుచు నుగ్రాతపమున కోపక వృక్షం**
**బుల నీడల నిలుచుచు నెలు, గుల బులులంజూచి భయముగొని వగవగమన్!**

**ఏచిన పొదల బొరల్పడ, ద్రోచుచు ముండ్లకును నల్లదొలగుచు దిక్కుల్**
**సూచుచు దొడరుచు ద్రెళ్ళుచు, లేచుచు లలితాంగి సంచలించుచు నరిగెన్.**

ఇట్లరుగుచున్న దమయంతి నంతికన్య స్తచరణయయిన దాని నాహారార్థియై యొక్క యజగరంబు పట్టికొనిన నక్కోమలి మెదల నేరక

**ఇంకనైన నన్ను నేల యాలింపవు, నాకు శరణమగుము నాధ! యనుచు**
**నరచుచున్న దాని యాక్రందనధ్వని, వినుచునొక్క యెఱుకు వేగ వచ్చి.**

తనపట్టిన సురియ నొప్పెనుబాము వదనంబు వ్రయ్యం దరిగిన రాహుముఖ విముక్తయయిన చంద్రరేఖయుంబోలె నజగర ముఖంబువలన వెలువడిన యా దమయంతి నాశ్వాసించి తత్సమీప సరోవరస్నాతను, వన్యస్వాదు ఫలాహారనుగా జేసి విగతశ్రమం గావించి నీ వెవ్వరిదాన విట్లేల యేకతంబ యివ్వనంబునకు

వచ్చితని యడిగి మధుర భాషిణియైన యమ్మగువ-చలన నంతవృత్తాంతంబు నెఱింగి

రజనికరానన బీనవయోధరరాజిత రాజసుతన్ విలస
ద్గజపతిగామిని జందనగంధి ప్రకాశితకాంతి సమన్విత బం
కజదళలోచన జూచి కిరాతుడు కామనిశాతశరాహతుడై
నిజ హృదయం బెఱిగించె లతాంగి కనింద్య చరిత్రకు వేడుకతోన్.

అగ్ని శిఖయుబోలె నంటను డాయను జూడరాని యట్టి శుభ చరిత్ర
నెరుకలేని కరకు టెరు కపేక్షించె గాదనక తనకు నాయు వల్పమైన!

## దమయంతి శాపంబునం గిరాతుండు చచ్చుట.

దమయంతి వాని నలిగి చూచి యేను పతివ్రతనైతినేని యిద్దురాత్ముండైన కిరాతుడిప్పుడ మృతుండయ్యెడు మని శాపంబిచ్చిన వాడప్పుడ యగ్నిదగ్ధంబైన వృక్షంబునుబోలె విగతజీవుండై పడియె అంత దమయంతి తన హృదయమున నిజాధీశుని స్మరించుచు, నుగ్రాటవిలో సంచరించుచు భర్త నన్వేషించుచు దిరుగుచుండ ముందట

వారి భక్షులు పర్ణభక్షులు వాయుభక్షులు శాక నీ
వారభక్షులు వృక్షమూలనివాస యుక్తులునై తపం
బారజేయు మహామునీంద్రుల యాశ్రమం బెడ గాంచె నం
భోరుహాక్షి పురాసమార్జితపుణ్యకర్మఫలంబునన్.

ఇట్లు మృగవ్యాళతస్కరకిరాత నిరంతరంబైన కాంతారంబునం బుణ్యానదీ తీరంబున నొకముని పల్లియం గని యందు వసిష్ఠ వామదేవ వాలఖిల్య భృగు నారద సదృశులయిన మహామునులంగని నమస్కరించి యున్న నమ్మునులు దమయంతింజూచి యచ్చెరువడి యవ్వా నీ వెవ్వరిదాన విప్పన దేవతవో, దేవభామినివో, దివ్యంబైన తేజంబుతో నేలక్రుమ్మరియెద వనిన వారలకు దమయంతి యిట్లనియె

**వినుడే బుణ్యశ్లోకుం డనగ సదా యజ్ఞనిరతుడనగ ధరిత్రిన్**
**దనరిన నలుభార్యను నజ్జనమత దమయంతియన నెసంగిన దానన్.**

విధివశంబున నన్నుంబాసి హృదయేశ్వరుం డెటయేనియుం బోయిన దదన్వేషణాసక్త చిత్తనై విపిన పరిభ్రమణంబు సేసెద, మీ తపోవనంబునకు వచ్చి నలుండు, భవత్పాదాభివందన కృతార్థుడై యెక్కడికిం బోయె నతని పోయిన వల నెఱుంగుదురేని నానతిండు కొన్ని దినంబులలోన దద్దర్శనంబు సంభవిల్లని నాడు దేహంబు విడుతునని యేడ్చుచున్న దానింజూచి కరుణించి మునులిట్లనిరి

**వనజాయతాక్షి! కతిపయ దినములలో జూడగాంతు తివిరి నలుని భూ**
**జననుతు నెప్పటి యట్టుల తనపురమున రాజ్యలీల దనరెడివానిన్.**

మేము మా తపోదృష్టిం జూచితిమి, దుఃఖింపకుండుమని తాపసులు దమయగ్ని హోత్రంబులయు, నపార ఫలపుష్పతరునదీరమ్య తపోవనంబుల యుందోడ నదృశ్యులైనంజూచి దమయంతి యిది కలయో నిక్కువంబో యని విస్మయంబందుచుం జని ముందట నొక్కచనుపం గని దానిం జొచ్చునపు డందలి జనంబులు,

పాంసుజాలములు పై బ్రాకిన గరము రూ
క్షములగు మూర్ధాలకములదాని
నతిమలినంబైన యర్ధవస్త్రంబుచే
నావృతంబగు దేహయష్టిదాని
నాకలి తృష నిద్రలను వీని నెఱుగక
యున్మాదినియు బోలె నున్నదాని
దమయంతి జూచి కొందరు పిశాచంబని
వఱచిరి కొందఱు భయముహొంది

రందు గొందఱధిక హాస్యంబు సేసిరి
యడవి నేమి రోసె దనిరి కొంద

**రవ్వ నీవు వేల్పవగుదని కొందఱు**
**మొగిన కేలు మొగిచి మ్రొక్కి రంత.**

దమయంతి సార్థవాహులంజూచి యిమ్మహాగహనంబున నిట్టి జన సంకులంబయిన సార్థంబు గానంబడియెడు నెట్టి పుణ్యంబోయని పలికి మఱియు నిట్లనియె

**ఏను నలుభార్య బుణ్యవి, హీనత బతి బాసి నవసి యేకాంతమ యీ**
**కానల బరిభ్రమించెద, గానరె మీ రమరసదృశు గరుణాత్ము నలున్.**

అనిన దానికి సార్థవాహుండు శుచియనువా డిట్లనియె అమ్మా! యీ వనంబున నలుంగాన మనిన, ఆమె మీ రెటుబోయెదరనిన మేము చేదిపతియైన సుబాహు పురంబునకుం బోదుమనిన అట్లేని మీతోడ వచ్చెదనని పతి దర్శన లాలసయై మునుల పలుకులు దలంచుచు నరిగిన వారు చని చని అర్ధరాత్రంబున నొక జలాశయంబున విశ్రమించుటయు అంత గజయూధములు నిద్రాసక్తులై యున్న యా బాటసారుల నుగ్గు సేయుటయు కొందఱు భిన్నాంగులైరి, కొందఱు ప్రాణభీతి మహీజంబుల నెక్కి ప్రాణంబులు దక్కిన వారల తోడం దమయంతి చనుచు నాత్మగతంబున

**జీవితార్థులైన జీవుల నుఖనుప్తు, లైన వారి జంపె నఱవ నఱవ**
**మరణకాంక్ష నున్న మగువ జంపక నను, మఱచె విధి కరంబు మందబుద్ధి**

అని చింతిల్లుచు మును నా స్వయంవరమునాడు దేవతల వరింపక నలు వరించిన నాటియెగ్గు దలంచి వేల్పులు ఇట్టి యాపదలు సేసిరో యని దుఃఖించుచు వగచుచు నిజభర్తృ పాదంబుల నెద నిడుకొని హతశేషులైన యాబ్రాహ్మణ వరులతో చేదిపతి పురంబు చొచ్చి జనసంకులంబైన రాజమార్గంబున వచ్చుచున్న దమయంతిని ప్రాసాదగతయైన రాజమాత దవ్వులం గని తనదాది కిట్లనియె. 'ధూళిధూసరిత గాత్రయై యున్మత్త వేషిణి యైన లచ్చికరణి యీమె వచ్చుచున్నది చూడుము అక్కోమలియందు నాకతి స్నేహంబై యున్నయది ఆమెను దోడ్కొని రమ్ము' అనగా దాది ఆమెను దోడ్కొని రాజమాత యొద్దకుం జనిన నా రాజమాత

దమయంతిని జూచి నీ వెవ్వరి దానవు ఇట్లేల దుఃఖావేశవివశవై యున్న దానవు చెప్పుమనిన దమయంతి యిట్లనియె

జితవైరి మత్పతి జూదమాడి నిర్జితుడయి చనిన
బతితోడ నీడయుబోలె నేనును బాయక యఱిగి
యతి బుభుక్షాతురుండైన పతిచేత నవ్వ ధైవాము
మతి జేసి వంచిత నైతి నొక్కచో మఱచి నిద్రించి.

అంత నుండియు నమ్మహానుభావు నేకవస్త్ర్తు ననికేతను నన్వేషించుచు, సైరంధ్రీ వృత్తంబు సేకొని వియోగానలంబునం గంది కంద మూలఫలంబుల నాహారంబుగా బ్రొద్దు వడిన చోట నివాసంబుగా మృగకులంబ సహవాసంబుగా వనంబులం బరిభ్రమించితి నని బాష్పజలంబుల విడచుచు మారుబలుక నేరకున్న యా దమయంతికి రాజమాత యిట్లనియె

నీవుండుము నాకడ నిం, దీవర దళనేత్ర నీ పతిని రోయగ భూ
దేవోత్తములం బంచెద, నావుడు నిట్లనియె భీమనందన నెమ్మిన్.

ఏను సైరంధ్రినై యుండియు నుచ్ఛిష్టంబు ముట్టను బద ధావనంబు సేయను, పర పురుషులతో బలుకనోప బతి నన్వేషించు పొంటె నరిగెడు బ్రాహ్మణులతో బలుకుదు నట్టైన నీ యొద్ద నుండుదు నొండు విధంబైన నుండనేర ననిన నీ కిష్టంబైన విధంబున నా యొద్దన యుండుమని దాని నతి గౌరవంబునం జేకొని దనకూతు సునందన యను దానికి సమర్పించిన

అలయక పుణ్యవ్రతములు, నలుపుచు సైరంధ్రియనగ జైద్యేశుపురిన్
నలుదేవి యుండె నెదబతి, దలచుచు దుస్సహవియోగతాపార్దితయై.

అట నలుండు దమయంతి బాసి దారుణారణ్యంబులో నరుగువాడు ముందట

అవిరళ విస్ఫులింగ నివహంబుల నభ్రపథంబు నంటుచున్
దవదహనం బుదగ్ర తరుదాహము సేయుచు నున్నజూచి మా

నవవతి దాని యంతరమునన్ వినియెన్ నరనాథ! నన్ను గా
రవమున గావవేగ యిట రమ్మను నార్త మహా నినాదమున్!

విని శంకింపక చెచ్చెర ననఘుం డత్యుగ్రతర దవానలమధ్యం
బున కరిగి కనియె దీనాననము మండలితాంగు నొక్క నాగకుమారున్.

అన్నాగకుమారుండును నలునకుం గృతాంజలియై యేసు గర్కోటకుండను వాడ గర్మవశంబున నొక్క బ్రహ్మఋషి నుపాలంభించి తచ్ఛాపంబున నెక్కడం గదలనేర కున్నవాడ

నాలుగు దిశలను దావ జ్వాలావళి గవిసె గ్రమ్మంది చానోవ మహీ
పాలక! నన్నొక సరసీ కూలము జేరంగ నెత్తికొని పొమ్ము దయన్.

## నలుండు కర్కోటకునిచేత దష్టుండగుట

నన్ను రక్షించిన నీకుం బ్రియంబు సేయనోపుదు ననిన వాని నెత్తికొని పోవం జాలకనై యంగుష్ఠ ప్రమాణ దేహుండై యున్న నెత్తికొని నలుం డతిత్వరితగతి నరిగి తాపవర్జితంబైన యొక్క సరోవర సమీపంబున విడువంబోయిన వింకను బదియడుగు లరుగుము నీకు శ్రేయః ప్రాప్తిం జేసెద ననిన నడుగు లెన్నికొనుచు నరిగి పది యగు నప్పుడప్పాము చేత దష్టుండై తన రూపంబు విడిచి వికృత రూపంబుతో నున్న నలునకుం గర్కోటకుం డాత్మరూపంబు చూపి యిట్లనియె "అయ్యా! నీవు నా చేత విషపీడితుండ వైతివని దుఃఖింప వలదు నిన్నొరులెఱింగిన నెగ్గగుం గావున వికృత శరీరుం జేసితి నెంత కాలంబు నీ శరీరంబున నా విషంబుండు నంత కాలంబును నీకు విషోరగ రాక్షస పిశాచ శత్రునివహంబు వలన భయంబు లేదు సర్వసంగ్రామ జయంబును భార్యాసంగమంబును నెప్పటి రాజ్యవిభవంబును నగు నీకెప్పుడేని నిజరూపంబు సేకొన నిష్టంబయ్యె నప్పుడ నన్నుం దలంపు మీ వస్త్రంబు నీ యొద్దకు వచ్చు దాని ధరియించుడు, నిజరూప ప్రాప్తి యగునని వరంబిచ్చి వెండియు నిట్లనియె

ఇలబ్రసిద్ధుడు ఋతుపర్ణుడనెడు మహీశుడిక్ష్వాకు
కులజుండు నీకు సేవ్యుండగు నతని గొలిచి యందుండు

నెలకొని యతనికి నశ్వహృదయ మనెడి విద్య యిచ్చి
వెలయ నతనిచేత నక్షహృదయ మన్విద్య జేకొనుము.

మరియు బాహుకుండను నామంబుతో సూతవృత్తి నుండు"మని హితోపదేశంబు సేసి కర్కోటకుం డదృశ్యుడైన, దద్వచనంబున నలుడయోధ్యా పురంబునకుం జని ఋతుపర్ణు గని యేను బాహుకుం డనువాడ నశ్వశిక్షయందు కుశలుండనన్న సంస్కారంబుల శిల్పంబుల బెక్కు విధంబుల రచియింప నేర్తు భవత్సేవార్థినై వచ్చితి ననిన ఋతుపర్ణుం డిట్లనియె

నా యొద్దనుండు దేని మదీయ రథాశ్వములకును ద్రుతిని శీఘ్రముగా
జేయుము నావుడు నట్టుల చేయుదు నని నలుడు వాని సేవించె దగన్.

ఇట్లు ఋతుపర్ణునొద్ద నశ్వాధ్యక్షుండై దుష్టాశ్వంబుల వశంబు జేయుచు, నశ్వారోహకుల నారోహణంబుల శిక్షించుచు రసవంతంబులుగ నన్న సంస్కారంబుల సేయుచు, ఋతుపర్ణుచేత నియుక్తులైన వార్ష్ణేయ జీవలులు దనకు సహాయులుగా బ్రచ్ఛన్నుండై యుండి తన ప్రియురాలైన దమయంతి మదిందలంచుచు మనోవ్యథం గుందుచు కాలంబు గడుపుచుండ అట విదర్భేశ్వరుండు, నలురాజ్యభ్రంశంబు విని కూతురు నల్లుండు నెటుబోయిరో యెందున్న వారో యని శోకించి వారల నన్వేషించుటకై విద్వాంసులైన బ్రాహ్మణ శ్రేష్ఠుల బంపుచు నలదమయంతులున్న చోటెరింగి వచ్చిన వారికి వేయి గద్యాణంబు లిత్తుననియు వారలం దోడ్కొని వచ్చిన వారికి గోసహస్రంబులు, నగ్రహారంబులు నిత్తుననియుం బలికి పంపిన వారలు మహాపట్టణంబులు గ్రామంబులు వెదకుచుండ అందు సుదేవుండను బ్రాహ్మణుండు చేదిపతియైన సుబాహుపురంబునకుం జని పుణ్యాహంబు సేయింపం బోవు బ్రాహ్మణులతో రాజ గృహంబు చొచ్చి యంతఃపురంబున సునందాసహితయై యున్నదాని సైరంధ్రీ వేషిణియై యున్నను దదీయ భ్రూయుగ మధ్యగతంబైన సూక్ష్మలక్షణంబుల నిరీక్షించి దమయంతిగా నెఱింగి యాత్మగతంబున నిది పతివిముక్త యయిన పతివ్రతా గుణంబున నొప్పుచున్నయది

అనపహార్యంబు తేబోమయంబు సర్వ
గుణములకు నలంకారంబు గురుతరంబు
భామకుం బతిభక్తియు పరమమైన
భూషణం బిట్టివే పెరభూషణములు

అని ఈమెకు భర్తృ సమాగమం బెన్నండయ్యెడినో యని చింతించుచు నల్లనల్లన దమయంతి కిట్లనియె

అవ్వ నీతల్లి దండ్రుల కాత్మజాలకు
బంధుజనులకు కుశలంబు భామనీదు
కుశలమెరుగునంతకు వంత గూరి వగచు
చున్న వారు వారికి వంత యుడుగు నింక.

దేవి యేను భవద్భ్రాతృనఖుండ సుదేవుండను బ్రాహ్మణుండ విదర్భేశ్వరుండు నీ యున్నచో టెరుగం బెక్కండ్రు బ్రాహ్మణులం బుచ్చిన నిందులకు వచ్చి నా పుణ్యంబున నిన్ను గంటి ననిన దమయంతి వాని నెఱింగి తన పుత్రుల తల్లిదండ్రుల బాంధవులం బ్రత్యేకంబ యడిగి యశ్రుజలంబు లురుల నేడ్చుచున్నం జూచి యేలకో యిప్పుడు సైరంధ్రి యేడ్చుచున్నయది యని సునంద తన తల్లికిం జెప్పి పుచ్చిన

చనుదెంచె నంతిపురమున వనితానివహంబుతోడ వారిజదళలో
చన రాజమాత నృపనందన యగు దమయంతికడకు దద్దయు వేడ్కన్

ఇట్లు వచ్చి తమలో మాటలాడుచున్న బ్రాహ్మణుని దమయంతి జూచి రాజమాత బ్రాహ్మణుని వలన నలదమయంతుల సకల వృత్తాంతంబును విని అచ్చెరువంది భయ స్నేహంబుల దమయంతిం గాఢాలింగనం బొనర్చి యూరడించి తల్లీ నీవు మా కూతురవే యనిన దమయంతి కొన్ని దినంబు లచ్చట సుఖంబుండి పిదప తల్లి దండ్రుల ననుజుల నాత్మజుల జూడ వేడుకయ్యెనది విదర్భకుం బోయెద నానతిమ్మని కృతాంజలియైన దమయంతి నతిస్నేహంబున సుబాహుజనని సుతప్రేషిత బలంబుతో సువర్ణమణిమయ విమానోపమాన యానంబున నునిచి

పుచ్చిన దమయంతి విదర్భకుం జని దేహసౌఖ్యంబుల నొల్లక మలినార్ధ వస్త్రమును ధరించి జీవితేశ్వరుని స్మరించుచు వ్రతంబుల సలుపుచు భర్తృవియోగంబును భరింపనోపక తన మనోరథంబును దనజనని కెరిగించిన ఆమెయు గూతు నభిప్రాయంబు భీమున కెఱింగించిన నాతండు నలుమార్గణంబున సద్బ్రాహ్మణుల నియోగించిన దనపతి నన్వేషంప నరుగు బ్రాహ్మణులకు దమయంతి యిట్లనియె

నైషధేశ్వరుండు నలుడిప్పు డసమర్థు
డగుట జేసి తన్ను నన్యులెఱుగ
కుండ నుండుగాన యురునభాంతరముల
కరిగి యరిగి యిట్టులనుడు మీరు

సత్యనిత్యుండవు సతినిట్లు వంచించి
దాని వస్త్రార్థంబు దఱిగి నీకు
బరిధానముగ జేసి పాడియే పోవంగ
భార్య భర్తవ్యనా బరగుధర్మ
మదిమిథ్య యయ్యె నీయందు నీకిట్టి ని
ర్దయబుద్ధి జేకొన దగునె యట్టి
సాధ్వికి గరుణ బ్రసన్నుండ వగుమని
యెల్లచో బలికిన నెవ్వడేని

బలుకువడగ నోడి ప్రతివచనం బిచ్చు
నతడు నలుడుగా బ్రియంబుతోడ
నెఱిగి నన్ను నతని కెఱిగించి తోడ్కొని
రండు రానివాడు రండెఱింగి.

అని పంచినం బనిపూని బ్రాహ్మణులు దమయంతి కఱపిన పలుకులెల్ల సభలం బలికి యెందుం గానక వచ్చిరి అందు పర్ణాదుండను బ్రాహ్మణుండు దమయంతి కిట్లనియె నే నయోధ్య కరిగి ఋతుపర్ణు సభ నీపలికినట్లు బలికిన అందు విరూపాంగుండు శీఘ్రయాన కుశలుండు బాహుకు డనువాడు విని నన్ను నేకతంబ కనుంగొని వెలవెల నగుచు దీర్ఘనిశ్వాస పురస్సరుండై యిట్లనియె

**పురుషునందు దోషపుంజంబు గలిగిన**
**నెరిగి యెద సహించునేని భార్య**
**పురుషునందభీష్ట భోగంబు దేహాంత**
**రంబునందు ధర్మరతియు వడయు.**

అని యొండిడ్డియుం బలుకక తన నివాసంబునకుం బోయెనని సకల వృత్తాంతము నెరింగించిన దమయంతి అతని నలుంగా నెరింగి బెద్దయుంబ్రొద్దు చింతించి సుదేవుండను బ్రాహ్మణుని రావించి వానికిట్లనియె నన్ను ఎఱింగి తెచ్చినట్ల నలునెఱింగి తెమ్మా యని పంపుచు నతనితో మరియు విదర్భాధిపుండైన భీముండు నలు నెందుం గానక దమయంతీ పునఃస్వయంవరంబు చాటించిన సకల రాజులుం బోయెదరని అతిత్వరితంబుగ ఋతుపర్ణున కెరింగింపు మనియు చెప్పెను అతడట్లు సేయ ఋతుపర్ణుండు బాహుకుంజూచి నాకు దమయంతీ స్వయంవరంబు జూడ నొక్కనాట విదర్భకుం బోవలయు నీయశ్వనైపుణ్యంబు ప్రకాశింప జేయుమనిన నట్ల చేయుదునని నలుండు మనంబున దుఃఖించి తాను జేసిన ద్రోహంబునకు ప్రతిఫలించినది గాబోలునని తలంచి పతివ్రత లిట్లు చేయరైనను ఋతుపర్ణుతో బోయి యెరుంగవలయునని బుద్ధిదలచి సకల శుభలక్షణంబులతో గూడి మనోవాయు వేగంబులు గల యశ్వంబుల బూన్చికొని వచ్చిన ఋతువర్ణుం డారథం బెక్కునప్పుడు హయంబులు మ్రొగ్గినం జూచి యిప్పేద గుఱ్ఱంబులతి దూరంబెట్లు పోవనోపునని బాహుకుండు,

**అవనీశ! ఈహయంబులు పవనగతిం బరచు బ్రొద్దువడకుండగ నే**
**డ విదర్భకు ననవుడు విని కువలయపతి మెచ్చి బాహుకున కిట్లనియెన్.**

అట్లయిన నీ హయతత్త్వ కౌశలం బెరింగి నీకు నభిమతం బొనరింతునని రథం బెక్కి బాహుక వార్ష్ణేయ సహితుండై యరుగువాడై ఋతుపర్ణుండు నలుని రథయాన కౌశలంబున కచ్చెరువొంది తాను నెరింగియున్న యక్షహృదయమను విద్యను నలున కుపదేశింప కుతూహలుండై దాని మాహాత్మ్యంబును వినిపించి,

**సకలగుణ ప్రసిద్ధుడగు సర్వహితుండగు జూవెయంచు బా**
**హుకునకు బ్రీతితోడ విధియుక్తముగా నుపదేశమిచ్చె న**

త్యకుటిలబుద్ధి నక్షహృదయంబు గరంబు రయంబుతో విద
ర్భకు జనువేడ్క జేసి ఋతుపర్ణుడు పూర్ణమనఃప్రసన్నుడై.

ఇట్లు నలుండు ఋతుపర్ణువలన నక్షహృదయంబు వడసి సంతుష్టుండై నీకు నశ్వహృదయం బిచ్చెద బరిగ్రహింపు మనిన ఋతుపర్ణుండట్ల చేయుదు నది యంతకు నీయంద యుండనిమ్ము నా వలసినప్పుడు గొందుననియె నంత నయ్యక్షహృదయసామర్థ్యంబున నప్పుడు

నలు దొల్లియాక్రమించిన కలిగర్కోటక విషంబు గ్రక్కుచు నొడలన్
వెలువడి నలునకు విహితాంజలియై తన్నెఱుగ జెప్పె జంచలుడగుచున్.

వాని జూచి నలుడు దానల్గి శాపమీనున్న గలి యెరింగి విన్ను బొంది
యహివిషంబు చేత ననిశంబు దగ్ధుండ నైతి నింక నాకు నలుగవలదు.

నిన్నుం గీర్తించిన జనంబులు నావలని భయంబు బొందరు కరుణింపు మనిన నలుండు గోపంబుడిగె కలియు నవ్విభీతకి వృక్షంబు నాశ్రయించె నది మొదలుగా విభీతకంబప్రశస్తం బయ్యెనట్లు నలుండు వికృత రూపంబు మాత్రంబు దక్క, దక్కిన దుష్కృతంబుల వలన విముక్తుండై రథంబెక్కి యతి వేగంబున ఋతుపర్ణవార్ష్ణేయ సహితుండై విదర్భకుం జనియె నంత సాయాహ్నంబున దమయంతి పట్టణ సమీపంబున నా రథధ్వని విని యిది నలురథ ఘోషయని యనురాగ మొందియుండ వచ్చిన ఋతుపర్ణుని భీముండును యథార్హంబుగ బూజించి యుచిత హర్మ్యంబున విడియించెను బాహుకుండును రథశాల రథాశ్వంబుల బంధించి రథసమీపమున విశ్రమించి యుండె నంత దమయంతి కేశినియను దాది ద్వారా నలుని సకల వృత్తాంతముల నెఱింగి సఫలమనోరథయై నిజజనని కిట్లనియె

నందియ మేల సర్వగుణసంపద జాడగ బాహుకుండు భూ
వందితుడైన నైషధు డవశ్యము దానగు నా మనంబు నా
నందము బొందుచున్నది ఘనంబుగ వాడిట వచ్చువాడొ యే
నందుల కేగుదాననొ రయంబున నాతని నిశ్చయింపగన్.

అనిన నదియప్పుడ భీము ననుమంతంబున దమయంతి యొద్దకు బాహుకు రావించిన,

చనుదెంచి యందు దీనానన
నవిరళవంకమలిన నతగాత్ర దప
స్విని నతికృశ దమయంతిం
గనియె నలుండుదిత బాష్పకణ కలితముఖిన్.

దమయంతి నలుని వికృతాం
గము జూచియు నతని నన్యుగా వగవక నె
య్యమునను లజ్జను నతివం
భ్రమమున వివశాత్మ యగుచు బతికిట్లనియెన్.

విజనంబైన విపినంబునందు నలసి నిద్రబోయిన దాని నబల నతిసాధ్వి ననువ్రత నగ్నిసన్నిధి బాణిగ్రహణవిధి లబ్ధయైన దానిం బాసి నలు నట్లొరులు నిర్దయులై యరిగిన వారు లేరు

సురవరుల దొరగి తన్నున్
వరియించితి నన్ను బుత్రవతి నేలొకొ చె
చ్చెర విడిచె నాతనికి ని
ష్కరుణున కేనేమి యెగ్గు గావించితినో?

నిన్ను విడువనోడకుండుమని పలికిన యప్పలుకులేల మరచెనో యని శోక తప్తంబైన తన హృదయంబు దడుపుచున్నదియును బోలె బాష్పధారలం గుచమండలంబు దడుపుచు నున్న దమయంతి జూచి శోకాకులుండై నలుండిట్లనియె.

కలినమావిష్టమతినయి కష్టవృత్తి
నట్టియిడుమల బడితి నేనవి మదీయ
తపము బలమున నీ దుఃఖ దాహమునకు
నష్టమైపోయె గలియిప్డు నన్ను విడచె.

ఏనిందులకు నీ తదర్థంబ వచ్చితి నది యట్లుండె నన్ను ననురక్తు ననువ్రతు దలంపక యన్యాపేక్షంబున స్వయంవరంబు రచియించుట యిది కులస్త్రీ ధర్మంబు గాదు. రాజులనెల్ల నీ స్వయంవరంబునకు రావించుటం జేసి గాదె ఋతువర్ణుండు వచ్చెననిన వెఱచి కృతాంజలియై దమయంతి యిట్లనియె

నిన్ను రోయంగ విప్రులు నెమ్మి నరిగి
పలికి రెల్లచో నా చేత బలుక బడియ
యందు బర్ణాదుడను విప్రుడయ్యయోధ్య
కేగి ప్రతి వచనంబుల నెఱిగె నిన్ను.

ఆపర్ణాదువలన నిన్నెఱింగిన దాననై నిన్నిట రావించు నుపాయంబు దలంచి యెల్లి దమయంతీ ద్వితీయ స్వయంవరం బగునని ఋతువర్ణునందుం బ్రకాశింప సుదేవుడను బ్రాహ్మణుం బుత్తెంచితి

నరవరుడు నలుడు గాకె
వ్వరు శతయోజనములొక్క వాసరమున వ
త్తురు నరులొరులని దీనిం
బరికింపగడంగి యిట్లు పంచితి నధిపా!

ఏనతిపాపభావమును నెగ్గు దలంపక యుండునట్లుగా
నానతవైరి! నీ యడుగులంటగ నోపుదు పట్టిదైవ న
న్నీ నలినాప్తు డీయనలు డీమృగలాంఛను డీసురోత్తముల్
జూను పెడంగ నీక్షణమ చంపరె కోపపరీతచిత్తులై.

అనుచున్న యవసరంబున నఖిల భూతాంతర్గతుండైన వాయుభట్టార కుండెల్లవారలు విన నాకాశంబున నుండి నలున కిట్లనియె

అమల చరిత్ర నిట్లు దమయంతి బతివ్రత బల్కుదే నృపో
త్తమ! విను దీనియందు విదితంబగు శీలవిధిన్ సుధాంశుడుం
గమలహితుండ యేమనయి కాచితి మొక్కట మూడు వర్షముల్
గొమరుగ దీని జేకొనుము కోమలి నీ కమరక్త నాపుడున్.

ఇట్లెల్ల వారికి నాశ్చర్యంబుగా వాయుదేవుండు తన్నెఱింగించి దమయంతి పతివ్రతా గుణంబులను పతియందు యకృతిమానురాగంబునుం జెప్పిన విని నలుండు పరమ ప్రమోద పరిపూర్ణహృదయుండై తత్క్షణంబ కర్కోటకుం దలంచి వాని యిచ్చిన పుట్టంబుపై బెట్టికొని నిజరూపంబు దాల్చిన,

ఆయతబాహు దప్తకనకాంచితవర్ణు మనోజరూపు నిం
ద్రాయితు సూర్యతేజు నిషధప్రభు నన్నలు జూచి పద్మప
త్రాయతనేత్ర యప్డు దమయంతి గరంబు ముదంబు నొంది ల
క్ష్మీయుత యయ్యె బంధులకు మిత్రులకున్ హృదయప్రియంబుగన్

ఇట్లు సంగతులైన యయ్యిరువురకు భీముండు మంగళ స్నానంబు లాచరింపజేసి రాజోచితములైన భూషణ విలేపన వస్త్రాదులచే విస్తరిల్లంజేసి పరమ సంతుష్ట హృదయుండై దేవగృహంబుల యందును విశేష పూజలు చేయించె నట్టి మహోత్సవం బెఱింగి ఋతుపర్ణుండు నలునొద్దకు వచ్చి నీవు నిఖిలలోక పూజ్యుండవయ్యును నాయొద్ద బాహుకుండనంగ బ్రచ్ఛన్న వృత్తినున్న నిన్నెఱుంగక నీచకర్మంబులందు నియోగించితి. దీని క్షమించునదియని నలుచేత సత్కృతుండై యశ్వహృదయోపదేశంబుగొని యయోధ్యకుం జనియె నిట నలుండును విదర్భాపురంబున నొక్క మాసంబు నివాసంబు చేసి విదర్భేశ్వరు వీడ్కొని దమయంతి నందబెట్టి యొక్క రథంబున కతిపయ బలంబులతో నిషధపురంబున కరిగి పుష్కరు నోడించి రాజ్యముం జేకొని దమయంతీ సహితుడై స్వర్గసమాన భోగంబుల సుఖంబుండెనని బృహదశ్వుండు ధర్మజాన కిట్లనియె

ఇన్నలోపాఖ్యాన మెప్పుడు దత్తావ
ధానులై వినువారు దవిలి సభల
జదివెడు వారును జగదీశ కలిదోష
నిర్ముక్తు లగుదురు నిఖిల పుణ్య

ఫలభాగు లగుదురు బహు పుత్ర పౌత్రాయు,
రారోగ్య ధనయుక్తు లగుదురెల్ల

విషములకును దుష్ట విషయంబులకు దూరు
లగుదురు ధర్మాత్ము లగుదురుర్వి
గడు ప్రసిద్ధ మిదియు గర్కోటకుని దమ,
యంతి బుణ్యమూర్తి యయిన నలుని
నుత చరిత్రుడైన బుతుపర్ణు కీర్తింప,
గలిభయంబులెల్ల గ్రాగు నధిప! *



# మార్కండేయుడు ధర్మజునకు సావిత్ర్యుపాఖ్యానంబు సెప్పుట

## (ఆరణ్య పర్వము : సప్తమాశ్వాసము)

కలడు మద్రేశుండు ఘను డశ్వపతి యను
ధరణీశుడతడు సంతానకాంక్ష
నెంతయు ధృతి బదునెనిమిది యేడులు
సావిత్రి గొల్చె నబ్జనవిభునకు
నద్దేవి ప్రత్యక్షమై వరమడుగుము
నావుడు నతడు వినమ్రుడగుచు
నాత్మజా గోరెద ననవుడు గన్నియ
పుట్టు నీ కనియె నా భువన మాత
యనుడు దేవి భవత్కృప నస్మదీయ
వాంఛితము సఫలంబుగా వలదె యని నృ

---

*వి ॥ దీనియందు అజగరము నోటి నుండి రక్షించిన కిరాతకుని దమయంతి శపించి భస్మమొనర్చినట్లు గలదు అయితే నలచరిత్ర యందు ఆ కిరాతకునకు అనేక ధర్మములు బోధించిన ను మనసును నిలుపజాలక వ్రత భంగము చేయ నిశ్చయించినందుచే విధిలేక అట్లు శపించినట్లు గలదు

పోత్తముడు విన్నవింప నయ్యోగమూర్తి
గాఢకారుణ్య వికచ హృత్కమల యగుచు

ఏను నీ మనోరథంబు తెలుంగు మున్న చతుర్ముఖున కెఱిగించిన నతండు గన్నియగా నిర్దేశించె, నద్దేవుని యానతి యమోఘంబు విను మక్కన్నియ కారణంబున నీకు నొక్క విధంబునం బిదప బుత్త్రశతలాభంబునగు సంతసిల్లుమని యనుగ్రహించి యద్దేవి యంతర్ధానంబు నొందె నయ్యశ్వపతియును సావిత్రీ ప్రసాదంబున నిజధర్మపత్ని యయిన మాళవియందు సావిత్రి యను కూతుంగని యక్కన్నియ నతిగౌరవంబునం బెనిచె నంత

ఆవనజాక్షి పరిస్ఫుట యౌవనయై సిద్ధ సాధ్యయక్షామర క
న్యావళి దన సౌందర్య శ్రీ విలసనరేఖ నవహసించుచు నొప్పెన్.

కోరి జనపతి దనకూర్మి కూతు జూచి గుణవయోరూపముల కనుకూలుడైన
భర్త నెమ్మెయి దీనికి బడయువాడ నొక్కొయని యెద్దదడవుచు నుండె నెలిమి.

అదియును సాళ్వపతియైన ద్యుమత్సేను కొడుకు సత్యవంతుండు రూపవంతు డనియును గుణవంతు డనియును విని వాని యందు జిత్తంబు దగిలి యున్నను సిగ్గు పెంపున నెవ్వరికి నెఱింగింవకుండె నంత నొక్కనాడమ్మద్రపతి కడకు నారదుం డరుగుదెంచిన నతం డమ్మహాముని నుచిత సపర్యాపరితోషితుం జేసి సద్గోష్ఠీ విశేషంబు సలుపుచున్న యెడ

నెచ్చెలులు దన్ను గొలువగ బచ్చవిలుతు కలిమియెల్ల బద్మాననయై
యచ్చుపడినట్లు మెఱయుచు నచ్చటి కేతెంచె భూవరాత్మజ నెమ్మిన్.

ఇట్లు వచ్చి సఖీజనంబు నంతంత నిలిపి మెలుపుతోడి పొలుపు మిగుల విముగ్ధ లీలామధురం బగుచుండ దండ్రికి మ్రొక్కిన నతండు ప్రగాఢ స్నేహ సన్నాహదోహలం బగు చిత్తంబుతో నత్తన్వి గ్రుచ్చి యెత్తి నిజాంకతలంబున నునిచికొని సమంచితోపలాలన కేళీ పరవశుం డయ్యెనప్పుడు నారదుండ మ్ముద్దియం జూచి యశ్వపతి తోడ నిక్కన్నియం దగిన వరునకొసంగక యిట్లేల యునిచినాడ వనిన నతండు గూతున కిట్లనియె

తల్లి నీ గుణరూప వృత్తముల కెందు,
దగినవరు గాంచనైతిని దడవి కాన
నీ మనస్సున కెక్కిన నృపకుమారు
గోరి వరియింపు మిదియ నాకును బ్రియంబు

అనిన నదియు గొండొక లజ్జించి కోర్కి పెంపున సిగ్గు దొలంగంద్రోచి ప్రకట కౌతూహల తరళితాంతరంగ యగుచు దండ్రికి నల్లన యిట్లనియె

చిరకీర్తి సాళ్వభూవరు
వరతనయుండయిన సత్యవంతుడు నాకున్
వరుడుగ గోరుదు మదిలో
నరవర యాతనికి నిమ్ము నను బ్రీతిమెయిన్

సాళ్వపతి యిప్పుడ దైవయోగంబునంజేసి విగతచక్షుండయి తన రాజ్యంబు వైరులచేతం గోల్పడి పుత్రదార సహితంబు వనంబున నున్న వాడెట్లయినను సత్యవంతునే వరియింతుననిన మద్రేశ్వరుండు నారదుంజూచి మునీంద్రా! మీ రెఱుంగని వారు లేరు సావిత్రి చేత వరియింపబడిన కుమారుం డెట్టివాడు? వాని గుణ రూపశీలంబు లెఱింగింపుడన నారదుండిట్లనియె

సత్యంబు వలుకుట సత్యవంతుండన
నతడొప్పు మఱియు జిత్రాశ్వుడనగ
నామాంతరంబు నన్నరనాథ సుతునకు
గలదు తేజంబున గమల మిత్త్రు
బుద్ధి నింద్రాచార్యు బురుడించు శూరత
వాసవు దాలిమి వసుధ బోలు
గాంతి జంద్రున కెనగా దగు రూపున
నాశ్వినేయుల సరియన దలిర్చు
దపము శమము దమము దానంబు బ్రాహ్మణ
భక్తియును మహాప్రభావతయును

నతని యందకాని యన్యులయందు లే
దింత నిక్కువము మహీతలేశ!

వానియందును గీడు నొక్కటియుం గలదు నేడు మొదలుగా నొక్క సంవత్సరంబునకు మృతిం బొందు నిది నీకు జెప్పవలయుటం జేసి చెప్పితి ననిన నతండు గూతురు మొగంబుచూచి తల్లీ! యిమ్మహాత్ముండు దేవరహస్యంబు లెఱుంగు నీతని వచనంబమోఘంబు నీకు నట్టివరుండేల? యొండొకవరుని వెదకి కొమ్మనిన అక్కన్నియ తండ్రి కిట్లనియె

వినుము మనోవాక్కాయము లను, మూడు దెఱంగు లందు నంతఃకరణం
బనఘ ప్రధానము గావున, మనమున గైగొన్న భర్త మానందగునే?

సత్యవంతుం డెట్టివాడైన నగుంగాని యేనింక నొరుల వరియింప నొల్లననిన నశ్వపతి నారదుదెస జూచుటయు నతండిట్లనియె

గొనముల ప్రోక నీ యనుగు గూతురు దీని తలంపు మాన్పగా
మనకు నశక్యమింక ననుమానము లేల నరేంద్ర! యింతి జ
య్యన నృపసూతి కిమ్ము కమలానన చేసిన పుణ్య గౌరవం
బున నయినం బ్రియుండు పరిపూర్ణ చిరాయు రుపేతు డయ్యెడున్.

అనిన నమ్మహీపతి యమ్మునిపతికి మ్రొక్కి నీవు మాకుం బరమ గురుండవు నీ యానతిచ్చినట్ల చేసెద ననిన నారదుండు వారి దీవించి దివంబునకుం జనియె నంత

అమర పుణ్యదినంబు నందు బాంధవ మంత్రి
వృద్ధ పురోహిత వితతి తోడ
సావిత్రి దోడ్కొని జననాయకుండు వై
వాహిక మహనీయ వస్తుకోటి
గొనుచు బుణ్యారణ్య గోచరుండై తప
స్థిరుడైన యా ద్యుమత్సేను కడకు

జనిన నా రాజును సంభ్రమంబున నశ్వ
పతికి నర్ఘ్యాది సంభావనంబు

లాచరించి సముచితాభిమతాలాప
పూర్వకముగ సుజన పూజ్యుడతని
యాగమన నిమిత్త మడిగిన మద్రేశు
డెలమి సాళ్వపతికి నిట్లు లనియె.

ఈ కన్నియ నాకూతురు, మాకులమున కెల్ల దేవ మనుజోత్తమ నీ
వీ కన్నియ గోడలిగా గైకొనుము మదీయవచన గౌరవ బుద్ధిన్.

అని పలికి సావిత్రి నతనికి నభివందనంబు సేయించి మఱియు నతండు

నీ కొడుకు సత్యవంతున, కీ కన్నియ దగు నరేంద్ర యీ కన్నియకున్
నీ కొడుకు దగు ననన్యగుణాకరు లియ్యిరువురును సమంచిత మూర్తుల్.

అనిన నతనికి ద్యుమత్సేనుం డిట్లనియె

విగత రాజ్యాలమై ఘోర విపినములకు
వచ్చి యిమ్మెయి దపమున్న వారమేము
బాల సుకుమారి యిది జనపాల యడవి
నుండి మాతోటి యిడుమల కోర్చునయ్య.

అనిన నశ్వపతి యతని కిట్లనియె

కలిమియు లేమియున్ సతము గావవి సెందినచో జెలంగుచుం
గలగుచు నున్కి ధీరుల ప్రకారమె లెస్సగ నింతవట్టు నే
దెలియగ జెప్పెదన్ వసుమతీవర! పిన్న యనంగ నేల నే
కొలదియు గాదు ధీరమతి గూతురు పేర్కొనజాల బెంపునన్.

నీతోడ వియ్యమందం జేతోగతి నాసజేసి చెచ్చెర వి ట్లే
నేతెంచితి మత్ప్రార్థన బ్రాతిగ జేకొనక యునికి పాడియె నీకున్?

## సావిత్రి సత్యవంతుని వివాహం బాడుట

అనుటయు నయ్యంధనృపతి తత్సంబంధంబునకు సంతసిల్లి నిజాశ్రమ వాసులైన మునులం గూర్చుకొని శుభలగ్నంబున సత్యవంతునకు సావిత్రిం బరిణయంబు సేసె నయ్యశ్వపతియునుం గూతునకు నల్లునకు వివిధాంబరాభరణాది వస్తు విశేషంబు లొసంగి నిజపురంబున కరిగె బదంపడి

**పడతి రమణీయ భూషణాంబర విలాస ముజ్జగించి వనాంతర యోగ్యలీల**
**వల్కలాజినవసన యై వదల కధిక భక్తి భర్తృశుశ్రూషణపరత నుండె.**

**ఆ మెలతి సేయు సవినయ సామకథల మృదుగభీర సంభావనలన్**
**మామయు నత్తయు సంతోషామృతమున దేలి రంతరంగముల దగన్.**

సావిత్రియు దనమగని యాయుఃప్రమాణంబు నారదముని చెప్పిన దినంబు మొదలుగా ననుదినంబును లెక్కయిడికొను చుండె నిట్లు వర్తిల్లుచుండ నాలుగు దివసంబులు గొఱంతగా నొక్క సంవత్సరము గడచిన

**నాలవ దినంబు పతిమృతి కాలంబని మది నెఱింగి కడు నిష్ఠమెయిం**
**జాల భరంబుగ బూనెను బాల త్రిరాత్రోపవాస పరమ వ్రతమున్.**

దానికి విస్మయంబంది ద్యుమత్సేనుండు గోడలిం బిలిచి తల్లీ యిట్లేల దుస్తరంబగు వ్రతంబు దొడంగితి వనిన నమ్మద్రరాజతనయ వినయంబుతో నిట్లనియె

**మీరు మదీయంబగువ్రత భారమునకు వగవవలదు వరమ శుభంబుల్**
**గోరి యొనరింపబూనితి గారణమును మీ కెఱుంగగా నగు మీదన్.**

అనిన నతం డట్లేని మేలగుగాక యనియె నంత జతుర్థ దివసంబున

**కడు రేవకడయ మేల్కని నిజభర్తకు**
**మరణ దినంబని మానసమున**
**దద్దయు శోకసంతాపంబు గదురంగ**
**దినముఖోచిత విధుల్ దీర్చి భక్తి**

బతికి సముంచిత పావన పరిచర్య
యప్పుడు కడు వేడ్కనాచరించి
యత్తకు మామకు నచటి విప్రులకును
వేర్వేఱ ప్రణమిల్లి వేడ్కవారు

దనకు సౌభాగ్య భాగ్యవర్ధనముగాగ
నిచ్చు దీవన మదిలో గ్రహించియున్న
బ్రొద్దు జామెక్కుటయు బూవుబోడి బిలిచి
మామ యిట్లని పలికె సమ్మాన మెసగ

కడు నుగ్రంబగు వ్రతమిది దొడగితి దివసత్రయంబుతో నది సెల్లెం
బడతీ యెంతయు డస్సితి దడయక పారణ యొనర్పదగదే యింకన్.

అనిన సావిత్రి యతని కిట్లనియె

అధిప ప్రొద్దుగ్రుంకు నంతకు నేడును
గుడవ దగదు నాకు గోరి యిట్లు
గాగ వ్రతము బూనుకాలంబునన మున్ను
నిశ్చయించుకొనిన నియమ విధియు.

అనియె నప్పుడు సత్యవంతుడు సమిత్కుశ ఫలాహరణార్థంబు వనంబునకుం గదలినం జూచి సావిత్రి యతని జేరంజని వనంబున కేనును నీ తోడ జనుదెంతు ధోడ్కొని బోవలయుననిన నతండు నీవు త్రిరాత్రోపవాసంబునం జేసి యెంతయు డస్సిన దానవు రానోపవనిన నిది వాని కిట్లనియె

ఉపవాసశ్రమ మిప్పు డించుకయు నాయుల్లంబునం దోప దీ
విపినం బుజ్జ్వల పుష్ప పల్లవ ఫలావిర్భూతి నానాలతా
ప్రవరీతంబన విందు జూడగ మదిం గౌతూహలం బయ్యె న
న్నువరోధింపకు మింత పట్టు చననీ యుక్తుండ వెబ్బంగులన్.

అనిన నతండట్లకాక చనుదెమ్మనుటయు సావిత్రి చయ్యనం జని భార్యాసహితుండయి యున్న తన మామకుం బ్రణమిల్లి మీ కొడుకు వనంబునకు

నగ్నిహోత్రార్థంబై సమిధలు దేర నరిగెడు నాకును నతని తోడన చని వనంబు చూడ వేడ్కయైనది మీరు నాకివ్వరంబు గృపసేయవలయుననిన నాతండిమ్మగువ యెన్నండును నెయ్యదియును నడుగదిత్తెఱంగు దీనికింబ్రియంబై యున్నది. నాకు నివారింప నేల యని తలంచి యనుమతించిన నయ్యిరువుర యడుగు లంబడి వీడ్కొని

## సత్యవంతుడు సావిత్రీ సహితుండై వనంబునకు బోవుట

**చిత్తంబున బైకొనియెడు నత్తలమడచుచును ముఖపయోరుహమున ద**
**ళ్కొత్తెడు వెడనవ్వున బ్రియు చిత్తంబిగురొత్త జనియె జెలువ యడవికిన్.**

ఇట్లాదంపతులు మందగమనంబున నరిగి పరిసరారణ్యంబు దఱియం జొచ్చిరప్పుడు

కమనీయ కమలినీ కల్లోల వీధుల
గదలు రాయంచల గతుల యొప్పు
బహుపుష్పవల్లవ ప్రకర చిత్రితములై
తనరారు తరులతా తతుల సొంపు
మకరంద రసపాన మదవిలోలంబులై
క్రాలెడి యెలదేటిగముల యులివు
బరిపక్వమంజుల ఫలరసోద్ధతములై
వలుకు రాచిలుకల వటురవంబు

బ్రియుడు వేఱు వేఱ బ్రీతిమై జూపుచు
జెప్పుచును జనంగ జిగురుబోడి
గనుచు వినుచు నిర్వికారసల్లావ మిం
పార నతని తెఱగు నరయుచుండె.

తదనంతరంబ యా రాజర్షి నందనుండు మధురంబులగు ఫలంబులు గోయుచు గరిడియు నిండించి యొక్క యెడ బరశుపాతంబునంజేసి కాష్ఠదళనంబు చేయందొడంగి శ్రమపడి యొల్లంబోయి గొడ్డలి పుడమిపయి వైచి

నిరంతర నిశ్వాస వేగ వివర్ణవదనుం డగుచు సావిత్రిం గనుంగొని

ఒడలు వశంబుగాదు భ్రమ నొందిన యట్లు మనంబు దూలెడిం
గడగి శిరంబు శూలవిశిఖ ప్రకరంబున నొంచినట్టి ద
య్యెడు నిలువంగ నోర్వనొక యించుకసేపు శ్రమంబుదీఱ నీ
యెడ శయనింతు నావుడు సితేక్షణ మెత్తని సంభ్రమంబుతోన్.

తన యంకతలమ ప్రియుశిర
మున కుపధానముగ జేయ భూపతనయుడో
య్యన వ్రాలి సోలి నిశ్చే
తనుడై నట్లుండె గొంత తడవున కెదురన్ !

కనియెం గోమల నీల మేఘవిలసత్కాలాంజనాకారు ఘో
రనిశాతోత్కటదంష్ట్ర నుజ్జ్వలచలద్రక్తాక్షు బ్రత్యగ్రకాం
చన వర్ణాంబరు నంత్యకాల దహన జ్వాలా ప్రచండున్ జగ
జ్జన సంత్రాసను నొక్క దివ్య బటుపాశప్రౌఢహస్తోద్ధతున్.

అప్పురుషుండును నధిక సంరంభంబున సత్యవంతుం గదిసిన నయ్యింతి యెంతయు భయంబునం బ్రియుని శిరంబొయ్యన దిగువంజేర్చి నిల్చి కృతాంజలియై అయ్యా! మీ రెవ్వరియ్యెడకు నెయ్యది చేయందలంచి విజయంబు చేసితి రనిన నతండిట్లనియె

కాలుండ జావ్వే యే గమలాక్షి నను నీవు
మహిత పాతివ్రత్య మహిమ జేసి
కానంగ జాలితి కానరా నన్యుల
కిదె నీదు భర్తకు నిపుడు కాల
మగుటయు నీడు మహాపుణ్యనిధి గాన
యితరులం బనువక యేన నీని
గ్రచ్చుఱ గొనిపోవగా జనుదెంచితి
నని యుగ్ర భంగి నయ్యంతకుండు

ధరణినాథ తనయు తనువున బ్రాదేశ
పరిమితాత్ముడగుచు బ్రజ్వరిల్లు
జీవువెడల దిగిచి చెచ్చెర నతిదీర్ఘ
భయదపాశనికరబద్దుజేసి.

కొని వేగంబున దక్షిణాభిముఖుడై ఘోరంపు మార్గంబునం
జనగా జొచ్చె ననంతరంబ మదిలో సావిత్రి శోకంబు పై
కొన బ్రాణేశ్వరు దేహ మొక్కయెడ నంగుప్తంబు గావించి యా
తనివజ్జం దగ దాను నేగె బద పద్మంబుల్ పడిం దొట్రిలన్.

దాని జూచి కరుణ ధర్ముండు నీ వేల వచ్చెదవు లతాంగి వలదు నిలువు
మింతి నీకగమ్య మిటమీది తెరువెల్ల ననిన నతని కిట్లులనియె బొలతి.

పతులెందు జనిన నచటికి నతులకు జనవలదె నీ ప్రసాదమునను మ
త్పతిభక్తి కతమునను సంస్తుత గుణ నాకరుగరాని చోటులు గలవే.

సకల మార్గంబులందును ధర్మ మార్గంబు ప్రధానం బట్టి ధర్మంబునకు నాధారంబు సజ్జనుల యని వినంబడు నట్టి సజ్జన సందర్శనం బెప్పుడు వృధ గాదు గావున సజ్జనశేఖరుండ వనంజను నీదైన సందర్శనంబునం బరమ శుభంబుల బొందక యేను రిక్తజనంబుల తెఱంగున నూరక యెట్లు మగుడుదు ననిన దాని ప్రగల్భవచనంబులకు నద్భుతం బంది ధర్ముం డిట్లనియె

తనులతాంగి భవదుదార వాగ్భంగికి మెచ్చు వచ్చెనాత్మ నిచ్చువాడ
వేడు మొక్క వరము విభుని జీవిత మొక్కటియును దప్ప నేది యయిన నొండు

## సావిత్రి యముని వలన నభీష్ట వరంబులు వడయుట

అనవుడు మద్రరాజసుత ప్రాంజలియై సమవర్తితోడ ని
ట్లను రిపుకోటిచే నపజయంబును బొంది వనాంతరంబునం
దనవరతవ్రతాభిరతుడైన మహాత్ముడు సాళ్వభూవిభుం
డనఘుడు లబ్ధచక్షుడగు నట్టులుగా గరుణింపవే దయన్.

నాపుడు నట్టుల నయ్యేడు నీవిట రావలదు మగుడు నెమ్మినని వెసం
బోవ దొడంగెను బిత్పపతి యా వెలదియు నంత నిలువ కరిగె బిఱుందన్.

ఇట్లు చనిచని మఱియు నిట్లనియె

ఎడపక వాఙ్మనఃక్రియల నేరికి నెగ్గొనరింపబూన రె
య్యెడలను దీనులం గరుణ యేర్పడ బ్రోవగ జాతురిచ్చుచో
గడమ వడంగ నీ కెదిరి కాంక్షితముల్ దుదిముట్ట దీర్తు రె
క్కుడు మది గూర్తు రాశ్రితులకున్ వినుమిన్నియు నార్యధర్మముల్.

నీ వెఱుగని యది యెయ్యది దేవోత్తమ! ధర్మగతుల తెఱగెల్ల భవ
ద్భావాధీన మగుటగాదే వెలసితి వీవు ధర్మదేవత యనగాన్.

సమబుద్ధితోడ దత్త త్సముచిత కర్మఫల మఖిల జంతు తతులకున్
సమకూర్చుట నీ కయ్యెను సమవర్తి యనంగ బేరు జగదభినుతమై.

యముడంద్రు నిన్ను నార్యులు
యమింతు భూతముల నెల్ల నట్లగుట దగున్
శమనుండ వైతి కల్మష
శమనంబున జేసి నీవు జలజాప్తసుతా!

అనినం బ్రేతిపతి యా పుణ్యసతి కిట్లనియె

తృషితు డగు వాని బరిలఘు తుషార తోయములు మోదితుని జేయుగతిన్
హృషితాంగు జేసె నను గల్మషహరణములైన నీ సమంజస ఫణితుల్.

కావున సత్యవంతు ప్రాణంబులు దక్కందక్కినకోర్కి యెయ్యదియైనం జెప్పుము సఫలంబు సేసెద ననిన సావిత్రి, దేవా! వైరులచేత నపహృతంబైన రాజ్యం బెప్పటియట్ల ద్యుమత్సేనునకు ప్రాప్తించునట్లుగా ననుగ్రహింపవే యని వేడుటయు వైవస్వతుండట్ల యగు నని పలికి యిట్లనియె

వలదు నిలువు మింక వదలక నీభక్తి మగని కెక్కెదుర్గమంపు ద్రోవ
యిది కృతంబు లయ్యె నెల్లయు నీ విట వచ్చు సెలవు లేదు వనజనయన!

అనిన నమ్మహాభాగ యితని కిట్లనియె

ధర్మాత్ములు దమ సలిపెడు ధర్మక్రియ దప్పరెట్టి దశలందును మో
హోర్మియు దాపము బుట్టవు ధార్మిక హృదయముల బ్రథమ ధర్మాధ్యక్షా!

కావున బతియనుగమనం, బేవిధమున విడువ దగునె యెట్లయినను మో
హావేశము బొందక ధర్మావస్థితి నలువ వలదె యవహిత బుద్ధిన్ !

అనిన నంతకు డిట్లను నతివ నీవు
ప్రకట ధర్మవిశేషతత్పరవుగాన
యింకనొక వరమిత్తు బ్రాణేశు బ్రతుకు
వలదు గాని యొండడుగుము వలయు దాని,

అనుటయు నక్కాంత గృతాంజలియై మాతండ్రి మద్రేశ్వరుం డపుత్రకుం డతనికి బుత్ర శత లాభంబగునట్లుగా బ్రసాదింపుమని యభ్యర్థించిన నట్ల కానిచ్చితని పల్కి ధర్మరాజు నేడు నీవు గడు దూరంబు వచ్చి డస్సితింక మగుడుట లెస్సయని పలికిన నప్పతివ్రత యిట్లనియె

నాకు దప్పి యెక్కడిది మనంబు భర్తృ
చరణ పంకజాసక్తమై కరము భక్తి,
నలరుచున్నది సతులకు నన్యమెట్టి
దియును ధర్మమె భర్తృసంశ్రయము కాక,

మఱియు నొక్క విన్నపంబు సేసెద

ఆత్మ ధర్మనిరతులైన పుణ్యాత్ములు
దుర్లభులు సమస్త దురితములును,
శాంతిబొందు వారి సంసర్గమున దీర్ఘ
పూతమతులు వారు భూతలమున.

వారల పేర్మి గాదె శశివారిజమిత్త్రులు నిర్వికార సం
చారత మల్లసిల్లెదరు సర్వపయోనిధులున్ నిరాకులా

కారత గ్రాలెడుం గులనగంబులు నిశ్చలరూఢి జాల నొ
ప్పారెడు భూత ధాత్రి నిఖిలైక ధురీణత బేర్మి బొందెడున్.

అని పలికి మఱియు నిట్లనియె

ఏడు మాటలాడిన యంత నెట్టివారు నార్యజనులకు జాట్టంబు లగుదురనిన
జిరనమాలాపనంసిద్ధి జేసి నీకు నేను జాట్టమనని వేఱ యేల చెప్ప.

కావున మిత్రమనోరథం బవశ్య కర్తవ్యంబుగా జిత్తగింపుమనిన నమ్మహానుభావు డబ్బామిని దెసం గనుంగొని నీకుంబ్రసన్నుండనైతి నభీష్టంబైన వరంబొక్కటి యిచ్చెద వేడు మనిన నమ్మానిని యిట్లనియె

మది సత్యవంతు జీవిత మది యిమ్ముగ దొలగ బెట్టి యన్యంబుల ని
చ్చెదనని పలుకుదు మును నీ వది యిప్పుడు లేద యింక నడిగెద బ్రీతిన్.

పతి రహితంబు దుస్సహము భర్తృవినాకృతియైన కాంత దూ
షిత యగు సర్వమంగళ విశేషములందును గాక మత్ప్రియుం
డతులిత కీర్తిశాలి సుగుణాఢ్యుడు సాళ్వసుతుండు లబ్ధజీ
వితుడుగ నిమ్ము ధర్మపదవీ పరిరక్షణ! పుణ్యవీక్షణా!

అనిన నట్ల చేయుదునని యా క్షణంబ కృతాంతుండు సత్యవంతు నపగత పాశుంజేసి యా సుందరి కిట్లనియె

కొనుమిదె నీ మనఃప్రియుని గోమలి వీడు చతుశ్శతాబ్దముల్
మను నిటమీద బుత్త్రుల గ్రమంబున మార్వరగాంచు గీర్తివ
ర్ధను డగు సంతతాధ్వరవిధానములం బరితుష్టి సేయు న
య్యనిమిషకోటి కెల్లను నిజాన్వయమౌళివిభూషణుండగున్.

అని యాదేశించి యాతండంతర్హితుండయ్యె నక్కాంతయు గ్రమ్మఱి చని యెప్పటి యట్ల జీవితేశ్వరుం దన తొడలపై నిడికొని కూర్చున్న యెడ గొండొక వడికి లబ్ధచేతనుండై సత్యవంతుండు దెలిసి నిజవల్లభం జూచి యిట్లనియె.

కడు దడవు నిద్ర వోయితి బడతీ నను దెలుప వలదు బలియు డొకరు డె
క్కుడు జవమున బట్టి బలం బెడలగ ననుదిగిచె నాత డెవ్వడు సెపుమా.

అది కలగాదు నిక్కువము యైనటులున్నది నాకు నెంతయున్
మది వెఱ వుట్టె నావుడును మానిని యిట్లను నీకు నంతయున్
ముదమున రేవు సెప్పెద దమోమయమై యిదె శర్వరీ ముఖం
బొదవె విలంబనం బిచట నొప్పదు లెమ్ము నరేంద్రనందనా! *

మనుస్మృతి యందు నార్యుల కాలములో స్త్రీలు ఎంత పూజ్యత గలవారై యుండిరో చెప్పబడినది చూడుడు

యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః ।
యత్రైతాస్తు న పూజ్యన్తే సర్వాస్తత్రాఫలాః క్రియాః ॥

ఏ కుటుంబమునందు నారీమణులు పూజింప బడుచుందురో యా కుటుంబమును జూచి దేవతలు సంతుష్టి గలవారై యుందురు ఏ యింటిలో

---

*ఈ చరిత్రలో సామాన్య జనులకు గలిగి యుండు యొక్క కుశంక నివృత్తి గాగలదు అదేమన స్త్రీలు చేయుచుండు దైవకార్యములచే గలిగెడు ఫలితము భర్తలకు చెందదనియు, నది భార్యలకు మ ఏ ఫలమిచ్చుననియు జెప్పుచుందురు ఇందువలన గాబోలు స్త్రీలు బ్రహ్మ నిష్ఠాది దైవకార్యము లాచరించుటకు పురుషులు సహింపకున్నారు పురుషులు జేసిన పుణ్యములో నొక భాగము భార్యలకు లభించుననియు నందువలన భర్తలు చేయు దైవ కార్యములలో భార్యలు పాల్గొన్న చాలుననియు, నిర్బంధింతురు ఓహో, ఎంత యంధ విశ్వాసము! చేయువారికిని, చేయించెడి వారికిని, ప్రేరేపించెడి వారికిని, చూచి సంతోషించు వారికిని కర్మఫలము సమానముగ గలుగునని చెప్పెడు శాస్త్ర వాక్యములను వీరు వినుట లేదే ఇట్టి సందేహము ఈ సావిత్రీ చరిత్రముచే తొలగి పోవును సావిత్రియనియు, గాయత్రియనియు, సరస్వతి యనియు చెప్పెడు ఈ మూడు పేర్లును నొకటియే ఈమెకు తపశ్శక్తి వల్లనే యమధర్మరాజును చూచు భాగ్యము గలిగినది దీనికే దివ్యదృష్టి యని పేరు ఈ బాలిక తన తపస్సు చేత భర్తృప్రాణములను సంరక్షించుటయే గాక మామకు నేత్రములు గలుగుటయు, కోల్పోయిన రాజ్యము లభించుటయు, తండ్రికి సంతాన ప్రాప్తియు వీటినినన్నిటిని సిద్ధింపజేసినది కనుకనే సాధ్వీమణులకు వ్రతములు, దైవచింతనలు లేకపోయినవో యప్పటి నుండియే వారి గర్భములో జన్మించెడు బిడ్డలు గూడ జ్ఞానహీనులై పోవుటకు ప్రారంభించిరి కుంతీదేవి తపస్సంపన్నుడగు దుర్వాసమహర్షి సేవచేతనే గదా లోకోద్ధారకులగు ధర్మరాజ భీమార్జుననకుల సహదేవులను పుత్రులను గనినది ఈలాంటి చరిత్రము లెన్నియో గలవు

స్త్రీలు దుఃఖితలై తపింతురో యా గృహస్థుడు చేసెడు సమస్త క్రియలు నిష్ఫలములగును

ఈలాగున చూచిన దైవభక్తి గలిగి సత్త్వగుణములతో ప్రసన్న చిత్తలగు స్త్రీలు చాల యరుదుగనున్నారు. గదా! కనుకనే సంసారము దుఃఖసాగరమైనది సత్త్వగుణము గలిగి దైవభక్తి గల స్త్రీలలో నీ క్రింద నిరూపించేలాగున సంతానము గలుగును

**రూపసత్త్వగుణోపేతా ధనవంతో యశస్వినః ।**
**పర్యాప్తభోగా ధర్మిష్ఠా జీవంతి చ శతం సమాః ॥**

మంచి రూపము, మంచి బలము, సంపూర్ణ గుణసంపదలతో గూడిన వారలై ధనవంతులై, పేరెన్నిక గలిగి, నిండు భోగంబులు గలిగిన వారైన పుత్రులు పుట్టుదురు మఱియు వారు నూరేండ్లు ఆయుస్సు గలవారై యుందురు అట్లుగానిచో కుయుక్తులు గలవారు, కురూపులు, అల్పాయుస్సు గలవారు, దైవద్వేషులు, మాతా పితృ ద్రోహులు, దుష్టులు, దుర్గుణ భూయిష్ఠులు, సాధునిందకులు, ధర్మ ఘాతకులు మొదలగువారే గలుగుదురు నారీమణుల యొక్క పవిత్రతను గుఱించి శ్రీ కృష్ణభగవానులు విభూతి యోగమున నుపదేశించిన దానిని చూడుడు

**కీర్తిః శ్రీర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా ।**

స్త్రీలలో గల లక్ష్మియు, కీర్తియు, మంచి వాక్కును, జ్ఞాపకశక్తియు, పరిశుద్ధ బుద్ధియు, ధర్మకార్యములందు ధీరతయు, ఓర్మియు నేనై యున్నాను ఈ గుణము లన్నియు నేస్త్రీలలో గాన్పించునో యట్టి నారీమణులు లక్ష్మీదేవితో సమానలగుదురు అవి యన్నియు భగవదంశములని భగవాను డుపదేశించెను



# అష్టవిధ వివాహములు

## (మనుస్మృతి)

బ్రాహ్మో దైవస్తథైవార్షః ప్రాజాపత్యస్తథాఽఽసురః ।
గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽధమః ॥

(1) బ్రాహ్మము, (2) దైవము, (3) ఆర్షము, (4) ప్రాజాపత్యము, (5) ఆసురము, (6) గాంధర్వము (7) రాక్షసము, (8) పైశాచము అని వివాహము లెనిమిది తెఱంగులు అందష్టమమగు పైశాచ మధమము

యో యస్య ధర్మ్యో వర్ణస్య గుణదోషౌ చ యస్య యౌ ।
తద్వః సర్వం ప్రవక్ష్యామి ప్రసవే చ గుణాగుణాన్ ॥

ఏ వర్ణము వారికేది శాస్త్రీయమైనదో, ఎవరికి ఏ వివాహమున కేవి గుణదోషములో, ఆ వివాహమువలన బుట్టిన సంతతకి గల గుణాగుణము లెవ్వియో వానినన్నింటిని మీ కెఱింగించెదను *

పంచానాం తు త్రయో ధర్మ్యా ద్వావధర్మ్యౌ స్మృతావిహ ।
పైశాచశ్చాసురశ్చైవ న కర్తవ్యౌ కదాచన ॥

ప్రాజాపత్యము మొదలు ఆసురము వఱకు గల అయిదు వివాహములలో

---

*ఈ వివాహ విషయములలో కేవలము వర్ణములను గూర్చి నిర్ణయించడమైనది ఒక వేళ వర్ణమును నిర్ణయించినను వివాహము మాత్రము అందరికన్న శుద్ధమైనది యేల చేయకూడదు? ఈ అష్ట విధ వివాహములలో 1 బ్రాహ్మము, 2 దైవము, 3 ఆర్షము, 4 ప్రాజాపత్యము ఇవి నాల్గును ప్రశస్తములు వీనిలో ఆర్షమందు వరునుండి ఒక ఆవు, ఒక ఎద్దును పుచ్చుకొనేలాగున గలదు అది వరశుల్క మగుటచే దీనియందే నిషేధింపబడినది తక్కిన మూడును సర్వజనులకును శ్రేయోదాయకములు గాంధర్వ వివాహమొకటి క్షత్రియునకు విధి గలదు కాని విషయ వాంఛతో చేయున దగుటచేత అదియు నిందితమని దీనిలో నిరూపించడమైనది ముఖ్యముగా నా కాలమున క్షత్రియ రాజులు రాజ్యమును పాలించు వారగుటచే ఈ గాంధర్వము ఏ మాత్రము వారికి తగదు ఏలన రాజుయొక్క వర్తన ననుసరించియే ప్రజలు కూడా ప్రవర్తింతురు కావున ఈ గాంధర్వ వివాహము విషయోద్రేక బుద్ధితో చేయున దగుటచే నిందితము తక్కిన ఆసురము, రాక్షసము, పైశాచము సర్వజనులకును నిందితములు

బ్రాహ్మ దైవ ప్రాజాపత్యములు మూడును ధర్మశాస్త్ర సమ్మతములు. తక్కిన రెండును శాస్త్ర సమ్మతములు గావు ఆసుర పైశాచములు ఎవరికిని ఒకప్పుడున్ను కూడవు (బ్రాహ్మ దైవ ఆర్ష ప్రాజాపత్య ఆసురములు అను అయిదింటిలో ఆర్షమును, అసురమును మంచివి గావు. బ్రాహ్మ, దైవ, ప్రాజాపత్యములు మూడును మంచివి, (శ్రేయోదాయకములు ) అందఱికిని దెలియుట కొఱకు ఆ అష్ట విధ వివాహముల లక్షణములు క్రింద వివరింపబడుచున్నవి

## 1. బ్రాహ్మము

ఆచ్ఛాద్య చార్చయిత్వా చ శ్రుతిశీలవతే స్వయమ్ ।
ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః! ॥

వేదాధ్యయనము జేసి యాచారవంతుడయిన యొక బ్రహ్మచారిని తానుగా రప్పించి యతనికి గట్టబెట్టి, మర్యాదలు సలిపి అలంకృత కన్య నొసగుట బ్రాహ్మ వివాహ మనబడును

## 2. దైవము

యజ్ఞే తు వితతే సమ్యగృత్విజే కర్మ కుర్వతే ।
అలంకృత్య సుతాదానం దైవం ధర్మ్యం ప్రచక్షతే ॥

జ్యోతిష్టోమము మొదలగు యజ్ఞములందు ఆధ్వర్యవము చేయునట్టి ఋత్విజునకు సాలంకృతముగా కన్యనొసగుట దైవ వివాహ మనబడును.

## 3. ఆర్షము

ఏకం గోమిధునం ద్వే వా వరాదాదాయ ధర్మతః ।
కన్యాప్రదానం విధివదార్షో ధర్మస్స ఉచ్యతే ॥

యాగాదిసిద్ధి కొఱకుగాని, కన్యనొసగుటకు గాని, ఒక గోమిధునమునో, లేక రెండు గో మిధునములనో వరుని కడనుండి కైకొని శాస్త్ర ప్రకారము, వరునికి గన్య నొసగుట యార్షవివాహ మనబడును.

## 4. ప్రాజాపత్యము

సహోభౌ చరతాం ధర్మమితి వాచానుభాష్య చ ।
కన్యాప్రదానమభ్యర్చ్య ప్రాజాపత్యో విధిః స్మృతః ॥

మీరిరువురు గలిసి ధర్మమాచరింపుడని జెప్పి తల్లి దండ్రులు వరుని పూజించి పిల్లనిచ్చుట ప్రాజాపత్య వివాహ మనబడును

## 5. ఆసురము

జ్ఞాతిభ్యో ద్రవిణం దత్వా కన్యాయై చైవ శక్తితః ।
కన్యాప్రదానం స్వాచ్ఛంద్యాదాసురో ధర్మ ఉచ్యతే ॥

జ్ఞాతులకును పిల్లకును వలసిన ధనమును నొసగి తమ యిష్టంబున పెండ్లి చేసికొనుట యాసుర వివాహ మనబడును

## 6. గాంధర్వము

ఇచ్ఛయాన్యోన్యసంయోగః కన్యాయాశ్చ వరస్య చ ।
గాంధర్వస్స తు విజ్ఞేయో మైధున్యః కామసంభవః ॥

స్త్రీపురుషులొండురు లపేక్షచే సమ్మతించి కలియుట గాంధర్వ మనంబడును ఇయ్యది కామ సంభవమైనదియు మైధున కర్మ కేర్పడినదియునై యున్నది

## 7. రాక్షసము

హత్వా ఛిత్వా చ భిత్వా చ క్రోశంతీం రుదతీం గృహాత్ ।
ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధిరుచ్యతే ॥

కన్యక బంధువులు సమ్మతింపనప్పుడు వారిని చంపి కాని, నఱికికాని, చీల్చి గాని బంధు నాశనమునకై వగచుచున్న కన్యను బలవంతముగా దెచ్చుట రాక్షస వివాహ మనబడును

## 8. పైశాచము

సుప్తాం మత్తాం ప్రమత్తాం వా రహో యత్రోపగచ్ఛతి ।
స పాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమోఽధమః ॥

నిద్రించుదానిని గాని, కైపుతోనున్న దానిని గాని, ఏమఱుపాటున నున్న దానినిగాని బలాత్కారమున, నేకాంతమున గ్రీడించుట పైశాచమనబడును ఈయెనిమిదవ వివాహము మిక్కిలి అధమమైనది

యో యస్యైషాం వివాహానాం మనునా కీర్తితో గుణః ।
సర్వం శృణుత తం విప్రాః సర్వం కీర్తయతో మమ ॥

ఓ ద్విజోత్తములారా! ఏయే వివాహమునకు నేది యేది గుణమో, ఆ గుణమును, మనువు చెప్పిన దెఱుగున తెలిపెద నాలకింపుడు

దశ పూర్వాన్ వరాన్ వంశానాత్మానం చైకవింశకమ్ ।
బ్రాహ్మీపుత్రస్సుకృతకృన్మోచయేదేనసః పితౄన్ ॥

బ్రాహ్మ వివాహముచే జనించిన పుత్రుడు పుణ్యము జేసిన వాడు అతడు తన ముందటి పదితరముల వారిని, తన వెనుకటి పదితరములవారిని, తనను, మొత్తమున కిరువదియొక్క తరముల పితృదేవతలను పాపములనుండి తరింపజేయును (వాని పితరులను పాపమునుండి తరింపజేయును) అతని పుత్రాదులు గూడ నతని కులమున పాపరహితులై జన్మింతురు. *

---

*గృహస్థ బ్రహ్మచర్య పాలనతో సహా ఈ బ్రాహ్మాదులగు నాల్గువివాహ ధర్మములు కూడ నుండవలయును వేదమంత్రములతో గూడినదిగాను, బ్రహ్మనిష్ఠుల ఆశీర్వచనములతో కూడినదిగాను, అగ్నిహోత్రముతో గూడినదిగాను, ఉభయ మాతాపితరుల ప్రీతితో గూడినదిగాను, దైవపూజతో కూడినదిగాను, పెద్దల సన్నిధిలో చేయునదిగాను వివాహ ముండవలయును అట్లయిన పైచెప్పిన పవిత్రగుణములన్నియు గల్గియుండును వివాహానంతరము గృహస్థ బ్రహ్మచర్య మనుష్ఠించి గర్భము ధరించినప్పటి నుండి ప్రసవించువరకు గల దోష నివారణ క్రియలు చేయుచు వేదములలో చెప్పినట్లు దివ్యౌషధిని సేవించుచు సంతానోత్పత్తి కాలము నుండి బిడ్డలను పవిత్ర మార్గ ప్రవర్తకులుగా చేయుచుండవలయును

దైవోఢాజస్సుత శ్చైవ సప్తసప్త పరావరాన్ ।
ఆర్షోఢాజస్సుత స్త్రీం స్త్రీన్ షట్ షట్ కాయోఢజస్సుతః ॥

దైవ వివాహముచే జనించినవాడు ముందేడు, వెనుక నేడు తరములవారిని, ఆర్ష వివాహ జాతుడు ముందు మూడు వెనుక మూడు తరముల వారిని, ప్రాజాపత్య వివాహజాతకుడు ముందాఱుతరముల వారిని వెనుకటి యారుతరముల వారిని తన్నును పితృ ఋణము నుండి విడిపించును

బ్రాహ్మాదిషు వివాహేషు చతుర్ష్వేవానుపూర్వశః ।
బ్రహ్మవర్చస్వినః పుత్రా జాయంతే శిష్టసమ్మతాః ॥

బ్రాహ్మము మొదలగు నాలుగు వివాహములందును జన్మించిన పుత్రులు వేదాధ్యయన సంపత్తి వలన కలిగిన బ్రహ్మవర్చస్సు గలవారై, శ్రేష్ఠులకు ఇష్టులైన వారై జన్మింతురు

రూపసత్త్వగుణోపేతా ధనవంతో యశస్వినః ।
పర్యాప్తభోగా ధర్మిష్ఠా జీవంతి చ శతం సమాః ॥

మఱియు రూపము, బలము, గుణసంపదలను వానితో గూడిన వారలై ధనవంతులై పేరెన్నిక గలిగి, నిండు భోగంబులు గలిగినవారైన పుత్రులు పుట్టుదురు. మఱియు వారు నూరేండ్ల ఆయుస్సు గలవారై యుందురు.

ఇతరేషు తు శిష్టేషు నృశంసానృతవాదినః ।
జాయంతే దుర్వివాహేషు బ్రహ్మధర్మద్విషస్సుతాః ॥

తక్కిన యాసురాది వివాహముల వలన జన్మించిన సుతులు క్రూరులు, అసత్యవాదులు, వేదవిరోధులు, యాగాది ధర్మకార్యద్వేషులునునై యుందురు *

అనిందితైః స్త్రీవివాహైరనింద్యా భవతి ప్రజా ।
నిందితైర్నిందితా నౄణాం తస్మాన్నింద్యాన్ వివర్జయేత్ ॥

---

* ఈ ధర్మసూక్ష్మము తెలిసిన ఇపుడు కొందఱు చేయుచుండు దుష్టవివాహముల ఫలమేమగునో తెలిసికొనవచ్చును

అనిందితములైన స్త్రీ వివాహములచేత నింద్యము గానట్టి సంతతి కలుగును నిందితములైన స్త్రీ వివాహములచేత నింద్యమైన సంతతియే కల్గును

**ఋతుకాలాభిగామీ స్యాత్స్వదారనిరతస్సదా ।**
**సర్వవర్జం వ్రజేచ్చైనాం తద్వ్రతో రతికామ్యయా ॥**

భార్యను సంతోష పెట్టుటయే వ్రతముగా నెంచి అన్యస్త్రీల గోరక వర్వదినముల బాసి ఋతుకాలమునందు నిషిద్ధ దినములు వదలి సత్సంతానోత్పత్తి కోరికతో భార్యను గూడవలయును

**న కన్యాయాః పితా విద్వాన్ గృహ్ణీయాచ్ఛుల్కమణ్వపి ।**
**గృహ్ణాఞ్ఛుల్కం హి లోభేన స్యాన్నరోఽపత్యవిక్రయీ ॥**

వివేకయగు కన్యతండ్రి వరుని కడనుండి యించు కేనియు ఓలి గైకొనరాదు లోభముచే నట్లుతడు గైకొనెనా, వాడు బిడ్డనమ్ముకొన్నవాడే యగును.

**స్త్రీధనాని తు యే మోహాదుపజీవంతి బాంధవాః ।**
**నారీయానాని వస్త్రం వా తే పాపా యాంత్యధోగతిమ్ ॥**

తండ్రియో లేక చుట్టములో కన్యకకు వివాహకాలమున నొసగిన ధనమును వాహనములను వస్త్రములను తా ముపయోగించుకొందురేని అట్టివారు పాపము నొనర్చిన వారై యధోగతి పాలగుదురు.

**ఆర్షే గోమిథునం శుల్కం కేచిదాహుర్మృషైవ తత్ ।**
**అల్పోఽప్యేవం మహాన్వాపి విక్రయస్తావదేవ హి ॥**

ఆర్ష వివాహమునందు గోమిథునము (ఒక ఎద్దు ఒక యావు) ఓలి గైకొనవచ్చునని కొందరనిరి. కాని యది కల్లయే యగును. ఓలి కొలదిగా పుచ్చుకొన్నను నది విక్రయతుల్యయే యగును *

---

* ఈ ఆర్ష వివాహముగూడా మంచిది కాదు బ్రాహ్మం, దైవం, ప్రాజాపత్యం ఈ మూడును మాత్రమే శ్రేష్ఠములు,వీరికి గల్గిన సంతానములే ధర్మబుద్ధి గలవారలై, మాతా పితరులయందు భక్తి గలవారలై, వేదములోను, దైవమందును, సాధువులయందును విశ్వాసము గలవారై జీవ దయాపరులై

యాసాం నాదదతే శుల్కం జ్ఞాతయో న స విక్రయః ।
అర్హణం తత్కుమారీణామానృశంస్యం చ కేవలమ్ ॥

ఏస్త్రీకి వివాహకాలమున బంధువులు సుంకము (ఓలి) గైకొనరో అది విక్రయము గానేరదు అది వివాహమున కన్యలకు ప్రీతితో నొసగిన ధనము కాన దానిని వారి నిమిత్తమే యుపయోగ పరచవలయును

యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః ।
యత్రైతాస్తు న పూజ్యన్తే సర్వాస్తత్రాఫలాః క్రియాః ॥

ఏ కులమున నతివలు (స్త్రీలు ) గౌరవింపబడుదురో ఆకులము వారిపై దేవతలు దయ గల్గియుందురు ఏ కులమున వీరికి గౌరవములు లేవో ఆ కులము వారు చేయు ధర్మ కార్యము లన్నియు నిష్ఫలములు

జాయాశ్చ యత్ర శోచంతి వినశ్యత్యాశు తత్కులమ్ ।
న శోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా ॥

ఏ కులమున స్త్రీలు పరితపించుచుందురో ఆకులము శీఘ్రముగా నశించును ఏ కులమున స్త్రీలు సంతోషము గల్గి యుందురో ఆ కులము సర్వదా వృద్ధినొందుచుండును *

సంతుష్టో భార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ ।
తస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్ ॥

ఏ కులంబున భార్యచే భర్తయు, భర్తచే భార్యయు సంతసము కల్గి

---

యుందురు ఇది చూచిన ఇప్పుడు జరుగుచుండు కన్యాశుల్కము, వరశుల్కము ఎట్టి అధర్మముతో కూడినవో ఆలోచించుకొనవచ్చును

* ఈ ఆర్ష ధర్మమును జాచిన అట్టి వేదకాలములో నుండు స్త్రీలు ఎంత గౌరవము గలవారై యుండిరో తెలిసికొనవచ్చును కావుననే అట్టి గర్భములో జన్మించిన సంతతి వారు ధీర, ఉదాత్తులైనారు అయితే స్త్రీలు తమ గౌరవమును సంరక్షించక నీచ బుద్ధి గలవారై ప్రవర్తించిన ఇంటిలో నుండే వారివల్ల కలిగెడు దు ఖమునకు వారే కారకులని గూడా మరువకూడదు

యుందురో ఆ కులంబున సంపద యెల్లప్పుడు స్థిరముగా తాండవ మాడుచుండును

**కువివాహైః క్రియాలోపై ర్వేదానధ్యయనేన చ ।**
**కులాన్య కులతాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ ॥**

నిషిద్ధ వివాహములచేతను, దైవసంబంధ క్రియలు లేమి చేతను, వేదముల నధ్యయనము చేయమి చేతను, బ్రహ్మనిష్ఠుల గౌరవింపమి చేతను సత్కులంబెల్ల హీనస్థితి నొందును

తక్కిన విషయములు పతివ్రతా ధర్మము చెప్పిన స్థలమున చూడందగును అయితే ఈ యుత్తమ సంతతిని కలుగజేయు విషయమై ఒక ప్రశ్న రావచ్చును అదేమన మీరెన్ని సంస్కారములను జేసినను, ఎన్ని క్రియ లొనర్చినను జీవులయొక్క పూర్వ జన్మకర్మ ననుసరించి గదా! పుట్టుదురు దానిని మార్చుటకెవరికి సాధ్యము?

దీనికి సమాధానము ఇట్టి వేదవిధి ననుసరించి దివ్య సంస్కారముతో నుండు నప్పుడు దానికి తగిన పుణ్యజీవులు, జ్ఞానజీవులు మాత్రమే అట్టి గర్భమున జన్మింతురు ఎట్లన ఒక పరీక్షలో ఒకటి, రెండు, మూడు తరగతులలో నుత్తీర్ణులైన వారికి వారి యుత్తీర్ణతకు తగినట్లుగా ఉద్యోగార్హతను నిర్ణయించునటుల, అట్టివారిని వేరు వేరుగా విభజించునటుల ఈ ధర్మరహస్యము గూడ నుండును పుత్రకామేష్టి యజ్ఞముచే నిటువంటి సంతానము పుట్టునని కలదు గదా! అట్టి క్రియ వల్ల గదా శ్రీ రామ లక్ష్మణాదులు జన్మించిరి ఇదే దీనికి దృష్టాంతము

# పునర్వివాహము

స్త్రీలకు పునర్వివాహమును శాస్త్రమంగీకరించుచున్నదా యని యనేకులు అడుగుచుందురు పురుషులకు పునర్వివాహ మేర్పడుటకు కారణమేమని వారిని అడిగినచో శాస్త్రమాలాగున చెప్పుచున్నదని మాత్రమే సమాధానము లభించును శాస్త్రమాలాగున పక్షపాతముతో తెలుపుటకు హేతువేదై యుండునో

అని అడిగినచో దానికి మౌనము తప్ప వేఱు ప్రత్యుత్తర మేదియు కనిపించదు వేదములలో పునర్వివాహమును గురించిన మంత్రము లనేకములు గలవు వేదము యొక్క వ్యాఖ్యానమనందగు మనుస్మృతియందు నియోగమని యొక పద్ధతి గలదు అయితే అది అంత మంచి పద్ధతి యని తోచుట లేదు కావున ఆ నియోగ విధానమును గుఱించి యిప్పుడేమియు జెప్పంబూనలేదు శాస్త్రములో యావజ్జీవితము బ్రహ్మచర్యవ్రతముతో కాలము గడుపువాడే దుఃఖరహిత శాంతిని పొందగల్గునని తెలుపడమైనది

కావుననే మన మతకర్త లందఱిలో అనేకులు బ్రహ్మచర్య వ్రతమునే సల్పిరి శ్రీశంకరాచార్య, శ్రీమధ్వాచార్య, శ్రీరామానుజాచార్య ప్రభృతులు నైష్ఠిక బ్రహ్మచారులే అయితే రామానుజాచార్యులు మాత్రము వివాహమును జేసికొనినను సంసారములో ఉండలేదు శ్రీబుద్ధదేవులు వివాహితు లయినను త్వరలోనే పరమత్యాగ మవలంబించి సన్న్యాసులైరి శ్రీ ఏసుక్రీస్తు గూడ నైష్ఠిక బ్రహ్మచారియే శ్రీ మహమ్మదునబిగారు వివాహము కలవారైనను త్యాగమూర్తియై సాధువై దైవమతమును బోధించుటలోనే కాలము గడిపిరి వర్తమాన యుగమున శ్రీ దయానందస్వామిగారును అఖండ బ్రహ్మచారి యయ్యే యుండెను శ్రీ కృష్ణచైతన్యులకు బాల్య కాలమున వివాహము జరిగినను వెంటనే పరమత్యాగియై శ్రీకృష్ణపాదారవింద యుగళములం దాసక్త చిత్తము గలవాడై భగవద్భక్తిని ప్రపంచములో బోధించెను

ఈ వల నేర్పడిన శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ నారాయణ గురుస్వామి మొదలగు లోకోద్ధారకులు గూడ పూర్ణ బ్రహ్మచర్య వ్రతమును సల్పినవారే శ్రీ గురునానక్ బుద్ధదేవునివలె వైవాహిక ధర్మము గలవారైనను శీఘ్రముగానే త్యజించి దైవధ్యాన పరాయణులై, దయ, శాంతి ,భక్తి మొదలగు పవిత్ర ధర్మములను జాతి మత భేదము లేక సర్వజనులకు నుపదేశించి జీవులను పవిత్రులనుగా జేసిరి. ఆ గాథలన్నిటిని ఇచట విస్తరింప బూనలేదు నిర్మల జీవిత మేలాటి బంధమును లేక గడప దలంచు స్త్రీగాని, పురుషుడుగాని బ్రహ్మచర్య వ్రతము నవలంబించుటయే మంచిది లేనిచో పరప్రాణులకు మేలు జేయుటకుగాని,

లోకసేవ యొనర్చుటకుగాని, నిశ్చింతగా పరమేశ్వరుని ధ్యానించుటకు గాని జీవితములో సమయము దొరకదు అట్టిది సత్యమని పలుకుచున్నాను

అయితే విధి ప్రకారము బ్రహ్మచర్య వ్రతమును పవిత్రముగా సలుప శక్తి లేని వారు ధర్మబద్ధమగు వివాహమును జేసికొనడమే మంచిది అట్లైనను గృహస్థ బ్రహ్మచర్యమున విధించినటుల ఆచరించిన మాత్రమే సుఖము గల్గును లేనిచో జీవితమంతయు దుఃఖమయమై నష్టమయిపోవును అట్లు వివాహితు లయినను ఎంతకెంతకు విషయ విరక్తిని జేసికొనెదరో, అంతకంతకు స్త్రీ పురుషులు ఉభయులకును ఊర్ధ్వగతియు, సంసారభారశమనమును, ఓజస్సును,శాంతియు గలుగును, స్త్రీ అయినను, పురుషుడైనను ఒకసారి వివాహము అయిన తర్వాత ఉభయులలో ఎవరికైనను వియోగము గల్గినచో అప్పటినుండి యయినను బ్రహ్మచర్యమును పాలించుట శ్రేయస్కరము ఒకానొకడే దుర్గమమగు పర్వతోపరిభాగమునకు వెళ్లుటకు ప్రయాసముగా నున్నప్పుడు, మఱియొకరినిగాని ఇద్దఱిని గాని లేక ముగ్గుఱిని గాని ఎత్తుకొని పోవడము ఎటుల దుస్సాధ్యమో, ఆలాగున ప్రకృతికి విలక్షణమగు పరమ పురుషుని స్థానమైన ముక్తిపదవి సర్వసంగ పరిత్యాగు లయిన వారికే మిక్కిలి ప్రయాసముగ ఉంటుండగా సంసార మహాభారముతో భార్య బిడ్డలను గూడ మోసికొని యెట్లు మోక్షమును జేరగలుగను? ఇందువలననే సంసారము మహారణ్యమనియు, సంసారసాగర మనియు, సంసారకూపమనియు వర్ణించిరి

మఱియొక రహస్యము, పెట్రోలుచేత గాని క్రూడాయిలుచేత గాని నడుపబడు యంత్రమునకు తైలము నశించినయెడల ఎట్లు గమన మాగిపోవునో, ఆలాగున శారీరక మానసికమగు నీ దేహయంత్రమును శుక్లము నడుపుచుండును స్త్రీలకు శుద్ధశోణితమును అట్టిదే, కావున శుక్లమునకు వీర్యమని పేరు గల్గినది. అందువలననే వీర్యము నష్టమయిన నిర్వీర్యుడగును ఈ విషయమంతయు 'శుష్క వేదాంత తమోభాస్కరమున' గనందగును. ఇప్పుడు స్త్రీ పునర్వివాహ విషయమును గూర్చియే చెప్పబూనినందుచే బ్రహ్మచర్య వ్రతపుణ్యము, జ్ఞానము, అతీంద్రియజ్ఞానము మొదలయిన వానిని తెలుప తలంచలేదు. స్త్రీ యయినను,

పురుషుడైనను యావజ్జీవితమును బ్రహ్మచర్యముతో గడిపి బ్రహ్మపదవిని పొందవలయుననియే యీ ఉపాధి యొక్క నమ్మకము కలియుగమున కేర్పడిన పరాశరస్మృతిలో ఒక శ్లోకమునే నిరూపింప దలంపు గలదు.

నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ ।
పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే ॥

పతి దేశాన్తరమునకు పోయి వార్త తెలియకున్నను, మృతి నొందినను, సన్న్యసించినను, నపుంసకు డయినను, పతితుడైనను స్త్రీలకు వేరొకపతి విధింపబడుచున్నాడు

మృతే భర్తరి యా నారీ బ్రహ్మచర్యే వ్యవస్థితా ।
సా మృతా లభతే స్వర్గం యథా తే బ్రహ్మచారిణః ॥

ఏ స్త్రీ భర్త మరణించిన పిదప బ్రహ్మచర్యమును పరిపాలించునో అట్టి స్త్రీ మరణానంతరము బ్రహ్మచారులవలె స్వర్గమును పొందుచున్నది

ప్రోషితో ధర్మకార్యార్థం ప్రతీక్ష్యోఽష్టౌ నరస్సమాః ।
విద్యార్థం షడ్యశోర్థం వా కామార్థం త్రీంస్తు వత్సరాన్ ॥

వివాహిత పతి ధర్మము కొఱకు పరదేశముపోయి యుండిన యెనిమిది యేండ్ల వరకును, విద్యాకీర్తులకొఱకు పోయి యుండిన ఆరేండ్ల వరకును, ధనాదుల కొఱకు పోయి యుండిన మూడేండ్లు వరకును నిరీక్షించి, అంతు తెలియక పోయినచో, స్వజనులకు తెలిపి వారియిష్ట ప్రకారము మరియొక వివాహము చేసికొనవచ్చును

భర్తృవియోగానంతరము పవిత్ర జీవితమును గడుపజాలక పాడు కృత్యములలో ప్రవేశించి గర్భస్రావాది పాపములు చేసి జీవించుటకన్న ఈ పునర్వివాహము మంచిదని తలంచబడినదేగాని నిజముగా పై జెప్పిన ప్రకారము వివాహాది బన్ధము లేకుండుటయే సౌఖ్యమని తెలువబడినది కాని పునర్వివాహమును జేయుట పాపమని శాస్త్ర నిషిద్ధమని జెప్ప సాహసించను.

ఇకను వివాహితులగు దంపతులకు శ్రేష్ఠ సంతానము గలుగవలసియుండిన స్త్రీ పురుషు లుభయులును పవిత్ర జీవులై యుండవలయునని మనువు చెప్పెను

**క్షేత్రభూతా స్మృతా నారీ బీజభూతః స్మృతః పుమాన్ ।**
**క్షేత్రబీజసమాయోగాత్సంభవస్సర్వదేహినామ్ ॥**

స్త్రీ క్షేత్ర (భూమి) తుల్య యనబడును పురుషుడు బీజతుల్యుం డనబడును క్షేత్ర బీజముల రెండింటి చేరిక వలన సకల ప్రాణులు పుట్టునని చెప్పబడినది

**సుబీజం చైవ సుక్షేత్రే జాతం సమ్పద్యతే యధా ।**
**తథా౽౽ర్యాజ్జాత ఆర్యాయాం సర్వం సంస్కార మర్హతి ॥**

ఎటుల మంచి క్షేత్రమున విత్తిన మంచి విత్తనము చక్కగా మొలిచి మెండుగా ఫలించునో, అట్లార్యుని (శ్రేష్ఠుని) మూలమున ఆర్య స్త్రీ యందు (శ్రేష్ఠురాలగు స్త్రీ యందు) పుట్టినవాడు శ్రేష్ఠుడగును (ఆర్యుడగును) అయినను జన్మించిన వారందఱికిని సంస్కార కర్మ లవసరములు సంస్కారము వలననే ఆత్మశుద్ధి నొందగల్గును

**అక్షేత్రే బీజముత్సృష్టమంతరైవ వినశ్యతి ।**
**అబీజకమపి క్షేత్రం కేవలం స్థండిలం భవేత్ ॥**

తగని క్షేత్రమున (చవిటినేల యందు) విత్తిన విత్తనము ఫలము నొసంగక నశించుచున్నది మేలైన క్షేత్రమున మంచి బీజము విత్తనిచో బీడు పడిపోవును కనుక క్షేత్రము బీజము రెండును మంచివై యుండవలయును

ఓహో, శాస్త్ర మెంత పవిత్ర ధర్మము నుపదేశించెను! ఈ లాగున ఆచరించువారును బోధించు వారును లేక పోవుటే గదా యుత్తమ సంతానము కలుగకపోవుటకు కారణము! పై జెప్పిన శాస్త్రసారమేమన పవిత్రమగు గృహస్థ బ్రహ్మచర్యము స్త్రీ పురుషు లుభయులకును లేనిచో ఉత్తమ సంతాన మేర్పడదు చవిటిభూమిలో మంచి విత్తనము వేసినను మంచి ఫలము గలుగదు సారవంత

మగు భూమిలో లేత విత్తనము గాని క్రుళ్ళిన విత్తనముగాని పెట్టిన బాగుగ ఫలింపజాలదు సారవంతమగు భూమియు, మంచి ముదిరిన విత్తనము నుండిన నెట్లు బాగుగ ఫలించునో ఆలాగున భార్యాభర్త లిరువురు గృహస్థ బ్రహ్మచర్యము నవలంబించి శుద్ధమగు నాహారము గల్గి నిర్మలవర్తనము గలిగియుండిన మాత్రమే సత్సంతానము బడయగలరు అట్టివారు లోకోద్ధారకులును, వంశోద్ధారకులును, ఆత్మోద్ధారకులును గాగలరు

అయితే ఆహారము గూడ శుద్ధముగా నుండవలయును సాత్త్వికాహారముచే సత్త్వగుణ సంతతియు, రాజసాహారముచే రజో గుణ సంతతియు, తామసాహారముచే తమోగుణ సంతతియు గలుగునని మరువకూడదు వీరు ఋతుకాల ధర్మము నవలంబించిన వారైనను యుత్తమ సంతానము గలుగదు సత్త్వగుణ రజోగుణ తమోగుణాహారములు భుజించెడు వారికి మూడు గుణములతో మిశ్రమ స్వభావము గల సంతతియు, సాత్త్వికరాజసాహారములను భుజించు వారికి సత్త్వగుణము రజోగుణము గలిసిన సంతతియు, రాజసతామసాహారములను భుజించెడు వారికి రాజస తామసగుణ మిశ్రమమగు సంతతియు జన్మించును ఈ విషయములో గృహస్థులు చాల జాగ్రత్త గలిగి యుండవలయును ఈ త్రిగుణాహారముల గురించి గీత - 17 వ అధ్యాయమున కనందగును

ఇక అన్నిటికన్న పరమరహస్య మొకటి దెలిపెద అదేమన సత్త్వగుణ రజోగుణ తమోగుణ పదార్థములను మాత్రము భుజించిన చాలదు సాత్త్విక రాజస తామసస్వభావము గలిగియుండిన అట్టి గుణముల ననుసరించి సంతానము పుట్టుట గలదు ఏలన, ఆహార పానీయములచే స్థూల దేహమును, స్వభావము అనగా ప్రవర్తన ననుసరించి సూక్ష్మదేహ మేర్పడును ఈ విషయములోను జాగ్రత్త పడవలయును మఱియు వస్తువు మాత్రము శుద్ధముగా నుండిన చాలదు అది వచ్చు మార్గము గూడ శుద్ధముగా నుండవలయును అనగా పాపపు సొమ్ముచే శుద్ధ పదార్థమును కొని తినినచో అది పాపాహారమే యగును కావున సత్యార్జితమగు ధనముచే శుద్ధమగు వస్తువును కొని

దైవభావముతో యుక్తముగా భుజింపవలయును, ఇది సాత్త్వికాహార మనబడును దొంగవస్తువుగాని, అసత్యసాక్షి సొమ్ముగాని, అసత్య వ్యాపారపు సొమ్ము గాని అయిన దానితో శుద్ధ వస్తువులను కొని భుజించినను అది పాపాహారమే యగును కట్టకడకు తానివ్వవలసిన వారి కివ్వకయు, తనపనివారలకు సరిగా కూలి నివ్వకయు, తాను చేయవలసిన పనిని సరిగా చేయకయు వచ్చెడు పదార్థము గాని, లేక వచ్చెడి సొమ్ముచే కొనిన మంచి వస్తువుగాని పాపాహారమే కనుక ధర్మముయొక్క సూక్ష్మ మీలాగున నున్నది సంతానోత్పత్తికి హేతువు స్త్రీ పురుషుల శుక్ల శోణితములే.

ఈ ధర్మము ననుష్ఠించుచు రావలయును అనగా భార్యా భర్తలు సంతానోత్పత్తికి హేతువగు మిధున క్రియలో ప్రవేశించుటకు ముందుగా ఈ ధర్మములో మెలకువ కల్గియుండవలయును ఏలన మనుష్యులు భుజించెడు ఆహార పానీయములే స్త్రీ పురుషులకు శుక్లశోణితములుగా మారుచుండును కావున అచ్చటి నుండియే శుద్ధి గలుగవలయును అట్లు కానిచో బిడ్డలు పుట్టిన తర్వాత ఎంత చక్కబరచజూచినను చక్కబడజాలరు యంత్రము గట్టిగా నుండవలసిన లోహములు కరుగజేసి అచ్చులో పోయుటకు ముందుగా ఏయే లోహము ఎంత ప్రమాణముగా జేసిన ఆ యింజనులు, గడియారములు, గంటలు శుద్ధముగా దృఢముగా నుండునో అది తెలిసికొని యుండవలయును మలిన లోహము లయినచో మిషన్లు గాని, గడియారములుగాని, ఘంటలు గాని సరిగా పనిజేయ జాలవు కనుకనే ధర్మశాస్త్రము ఈ రహస్యమును తెలిపినది

ఈ లాగుననే బ్రహ్మనిష్ఠ చేయువారు గూడ అచ్చట నుండిన మంచి భోజనము దొఱకునని తలంచి చెడ్డ ఆహారమునకై ఆశింపకూడదు ఒకవేళ పెట్టేవారు మంచి పదార్థమునే ఇచ్చినను అది వచ్చే మార్గము శుద్ధమా, అశుద్ధమా అని భోక్తలు గమనించుకొనవలయును. లేనిచో బుద్ధిసూక్ష్మత, మనోనిర్మలత తగ్గిపోవును సోమరితనము తనలో ప్రవేశించును. దుస్సంకల్పము గలుగును దుర్గుణములు పొడమును వీని వలన పతితులు గూడ కావచ్చును ఈ సత్య మెఱుంగుటే పూర్వ ఋషులు వనవాసులై యుండి కందపక్వఫల మూలాదులను

భుజించి యుండుటకు కారణము అందువలననే వారు ఊర్ధ్వరేతస్సును గలవారై, అతీంద్రియ జ్ఞానులై, అమానుష ప్రజ్ఞావంతులై యుండిరి

**అన్నం పుంసాఽశితం త్రేధా జాయతే జఠరాగ్నినా ।**
**మలం స్థవిష్ఠో భాగస్స్యాన్మధ్యమో మాంసతాం వ్రజేత్ ।**
**మనః కనిష్ఠో భాగస్స్యాత్తస్మాదన్నమయం వపుః (మనః) ॥**

(చరక సంహిత)

జీవులు భుజించెడు అన్నపానాదులు జఠరాగ్ని వలన మూడు భాగములుగా మారుచుండును స్థూలభాగము మల, మూత్రములుగాను, మధ్యభాగము రక్తమాంసములు గాను, కనిష్ఠభాగము మనసుగాను మారుచుండును కావున ఆహారముచేతనే దేహమేర్పడు చున్నదని చెప్పబడినది ఆహారము చేతనే స్థూల సూక్ష్మ దేహము లేర్పడుచున్నవి

**పరాన్నేన తు భుక్తేన మైథునం యోఽధిగచ్ఛతి ।**
**యస్యాన్నం తస్య తే పుత్రా అన్నాచ్ఛుక్రం ప్రవర్తతే ॥**

**(శంఖలిఖితస్మృతి)**

ఎవనివద్ద ఏ విధమయిన అన్నమును మనుజుడు భుజించునో అట్టి అన్నముచే నేర్పడిన శుక్లముచే వానికి గలిగెడు పుత్రులును ఆ అన్నదాత యొక్కయు, అన్నము యొక్కయు స్వభావమునే గలిగియుందురు అణు స్వరూపముగా నుండెడు బీజము వృక్షాకారముగా పరిణమించునటుల శుక్లములో గల అణువులు ఏలాటి స్వభావములు గలవో ఆలాటి స్వభావములు గల సంతానములే పుట్టుచుండును నైష్ఠికులు ఆహార విషయమందు అంతనిష్ఠ గల్గియుండుటకు కారణమిదియే

ఓమ్ తత్ సత్ ఓమ్



# ఋతుకాల నిర్ణయము

## (మనుస్మృతి)

ఋతుస్స్వాభావికః స్త్రీణాం రాత్రయః షోడశస్మృతాః ।
చతుర్భిరితరైస్సార్థమహోభిస్సద్విగర్హితైః ॥

స్వాభావికముగా పదునాఱు దినముల వరకు ఋతుకాలము, అందు మొదటి నాల్గు దినములు సజ్జన నిందితములు (వర్జనీయములు)

తాసామాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీచ యా ।
త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశ రాత్రయః ॥

ఆ ఋతుకాలపు దినములలో మొదటి నాలుగు దినములును, పదునొకండవ, పదుమూడవ రాత్రియు నిందితములు తక్కిన పదిరాత్రులు ప్రశస్తములు *

యుగ్మాసు పుత్రా జాయంతే స్త్రియోఽయుగ్మాసు రాత్రిషు ।
తస్మాద్యుగ్మాసు పుత్రార్థీ సంవిశేదార్తవే స్త్రియమ్ ॥

ముందు చెప్పిన పది రాత్రులలోను ఆఱవది, ఎనిమిదవది మున్నగు సరిరాత్రులలో పుత్రులు పుట్టుదురు బేసిరాత్రులలో (అనగా 5,7,9, మొదలగునవి) స్త్రీలు పుట్టుదురు కావున పుత్రార్థి యగువాడు సరి రాత్రులలోను, పుత్రికలను గోరువాడు బేసి రాత్రులలోను ఋతుకాలమందు స్వభార్యలను గూడవలయును

పుమాన్పుంసోఽధికే శుక్రే స్త్రీ భవత్యధికే స్త్రియాః ।
సమే పుమాన్ పుంస్త్రియౌ వా క్షీణేఽల్పే చ విపర్యయః ॥

---

*ఇదిగాక అమావాస్య, ఆదివార, పర్వదిన, వ్రతరోజులును నిందితములు ఋతువైన పదునాఱు దినములు గడచిన తర్వాతను, గర్భము ధరించిన పిమ్మటను గర్భాశయము మూసికొనిపోవును ఆ సమయమున శుక్లము వ్యర్థమై పోవుట వల్ల కూడదు ఈ కాలములో స్త్రీ యొక్క శోణితము ఆగిపోవును వర్జనీయము

పురుషుని శుక్లము మిక్కుట మైనప్పుడు పురుషుడును, స్త్రీ శోణితము మిక్కుట మైనప్పుడు స్త్రీయు జన్మింతురు పురుషుని శుక్లము స్త్రీ శోణితము సమమైనప్పుడు నపుంసకుడుగాని, స్త్రీ పురుషులు (కవలలు) గాని జన్మింతురు శుక్ల శోణితములు లేక యున్నప్పుడు గర్భమే గలుగదు

**నింద్యాస్వష్టాసు చాన్యాసు స్త్రియో రాత్రిషు వర్జయన్ ।**
**బ్రహ్మచార్యేవ భవతి యత్ర తత్రాశ్రమే వసన్ ॥**

ముందు చెప్పిన నిషిద్ధములైన మొదటి నాల్గు దినములను, పదకొండవ పదుమూడవ దినములును, అమావాస్య పున్నమ వ్రత దినములును వదలి పెట్టి తక్కిన రాత్రులు పత్నితో గూడినవాడు గృహస్థాశ్రమము నందున్నను బ్రహ్మచారియే యగుచున్నాడు స్త్రీయును బ్రహ్మచారిణియే యగును అనగా బ్రహ్మచారులు, బ్రహ్మచారిణులు పొందెడు జ్ఞానమును బ్రహ్మప్రాప్తియును వీరుగూడ పొందగలరు గ్రంథాంతరమున చెప్పినది జూడుడు

**ఋతుకాలాభిగామీ యః స్వదారనిరతశ్చ యః ।**
**స సదా బ్రహ్మచారీ హి విజ్ఞేయః స గృహాశ్రమీ ॥**

స్వభార్య యందు ఋతుకాలమున మాత్రము చేరువాడు సదా బ్రహ్మచారి యనియే గ్రహించుకొనదగినది అట్టివాడు గృహస్థాశ్రమి యైనను బ్రహ్మచారులలో గణింపదగినవాడు. అట్టి స్త్రీ గూడ బ్రహ్మచారిణి యనియే తలంచవలయును

**స్వదారే విధివత్కృత్వా నివృత్తిశ్చాన్యతస్సదా ।**
**మనసా కర్మణా వాచా బ్రహ్మచర్యమితి స్మృతమ్ ॥**

స్వభార్యయందు విధిప్రకారము ఋతుకాలమందు మాత్రము ప్రవర్తించుటయు, మనస్సుచేతను, కర్మచేతను, వాక్కు చేతను ఇతర స్త్రీ యందు నివృత్తి గల్గియుండుట యేది కలదో అదియే గృహస్థ బ్రహ్మచర్యమని గ్రహించబడెను

**బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థోఽథవా యతిః ।**
**యది స్యాత్సంయతాత్మా స నూనం ముక్తి మవాప్నుయాత్ ॥**

బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, వానప్రస్థుడైనను, సన్న్యాసియైనను ఆత్మ సంయమము గలవాడాయెనేని అతడు నిశ్చయముగా ముక్తిని పొందగల్గును

**కేచిత్తత్రైవ ముచ్యంతే జ్ఞానయోగరతా నరాః ।**
**ఆవర్తన్తే పునశ్చాన్యే సంసారే భోగతత్పరాః ॥**

**తస్మాద్విముక్తిమిచ్ఛంస్తు భోగాసక్తిం వివర్జయేత్ ।**
**విరక్తః శాన్తచిత్తాత్మా శివజ్ఞానమవాప్నుయాత్ ॥**

జ్ఞానయోగ నిరతులగు నరులు ఆ గృహస్థాశ్రమమందుండియే ముక్తులగుచున్నారు అట్లుగాక సంసారమందు భోగతత్పరులగు వారు పునర్జనన మొందుచున్నారు అందువల్ల మోక్షమిచ్ఛగించువా డగునేని భోగాసక్తిని వర్జించవలయును విషయ విరక్తుడై ప్రశాంతమైన చిత్తము గలవాడు శివజ్ఞానమును (దైవజ్ఞానమును) బొందును

**యధా భూస్సర్వ భూతానాం స్థానం సాధారణం స్మృతమ్ ।**
**తత్తధా శివభక్తానాం తుల్యం శివపురం స్మృతమ్ ॥**

ఏలాగున సమస్త ప్రాణులకు భూమి సమానమైన ఆధారముగా నున్నదో ఆలాగున శివస్థానము (కైవల్యము) సమానముగా నున్నది



# సంపూర్ణ ఋతుకాల నిర్ణయము

ఇదివరలో మనుస్మృతి గ్రంథములో నిరూపింపబడిన ఋతుకాల నిర్ణయముచే ఈ ధర్మము పూర్తి కాజాలదు ఏలన ఋతుకాల ధర్మము ననుసరించి గర్భము ధరించి ప్రసవించిన స్త్రీ మరల గర్భాధానమునకు కాలము నిర్ణయించెడు గ్రంధము దొరకలేదు పునఃగర్భాధాన కాలము తెలియక పోయినచో ఋతుకాల ధర్మము ఎట్లు పూర్ణముగా తెలిసినదగును? మామూలుగా ప్రతి మాసమునను గల్గెడు ఋతుకాల ధర్మము తెలిసిన చాలదు ఈ విషయమై

ఆయుర్వేదము గూడ తెలిసికొనవలయునని తలంచి ఆయుర్వేదజ్ఞులను కొందరిని అడుగగా, వారును నిర్ణయించి చెప్పకపోయిరి, ధర్మశాస్త్రజ్ఞులగు పండితులను కొందఱిని విచారించినను వారు గూడ ఇదమిత్థమని నిర్ణయించలేదు

కొన్ని పత్రికలలో కూడ నీ విషయమై పండితుల ఆశయములను తెలుపవలయునని ప్రచురణ చేసినను ఇదివరలో ఎవరును ఈ కార్యమును గూర్చి పూనియుండ లేదు లోక వ్యవహారము తెలిసిన కొందఱు పెద్దలను, కొందరు నారీమణులను అడుగగా వారును భిన్నభిన్నాభిప్రాయములను చెప్పిరేకాని ఇదే నిశ్చయమని తెలుపకపోయిరి కొందఱు శిశువును కనిన తర్వాత గర్భాధానమునకు 5 సంవత్సరము లవధియనియు, కొందరు 3 సంవత్సరము లవధియనియు, కొందరు 2 సంవత్సరములనియు, కొందరు 1సంవత్సరమనియు, కొందరు ప్రసవానన్తరము ఎప్పుడు స్త్రీ రజస్వల యగునో అప్పటినుండి ఋతుకాల మనియు, మఱికొందరు స్త్రీ పురుషులకు నెప్పుడు అట్టి సంకల్పము గలుగుచున్నదో అదే కాలనిర్ణయమనియు అభిప్రాయమును వెలిబుచ్చిరి అయితే ఈ విషయమై ప్రమాణ మేదైన కలదా యని అడిగిన ప్రమాణము తమకు తెలియదనియు, లోకానుభవము ఈ ధాగున నుండుననియు తెలిపిరి

పాశ్చాత్యశాస్త్ర కోవిదులగు డాక్టర్లను కొందఱిని విచారించినను సరియగు కాలనిర్ణయము తెలుపలేదు విజ్ఞులగు కొందఱి ఆశయమేమన ఉత్తమ లక్షణములు గల వనితామణులు సంవత్సరత్రయమునకు సంతానము కనెడు స్వభావము గల్గియుందురని వచించిరి ఇది చాల మట్టుకు అంగీకరించదగిన విషయమే ఇక కొందఱు శిశువులు ఎంత వరకు స్తన్యపానమును చేయుదురో, అంతవరకు పునర్గర్భాధానము చేయకూడదనియు రమారమి 3 సంవత్సరములు వయస్సు వచ్చువరకు శిశువులు స్తన్యపానమును చేయుచుందురనియు, తర్వాత దైవసృష్టి ననుసరించి స్వయముగానే స్తన్యము ఆగిపోవుచుండుననియు, అప్పుడే పునర్గర్భాధానమునకు తగిన కాలమనియు తెలుపుచున్నారు దీనిని చాలవఱకు అంగీకరించవచ్చును ప్రసవానన్తరము రజస్వల యయిన తర్వాత గర్భాధానమును చేయవచ్చునని చెప్పెడి ధర్మము సరి యగునది కాదు స్త్రీలు తీర్థమాడిన పిమ్మట

కొందఱు ద్విమాసములకును, కొందఱు మాసత్రయమునకును, కొందఱు షణ్మాసములకును, కొందఱు సంవత్సరమునకును, కొందఱు సంవత్సర త్రయమునకు రజస్వల లగుదురనియు, అది వారి వారి శరీర స్వభావము ననుసరించి యుండుననియు విద్యావతులును, విజ్ఞానవతులునగు కొందఱు వధూమణులు అభిప్రాయ మిచ్చిరి

ఇవన్నియు ఏ విధముగ నుండినను పిల్లలు పాలు త్రాగువఱకు పునః గర్భాధానము లేకుండుట మంచిది అది సుమారు 3 సంవత్సరముల వఱకుండును అట్టైన గర్భము ధరించిన పిమ్మట ప్రసవించుటకు 10 మాసములు అనగా ఒక సంవత్సరము తర్వాత తీర్థమాడినప్పటి నుండి ఒక సంవత్సరము బ్రహ్మచర్యము నందుండిన రెండు సంవత్సరము లేర్పడును పిమ్మట గర్భాధానమై ప్రసవించుటకు ఒక సంవత్సరము గడువేర్పడును అప్పటికి పునస్సంతానము గల్గుటకు 3 సంవత్సరములు పట్టును ఈ ప్రకార మాచరించిన మొదటి సంతానము కనిన పిమ్మట ఒక్క సంవత్సరము స్త్రీ పురుషులు బ్రహ్మచర్య మనుష్ఠించ వలసియుందురు ప్రస్తుత కాలస్థితికి ఇంతమాత్రమైన ఉండిన చాలును దాని కన్న అధికముగా ఇప్పుడుండు వారు నిగ్రహము గలిగియుండ జాలరు శిశువును కనిన 2 సంవత్సరముల వరకు నిగ్రహము గల్గియుండిన చాలమంచిది అట్టైన గర్భాధానము నుండి 3 సంవత్సరముల వఱకు బ్రహ్మచర్యము ననుష్ఠించిన వారలగుదురు ఆచరించుట కలవి గాని విషయము వ్రాసిన ప్రయోజన ముండదు. అందువలన ఇంత వరకైన వ్రాయడమైనది

స్త్రీలు భుజించెడు అన్నపానాదులు రసముగా, రక్తముగా మారుచు దాని నుండి క్షీరమేర్పడుచుండును ఎప్పుడు గర్భము ధరించునో అప్పటి నుండి కొద్ది రోజులు పోయిన క్షీర(దుగ్ధ) ముండదు అప్పుడు శిశువులకు తృప్తిగా పాలు లేకపోవుటచే శుష్క శరీరు లగుదురు. దీని వలన పూర్ణారోగ్యమును, శారీరక మానసిక బలమును శిశువులు పొందక పోవుదురు అంతేగాక నారీమణులు గూడ దుర్బల లగుదురు. వెంట వెంటనే సంతానములు గలుగుటచే శిశువులకు తగినంత పాలులేక పోవుట చేతను, స్త్రీల రక్తము దుర్బలస్థితిని పొందుటచేతను

ఉభయులును అనారోగ్యము గలవారై అల్పాయుస్సు గలవారై పోవుదురు ఇది మానవ లోకమునకు గొప్ప నష్టము ఏ వృక్షములైనను తగినంత జల పోషణలు, బలమైన క్షేత్రములును ఉండిన మాత్రమే గదా సంపూర్ణముగ వికసించి పల్లవించి పుష్పించి పూర్ణఫలముల నివ్వగల్గును! ఒక్కరు భుజించెడు ఆహారము నలుగురైదుగురు భుజించిన వారెట్లు ఆరోగ్యవంతులు గాగలరు? ఏలాగున సస్యములు ఎరువుతోను, జల సహాయముతోను ఉండిన మాత్రమే సంపూర్ణ ఫలము నివ్వగల్గునో ఆలాగున బిడ్డలు గూడ సృష్టికర్త యొక్క నియతిని అనుసరించి క్షీరపానము, నివాస ప్రదేశము సరిగా నుండిన మాత్రమే బలవంతులై, ప్రజ్ఞావంతులై పూర్ణాయుస్సు గలవారై జీవింపగలరు

ఇదిటుల ఉండునుగాక! ఋతుకాల నియమము తెలియక విషయ ప్రమత్తులగుట వలన, బహుసంతానము గల్గి వారికి సరియగు నాహారమును తృప్తిగా పెట్టుటకు అశక్తులై పోవుటవల్లను, ఈ శిశువులు దుర్బలులును, దుర్మనస్సు గల వారు నగుచున్నారు ఇది లోకమునకు గొప్ప నష్టము బ్రహ్మచర్య పటుత్వము లేనందుచేత తండ్రియు, ఇంద్రియ రక్తసౌష్ఠవము లేకపోవుటచే తల్లియు బలహీను లగుచున్నారు ఇంతకన్నను భారమైన మఱియొక విషయము గలదు అదేమన, బహుసంతానము లేర్పడుట వలన వారికి సరిగా విద్యాభ్యాసము చేయించ సమర్థత లేకపోవుటచే బాలబాలికలు విద్యావిహీనులై, మానవ జన్మము యొక్క ఫలమనుభవించుటకు నోచుకొనక కూలినాలి చేసికొనుచు యాచక వృత్తి నవలంబించి దీన జీవితమును గడుపవలసిన వారగుచున్నారు ఇతర దేశములలో గల విద్యాభివృద్ధికిని, భారత దేశములో గల విద్యకును సరిచూచు కొనిన ఆ సంగతి చరిత్రము చదువుకొన్న వారి కందఱికిని విదితమగును కావున నీ విషయమై పాశ్చాత్య వైద్య శాస్త్రజ్ఞులుగాని, ప్రాచ్య దేశ ఆయుర్వేదకోవిదులుగాని, ధర్మ శాస్త్రసారమెఱింగిన వారు గాని ప్రమాణ పూర్వకముగా తెలిపినచో ప్రణామముతో నందుకొని మరు ముద్రణమున ఈ గ్రంథమున చేర్చి ముద్రించెద.

ఇది స్వల్ప విషయమనియో, హీన విషయమనియో తలంచి విజ్ఞులు మౌనము నవలంబించ వలదు. ఏలన భావి కాలమున భారత దేశము నుద్ధరించుట

కును, సంరక్షించుటకును, ఉన్నత స్థితిలోనికి తెచ్చుటకును ఇక పుట్టబోవుచుండు బిడ్డలే ఆధారభూతులని యెవరును మరువకూడదు ఏలాగున గోడయుండిన మాత్రమే చిత్తరువుల చిత్రించుటకు సాధ్యపడునో, ఆలాగున లోకము స్వాధీనము గాను, సుభిక్షముగా నుండిన మాత్రమే మతమును చిత్రించుటకును సాధ్యమగును అప్పుడే ఆత్మరాజ్యమును సంపాదించుటకును, నిలబెట్టుటకును తగిన ధీరోదారవిరాగులగు సంతతులు భారత భూమిలో జన్మించగలరు. అప్పుడే ఆర్యుల యొక్క దివ్యతేజస్సు, ముఖములోను, శరీర సర్వావయవములలోను, దేహ సర్వాణువులలోను ప్రకాశించగల్గును అప్పుడే దయార్ద్రహృదయులును, శాంతమూర్తులును, వైరాగ్యపరులునునగు సంతానములు స్త్రీలలోను, పురుషులలోను మనము జూడగలము అప్పుడే ఆర్య వంశము యొక్క ప్రభావము, ప్రతాపమును మనము కండ్లార గాంచగలము అప్పుడే పరమ ఋషి సంతతి వారే భారతీయులని చెప్పెడు శాస్త్రసారమును జూడగలము అప్పుడే గృహస్థాశ్రమములో నుండినను జనకుడు, శిఖిధ్వజుడు, చూడాల, మదాలస మొదలగు వారివలెనుండు జీవన్ముక్తులను దర్శింపగలము మన దేశమును, మనమును అప్పుడు ధన్యులము గాగల్గుదుము

అంతేగాదు ఇతర దేశములను, ఇతర దేశీయులను ధన్యులుగా జేయు శక్తియు మనకు గల్గును వేదాధ్యయనమును చేయుటకును, తప మొనరించుటకును గల దివ్య శక్తి మనలో నుదయమగును అప్పుడు మోక్షము కొఱకు మఱియొక్క స్థలములోనికి వెళ్ళకనే, గృహములో నుండినను వనములో నుండినను ముక్తి తనలోనే గలదను జ్ఞానమును, దృఢమైన విశ్వాసమును, అనుష్ఠించ దగిన శక్తియును మనలో గల్గును అన్నిటికిని పరమకారుణికుడగు సర్వేశ్వరుని కరుణయు మనకు గల్గును పరమ పావనులగు మహాఋషి పుంగవుల కరుణతో గూడిన ఆశీర్వచనములును జడివానవలె మన పై వర్షింప గల్గును

ఈ పరిపూర్ణ ఋతుకాల నిర్ణయమును వ్రాసిన తర్వాత కాశీ హిందూ విశ్వవిద్యాలయములో గల ఆయుర్వేద మహాపండితుల యొక్కయు, వారణాసీ నివాసులగు ఆయుర్వేదాచార్యుల యొక్కయు సహాయము వలనను ఆర్యసమాజ

స్థాపకులగు శ్రీదయానందసరస్వతీ స్వాముల వారు రచించిన 'సంస్కార విధి' అను గ్రంధము వల్లను దొరికిన విషయముల క్రింద తెలిపెద అగుచో దీని వలన మా ప్రయత్నము పూర్తి యయినది అని గాని, మరల ప్రయత్నము చేయనవసరము లేదని గాని తలంచము అయితే ఇది అంతమట్టుకు మాత్రమని విజ్ఞులు తలపక భావిలో ఉభయుల శ్రేయస్సును గోరు భూలోక వాసులగు సకల స్త్రీ పురుషుల స్వంతకర్తవ్యమని తలంచి యింకను శారీరక మానసిక శక్తి గల సంతానము గలుగుట మన కందరికి అవసరమని తలంచి తగిన శాస్త్రము దొరికినంతవరకు పంపుచుండిన మరుముద్రణలో చేర్చగలము ఏలన ఒకసారి తీర్థమాడిన తర్వాత మరల గర్భాధానమునకు కాలము తెలియకపోయిన ఋతుకాలనిర్ణయము మనకు తెలియజాలదు అనేక ధర్మశాస్త్రములలోను, ఆయుర్వేద గ్రంధములలోను ఋతుకాల నిర్ణయము మామూలు రజస్వల అయిన నాల్గవ దినము నుండి 16 రోజుల వరకని కనపడుచున్నది ఈ విషయము లన్నియు ఈ గ్రంధములో మునుపు వ్రాయబడి యున్నవి సాధారణ ధర్మశాస్త్ర కోవిదులు ఋతుకాల నిర్ణయమును అడిగిన ఈ క్రింది విధముగ తెలుపుదురు "ఋతావుపేయాత్" అనగా ఋతౌ ఉపేయాత్ = ఋతుకాలమందు ధర్మపత్నిని చేరుటయే ఋతుకాల నిర్ణయమని యర్థము దీనిచే పునఃగర్భాధాన నిర్ణయము కాజాలదు ఇది మామూలుగ ప్రతి మాసములో జరుగుచున్న ఋతుకాల దర్శనమును మాత్రమే నిరూపించుచున్నది

## మహా పండితాశయము

యాజ్ఞ వల్క్యస్మృతిలోను, ఇతర ధర్మశాస్త్రములందు గూడ ఈ ఋతు గమనము మొదలగు విధి పుత్రప్రాప్తి కొఱకే విధింపబడియున్నది "అపుత్రస్య గతిర్నాస్తి" అని అన్నందున సద్గతి కొఱకై పితృపిండాది పైతృక క్రియానుష్ఠానము ననుష్ఠించుటకై పుత్రప్రాప్తి ఆవశ్యకమని ధర్మశాస్త్రములు తెలుపుచున్నవి అందువలననే జ్యేష్ఠపుత్రుడే పుత్రుడనియు, ఇతరులు కామజాలనియు చెప్పబడెను ఇందువలననే పితృ కర్మలన్నియు జ్యేష్ఠపుత్రుడు చేయుట అత్రి సంహిత యందు-

షణ్మాసాన్కామయేన్మర్త్యో గర్భిణీం స్త్రియమేవ హి ।
ఆదన్తజననా దూర్ధ్వ మేష ధర్మో విధీయతే ॥

అని కలదు దీని వలన ప్రసవానన్తరము బిడ్డకు దంతములు వచ్చిన పిమ్మటనే స్త్రీతో చేరుట విధింపబడుచున్నది అయితే దంతజనన మెప్పుడో ఆలోచించవలయును 'షణ్మాసం చైనమన్నం ప్రాశయేల్లఘు హితం చ' అని సుశ్రుతము (అ॥10 సూ॥52)

ఆరవ మాసములో అన్న ప్రాశనము విధింపబడియుండుటచే దంతములు అప్పుడే రా ప్రారంభమగునని తెలియుచున్నది 'అష్టాంగ సంగ్రహ' మను గ్రంథములో 'అథైనం జాతదశనం' అను అన్న ప్రాశనవిధి సందర్భములో ఆశ్లోక వ్యాఖ్య 'అథ వర్షాదనన్తరం జాతదశనం బాలం క్రమశః స్తనాదపన యేత్' అని కలదు కాబట్టి ఆరవ మాసములో దన్తములు రా ప్రారంభమయినను, సంవత్సరమునకు గాని బాగుగా రావు కాబట్టియే 'క్రమశః' అని చెప్పబడెను కాశ్యప సంహితా దంత జన్మకాధ్యాయము 'అథ అష్టమే మాసి సర్వ గుణ సంపన్నా భవన్తి' అని యున్నందున ఎనిమిదవ మాసములో గాని, పదవ మాసములో గాని, ఒక సంవత్సరములో గాని దన్తము లేర్పడును అంతవరకు స్తన్యపానము ఉండుననియు, ఈ కాలములోనే దమ్పతులు కలియగూడదనియు ఏర్పడు చున్నది

అచ్చటనే 'సుశ్రుత టీక' లో ప్రసవానన్తరము ఆరు మాసములు వర్జ్యము లనియు ఆరు మొదలు ఎనిమిది వరకు కనిష్ఠమనియు, సంవత్సరము తర్వాత మధ్యమ మనియు, రెండు సంవత్సరముల తర్వాత ఆచరించుట యుక్తమమనియు చెప్పబడుచున్నది కాశ్యప సంహితా సూతికోపక్రమణీ యాధ్యాయము -

షడ్భిర్మాసైః ప్రసూతాయాః ధాతవో రుధిరాదయః ।
ప్రయ్యగచ్ఛన్త్యరోగాయాః యధాస్వం పరిసంస్థితమ్ ॥

ఈ ప్రమాణము వలన ఆరు మాసములకు మరల శుక్ల రుధిరములు

మొదలగు అన్ని ధాతువులు సమానములై పూర్వపుస్థితి (గర్భధారణ యోగ్యస్థితి) సంభవించునని తెలియుచున్నది కాబట్టి యీ పూర్వోక్త శాస్త్ర ప్రమాణములచే ఆరు మాసములకు పూర్వము కూడదనియు, తర్వాత 8మాసములు కనిష్ఠ మనియు, సంవత్సరము మధ్యమమనియు, రెండు సంవత్సరములు ఉత్తమ మనియు తేలుచున్నది బెనారస్ ఆయుర్వేద కాలేజీ పండితులగు డాక్టర్ భాస్కర గోవింద ఘాణేకర్ సుశ్రుతమునకు ఆయుర్వేదరహస్య దీపికయను హిందీ వ్యాఖ్యను వ్రాసిరి దానిలో ప్రాచ్య, పాశ్యాత్యాభిప్రాయములను అనేక ధర్మశాస్త్ర ప్రమాణ పురస్సరముగ నిరూపించిరి వారును పై వ్రాసిన ప్రకారమే తెలిపియున్నారు. గర్భాధాన విషయమై శ్రీ దయానందసరస్వతీ స్వాములవారు రచించిన సంస్కార విధియను గ్రంథములోగల సారమిచట నిరూపించెద వర్తమాన యుగములో లోకోద్ధారణ విషయమై శ్రీ స్వాములవారు చేసిన పరిశ్రమ అపారమైనది ఆలాగున మరియొకరు చేసియుండలేదని చెప్పుట అతిశయోక్తి కానేరదు వారును ప్రపంచములో ఉత్తమ సంతానము గల్గిన మాత్రమే లోకోద్ధారకము గలుగునని తలంపు గలవారు

**పంచవింశే తతో వర్షే పుమాన్నారీ తు షోడశే ।**
**సమ్యత్వాగతవీర్యౌ తౌ జానీయాత్కుశలో భిషక్ ॥**

**(సుశ్రుతే సూత్రస్థానే అ. 35)**

**ఊన షోడశవర్షాయామప్రాప్తః పంచవింశతిమ్ ।**
**యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థః స విపద్యతే ॥**
**జాతో వా న చిరంజీవేత్ జీవేద్వా దుర్బలేన్ద్రియః ।**
**తస్మాదత్యంత బాలాయాం గర్భాధానం న కారయేత్ ॥**

**(సుశ్రుతే శారీరస్థానే అ. 10)**

ఇరవై అయిదు సంవత్సరములు పురుషునికి, పదునారు సంవత్సరములు స్త్రీకిని వయస్సు వచ్చునప్పుడు ఉభయులకును సంతానోత్పత్తికి తగిన శుక్ల శోణితములు మంచి స్థితిలోనికి వచ్చును అని తెలియందగినది అని వైద్య శ్రేష్ఠుడగు

సుశ్రుతకారుని ఆశయము

పదునారు సంవత్సరములకు తక్కువ వయస్సు గల స్త్రీయందు 25 సంవత్సరముల కన్న తక్కువ వయస్సు గల పురుషుడు గర్భమును ధరింపజేసిన అది నిలువకనే పోవచ్చును ఒకవేళ నిలిచి శిశువు జనించినను చిరకాలము జీవింపదు అట్లుగాక ఒక వేళ జీవించినను, దుర్బలమగు మానసేంద్రియకాయము గలదగును అనగా ఇంద్రియ పటుత్వము మనశ్శక్తి లేని శిశువులే జన్మింతురు అందువలన 16 సంవత్సరముల ప్రాయమురాని స్త్రీయందు గర్భాధానము జేయరాదు.

ఇట్టి ప్రబల ప్రమాణము పాటింపక పోవడము చేతనే బాల్య వివాహమును జేసికొని భూమికి భారములగు సంతానములను కనుచున్నారు వీరు తమ ఆత్మోద్ధరణకు గాని, దేశోద్ధరణకుగాని, కుటుంబోద్ధరణకు గాని, వంశోద్దారణకు గాని, మాతాపితరులను రక్షించుటకు గాని, కట్టకడకు స్వజీవితములైనా సుఖముగా గడుపుటకు గూడ శక్తిహీను లగుచున్నారు

చతస్రోఽవస్థాః శరీరస్య వృద్ధిర్యౌవనం సంపూర్ణతా కించిత్పరి
హాణిశ్చేతి, ఆషోడశాత్ వృద్ధి రాచతుర్వింశతేర్యౌవన
మాచత్వారింశతః సంపూర్ణతా తతః కిం చిత్పరిహాణిశ్చేతి ॥

శరీరమునకు నాలుగవస్థలు గలవు 1 వృద్ధి, 2 యౌవనము, 3 సంపూర్ణత 4 క్రమముగా క్షీణించుట అనగా పదునారు సంవత్సరముల వఱకు శరీర వృద్ధియు, ఇరువది నాలుగు సంవత్సరముల వరకు యౌవనము, నలుబది సంవత్సరముల పర్యన్తము సంపూర్ణత, అచ్చటి నుండి కొంచెము కొంచెముగా క్షీణదశయు గల్గును కావున 16 సంవత్సరములు స్త్రీలకును, 25 సంవత్సరములు పురుషులకును దేహేంద్రియ మనస్సులకు వృద్ధి కాలమగుటచే ఈ లోపల ఉభయులును బ్రహ్మచర్య వ్రతమును పాలించుకొనవలయును దీనిలోపల గర్భాధానము చేసిన స్త్రీ పురుషులు శారీర మానసేంద్రియములు వృద్ధిని పొందకపోవడము చేత కాయిక మానసికేంద్రియములు శుష్కించును అందుచే ఉత్తమ సంతానము గలుగ వలయునను తలంపు గల దంపతులును,

ఆరోగ్యవంతులై పూర్ణాయుస్సు గలవారై ధృఢ శరీరులై యుండవలయునని తలంపు గలవారును ఇట్టి నియమములు అనుష్ఠింప వలయును అట్లైన తాము సుఖముగా జీవించగలరు తమకు గల్గిన బిడ్డలును వీర్యౌదార్య శౌర్యపరాక్రమోపేతులై, శ్రీమంతులై, బలవంతులై, ధర్మాత్ములైన దైవగుణము గలవారై యుందురు

**వర్ధతాం బ్రహ్మవిద్యా చ లోకేభ్యస్సుఖ మేధతామ్ ॥**

బ్రహ్మవిద్య వృద్ధి నొందునుగాక, లోకము సుఖము నొందునుగాక



# గర్భాధాన కాలము

గర్భధారణ విషయమై ఇదమిత్థమని సర్వజన సమ్మతముగ శాస్త్రములో నిర్ణయము కనబడుట లేదు అయినను ఉపనయన కాలమునుండి గురుకుల స్నాతకవ్రతము వఱకు లెక్కించిన, కాలమును నిర్ణయించుకొనవచ్చును ఆ విషయమై దిగువ తెలిపెద ఈ విషయములో స్మృతి కర్తలను మాత్రము మన మాధారముగ జేసికొనిన చాలదు ఆరోగ్య విషయమై ఆయుర్వేదమే బోధించును ఇప్పుడు మన మవలంబించెడు పద్ధతిని గాంచిన స్మృతికర్తల యొక్కయు ఆయుర్వేదము యొక్కయు ఆశయము ఇంచుమించుగా దగ్గఱలోనే యున్నది అదియు క్రింద తెలిపెద

ఏ ఫలరస మైనను చక్కగా ముదిరి పండిన దైనచో ఏలాగున ఎంతో రుచికరముగను, ఆరోగ్యము కూడ గలిగియుండునో, ఆలాగున కందములు (గడ్డలు) చక్కగ ముదిరినచో ఎంత స్వాదుకరములో, బలప్రదములో తెలిసికొన వచ్చును ఆలాగున గర్భాధానమునకు స్త్రీ పురుషు లుభయులు గూడ యౌవనావస్థలోనికి రావలయును అట్టి యౌవనమేర్పడి నందులకు గుఱుతేమనగ, పురుషునకు మీసములును, స్త్రీలకు స్తనములును చక్కగ ఏర్పడవలయును. అప్పుడే గర్భాధానమునకు తగిన కాలము

అట్లుగాక గర్భధారణమును చేసినచో లేత విత్తనము దుర్బలభూమిలో పెట్టిన సస్యములవలె చక్కగా పెరిగి ఫలము నివ్వజాల నటుల అట్టివారి శిశువులును దుర్బలులై రోగగ్రస్తులై, అల్పాయుస్సు గలవారై యుందురు బాగుగా ముదిరిన విత్తనమును బలమైన భూమిలో పెట్టి పోషించినచో లెస్సగ పెరిగి పూర్ణ ఫలము నొసంగెడు విధమున, యౌవనావస్థలో గలిగెడు సంతానము ఆయుస్తేజః ప్రజ్ఞాబలములు గలిగియుండును కాన బాల్య వివాహమెంత ప్రమాదకరమో విజ్ఞు లూహించుకొనవచ్చును

ఈ విషయమై శాస్త్రముమాత్రము జదివినవారి అభిప్రాయ మేమన, రజస్వల యగుటకు ముందు వివాహము జేసినను గర్భాధానమును మాత్రము యౌవన కాలమున చేసిన చాలదా? అని అడుగుదురు ఒకవేళ వారు చెప్పిన వాక్యములో మాత్రము కొంత సత్యముండినను క్రియలలో అలాగున జరుగదు రజస్వల యగుటకు పూర్వము వివాహ మయినను రజస్వలానంతరము తప్పక దమ్పతులు సంసారకార్యములలో ప్రవేశింతురు ఇందువలన విద్యాభ్యాసమునకు గొప్పయాటంక మేర్పడుచున్నది పురుషుల విషయములలో ఎట్లైనను ఉండుగాక, స్త్రీలకు విద్య యందు ప్రవేశము లేకనే పోవుచున్నది అయితే ఈ విషయమై శాస్త్రమును చదువుకొన్న పండితులు ఏమని చెప్పుదురనగా, రజస్వల అయిన వెంటనే పతితో గృహస్థాశ్రమమున సతిని జేర్చకపోయిన ఏదైన విషయవృత్తి గల్గి జారత్వములోనికి జారిపోవచ్చుననియు చెప్పుదురు ఇది యెంత అవమానకరమగు వాక్యమో వారాలోచించుటలేదు. ఏలన తమ వంశమంత హీనమైనదా! తమ పిల్లలు అంత నికృష్ట గుణము కలవారా! అని కొంచెమైనను ఆలోచించుకొనుట లేదు

మఱియు క్షత్రియులలోను, రెడ్డి, కమ్మ మొదలగు ఉన్నత జాతులలో గల స్త్రీలకు రజస్వలానన్తర వివాహమును సామాన్యముగా జేయుదురు ఇందువలన అట్టివారి కన్యకలు దురాచార జార వృత్తి గలవారని ఎవరైన చెప్పగలరా! రజస్వలానన్తర వివాహము వల్లనే రాజులలోను, రెడ్డి, కమ్మ మొదలగు జాతులలోను గల స్త్రీ పురుషులు అంగసౌష్ఠమును గలిగి యుండుటకును, శక్తి మంతులై యుండుటకును, దృఢకాయము గలవారై యుండుటకును కారణము.

అయితే బాల్య వివాహ దౌష్ట్యము నుండి ముఖ్యముగ కన్యలను రక్షించుట కొఱకు ఈ మధ్య శారదా బిల్లు ఒకటి యేర్పడెను దానికి అంబులేని కారణముచే వట్టి విల్లుమాత్రమై యుండిపోయెను అందువల్ల అది నిరుపయోగమైనది అంబుగల విల్లయినచో, అది లక్ష్యమును భేదించుట కుపయోగపడును ఈ ఆక్టు బాణము లేని ధనుస్సు బోలె వ్యర్థమాయెను అనగా ఆక్టును సంరక్షింప దగిన కట్టుదిట్టములు గల శాసన మేర్పరచకపోయిరి దీనికొఱకు ప్రత్యేకముగ నొక కోర్టు ఉండవలయును అనగా విచారణ కచ్చేరి యుండవలయును కన్యల జననము నుండి 16 సంవత్సరముల వఱకు సరియగు రికార్డు కన్యకల కర్తలు కోర్టులో దాఖలా జేసి వివాహానుమతిని పొందిన తర్వాతనే వివాహమును జేయవలయునని కఠిన శాసనము ఉండవలయును. అప్పుడు మాత్రమే బాల్య వివాహ పిశాచమును ఉచ్చాటన జేయగలము అలాగున పురుషునకు 26 గాని 24 గాని వయస్సు ఉండవలయునని గూడ శాసన ముండవలయును

లోక జ్ఞానము, ఆరోగ్య జ్ఞానము తెలియని వారికిది కష్టముగా తోచవచ్చును అయినను కొంతకాలము జరిగిన పిమ్మట వారికే దీనియొక్క యుపయోగము గోచరమగును శారదా ఆక్టు వచ్చినప్పుడు చాలమంది దీనిని ప్రతిఘటించినను గవర్నమెంటువారు అధిక జనుల యొక్క ఆశయమును ఆధారముగ జేసికొని శాసించిరి ఇప్పుడు చాలమంది ప్రజ్ఞావంతులు అది యెంతో యుపయోగమని తలంచుచున్నారు శాసనానుసారముగ వివాహమును గూడ చేయుచున్నారు అయితే కొందఱు ముదుసలులు అయ్యో మేము జీవించి యున్నప్పుడే మా అమ్మాయికిని, అబ్బాయికిని వివాహము జరుగు దానిని చూచుటకు పుణ్యము లేకపోయినదని దుఃఖింతురు వివాహమైన వెంటనే వైధవ్యస్థితి పొందిన పిల్లలను జూచి మరల నిరంతరము దుఃఖపడుచునే యుందురు విధి యెట్లుండినను ఉండుగాక! మానవుల మతిని గూడ వ్యర్థ పరచగూడదనియే శాస్త్రము తెలుపుచుండును దీనిని గూర్చి విషయము లన్నియు పునర్వివాహమును గూర్చి చెప్పిన చోట చూడందగును అచ్చోట ఈ యుపాధియొక్క ఆశయము స్పష్టీకరింపబడెను

ఇక వివాహపు వయో నిర్ణయమును గుఱించి మనువు ఏమి తెలిపెనో చూతము

గర్భాష్టమేఽబ్దే కుర్వీత బ్రాహ్మణస్యోపనాయనమ్ ।
గర్భాదేకాదశే రాజ్ఞో గర్భాత్తు ద్వాదశే విశః ॥

బ్రాహ్మణునకు ఏడవ యేటను, క్షత్రియునకు పదవ యేటను, వైశ్యునకు పదునొకొండవ యేటను ఉపనయనము చేయవలయును ఇచ్చట గర్భకాలమొక సంవత్సరము తగ్గించడమైనది

బ్రహ్మవర్చస కామస్య కార్యం విప్రస్య పంచమే ।
రాజ్ఞో బలార్థినష్షష్ఠే వైశ్యస్యేహార్థినోఽష్టమే ॥

బ్రహ్మవర్చస్సును గోరు విప్రునికి నైదవయేటను, చతురంగ బలము గోరు క్షత్రియునికి నారవయేటను, బహుకృష్యాదులను గోరు వైశ్యునికి ఎనిమిదవ యేటను ఉపనయనము చేయవలయును

ఆషోడశాద్బ్రాహ్మణస్య సావిత్రీ నాతివర్తతే ।
ఆద్వావింశాత్ క్షత్రబంధోరాచతుర్వింశతేర్విశః ॥

బ్రాహ్మణునకు పదునాఱవ సంవత్సరము వఱకును, క్షత్రియునకు నిరువది రెండవ సంవత్సరమువఱకును, వైశ్యునకు నిరువది నాల్గవ సంవత్సరము వఱకును గాయత్రి నశింపదు అనగా ఈ సంవత్సరముల లోపల అయినను ఉపనయనము చేసికొనవచ్చును

ఇచట ఉపనయన కాలము, క్షత్రియులకు 10 సంవత్సరముల నుండి 22 సంవత్సరముల వఱకు అవధి విధింపబడినది ఇప్పుడు మనము ఉత్తమ పక్షమగు బ్రాహ్మణనియమమును, కనిష్ఠ పక్షమగు వైశ్య ధర్మమును దొలగించి మధ్యమ ధర్మమగు క్షత్రియులకు విధించినది గ్రహించిన 22 లో సగము 11 వ సంవత్సరము తీసుకొనవచ్చును. కాల దేశ స్థితులను అనుసరించి ఇటుల జేయడమైనది. ఏ ధర్మమైనను దేశముల ననుసరించి చేయవలయుననియే ప్రతి స్మృతికర్తయు తెలిపియున్నారు ముఖ్యముగ కలియుగమునకు సంబంధించిన పరాశరస్మృతి

వ్రాసిన పరాశర మహర్షియు అలాగుననే తెలిపియున్నారు పరాశరస్మృతి చూడదగును ఉపనయనానన్తరము గురుకుల వాస కాలమును ఇక తెలుపుదును

**ఏష ప్రోక్తో ద్విజాతీనా మౌపనాయనికో విధిః ।**
**ఉత్పత్తివ్యంజకః పుణ్యకర్మయోగం నిబోధత ॥**

ద్విజులకు రెండవ జన్మమును కలిగించునదై పుణ్యమగు ఉపనయన సంబన్ధమైన విధి యెల్ల చెప్పబడినది ఇకను వారికి గల యనుష్ఠాన క్రమమును తెల్పెద

'సంస్కారాద్విజ ఉచ్యతే' ద్విజుడనగా రెండవ జన్మము గలవాడు దీనికి సంస్కారము గల జన్మమనియు, మొదట మాతృ గర్భము నుండి జన్మించినది ప్రధమ జన్మమనియు, అది దేహమనియు, దేహేన్ద్రియములకు సాక్షియగు ఆత్మను కలుగచేయునది (బోధపరచునది) సంస్కారమనియు గ్రహించదగినది దేహమునకు భిన్నమగు ఆత్మయే తానను జ్ఞానము గలిగిన మాత్రమే ద్విజత్వము సిద్ధించును ఇది కలుగనిచో ద్విజులలో జన్మించినను ద్విజత్వము లేదు ఆత్మయే తా ననుజ్ఞానము గలవాడు ద్విజులలో జన్మింపక పోయినను అతడు ద్విజు డగును మఱియు ఉపనయనమనగా ఉప అనగా సమీపమనియు, నయన మన నేత్ర మనియు అర్థము గలదు ఉపనయన కృత్యమును ఆచార్యుండే చేయించును అప్పుడు పరమేశ్వరుని సమీపమునకు శిష్యుని చేర్చి, పరబ్రహ్మమును కనబరచే లాగున చేయుటయే ఉపనయన శబ్దార్థము అటువంటి ఆచార్యుడును ఉండవలయును సంస్కారమువలననే అనగా అనుష్ఠానము వల్లనే ఈశ్వర దర్శనము, లేక జ్ఞానము గలుగునని ప్రతివారును జ్ఞాపకముంచవలయును

**ఉపనీయ గురుశ్శిష్యం శిక్షయేచ్ఛౌచమాదితః ।**
**ఆచారమగ్ని కార్యంచ సన్ధ్యోపాసన మేవ చ ॥**

గురువు శిష్యునికి ఉపనయనము జరిపించి, మొదట శౌచమును, ఆచారమును, సాయంప్రాతః కాలములందు అగ్నిహోత్రమును సన్ధ్యోపాసనను నేర్పవలయును

తపోవిశేషైర్వివిధైర్వ్రతైశ్చ విధిచోదితైః ।
వేదః కృత్స్నోఽధిగన్తవ్యస్సరహస్యో ద్విజన్మనా ॥

ద్విజుడు నియమ సమూహములతోను, శాస్త్రోక్తములయిన వ్రతములతో నుండి, మన్త్ర బ్రాహ్మణ రూపమయిన వేదమును ఉపనిషత్తులను అధ్యయనము చేయవలయును

వేదమేవ సదాఽభ్యస్యేవస్తప్స్యన్ ద్విజోత్తమః ।
వేదాభ్యాసో హి విప్రస్య తపః పరమిహోచ్యతే ॥

తపంబు జేయగోరు ద్విజశ్రేష్ఠుడు వేదమునే యెల్లప్పుడు నభ్యసింప వలయును విప్రునకు వేదాభ్యాసమే ఈ లోకమున ముఖ్యతపంబని మునులచే చెప్పబడినది

సేవేతేమాంస్తు నియమాన్ బ్రహ్మచారీ గురౌ వసన్ ।
సన్నియమ్యేన్ద్రియ గ్రామం తపోవృద్ధ్యర్థ మాత్మనః ॥

బ్రహ్మచారి గురుకులమున వసించుచు ఇన్ద్రియములను నిరోధించి యాముష్మికము నందలి తపోఽభివృద్ధికై ఈ నియమముల ననుసరింప వలయును

నిత్యం స్నాత్వా శుచిః కుర్యాద్దేవర్షి పితృతర్పణమ్ ।
దేవతాభ్యర్చనం చైవ సమి దా ధానమేవ చ ॥

బ్రహ్మచారి ప్రతిదినము స్నానమొనర్చి పరిశుద్ధుడై దేవర్షి పితృతర్పణమును ఈశ్వరారాధనమును, సమిదాధానమును జేయవలయును.

చోదితో గురుణా నిత్య మప్రచోదిత ఏవ వా ।
కుర్యాదధ్యయనే యత్నమాచార్యస్య హితేషు చ ॥

గురువు నిత్యము చెప్పినను చెప్పకున్నను ప్రతిదినమును వేదాధ్యయనము నందును, గురుహిత కార్యములయందును ప్రయత్నము చేయవలయును

**యది త్వాత్యన్తికం వాసం రోచయేత గురోః కులే ।**
**యుక్తః పరిచరేదేనమాశరీరవిమోక్షణాత్ ॥**

గురుకులమున నైష్ఠిక బ్రహ్మచర్య రూపమగు వ్రతము నాచరింప గోరెనేని జాగరూకుడై గురుశుశ్రూష నా జీవితాంత మాచరింపవలయును

**ఆసమాప్తేశ్శరీరస్య యస్తు శుశ్రూషతే గురుమ్ ।**
**స గచ్ఛత్యంజసా విప్రో బ్రహ్మణస్సద్మ శాశ్వతమ్ ॥**

శరీరము నశించునంతదనుక ఎవడు గురుశుశ్రూష యొనర్చునో అతడు తప్పక శాశ్వతమగు బ్రహ్మలోకము నొందుచున్నాడు

**షట్ త్రింశదాబ్దికం చర్యం గురౌ త్రైవేదికం వ్రతమ్ ।**
**తదర్ధికం పాదికం వా గ్రహణాన్తికమేవ వా ।**

పై జెప్పిన విధంబున మూడు వేదములను సాంగముగా నధ్యయనము చేయుటకై గురుకులంబున ముప్పది యాఱు సంవత్సరము లుండవలయును లేదా అందు సగము (అనగా పదునెనిమిదేండ్లు) గాని అందు సగము (అనగా తొమ్మిదేండ్లు) గాని, కనీసము బాగుగా నేర్చుకొను నంతవఱకు గాని బ్రహ్మచర్యవ్రతంబు ననుష్ఠింపవలయును

**వేదానధీత్య వేదౌ వా వేదం వాఽపి యథా క్రమమ్ ।**
**అవిప్లుతబ్రహ్మచర్యో గృహస్థాశ్రమమావసేత్ ॥**

మూడు వేదములను గాని, రెండు వేదములనుగాని తుదకు తన శాఖావేదమును గాని గురుని కడ బ్రహ్మచర్యము దప్పక యభ్యసించి యావల గృహస్థాశ్రమమును ప్రవేశింప వలయును

ఇప్పుడు మనము వివాహము యొక్క వయస్సును నిశ్చయించుకొన వచ్చును దీనియందు గూడ పైజెప్పిన యుపనయన కాలములో మధ్యమ భాగమును గ్రహించు నటుల ఇచ్చట గూడ మధ్యభాగమగు 18 సంవత్సరములు గ్రహించినచో, ఈ గురుకుల వాసము పదునెనిమిదియు, ఉపనయన కాలము

పదుకొండును చేరునప్పుడు 29 సంవత్సరము లగుచున్నవి ఇదే ఆర్షకాలమున వివాహనియమము అప్పటికి విద్యపూర్తి యగును ఆయుర్వేదము గూడ ఈ లెక్క ననుసరించియే వివాహకాలమును నిర్ణయించు చున్నది

ఇప్పుడు సంస్కృతములో శిరోమణి పరీక్ష కావలసియుండిన ఎనిమిదిగాని, పదిగాని వయస్సు వరకు మాతృభాషను చదివి సంస్కృత పాఠశాలల ఎలిమెంటరీ నాల్గవ క్లాసు 4 సంవత్సరములు, అనగా అప్పటికి (14) పదునాల్గు, తర్వాత అడ్వాన్సు క్లాసు 4 సంవత్సరములు, అప్పటికి 18 సంవత్సరములు, తర్వాత కాలేజీలో శిరోమణి 4 సంవత్సరములు, అప్పటికి 22 సంవత్సరములు, తర్వాత ఆచార్య పరీక్ష యూనివర్సిటీలో 6 సంవత్సరములు, అప్పటికి 28 సంవత్సరములతో విద్య సంపూర్ణమగుచున్నది

ఇది ప్రతి సంవత్సరము తప్పక పరీక్షలో ఉత్తీర్ణుడయిన వానికి జెందినది ఆలాగున ఇంగ్లీషులోను 12 గాని 13 గాని సంవత్సరములు ఎలిమెంటరీ పాటశాలలో చదివి అచ్చట నుంచి హైస్కూలులో స్కూల్ ఫైనల్ వఱకు చదువ వలసి యుండిన 6 సంవత్సరములు, అప్పటికి 19 సంవత్సరములు కళాశాలలో బి ఏ , చదువుటకు [illegible]ములు, అప్పటికి 23 సంవత్సరములు పిమ్మట ఎం ఏ పరీక్ష కాలవసియుండిన విశ్వవిద్యాలయములో 2 సంవత్సరములు మొత్తం 25 సంవత్సరములు అగుచున్నవి ఇక దానిపై చదవవలసిన భాగములను చదువునప్పటికి 27 సంవత్సరముల ప్రాయమగును. ఇదియును ప్రతి [illegible]త్సరము తప్పక పరీక్షలో నుత్తీర్ణులయిన వారికి సంబంధించినదై యుండును దేసియ[illegible]దైనను ఒక సంవత్సరముగాని రెండు సంవత్సరములుగాని [illegible]ునచో 29 సంవత్సరములు పట్టును ఈ ధర్మమును సమన్వయ [illegible] ఆయుర్వేద కర్తయు 26 సంవత్సరములు గాని, 28 సంవత్సరములు గాని వివాహమునకు తగిన కాలమని చెప్పెను

**గురుణాఽనుమత స్స్నాత్వాసమావృత్తో యధావిధి ।**
**ఉద్వహేత ద్విజో భార్యాం సవర్ణాం లక్షణాన్వితామ్ ॥**

గురువు ననుజ్ఞ బడసి స్వగృహమందు చెప్పిన విధమున స్నాన సమావర్తన వ్రతము లాచరించి స్వజాతియందు పుట్టినదియు, శుభలక్షణములు గలదియునైన కన్యను పెండ్లియాడవలయును

గృహస్థాశ్రమము నవలంబించవలయునని ప్రీతి గలవారికే ఇది చెప్పడమైనది ఆత్మశుద్ధి గల్గి నిర్విషయస్థితి గలిగినచో యావత్కాలము బ్రహ్మచర్యాశ్రమము నందే యుండవచ్చును లేక ఎనిమిదిగాని, నాల్గుగాని, సంవత్సరములు వానప్రస్థమున నుండి తర్వాత సన్న్యసింపవచ్చును జీవితాంతము వరకు వానప్రస్థములోనే యుండదలంచిన ఆలాగున చేసి కొనవచ్చును

ఇప్పుడు ఆయుర్వేద గ్రంధమున స్త్రీ పురుషులకు వివాహకాలమును గుఱించి చెప్పినది చూడుడు

**ఊనషోడశవర్షాయామప్రాప్తః పంచవింశతిమ్ ।**
**యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థః స విపద్యతే ।**
**జాతో వా న చిరంజీవేజ్జీవేద్వా దుర్బలేంద్రియః ।**
**తస్మాదత్యన్త బాలాయాం గర్భాధానం న కారయేత్ ॥**
**(సుశ్రుతము - శారీరము)**

16 సంవత్సరములు పూర్తికాని స్త్రీ యందు 25 సంవత్సరముల వయస్సు నిండని పురుషుడు గర్భమును ధరింపజేయుచో అట్టి గర్భము నిలువజాలదు ఒకవేళ గర్భము నిలిచి శిశువు జన్మించినను చాల కాలము జీవించదు ఒక వేళ జీవించినను దుర్బలుడై రోగపీడితుడగును అందువలన పరిపక్వము గాని కన్యయందు గర్భాధానమును జేయరాదు ఓహో! దైవసమ్మతమగు ఆయుర్వేదము ఎంత సత్యము నుపదేశించినదో చూడుడు

**రసాద్రక్తం తతో మాంసం మాంసాన్మేదః ప్రజాయతే ।**
**మేదసోఽస్థి తతో మజ్జా మజ్జాచ్ఛుక్రస్య సంభవః ॥**

మానవులు భుజించెడు అన్నపానాదులు జఠరాగ్నిచేత రసమై, రసము రక్తమై, రక్తము మాంసమై, మాంసము మేదస్సై మేదస్సు అస్థియై, అస్థి మజ్జయై

(అనగా మూలుగై), అట్టి మజ్జ నుండి శుక్ల మేర్పడుచున్నది ఆహారము యొక్క సారమే సప్త ధాతువులుగా మారుచున్నది 1 రసము, 2 రక్తము, 3 మాంసము, 4 మేదస్సు 5 అస్థి, 6 మజ్జ, 7 శుక్లము- ఇవే సప్తధాతువులు కావున ఆహారమెంత సత్యార్జిత మైనదిగను, శుద్ధమైనదిగ నుండిన సంతానము గూడ అంత శుద్ధముగ నుండును

**ధర్మ్యం యశస్యమాయుష్యం లోకద్వయరసాయనమ్ ।**
**అనుమోదామహే బ్రహ్మచర్యమేకాంతనిర్మలమ్ ॥**

బ్రహ్మచర్య మెట్టి నిర్మలమైనదో తెలుపబడుచున్నది అన్ని ధర్మముల కాధారమైనదియు, యశస్సును కలుగజేయునదియు, పూర్ణాయుస్సును కలుగజేయునదియు, ఇహలోకమందును, పరలోకమందును అజ్ఞానరోగమునకు దివ్యరసాయనము వంటిదియు నగునది ఒకానొక బ్రహ్మచర్యము మాత్రమని ఋషులు తలంచుచున్నారు

**శ్రద్ధావినయసంయుక్తః శాన్తి దాన్త్యాది సంయుతః ।**
**యావత్ జ్ఞానోదయస్తావద్వేదాన్తార్థం నిరూపయేత్ ॥**

ఎంతకాలము వరకు ఆత్మజ్ఞానోదయము గలుగునో అంతవరకు భక్తి, శ్రద్ధ, వినయములతో గూడినవాడై, శాన్తి దాన్త్యాది గుణములు గలవాడై వేదాన్తార్థమును విచారణ చేయుచుండవలయును

**అవ్యుత్పన్నమనా యావద్భవానజ్ఞాత తత్పదః ।**
**గురుశాస్త్రప్రమాణైస్తు నిర్ణీతం తావదాచర ॥**

ఎంత వరకు మనోరాహిత్యము గలుగలేదో, ఎంతవరకు తత్పదార్థస్వరూప సాక్షాత్కారజ్ఞానము గలుగలేదో, ఓ రాఘవా! అంతవరకు గురువుచేతను, శాస్త్ర ప్రమాణముల చేతను నిర్ణయింపబడిన అనుష్ఠానమును నిదిధ్యాసమును చేయుచుండుము



# పంచాగ్ని విద్య

## ఛాన్దోగ్యోపనిషత్తు

### పంచమ ప్రపాఠకము- తృతీయ ఖండము

మూలముతో సహితము వ్రాయవలసియుండిన గ్రంథము పెరుగునని తలంచి అధిక భాగమును తాత్పర్యము మాత్రము వ్రాసి ముఖ్యమైన పురుష విద్యయు, స్త్రీ విద్యయు మూలముతో సహా వ్రాయ నిశ్చయించడ మైనది మూలము సహితము చూడ దలంపు గలవారు ఈ ఉపనిషత్తున జూచుకొన వచ్చును ఈ గ్రంధము రచించుటకు కారణము పీఠికలో నిరూపించిన 'దివ్యజననము' అనగా పుణ్యజీవులను పుట్టించుట అను విషయమై ఆధారపడి యున్నది దీని యొక్క కధారంభము -

బ్రహ్మాదిస్తంబ పర్యంత జీవులకు సంబంధించుచుండెడి సంసార గతి భేదమును దెలియజేయుట కొఱకు ఆఖ్యాయిక చెప్పబడుచున్నది పూర్వ కాలమున అరుణుడను ఋషి పుత్రుడైన శ్వేతకేతుడను బ్రాహ్మణుడు విద్యాభిమానగర్వముతో పాంచాల దేశములోని సభకు వచ్చియున్న వాడాయెను. ఆ సభలో జిబలపుత్రుడై యుండెడి ప్రవాహణుడను రాజు, ఈ బ్రాహ్మణుని జూచి విద్యాభిమానమును పోగొట్టుట కొరకు, ఓ వత్సా! * అని సంబోధించి పిలిచి చెప్పుచున్నాడు-(ఏమనగా) మహర్షియైన మీ తండ్రివలన శ్రద్ధాభక్తి పురస్సరముగా వినయముతో విద్యాగ్రహణము చేసి యుంటివా? అని ప్రశ్న వేసెను ఓ స్వామీ! నాకు మాతండ్రి శిక్షానియమ పూర్వకముగా విద్యోపదేశము చేసియున్నాడు కనుక నేను విద్యాభ్యాసము చేసియున్నానని శ్వేతుకేతు డుత్తరము చెప్పిన వాడాయెను

---

* వత్సా! అని రాజు సంబోధించుటలోనే యితడు శాస్త్రము మాత్రము చదువుకొన్నవాడనియు, బ్రహ్మజ్ఞానము లేనివాడనియు గ్రహింపనగును ఈ విషయము స్వయముగా తెలిసికొనియే రాజు అట్లు సంబోధించుట జరిగినది "వత్సా" అనగా పసివాడా అని అర్థము ఎన్ని శాస్త్రములు చదువుకొనినను ఆత్మజ్ఞానము లేనిచో పిల్లవానితో సమానుడని శాస్త్ర నిర్ణయము

పూర్వమంత్రమునందు జెప్పబడిన ప్రకారము, తండ్రివల్ల నుపదిష్టుడనై, విద్యాభ్యాసము చేసియున్నానని చెప్పిన శ్వేతకేతుడను బ్రాహ్మణునికి, జిబల కుమారుడగు ప్రవాహణుడను రాజునకు జరిగిన ప్రశ్నోత్తరములు వివరింపబడుచున్నవి

(1) ఓ శ్వేతకేతుడా! కర్మాధికారులైన జనులీ లోకమును విడిచిన తర్వాత యే ప్రదేశమునకు బోవుచుందురో, ఆ విషయము నీకు దెలియునా? యని రాజు ప్రశ్నము చేసెను స్వామీ! నాకు దెలియలేదని శ్వేతకేతుడు ప్రతి వాక్యమును జెప్పెను (2) లోకాంతరమునకు బోయిన వారు మఱల ఈ లోకమున కే ప్రకారముగా వచ్చుచున్నారో దానిని తెలిసి కొంటివా! యని మఱల రాజు ప్రశ్నము చేసెను అదియును నాకు దెలియదని శ్వేతకేతు డుత్తరమును జెప్పెను (3) అధికారి భేదముచే నిర్ణీతమై యుండెడు మార్గములలో దేవయాన పితృయానముల విభాగమును దెలిసికొని యుంటివా? యని మఱల రాజు ప్రశ్నించెను అదియును నాకు దెలియదని శ్వేతకేతు డుత్తరము జెప్పెను

(4) ఈ లోకమునుండి అనేక జీవులు సంతతము పోయి ప్రవేశించు చున్నను, పితృ సంబంధమైన యూర్ధ్వలోకము ఏ ప్రకారము నిండక యున్నదో, ఆ విషయమును దెలిసికొంటివా? యని రాజు మరల ప్రశ్నము జేసెను అదియును నాకు తెలియదని శ్వేతకేతు డుత్తరము జెప్పెను (5) ఈ లోకములో అంత్యేష్టి విధిచే నగ్నియందు హోమము చేయబడి యపూర్వమను సంజ్ఞ గలిగి యుండెడి అప్పబ్ద వాచ్యములైన భూత సూక్ష్మములు పునరావృత్తి ద్వారా అయిదవ యాహుతి వినియుక్తములై, పురుష శబ్ద వాచ్యము లే ప్రకార మగుచున్నవో, ఆ స్వరూపమును నీవు తెలిసికొని యుంటివా? యని రాజు మరల ప్రశ్న వేసెను ఓ స్వామీ! ఈ విషయమున నేమియును నాకు దెలియలేదని శ్వేతకేతు డుత్తరము జెప్పిన వాడాయెను

ఈ ప్రకారమైదు ప్రశ్నముల విషయములును నాకు దెలియలేదని చెప్పియుండెడి శ్వేతకేతుని గూర్చి రాజు చెప్పుచున్నాడు ఓ శ్వేతకేతుడా! నీవు తండ్రివలన శిక్షా పూర్వకముగా విద్యోపదేశము చేయబడియున్నానని

చెప్పియుంటివి లోకమునం దీప్రశ్న విషయములు తెలియకుండెడి ఏ పురుషుడైనను నేను విద్యాభ్యాసము జేసియున్నానని యే విధముగా చెప్పవచ్చును? నీవు విద్యాభ్యాసము చేయకయే సమగ్రముగా విద్య పరిపూర్తియైనదని యీ ప్రకారము సభలలో చెప్పుట యుక్తము కాదని యాక్షేపణ పూర్వకముగా నిరాకరించిన వాడాయెను

ఈ లాగున రాజుచే అధిక్షేపింపబడిన శ్వేతకేతుడు అత్యంత నిర్వేద యుక్తమైన ఆయాసముతో గూడిన వాడై, తండ్రి సమీపమునకు బోయి యడిగిన దేమనగా, సర్వజ్ఞులైన మీరు నాకు సమగ్రముగా విద్యోపదేశము జేయకయే సమావర్తన కాలమునందు విద్యోపదేశము పూర్తి యైనదని ఆజ్ఞ యిచ్చి యుంటిరని నాకు సంశయము గలిగినది ఈ సంశయ నిమిత్తమును విని ప్రతి వాక్యమును ఆజ్ఞాపించవలయునని ప్రార్థించుచున్నానని విజ్ఞాపన చేసెను పూర్వమంత్రము నందు రాజుచే తిరస్కరింపబడిన శ్వేతకేతుడు తండ్రి సమీపమునకు బోయి, తండ్రిని గూర్చి మీరు నాకు విద్యోపదేశము సమగ్రముగా జేయనందున రాజసభలో తిరస్కారము సంభవించినదని నిర్వేదముతో విన్నవించుకొనియుండెను (గనుక) నిర్వేద నిమిత్తమును, తండ్రియొక్క ప్రత్యుత్తరమును ఈ మంత్రమునందు వివరింపబడుచున్నది

సామాన్య రాజుగా నుండెడి జైబలుడు నన్ను అయిదు విషయములను ప్రశ్నము చేసిన వాడాయెను వానిలో నొక ప్రశ్న విషయమునైనను వివిరించి చెప్పుటకు నేను సమర్థుడను కాకపోతినని శ్వేతకేతుడు తండ్రికి మనవి చేసికొనెను తండ్రియైన గౌతము డీ వాక్యమును విని, ఓ శ్వేతకేతుడా! నిన్ను గూర్చి రాజు ప్రశ్నము చేసియుండెడి అయిదు విషయములును విద్యోపదేశ కాలమున నీవు నన్నడిగియుందువేని ఈ ప్రశ్నములలో నొక్క విషయమైనను నాకు దెలియకుండు విషయము నప్పుడే నీకు దెలిపియుందును ఈ ప్రశ్న విషయములు నాకు తెలిసియున్న యెడల ప్రియ పుత్రుడవైన నీకు విద్యోపదేశములో ఏ నిమిత్తముచే చెప్పక పోవుదును? కనుక నాకు దెలియకపోయిన యంశమే నీకును దెలియకపోయినది గాని యుపదేశములోని

లోపముచే దెలియక పోయినది కాదని తండ్రియైన గౌతముడు శ్వేతకేతుని గూర్చి ప్రత్యుత్తరము చెప్పిన వాడాయెను

పూర్వమంత్రమునందు జెప్పబడిన ప్రకారము, కుమారునికి ప్రతి వచనము నిచ్చి యుండెడి గౌతముడు జిబల పుత్రుడై యుండెడి ప్రవాహణుడను రాజు వలన నైదు ప్రశ్నల విషయమయి యుండెడి పంచాగ్నివిద్య మొదలయిన వాని స్వరూపమును గ్రహించవలయునను కోరిక గలవాడై రాజుయొక్క నివాస స్థానమునకు బోయినవాడాయెను ఈ లాగున నతిధిరూపముగా సంప్రాప్తమైన బ్రాహ్మణునికి రాజు యధావిధిగా పూజచేసి సత్కరించెను రాజగృహమున సత్కృతుడై యున్న యా గౌతముడు మఱునాటి ప్రాతఃకాలమున రాజసభలో ప్రవేశించి సభామధ్యమునకు వెళ్ళెను ఈ ప్రకారము సభలోనికి వచ్చియున్న యా బ్రాహ్మణుని రాజు చూచి యోగ క్షేమ రూపకార్యార్థమై వచ్చియున్నాడని యూహించి సర్వజ్ఞుడవైన యో గౌతముడా! యని పిలిచి మనుష్యలోక భోగార్థమయి యుండెడి ధన పశుక్షేత్రాది విత్తములలో నీకిష్టమై యుండెడి వాని గోరిన యెడల పుష్కలముగా సమర్పించెదనని చెప్పిన వాడాయెను ఆ బ్రాహ్మణు డీవాక్యమును విని యో రాజా! మనుష్యలోక భోగార్థమైన ధన పశుక్షేత్ర విత్తాదికము నకు నీవే యర్హుడవుగాని, నాకు వానితో ప్రయోజనము లేదు నేనుద్దేశించిన ప్రయోజన మేమన, నా కుమారుడైన శ్వేతకేతుడు మీ సభలోనికి వచ్చియున్న సమయమున, ఏ విషయములను ప్రశ్నచేసి యుంటివో యా విషయములను నిరూపించుటకు సమర్థత గలుగజేయు విద్యాస్వరూపమును నాకు చెప్పవలసినదని విజ్ఞాపించెను

ఈ ప్రకారము వినయపూర్వకముగా విద్యోపదేశముకొఱకు ప్రార్థన చేయుచుండెడి బ్రాహ్మణుని రాజు చూచి, ఇంతకు పూర్వము క్షత్రియ పరంపరలోనే ప్రర్తించుచుండెడి ఈ విద్యను బ్రాహ్మణునికి జెప్పవలసి వచ్చినదను వ్యసనముతో గూడియున్నను, విద్యా విషయమయి ప్రశ్నముచేసిన బ్రాహ్మణుని ప్రత్యాఖ్యానము (నిరాకరణము) చేయకూడదను నియమముచే విద్యాన్యాయము ననుసరించి చిరకాలము నివసించి యుండవలసిన ట్లాజ్ఞాపించెను. ఆ బ్రాహ్మణుడు విద్య నపేక్షించి చిరకాలము సేవించియుండగా ఆ రాజు బ్రాహ్మణుని గూర్చి

విద్యోపదేశము చేయుటకు ముందుగా తాను బ్రాహ్మణునిచే ప్రార్థింపబడి నందుకును, దీర్ఘకాలము నివసించి యుండవలసినదని యాజ్ఞాపించినందుకును క్షమాపణ వాక్యమును జెప్పుచున్నాడు

(ఏమనగా) సర్వవిద్యా పారంగతులై యుండెడి ఋషివంశ జాతుడవైన నీవు సామాన్య రాజునైన నన్ను విద్యా విషయము చెప్పవలసినదని యడుగుటతోనే ఆ విషయమును జెప్పవలసిన వాడనై యున్నాను అయినను ఈ విద్య పూర్వము లేనిదానివలె నింతవరకు బ్రాహ్మణపరంపరలో జేరి బ్రాహ్మణు లుపదేశము జేయుటకాని, గ్రహించుట గాని లేదు * ఇందువలననే, సర్వలోకములయందును క్షత్రియజాతికే ఈ విద్య సంప్రాప్తమై క్షత్రియపరంపరలోనే ఉపదిష్ట మగుచున్నది ఇప్పుడు నీవు నా వలన విద్యాగ్రహణము చేయుటతో నుత్తర కాలమందు బ్రాహ్మణుల యొక్క పరంపరలో బ్రవేశించుచున్నది. ఇట్టి విద్యా స్వరూపమును బోధించుటకై రాజునైన నేను, ఋషి వంశజాతుడవైన, సర్వజ్ఞుడవైన నిన్ను నియమించుటయును, మీచే ప్రార్థింపబడుటయును సంభవించినది కనుక నిది తగనిదియై యున్నను క్షమింపవలసినదని చెప్పి అరుణపుత్రుడైన బ్రాహ్మణునికి ప్రవాహణుడను రాజు పంచాగ్నివిద్యా స్వరూపము నుపదేశము చేసినవాడాయెను

ఇంక పంచాగ్ని విద్యలో 1 లోకవిద్య, 2 పర్జన్య విద్య, 3 పృధివీ విద్య , 4 పురుష రూపవిద్య, 5 స్త్రీ రూపవిద్య ఈ అయిదింటిలో లోకరూప విద్యయు, పర్జన్య రూప విద్యయు, పృధివీ విద్యయు మన విషయమునకు సంబంధించినవి కానందుచే నిచట వ్రాయబడలేదు పురుష రూప విద్యయు, స్త్రీరూప విద్యయు మనకు కావలసిన వగుటచే క్రింద నిరూపింపబడిచున్నవి

---

* దీని యందు గౌతముని యొక్క నిగర్వమును, వైరాగ్యమును, విద్యాగ్రహణాసక్తియు, దీర్ఘకాల గురుకుల వాసరీతియు గ్రహించుకొనవచ్చును మరియు రాజు ఋషులపై జూపిన గౌరవమును తెలియందగినది ఈ పంచాగ్నివిద్య ఆర్ష కాలములో క్షత్రియులలో ఉండుటయే మహావీర్య పరాక్రమ శాలురగు సంతానములు గలుగుటకు కారణమైనది ఇదే విధముగా ఆత్మపురాణమున జాబాలి అను బ్రాహ్మణునకు అజాత శత్రువను కాశీరాజు బ్రహ్మోపదేశము చేసినట్లు గలదు

## 1. పురుష రూప విద్య

**పురుషో వావ గౌతమాగ్నిస్తస్య వాగేవ సమిత్ప్రాణో**
**ధూమో జిహ్వార్చి శ్చక్షురంగారా శ్శ్రోత్రం విస్ఫులింగాః ॥**

నాల్గవ యాహుతి విషయమున పురుష శరీరమును అగ్ని స్వరూపముగా భావన చేయవలసినది ఈ పురుష శరీరము ప్రకాశించి వృద్ధి పొందుటకు హేతువై యుండెడి వాగింద్రియమును అగ్న్యుద్దీప్తమైన సమిధల స్వరూపముగా భావింపవలయును ముఖనాసికా రంధ్రముల నుండి నిర్గమించుచుండెడి ప్రాణవృత్తిని ధూమస్వరూపముగాను, అన్నపానభక్ష్యములు మొదలైన యిష్టరసముల నాస్వాదించుటకు యోగ్యమైన రసనేంద్రియవృత్తిని ఆజ్యాది హవిస్సులను గ్రహించుటకు యోగ్యమైన జ్వాలయొక్క స్వరూపముగాను, రూపాది విశేషములను దెలియజేయుటకు యోగ్యమైన చక్షురింద్రియవృత్తిని అంగారముల స్వరూపముగాను, సర్వ దిక్కులయందు వ్యాపించి శబ్దమును గ్రహించు చుండెడి శ్రోత్రేంద్రియమును అగ్ని నుండి లేచి సర్వదిక్కులను వ్యాపించుచుండెడి యంగారలేశముల స్వరూపముగాను భావించవలసినది

**తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవా అన్నం జుహ్వతి,**
**తస్యా ఆహుతే రేతస్సంభవతి ॥**

పూర్వమంత్రమునందు జెప్పబడిన ప్రకారము కార్యకరణ సంఘాత రూపమైన పురుష స్వరూపముగా భావింపబడి యుండెడి యగ్ని విద్యయందు యాగకర్త యొక్క వాగాది వృత్తి పరిణామ స్వరూపములైన దేవతలు, వ్రీహ్యాదుల సంస్కారము ద్వారా అన్న రూపముగా పరిణమించియుండెడి భూత సూక్ష్మములను హోమము చేసిన వారైరి ఈ హోమము వలన నపూర్వ సంస్కార విశిష్టమైన ఆయన్నమే పురుష శరీరములో ప్రజనన శక్తి (సంతానోత్పత్తి శక్తి) యుక్తమయిన రేతోరూపముగా పరిణమించుచున్నది

## 2. స్త్రీ రూపవిద్య

**యోషా వావ గౌతమాగ్ని స్తస్యా ఉపస్థ ఏవ సమి**
**ద్యదుపమంత్రయతే స ధూమో యోనిరర్చి**

ర్యదన్తః కరోతి తేఽఙ్గారా అభినందా విస్ఫులింగాః ॥

అయిదవ యాహుతి విషయమున స్త్రీ యొక్క శరీరమునే అగ్ని స్వరూపముగా భావించవలయును అట్టి స్త్రీ శరీర రూపమై యుండెడి యగ్నికి ఉపస్థేంద్రియము (రహస్యప్రదేశము) పుత్రోత్పత్తి ద్వారా వృద్ధిహేతు వైనందున, అగ్ని వృద్ధి సంపాదకములైన సమిధల స్వరూపముగాను, పురుషునితో సంబంధము కొరకు సంకేతము చేసికొని యుండుట అగ్నియొక్క ధూమ స్వరూపముగాను, యోని జ్వాలా స్వరూపముగాను, సుఖానుభవము కొఱకు పురుషునితో సంయోగము గలిగి యుండుటయే అంగారముల స్వరూపముగాను, ఆ పురుషసంబంధముచే ననుభవించెడి క్షుద్రసుఖమే అగ్ని లేశముల స్వరూపముగాను భావన చేయవలయును

తస్మి న్నేతస్మిన్నగ్నౌ దేవా రేతో జుహ్వతి
తస్యా ఆహుతే ర్గర్భస్సంభవతి ॥

పూర్వ మంత్రము జెప్పిన ప్రకారము యోషిద్రూపముగా నిరూపింపబడిన యగ్ని యందు యాగకర్తయొక్క వాగాది వృత్త్యభిమాన దేవతలు పురుష శరీరమనెడి అగ్నిలో హుతమై రేతోరూపముగా పరిణమించి యుండెడి భూత సూక్ష్మములను హోమము చేయుచున్నారు ఆ హోమమువలన రేతోరూపమై, అప్ఛబ్ద వాచ్యములై యుండెడి భూత సూక్ష్మములు స్త్రీ శరీరమున గర్భరూపముగా పరిణమించుచున్నవి *

---

*పంచాగ్ని విద్యయొక్క స్వరూపము సంగ్రహముగా నిరూపించడమైనది దంపతులిరువురు దీనిలో నిరూపింపబడిన భావము లన్నింటిని మిధునక్రియా కాలమునందు బాగుగా భావన చేసికొనవలయును ఉభయులును ఏక మనస్సు గలవారలై ఉత్తమ సంతానము గలుగవలెనను భావన మాత్రమే అప్పుడుండవలయును దైవ భావన గలిగియుండవచ్చును దివ్య పురుషుల లోకోద్ధారకుల, బ్రహ్మ నిష్ఠుల భావనకూడా కొందఱు చేయుదురు కరిగిన కంచు అచ్చురూపము ననుసరించి విగ్రహ రూపముగా మారునట్లు, ఆ సమయమున ఎట్టి భావము కలుగునో అట్టి సంతానమేర్పడును ఋతుకాల ధర్మవిషయమై మనుస్మృతి భాగము జూచుకొనవలయును

# బృహదారణ్యకోపనిషత్తు

దీనిని చదువునప్పుడు విరక్తులకు కొంత సిగ్గు కనబడును  అయినను వేదములో ఉండుటచేతను, ఉత్తమ సంతానము గలుగవలసి యుండుటచేతను వ్రాయడమైనది

ఈ  శ్రుతియందు గూడ దివ్య జననము గురించి యజ్ఞ రూపముగా తెలుపడమైనది  దీనివల్లను దివ్యజననము అనగా దివ్య సంతానము గలిగెడు విధానమును తెల్పడమైనది  పూర్వరాజులును, ఋషులును ఇట్టి విద్య నెఱింగి యుండుటచేతనే దివ్య సంతతిని గనగల్గిరి  దృష్టాంతముగ దశరథమహారాజు పుత్రకామేష్టియాగము చేసి యేర్పడిన ప్రసాదమును భుజించుట గదా శ్రీ రామలక్ష్మణాది దివ్యమూర్తులు జన్మించుటకు కారణమైనది  దీనివల్లనే యిపుడు మనము యజ్ఞముయొక్క ఫలము పొందగలము  ఛాందోగ్యశ్రుతి యందును మనుస్మృతి యందును ఉండు విధానముతో  కూడి, యీ దాంపత్య క్రియను గూడ ననుష్ఠించవలయును

## చతుర్థ బ్రాహ్మణము - షష్ఠాధ్యాయము

**ఏషాం వై భూతానాం పృథివీ రసః పృథివ్యా ఆపోఽపా మోషధయ ఓషధీనాం పుష్పాణి పుష్పాణాం ఫలాని ఫలానాం పురుషః పురుషస్య రేతః ॥**

జంగమస్థావరాత్మకమైన సమస్త భూతముల యొక్క సారమైనది భూమి భూమియొక్క సారము ఉదకములు  ఉదకముల యొక్క సారము ఓషధులు, ఓషధుల యొక్క సారము పుష్పములు, పుష్పముల యొక్క సారము ఫలములు ఫలముల యొక్క సారము పురుషుడు / పురుషుని యొక్క సారము రేతస్సు

పురుషునికి నేరేతస్సు  చెప్పబడెనో స్త్రీకిని ఆలాగున రక్తము ఏర్పడుచున్నది.

**స హ ప్రజాపతిరీక్షాఞ్చక్రే హన్తాస్మై ప్రతిష్ఠాం కల్పయానీతి,**
**స స్త్రియగ్ం ససృజే తాగ్ం సృష్ట్వాఽధ ఉపాస్త**

తస్మాత్స్త్రియ మధ ఉపాసీత స ఏతం ప్రాఞ్చం గ్రావాణ
మాత్మన ఏవ సముదపారయ త్తేనైనామభ్యసృజత్ ॥

సమస్త భూతములకు మిక్కిలి సారభూత మైనది రేతస్సు గనుక ఆ బ్రహ్మదేవుడు, దీనికి స్థితిని చేయవలయునని యుద్దేశించి స్త్రీని సృష్టించెను ఇట్లు స్త్రీని సృజించి మైధునకర్మను సేవించెను కనుకనే యిప్పుడును ప్రజలు స్త్రీలను సేవించుచున్నారు ఆ బ్రహ్మ అధికగమనము గల చంద్రకిరణమను పాషాణస్థానీయమగు ఈ జననేన్ద్రియమును నిండించెను అట్టి యింద్రియముతో స్త్రీసంసర్గమును చేసెను

ఈ శ్రుతి యందు స్త్రీలను ఎంత గౌరవభావముతో నిరూపించెను! కావుననే దీనియందు 'ఉపాస్త' అనగా ఉపాసించెను అని తెలుపడమైనది ఉపాసన అని తెలుపుటచే, అదియెంత గౌరవభావ ప్రయోగమో గ్రహింపవగును? స్త్రీయందు అట్టి గౌరవభావము లేనిచో గౌరవార్హములగు సంతానములు గలుగవు ఈ భావము ఇప్పుడు గూడ రాజులలో గలదు స్త్రీలను నీచముగా చూచువారికిని పిలుచువారికిని గంభీరాశయముగల సంతానము గలుగదు

తస్యా వేది రుపస్థో లోమాని బర్హిశ్చర్మాధిషణే సమిధో
మధ్యతస్తౌ ముష్కౌ సయావాన్ హ వై వాజపేయేన
యజమానస్య లోకో భవతి తావానస్య లోకో భవతి
య ఏవం విద్వానధోపహాసం చర

త్యా సాగ్ స స్త్రీణాగ్ సుకృతం వృఙ్క్తేఽధ య ఇద
మవిద్వానధోపహాసం చరత్యస్య స్త్రియః సుకృతం వృఞ్జతే ॥

ఇట్లు సృజింపబడిన స్త్రీ యొక్క సంసర్గమును చేసెడి సమయమునందు ఆ స్త్రీ యొక్క ఉపస్థయే యజ్ఞవేదికగాను, ఆ ప్రదేశము నందలి వెంట్రుకలే దర్భలుగాను, ఆ ప్రదేశమునందలి చర్మమే సోమఖండనము కొఱకు పలకయందుంచిన వృషభచర్మముగాను, రహస్య ప్రదేశ పార్శ్వముల యందలి కఠినమైన మాంసఖండములే అగ్నిగాను భావించి ఉపాసించెడి వానికి లోకము

నందు వాజపేయ యాగమును చేయువానికి ఎట్టి ప్రసిద్ధలోకము గలుగునో, అట్టిలోకము కలుగుచున్నది ఇట్లు తెలిసికొని సంసర్గమును చేయువాడు స్త్రీల యొక్క సుకృతమును పొందుచున్నారు ఇట్లు తిరిగి తెలిసికొనక సంసర్గమును చేయువాని యొక్క సుకృతమును స్త్రీలు పొందుచున్నారు

ఏతద్ధస్మవై తద్విద్వానుద్దాలక ఆరుణి రాహైతద్ధస్మవై
తద్విద్వాన్నాకో మౌద్గల్య ఆహైతద్ధస్మవై తద్విద్వాన్
కుమార హారిత ఆహ బహవో మర్యా బ్రాహ్మణాయనా
నిరిన్ద్రియా విసుకృతోఽస్మాల్లోకాత్ప్రయన్తి య ఇద
మవిద్వాగ్ సోఽధోపహాసం చరన్తీతి బహువా ఇదగ్
సుప్తస్య వా జాగ్రతో వా రేతస్స్కన్దతి ॥

ఈ వాజపేయ యాగమహిమను తెలిసిన అరుణ పుత్రుండగు ఉద్దాలకుడు ముద్గల పుత్రుండగు నాకుడు, కుమార హారితుడు అను ముగ్గురును లోకమునందు అనేకులగు మరణమును పొందెడివారైన బ్రాహ్మణ జాతివారు వాజపేయ యాగ సంపత్తును తెలియక సంసర్గము చేసినను మేలుకొని యుండగా గాని, నిద్రించుచుండగా గాని రేతః స్ఖలన మైనను ఇంద్రియము లేనివారై సుకృతము లేనివారై యీ లోకము నుండి మరణము పొందుచున్నారని చెప్పిరి

ఇచ్చోటినుండి కొన్ని శ్రుతి వాక్యములు అత్యవసరములు కావని విడువబడినవి అంతే గాక అవి నిండా అశ్లీలకరము లగుటచేతను త్యజించడ మైనది కావలసిన వారు బృహదారణ్యక భాష్యమును చూచుకొనవచ్చును

అథ యద్యుదకే ఆత్మానం పరిపశ్యేత్తదభిమన్త్రయేత
మయి తేజ ఇన్ద్రియం యశోద్రవిణగ్ సుకృతం మితి, శ్రీర్హవా
ఏషా స్త్రీణాం యన్మమలోద్వాసాస్త స్మాన్మలోద్వాసనం
యశస్వినీ మభిక్రమ్యోపమన్త్రయేత ॥

అనంతరము యోని యందు శుక్లపతనమైన యెడల 'మయితేజః ఇన్ద్రియం యశోద్రవిణగ్ సుకృతమ్' అను మంత్రముతో అభిమంత్రించవలయును

లోకమునందు స్త్రీలలో రజస్వలా స్త్రీ శ్రేష్ఠురాలు అట్టి స్త్రీని పురుషుడు నాల్గవ దినమున స్నానానన్తరము పొంది దేవతలు నాయందు తేజస్సును, ఇన్ద్రియమును, కీర్తిని, ధనమును పుణ్యమును కల్పించెదరుగాక యని అభిమన్త్రించవలయును

అథ యస్య జాయామార్తవం విన్దేత్త్ర్యహం కగ్ంసేన
పిబేదహతవాసా నైనాం వృషలో న వృషల్యుపహన్యాత్త్రి
త్రి రాత్రాన్త ఆప్లుత్య వ్రీహీ నవఘాతయేత్ ॥

పురుషుని యొక్క భార్య ఋతుమతియైన యెడల ఆస్త్రీ గిన్నెతో నుదకపానమును చేయవలయును రజస్సుచే దూషితమైన వస్త్రము గలదియై యుండును ఆ స్త్రీని ఇతర స్త్రీ పురుషులు తాకగూడదు మూడు రోజులు వెళ్ళిన తరువాత స్నానము చేసి రజోదూషితముగాని వస్త్రము గల స్త్రీ స్వయముగా దంపతులకు ఋతుకాల దివసములలో భుజించవలసిన అన్నమునకు తగిన వడ్లను దంచవలయును

స య ఇచ్ఛేత్పుత్రో మే శుక్లో జాయేత వేదమనుబ్రువీత
సర్వమాయు రియాదితి క్షీరౌదనం పాచయిత్వా
సర్పిష్మన్త మశ్నీయాతా మీశ్వరౌ జనయితవై ॥

ఇట్లు దంచబడిన వడ్లవలన గలిగిన బియ్యముతో నేమి చేయవలయు ననిన, ఆవాజపేయ యాగ సంపత్తుగల పురుషుడు తనకు తెల్లని కాంతిగల వాడును, నూరు సంవత్సరములు ఆయుస్సు గలవాడును, ఒక వేదమును సాంగముగా చదువుకొనిన వాడునగు పుత్రుడు గలుగవలయునని కోరిన యెడల ఆ బియ్యముతో క్షీరాన్నమును వండించి స్త్రీ పురుషు లిద్దఱును భక్షించవలయును ఇట్లు భక్షించిరేని వారు అట్టి పుత్రుని కనుటకు సమర్థు లగుదురు

అథ య ఇచ్ఛేత్పుత్రో మే కపిలః పింగళో జాయేత
ద్వౌ వేదావనుబ్రువీత సర్వమా యురియాదితి దధ్యోదనం పాచయిత్వా
సర్పిష్మన్త మశ్నీయాతామీశ్వరౌ జనయితవై ॥

కపిల వర్ణము గలవాడును, పచ్చని కాంతి గలవాడును రెండు వేదములను చదువుకొనిన వాడును, సంపూర్ణమైన ఆయుస్సు గలవాడును నగు పుత్రుడు నాకు గల్గును గాక యని కోరెడు జనుడు పెరుగు అన్నమును పచనము చేయించి, నేతిలో కలిపి స్త్రీ పురుషు లిద్దఱును భక్షించిరేని అట్టి పుత్రుని కనుటకు సమర్థు లగుచున్నారు.

అధ య ఇచ్ఛేత్పుత్రో మే శ్యామో లోహితాక్షో జాయేత
త్రీన్వేదాననుబ్రువీత, సర్వమాయురియా దిత్యుదోదనం
పాచయిత్వా సర్పిష్మన్త మశ్నీయాతా మీశ్వరౌ జనయితవై ॥

నల్లని దేహకాంతి గలవాడును, ఎఱ్ఱని నేత్రములు కలవాడును మూడు వేదములు చదువు కొనినవాడును, సంపూర్ణాయుస్సు గలవాడును నగు పుత్రుడు నాకు పుట్టును గాక యని కోరెడి వారు శుద్ధాన్నమును వండించి (క్షీరాదులను కలుపకుండ నీటితో మాత్రము పచనము చేసిన అన్నమును) నేతితో కలిపి స్త్రీ పురుషులు భక్షించిరేని, వారు అట్టి పుత్రుని కనుటకు సమర్థు లగుదురు

అధయ ఇచ్ఛేద్దుహితా మే పణ్డితా జాయేత
సర్వమాయురియాదితి తిలౌదనం పాచయిత్వా
సర్పిష్మన్తమశ్నీయాతా మీశ్వరౌ జనయితవై ॥

పూర్ణాయుస్సు గలదియును, గృహ కృత్యములయందు నేర్పుగలదియు నగు కుమార్తె నాకు కలుగునుగాక యని కోరెడి వాడు నువ్వుల పులగమును వండించి నేతితో కలిపి స్త్రీ పురుషులు భక్షించిరేని ఆ స్త్రీ పురుషులు అట్టి స్త్రీని కనుటకు సమర్థు లగుదురు

అథై నామభివద్యతే అమోహామస్మి సాత్వగ్
సాత్వమస్యమోహం సామాహామస్మి ఋక్త్వం
ద్యౌరహం పృధ్వీ త్వం తావేహి సగ్ రభావహై
స హరేతోదధావహైపుగ్సే పుత్రాయ విత్తయ ఇతి ॥

ఆ పురుషుడు క్షీరాన్నాది భక్షణమును చేసిన తర్వాత ఈ స్త్రీని

'అమోహమస్మి' అను మంత్రమును చెప్పుచు స్పర్శించుచున్నాడు ఈ మంత్రాభిప్రాయ మేమనగా, నేను ప్రాణము, నీవు వాక్కువు ప్రాణమునకు వాక్కు స్వాధీనమయినట్లు, నీవు నాకు స్వాధీనయయిన దానవు నేను సామవేదము, నీవు ఋగ్వేదము, సామవేదమునకు ఋగ్వేద మాధార మయినట్లు నాకు నీవాధారమయి యున్నావు నేను అంతరిక్షము, నీవు భూమివి భూమ్యంత రిక్షములు లోకమునకు తల్లిదండ్రులు అయినట్లు మనము పుత్రునకు తల్లిదండ్రులమై యున్నాము కనుక నీవు రమ్ము, అటువంటి మనమిద్దఱమును గూడి పుంస్త్వము గల పుత్రోత్పత్తి కొఱకు ప్రయత్నము చేయుదము రేతస్సును ధరించుదము అని స్పర్శించుచున్నాడు

ఇట్టి వాజపేయ యజ్ఞముచే గలిగిన కుమారునికి స్తన్యపానము చేయించు విధానము క్రింద నిరూపింపబడుచున్నది గర్భిణిగా నున్నప్పుడు చేయవలసిన కర్మలన్నియు మామూలు గృహ్య సూత్రమున చెప్పినట్లు చేసిన చాలును

అథైనం మాత్రే ప్రదాయ స్తనం ప్రయచ్ఛతి
యస్తే స్తన స్సశయో యోమయో భూర్భో
రత్నధా వసు విద్యస్సుదత్రః యేన విశ్వాపుష్యసి
వార్యాణి సరస్వతి తమిహ ధాతవేఽకరితి ॥

అనంతరము ఆ పురుషుడు, ఈ పుత్రుని, తల్లి తొడమీద కూర్చుండబెట్టి ఈ కుమారునికి స్తనమును 'యస్తేస్తనః' అను ఈ మంత్రమును చెప్పుచు ఇప్పించుచున్నాడు ఈ మంత్రము యొక్క తాత్పర్యమేమనగా, ఓ సరస్వతీ! సమస్త ప్రాణులకు స్థితి హేతువు అయిన అన్నమును, క్షీరమును గలుగజేయునది యును, సమస్త కర్మ ఫలమును తెలిసికొని ఆయా ఫలమును ఇచ్చునదియును, దేవాది సమస్తభూతములను పోషించునదియు నగు నీ యొక్క స్తనమును నా యొక్క పుత్రుడు పానము చేయుటకు నా భార్య యొక్క స్తనమునందుంచు మా యని చెప్పి ప్రార్థించుచు స్తనమును పుత్రునికి ఇప్పించుచున్నాడు

తర్వాత అన్నప్రాశన కాలములో ఈ క్రింది విధముగ చేయవలయును.

**అధాస్య దక్షిణం కర్ణమభినిధాయ వాగ్వాగితి త్రిః**
**అథ దధి మధు ఘృతగ్ సన్నీయా నన్తర్హితేన జాతరూపేణ ప్రాశయతి**
**భూస్తే దధామి, భువస్తే దధామి, సువస్తే దధామి**
**భూర్భువస్సువస్సర్వం త్వయి దధామీతి ॥**

అనన్తర మా పురుషుడు ఈ పుత్రుని కుడిచెవియందు ముఖము నుంచి వాక్కు వాక్కు అని మూడు సార్లు జపియించి సమీపమునందున్న బంగారుతో పెరుగును, తేనెను, నేతిని ఈ మూటిని కలిపి 'భూస్తే దధామి' అనునది మొదలయిన నాలుగు మంత్రములను చెప్పుచు పుత్రునికి తినుపించుచున్నాడు

తదనన్తరము నామకరణ కాలమున వేదము, జ్ఞానము, ధర్మము, ఓజస్సు, ధీరత్వము, తపస్సు, దానము, ధనము మొదలగు గుణములు గల పేర్లతో కలిపియే నామకరణము చేయువలయును అట్టి ప్రభావయుక్తమగు నామమే యుండవలయును గాని దీనభావమును గలుగజేసెడి నికృష్ట నామములు(పేర్లు) ఉండకూడదనిరి

**అధాస్య నామకరోతి వేదోఽసీతి తదస్య తద్గుహ్యమేవ నామ భవతి ॥**

అనంతరమునం దాపురుషుడు ఈ పుత్రునికి వేదమని పేరు పెట్టుచున్నాడు ఈ పుత్రునికి పెట్టిన ఆ వేదము అను పేరు మిక్కిలి రహస్యమై యున్నది కనుక ఆ పేరుతో లోకమునందు వ్యవహారము లేదు

పిమ్మట సకాలమున ఉపనయనాది క్రియలు చేయించుటయు, బ్రహ్మవేత్తలగు ఆచార్యుల స్థానమునకు విద్యాభ్యాసము, బ్రహ్మచర్యమును సల్పుటకు పంపుటయు ఈ శ్రుతియొక్క సారమై యున్నది



# యయాతి చరిత్రము

## (ఆంధ్ర భాగవతము - నవమస్కంధము)

ఇచ్చట యయాతి చరిత్ర సంక్షిప్తముగా వ్రాయబడుచున్నది విస్తారముగా జూడగోరువారు భావగవతమున నవమస్కంధములో చూడనగును

యయాతి శక్రశాపగ్రస్తుడై దేవయానిం దోడ్కొని పురంబునకుం జని పెద్ద కొడుకగు యదువుం బిలిచి యిట్లనియె

నీ తల్లిం గనినట్టి శుక్రువలనన్ నే డీ జరం బొందితిన్
నా తండ్రీ! యదునామధేయ! సదయా! నా వృద్ధతం దాల్పవే
నీ తారుణ్యము నాకు నీవె తనివో నిండార గొన్నాళ్ళు నే
జేతోజాత సుఖంబులం దిరిగెదన్ శృంగారినై పుత్రకా!

అనిన విని తండ్రికి యదుం డిట్లనియె

కాంతాహేయము దుర్వికారము దురాకండూతిమిశ్రంబు హృ
చ్చింతామూలము పీనసాన్వితము ప్రస్వేద వ్రణాకంవవ
శ్రాన్తిస్ఫోటక యుక్త మీ ముదిమి వాంఛం దాల్చి నానాముఖో
పాంతం బైన వయోనిధాన మిది యయ్యా! తేర యీవచ్చునే.

అని యందు కొడంబడకున్న యయాతి దుర్వసుద్రుహ్యాదుల నడిగిన వారును యదువు పలికినట్ల పలికిన గడగొట్టు కుమారుండైన పూరువున కిట్లనియె

పిన్నవు గాని నీవు కడు బెద్దవు బుద్ధులయందు, రమ్మి నా
యన్న! మదాజ్ఞ దాటవు గదన్న! వినీతుడ వన్న! నీవు నీ
యన్నలు సెప్పినట్లు పరిహారము సెప్పకుమన్న! నాజరన్
మన్నన దాల్చి నీతరుణిమం బొనగూర్పుము నాకు బుత్రకా!

అనిన విన గురుభక్తి గుణాధారుండయిన పూరుం డిట్లనియె

అయ్యా! నన్నిటు వేడనేల భవదీయాజ్ఞానముల్లంఘునం
బయ్యుండం బరిహారమున్ నొడువ నే నన్యాయినే నీజరన్
నెయ్యంబొప్పగ దాల్చి నా తరుణతన్ నీకిచ్చెదం బంపినం
గ్రయ్యంబారెడి పుత్రకుండు క్రిమిసంకాశుండు గాకుండునే.

అదియునుంగాక,

మునివృత్తి డయ్యనేటికి, జనపాలక సుగతిగోరు సత్పురుషులకున్
దను గన్నతండ్రి సెప్పిన, పని చేసిన సుగతి గొంగువసిండియ కాదే!

పనుపక చేయుదు రధికులు, పనిచిన మధ్యములు పొందుపఱతురు, తండ్రుల్
పని చెప్పి కోరి పనిచిన, ననిశము మాఱాడు పుత్రు లధములు తండ్రీ!

అని పలికి పూరుండు ముదిమి సేకొని తన లేప్రాయంబు యయాతి కిచ్చె, నయ్యయాతియుం దరుణుండై,

ఏడున్ ద్వీపము లేడు వాడలుగ సర్వేలాతంబెల్ల బె
న్వీడై పోడిగ నేలుచుం బ్రజల నన్వేషించి రక్షించుచున్
దోడన్ భార్గవి రా మనోజ సుఖ సంతోషంబులం దేలుచున్
గ్రీడించెన్ నియతేంద్రియుం డగుచు నా క్రీడాతిరేకంబులన్.

మర్మంబుల నతి సాధ్వీధర్మంబుల దేవయాని దన ప్రాణేశున్
నర్మముల మనోవాక్తను కర్మంబుల నొండు లేక కడు మెప్పించెన్.

ఆకాశంబున మేఘ బృందము ఘనంబై సన్నమై దీర్ఘమై
ఏకంబై బహురూపమై యడగున ట్లేదేవు గర్భంబులో
లోకశ్రేణి జనించుచున్ మెలగుచున్ లోపించు నాదేవు సు
శ్రీకాంతున్ హరి గూర్చి యాగములుసేసెన్ నాహుషుండిమ్ములన్.

మఱియును,

చెలికాండ్రన్ భటులన్ రథమ్ముల గరిశ్రేణిం దురంగంబులన్
గలలో గన్న ధనాళితో సమములుంగా జూచుచున్ భార్యతో

బలువేలేండ్లు మనోజ భోగలహరీ పర్యాప్తుడై తేలియున్
బలుతృష్ణం గడగాన ేంద్రియ మహాబంధంబులన్ ద్రుక్కుచున్.

ఒక్క దినంబున నాత్మజ్ఞానంబునం జేసి కాంతా నిమిత్తంబున మోసపోవుట యెఱింగి యయాతి (యతి విషాదంబునొంది) దేవయాని కిట్లనియె

అబలా! నీ నిబిడాతి దుర్జయ సలజ్జాపాంగ భల్లంబులం
బ్రబలంబైన మనంబు భగ్నముగ నా ప్రావీణ్యముం గోలుపో
యి బలిష్ఠుండగు కాముబారి బడి నేనెట్లోర్తునే బందిక
త్తైబడిం బావవు దృష్ణ యిప్పుడకటా దీర్ఘాకృతిన్ రొప్పెడిన్.

కదలదు ప్రాణము గదలిన, గదలవు సర్వాంగకములు గదలుచునుండన్
వదలవు బిగువులు వదలిన దుది, లేదీతృష్ణ దీని ద్రుంపగ వలయున్.

వెయ్యేండ్లయ్యెను నీతో గ్రయ్యం బడియున్న వాడ గామ సుఖములం
గ్రుయ్య దొకయించుకైన న్డయ్యెదు కొనలిడియె దృష్ణ నవ పద్మముఖీ!

ముదిసెను దంతావళియును ముదిసెను గేశములు దనువు ముదిసెందనకున్
ముదియనివి రెండు సిక్కెను, బ్రదికెడి తీపియును విషయ పక్షస్పృహయున్.

కడలే దాశాలతకుం గడ జూడగ గాన రాదు కడగని రేనిన్
గడు ముదమున సంసారము గడగందురు తత్త్వవిదులు గమల దళాక్షీ !

మండనహాటకపశు వేదండాశ్వ వధూ దుకూల ధాన్యంబులు పె
క్కుండియు నాశాపాశము ఖండింపగ లేవు మఱియు గడమయచుమీ్మ.

కామోపభోగ సుఖములు వేమాఱును బురుషు డనుభవించుచు నున్నం
గామంబు శాంతి బొందునె ధూమధ్వజాడాజ్యవృష్టి ద్రుంగుడువడునే.

అక్క తల్లి చెల్లెలాత్మజ యెక్కిన పానుపెక్క జనదు పద్మనయన
పరమ యోగికైన బలిమిని నింద్రియ గ్రామ మధికపీడ గలుగజేయు.

వెంగలివిత్తయి తిరుగుచు గంగార్రై చెడక ముక్తి గాక్షించు నతం
డంగనలతోడ విడువని సంగడములు వదలవలయు జలజాతముఖీ!

అదిగావున నేడు మొదలు తృష్ణాఖండనంబు సేసి నిర్విషయుండనయి యహంకారంబు విడిచి మృగంబులం గలిసి వనంబున సంచరించెద పరబ్రహ్మంబునందు జిత్తంబు చేర్చెద బ్రహ్మనిష్ఠ మనుష్యులకు నాశానివారిణి యగుటంజేసి యేనందు దత్పరుండనై యాహార నిద్రాది యోగంబుల బరిహరించెద, నాత్మ విదుండై సంసార నాశంబుల దలంచిన వాడే విద్వాంసుడని పలికి పూరుని యౌవనం బతనికిచ్చి ముదిమి దాను గైకొని విగతలోభుండై నిజభుజశక్తి పాలితంబగు భూమండలంబు విభాగించి ద్రుహ్యునకు బూర్వ భాగంబును, యదువునకు దక్షిణ భాగంబును, దుర్వసునకు బశ్చిమ దిగ్భాగంబును, ననువునకు నుత్తర దిగ్భాగంబును సంరక్షింపుడని యిచ్చి వారల సమక్షంబున

నాలుగు చెఱగుల నేలయు బాలింపుండనుచు నగ్రభవులను బంచెన్
భూలోక మేలు మనుచును, బాలార్కోదారు బూరుబట్టముగట్టెన్

ఇట్లు పూరునికి రాజ్యంబిచ్చి పెక్కు వర్షంబులందు ననుభూతంబులయిన యింద్రియ సుఖంబులు వర్జించి.

మిక్కిలి నుజ్ఞానంబున జిక్కగ దెగ నడిచి వైరిషడ్వర్గంబున్
ఱెక్కలు వచ్చిన విహగము గ్రక్కున నీడంబు విడచు కరణి నుదితుడై

కారుణికోత్తముడగు హరి కారుణ్యము కతన నతడు ఘనుడై గెలిచెం
గ్రూరములగు విషయంబుల నూరక గెలువంగ శక్తుడొక్కడు గలడే

మరియు నిర్మూలిత సకల సంగుండై సత్త్వరజస్తమోగుణంబుల దిగనాడి నిర్మలంబయి పరమంబయిన వాసుదేవాభిధాన బ్రహ్మంబునందు యయాతి భూపాలుండు స్వతస్సిద్ధమయిన భాగవత గతిం జెందె నంత

ప్రాణేశుడాడిన పలుకులు నగవులు
గాజాడ కంతరంగమున నిలిపి
పధికులై పోవుచు బానీయశాలల
జల్లగా నుండెడి జనులయట్ల

సంసారమున గర్మ సంబంధులై వచ్చి
యాలుబిడ్డలుమగండనుచు గూడి
యుండుట గాని సంయోగంబు నిత్యంబు
గా దీశమాయా ప్రకల్పితంబు

దీనివిడుచుట దగవని తెగువ మెఱసి
నిద్ర పాలించి మేల్కొన్న నేర్పుపాల
గలిగి భార్గవి సర్వసంగముల విడిచి
హరివరాధీనయై ముక్తి కరిగె నధిప.

ఈ యయాతి చరిత్రము ఇచ్చట నిరూపించుటకు కారణమేమన అతడు చక్రవర్తియై యుండియు, తన యౌవన కాలమంతయు సర్వసుఖముల ననుభవించి యుండియు, తన కుమారుని యౌవనమును తాను గైకొనియు, తన వార్ధక్యమును కొడుకున కిచ్చియు, బహుకాలము సర్వసౌఖ్యముల ననుభవించియు, పూర్వపుణ్యావశంబున కొంత జ్ఞానము గలవాడై, వైరాగ్య మవలంబించి, వనమునకు వెళ్లెను దీనివలన ప్రపంచ సుఖము లెంతవరకు అనుభవించినను విషయాశ వర్ధిల్లునే గాని శమించదని గ్రహించు కొనవలయును దీనికి కావలసిన వాక్యము లన్నియు సయుక్తికముగ యయాతి చెప్పిన ఈ భాగవత వాక్యములలోనే కలవు కావున ఈ గ్రంధము గృహస్థాశ్రమ మహిమను గుఱించి చెప్పిన దయినను వైరాగ్యము గల్గి సర్వసంగపరిత్యాగియై, యేకాంతమున తప మొనరించి బ్రహ్మచింతనము వలన మోక్షము పొందవలయునని తెలిసికొన వలయును విషయాగ్ని భోగములచే అంతకంతకు వృద్ధియగునేగాని శమించదని తెలిపెడి కొన్ని వాక్యముల నిచ్చట నిరూపించెద

సర్పిషా కాష్ఠభారేణ వర్ధతేఽగ్నిశిఖా యధా ।
ఉపభోగేన కామేన హ్యాశా చోపరివర్ధతే ॥

నేతిచేతను, సమిధలచేతను అగ్నిహోత్రు డంతకంతకు జ్వాలాకారమై వెలుగునే గాని శమించడు ఆలాగున కామము చేతను భోగోపభోగములచేతను ఆశ యనెడి విషయాగ్ని ఉపరి ఉపరి వృద్ధి నొందునే గాని శాంతి నొందదు

ఇన్ధనేన యథా వహ్నిః వర్ధతే ఉత్తరోత్తరమ్ ।
భోగేన కామరూపాగ్నిః ఉత్తరోత్తర వర్ధతే ॥

దీని యర్థము పై జెప్పినదే యగును

భోగేన తృప్తిర్నైవాస్తి విషయాణాం విచారతః ।
తస్మాద్విరాగః కర్తవ్యో మనసా కర్మణా గిరా ॥

ఎంత విచారణ చేసినను విషయముల భోగము ననుభవించుటవలన నెంత కాలమున కైనను తృప్తి గలుగదు. కావున మనస్సు చేతను, కర్మచేతను, వాక్కు చేతను వైరాగ్య మొక్కటియే కర్తవ్యమని తెలియందగును

న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।
హవిషా కృష్ణవర్త్మేన భూయ ఏవాభివర్ధతే ॥

విషయముల భోగము వలన నేకాలమందును సంతృప్తి గలుగదు ఎట్లన, అగ్ని హోత్రుండు కట్టెల చేతను, హవిస్సు చేతను అంతకంతకు వర్ధిల్లునే గాని శమించడు గదా! విషయముల ననుభవించిన తృప్తి పొందగలమని చెప్పువారు నేతి చేతను, హోమద్రవ్యాదుల చేతను, సమిధల చేతను అగ్నిహోత్రుడు చల్లనై చల్లారునని చెప్పెడి దాని యందు నెంత సత్యము గలదో యీ వాక్యములును అటువంటివే

శబ్దస్పర్శమయా యేఽర్థా అనర్థా ఇవ మే స్థితాః ।
యేషాం సక్తస్తు భూతాత్మా న స్మరేచ్చ పరం పదమ్ ॥

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు సుఖములుగ నగుపడినను అవి సుఖములు గావు దుఃఖములే, ఎందుకనగా అట్టి అనర్థ విషయమలను అర్థవంతములుగా తలంచు వానికి పరమాత్మను గుఱించి తలంచుటకైనను సమయము దొరకదు

యథా నిరింధనో వహ్నిః స్వయమేవోపశామ్యతి ।
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయమేవోపశామ్యతి ॥

సమిధలు మొదలయినవి లేనిచో అగ్నిహోత్రుం డేలాగున స్వయముగా చల్లారునో, ఆలాగున విషయవృత్తిలేని మనస్సు స్వయముగా శాంతినొందును అనగా త్యాగముచేత శాంతి లభించునేగాని భోగముచేత గాదు అని మైత్రేయోపనిషత్తు తెలుపుచున్నది

**వైరాగ్యం చ ముముక్షుత్వం తీవ్రం యస్య తు విద్యతే ।**
**తస్మిన్నేవార్థవన్తస్స్యుః ఫలవన్తశ్శమాదయః ॥**

ఎవ్వనికైతే వైరాగ్యము, ముముక్షుత్వమును తీవ్రముగా నుండునో, వానియందే శమదమాదిషట్కము, ధ్యానధారణా సమాధులును సార్థకములును, ఫలకారులు గానగును

**ఏతయోర్మన్దతాయత్ర విరక్తత్వ ముముక్షయోః ।**
**మరౌ సలిలవత్తత్ర శమాదేర్భానమాతతా ॥**

ఎవనియం దీవిరక్తత్వ, ముముక్షుత్వములు మందములుగ నుండునో, వానియందు మరుభూమియందు తోయమువలె, శమాది షట్కము పైకి గనపడుటయే గాని శమాదులు నామమాత్రములై ఫలము నీయజాలవు బురద నీరు నిర్మల మగునప్పుడు దానిలో గల అన్ని వస్తువులు ఏలాగున గోచరించునో, ఆకాశము నిర్మల మగునప్పుడు సూర్యచంద్ర నక్షత్రాదులు ఎట్లు కనబడు చుండునో, ఆలాగున పుణ్యము వృద్ధి యగునప్పుడు ధర్మతత్త్వములును గోచరమగుచుండును. యయాతికి పుణ్య విశేషముచే మనస్సు స్వచ్ఛమయిన సమయమున ధర్మతత్త్వ మెటుల ఉదయమాయెనో, ఆ తరుణమున విషయ విరక్తియు, ముముక్షుత్వమును ఎటుల గలిగెనో, అదేరీతిగా శ్రీరామచంద్రునకు విషయ వైతృష్ణ్యము, ఆత్మ జిజ్ఞాసయు గలిగిన విషయమై యోగవాసిష్ఠమున తెలుపబడిన దానిని జూడుడు

## యోగవాసిష్ఠము - వైరాగ్య ప్రకరణము

**ఆపాతమాత్రహృద్యేషు మా భోగేషు మనః కృథాః ।**
**ఇతి పార్శ్వగతం భవ్యమనుశాస్తి సుహృజ్జనమ్ ॥**

శ్రీరామచంద్రుడు వైరాగ్యము ఉదయించినప్పుడు మిత్రులకు ఈ లాగున ఉపదేశించెను విషయేంద్రియ సంయోగము వలన కలుగునవియు, దుఃఖమునే అంతముగా గలవియు, క్షణికములను నగు భోగములందు మనస్సు నుంచకుము

**నూనం నిగరణాయాశు ఘనగర్ధ మనారతమ్ ।**
**ఆఖుర్మార్జారకేణేవ మరణేనావలోక్యతే ॥**

ఎలుకలను మ్రింగుటకు పిల్లి కనిపెట్టి యుండునట్లు మృత్యువు జీవితమును గబళింప వేచియున్నది కావున అజాగ్రత్త పడకుడు

**అహంకారం పరిత్యజ్య మునే! శాంతమనస్తయా ।**
**అవతిష్ఠే గతోద్వేగో భోగౌఘో భంగురాస్పదః ॥**

ఓ వసిష్ఠమునీ! నే నహంకారమును త్యజించి మనశ్శాన్తిని బడసి ఉద్వేగ (మనోవేదన) రహితుడనైతిని భోగ పదార్థము లన్నియు క్షణభంగురములు ఇన్ద్రియములకు పరాధీనము కావున విషయ భోగములచే మనశ్శాంతి కలుగదు

**చేతః పతతి కార్యేషు విహగస్స్వామిషేష్వివ ।**
**క్షణేన విరతిం యాతి బాలః క్రీడనకాదివ ॥**

పక్షులు మాంసమును జూచిన ఆకాశమునుండి దిగి దాని మీద పడినట్లు, చిత్తము సతతము విషయముల మీద వ్రాలుచున్నది బాలుడు ఆటలు దొరకిన చదువును విడిచిపెట్టి ఆ ఆటల పైకి పోవునటుల, చిరాభ్యస్తధ్యానాది ధర్మ కార్యములను క్షణములో విడిచి మనస్సు విషయములపై పరుగెత్తి పోవుచున్నది

**యాం యామహమతీవాస్థాం సంశ్రయామి గుణ శ్రియమ్ ।**
**తాం తాం కృన్తతి మే తృష్ణా తంత్రీమివ కుమూషికా ॥**

దుష్ట మూషికము వీణ తీగెలను కొరికి వేయునట్లు, తృష్ణయు నేనాశ్రయించి అనుష్ఠించు వివేక వైరాగ్యాది గుణముల నాశన మొనర్చు చున్నది

**పాతాళాద్గచ్ఛతా పృథ్వీం పృథ్వ్యాః పాతాళగామినా ।**
**కూపకాష్ఠం కుదామ్నేవ వేష్టితోఽస్మి కుచేతసా ॥**

కట్టబడిన త్రాడువలన ఏతము క్రింద నుండి పైకి, పైనుండి క్రిందికి తిరుగునటుల నేను మంచి చెడ్డలగు తలంపులతో, పుణ్యాపాపములతోను ఇహలోకమునుండి పరలోకమునకు, పరలోకము నుండి ఇహలోకమునకు వచ్చుచు, పోవుచు నిలకడ లేక యున్నాను (కపిల తోలు బాన నూతి నుండి పైకిని, పైనుండి నూతిలోనికి తిరుగు నటుల, కర్మపాశముచే బద్ధుడైన జీవుడు శాంతి పదమును పొందజాలక యెల్లప్పుడును ఇహ పర లోకములలోనే తిరుగుచుండును సంసార చక్రము యొక్క స్వరూప మీలాగున నున్నది )

అన్త్రర్గ్రథితయా దేహే సర్వదుశ్ఛేదయాఽనయా ।
రజ్జ్వేవాశు బలీవర్దస్తృష్ణయా వాహ్యతే జనః ॥

ముక్కుకు త్రాడు వేయబడిన యెద్దువలె, త్రెంప నలవిగాని తృష్ణా సూత్రముచే బంధింపబడిన మనుజుడు, ఐహికాముష్మిక ఫలరూపమగు భారమును వ్యర్థముగా మోయుచున్నాడు (ఎంత సుందరమైన, బలమైన కోడెదూడైనను ముక్కుదారము గట్టబడినదైనచో ఏలాగున దీనావస్థను పొందుచుండునో, విషయ తృష్ణగల మనుజుని యొక్క స్థితియు అట్టిదే)

పదం కరోత్యలంఘేఽపి తృప్తాఽపి ఫలమీహతే ।
చిరం తిష్ఠతి నైకత్ర తృష్ణాచపలమర్కటీ ॥

తృష్ణయను చపలమర్కట మొకచోట నుండదు పొంద వీలులేని వస్తువుకై ప్రాకులాడును తృప్తి నందినను ఇతర విషయముల వాంఛించును

క్షణమాయాతి పాతాళం క్షణం యాతి నభః స్థలమ్ ।
క్షణం భ్రమతి దిక్కుంజే తృష్ణా హృత్పద్మషట్పదీ ॥

హృత్కమల భ్రమరమగు విషయతృష్ణ ఒక క్షణమున పాతాళమునను, మఱియొక క్షణమున ఆకాశమునను, ఇంకొక క్షణము దిక్కులనే పొదలలోను విహరించుచుండను

ప్రయచ్ఛతి పరం జాడ్యం పరమాలోకరోధినీ ।
మోహా నీహార గహనా తృష్ణా జలదమాలికా ॥

మంచుతో గూడిన మేఘసమూహము చలిని గలిగించి సూర్యుని కప్పివేయు నటుల, మోహముతో గూడిన విషయ తృష్ణ అజ్ఞానమును గలిగించి ఆత్మజ్ఞానమును గప్పివేయచున్నది

**తావన్మ్మహ్యత్యయం మూకో లోకో విలులితాశయః ।**
**యావదేవానుసంధత్తే తృష్ణావిషవిషూచికా ॥**

విషూచి (కలరా) వ్యాధిచే బాధపడు మనుజుడు, అది తగ్గనంతవఱకు మాటలాడు శక్తిని గోల్పోయి మూర్ఛితుడై పడియుండునటుల సంసారియు తృష్ణావశమనము కానంతవఱకు వేదాంత శాస్త్రమున మూగయై, వ్యాకులచిత్తుడై, మోహగ్రస్తుడై పడి యుండును

తృష్ణాశాంతియు, ఆత్మజ్ఞానప్రాప్తియును జీవించి యున్నప్పుడే కలుగజేసికొనవలయునని శ్రీకృష్ణభగవానుడు గీతలో ఉపదేశించిన దానిని కనుగొనుడు జీవించి యున్నప్పుడే సకల బంధములనుండి విముక్తి గలుగుటయే జీవన్ముక్తి యనబడును.

**మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ! శీతోష్ణ సుఖదుఃఖదాః ।**
**ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత! ॥**

ఓ అర్జునా! ఇంద్రియములకు శబ్దాది విషయములతోడ గలిగెడు సంయోగములు శీతోష్ణములను, తన్మూలకముగ సుఖదుఃఖములను గలుగ జేయునవియు, రాగపోకలు గలిగినట్టివియు, స్థిరములు కానట్టివియు నగుచున్నవి కావున వాటిని ఓర్చుకొనుము సహనము వలననే మనుజుడు తరించవలసి యున్నాడు

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః ॥**

విషయేంద్రియ సంయోగమువలన పుట్టిన సుఖానుభవములు దుఃఖమునకు కారణము లనియు, ఆద్యంతములు గలవి యనియు తలచి నిర్మల బుద్ధిగలవాడు విషయ సుఖములందు ఆసక్తి నుంచడు.

విషయేన్ద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥

స్రక్చందన వనితాది సంయోగముచేత ప్రసిద్ధ మైనదియును, విషయముల యందు ఇన్ద్రియములు చేరుటవలన మొదట అమృత తుల్య మైనదియును, అనగా అతి ప్రేమాస్పద మైనదియును, పిమ్మట బలము, వీర్యము, రూపము, ప్రజ్ఞ, జ్ఞాపకశక్తి, ఉత్సాహము అను వీని యొక్క హానికి కారణమగుట వలన విషము వంటిదియు నగు సుఖ మెద్దియో అదియే రాజససుఖము (ఇది విషము గలిసిన క్షీరాన్నము వంటిది).

శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం న యుక్తస్స సుఖీ నరః ॥

ఏ పురుషుడు బ్రతికియున్నప్పుడే కామక్రోధముల యొక్క వేగమును సహింపశక్తి గలిగియున్నాడో, అట్టి పురుషుడు ఇన్ద్రియ నిగ్రహము గలవాడును, శాశ్వతానందము గలవాడు నగుచున్నాడు

ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥

ఎవరి యొక్క మనస్సు సకల భూతములయందును బ్రహ్మముతో సమముగా నున్నదను విషయమునందు నిశ్చలమై యున్నదో అట్టివా రీలోకమునందే జన్మమును జయించిన వారగుచున్నారు మఱియు బ్రహ్మము ప్రకృతి దోషరహితమైనది కనుక అట్టి దోషరహితులు సదా బ్రహ్మమునందు నున్న వారగుచున్నారు (జలములో జలము, తైలములో తైలము ఐక్యమగునట్లున్ను, జలములో తైలము, తైలములో జలము ఐక్యము కానట్లు ప్రకృతిదోషరహిత జీవులే బ్రహ్మమునం దైక్యమును పొంద గలరు ప్రకృతిగుణము గలవారు బ్రహ్మ మందైక్యమును బడయజాలరు )

బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్ ।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥

ఏ పురుషుడు బాహ్యములగు శబ్దాది విషయముల యందాసక్తి లేని మనస్సు గలవాడై తన ఆత్మయందే సుఖమును పొందుచున్నాడో అట్టి పురుషుడు బ్రహ్మనిష్ఠయను సమాధితో కూడుకొనిన మనస్సు గలవాడై నాశరహితమగు బ్రహ్మానందము ననుభవించుచున్నాడు గ్రంథాన్తరము

**అనాత్మన్యరుచిశ్చిత్తే రుచిశ్చాత్మని చేద్భవేత్ ।**
**పుణ్య పుంజేన శుద్ధం తచ్చిత్తమైకాగ్ర్యమర్హతి ॥**

అనాత్మ దృశ్యవిషయములలో అప్రీతియు, ఆత్మధ్యాన విషయములలో ప్రీతియు నేచిత్తమున గలుగుచుండునో అది యనేక జన్మములలో జేసిన పుణ్య సమూహము చేతనే గల్గును అట్టి శుద్ధమైన చిత్తము ఏకాగ్రత గలదియై సమాధియందు ఉపరతిని పొందగల్గును

ఇంతవరకు గృహస్థాశ్రమమునందుండి జీవన్ముక్తి పదవిని పొందదలచు వారు ఈ క్రింద నిరూపింపబడు ఒక్క శ్లోక తాత్పర్యమును గ్రహించిన చాలును ఇదే గృహస్థుని యొక్క ధర్మసారము

**దయా దానం దమో దేవపూజా భక్తిర్గురౌ క్షమా ।**
**సత్యం శౌచం తపోఽస్తేయం ధర్మోఽయం గృహమేధినామ్ ॥**

1 భూతదయ, 2 కలిమికి తగిన దానము, 3 దేహేంద్రియములను స్వాధీన మందుంచుట, 4 దైవారాధన, 5 గురుభక్తి, 6 ద్వంద్వముల సహనము, 7. సత్య వాక్యము, 8 బాహ్యాభ్యంతరశుచి, 9 వ్రతములు సల్పుట 10 ఇతరుల సొమ్ము నపహరింపకుండుట అను నీ పది ధర్మములు గృహస్థునకు శ్రేయోదాయకములు, మోక్షప్రదములు ఇట్టి ధర్మగుణములు గలవారు జనకుడు, శిఖిధ్వజుడు, చూడాలవలె నుండి జీవన్ముక్తిని పొందవచ్చును అట్లు కాని వారు ఋణత్రయమును నివృత్తి జేసికొని వానప్రస్థాశ్రమమున కేగవలయును వానప్రస్థ మనగా ఉద్యానము, తోట, ఏకాంత ప్రదేశము మొదలగు చోట్ల నుండుట.



# వానప్రస్థము

**చతుర్థమాయుషో భాగముషిత్వాஉஉద్యం గురావిహా ।**
**ద్వితీయమాయుషో భాగం కృతదారో గృహే వసేత్ ॥**

ఆర్యులు తమ ఆయుః పరిమితిలో నాల్గవ (25 సం॥) భాగమును గురుకుల వాసముచే గడిపి రెండవ ( 26 సం॥ నుండి 50 వఱకు) భాగమున గృహస్థాశ్రమము నవలంబించి గృహమున నుండవలయును

**ఏవం గృహాశ్రమే స్థిత్వా విధివత్స్నాతకో ద్విజః ।**
**వనే వసేత్తు నియతో యథావద్విజితేన్ద్రియః ॥**

విద్యావ్రత స్నాతకుడగు విప్రుడిత్తెఱగున గృహస్థాశ్రమమును గడిపి నియమములను గొని, శాస్త్ర విధిచొప్పున జితేన్ద్రియుడై వనమున వానప్రస్థాశ్రమమున నుండవలయును

నూరు సంవత్సరముల ఆయుఃపరిమితి పూర్వము ఏర్పడినది ఇప్పుడు 80 సంవత్సరములు కొందఱికి, కొందఱికి 60 సంవత్సరములు జరుగుచున్నవి వనమునందు 25 సంవత్సరములు అవసరములు గావు 12 గాని, 8 గాని, 4 గాని సంవత్సరములు చాలును గృహస్థాశ్రమములో నుండినప్పుడు అంతః కరణములో నుండిన విషయమాలిన్యము నశించుట కొఱకు వనమున తపమొనరించ వలయును అందువలన చిత్తము శుద్ధమగును. బ్రహ్మధ్యానార్హత గలుగును

గ్రంథాన్తరము :-

**యథా చ మలినే వస్త్రే రంగః శుభతరో నహి ।**
**క్షాళనే హి కృతే శుద్ధే సర్వో రంగః ప్రసజ్జ తే ॥**

ఏలాగున పొగ మొదలగు మాలిన్యము గల వస్త్రమునకు రంగువేసిన శుద్ధముగా పట్టువడదో, అట్టి వస్త్రమును శుద్ధముగా ఉతికిన నే విధమగు

రంగుగాని యేలాగున పట్టుకొనునో, ఆలాగున వనమున తపమాచరించి హృదయ మాలిన్యము నశించిన పిమ్మటనే బ్రహ్మజ్ఞానావగాహనమునకు తగిన శుద్ధమగు బుద్ధి యేర్పడును

**తపసో న పరం కించిత్ తపో హి మహతాం ధనమ్ ।**
**తపసా ప్రాప్యతే సర్వం తపోయోగ్యోఽసి పుత్రక ! ॥**

తపమున కన్న శ్రేష్ఠనుయినది మఱియొకటి లేదు మహనీయుల ధనము తపస్సే తపస్సు వలననే సమస్తము ప్రాప్తమగుచున్నది అందుచే ఓ కుమారుడా! నీవు తపమొనర్చుటకు యోగ్యుడుగా అగుచున్నావు

**తపసో హి వినా నాస్తి సిద్ధిః కుత్రాపి శోభతే ।**
**సర్వాసాం కర్మసిద్ధీనాం మూలం హి తప ఉచ్యతే ॥**

తపస్సు లేకయే సిద్ధియు నెచ్చటను ప్రకాశించుట లేదు సర్వానుష్ఠాన సిద్ధులకును తపస్సే మూలమని ఋషులచే చెప్పబడెను

**సర్వపాపేషు నష్టేషు బుద్ధిర్భవతి నిర్మలా ।**
**సైవ బుద్ధిస్సమాఖ్యాతా జ్ఞానశబ్దేన సూరిభిః॥**

తపస్సుచే సర్వపాపములు నశించునప్పుడు బుద్ధి మిక్కిలి నిర్మలతను పొందును అట్టి నిర్మలతయు, ఏకాగ్రతయు గల బుద్ధి జ్ఞానమును ధరించుటకు సమర్థత గలది యగును అని ఋషులు చెప్పిరి

ఇక మనుస్మృతిని అనుసన్ధించెదను అందు వానప్రస్థమునకు కాలము నిర్ణయించబడియున్నది

**గృహస్థస్తు యదా పశ్యేద్వలీపలితమాత్మనః ।**
**అపత్యస్యైవ చాపత్యం తదాఽరణ్యం సమాశ్రయేత్ ॥**

ఎప్పుడు గృహస్థుడు తన మోమున ముడుతలను, శిరమున నెఱను జూచునో, ఎప్పుడు పుత్రునికి పుత్రుని పుట్టుకను జూచునో, ఆ వెంటనే గృహస్థాశ్రమము వీడి వానప్రస్థాశ్రమ మూని యరణ్యమునకు బోవలయును

గృహస్థాశ్రమము పూనినను ఎప్పుడు వైరాగ్యము గలుగునో అప్పుడే వనమున కేగుట యుత్తమ మగును పుత్రుని కనిన తర్వాత వనమున కేగుట మధ్యమ మగును పుత్రున కైనను, పుత్రిక కైనను పుత్రుడు గలిగిన (పౌత్రు డేర్పడిన) తర్వాత వానప్రస్థమును పొందుట కనిష్ఠ మగును అటు తర్వాత గూడ గృహమున నుండెనేని అది అధర్మ మగును

**సంత్యజ్య గ్రామ్యమాహారం సర్వం చైవ పరిచ్ఛదమ్ ।**
**పుత్రేషు భార్యాం నిక్షిప్య వనం గచ్ఛేత్సహైవ వా ॥**

సామాన్యముగా గృహస్థాశ్రమములో భుజించెడు కట్వామ్ల లవణాది ఆహారములను మాని కందమూల ఫలములను ఆహారముగ గైకొనుచు పరిజనము నంతటిని వీడి భార్యను పుత్రుల యధీనతలో వదలిగాని, ఆమె కిష్టమున్నచో నామెతోగూడ గాని వనమునకు పోవలయును

బ్రహ్మచర్యవ్రతము అవలంబించుటకును, వనములో దొరకు ఆహారముల భుజించుటకును, నారవస్త్రము మొదలగు వానిని ధరించుటకును, పర్ణశాలలో నివసించుటకును, శీతోష్ణాది ద్వంద్వములను సహించుటకును, శక్తిగలదై యుండినచో భార్యను గూడ వానప్రస్థమునకు తీసికొనిపోవచ్చును గృహము వీడి వనము ప్రవేశించిన మరల గృహ సంబంధములగు ఏ సంకల్పములు గలుగని స్థితిలోనికి మనస్సు రావలయును నీవారధాన్యాన్నమును గోక్షీరమును వనవాసులు భుజింపనగును

**మున్యన్నైర్వివిధై ర్మేధ్యై శ్శాకమూలఫలేన వా ।**
**ఏతానేవ మహాయజ్ఞాన్ నిర్వపేద్విధిపూర్వకమ్ ॥**

నివ్వరి ధాన్యము మొదలగు పలు తెఱంగులగు పవిత్రములయిన మునుల ఆహార పదార్థములచేతను, అరణ్యముననే దొఱకు శాకములచేతను, కందమూల ఫలముల చేతను తొల్లి గృహస్థునికి విహితములగు పంచమహాయజ్ఞములను శాస్త్రవిధి చొప్పున నాచరింపవలయును

వసీత చర్మచీరం వా సాయం స్నాయాత్ప్రగే తథా ।
జటాశ్చ బిభృయాన్నిత్యం శ్మశ్రులోమనఖాని చ ॥

జింక మొదలగు జంతువుల చర్మములను గాని, నారబట్టలను గాని ధరింప వలయును తెల్లవారుజామునను సాయంకాలమునను స్నానము చేయవలయును జడలను, గడ్డము, మీసములను, రోమములను, గోళ్లను ధరింపవలయును

యద్భక్ష్యం స్యాత్తతో దద్యాద్బలిం భిక్షాం చ శక్తితః ।
అమ్మూలఫలభిక్షాభిరర్చయేదాశ్రమాగతాన్ ॥

తానేది భుజించునో ఆ పదార్థముతోనే బలియు (పూజయు), వైశ్వదేవము, నిత్యశ్రాద్ధము జేయవలయును తన యాశ్రమమునకు వచ్చిన వారిని జలము, దుంపలు, పండ్లు అను భిక్షతోనే సత్కరింపవలయును

స్వాధ్యాయే నిత్యయుక్తస్స్యాద్దాంతో మైత్రస్సమాహితః ।
దాతా నిత్యమనాదాతా సర్వభూతానుకంపకః ॥

వేదాధ్యయనమునం దెల్లప్పుడాసక్తి గలవాడును, ఎండ, వాన, చలి మొదలగునవి ఓర్చుకొనువాడును, అందఱకు మేలొనర్చువాడును, మనస్సును వశపరుచుకొన్న వాడును, విడువని దాతయు, ఒరులకడ నుండి ప్రతిగ్రహమును చేయని వాడును, సకల జీవము లందు దయగలవాడును నై యుండవలయును

తాపసేష్వేవ విప్రేషు యాత్రికం భైక్షమాహరేత్ ।
గృహమేధిషు చాన్యేషు ద్విజేషు వనవాసిషు ॥

తాపసులగు విప్రుల నుండియే జీవధారణమునకు వలసిన యాహారములను భిక్ష గైకొనవలయును అట్టివారు లేని చోట నితరులయిన వనవాసులగు గృహస్థులకడ నుండియు భిక్షగైకొనవచ్చును.

గ్రామాదాహృత్య వాఽశ్నీయా దష్టౌ గ్రాసాన్ వనే వసన్ ।
ప్రతిగృహ్యా పుటేనైవ పాణినా శకలేన వా ॥

అట్టివారు కూడ లభింపనప్పుడు గ్రామము నుండియైనను నెనిమిది

ముద్దలను ఆకులోగాని, మూకుటి పెంకులో గాని, దోసిలితో గాని తెచ్చుకొని తాను వనవాసియై భుజింపవలయును

**ఏతాశ్చాన్యాశ్చ సేవేత దీక్షా విప్రో వనే వసన్ ।**
**వివిధాశ్చౌపనిషదీరాత్మసంసిద్ధయే శ్రుతీ: ॥**

వానప్రస్థుడు ఈ నియమములను, నితరములగు కొన్ని వానప్రస్థ శాస్త్రమున జెప్పబడిన నియమములను నభ్యసించుచు, ఉపనిషత్తులందు జెప్పబడిన బ్రహ్మప్రతిపాదకము లయిన వాక్యముల నన్నిటిని పరబ్రహ్మప్రాప్తికై పలుమాఱు పఠించుచు వాని యర్థములను తెలిసికొనుచుండవలయును

**ఋషిభిర్బ్రాహ్మణైశ్చైవ గృహస్థైరేవ సేవితా: ।**
**విద్యాతపో వివృద్ధ్యర్థం శరీరస్య చ శుద్ధయే ॥**

ఏలయన ఋషులను, బ్రహ్మసాక్షాత్కారమునొందిన యతులును, గృహస్థులును తమకు నద్వైత జ్ఞాన ధర్మ మభివృద్ధి యగుటకై యుపనిషత్తులలోని వాక్యములను మననము చేసిరి శరీరేంద్రియముల శుద్ధి కొఱకును ఇట్లు చేసిరి. కావున వానప్రస్థు లిటుల చేయుట యుత్తమము

**ఆసాం మహర్షిచర్యాణాం త్యక్త్వాఽన్యతమయా తనుమ్ ।**
**వీతశోకభయో విప్రో బ్రహ్మలోకే మహీయతే ॥**

ఈ మున్ను చెప్పిన మహర్షి చర్యలలో నొక్క దానిని అనుష్ఠించి దేహమును పరిత్యజించు ఆర్యుండు భయదుఃఖములను బాసినవాడై బ్రహ్మలోకమున పూజ్యుడగుచున్నాడు

**యధోక్తాన్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమ: ।**
**ఆత్మజ్ఞానే శమే చ స్యాద్వేదాభ్యాసే చ యత్నవాన్ ॥**

ఆర్యోత్తముడు శాస్త్రవిహితములగు నగ్నిహోత్రాదికర్మలను పరిత్యజించి యైనను పరమాత్మ చింతనము, ఇంద్రియ జయము, ప్రణవ జపము, ఉపనిషదాది వేదపఠనములయందు ప్రయత్నపరుడై యుండవలయును

**జపేచ్చ ప్రణవం నిత్యం జితాత్మా విజితేన్ద్రియః ।**
**పఠేదుపనిషద్వాక్యం వేదాన్తార్థాంశ్చ చిన్తయేత్ ॥**

ఇంకను సంగ్రహములో సంగ్రహించి తెల్పబడుచున్నది ఇన్ద్రియ నిగ్రహము గలవాడై, ఆత్మ నియమము గలవాడై, నిత్యము ప్రణవమును జపించవలయును ఉపనిషద్వాక్యములను పఠించవలయును వేదాన్తార్థములను బ్రహ్మప్రాప్తికొఱకు చింతన చేయవలయును. ఈ లాగున యావత్కాలము వ్యాస విశ్వామిత్ర మైత్రేయాదులవలె వానప్రస్థమున నుండవచ్చును అట్లు కానిచో అచ్చోటి నుండియే సన్న్యసింపవచ్చును.

**వనేషు తు విహృత్యైవం తృతీయం భాగమాయుషః ।**
**చతుర్థమాయుషో భాగం త్యక్త్వా సంగాన్పరివ్రజేత్ ॥**

ఇత్తెఱగున నాశ్రమములందు నాయువు నందలి మూడవ భాగమును గడిపి పుత్రకళత్రాది సంబంధములను దొరగి యాయువున నాల్గవ భాగమున సన్న్యాసమును స్వీకరించవలయును దీనియందు గల వానప్రస్థుని ఆహార నియమము వర్తమాన యుగములో నుండు జనులకు కొంచెము కఠినముగా కనిపించవచ్చును స్మృతికర్తలయొక్క, యోగనిష్ఠులయొక్క ఆశయము దేశకాలానుగుణముగ వర్తన గలిగి యుండుటచే నగును పూర్వకాలమున నుండిన ఋషుల యొక్క మానసిక కాయికములకును వర్తమాన యుగములో నుండు శారీర మానసేన్ద్రియములకును చాల మార్పు గలదు కావున ప్రస్తుత స్థితి ననుసరించి వనము అనిన విశ్రాన్తిగల ఉద్యానవనము, తోట, ఏకాన్త ప్రదేశమును అర్థము గ్రహించిన చాలును ఆలాగున కందపక్వఫలములను శుద్ధ మగు సాత్త్వికాన్నాహారాదులు అని గ్రహించిన సరిపోవును



# సతీవ్రత ధర్మము

## (ఏకపత్నీ వ్రత ధర్మము)

పురా చ నైమిశారణ్యే పుణ్యస్సూతో జగాద యమ్ ।
లోకానాం చ హితార్థాయైవ పతిధర్మం బ్రవీమి తమ్ ॥ 1

పూర్వకాలమున నైమిశారణ్యమునందు పూజ్యుండగు సూతమహర్షి లోకహితము కొఱకై ఏ పతిధర్మమును చెప్పెనో ఆ పతి ధర్మమునే చెప్పుచున్నాను

ప్రభుభక్తిం స్థాపయితుం ప్రజాసు చ ప్రభుర్యథా ।
స్వానుష్ఠానేవ యతతే తద్వత్పత్న్యాం పతిర్భవేత్ ॥ 2

రాజేవిధమున ప్రజలయందు ప్రభుభక్తిని స్థాపించుటకు తన మంచి నడవడికచేత ప్రయత్నించుచున్నాడో, గురువు శిష్యులకు తన యందు భక్తి గలుగుటకు అప్రమత్తుడై ప్రవర్తించు చున్నాడో, ఆలాగుననే భార్యకు తనయందు భక్తి గలుగుటకు భర్త జాగరూకుడై ప్రవర్తించవలయును

రఘూద్వహే మైథిలరాజపుత్ర్యా నలే చ భైమ్యాః పతిభక్తిసిద్ధౌ ।
త్రిశంకుజే చంద్రమతీ సుతన్వ్యా స్తద్భూమిభృద్వర్తనమేవ హేతుః ॥ 3

శ్రీరామునియందు జానకీ దేవికి, నలునియందు దమయంతికి, హరిశ్చంద్రుని యందు చంద్రమతీదేవికి భక్తి గల్గుటకు శ్రీరామ నలహరిశ్చంద్ర నృపతుల యొక్క నడవడికయే కారణము

మనోవాక్కాయ కరణైః పరనారీస్పృహాం వినా ।
స్వపత్నీగమనం ధర్మ ఇతి వ్యాసోఽవదత్పురా ॥ 4

మనోవాక్కాయ కరణములచేత పరస్త్రీల యందాశను వదలి స్వభార్యాగమనమే పరమధర్మమని వ్యాసుడు పూర్వము పలికెను

మాతృవత్పరదారాంశ్చ పరద్రవ్యాణి లోష్టవత్ ।
ఆత్మవత్సర్వభూతాని పశ్యేదేవం పతిస్సదా ॥ 5

భర్త యితరుల భార్యలను తల్లుల వలెను, ఇతరుల సొత్తులను మట్టివలెను, సర్వభూతములను తనవలెను ఎల్లప్పుడును చూడవలయును దీనికన్న పవిత్ర ధర్మమును ఏమి చెప్పగలరు?

దారాణాం దేహార్ధం పత్యుస్స్యాత్తథైవ పత్యుః కళత్రస్య ।
సృష్ట్యాదౌ పరమేష్ఠీ జగాద తస్మాదతంద్రిణౌ స్యాతామ్ ॥ 6

భార్య యొక్క దేహార్ధము భర్తదనియు, భర్త యొక్క దేహార్ధము భార్యదనియు బ్రహ్మదేవుడు సృష్ట్యారంభముననే చెప్పెను కాన దంపతులు కడు జాగ్రత్త గలవారలై మెలంగ వలయును

ఆచారం పత్యురుద్దిశ్య సతీ వర్తేత సర్వదా ।
తస్మాత్పతిర్జాగరూకో భవేదత్ర న సంశయః ॥ 7

భార్య సర్వకాలము భర్త యొక్క నడవడిని ఉద్దేశించియే (అనుసరించియే) ప్రవర్తించ వలసియున్నది కావున భర్త తన నడవడికయందు కడుజాగరూకుడై మెలంగవలయును ఏలన భర్త అధికుడగుట చేత

స్త్రియోஉబలాస్సంకల్పాః భర్త్రధీనాశ్చ తాను చేత్ ।
లోపో జాయేత తం సోఢుం సంస్కర్తుం పతిరర్హతి ॥ 8

స్త్రీలు అబలలుగను, ఎక్కువ సంకల్పము గలవారుగను, భర్తకు స్వాధీనలైన వారుగను నున్నారు. కాబట్టి వారియందు లోపమేదైన గలిగిన భర్త సహించుకొని సంస్కరించుటకు నర్హుడగు చున్నాడు దీనిని అర్జునుడు గీత యందు 'ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుం' అని వక్కాణించి యున్నాడు

వర్షాతపౌ చేద్భవతస్సమౌ యథా
సస్యం స్వపత్యం సమధీయుజస్తథా ।
జాయేత జాయాపతియుగ్మకస్య వా
తద్వైపరీత్యే ఫలవిఘ్నకో భవేత్ ॥ 9

ఎండవానలు సమముగా నున్న సస్యము లెట్లు అభివృద్ధి జెందునో,

అవ్విధముననే సమానబుద్ధి గల దంపతులకు శ్రేష్ఠమైన యపత్యము (సంతానము) కలుగును అట్లు గాక వర్షాతపములు గాని దంపతులుగాని విషమముగా ప్రవర్తించిన సస్యములును సంతానమును చెడిపోవును

**వృషభో వృషభేన సంయుతో**
**శకటం భారభృతం యధా తటమ్ ।**
**సమజాతి సమాన భావజం**
**పతియుగ్మం భవనావమానయేత్ ॥ 10**

వృషభముతో జతపఱచి కట్టిన వృషభ మెవ్విధంబున భారభృతంబగు రధంబును సుఖముగా గమ్యస్థానమును చేర్చుచున్నదో, అవ్విధముననే సమగుణ సమానాభిప్రాయములు గల భార్యాభర్తలు సంసార రధమును గమ్యస్థానమును సుఖముగా జేర్చుదురు భిన్న జాతిగల మహిషముతో వృషభమును, అశ్వముతో వృషభమును కట్టిన ఏ విధమున బండిని లాగవో, అట్లే భిన్నగుణ భిన్నాభి ప్రాయము గల దమ్పతులు సంసారశకటమును గమ్యస్థానమును జేర్పజాలరు అట్టి వారికి సంసారము భారమే

**లోకే చ ధూమశకటస్సమవహ్నినీర**
**శక్త్యుద్గతో నయతి గమ్యపదం జనాంశ్చ ।**
**స్వస్థాంస్తథైవ సమభావయుతం హి ద్వన్ద్వం**
**తత్ ప్రాపయేత్స్వగృహగానఖిలాన్మనుష్యాన్ ॥ 11**

లోకమున సమానమైన జలాగ్నుల శక్తిచే నడుచు రైలు బండి యెట్లు తన యందలి ప్రజలనందగిని వారి వారి గమ్యస్థానములకు చేర్చుచున్నదో, అవ్విధముననే సమాన భావముతో కూడుకొనిన దంపతులు తమ గృహమున గలవారి నందరిని వారి గమ్యస్థానమునకు చేర్చుదురు

**చంద్రార్క దేవౌ స్వగతిం ప్రయాతో**
**లోకాస్తతస్సాధు భవన్తి తద్వత్ ।**

**జాయాపతీ స్వీయపథేన యాతౌ**
**శ్రేష్ఠశ్చ నోచేద్విషమో భవస్సః ॥ 12**

సూర్య చన్ద్రులు వారి మార్గము ననుసరించి చక్కగా పోవుచున్నందువలననే లోకము లన్నియు చక్కగా నున్నవి భార్యాభర్త లీరీతిగనే వారి మార్గము ననుసరించియే నడిచిన సంసారము శ్రేష్ఠమగును అట్లుగాని యెడల సంసారము కష్టదాయకమే యగును (నిస్సారమే యగును)

**యథా జలం జలేనైక్యం తద్వన్నైతి ఘృతం జలే ।**
**న భావౌ దంపతీ చైక్యమేత్య యాతస్సుఖం భృశమ్ ॥ 13**

నీరు నీటిలో ఏ విధమున నైక్యమగుచున్నదో, ఆవిధమున నెయ్యి నీటిలో ఐక్యము గాదు ఆవిధముననే సమాన భావముగల దంపతులు ఐక్యముగా నుందురు, సుఖము నొందుదురు భిన్నభావముగల దంపతులు తైలజలముల వలె నైక్యమై యుండరు. సుఖమును పొందరు

**క్రమేణ యాతో యది ప్రాణ వాయు రపానవాయు స్సుఖినశ్చ జీవాః ।**
**తథా లభేతాం భువి దంపతీ చ సుఖం మహన్నో యది దుఃఖమేవ॥14**

ప్రాణాపాన వాయువులు క్రమముగా నడచుచుండిన ప్రాణులన్నియు సుఖముగా నుండును ఆవిధముననే భూలోకమున భార్యాభర్తలు క్రమముగా ప్రవర్తించిన గొప్ప సుఖము నొందుదురు లేని యెడల కష్టముల బడుదురు

**పతివ్రతానాం చరితం పఠన్త్యః పత్నీవ్రతానాం చరితం పఠన్తః ।**
**తథా చరిత్వా సుగతిం ప్రయాన్తు భవేగతాస్తేఽపి యథాఽమ్బుపద్మే॥15**

స్త్రీలు పతివ్రతల చరితమును జదువుచు, పురుషులు ఏకపత్నీవ్రతుల కథలను పఠించుచు నందలి పద్ధతి ననుసరించి ప్రవర్తించుచుండిన వారలు సంసారము నందున్న వారైనను తామరాకు నీటిలో నున్నను తడవనటుల బద్ధులుగాక ముక్తు లగుదురు "పద్మపత్ర మివాంభసా" అని గీత

సంసారో యది శుద్ధోఽన్యత్పూతం స్యాదాశ్రమత్రయమ్ ।
జాయన్తేఽత్ర సుపుత్రాశ్చ దేశరక్షణతత్పరాః ॥ 16

గృహస్థాశ్రమము పరిశుద్ధమైనచో తక్కిన బ్రహ్మచర్య వానప్రస్థ సన్న్యాసములను ఆశ్రమ త్రయము పవిత్ర మగుచున్నది. అట్టి సంసారమునందు తనను, మాతాపితరులను దేశమును ఉద్ధరించెడి బిడ్డలుద్భవింతురు

సదాచారే వ్రతే త్యాగే తపో ధర్మకలానుచ ।
దమ్పతీ చ మిథ శ్శ్రేష్ఠౌ వర్తేయాతాం దినే దినే ॥ 17

జాయాపతులు సదాచారమునందును, వ్రతమునందును, త్యాగము నందును, తపోధర్మవిద్యలయందును పరస్పరము మించిన వారుగా ననుదినము ప్రవర్తించవలయును

తే గృహే నివసన్తోఽపి మోక్షం యాన్తి న సంశయః ।
అరణ్యస్థో తపస్వీ చ సన్న్యాసీ యాదృశం వ్రజేత్॥ 18

భార్యా భర్తలు పై జెప్పిన విధమున ప్రవర్తించుచున్న యెడల అరణ్యము నందు నివసించు తపస్వియు, సన్న్యాసియు నెట్టి మోక్షమును పొందుచున్నారో అట్టి ముక్తిని పొందుదురు దీనియందు సంశయము లేదు

ఉద్వాహకాలే చ పతిస్స్వనారీ తుల్యార్థభాగాపురుషార్థవర్గే ।
ఇత్యగ్ని దేవద్విజసన్నిధానే ఉక్త్వా కథం తామబలాం త్యజేత్సః ॥19

భర్త తన పరిణయ కాలమునందు తన భార్య ధర్మార్థకామమోక్షములందు సమాన భాగస్థురాలని దేవబ్రాహ్మణాగ్నుల సమక్షమున జెప్పి అబలయగు నామెను నే విధమున విడువవచ్చును? అనగా విడువరాదని భావము

ఏవం చ స్వగృహే స్థిత్వా గృహభారం విధాయ చ ।
యుక్తేషు జమ్పతీ యాతాం తపః కర్తుం వనం ప్రతి ॥ 20

తపః కృత్వాఽన్త్య కాలే తు వ్రజేతాం దమ్పతీ భువి ।
మోక్ష నిర్వాణమిత్యేవం భావయుక్తౌ చ స్తాం సదా ॥ 21

పై జెప్పిన రీతిగా గృహస్థాశ్రమము నిర్వర్తించి, తగిన వారి యందు గృహభారముంచి భార్యాభర్తలు తపము చేయుటకు అరణ్యమునకు వెళ్ళవలయును, అట్లు తపమాచరించి మోక్షము పొందవలయునను భావముతో భార్యాభర్త లెల్లప్పుడును జీవిత యాత్రను సుమంగళముగ గడుపవలయును



# పరమరహస్యము

ఈఉపాధి పాదచారియై తీర్థయాత్ర జేయుచు బృన్దావన ప్రాన్తములో సంచరించు చున్నప్పుడు అన్నిచోట్ల ముఖ్యముగ మధుర, బృన్దావన, గోకుల, గోవర్ధనాదు లంతటను 'రాధాకృష్ణా' అనుధ్వనులే సర్వకాల సర్వావస్థల యందును వినబడుచుండెను. అనగా భక్తి పరవశులై యుండు పరమ సాధువులును, పరమయోగులును, పరివ్రాజకులగు యతి వర్యులును, నైష్ఠికబ్రహ్మచారులగు బ్రహ్మనిష్ఠులును, గొప్ప తపోవంతులును, తపస్వినులును, మునులకు సదృశులగు మహాత్ములును పై జెప్పినట్లు శ్రీరాధాకృష్ణా! అని జపించుచు, స్మరించుచు, ఉచ్చరించుచుండిరి అదే ప్రకారము అయోధ్యలో ఎచ్చట జూచినను ఎల్లప్పుడును 'సీతారాం సీతారాం' అను పవిత్ర వాక్యములే వినవచ్చు చుండెను అచ్చటను పై జెప్పిన వారివలె తాపసులును, యతీశ్వరులును, ఋషులవంటి వారును గలరు అదే రీతిగ శ్రీకాశిలోను రాత్రింబవళ్ళు ' పార్వతీపతే హరహర మహాదేవ శంభో' అను పావనశబ్దమే వినబడుచుండెను

ఇట్లు ఉచ్చరించుచుండు వారిలో అనేకులు పరమ వైరాగ్యము గలవారుగను, సంసారమాలిన్యము తగులనివారుగ నుండిరి అంతేగాక సంసారము నిస్సారమనియు, సంసార కూపమనియు, సంసార సాగరమనియు, సంసారారణ్యమనియు, సంసార పాశ మనియు, సంసారజాల మనియు (వల యనియు), దానిలో నుండి త్వరలో విముక్తులు కండు అనియు జనులకు బోధించుచుందురు ఇప్పుడును లోకములోని పరమభక్తులు మహావైరాగ్య నిధులు గూడ ఆలాగున జెప్పుచుందురు

అయితే వారిలో గల యోగులు గాని, విరక్తులుగాని, సన్న్యాసులుగాని, యేదైవము నుపాసించెదరు? ఆదేవతలు సంసారమును దూషించువారా! సంసారమును త్యజించినవారా! ఇప్పుడును సంసారములో నుండువారా! లేక గృహస్థాశ్రమము నుపేక్షించిన వారా! అంతమాత్రమైన పై జెప్పిన సాధువులు యోచించుకొనుట లేదు గృహస్థాశ్రమము అంత పవిత్రము గానిచో ఆ దేవతలందరు ఏల గృహస్థాశ్రమము నంగీకరింపవలయును? ఒక్కొక్క దైవమును గుఱించి యోచించుకొనుడు శ్రీ బ్రహ్మదేవుడు సత్యలోకమున సరస్వతీ దేవితో గూడి గదా యుంటున్నాడు యోగులందరు అట్టి హిరణ్యగర్భుని గదా యుపాసించుచున్నారు ఆలాగున భక్తులందఱును, మునులందఱును, విరక్తులందఱును శ్రీ మన్నారాయణమూర్తిని గదా భజించుచున్నారు ఆ విష్ణుభగవానుడు శ్రీ వైకుంఠమున శ్రీ లక్ష్మీదేవితో గూడి గదా నివాసము జేయుచున్నాడు, ఆలాగున శ్రీ పరమశివుండు కైలాసమున శ్రీ పార్వతీ దేవితో గూడి గదా యుంటున్నాడు ఈ దేవతల ధ్యానశ్లోకము లన్నిటిలోను సరస్వతితోను, లక్ష్మితోను, పార్వతితోను గూడి యున్నట్లే గనబడుచున్నది

పై జెప్పిన విరాగులు సంసారమును నిందించుటలో ఏదైన సత్యము గలదా? గృహస్థాశ్రమము అంత అపవిత్రమైనచో ఆత్రిమూర్తులు అట్టి గృహస్థాశ్రమమును సేవింతురా! ఇట్లుండగా తాముపాసించెడు ఇష్టదేవతలే గృహస్థాశ్రమములో నుండు వారై యుండగా తమకు మాత్రము ఎట్లు గృహస్థాశ్రమము దుఃఖకరముగా నుండుటకు కారణమగును? ప్రపంచములో గల సర్వమునులును, ఋషులును, ఇట్టి త్రిమూర్తులను గదా ఇష్టదైవములుగా నుపాసించుచున్నారు. దీనికన్న నిక మీకు నేమి ప్రమాణము గావలయును? సృష్టియంతయు ఈ ద్వంద్వము వలననే జరుగు చుండును కావుననే గీతలో శ్రీ కృష్ణ భగవానుడు 13 వ అధ్యాయమున ఇట్లుపదేశించినది

**యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజంగమమ్ ।**
**క్షేత్ర క్షేత్రజ్ఞసంయోగాత్ తద్విద్ధి భరతర్షభ! ॥**

ఓ అర్జునా! చరములును, అచరములును, సృష్టిలో గల సకల వస్తు సముదాయములును క్షేత్రక్షేత్రజ్ఞుల చేరిక వలననే పుట్టుచున్నవి అని తెలిసికొనుము ప్రకృతి పురుషుల సంబన్ధములు లేక యే వస్తువును కొంచెమైనను పుట్టుట లేదు

ప్రత్యక్షముగా పరిశీలించుకొనుడు ఎండ వానల వలననే సమస్త తృణాదులును ఉద్భవించుచున్నవి ఒక్క యెండ మాత్రముచే గాని, లేక వాన మాత్రముచే గాని ఒక తృణమైనను ఆవిర్భవించజాలదు ఆలాగున ఆకాశ భూముల స్థితియు గ్రహించు కొనవలయును ఆకాశము పురుషుడనియు, భూమి స్త్రీ యనియు తెలియనగును ఆలాగున నిప్పును, నీరును రెండు లేనిచో ఒక్క ప్రాణియైన బ్రతుక గల్గునా? అగ్ని పురుష శబ్దమని , అప్పు (జలము) స్త్రీ శబ్దమని శబ్ద శాస్త్ర మెఱింగిన వారందఱికి విదితమే ఆలాగున ప్రాణాపానముల రెంటివలననే ప్రాణికోట్లన్నియు జీవించుచున్నవి ఒక్క ప్రాణవాయువు మాత్రము చేతగాని, ఒక్క అపానవాయువు మాత్రముచే గాని ఒక ప్రాణియు జీవింప జాలదు అదే రీతిగా నిప్పు, నీళ్ళు, అను రెండింటిచేతనే సర్వ యంత్రములు నడచుచున్నవి వీనిలో నేదైన ఒక వస్తువువలన నేయింజను గాని చలింపజాలదు కావున ప్రాణికోట్ల యుత్పత్తి యంతయు ద్వంద్వముల చేతనే గల్గుచున్నది.

ఆలాగున శీతలమును గలుగజేసెడి చంద్రుని వలనను, ఉష్ణమును గలుగజేసెడి సూర్యుని వలనను నీ బ్రహ్మాండకార్యము లన్నియు జరుగుచుండగా ధర్మబద్ధమగు గృహస్థాశ్రమ దాంపత్యము ఎట్లు బన్ధమగును? ఎట్లు దోషయుక్త మగును? తాముపాసించెడు దైవములే దంపతులై యుండగా తమకు మాత్రము దాంపత్యమెటుల బన్ధమును గలుగజేయును? బన్ధములనుండి విముక్తులుగా చేసెడు దేవతలే దామ్పత్యము గలిగి గృహస్థాశ్రమము నవలంబించి యున్నారను దానినే దీనిలో గ్రహించవలయును అదేమన ఆ దేవతలవలె జనులుగూడా గృహస్థాశ్రమములో నుండిన దోషము లేదనియు, మోక్షమునకు భంగము గలుగదనియు భక్తులు తెలిసి కొనుట కొఱకే అట్లు గృహస్థాశ్రమమును గ్రహించిరి అదియునుగాక ఆ దేవతలు ఏలాగున నిస్సంగులై తమ కేర్పడిన సృష్టిస్థితి

లయములను జేయుచున్నారో, అలాగున మానవులకు ఏర్పడిన ధర్మములను వారు వారనుష్ఠించు చుండిన బన్ధము గలుగదనియు, సరిగా చేయనిచో మాత్రమే బన్ధము గలుగుననియు తెలుపుట కొఱకే ఆలాగున నున్నారు కావుననే గీతయందు మూడవ అధ్యాయమున శ్రీ కృష్ణభగావానుడు ఈలాగున తెలిపెను

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥

గుణహీనమైనను తన కేర్పడిన ధర్మము చక్కగా ఆచరింపబడిన, అది ఇతరులు ఆచరించు ధర్మముకంటె నుత్తమమైనది తన యాచరణయందు మరణము కలిగినను శ్రేయస్కరము ఇతరుల ఆచారము భయమును గలుగజేయునది మఱియు పదునెనిమిదవ అధ్యాయమున

స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరతస్సిద్ధిం యధా విన్దతి తచ్ఛృణు ॥

జనులకు ఏయే ఆశ్రమములలో ఏయే కర్మలేర్పడినవో వానిని ఆచరించుకొనియే మనుజుడు ముక్తిని పొందుచున్నాడు అయితే అసత్యము, హింస, దురాచారము వీటిని మనుష్యుల కెవరికిని ఏ శాస్త్రమును విధించి యుండలేదు ఇచ్చట స్వధర్మ శబ్దమునకు చాకలి వాడయినచో, స్త్రీల మలినకాలములో గల వస్త్రమునైనను ఉతుక వచ్చును మంగలివాడు క్షురకర్మ చేయవచ్చును పాకివారు మరుగుదొడ్డియైనను కడగవచ్చును ఇట్టి కార్యముల జేసియు శుభ్రముగా నుండి మనోనిర్మలత గలిగి బ్రహ్మవిచారము చేయవచ్చును వేదములను గూడ చదువవచ్చును

దైవముచే సృష్టింపబడిన సూర్యచంద్రాది గ్రహములు సృష్ట్యారంభము నుండి నేటి వఱకు ఒక క్షణ కాలమైనను నిలువక తమ తమ కార్యములలో సంచారమును చేయుచునే యున్నవి అందువలననే ప్రళయాది భయములు లేక భూలోకాదులు సుఖముగా నుండుటకు అవకాశ మేర్పడుచున్నది. గ్రహముల సంచారము సరిగా లేనిచో ఒక గ్రహము మఱియొక గ్రహముతో ఢీకొని లోకము

ధ్వంసమైపోగను అదియే ప్రళయము ఇప్పుడు గూడ ఎప్పుడైన గ్రహముల గతి వక్రము లగునప్పుడే అతివృష్టి, అనావృష్టి మొదలగు అరిష్టములు గలుగుచుండును అని జ్యోతిశ్శాస్త్రము ఉపదేశించుచున్నది అదెటుల ననగా నియమము లేక రైలుబండ్లు నడచుచుండిన ఒక దానితో నొకటి ఢీకొని శిథిలమైపోవును గదా కావుననే దైవాజ్ఞ ననుసరించి ప్రవర్తించిన, గృహస్థాశ్రమము బన్ధము గాదు

మఱియు ప్రతి పశుపక్ష్యాది జంతువు లన్నిటికి పుట్టుచుండు సంతానము లన్నియు స్త్రీ పురుషద్వన్ద్వములతోనే గూడియున్నవి ఇందువలనను గృహస్థాశ్రమ ధర్మము దైవసమ్మతమనియే గ్రహించుకొనవలయును విహంగవర్గములో కొన్నింటికి రెండు పిల్లలు మాత్రమే యేర్పడును వాటిలో నొకటి పోతు మఱియొకటి పెంటియు నుండును ఇది లోకమంతయు నెఱింగిన విషయమే ఇదియును గాక కొందఱు విరాగులు స్త్రీలను హీనులుగా తలంతురు అది వారి యొక్క మనఃస్థితిచే కలిగిన దోషమేగాని స్త్రీల దోషము గాదు. ఎట్లన నేత్రవ్యాధిచే ఒక వస్తువు మఱియొక విధముగా కనుబడునట్లును, రోగమువల్ల జిహ్వా దోషముచే రుచ్య పదార్థము అరుచిగా నున్నట్లు నుండును ఒక వేళ శాస్త్రములలో వైరాగ్యము గలుగుట కొరకు కొన్ని స్థలములలో స్త్రీ దూషణ కనుపించినను అదియుత్తమ స్త్రీలను గుఱించి కాదు దుష్టగుణములు గల స్త్రీలను గుఱించి మాత్రమే యని తెలియందగినది ఆలాగున శాస్త్రములలో సంసారమును గుఱించి గూడ కొన్ని స్థలములలో నిందగలదు. అదియు శుద్ధముగా, చక్కగా గృహస్థాశ్రమమున నడువజాలని వారిని గుఱించియేగాని, మఱియొకటి గాదని విజ్ఞులు తెలిసికొనియే యున్నారు.

స్త్రీలు దోషయుత లయినచో ప్రతి ప్రయోగమునందును స్త్రీ శబ్దము ముందుగాను, పురుష శబ్దము వెనుకగా నుండదు చూడుడు. తల్లి దండ్రులు, లక్ష్మీనారాయణులు, గౌరీ శంకరులు, సీతారాములు, వాణీ హిరణ్యగర్భులు ఈ లాగున ప్రయోగము లేర్పడుటకు కారణము స్త్రీ శబ్దము పవిత్ర వాచక మగుట చేతనే అని గ్రహించుకొనదగినది ఇందుచేతనే పుత్రులు మాతాపితరులకు నమస్కారము చేయు సమయములో మొదట తల్లికిని, పిమ్మట తండ్రికిని, తర్వాత

వృద్ధజనులకును నమస్కారము నొనరించవలయునని విధి యేర్పడినది మనువు చెప్పినది చూడుడు

**ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాం శతం పితా ।**
**సహస్రన్తు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే ॥**

పదుగురు ఉపాధ్యాయులకన్న ఒక వంశాచార్యుడు అధికుడు అట్టి కులగురువులు నూఱుగురికన్న ఒక తండ్రి అధికుడు అట్టి వేయి తండ్రులకన్న తల్లి అధికపూజ్యురాలు ఇదియునుగాక వేదములలో చెప్పినది జూడుడు

'మాతృమాన్ పితృమాన్ ఆచార్యవాన్ పురుషో వేద' మొదట తల్లిపేరును నిరూపించి, పిమ్మట తండ్రి యొక్కయు, గురువు యొక్కయు పేర్లు నిరూపించడమైనది ఇదియును గాక వేదమున 'మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథి దేవోభవ అని వరుసగా పవిత్రతయు, పూజ్యతయు తెలుపబడుచున్నది దీనియందు మాతృశబ్దము పూర్వము ప్రయోగించుటచే తల్లి యందు ఎంత ప్రామాణ్య బుద్ధి పుత్రులు గలిగియుండవలయునో యోచించుకొనుడు తల్లియందు అట్టి పవిత్రభావము లేని పుత్రు లెప్పటికిని ఉన్నతస్థితికి రాజాలరు

మఱియు గృహస్థుని ఇంటికి వచ్చెడు బ్రహ్మచారులు గాని, సన్న్యాసులు గాని, 'భవతి భిక్షాం దేహి' అనియే చెప్పుదురు అనగా భవతి = తల్లి వంటి పూజ్యురాలగు అమ్మా! భిక్షాం దేహి = భిక్ష నొసగుము అని చెప్పుదురే గాని పురుషులపేర్లు ఎచ్చటను వినుటలేదు కావుననే శ్రీ భాగవతమున 'పొసగ భిక్షంబు పెట్టరే పుణ్యసతులు' అని నిరూపించిరి ఈ ధర్మవాక్యము లన్నియు సంగ్రహముగా నిచ్చట నిరూపించడమైనది

ఈ పరమ రహస్యములో మఱియొక రహస్యము అదేమన, ప్రభువు యొక్క అనుగ్రహమునకు పాత్రులు గావలసిన ప్రజలు ప్రభువు యొక్క ఆజ్ఞాను వర్తులయిన మాత్రమే గదా సిద్ధించును ఆలాగున తండ్రి యొక్క కృపకు పాత్రుడు కావలసి యుండిన, తండ్రియాజ్ఞాను సారము ప్రవర్తింపవలయును గాదా! అదే

రీతిగ గురువుయొక్క కరుణకు పాత్రుడుగా వలయునని తలంచిన శిష్యుడు గురువు ఆశయము ననుసరించి అనుష్ఠింప వలయును గదా! ఆ చొప్పున పతి యొక్క ప్రీతికి పాత్రురాలు గావలయునని తలంచెడు సతీమణి పతి ఇష్టానుసారముగ నడువవలసినది గదా! ఆలాగున జగత్ప్రభువును, జగత్పతియును, జగద్గురువును, జగద్భర్తయు నగు సర్వేశ్వరుని కృపవలననే గదా మోక్షము గలుగవలసియున్నది అట్లయిన సర్వేశ్వరాశయమును కనుగొని ప్రవర్తించుట తప్ప వేఱు గతి లేదు గదా!

అది సరియయినదని నిశ్చయించుకొనిన ఈశ్వరుడు జీవకోట్ల సౌఖ్యము కొఱకును, పురోఽభివృద్ధి కొరకును ఏర్పరచిన ఈ జగత్కార్యము నభివృద్ధి పరచుటకే గదా చూడవలయును అట్లయిన గృహస్థాశ్రమము నవలంబించు టయు సంసారమును వృద్ధి పరచుటయు చేయక, జగత్సృష్టిని నశింపజేసెడి వైరాగ్యము, బ్రహ్మచర్యము, సన్న్యాసము ఎట్లు ఈశ్వరప్రీతి కరములగును? ఋషులు, మునులు, యోగులు, భక్తులు, సాధువులు, సన్న్యాసులు, సన్న్యాసినులు, తపస్వినులు, గృహస్థాశ్రమమును విడిచిపెట్టుటయు, నిందించుటయు నెట్లు సరిపోవును? అట్లుగాక ఈ జగత్సృష్టి ఈశ్వరుని కిష్టము లేదనిగాని, ఈశ్వరుడు సృష్టించలేదని గాని వీరు నిరూపించిన వీరి గృహస్థాశ్రమ దూషణము సరియగును అప్పుడు ఈశ్వరుని కిష్టమయినదని కాని, ఈశ్వరుని కిష్టమగు కార్యమునే వీరు చేయుచున్నారని కాని నమ్మవచ్చును అప్పు డీ సృష్టినెవరు గావించిరో వారిని గూడ వీరు నిరూపింప నగును అప్పుడే వీరి వాదము మనము గూడ అంగీకరింపవచ్చును

ఇదటుల నుండనిమ్ము. భగవంతుడే సాక్షాత్ రామకృష్ణాద్యవతారము లెత్తినప్పుడు గృహస్థాశ్రమ మవలంబించిరి అట్లు లేదని వీరు తెల్పవలయును అది వీరికి సాధ్యము కానిపని యనియే తలంచెద. అటుల కాకపోయినను, పోనీ, ఈ రామకృష్ణాద్యవతారపురుషులు, భగవదవతారులు కారు అనియైన ఈ వైరాగ్య పురుషులు విరాగులు విరాగిణులు మనకు ఋజువు పరచవలయును. అట్లు కానిచో ఈ సన్న్యాసులు సాధువుల వాక్యములను మనము నమ్మకూడదు.

ఇదొకటియే మనకు సాధనము "లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు" అని ఈ సన్న్యాసులు సర్వదా ఆశీర్వాదమును జేయుచుందురు జాబులు వ్రాయు నప్పుడును ఆశీస్సును పంపుచుందురు దీని యొక్క అర్థము వీరు బాగుగా గ్రహించినచో ఆలాగున జేయుదురా! దీని సారమేమన, "లోకాః- సమస్తాః- సుఖినః - భవన్తు" ప్రపంచములో గల సమస్త జీవకోట్లు ఎల్లప్పుడును సుఖరూపులై యుందురుగాక యని యర్థము ఈలాగుననే "సర్వే జనాస్సుఖినో భవన్తు" లోక శబ్దమునకు ప్రపంచమనియు, జనమనియు, చరాచర ప్రాణికోట్లనియు అర్థము గలదు మఱియు,

సర్వేఽత్ర సుఖినస్సన్తు సర్వే సన్తు నిరామయాః ।
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిద్దుఃఖమాప్నుయాత్ ॥

దీని యర్థమును పై జెప్పిన విధమే ఈ ప్రపంచములో గల చరాచర ప్రాణికోట్లన్నియు సౌఖ్యము నొందునుగాక! సర్వులును రోగరహితులై ఆరోగ్యవంతులై యుందురుగాక! సర్వజనులును శుభమును దర్శింతురుగాక! ఒక ప్రాణియైనను దుఃఖమును పొందక యుండునుగాక! ఇట్టి మంగళ వాక్యములగు ఆశీర్వాదములను ఏల చేయవలయును? భగవంతుడు సృష్టించిన యీ లోకము, లోకనివాసులగు ప్రాణులును ఎల్లప్పుడు శుభములను (మంగళములను) గల్గియుండును గాత! అని భావము ఇదే భగవదాశయము అది వారికి తెలిసియో తెలియకయో లోపల నుండు అంతరాత్మ పలుకుచున్నది కావున నిదే సత్యము ఈలాటి అర్థములను తెలుపు ఆశీస్సులు అనేకములు వేదములలో గలవు ఋషులును ఆలాగుననే వచించిరి వచించుచున్నారు



# పరమ గోప్యము

ఇదివరలో చెప్పిన గృహస్థ మాహాత్మ్యమును గురించిన వాక్యములను విని గృహస్థాశ్రమస్థులు ఆనందపరవశులై యుండువచ్చును దానిచే తమ పని సంపూర్ణ మైనదని తలంచి యూరకుండరాదు ఏలన, గృహస్థాశ్రమమున కావల నింకను రెండాశ్రమములను దాటినప్పుడే తమ పని పూర్తియైనదని గ్రహించుకొన వలయును కావున గీతలో ఇట్లుపదేశించిరి

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥ (5-22)**

విషయేన్ద్రియ సంయోగము వలన బుట్టిన సుఖానుభవములు దుఃఖమునకు కారణము లైనవనియు, ఆద్యంతములు గలవి యనియు తలంచి నిర్మలబుద్ధి గలవాడు విషయ సుఖములయందు ఆసక్తి గలవాడై యుండడు గృహస్థాశ్రమములో నుండి అనుభవించెడు సౌఖ్యము లన్నియు ఇంద్రియ జన్యము లయినవి అది నిజమగు సౌఖ్యము గాదు అదియునుగాక గృహస్థాశ్రమములో జేయు యజ్ఞదానాది క్రియలన్నియు పుణ్యలోకమును గలుగజేయు చున్నవిగా నుంటున్నవి దాని వలన గల్గెడి స్వర్గాది లోకముల నుండి ఆ పుణ్యము నశించిన వెంటనే మరల మానవలోకమున పుట్టవలసిన వారై యున్నారు కావుననే గీతాచార్యుడు "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" అని యువదేశించినాడు. అందువలననే రెండవ అధ్యాయమున ఇట్లు తెలుపబడెను

**యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః ।**
**వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతి వాదినః ॥ (2-42)**

ఓ యర్జునా! ఆత్మజ్ఞానము లేనివారు వేదములో గల అర్థవాద వాక్యముల యందు విశ్వాసము గలవారై ఫలములను గలుగజేయని వట్టి పుష్పములవంటి వాక్యములను చెప్పువారై విషయాసక్తి గలవారై యుండువారి మాటలను విని చెడిపోకుము

అట్టి వారిని శ్రీకృష్ణ భగవానుడు అవిపశ్చితులని వర్ణించెను అనగా విజ్ఞానము లేనివారని అర్థము కావున మనువు జెప్పేలాగున ఋణత్రయమును దీర్చుకొని, గృహస్థుడు వానప్రస్థాశ్రమమునకు జేరవలయును

మహర్షి పితృదేవానాం గత్వాఽఽనృణ్యం యథావిధి ।
పుత్రే సర్వం సమాసజ్య వసే న్మాధ్యస్థమాశ్రితః ॥

గృహస్థుడు వేదాధ్యయనము చేత ఋషుల ఋణమును, పుత్ర సంతతిం బడయుటచే పితృఋణమును, యజ్ఞములచే దేవతల ఋణమును శాస్త్ర ప్రకారముగ దీర్చికొని యోగ్యుడగు పుత్రునియందు కుంటుంబ భారము నెల్ల నుంచి ఏకాంతమునకు వెళ్ళి బ్రహ్మచింతనచే మోక్షము నొందవలయును అచ్చట కొంతకాలముండి తపోధ్యాన యోగాదులచే ఆత్మశుద్ధి జేసికొని నిర్విషయస్థితి గలుగునప్పుడు సన్న్యసించవలయును ఒకవేళ వనవాసము వరకు నిర్విషయస్థితి గలిగిన భార్య యుండిన రావచ్చును ఆవల నుండి సన్న్యాసాశ్రమమున భార్య రాకూడదు తురీయాశ్రమములో మాత్రమే నాల్గాశ్రమముల పూర్తి యగును అచ్చోటనే ఉపనిషత్ప్రతిపాదితమగు బ్రహ్మమును గుఱించిన చిన్తన పూర్తి యగును అత్తఱి ఓంకార జపము, ఉపనిషత్పఠనమును ముఖ్యములు అదే వేదము యొక్క అన్త్యమగు వేదాంతము తక్కిన మూడాశ్రమములలోను వేదములను గురించిన కర్మభాగములే యెక్కువగా ప్రతిపాదింపబడెను

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున! ।
నిర్ద్వన్ద్వో నిత్య సత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ (2-44)

ఓ అర్జునా! వేదములు త్రిగుణాత్మకములగు సంసార విషయములను తెలుపునవిగా నున్నవి ఆ కారణము వలన నీవు త్రిగుణాత్మకములగు విషయములయందు వాంఛ వదలిన వాడవుగను, కేవల సత్త్వగుణ విశిష్టుడవుగను, సుఖదుఃఖాది ద్వన్ద్వముల సహించు వాడవుగను యోగక్షేమముల సహితము కోరని వాడవుగను, ఆత్మజ్ఞానము గలవాడవుగను అగుము అని తెలుపబడినది బ్రహ్మ చర్యాది వానప్రస్థము వఱకు అనుష్ఠించిన కర్మము లన్నియు, తపస్సు లన్నియు, యోగము లన్నియు ఆత్మశుద్ధి గలుగుటకొఱకును, హృదయ నిర్మల

స్థితియు, ఇన్ద్రియముల శుద్ధియు గలుగుట కొఱకు మాత్రమని మఱువగూడదు అదియును గాక పై జెప్పిన ఆశ్రమ త్రయమున జేయుకార్యము లన్నియు దైవమును గురించియు, జీవుని గురించియు, అంతఃకరణ శుద్ధిని గురించియు, పాపక్షయమును గురించియు, పుణ్యప్రాప్తిని గురించియు మాత్రమేయని గ్రహించుకొనవలయును ఈ తురీయాశ్రమము మాత్రమే మహావాక్యోపదేశమును గలుగజేయును అది జీవేశ్వరుల ఏకత్వమును గలుగజేయును కావుననే గాయత్రి వేదమాతయనియు, మహావాక్యము తండ్రి యనియు ఓంకారము తాత యనియు ఉపదేశించిరి.

> గాయత్రీ వేదమాతా స్యాన్మహావాక్యం పితా భవేత్ ।
> ఓంకార స్సర్వమూలస్స్యాత్స ఏవ చ పితామహః ॥

దీని యర్థము పైజెప్పబడినదే వానప్రస్థము వరకు శుద్ధమాయగాని, మలిన మాయగాని ఆత్మతో గూడియుండును కావుననే ఉపాధిద్వయ రహితమగు పూర్ణాత్మభావము అంత్యాశ్రమముననే గలుగునని వేదాంత ముపదేశించినది అయితే యిది క్రమ పద్ధతిని అనుసరించుచు ఉంటున్నది ముముక్షువుల యొక్క పూర్వపుణ్య పరిపాకము వలన బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థములందుగాని ఆవరణము తొలగెనేని జీవన్ముక్తి గలుగవచ్చును. అయితే యిది యందఱికిని గలుగునది కాదు. కాకతాళీయ న్యాయమనుసరించి ఒకానొకనికి మాత్రమే సిద్ధించును అందరికిని సిద్ధించెడు విషయమున చతురాశ్రమములు ఏర్పడుటకే అవకాశము లేదు ఒకవేళ బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థాశ్రమములలో నెచ్చటనైన ఆత్మజ్ఞానము గలిగినచో, అది జన్మాంతర ములో జేసిన అనుష్ఠాన బలము వలననే గలిగినట్లు శాస్త్రముపదేశించుచున్నది బ్రహ్మచర్య, గృహస్థాశ్రమ వానప్రస్థములందును అధ్యయన, యజ్ఞ తపశ్చర్యాదులగు కర్మకలాపము లున్నవి అందువల్ల నిస్సంకల్పత్వ, నిర్విషయత్వ, స్థితి గలుగదు.

కావుననే సన్న్యసించు నప్పుడు శాస్త్రోక్తముగ సన్న్యసించి, బాహ్యావృత్తులను నిరోధించి, బాహ్యములో ప్రసరించు కర్మేన్ద్రియ, జ్ఞానేన్ద్రియములను అంతర్ముఖముగ నొనర్చుకొన వలయునని తెలుపబడినది.

అదియును గాక అన్తరిన్ద్రియములగు మనస్సు, బుద్ధి, చిత్తములను గూడ నిశ్చలముగ జేయవలయునని తెలిపెడి రహస్యము దీనినే శమమనియు బాహ్యేన్ద్రియముల నిగ్రహము దమమనియు శాస్త్రము విధించినది కాకతాళీయ న్యాయముగా ఒకానొకనికి ఈ జన్మములో ఎక్కువ ప్రయత్నము లేకనే ముక్తి సిద్ధించినను, ఆలాగున అందఱికిని లభించునని తలంచి మోసపోకుడు ఎట్లన ఒకానొకడు కొండప్రదేశమున చెట్లు పెట్టుటకు గుంటలు త్రవ్వునప్పుడు అతనికి పుణ్య బలమున గొప్ప నిధి దొరకెను దానిని జూచి అందఱును కొండలన్నిటిని త్రవ్వప్రారంభించిన నేగతి గల్గునో ఆలాగున వీరిస్థితి గూడ నున్నదని గ్రహించుకొననగలయును

కాళిదాస మహాకవికి దేవి యొక్క అనుగ్రహముచే గొప్ప విద్య లభించెను ఆలాగుననే తర్వాత ఎంత మందికి విద్వత్తు సిద్ధించెను? తక్కిన వారందఱు చక్కగ చదువుకొనియే విద్వాంసులు గాను, విదుషీమణులుగాను అయిరి ఆలాగున నిప్పుడు ప్రపంచములో గల శ్రీమంతులు ఉద్యోగము చేతనో, వ్యాపారము చేతనో, వ్యవసాయముచేతనో అట్టి స్థితికి వచ్చిరేగాని నిక్షేపప్రాప్తిచే వచ్చిన వారుకారని తెలిసికొని ముముక్షువులు తమ అనుష్ఠానములను చక్కగ నొనర్చుకొన వలయును సన్న్యాసము వలననే సులభముగా మోక్షము గలుగునని తలంచియే గీత కడపటి యధ్యాయమునకు మోక్ష సన్న్యాస యోగమని భగవానుడు నామకరణ మొనర్చిన వాడాయెను అచ్చటనే చరమ శ్లోకము, అనగా అన్తిమోపదేశము తెలుపబడెను

**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ (18-66)**

సమస్త ధర్మములను విడిచి నన్ను ఒకనిని మాత్రము శరణము పొందుము నేను నిన్ను సమస్త పాపముల నుండి విముక్తునిగా జేసెదను దుఃఖింపకుము (సంశయింపకుము)

జ్ఞానదీపమునకు బ్రహ్మచర్యము దీపస్తంభమువంటి దనియు, గృహస్థాశ్రమము తైలము వంటిదనియు, వానప్రస్థము వత్తివంటిదనియు

గ్రహించుకొనవలయును అయితే ప్రమిద మాత్రముచే చీకటి నశించునా? నూనెచే మాత్రము చీకటి దొలగునా? వత్తితో మాత్రము తమస్సు దూరమగునా? కాదు ఈ మూడును అమరి గాలిలేని స్థలములో జ్యోతిని వెలిగించిన మాత్రమే దీపము ప్రజ్వలించును అప్పుడు చీకటి పటాపంచలై వెలుతురు గలుగును అత్తరి తమస్సు నశించును అప్పుడు కనబడవలసిన వస్తువు లన్నియు కనబడును అదే తురీయాశ్రమమున జీవబ్రహ్మల కైక్యము గలుగునని చెప్పెడి రహస్యము

అయితే బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థాశ్రమములు వ్యర్థములు గావు ఈ మూడాశ్రమములలో జేసిన స్వాధ్యాయ, యజ్ఞ, తపస్సుల వలననే నాల్గవ యాశ్రమమగు సన్న్యాసము నిలకడ గలిగియుండును అట్లు గానిచో ప్రమిదయు, చమురును, వత్తియు లేకయే దీపము వెలిగించునటు లుండును కావుననే సాధనలును, శమమాదులును పూర్తిగా లేనివారికి మహావాక్య బోధనముగాని, సన్న్యాసముగాని పతన హేతువగునని తెలుపుట అని మరువకూడదు ఒకవేళ బ్రహ్మచర్యాది వానప్రస్థము వరకు విధిగా ననుష్ఠించిన తర్వాత మాత్రమే సన్న్యాసమునకు గాని, మహావాక్యోపదేశమునకు గాని అర్హత గలుగునని తలంచ పనిలేదు ఆమూడాశ్రమములలో గల స్వాధ్యాయ యజ్ఞతపశ్చర్యలు మాత్రము తప్పక యుండవలయును

> సద్గురు సమీపే సకల విద్యా పరిశ్రమజ్ఞో భూత్వా, విద్వాన్
> సర్వమైహికాముష్మిక సుఖశ్రమ జ్ఞాత్వా, ఈషణాత్రయ
> వాసనాత్రయ మమత్వాహంకారాదికం వమనాన్నమివ
> హేయమధిగమ్య మోక్షమార్గైక సాధనో, బ్రహ్మచర్యం
> సమాప్య గృహీ భవేత్. గృహాద్వనీ భూత్వా ప్రవ్రజేత్,
> యదివేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్ గృహాద్వా వనాద్వా.

అని పరమహంస పరివ్రాజకోపనిషత్తున శ్రీ మన్నారాయణమూర్తి బ్రహ్మదేవున కుపదేశించెను

బుద్ధిమంతుడు సద్గురు సమీపమునందు సమస్త విద్యలను గుర్తెఱింగిన వాడుగా అయి (ముక్తికి తగిన విద్యలను నన్నింటిని నేర్చుకొన్నవాడై)

సకలైహికాముష్మిక సుఖములను నశ్వరములని యెఱింగి, ఈషణాత్రయ, వాసనాత్రయ, మమత్వాహంకారాదులను వమనాన్నమునువలె హేయములనుగా తలంచి, మోక్షమార్గమునే ముఖ్యసాధనముగా గలవాడై బ్రహ్మచర్యవ్రతమును పూర్తిజేసి సంపూర్ణ విరక్తి గలుగనిచో గృహస్థుడు కావలయును తర్వాత అచ్చట నుండి వానప్రస్థుడు కావలయును ఆయాశ్రమమును గడిపిన తర్వాత సన్న్యాసి గావలయును ఒక వేళ సంపూర్ణవైరాగ్యము గల్గియుండిన బ్రహ్మచర్యము నుండిగాని, గృహస్థాశ్రమమునుండిగాని, వానప్రస్థాశ్రమమునుండి గాని సన్న్యసింపవచ్చును

ఈ వ్యాసమును పరమ గోప్యమని తెలుపుటకు కారణమేమన - పరమ యోగులగు సనక సనందన సనత్కుమార సనత్సుజాతులను నలుగురును జీవేశ్వరుల యైక్య విషయమై సందేహము గలవారై దాని నివృత్తి కొఱకు చతుర్ముఖ బ్రహ్మదేవుడుండు సత్యలోకమునకు వెళ్ళి, తమ ఆగమన వృత్తాన్తమును తెలుపగా, ఆయన ఈ బ్రహ్మజ్ఞానమునకు వైరాగ్య మొక్కటియే ముఖ్యసాధనమని తెలుపునప్పుడు సరస్వతీదేవి గూడ అచ్చటనే యుండెను ఆ సరస్వతీదేవిని జూచి యీ ఋషులు నలుగురును తమలో తాము పరస్పర ముఖావలోకనపరులైరి. వారి చిరునవ్వును బ్రహ్మదేవుడు జూచి మౌనముగా కొంతసేపుండుగా , ఇచ్చట పరిస్థితులు ఈ లాగున నుండునని ఋషులు గ్రహించి ఆచరణలేని యుపదేశము ప్రయోజనపడదని తలంచి బ్రహ్మదేవుని యొద్ద సెలవు తీసికొని శ్రీ వైకుంఠమునకు వెళ్ళిరి

అప్పుడు శ్రీ విష్ణుమూర్తి సనకాది మహాయోగులకు స్వాగతమిచ్చి యుచితాసనముల కూర్చుండబెట్టి ఆగమన వృత్తాన్తమును అడుగగా జీవేశ్వరుల యైక్య విషయమై గల సందేహనివృత్తి కొఱకు వచ్చినారమని మునులు తెలుపగా వేదవేదాంతసారములను బహువిధములుగా తెలుపుచు నిర్విషయస్థితి గలుగనిచో ఈ తత్త్వము గోచరము గాదనియు, కావున దానికి తీవ్రమైన విరక్తి అవసర మనియు గంభీరముగా తెలుపునప్పుడు. ఆసమయముననే శ్రీ లక్ష్మీదేవి భగవానునికి సేవజేయునది చూచి మహర్షి సత్తములు బ్రహ్మలోకమున

మందహాసము చేసినట్లు చేసిన దానిని శ్రీ విష్ణుభగవాను డెఱింగి మౌనముగా గూరుచుండెను అప్పుడు ఋషులు అనుష్ఠానములేని వేదాంత ముపయోగపడదని తలంచి విష్ణుమూర్తి వద్ద సెలవు తీసికొని కైలాసమునకు పయనమయిరి ఇదే యీ గోప్యములో గల గోప్యము ఇదే దీనిలో గల రహస్యము

సంగతు లన్నియు దివ్య దృష్టితో నెఱింగి శివుడు బ్రహ్మావిష్ణ్వాది మూర్తులకు ఋషులవల్ల తిరస్కారము గలిగినట్లు తనకు గూడ గలుగునని తలంచి, పరమ వైరాగ్యము నవలంబించి కైలాసమును, పార్వతీదేవిని, నవరత్నాది ఆభరణములను త్యజించి వ్యాఘ్రచర్మ రుద్రాక్షమాలికా విభూతులను ధరించి జటామండల ధారియై సిద్ధాసనారూఢుడై ఒక మఱ్ఱిచెట్టు క్రింద గూర్చుండి బ్రహ్మదృష్టి గలవాడై యుండెను. అప్పటికి ఆ సనకాది మహాయోగులు నలుగురును అచ్చోటికి విజయము చేసినవారై యీ దక్షిణామూర్తి భగవానుని జూచిన వెంటనే చెప్పేలాగున చేయు గురుమూర్తి లభించెనని మనస్సులో తలంచి ఆనంద భరితులై శ్రీ పరమశివమూర్తి యగు దక్షిణామూర్తికి భక్తి పూర్వకముగా సాష్టాంగముగ నమస్కరించి బద్ధహస్తులై నిశ్చలేంద్రియులై నిలిచి యుండు మునులను జూచి భగవంతుడగు శ్రీ దక్షిణామూర్తి ఊర్ధ్వదృష్టిలోనే కొంత సేపుండి మందస్మిత వదనారవిందుడై, శిరస్సుతో ఋషులను కూరుచుండులాగున సంజ్ఞ జేయగా మహామును లందఱును ఏకాగ్ర చిత్తము గలవారై సిద్ధాసనములలో కూర్చుండిరి తర్వాత భక్తితో తమకు గలిగిన సంశయమును గురించి ప్రశ్న ప్రారంభించిరి అదేమనగా.

**1. ప్రశ్న ॥ వేదము జీవేశ్వరులకు ఐక్యము నుపదేశించుచున్నదా? లేక జీవేశ్వరులు భిన్నులని తెలుపుచున్నదా? అను మొదలగు అగా ధార్థములగు అనేక సంవాదములు చాలకాలము వఱకు నీశ్వరావతార మగు శ్రీ దక్షిణామూర్తికిని యోగి పుంగవులగు మునులకు జరిగినవి**

శ్రీదక్షిణామూర్తి :- మునివరులారా! వేదము సామాన్య దృష్టితో జూచువారికి జీవేశ్వరుల గుఱించియే చెప్పునట్లు తోచును. అయితే వేదాంతమగు ఉపనిషత్తు జీవబ్రహ్మల యేకత్వమునే ప్రతిపాదించుచున్నది

**2. ప్రశ్న ॥ సనకాదులు:- ఓ ఈశానా! బ్రహ్మసాక్షాత్కార స్థితి గలిగిన వారికి 'అహం బ్రహ్మాస్మి' యను వృత్తి గలదా? లేదా?**

సమాధానము ॥ యోగివర్యులారా! అహంవృత్తి మూడు విధములుగ నున్నది అజ్ఞులకు దేహోఽహ మనువృత్తి యుండును విజ్ఞులకు జీవోఽహమను వృత్తి యుండును విశేషజ్ఞులకు బ్రహ్మోహ మనువృత్తి మాత్రమే యుండును

**3. ప్రశ్న ॥ బ్రహ్మోహమను వృత్తిగూడ ఏకత్వమునకు భిన్నమగునది గదా! నేనే బ్రహ్మమని నిశ్చయించునప్పుడు నేను వేరుగాను, బ్రహ్మము వేరుగాను నుంటున్నది గదా!**

సమా ॥ ఏల ఈలాగున సందేహపడుచున్నారు? ఒకడు ఏకచ్ఛత్రాధిపతిగా నున్నాడనుకొనుడు ఎవరైన తాను చక్రవర్తియని యడిగిన నేను చక్రవర్తిని చెప్పుటలో తన చక్రవర్తిత్వమునకు ఏమైనా లోపము గలదా! అదియును వ్యవహారార్థముగా చెప్పవలసి వచ్చినదేగాని మఱియొకటి గాదు

**4. ప్రశ్న॥ అట్లగుచో నేనను వృత్తిజ్ఞాన ముంటున్నది గదా !**

సమా ॥ నేనను వృత్తి భావము లేనిచో మహావాక్యమును బోధించునప్పుడు "బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహ మితీర్యతే" అని యేల తెలుపవలయును? అనగా బుద్ధికి సాక్షియై నేనని పలుకుచున్న మహావాక్యము వేదాన్తము యొక్క పరాకాష్ఠ కాదా!

**5. ప్రశ్న॥ అప్పుడు నేనే బ్రహ్మమని తెలువు ఎఱుక యున్నది గదా! ఎఱుక యున్నప్పుడు పరిపూర్ణము ఎట్లుల సిద్ధించును?**

సమా ॥ ఏల పామరులవలె చెప్పుచున్నారు? ఎఱుకలేని జడమువలె నుండుటయా బ్రహ్మ జ్ఞానము! అట్లైన జడమగు విగ్రహము గూడ, స్తంభము గూడ జీవన్ముక్తిని పొందియుండును గదా! ఆలాగున నుండిన మరల శాస్త్రము నుపదేశించెడు ఆచార్యు లేల? విగ్రహములు జాలును గదా!

**6. ప్రశ్న ॥ నిర్వికల్పసమాధియందు ఎఱుక యుండదు గదా!**

సమా ॥ సమాధి యందనుభవించిన బ్రహ్మసుఖము ఎఱుక లేకపోయిన వ్యుత్థానదశ యందు అట్టి నిరతిశయ సుఖమును భక్తులకు తెలుపువారై యుండరుగదా! అదియునుగాక సమాధి స్థితిని పొందిన వారు అలాగుననే జీర్ణించిపోయిన గురుశిష్య సంప్రదాయమే లోకమందుండదుగదా! అదియుగాక ఒకవేళ వ్యుత్థానదశలో చెప్పనిచో సమాధిస్థితిలో గల విషయము తెలియక పోవును అప్పుడు ఆచార్యుండు మృషావాది యగును గదా! నిర్బీజ నిర్వికల్ప సమాధిని గుఱించి పతంజలి మహాముని యేమి చెప్పిరో చూడుడు

**విభూతిపాదము సూ॥3 తదేవార్థ మాత్ర నిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః**

ఇదివఱలో ధ్యానావస్థలోనికి వచ్చిన వారి ధ్యానమును ధ్యేయమును ఏకమై ధ్యానించు వస్తువుల యొక్క స్వరూపమై యుండుట యేది గలదో, అదియే సమాధి యనంబడును దీని యందు స్వరూపశూన్యమని ఒక పదముంటున్నది దానియొక్క అర్థము సరిగా తెలిసికొనకపోవుటచే స్వరూపశూన్యము గూడ గలుగవలయుననియు కొందఱు తలంతురు ఇచట బీజము వృక్షముగా మారునటుల జీవేశ్వరుల యేకత్వస్థితి గలుగుటయే సమాధియని యెరుగవలయును కావుననే యోగపాదమున,

**సూ॥3 తదా ద్రష్టుస్స్వరూపేఽవస్థానమ్ ।**

యోగావస్థయందుండు కాలమునందు చిన్మాత్రుడయిన పురుషుడు నిజస్వరూపము నందుండుట సంభవించుచున్నది అనగా సమాధియందు స్వస్వరూపస్థితి యందు స్వయం ప్రకాశుడై జ్ఞానస్వరూపుడై యుండును అట్లుగాక జడమైపోయిన యెడల ఇంతవర కనుష్ఠించుచు వచ్చిన దానియొక్క అనుభవమగు బ్రహ్మసుఖము ననుభవించువాడే లేకపోవలసివచ్చును గదా! ఇట్టి జడత్వము దాటుటకొఱకు చిరకాలము వ్రతానుష్ఠానములతో గూడిన యోగమభ్యసింప వలయును

ఇక ఎఱుక విషయమై ఋభుమహాముని నిదాఘ ఋషికి ఉపదేశించిన భాగమును 'ఋభుగీత' 3,4 అధ్యాయములలో గనందగును అచ్చట

ఎఱుకయొక్క రహస్యము గోచరము గాగలదు ఈలాగున జీవేశ్వరుల ఏకత్వమును ఉపదేశించిన పిమ్మట కట్టకడకు అంగుష్ఠతర్జనీ వ్రేళ్ళతో జీవేశ్వరుల యైక్యమే మోక్షమనెడు చిన్ముద్రను (జ్ఞానముద్రను) ప్రదర్శించి, శ్రీ దక్షిణామూర్తి భగవానులు మౌనముగా నుండిపోయిరి దక్షిణామూర్తి యొక్క అవతారసార మిది అప్పుడు బ్రహ్మమానస పుత్రులగు సనకాది పరమయోగులు సంశయ రహితులై జీవేశ్వరుల యైక్యమే పరమార్థదశలో గల ముక్తియని గ్రహించి కృతార్థులై మహానందభరితులై, శ్రీ దక్షిణామూర్తి భగవానుని అనేక విధములుగ వేదవాక్యములతో స్తోత్రముజేసి స్వస్థానమునకు వెళ్ళిపోయిరి

కావున బోధకులగు గురువులు, ఆచార్యులు, పీఠాధిపతులు మొదలగు వారందఱు తాము ముందుగా ఆచరించి యితరులకు బోధించులాగున చూడవలయును అదియే సరియగు పద్ధతి అట్టి ఉపదేశ వాక్యములు మాత్రమే లోపల గింజగల విత్తనములను పెట్టిన మాత్రమే మంచి ఫలమును గలుగజేయు లాగున ఉపయోగపడును అట్లు కాని ఉపదేశము లన్నియు లోపల గింజలేని వట్టి టెంకి (పొట్టు) భూమిలో పెట్టిన ఎట్లు వృక్షములై సస్యములై ఫలమును గలుగజేయక వ్యర్థములైపోవునో, ఆలాగున వ్యర్థములని గ్రహించేది కావుననే ఆచార్యుల లక్షణ మీలాగున శాస్త్రమున తెలియబఱచిరి

**ఆచినోతి చ శాస్త్రార్థం ఆచారే స్థాపయత్యపి ।**
**స్వయమాచరతే యస్మాదాచార్యస్తేన కథ్యతే ॥**

చక్కగా గురువుల యొద్ద శాస్త్రాధ్యయనము చేసి శాస్త్రములో జెప్పినటుల ఆచరించి, మరల ఇతరులచే ఆచరింప జేసేలాగున జేయుటయే ఆచార్య శబ్దమున కర్థమగును

ఇక మతకర్తలు గదా మన కాదర్శపురుషులు! వారలను గదా లోకము ఆదర్శప్రాయులనుగా జేసి కొనుచున్నది! అవతార పురుషులలో తొమ్మిదవ వాడగు శ్రీ గౌతమబుద్ధుడు కొద్దికాలము మాత్రము గృహస్థాశ్రమమునందుండి తర్వాత చాలకాలము వనములో నివసించుచు పిమ్మట సన్న్యసించెను ఈ మహానుభావుడే జీవ కారుణ్య ప్రవాహమును ప్రపంచములో విస్తరింపజేసినవాడు. దీని కన్న

పరమ ప్రమాణము మరియేమి కావలయును? ఆలాగున ముస్లిం మతమును స్థాపించిన శ్రీ మహమ్మదునబిగారు గూడ కొంతకాలము మాత్రమే గృహస్థాశ్రమమునందుండి, తర్వాత త్యాగమవలంబించి సంచారము జేసి, మతప్రచారము చేసెను దైవమును, సత్యమును అరబ్బీ దేశస్థులకు ఈ మహనీయుడే ఉపదేశించెను యేసుక్రీస్తు పుట్టుకతో నైష్ఠిక బ్రహ్మచారియై యుండియే పాశ్చాత్య దేశమున మత ప్రచారమును జేసియున్నారు కరుణయు, శాంతియు, సహనము, దైవ విశ్వాసము ఈ మహాపురుషుని యందు మూర్తీభవించి యుండెను

ఇప్పుడు ప్రపంచములో నీ మూడు మతములే ముఖ్యములు అవి 1)క్రీస్తుమతము, 2) మహమ్మదు మతము, 3) బౌద్ధమతము,

హిందూమతమైతే ఒకరు ఏర్పరచినది గాదు. అది సర్వేశ్వర సంకల్పముచే వేదము ద్వారా అనాదిగా నేర్పడినది త్యాగము లేనిచో, నిశ్చింతగా నుండి యెట్లు బ్రహ్మచింతనము జేయగలరు? ఎట్లు దైవశక్తిని తమలో నిలుపగలరు? కాన ఏ మత ప్రవర్తకులను చూచినను వారందరును బ్రహ్మచారులుగాను, వానప్రస్థులు గాను, సన్న్యాసులు గాను ఉండియున్నారు అద్వైత మత స్థాపకులగు శ్రీశంకరాచార్యులవారును నైష్ఠిక బ్రహ్మచారియే బ్రహ్మచర్యాశ్రమము నుండియే వారు సన్న్యసించిరి అద్వైతజ్ఞానామృతమును ఈ మహనీయాత్ముడే లోకమంతటను వెల్లువ లగునటుల జేసెను ఆలాగున ద్వైతమత ప్రవర్తకులగు శ్రీ మధ్వాచార్యుల వారును నైష్ఠిక బ్రహ్మచర్యము నుండియే శంకరులవలె సన్న్యసించిరి ఆత్మశుద్ధి కొఱకు తగిన ధర్మములను ప్రపంచమున స్థాపించిరి ఇదేరీతిగ విశిష్టాద్వైత ప్రవర్తకులగు శ్రీ రామానుజాచార్యులకు బాల్యమున వివాహము జరిగినను సంతానము గలుగుటకు ముందుగానే సన్న్యాసాశ్రమమును స్వీకరించిరి భగవదుపాసన, భగవద్భక్తి, సర్వజనులకు అనర్గళముగ బోధించిన మహనీయులు వీరే దీనికన్న ప్రబల ప్రమాణమేమి గావలయును?

ఇదే రీతిగ సిక్కు మతాచార్యులగు శ్రీ గురునానక్కు గారును కొంతకాలము గృహస్థాశ్రమములో నుండినను దానివలన గలిగెడు అస్వాతన్త్ర్యము,ఆత్మ

మాలిన్యము నెఱింగి, వెంటనే సర్వమును సన్న్యసించియే మతకర్తయై ప్రపంచములో కరుణయు, జ్ఞానము, స్వాతంత్ర్యము నుపదేశించిరి శ్రీ కృష్ణచైతన్యులు (అనగా గౌరాంగప్రభువు) బాల్యమున వివాహితుడైనను స్వల్పకాలములోనే సర్వసంగ పరిత్యాగియై శ్రీకృష్ణభక్తియను జడివానను లోకములో కురిపించెను సకాలమున వర్షము లేక సస్యములు శుష్కించి పోయెడి తరుణమున మంచి వాన కురిసిన ఏలాగున సస్యము లన్నియు నూతన కళలతో పెరుగుచుండునో, ఆలాగున మానవహృదయక్షేత్రములో గల సత్య, శాంతి, కరుణ, దైవ విశ్వాసములు క్షీణించినప్పుడు ఒక్కొక్కరు దివ్యపురుషు లవతరించి కరుణాన్వితమగు బోధనావృష్టి వలన మానవ హృదయ క్షేత్రములో గల సత్యాది సస్యములను పునరుజ్జీవింప జేయగలరు చైతన్య వంతములుగా మార్చగలరు ఈలాగున జైనమునియు పరమత్యాగ మొనర్చి సన్న్యసించియే దయయను తన పావనమతమును భూలోకమున బోధించ గలిగిరి చైనా దేశమున శ్రీ కన్ఫూషి ఋషియు సాధువై పరమత్యాగియై తన ఆత్మ ప్రాప్తికరమగు మతమును ప్రపంచములో నిలబెట్ట గల్గిరి

ఈ విధముగానే ఆర్యమతస్థాపకులగు శ్రీ దయానంద సరస్వతీస్వాముల వారును నైష్ఠిక బ్రహ్మచర్యమున నుండియే సన్న్యసించి అనాచార వర్తనములను మానవ హృదయమునుండి పారద్రోలి వేదప్రమాణమగు తన ఆర్యమతమును ప్రపంచములో స్థాపించగల్గిరి. శ్రీరామమోహనరాయిగారును పరమత్యాగ మవలంబించియే సర్వజన స్వాతంత్ర్యమగు బ్రహ్మమతమును స్థాపించగల్గిరి. బన్ధనములో నుండువాడు బద్ధుడైన మరియొకరిని బన్ధమునుండి యెట్లు విమోచనము జేయగల్గును? ఆలాగున సంసారపాశముచే బద్ధుడైన వాడు ఇతరుల బన్ధనములను ఎట్లు ధ్వంసమొనర్ప శక్తి గల్గియుండును? కావున మొదట తన బన్ధనమును త్రుంచిన వాడైన మాత్రమే యితరుల బన్ధనములను నిర్మూలన మొనరింప శక్తుడగును. అప్పుడాత్మ శాంతి పొందగల్గును మలినమైన బుడ్డిలో దీపమేలాగున ప్రకాశింపజాలదో, నిర్మలపరచిన చిమ్నీలో గల దీపమెటుల ప్రకాశించునో , ఆలాగున సంసార మాలిన్యముగల హృదయములో ఆత్మప్రకాశము గలుగదు

గాఢనిద్రలో నుండువాడు, సుషుప్తిలో నుండు ఇతరులను ఎటుల లేప శక్తి లేనివాడై యుండునో, ఆలాగున మాయామోహములో పడియుండువాడు అజ్ఞానసుషుప్తిలో నుండు ఇతరులను ఎటుల లేపగల్గును? నిద్రనుండి లేచిన వాడు ఎట్టివాడైనను ఎంత గొప్ప వారిని గూడ ఎట్లు లేపశక్తి గలిగి యుండునో ఆలాగున తాను మాయామయమగు సుషుప్తి నుండి మెల్లగ మేల్కొనిన మాయలో నుండు జీవులందరిని లేపు సామర్థ్యము గలిగియుండును

పర పరిపాలనా పాశముచే బద్ధులయిన జనులను, దేశమును విడిపించుట కొఱకు ప్రయత్నము జేసిన శ్రీగాంధీగారి జీవితమును జూడుడు ఆ మహాశయుడు గూడ కొంతకాలము గృహస్థాశ్రమములో నుండిన తర్వాత సర్వసంగ పరిత్యాగియై గొప్ప ఋషియై యుండి లోకోద్ధారణ జేయ శక్తి గలిగి యుండిన దానికి నీ త్యాగమే కారణము వీరును పూర్వకాలమున నుండిన శ్రీబుద్ధ, క్రీస్తు మొదలగు వారివలె సంచరించుచు జనుల ఆతిథ్యము వలననే దేహ సంరక్షణము జేసికొని ధర్మప్రచారము చేయుచుండిరి త్యాగము లేనిచో అనగా బ్రహ్మచర్యముగాని, వానప్రస్థముగాని, సన్న్యాసముగాని లేనిచో బ్రహ్మచర్యమును సంరక్షించుటకు అంత అవకాశ ముండదు

శరీరమొక యంత్రము వంటిది బ్రహ్మచర్యము దానిలో గల ఆయిల్ వంటిది ఆయిల్ నశించిన యంత్రమాగిపోవునటుల బ్రహ్మచర్యము నష్టమగుచో, మానసిక కాయిక శక్తి నశించి మానవుని ఊర్ధ్వగమన మాగిపోవును తైలము నశించిన దీపము చిన్నగా ఆరిపోవునటుల బ్రహ్మచర్య పతనముతో తన ప్రజ్ఞ గూడ అస్తమించును ఏలాగున దృఢమగు బాయిలరును, సరియైన పెట్రోలు లేక క్రూడాయిలును ఉండిననే ఆ జడమయిన యంత్రము మహాచైతన్యము గల్గి అతి వేగముగ పనిజేయుచుండునో, ఆలాగున బ్రహ్మచర్యముయొక్క మహిమయు, దాని వలన గల్గెడు శరీరదార్ఢ్యమును ఉండునని మరువగూడదు ఇందువలన వానప్రస్థాశ్రమము యొక్కయు, సన్న్యాసాశ్రమము యొక్కయు మహిమచే పరమ శాంతియు, సుప్రసన్నతయు, ఆత్మ విముక్తియు, పరోపకార శక్తియు జనులు తెలునుకొనవచ్చును. కావుననే శ్రుతి యీలాగున

నుపదేశించుచున్నది "త్యాగేనైకే అమృతత్వ మానశుః" త్యాగ మొక్క దాని వలననే అమృతత్వ ప్రాప్తి అనగా మోక్షము గలుగుచున్నది

ఇక మన భరత ఖండమున గల శాస్త్రములలో ముఖ్యమైనదగు మహాభారతమునకు నాయకులగు పాండవుల చరిత్రమును జదివిన ఈ ధర్మతత్త్వము ప్రతివారికిని సులభముగ గోచరముగా గల్గును మహాభారతమున మహాప్రస్థాన పర్వమును జూడుడు ఆలాగున శ్రీ కృష్ణభగవానుడు తన అంతరంగ భక్తుడగు ఉద్ధవున కుపదేశించిన పరమార్థ తత్త్వమును భాగవత ఏకాదశస్కంధమున జూడుడు ఉద్ధవుడు గూడ గృహస్థాశ్రమములో నుండినవాడే వానప్రస్థాశ్రమమును అవలంబించనిచో నిశ్చింతగా నుండి పరమాత్మను ధ్యానము చేయుటకును, చిత్తైకాగ్రత గల్గుటకును, హృదయ నిర్మలత చేకూరుటకును అవకాశము లేదని శ్రీకృష్ణ భగవానుడు ఉద్ధవునికి తెలిపి బదరి కాశ్రమమునకు వెళ్ళేలాగున నుపదేశించెను

## మహాభారతము - మహాప్రస్థాన పర్వము

శేషించిన కాంచనరత్నాదు లాక్షితిపతి పరీక్షితునకు బరమాదరంబున సమర్పించి యతనిం గృపాచార్యునకు శిష్యునిగా నప్పగించి పౌరజానపద ప్రవరజనంబుల రావించి

**ఆపార్థ పౌత్రుని జూపి మాయేపుర**
**మాఱుగా మీరిక్కుమార వరుని**
**గైకొని తగనెల్ల కార్యజాతంబును**
**నడపుచు నమరక్తి నాడు నాటి**
**కెక్కుడగుచునుండ నీతని యుల్లంబు**
**రంజిల్ల సమ్యగారాధనము**
**నందు సంప్రవణులరగుడయ్య యని పల్కి**
**తమ నిశ్చయంబు నుదాత్తభంగి**

జెప్పుటయు వారు మొగములు చిన్నబోవ
మమునుపేక్షించి యిటు సేత సముచితంబె
నీదు చిత్తంబు కారుణ్యనిలయ మేము
దరతరంబ యాశ్రితులము ధర్మశీల ॥

అని గద్గదకంఠులగుచు నాడిన మాటలకు నమ్మనుజేంద్రుండు దగు తెఱంగున మాటలాడి తమ గమనంబునకు నజ్జనంబుల నీయకొల్పి నప్పుడందులోను గొందఱు కొందఱి నివేశనంబు లధికాభిలాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన సహదేవుండు కలియుగంబు ప్రవేశించుటం జేసిగాదె ఇట్టివి పుట్టెడునని తలంచి నవ్వి నరనాధునకుం జెప్పిన నప్పార వోత్తముండు నవ్వుచు మన మనువులు సాలునని పలికి సర్వాభరణంబు లూడ్చి వల్కలాజినంబుల ధరియించిన దమ్ములు ద్రౌపదియు నట్లచేసి రందఱుం దత్కాలోచితంబులగు నిష్ఠావిధానంబు లాచరించి యగ్నుల నంబుగతంబుల జేసి మొగంబులం దెలివగ్గలింప గృహంబు వెలువడి రప్పుడు ద్రౌపది షష్ఠత్వ నిష్ఠంబోవ సప్తమంబై యొక్క సారమేయంబు వారల వెనుక జనియె



# శ్రీకృష్ణుండుద్ధవునకు బరమార్థోపదేశము చేయుట

## శ్రీమద్భాగవతము - ఏకాదశస్కంధము

ఇట్లు నుతియించి దేవా! నీవు యదుక్షయంబు గావించి చనిన మేమేవిధంబున నిర్వహింతుము? నీ సహచరులమై జరిపిన మజ్జన, భోజన శయనాసనాది కృత్యంబులు మఱువవచ్చునే యని యుద్ధవుండాడిన వాసుదేవుం డిట్లనియె బ్రహ్మాది దేవతా ప్రార్థనంబునంజేసి ధాత్రీభారంబు నివారించితి నింక ద్వారకానగరంబు నేటికి సప్తమదివసంబున సముద్రుండు ముంపగలవాడు.

యదుక్షయంబునుం గాగలయది యంతట గలియుగంబునుం బ్రాప్తంబయ్యెడి నందు మానవులు ధర్మవిరహితులు, నాచారహీనులు, నన్యాయపరులును, నతిరోషులు, మందమతులు, నల్పతరాయువులు, బహురోగ పీడితులు, నిష్ఫలారంభులు, నాస్తికులునై యొండొరుల మెచ్చక యుందురు కావున నీవు సుహృద్బాంధవ స్నేహంబు వర్జించి, యింద్రియ సౌఖ్యంబులం బొరయక క్షోణీతలంబునం గల పుణ్యతీర్థంబుల నవగాహనంబు సేయుచు, మానస వాగక్షి శ్రోత్రఘ్రాణేంద్రియ గృహ్యమాణంబగు వస్తుజాతంబెల్ల నశ్వరంబుగా నెఱుంగుము

పురుషుండు నానార్థకామంబుల నంగీకరించి నిజగుణ దోషంబుల మోహితుండై యుండుం గావున హస్తిపకుండు గంధమాదనంబుల బంధించు చందంబున నింద్రియంబులను మనోవికారంబులను నిగ్రహించి, ఈషణ త్రయంబును వర్జించి, మోదఖేదంబుల నముండవుగా వర్తించుచు, నీ జగంబంతయు నాత్మాధిష్ఠితంబుగా నెఱింగి మాయాదు లాత్మతత్త్వాధీనంబులుగా దెలియుచు, జ్ఞానవిజ్ఞాన యుక్తుండవై యాత్మానుభవ సంతుష్టుడవై విశ్వంబును నన్నుగా భావించి వర్తింపవలయునని వాసుదేవుం డానతిచ్చిన నుద్ధవుండు భక్తి భయవినయంబులం గరంబులు మొగిడ్చి మహాత్మా! సన్న్యస్త లక్షణంబు దుష్కరంబు, పామరులగు వారలాచరింప లేరు నీ మాయచేత భ్రాంతులైన సాంసారికులు భవాబ్ధిం గడచి యెట్లు ముక్తి వడయుదురు? భృత్యుండనైన నామీది యనుగ్రహంబునం జేసి యానతిమ్ము బ్రహ్మాది దేవతా సముదయంబును బాహ్య వస్తువుల భ్రాంతులై పర్యటనంబు సేయుదురు నీభక్తులైన పరమ భాగవతు లమ్మాయా నిరసనంబు సేయుదురు గృహిణీ గృహస్థులకైన, యతులకైన నిత్యంబును నీ నామస్మరణంబు మోక్ష సామ్రాజ్య ప్రదంబు గావున బరమేశ్వరా! నీదు చరణంబుల శరణంబు నొందెద గృపారసంబు నాపై నిడిగింపుమని ప్రియ సేవకుండైన యుద్ధవుండు పలికిన నతనికి గంసమర్దనుం డిట్లనియె ఉద్ధవా! నీవీ ప్రకారంబు గరిష్ఠ నిష్ఠాతిశయంబున యోగ నిష్ఠుండవయి బదరికాశ్రమంబు సేరి మత్కథితంబయిన సాంఖ్యయోగం బంతరంగంబున నిల్పికొని గలియుగావసాన పర్యన్తంబు వర్తింపుమని యప్పరమేశ్వరుం డానతిచ్చిన

నుద్ధవుండు నానందభరితాన్తరంగుండై తత్పాదారవిందంబుల హృదయంబునం జేర్చుకొని పావనంబయిన బదరికాశ్రమంబున కరిగె

ఇక వానప్రస్థ విధిని గురించి మనువు జెప్పినది చూడుడు

**ఏక ఏవ చరేన్నిత్యం సిద్ధ్యర్థమసహాయవాన్ ।**
**సిద్ధిమేకస్య సంపశ్యన్న జహాతి న హీయతే ॥**

ఒంటరియై, తోడు లేక మోక్ష సిద్ధి కొఱకు సంచరింపవలయును మోక్షప్రాప్తి యొంటరిగా నున్న వానికే గలుగునని తెలిసి యట్లు సంచరించుచు ద్వంద్వములలో తగులుకొనక యుండెనేని యెవడును దుఃఖము ననుభవింపడు, అందువలన సుఖముగా ముక్తిని పొందును

**అధ్యాత్మరతిరాసీనో నిరపేక్షో నిరామిషః ।**
**ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరేదిహ॥**

పరమాత్మను గూర్చిన ఆసక్తి గలవాడై, (ఎల్లప్పుడు బ్రహ్మధ్యాన మందాసక్తుడై) సిద్ధాసనము మున్నగు యోగాసనముల యందు శ్రద్ధగలవాడై, దేని యందును ఆశలేని వాడై, నిర్విషయుండై తనకు తానే సహాయభూతుడై, మోక్ష సుఖమును గోరుచు ప్రపంచమున నుండవలయును

**యస్మాదణ్వపి భూతానాం ద్విజాన్నోత్పద్యతే భయమ్ ।**
**తస్య దేహాద్విముక్తస్య భయం నాస్తి కుతశ్చన॥**

ఏ మనుజుని వలన సకల భూతములకు ఇంచు కేనియు భీతి గలుగదో, అట్టి వానికి నీ లోకమందైనను, దేహవిముక్తి గలిగి పరలోక మందైనను నెచ్చటను దేని వలనను భయము గలుగదు.

**ఏక కాలం చరేద్భైక్షం న ప్రసజ్జేత విస్తరే ।**
**భైక్షే ప్రసక్తో హి యతిర్విషయేష్వపి సజ్జతి ॥**

దినమున కొక పూటయే యతి భిక్షాన్నమును భుజించవలయును, అదియు ఎక్కువ సౌఖ్యసక్తితో చేయరాదు భిక్షాన్నమందు అధికాసక్తి గలవాడు

విషయములలో పతితుడగును

**ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేషక్షయేన చ ।**
**అహింసయా చ భూతానామమృతత్వాయ కల్పతే ॥**

ఇంద్రియముల నిగ్రహించియు, రాగద్వేషము లేకుండియు, ప్రాణిహింస జేయకయు నుండు బ్రహ్మనిష్ఠుడు సుఖముగా మోక్షమును బడయును

**అనేన విధినా సర్వాంస్త్యక్త్వా సంగాన్ శనైశ్శనైః ।**
**సర్వద్వంద్వవినిర్ముక్తో బ్రహ్మణ్యేవావతిష్ఠతే ॥**

సమస్త సంగములను వీడి సుఖదుఃఖాది సర్వద్వంద్వముల నుండి తొలగి జ్ఞాననిష్ఠ యందుండు వాడు పునరావృత్తి రహితమయిన మోక్షము నొందుచున్నాడు

గృహస్థాశ్రమోత్కృష్టతను గురించి చెప్పునప్పుడు మాతాపితరుల పుణ్య విశేషము చేతనే అట్టి అవతారపురుషులు, అట్టి లోకోద్ధారకులు, అట్టి మహాత్ములు జన్మించిరని తెలుపడమైనది అదియొక విధముగా సత్యమైనను నిజముగా జన్మించిన దివ్య పురుషుల మాహాత్మ్యమువల్లనే వారి మాతా పితరులకు మహిమ గలిగినదనెడు సత్యమొక్కటి ఇచ్చట నిగూఢ మైనదని విజ్ఞులు గ్రహించు కొనవలయును ఎట్లన వాసుదేవ పరబ్రహ్మమగు శ్రీ కృష్ణ మాహాత్మ్యము వల్లనే దేవకీవసుదేవులు మహిమ గలవారైరి ఆలాగున తారక బ్రహ్మమూర్తియగు శ్రీ రామచంద్రుని జననముచేతనే కౌసల్యా దశరథులు పూజ్యులైరి ఆ విధముగనే శ్రీ గౌతమబుద్ధుని యొక్క ఆవిర్భావమువల్లనే వారి తల్లిదండ్రులగు మాయాదేవీ శుద్ధోదనులు గౌరవ పాత్రులయిరి అదేరీతి శ్రీ క్రీస్తుదేవుని జననము వలననే వారి మాతాపితరులగు మేరీజోసప్పులు లోకవిఖ్యాతి గలవారైరి అట్లే శ్రీ మహమ్మదునబిగారి జన్మమువల్లనే వారి జననీజనకులగు అమీనా అబ్దుల్లాలు మహాత్ములైరి ఇదే ప్రకారము శ్రీ శంకరాచార్యుల వారి ఉద్భవమువలననే వారి జననీ జనకులగు ఆర్యాంబాశివగురువులు లోకవందితు లయిరి ఈలాగుననే తక్కిన వారందఱిని తెలిసికొనందగినది ఇందువల్ల ఆత్మ జ్ఞానము యొక్కయు,

సన్న్యాసముయొక్కయు, దైవభక్తి మహిమయొక్కయు సారమును లోకము తెలిసికొనవచ్చును ఈ విషయమై శ్రీ వేదవ్యాసులు చెప్పిన దానిని జూడుడు

స్నాతం తేన సమస్త తీర్థనిచయే సర్వాఽపి దత్తాఽవనిః
యజ్ఞానాం చ సహస్రమిష్ట మఖిలా దేవాశ్చ సంతర్పితాః ।
సంసారాచ్చ సముద్ధృతా స్స్వపితరస్త్రైలోక్య పూజ్యోఽవ్యయం
యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్ ॥

మనస్సు ఒక్క క్షణకాలమైనను పరమాత్మ ధ్యానములో మగ్నమగుచో దాని వలన గల్గెడు మహిమ ఇట్టిదని తెలుపబడుచున్నది భూమండలములో గల సమస్త తీర్థములలో స్నానమొనర్చిన ఏ ఫలము గలదో, ఏకచ్ఛత్రాధిపతి తన రాజ్యమును గ్రహణాది పుణ్యకాలములలో వేదవేత్తలగు బ్రాహ్మణులకు కాశియందు దానము జేసిన ఏ ఫలము గలదో , అశ్వమేధ రాజసూయాది సమస్త యాగములను విధి ప్రకార మొనర్చిన ఏ ఫలితము గలదో, బ్రహ్మ విష్ణు శివాది దేవతలను ప్రతిష్ఠించి పూజించిన లేక భజించిన ఏ పుణ్య ఫలము గలదో, గయలో శ్రీ విష్ణుపాదమున శ్రాద్ధ తర్పణాదులను జేసి తన వంశములో అనాదిగా నుండెడు పితృదేవతల నుద్ధరించిన యే ఫలము గలదో- అవియన్నియు ఒక క్షణకాలము బ్రహ్మధ్యానమున నైక్యమగు మనస్సు కలవానికి గల్గును అంతేగాక త్రైలోక్యములో గల దేవతల చేతను, మునుల చేతను పూజింపబడిన యున్నత పదవిని గూడ ఈ పుణ్యాత్ముడు పొందగల్గును ఓహో, బ్రహ్మనిష్ఠయొక్క మాహాత్మ్య మేమని చెప్ప నగును! ఈ సత్య మెఱింగి అనుష్ఠానము జేయువారు కొఱతవడి యుండుటయే లోకము దీనిని తెలిసికొనక పోవుటకు కారణము



# ఓంకారధ్యానముచే బ్రహ్మము నొందుట

స్మరణాత్కీర్తనాద్వాపి శ్రవణాచ్ఛ జపాదపి ।
బ్రహ్మ తత్రాప్యతే నిత్య మోమిత్యేతత్పరాయణమ్ ॥

నిత్యము ఓంకారము యొక్క స్మరణము వలనను, కీర్తనమువలనను, శ్రవణమువలనను, జపమువలనను బ్రహ్మప్రాప్తి గలుగుచున్నది కనుక 'ఓం' అను ఏకాక్షరమే ముక్తికి ముఖ్యమగు సాధన మగుచున్నది

శ్రీ కాశియందు ప్రాణము వీడిపోయెడు ప్రాణి కోట్లకు శ్రీ పరమశివుండు ఈ ప్రణవము నుపదేశించియే పవిత్రులనుగా జేసి వారిని శివలోకమునకు పంపుచుండును

శ్రీ పరమ శివుండు ఉపదేశించెడు తారకమును ఈ ఓంకారమే

కాశీపతిః కారుణికః కరాభ్యామాదాయ మూర్ధానమతీవ తాసామ్ ।
ఆగమ్య వేగాద్యుగవచ్ఛ తాసామోంకారమోంకారయతి స్మ కర్ణే ॥
(మాఘపురాణము)

మృగశృంగ మహాముని భార్యలు సువృత్త, కమల, విమల, సురస అనువారలు, అందులో సువృత్తకుమారుడగు మృకండ మహర్షి తన ధర్మపత్నియగు మరుద్వతి, తమ తల్లులగు సువృత్త కమల, సురస అను నల్గురితోను కాశీక్షేత్రమునకు వెడలెను అచ్చట వారందఱు ఒకనాడు మధ్యాహ్నమున మణికర్ణిక యందు శాస్త్రోక్తముగ స్నానము జేసి విశ్వేశ్వరాలయమునకు ప్రదక్షిణము జేయుచుండగా ఆ ప్రదక్షిణముచేత గలిగిన శ్రమవల్ల ఒడలు తిరుగగా వారి మనస్సులందు ఇట్లని వేడుకొనిరి 'ఓ విశ్వేశ్వరా! సకల పాపములను పోగొట్టువాడా! హేశూలపాణే! సకల భయములను పోగొట్టువాడా మాకు రక్షకుడవు అగుము' అని అనేక ప్రకారముల వేడుకొనుచు, స్మృతి తప్పి నేలపైబడిరి, అప్పుడు కాశీ విశ్వేశ్వరుడు ఆ మృగశృంగుని భార్యలందు కనికరము గలవాడై వారి తలలను తన చేతులలో లేవనెత్తి పట్టుకొని ఆ నలుగురి చెవుల యందును ఏక

కాలములోనే "ఓం, ఓం" అని తారక మంత్రమయిన ప్రణవమును ఉపదేశము చేసెను అప్పుడు వారలు ముక్తులైరి

ఛాన్దోగ్యోపనిషత్ ప్రథమ ప్రపాఠకము, ద్వితీయ ఖండమున ప్రణవోపాసన ప్రభావమును గుఱించిన మహత్తరమగు నొక కథగలదు ఇది ప్రణవోపాసనాసక్తి గల ముముక్షువు లందరును గ్రహించుకొనదగినది అదేమన ప్రజాపతి పుత్రులగు దేవతలకును అసురులకును అప్పుడప్పుడు యుద్ధము జరుగుచుండెను కొన్నిటిలో దేవతలకు జయము గల్గినను, ముఖ్యమగు సంగ్రామములలో అసురులకు విజయము గల్గి దేవత లపజమును పొందుచుండిరి ఇట్టి అపజయమునకు కారణమేమని దేవతలలో ముఖ్యులందురు సమావేశమై ఆలోచించగా, అసురులకు ఉద్గీథోపాసనయను ఓంకారోపాసన అధికముగా నుండుటయే వారి జయమునకు కారణమని యెఱింగి, దేవతలును ఉద్గీథయను ప్రణవోపాసనను చేయ ప్రారంభించిరి ఈ ఓంకారోపాసనా ప్రభావము వలన దేవతలు దివ్యశక్తి గలవారై యెల్లప్పుడును రణరంగమున అసురులను ఓడించుటకు శక్తిగల వారైరి ఇందుచే ఓంకారోపాసనయొక్క మహిమను ముముక్షువు లెఱుంగ గలరు

ఈ ప్రభావము ప్రణవోపాసన యందుండుటయే మధ్యకాలమున ద్విజేతరులు ఉపాసనాది కార్యము లన్నిటిలోను మంత్రములు చెప్పునప్పుడు ఓంకారమును తీసివేయుటకు కారణమైనది అందువలననే బ్రాహ్మణులకు వేద సమ్మతముగాను (ఓంకార యుక్తముగాను) బ్రాహ్మణేతరులకు పురాణసమ్మతము గాను ఉపాసనాది కర్మకాండము లెల్లను ఏర్పాటు చేయడమైనది ప్రణవముతో గూడినది వైదికమనియు, ప్రణవము లేనిది పౌరాణికమనియు గ్రహించు కొనవలయును

దీనిలో గల రహస్యమేమన ఓంకార సహితముగా అనుష్ఠించిన దానియొక్క తేజః ప్రభావముచే బ్రాహ్మణేతరులు గూడ బ్రాహ్మణులతో సమానులు గాగలరని దుష్టభావముతో ఇటుల నొనర్చిరేగాని, దీనియందు మరియొక రహస్యముగాని, గోప్యముగాని యేమియు లేదు ఈ సత్యమెఱింగియే ఆర్యసమాజస్థాపకులగు

శ్రీ దయానంద సరస్వతీస్వామిగారును, వైశ్యజాతిని మనుష్య సామాన్యులను పౌరాణిక క్రియలనుండి సంస్కరించిన ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజి గారును పౌరాణిక మార్గమును త్యజించి వేదానుగుణ మార్గముగ అన్ని కార్యముల జరుపవలయునని ఏర్పరచుటకు కారణమైనది

అయితే ఈ విషయములో వైదిక మార్గావలంబు లగువారు చెప్పునదేమన బ్రాహ్మణేతరులు అంత సత్యముగను, శౌచముతోను, ధర్మముగా నుండి ఈ వైదిక ధర్మము నాచరింప జాలరనియు, అందువలన పురాణోక్తముగ అన్ని కర్మలు వీరు చేసిన చాలుననియు, సత్య ధర్మములతో ఆచరించనిచో వైదికకర్మము చేయువారికి దోషము గల్గుననియు చెప్పి భయము నొందింపసాగిరి బ్రాహ్మ ణేతరులును అట్టి వాక్యములను విని భయపడదొడంగిరి ఇదే దీనిలో గల రహస్యము ఒక వేళ సత్య ధర్మశౌచాదులు లేని వారు వైదికవిధి ననుసరించి క్రియలు సల్పిన దోషము గలుగుననియు, అట్లు శుద్ధముగ ఆచరించుటకు శక్తిలేని వారు పౌరాణికముగ చేసిన చాలుననియు చెప్పిన అది చాల బాగుండెడిది అట్లుగాక ఒక జాతిలో నుండు వారందఱిని అవైదికులుగా జేయుట యెటుల ధర్మమగును?

సామాన్యముగా కొన్ని పల్లెటూర్లలో ఒక్కడు ధనవంతు డుండినచో తక్కిన వారు తనకు సమానులుగా నుండకూడదని తలంచి వారి యభివృద్ధికి ఆటంకము లను గలుగజేయుట మనము జూచుచునే యున్నారము ఇదే విధముగ ఒక మతములో అధిక జనులుండే స్థలమున తక్కిన మతస్థులు తమకు సమానులుగా రాకూడదను తలంపుతో ప్రవర్తించు వారు గూడ లోకములో గలరు గదా! అందు చేతనే కలహములు, కొట్లాటలు, హింసలు, యుద్ధములు లోకములో జరుగు చున్నవి మతతత్త్వము ఇట్టిదే ఇది సత్యాన్వేషణ బుద్ధికి తగినది గాదు ఏ ఔషధమునకు ఎట్టి పథ్యము ఉండవలయునో దానిని తెలుపుట ధర్మమగును అట్లుగాక తనవారికి ఒక మందు, ఇతరులకు మఱియొక మందును ఇచ్చు వైద్యుడేలాగున పక్షపాతియో, మన మతముయొక్క స్థితియు ఆలాగున పరిణమించినది ఇప్పుడు ఛాందోగ్యోపనిషత్తునందు గల ఉద్గీథోపాసన మంత్ర

పూర్వకముగా వ్రాయబడుచున్నది

దేవాసురా హ వై యత్ర సంయేతిరే ఉభయే ప్రాజాపత్యా
స్తద్ధ దేవా ఉద్గీథమాజహ్రురనేనైనానభిభవిష్యామ ఇతి ॥

దేవతలు, అసురులు ఇతరేతర విషయములను తిరస్కరించుచు, స్వోత్కర్షను పరాపకర్షను ఆపాదించుకొనుట కొఱకు ప్రసిద్ధులగు దేవాసురులు యుద్ధమునకు సంగతులైరి అన్యోన్యాభిభవరూప మయిన సంగ్రామమందు ప్రవర్తించిరి వీరిలో దేవతలు అసురులను జయింపగోరి ఉద్గీథాక్షర మనెడి ఓంకార రూపమును అగ్నిష్టోమాది యజ్ఞములలో ఔద్గాత్రకృత్యమందు సాధన రూపముగా ఉపాసించుటకు పరిగ్రహించిన వారుగా అయిరి ఈ విషయము విస్తరముగ జూడ తలంపు గలవారు 'ఛాందోగ్యోపనిషత్తు' న చూడనగును ఇచ్చట సంగ్రహముగా మాత్రము వ్రాయబడెను దశోపనిషత్తులలో ఈఛాందోగ్యోపనిషత్తు, బృహదారణ్యకము, తైత్తిరీయములను మూడును చాల గొప్పవి

తాను తత్ర మృత్యుర్యథా మత్స్యముదకే పరిపశ్యేదేవం
పర్యపశ్య దృచి సామ్ని యజుషి తేను విదిత్వోర్ధ్వా ఋచ
స్సామ్నో యజుషః స్వరమేవ ప్రావిశన్ ॥

మత్స్యఘాతకుడు జలమునందు ఉండెడి మత్స్యమును గాలము మొదలయిన సాధనములతో గ్రహించుటకు సాధ్యమయ్యెడి లాగున యోచించునట్లు మృత్యువు సత్కర్మానుష్ఠానమునందు ప్రవేశించిన దేవతలను గ్రహించుటకు కర్మక్షయమునే సాధనమునుగా నాలోచించి కాలమును కనిపెట్టి యుండెను ఆ దేవతలు కర్మయందుండెడి క్షయిష్ణుత్వ దోషమును, పాపరూపమగు మృత్యువుయొక్క వ్యాపారమును తెలిసికొని అనిత్యమయిన కర్మ మృత్యు భయమును పోగొట్టుకొనుటకు సాధకము కాజాలదని నిశ్చయించి విధ్యుక్తకర్మ త్యాగ పూర్వకముగా అమృతాభయాక్షర స్వరూపమయిన ఉద్గీథ ప్రణవోపాసన యందు నిష్ఠగలవారైరి అనగా అనిత్య మయిన కర్మఫలమందు వైరాగ్యము గల్గినందున దేవతలు ప్రణవోపాసనకు అభిముఖులయిరి.

యదా వై ఋచమాప్నోత్యోమిత్యేవాతి స్వరత్యేవగ్
సామైవం యజురేష ఉ స్వరో యదేత దక్షరమేత దమృత
మభయం తత్ప్రవిశ్య దేవా అమృతా అభయా అభవన్ ॥

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము మొదలయిన వానియొక్క అధ్యయన సమాప్తియందు ఓం అనెడి శబ్దోచ్చారణ చేయబడుచున్నది కనుక ఈ ఓంకారమునకు స్వరమనెడి సంజ్ఞ గలిగినది ఓంకారమే అక్షర స్వరూపమును, అమృతాభయ రూపమయిన పరబ్రహ్మోపాసనకు ముఖ్యాలంబనమును అయినది కనుక ప్రసిద్ధులగు దేవతలు బ్రహ్మబుద్ధిచేత ఈ ఓంకారమును ఉపాసించి స్వరూపగుణ సంబంధముచేత అమృతాభయ స్వరూపు లయిరి

సయ ఏత దేవం విద్వా నక్షరం ప్రణౌత్యేత
దేవాక్షరగ్ స్వర మమృత మభయం ప్రవిశతి
తత్ప్రవిశ్య యదమృతా దేవాస్తదమృతో భవతి ॥

ఉపాసనయొక్క ఫలము నిరూపింపబడుచున్నది ఏ పురుషుడు ఈ ఉద్గీథాక్షర స్వరూపమయిన ఓంకారమును అమృతాభయ రూపమయిన పరబ్రహ్మోపాసనకు ముఖ్యమయిన ఆలంబన మని తెలిసికొని ఉపాసించు చున్నాడో, ఆ ఉపాసకుడు బ్రహ్మస్వరూపోపాసనచేత సిద్ధులైన దేవతలు ఏ ప్రకారము అమృతాభయ స్వరూపులు అయియున్నారో, ఆ ప్రకారము బ్రహ్మస్వరూప సాక్షాత్కారముచేత సిద్ధుడై అమృతాభయ రూపుడవునని తాత్పర్యము ద్వితీయ ప్రపాఠకమున నిరువది మూడవ ఖండము

ప్రజాపతిర్లోకానభ్యతపత్తేభ్యోఽభితప్తేభ్యస్త్రయీ
విద్యా సంప్రాస్రవత్, తామభ్యతపత్తస్యా అభితప్తాయా
ఏతా న్యక్షరాణి సంప్రాసవన్త భూర్భువస్స్వరితి ॥

లోక సృష్టి యొక్క అనంతరము సృష్టికర్తయైన బ్రహ్మ, లోకములోని సారమును గ్రహించుటకు సంకల్పించిన నిరన్తర ధ్యానమును తపస్సును జేసెను. ఆ ప్రకారము తపోధ్యాన విషయమైన లోకములయందు ఋగ్యజుస్సామములను వేదత్రయము సారభూతముగా నిశ్చయింపబడిన వయ్యెను ఈ త్రయీ

విద్యయందును సారము తెలియవలసినదిగా సంకల్పించి ధ్యానము చేసిన వాడాయెను ఈ లాగున నిరన్తరధ్యాన విషయమైన మూడు వేదములలో వ్యాహృతిత్రయమైన భూః భువః సువః అను అక్షరములు సారభూతములుగా నిశ్చయింపబడిన వయ్యెను

**తాన్యభ్యతపత్తేభ్యోఽభితప్తేభ్య ఓంకారస్సంప్రాస్రవత్**
**తద్యథా శంకునా సర్వాణి పర్ణాని సంతృణ్ణాన్యేవమోంకారేణ**
**సర్వా వాక్ సంతృణ్ణా ఓంకార ఏవేదగ్ సర్వమోంకార ఏవేదగ్ సర్వమ్ ॥**

పూర్వమంత్రమునందు వేదత్రయము యొక్క సారభూతముగా నిశ్చయింపబడి యుండెడి భూర్భువస్సువః అను వ్యాహృతిత్రయ సంబంధమయిన యక్షరములలోని సారమును సైతము తెలిసికొనుట కొఱకు సంకల్పించి, సృష్టికర్తయయిన బ్రహ్మ నిరన్తరధ్యాన రూపమయిన తపస్సును జేసెను ఈ ప్రకారము తపోధ్యాన విషయము లయిన వ్యాహృత్యక్షరములలోను ఓంకారమను నక్షరము సారభూతముగా తెలియబడినందున స్థూలసూక్ష్మ రూపముగా నుండెడి సర్వ ప్రపంచమునకు ఓంకారమే కారణముగా నిశ్చయించెను లోకమందు పర్ణము (ఆకు) యొక్క మధ్యనాళముచేతను సమస్త పర్ణము లనుస్యూతమై యే ప్రకారము వ్యాపింపబడియున్నవో యా ప్రకారమే స్థూలసూక్ష్మరూపముగా నుండెడి ప్రపంచమంతయు నామమాత్ర వికారమును సమస్తనామములు అకారము చేరి యున్నందున అకారమాత్రమును, అకారము ఓంకారమునందు అవయవ భూతమైన యొక వర్ణముగా నున్నందున ఓంకారము చేతనే సర్వము వ్యాపింపబడి యున్నది కనుక సర్వ ప్రపంచాశ్రయభూతమయిన ఓంకారమే సర్వాధిష్ఠానమైన పరబ్రహ్మోపాసన జేయుటకు ముఖ్య ప్రతీకమై యున్నందున ఓంకార స్వరూపముగానే పరమాత్మోపాసన చేయుట ముఖ్యమని తాత్పర్యము కావుననే-

**ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా ।**
**కంఠం భిత్త్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభౌ ॥**

ఓంకారశబ్దము, అథశబ్దము ఈ రెండు మొదట బ్రహ్మదేవుని కంఠమును భేదించుకొని బయటికి వచ్చినవి అందువలన ఈ రెండు శబ్దములు

మంగళస్వరూపములు, సమస్త విఘ్నములను నశింపజేయునవి బ్రహ్మదేవుడు పై యుపనిషత్తున జెప్పిన ప్రకారము సృష్టి మూలతత్త్వమును గనుగొనుటకు చిరకాలము తపమాచరించి కనుగొనిన సారము ఈ ఓంకార మగుటచేత, ప్రప్రథమమున ఓంకారమును ఎలుగెత్తి వెల్లడి చేసిరి

**ఓమిత్యేకాక్షరధ్యానా ద్విష్ణుర్విష్ణుత్వ మాప్తవాన్ ।**
**బ్రహ్మ బ్రహ్మత్వమాపన్న శ్శివతామభజచ్ఛివః ॥**

ఏకాక్షరమగు నీ ప్రణవము యొక్క ధ్యానమువలననే విష్ణువు విష్ణుత్వ మును, బ్రహ్మ బ్రహ్మత్వమును, శివుడు శివత్వమును బొందెను ఓంకారధ్యాన ప్రభావమువలననే బ్రహ్మ సృష్టిశక్తిని, విష్ణువు పాలనశక్తిని, శివుడు లయ మొనరించు శక్తిని బడయగల్గిరి ఈ వాక్యము వలననే ఓంకారము యొక్క మహిమను జనులు తెలిసికొనగలరు హిందువులకు వేదమే ప్రామాణిక గ్రంథము దీనిని శ్రుతి యందురు తర్వాత నేర్పడినది మానవ శాస్త్రము దీనిని స్మృతి యందురు ఇది మనుమహర్షి తెలిపినదగుటచే దీనికి మనుస్మృతి యని పేరు వచ్చినది ధర్మశాస్త్రము లన్నిటిలోను ఇది మొదటిది ఛాందోగ్యోపనిషత్తున సృష్టియొక్క మూలతత్త్వము బ్రహ్మదేవుడు దీర్ఘకాల తపముచే కనుగొనిన ప్రణవమునే దీనియందు గూడ నిరూపించడమైనది (మనుస్మృతి)

**అకారం చా ప్యుకారం చ మకారం చ ప్రజాపతిః ।**
**వేదత్రయాన్నిరదుహద్భూర్భువస్స్వరితీతి చ ॥**

బ్రహ్మ ఋగ్యజుస్సామలక్షణములగు మూడు వేదముల నుండి అకారమును, ఉకారమును, మకారమును, భూః భువః స్వః అను మూటిని క్రమముగా గ్రహించెను

ఈ భూః భువః, స్వః అను మూడును వ్యాహృతు లనబడును ACC ఛాందోగ్యోపనిషత్తులో చెప్పినదియు ఇదియు సరిపోయినవి

**త్రిభ్య ఏవ తు వేదేభ్యః పాదం పాదమదూదుహత్ ।**
**తదిత్యృచో౽స్యాస్సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః ॥**

ప్రజాపతియగు పరమేష్ఠి మూడు వేదముల నుండి 'తత్సవితుః' అను ఋక్కుయొక్క ఒక్కొక్క పాదమును గ్రిగొనెను

**ఏతదక్షరమేతాం చ జపన్ వ్యాహృతి పూర్వికామ్ ।**
**సన్ధ్యయోర్వేదవిద్విప్రో వేదపుణ్యేన యుజ్యతే ॥**

కనుక రెండు సంధ్యలందును 'ఓమ్' అను నీ యక్షరముతో గూడ ఈఋక్కును జపించు వేదవేత్తయగు విప్రుడు వేదాధ్యయన పుణ్యము నొందుచున్నాడు

**సహస్రకృత్వస్త్వభ్యస్య బహిరేతత్త్రికం ద్విజః ।**
**మహతోఽప్యేనసో మాసాత్త్వచేవాహిర్విముచ్యతే ॥**

ద్విజుడు సన్ధ్యాకాలమందును, తక్కిన సమయములందును గ్రామమునకు వెలుపల నీ యోంకారముతో గూడిన వ్యాహృతిత్రయమును వేయి పర్యాయములు ప్రతిదినము జపించిన యెడల నొక్కమాసమునకు, సర్పము కుబుసము నుండి విడివడునటుల మహాపాపములనుండియు విడుదల నొందును

గ్రామమునకు వెలుపల అని చెప్పుటచే నిశ్శబ్దముగా నుండు ప్రదేశముండ వలయునని తెలుపడమైనది నిశ్శబ్దముగా నుండనిచో చిత్తైకాగ్రత గలుగదు ప్రాతస్సన్ధ్యాకాలములో తప్పక ధ్యానాదులను జేయుచు మఱల ఎప్పుడెప్పుడు మనస్సు ధ్యానాభిముఖముగా తిరుగుచుండునో, అప్పుడెల్లను ధ్యానము చేయుచుండ వలయును అత్తరి ప్రత్యేకము ఆసనముగాని, ఋష్యాదిన్యాసము గాని యుండనవసరము లేదు

**యోఽధీతేఽహన్యహన్యేతాంస్త్రీణి వర్షాణ్యతంద్రితః ।**
**స బ్రహ్మపదమభ్యేతి వాయుభూతః ఖమూర్తిమాన్ ॥**

ఎవడు ప్రతిదినము సోమరి గాక ఓంకార పూర్వకములగు మహా వ్యాహృతులను మూడు సంవత్సరముల కాలము జపించునో, వాడు పరబ్రహ్మము నొందుచున్నాడు అతడు వాయువు వలె సంకల్పసిద్ధి గలవాడును, బ్రహ్మ స్వరూపుడు నగుచున్నాడు

క్షరంతి సర్వా వైదిక్యో జుహోతి యజతి క్రియా : ।
అక్షరం దుష్కరం జ్ఞేయం బ్రహ్మ చైవ ప్రజాపతిః ॥

వేదవిహితములైన హోమయాగ రూపములగు క్రియలన్నియు నశించు చున్నవి ఓం అను నక్షరము బ్రహ్మప్రాప్తి హేతుభూత మగుటవలన నశింపదు ఏలయన ప్రజల కధిపతియు నీ బ్రహ్మ కాన నా బ్రహ్మస్వరూపమే ఈ యోంకారముగను బ్రహ్మస్వరూపముగను బ్రహ్మప్రతిపాదకముగను నుండుట చేత నోంకారమే బ్రహ్మము రెండు తెరగులగు (బ్రహ్మత్వము చేతను బ్రహ్మత్వ ప్రతిపాదకత్వము చేతను) నోంకారమును జపించుట మోక్షప్రదమని భావము

ఆద్యం యత్ర్యక్షరం బ్రహ్మ త్రయీ యస్మిన్ ప్రతిష్ఠితా ।
స గుహ్యోఽన్యస్త్రివృద్వేదో యస్తం వేద స వేదవిత్ ॥

సర్వవేదముల మొదటిదియై అకార ఉకార మకార స్వరూప మైనందున త్ర్యక్షర స్వరూపమైన ఏ వేదసారము గలదో, ఏ మూడక్షరములయందే మూడు వేదము లున్నవో, అది మఱియొక త్రివృద్వేదము అప్రణవ మనునది వేద మంత్రములలో శ్రేష్ఠమైనది గనుకను, పరమార్థ స్వరూపమగు బ్రహ్మమును వివరించునది గనుకను, పారమార్థిక మైనందున జపతపంబులు చేయువారికి మోక్షప్రద మైనందున మిక్కిలి రహస్యమును, గోప్యమునైనది ఎవ డీప్రణవమును స్వరూపముతోను, నర్థముతోను నెఱుంగునో వాడు వేదవేత్త యగును

ప్రణవమును జపించునప్పుడు ప్రణవార్థమైన పరబ్రహ్మభావనమును గలిగి యుండవలయును పతంజలి మహర్షియు ఈలాగుననే యుపదేశించెను "తజ్జపస్తదర్థభావనమ్" అనగా అర్థముతో గూడ జప మొనర్చవలయును ఈ విషయమై యిది వరలో వ్రాసిన గ్రంథములలో విస్తారముగా జెప్పబడియున్నది కలియుగములో భగవద్గీతకు సమానమగు స్థానము మఱియొకటి లేదని సర్వమతముల యొక్కయు, సర్వపండితుల యొక్కయు ఏకాభిప్రాయమై యున్నది దానిలో అష్టమాధ్యాయమున మొదటనే అర్జునుడు వేసిన ఏడు ప్రశ్నలలో కడపటి ప్రశ్న యనునది- అంత్య కాలమున "ఎట్టి భావన కలిగియుండిన పరమాత్మను ముముక్షువు పొందగలుగును?" అని గలదు "ప్రయాణకాలే చ

కథం జ్ఞేయోసి నియతాత్మభిః'' దీని యర్థము పైన తెలిపినదే దీనికి శ్రీకృష్ణభగవాను డిచ్చిన సమాధాన మిది

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥**

అన్త్యకాలమున ప్రణవ ముచ్చరించుచు ప్రణవార్థమైన పరమాత్మను భావన చేసికొని ఎవడైతే దేహమును వీడి పోవుచున్నాడో అట్టివాడు సర్వోత్కృష్టమగు బ్రహ్మపదమును పొందుచున్నాడు యచ్ఛబ్దప్రయోగముచే మనుష్య మాత్రులలో ఎవరైనను బ్రహ్మపదమును ఇట్టి అనుష్ఠానము గలిగిన పొందవచ్చునని తెలుపడ మైనది ఇట్టి భగవద్వాక్యములలో కూడ నమ్మకము లేనిచో ఇక ఎవరైనను ఏమి జేయగలరు? శ్రుతిలోను, స్మృతిలోను చెప్పిన సారము మీకు తెలుపడమైనది మహనీయుల ఆశయమును చెప్పడమైనది ఇక అనుష్ఠానముతో సహా మీ యాచరణము చక్కగా నుండులాగున చూచుకొనవలయును

ఇక ఈ విషయమై అనేక గ్రంథములు ఇదివరలో వ్రాసి యుండుటచేతను, ముఖ్యముగా ప్రణవోపాసనను గురించి ఓంకార గ్రంథమున తెలిపియుండుట చేతను మరల విస్తరించి వ్రాసి ఈ గ్రంథమును విస్తరించ దలంచలేదు

**యస్య వాఙ్మనసీ శుద్ధే సమ్యగుప్తే చ సర్వదా ।**
**స వై సర్వమవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్ ॥**

ఎవని యొక్క వాక్కు అసత్యాలాపాదులచే దుష్టము కాకయు, మనస్సు రాగద్వేషాదులచే జెడకయు నిర్మలములై యుండునో, అతడు వేదాంతమందు జెప్పబడిన సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ రూపఫలమును పొందును

**ఋషయస్సంయతాత్మానః ఫలమూలానిలాశనాః ।**
**తపసైవ ప్రపశ్యంతి త్రైలోక్యం సచరాచరమ్ ॥**

ఋషులు వాఙ్మనః కాయనియమములు గలవారై ఫల మూలములను భక్షించువారై ప్రాణాయామనిష్ఠ గలవారై తపంబొనర్చియే తమజ్ఞానదృష్టిచే జంగమస్థావరాత్మకమైన స్వర్గమర్త్య పాతాళములను నొక ప్రదేశమునుండియే

చూడగల్గియున్నారు

ఋషయో దీర్ఘసన్ధ్యత్వాద్దీర్ఘమాయురవాప్నుయుః ।
ప్రజ్ఞాం యశశ్చ కీర్తిఞ్చ బ్రహ్మవర్చసమేవ చ ॥

ఋషులు ఎక్కువ కాలము సంధ్యానుష్ఠానము చేయుటచే దీర్ఘాయుస్సు నొంది చిరకాలము జీవించి బుద్ధిని, జీవితదశలో యశస్సును, మృతులై కీర్తిని, అపార ప్రజ్ఞను పొందిరి కావున ప్రజ్ఞాశక్తిని, జ్ఞానశక్తిని, యశస్సును, కీర్తిని సుఖమును ముక్తిని గోరువారు దీర్ఘకాలము తపస్సును, ఉపనిషత్పఠనమును చేయవలయును

జప్యేనైవ తు సంసిద్ధ్యేద్బ్రాహ్మణో నాత్ర సంశయః ।
కుర్యాదన్యన్న వా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే ॥

బ్రాహ్మణుడు జప్యము(జపము) చేతనే నిస్సంశయముగా మోక్షసిద్ధిని పొందును తక్కిన యాగాది వైదిక కార్యములను చేసినను జేయనీ, చేయక వదలినను వదలనీ, బ్రాహ్మణుడు సర్వప్రాణుల యందును మైత్రీభావము గలిగియుండవలయును ఒక్క ప్రాణికి గూడ క్లేశము గలుగజేయరాదు

ప్రణవాద్యాస్త్రయో వేదాః ప్రణవే పర్యవస్థితాః ।
వాఙ్మయం ప్రణవం సర్వం తస్మాత్ప్రణవమభ్యసేత్ ॥

మూడు వేదములును ఓంకారమే మొదటగా గలవి ప్రణవము చేతనే ఆవేదములు సమాప్తి జెందినవి సకలవాక్కులును ప్రణవస్వరూపములే ఈ ప్రణవము నొకదానిని జపించినచో సకల మన్త్రజపములును సమస్త వేదాధ్యయనమును జేసిన ఫలము పొందుదురు

పద్మాసనం సమారుహ్య సమకాయశిరోధరః ।
నాసాగ్రదృష్టిరేకాంతే జపేదోంకారమవ్యయమ్ ॥

సాధకు డేకాన్తప్రదేశమున పద్మాసనస్థుడై సమానముగా శరీరమును శిరస్సును మెడను ఉంచినవాడై భ్రూమధ్యమున దృష్టినుంచి నాశరహితమైన

ప్రణవమును బ్రహ్మభావముతో జపించవలయును అని యోగ చూడామణ్యుపనిషత్తు

ఇక ప్రణవధ్యాన విధానమును తెలిపెద బ్రహ్మోపనిషత్తు-

**ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ।**
**ధ్యాననిర్మథనాభ్యాసాద్దేవం పశ్యేన్నిగూఢవత్ ॥**

ఆత్మను క్రింది అరణిగాను, ప్రణవమును మీది అరణిగాను చేసి ధ్యానమనెడి మథనాభ్యాసమువలన రహస్యమగు పరబ్రహ్మమును సాధకుడు దర్శించుచున్నాడు

అరణి యన అగ్ని నుత్పత్తి చేయుటకు అమర్చిన కొయ్య విశేషము కట్టెయందు నిప్పుండినను తఱచునప్పుడే పుట్టునట్లు ఆత్మ చైతన్యము అంతట నుండినను ఆత్మానుసంధాన ధ్యానము చేయువారికే లభించును

**ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే ।**
**అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥**

ప్రణవము ధనుస్సు, బాణము ఆత్మ, లక్ష్యము బ్రహ్మమై యున్నది అప్రమత్తుడై, జితేంద్రియుడై, చిత్తైకాగ్రత గలవాడై ధ్యానముచే బ్రహ్మమును పొందవలయును బాగుగ నెక్కుపెట్టబడిన ధనుస్సుచేత బాణ మెటుల లక్ష్యమును జేరునో, అటులనే అభ్యసింపబడిన ప్రణవముచేత ఆత్మ అక్షర పరబ్రహ్మమునందు చేరుచున్నది. ఇక ప్రణవోచ్చారణ మాత్రను గురించి తెలిపెద

**హ్రస్వో దహతి పాపాని దీర్ఘస్సంపత్ప్రదోఽవ్యయః ।**
**అర్ధమాత్రాసమాయుక్తః ప్రణవో మోక్షదాయకః ॥**

ఈ ఓంకారము హ్రస్వముగా నుచ్చరింపబడిన సమస్త పాతకములను నశింపజేయును దీర్ఘముగా నుచ్చరింపబడిన ఓంకారము అక్షయమగు సంపత్తు నొసంగును. అనగా నశించని విజ్ఞానమును గలుగజేయునని భావము. అర్ధమాత్రయగు నాల్గవ పాదమో సమన్వయ పఱచి దాని యర్థమును భావములో

నుంచి ధ్యానింపబడెడు ప్రణవము మోక్షము నొసగును మరియొక విధము

హ్రస్వో దహతి పాపాని దీర్ఘో మోక్ష ప్రదాయకః ।
ఆప్యాయనప్లుతో వాఽపి త్రివిధోచ్చారణే న తు ॥

ఓంకారోచ్చారణము హ్రస్వమయ్యేనేని పాపముల నన్నిటిని దహింప జేయును దీర్ఘమగుచో ముక్తిని గలుగజేయును ప్లుతమయినచో ఇష్టసిద్ధిని గలుగజేయును ఈలాగున ఉచ్చారణము మూడు విధములుగ గలదు

ఏక మాత్రో భవేద్ధ్రస్వః ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే ।
త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయో వ్యంజనం త్వర్ధమాత్రకమ్ ॥

ఒక మాత్ర కాలమునకు హ్రస్వమనియు, రెండు మాత్రల కాలమునకు దీర్ఘమనియు, మూడు మాత్రల కాలమునకు ప్లుతమనియు, అర్ధమాత్రల కాలమునకు వ్యంజన మనియు పేర్లు 'అ' హ్రస్వమనియు, 'ఆ' దీర్ఘమనియు గ్రహించదగినది

హ్రస్వం బిందుగతం ధైర్ఘ్యం బ్రహ్మరంధ్రం గతం ప్లుతమ్ ।
ద్వాదశాన్తర్గతం మన్త్రం ప్రసాదం మన్త్రసిద్ధయే ॥

ఈ ప్రణవధ్వని బిందుగత మగునప్పుడు హ్రస్వమనియు, బ్రహ్మరంధ్రగత మగునప్పుడు దీర్ఘమనియు, ద్వాదశాన్తర్గత మగునప్పుడు ప్లుతమనియు చెప్పబడును

ఇట్టి ప్రణవ పరబ్రహ్మము సర్వజీవరాసులలో వెలుగుచుండియు అందటికిని లభ్యము కానందులకు కారణము తెలుపబడుచున్నది.

తిలమధ్యే యధా తైలం క్షీరమధ్యే యధా ఘృతమ్ ।
పుష్పమధ్యే యధా గన్ధః ఫలమధ్యే యధా రసః ॥
కాష్ఠాగ్నివత్ప్రకాశేత ఆకాశే వాయువచ్చరేత్ ॥

నువ్వులయందు నూనెవలెను, పాలయందు నేయివలెను, పుష్పమునందు వాసన వలెను, ఫలమునందు రసమువలెను, కట్టెయందు నిప్పువలెను,

ఆకసమునందు గాలివలెను ఈ బ్రహ్మము నిగూఢమై యున్నది పై జెప్పిన వస్తువులలో గల సారమును తగిన క్రియలచే వేరు పరచునట్లు ధ్యానతపస్సులచే దేహములో గల ఆత్మను గూడ వేరుపరచి దర్శించు కొనవలయును

ఇక ప్రణవానుసంధానము ఎటులుండవలయునో అట్టి విధానము తెలిపెద

**తైలధారామివాచ్ఛిన్నం దీర్ఘఘంటానినాదవత్ ।**
**అవాచ్యం ప్రణవస్యార్థం యస్తం వేద స వేదవిత్ ॥**

తైలధారవలె నెడతెగనిది వలెను, దీర్ఘంబైన ఘంటా ధ్వనివలెను, విచ్ఛేదరహితంబైనదై, వాక్కు చేత వర్ణించుట కలవి గానిదగు బ్రహ్మస్వరూప ప్రణవమును ఎవ్వడెఱుగునో వాడే వేదవేత్త యగును

ఒక పాత్ర నుండి మఱియొక పాత్రలోనికి తైలమును పోయునప్పుడు ఏలాగున ధార యెడతెగక యుండునో, ఆలాగున పెద్ద గంట వాయించిన తర్వాత ఆశబ్ద మేలాగున దీర్ఘముగా నయి క్రమముగ సన్నగిలిపోవుచుండునో, ఆలాగున ప్రణవోచ్చారణయు నుండవలయును. ధ్వని లయమగునటుల మనస్సుగూడ బ్రహ్మమందు లయము పొందవలయును ఉప్పురాయి జలములో నేలాగున గ్రమముగ లయమై, తన రూపము లేనిదై, జలరూపమై పోవుచుండునో ఆలాగున ధ్యానమందు మనస్సు లయమై బ్రహ్మాకారస్థితి నొందవలయును. దానికి తగిన ఆసనమును, ధ్యానమును, స్థలమును క్రింద నిరూపింపబడుచున్నవి

**మృద్వాసనే సమాసీనో జితచిత్తేన్ద్రియక్లమః ।**
**ఓమిత్యుచ్చారయేత్తావన్మనో యావత్ప్రసీదతి ॥**

ఏకాంతమున మెత్తని ఆసనమందు కూర్చుండి ఇన్ద్రియాది వృత్తులను నిశ్చలముగా జేసికొని మనస్సు నిర్మలమై బ్రహ్మాకారమగు పర్యన్తము ఓంకారమన్త్రమును పరమాత్మ పరముగా భావనచే ధ్యానము చేయవలయును

మెత్తని ఆసనముండిన పాదములకు నొప్పి తగులదు కఱకు అయినదైనను కఠినమైన దైనను చరణములకు నొప్పి గల్గును. అప్పుడు కాలు మార్చుకొని కూర్చుండవలసియుండును. అట్లులేక యుండుట కొఱకే మృదువైన

ఆసన ముండవలయునని చెప్పుటకు కారణమైనది కావుననే దర్భాసనము, దానిపై చర్మాసనము, దానిపై మెత్తని దళసరిదైన వస్త్రాసన ముండవలయునని శ్రీ కృష్ణభగవానుడు గీత ఆరవ అధ్యాయములో ఉపదేశించిరి ధ్యానయోగపరులు 6వ అధ్యాయమును పఠించిన ధ్యానమును గుఱించిన విషయము లన్నియు తెలిసికొన గల్గుదురు

ఇక ఛాందోగ్యోపనిషత్తున ప్రణవోపాసన గురించిన ఒక అపూర్వ గాధ గలదు దీనిని తెలిసికొనిన ప్రణవోపాసనచే ఎవరు దేనిని గోరుదురో, అట్టి ఫలమును పొందగలరనియు, ప్రణవోపాసనకు మనుష్యులేగాక, దేవతలే గాక, జంతువులు గూడ అర్హులనియు అర్థము బోధపడగలదు



## ఛాన్దోగ్యోపనిషత్తు - ప్రథమ ప్రపాఠకము - ద్వాదశ ఖండము

**ఆధాత శ్శౌన ఉద్గీథ స్తద్ధబకో దాల్భ్యోగ్లావో వా మైత్రేయ స్స్వాధ్యాయ ముద్వవ్రాజ ॥**

పూర్వ ఖండమునందు అన్నము లేనందున సంభవించిన కష్టావస్థ నిరూపింపబడి యున్నది కనుక అట్టి కష్టదశ లేకుండుట కొఱకు అన్న ప్రాప్తి సాధకముగా నుపాసన విధింపబడుచున్నది అన్నమపేక్షా విషయ మైనందువలన, అన్నలాభ నిమిత్తమై, శునకములచే గ్రహింపబడి యుండెడి ఉద్గీథ విద్య ప్రశంసింపబడుచున్నది దాల్భ్యుడను ఋషికి ఔరసుడును, మిత్రయను నామెచే పుత్రుడుగా స్వీకరింపబడియుండెడు బకుడని గాని, గ్లావుడనిగాని నామధేయముతో ప్రసిద్ధమయిన ద్వ్యాముష్యాయణ ఋషి స్వాధ్యాయము చేయుట కొఱకు గ్రామమును విడిచి వెలుపల సంచరించుచుండెను

**తస్మై శ్వా శ్వేతః ప్రాదుర్బభూవ తమన్యే శ్వాన ఉప**
**సమేత్యోచు రన్నం నో భగవానాగాయతు అశనాయామ వా ఇతి ॥**

ఈ ప్రకారము స్వాధ్యాయ నిమిత్తమయి గ్రామము వెలుపల సంచరించు చుండగా దాల్భ్యఋషికి దివ్యమయిన తెల్లని శునకము కనబడెను ఆ శునకము

ననుసరించి మరికొన్ని సామాన్య శునకములు వచ్చి యాశ్రయించి, గొప్పగా నుండెడి యాతెల్లని శునకమును ప్రార్థించి యోసర్వజ్ఞుడా! మేము ఆకలి గొనియున్నారము మా భక్షణ కొరకు మీ గానవిద్యా సామర్థ్యము చేత నన్నమును సంపాదించి యిమ్మని కోరిన వాయెను

తాన్ హోవాచే హైవమా ప్రాతరుపసమీయా తేతి తద్ధ బకో
దాల్భ్యో గ్లావో వా మైత్రేయః ప్రతిపాలయాఞ్చకార ॥

గాన సామర్థ్యముచేత నన్నమును సంపాదించి యిమ్మని కోరిన యాశునకముల నుద్దేశించి శ్రేష్ఠమైన శ్వేతశునకము చెప్పుచున్నది మీరు ఈ ప్రదేశములోనే ప్రాతఃకాలమునందు నాతోడ గలిసికొన్న యెడల మీ కార్యమును సాధించెదనని శ్వేత శునకము ఆజ్ఞాపించెను ఈ వాక్యమును ఆ బకుడని లేక గ్లావుడని పేరు గలిగి యుండెడి ఋషి వాక్య విని ఆ శునకముల వృత్తాంతము తెలిసికొనవలెననెడి యభిప్రాయముతో ఆ ప్రదేశమందు ఆ కాలమును గనిపెట్టి యుండెను

తేహ యథై వేదం బహిష్పవమానేన స్తోష్యమాణా
స్సగ్ఁరబ్ధాస్సర్పన్తీ త్యేవమాసస్పృపుస్తేహ సముపవిశ్య హించక్రుః ॥

పూర్వమంత్రమందు చెప్పిన ప్రకార మాప్రదేశములో ప్రాతఃకాలము బకగ్లావ ఋషి యొక్క సమక్షములో శునకములు శ్వేత శునకముతో కలసి ఉద్గాతృపురుషులు బహిష్పవమాన స్తోత్రమును జేయుటకు సంరంభముతో హవిర్ధానమునుండి అధ్వర్యుడు మొదలుకొని యజమానుని వఱకు నొకరినొకరు విచ్ఛేదము లేకుండ సమవేతులై సంచరించి స్తోత్ర స్థానమందు ఏలాగున ప్రవేశింతురో, ఆ ప్రకారమే శ్వేతశునకమును ప్రధానముగా జేసికొని యన్ని శునకములు ఒక దానియొక్క తోకను మఱియొకటి నోటితో దృఢముగా కఱచుకొని యా ప్రదేశమునకు వచ్చి ప్రవేశించి అక్కడ యథాన్యాయముగా గూర్చుండి ఉద్గీథ గానారంభక మయిన హింకారమును జేసినవి

ఓ3 మదా3 మోం3 పిబా3 మోం3 దేవో వరుణః ప్రజా
పతిస్సవితా౨౨న్న మిహా౨ హరద౞ న్నపతే3౨౨న్న

మిహా౨౨౨హారా౨౨౨ హారో3మితి ॥

ఈ ప్రకారము శునకములు స్తోత్ర స్థానమందు కూర్చుండి గానము జేసెను సమస్త లోకమునకు ప్రకాశకు డైనందున దేవశబ్ద వాచ్యుడును, వర్షించువా డైనందున వరుణుడును, సమస్త ప్రజలకు పాలకు డైనందున ప్రజాపతియును అయి సమస్త ప్రపంచమును ప్రకాశ ప్రవృత్తులచేత ప్రేరణ చేయువాడై సవితయను పేరు గల యాదిత్య దేవత మాకు అన్నమును ఇచ్చునుగాక యని సంరంభముతో ఓం అని హింకారమును జేసి మేము భక్షించెదము అని మరల ఓం అని హిం కారముచేసి మేము పానము చేసెదము అని, మరల ఓం ఓం అని మరల ఓం ఓం అని పునర్హింకారమును చేసినవై అన్నము నుత్పత్తి చేయుటకు కారణమై నియామకుడైన యాదిత్య దేవతా! మాకు అన్నమును పుట్టించి యిమ్మా! అన్నమును కలుగజేయుమా? యని ఆదరణముతో రెండు పర్యాయములుగా ప్రార్థించి, మరల(ఓం ఓం అని) హింకారముచేసి గానము చేసినవి

ఈ ప్రణవోపాసనము మహిమ వలన శునకములుగూడ తమకు కావలసిన అన్నమును సవితృ దేవతచే పొందినవని చెప్పుచుండగా ఇక పవిత్రజన్మ గల్గిన మానవులు పవిత్ర నిష్ఠగలిగి పరమాత్మను ప్రణవపూర్వకముగా ధ్యానించిన వారు వారు కోరెడి ఫలమును పొందుటలో సందేహము గలదా! ఏ ఫలము నుద్దేశించి యెవరు ప్రణవాక్షరపూర్వకముగా ప్రార్థించిన అట్టివారు కోరిన ఫలము వారికి గలుగుచుండును కామ్య ఫలమును గోరక మోక్షమును గోరువారికి బ్రహ్మపదము గల్గును. కోరికలతో ఉపాసన జేయువారికి కోరిన ఫలములు ప్రాప్తించును కాని అంతఃకరణ శుద్ధి గలిగి విషయరహితమై యుండువారికి గలుగు మోక్షము పై జెప్పిన వారికి కలుగదు ఫలాపేక్ష లేనివారై మోక్షము కొరకు మాత్రమభిలాష గలవారై యీ ప్రణవోపాసన యీశ్వరార్పణ బుద్ధితో జేయువారికి అంతఃకరణశుద్ధి గలుగుట, అవిద్యాదోషము నశించుట, బ్రహ్మప్రాప్తికి గల ఆటంకము లన్నియు దొలగుట, బ్రహ్మనిష్ఠ కనుకూలమగు సమస్త కార్యములు సమకూరుట యివన్నియు గల్గుటయే గాక మోక్షము గూడ ప్రాప్తించును ఈ విషయమై యితర ఉపనిషత్తులు చెప్పిన ప్రమాణ వాక్యములు నిరూపించెద

ప్రణవం హీశ్వరం విద్యాత్సర్వస్య హృది సంస్థితమ్ ।
సర్వవ్యాపినమోంకారం మత్వా ధీరో న శోచతి ॥

సకల ప్రాణుల యొక్క హృదయమందున్న యీశ్వరుని ప్రణవ పూర్వకముగా నుపాసించవలెను ఆకాశమువలె అంతట వ్యాపించిన ఓంకార పరబ్రహ్మమును ఉపాసించువాడు ఎచ్చటను శోకమును పొందడు

అమాత్రోఽనన్తమాత్రశ్చ ద్వైతస్యోపశమశ్శివః ।
ఓంకారో విదితో యేన స మునిర్నేతరో జనః ॥

మాత్రారహిత మైనట్టియు, అనన్త మయినదియు, మాయారహితమై నదియు, మంగళ స్వరూప మయినదియు నగు ఓంకారమును ఎవడెఱుంగు చున్నాడో వాడే ముని యగును మౌనము మాత్రము గలవాడు ముని కాజాలడు ఈ ఓంకార ధ్యానముచే ప్రకృతి గతములయిన సర్వ దోషములు నశించినవే గాక నిత్య మంగళ స్వరూపమగు ఆత్మప్రాప్తియు గలుగును అకార ఉకార మకారములకు మాత్రమే మాత్రలు గలవు చతుర్థ పాదము (తురీయము) మాత్రారహిత మయినది అందుచే నది అనంతము

యుంజీత ప్రణవే చేతః ప్రణవో బ్రహ్మ నిర్భయమ్ ।
ప్రణవే నిత్యయుక్తస్య న భయం విద్యతే క్వచిత్ ॥

ఇట్టి ప్రణవమునందు సాధకుడు మనస్సును బొందింపవలయును ప్రణవమే నిర్భయమగు బ్రహ్మము అనగా సర్వదుఃఖరహితమగు మోక్షము ప్రణవము నందెల్లప్పుడు యుక్తుడై యుండు వానికి దేని వలనను ఎచ్చోటను భయము గలుగదు. వానికి ఎల్లప్పుడును మంగళమే గల్గును ఓం శివం శాంతమమృత మద్వైతం ఓమ్

సంపూర్ణము
ఓం తత్ సత్.



# పీఠిక

పరిశుద్ధాత్మస్వరూపులగు ఆత్మ సోదరీసోదరులారా! కరుణా మూర్తియగు సర్వేశ్వరుని కృపచే లోకములో శాంతియు, కరుణయు, సద్భక్తియు, విజ్ఞాన బోధయున్ను వర్థిల్లునుగాక! సన్న్యాసయోగము అను ఈ గ్రంథము స్త్రీలకు సన్న్యాసమున కర్హతగలదని నిరూపించుట కొఱకే యైనను, స్త్రీలకేగాక, పురుషులకు గూడ గ్రహించవలసిన ధర్మము లనేకము లిందు గలవు కావున ఇది నారీమణులకు మాత్రము చెప్పబడిన ధర్మమని తలంపక త్యాగులై, బ్రహ్మనిష్ఠులై, సన్న్యాసులగు పురుషులుగూడ దీనిని గ్రహించుకొనవలయును పురుషులకు సన్న్యాసము అనాది సిద్ధముగా నేర్పడియుండుటవల్ల, పురుషులను గురించి యిచట ప్రత్యేకముగా చెప్పలేదు కాని సన్న్యాస ధర్మము స్త్రీలకున్ను, పురుషులకున్ను సమానము

ఇదివఱలో చాలామంది స్త్రీలకు సన్న్యాసాధికారమును శాస్త్రము విధించలేదనియే చెప్పుచుండిరి ప్రాచీన కాలమున సన్న్యాసినులగు వధూమణులు ఉండిరనియు, వారికిగూడ సన్న్యాసాధికారమును శాస్త్రము అంగీకరించి యున్నదనియు తెలుపుట కొఱకే బృహదారణ్యకము, భారతము, యోగవాసిష్ఠము మొదలగు గ్రంథములను నిరూపించడమైనది స్త్రీలకు నేల సన్న్యాసార్హత లేదని అడిగినచో, స్త్రీలు విచ్చలవిడిగా తిరుగుటచే చెడుటకు నెక్కువ కారణములు గలవనియు, చంచల స్వభావము గలవారగుటచే మనోనిశ్చలత్వము గలుగుట ప్రయాసమనియు రెండు కారణములనే ముఖ్యముగా తెలుపుదురు ఇకను కొన్ని కారణములు తెలిపినను అవి అంత ముఖ్యములు గావు పై చెప్పిన రెండు సమాధానములున్ను అంత సరియైనవి కావు ఏలన చెడు గుణములున్ను, చంచల స్వభావమున్ను గలవారు స్త్రీలలోను, పురుషులలోను ఉందురు వధూమణులలో నెవరైన అట్టి గుణము గలిగియుండినచో, యోషిన్మణు లందరికిన్ని దాని నంట గట్టుట గౌరవహానియే యగును పై చెప్పిన రెండు గుణములు గలవారు సన్న్యసించవలయునను తలంపు గలిగి యుండరు

మరియు ఈ గ్రంథమందు గూడ, బౌద్ధమత సన్న్యాసినుల గుఱించి

చెప్పునపుడు ఆబౌద్ధమత సన్న్యాసినులు పురుషులతో సంబంధము లేక ప్రత్యేకముగా నుండిరని తెలిపినందుచే సన్న్యసించినను, స్త్రీల నివాసస్థలము ప్రత్యేకముగానే యుండవలయును బ్రహ్మచర్యాశ్రమములో నుండియే 'సులభ' సన్న్యసించెను గృహస్థాశ్రమమందు భర్తతో గూడి యున్నపుడే 'మైత్రేయి' సన్న్యసించెను ఇట్లుండగా వైధవ్యస్థితిగల స్త్రీలు సన్న్యసింపవచ్చునా? అను విషయము చెప్పనక్కరలేదు దీనికి 'పౌతమసి' యే సాక్ష్యము అయితే తానుండు ఆశ్రమము బ్రహ్మచర్యమైనను, గార్హస్థ్యమైనను, లేక వైధవ్యస్థితియైనను అచ్చోటనే యుండి బ్రహ్మనిష్ఠాది అనుష్ఠానములు చేయుటకు ప్రతిబంధము ఉండిన మాత్రమే సన్న్యసించవచ్చునని శాస్త్రము బోధించుచున్నది పురుషులున్ను ఆలాగుననుండిన మాత్రమే సన్న్యసించవలయునని శాస్త్రముపదేశించుచున్నది

**సోఢ్వాఽపి కర్మవిక్షేపం చిత్తైకాగ్రే క్షమో యది ।**
**తదా వేత్తు గృహస్థోఽపి ప్రవ్రజత్వన్యథా పుమాన్ ॥**

కర్మవిక్షేపమును సహించి, చిత్తము నేకాగ్రముచేయ సమర్థుడయ్యేనేని, గృహస్థుడును ఆత్మను తెలియవచ్చును అట్లు కానపుడు పురుషుడు సన్న్యసించుగాక అని అనుభూతిప్రకాశము.

బ్రహ్మనిష్ఠయందు, వేదాధ్యయనమునందు, తపస్సునందు, యోగాభ్యాస మందు, భక్తియందు, ఏకాంతవాసమునందు, బ్రహ్మచర్యమందు, వానప్రస్థాశ్రమ మందు పురుషులకువలె స్త్రీలకున్ను సర్వాధికారము గలదని సర్వులున్ను అంగీకరించి యున్నారు సన్న్యాసాశ్రమ స్వీకరణమందు మాత్రమే, "ఆధునిక" జనులు కొంత ఆటంకమును చెప్పుచున్నారు దాని కారణముపైన నిరూపించడ మైనది మోక్షము కొఱకు సన్న్యాసము కారణము గాదనియు, దానికి జ్ఞానమే కారణమనియు నీ గ్రంథమున అనేక స్థలములలో నిరూపించడమైనది ఈ శ్లోకమున్ను దానినే రూఢిపరచుచున్నది మరియు మైత్రేయ్యుపనిషత్తునందు చెప్పినది చూడుడు

**ద్రవ్యార్థమన్నవస్త్రార్థం యః ప్రతిష్ఠార్థమేవ వా ।**
**సంన్యసేదుభయభ్రష్టః స ముక్తిం నాప్తు మర్హతి ॥**

ధనాభిలాషచే గాని, సన్న్యసించిన నన్నవస్త్రాదులు దొరకునని గాని, గౌరవస్థానము గలుగునను భావముతో గాని యెవడు సన్న్యసించునో వాడుభయభ్రష్టు డగును ముక్తిని పొందజాలడు

**కాషాయధారణం మౌండ్యం త్రివిష్టబ్ధం కమండలుః ।**
**లింగాన్యత్పథభూతాని న మోక్షాయేతి మే మతిః ॥**

కాషాయము, ముండనము, దండము, కమండలము మొదలగు చిహ్నములు మోక్షమునకు సాధనములు గావని మా సిద్ధాన్తము అని భారతమున జనకుడు వచించెను

**నైవ జన్మని సర్వస్మిన్ విద్యాఽసౌ సులభాఽపి తు ।**
**శిష్యలక్షణసంపూర్ణజన్మన్యేవ హి లక్ష్యతే ॥**

అన్ని జన్మములందు నీ బ్రహ్మవిద్య సులభము గాదు శిష్యలక్షణములు సంపూర్ణముగా నున్న జన్మమునందే కనబడుచున్నది అని అనుభూతి ప్రకాశము

అందరికిన్ని ఈ బ్రహ్మ విద్యయందు అధికారము లేదనియు, అనేక జన్మములలో జేసిన పుణ్యవిశేషముచేత, దైవానుగ్రహము చేత ప్రకృతి దోషములు నశించి, సంపూర్ణ వైరాగ్యము గలిగి, శమదమాది గుణములు గల ఒకానొక జన్మములోనే బ్రహ్మవిద్య కర్తృత గలుగుననియు నీ యొక శ్లోకమేగాక అనేక ప్రమాణము లుద్ఘోషించుచున్నవి ఇది పరమ సత్యమని మరువకూడదు నన్ను గూడ అనేక యోషిన్మణులు సన్న్యాస మివ్వవలయునని కోరుచుండిరి సరియైన ప్రమాణము ఇదివరలో దొరకనందుచే నెవరికిన్ని సన్న్యాసమిచ్చియుండలేదు మోక్షమునకు బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గలుగుటయే కారణమని చెప్పుచూ దానికి తగిన అనుష్ఠానములు, ఏకాంత ప్రదేశములు, ధ్యానయోగాదులు మాత్రము తెలుపుచూ రావడమైనది ఏలన అశాస్త్రీయ ప్రవర్తనము మౌర్ఖ్యమే యగును అంతే గాక విద్వాంసు లెవరైన తామవలంబించెడు వర్తనమునకు శాస్త్ర ప్రమాణము గలదా? యని అడిగినచో ప్రమాణరూపముగా సమాధానము నివ్వవలయును అదే పవిత్రమార్గ మగును అట్లు గానిది స్వేచ్ఛా ప్రవర్తనమనియే విద్వజ్జనులు తలంతురు కావుననే శ్రీగీతాచార్యుడు "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య

వ్యవ్య స్థితౌ" అని తెలుపడమైనది

దీనియందు స్త్రీలకు సన్న్యాసాధికారము గలదని మాత్రమే తెలుపడమైనది గాని, సన్న్యాసాశ్రమ స్వీకరణవిధి తెలిపియుండలేదు అది సన్న్యాసాశ్రమ స్వీకరణధర్మము నెరింగివారును, సన్న్యాసాశ్రమమందు నుండువారగు యతీశ్వరులవలన గ్రహించుకొనవలయును అట్లుగాక స్వయముగా సన్న్యసించుట, లేక విధి ప్రకారము సంస్కారాది కర్మలను జేయక, యెవరిచేనైన కాషాయ వస్త్రములు మాత్రము తీసుకొనుటయు శాస్త్రమంగీకరించదు శాస్త్రోక్తప్రకారము సంస్కారములు చేసిన సన్న్యాసాశ్రమమును స్వీకరించిన మాత్రమే తనయొక్క మనస్సునకు గూడ సమాధానము గలుగును లేనిచో తన మనస్సులో తనకే పలుమార్లు సందేహము గలిగి బాధనొందవలసి యుండును

అంతేగాక ఉత్తర దేశములో కొందరు మఠాధిపతులు విధిప్రకారము సన్న్యసించినారా? అని అడుగునపుడు అసత్యముగూడ చెప్పవలసివచ్చును మఱియు నీ దక్షిణదేశములో సన్న్యాసమంత అవసరము లేదు కాశీ, హృషీకేశ, హరిద్వారాది కొన్ని స్థలములలో బ్రహ్మనిష్ఠ చేయువారికి నీ సన్న్యాసాశ్రమ స్వీకారము కొంత సహాయమును గలుగజేయును ఏలన మఠములలో తురీయాశ్రమస్థులను మాత్రమే చేర్చుదురు అట్లుండ వారికి మాత్రమే బ్రహ్మ విద్యకు సంబంధించిన పాఠములను చెప్పుదురు ఈ రెండు కారణముల వల్ల ఆ ప్రాంతములో నుండువారికి సన్న్యాసాశ్రమ స్వీకరణము అనుకూలము గలుగజేయును ఇంత మాత్రమే సన్న్యాసాశ్రమ స్వీకరణ ముపయోగపడును

మఱియు దీనియందొక విశేషము గూడగలదు సత్యబుద్ధియు, నిర్మలహృదయము గలవాడు కొన్ని విషయములను నిగ్రహింపజాలినను, ప్రయాసమని తోచుటచే, నీ కాషాయ వేషధారణ తన పవిత్రతను సంరక్షించుటకు కారణమగును ఆలాగున దేహసంబంధులగు జనులనుండియు, కుటుంబ సంబంధ కార్యముల నుండియు, బాహ్యసంబంధ కర్మలనుండియు విముక్తి పొందుటకున్ను ఇది సహాయమును గలుగజేయును. ఇది వైరాగ్యముగల ముముక్షువులకున్ను, జిజ్ఞాసువులకున్ను చాల సహాయ కారి కదా!

మరియు సర్వసంగ వర్జితుడై సన్న్యసించునపుడుగాని, ధర్మబోధనార్థము తిరుగుచున్నపుడు గాని, యీ వేషము అన్న పానాదులకు ప్రయాసమును గలుగనీయక సంరక్షించుచుండును ముఖ్యముగా తనధర్మములో నిలుకడ గలుగ జేసికొనుటకు నిది సూక్ష్మబుద్ధి గలవారికి చాల అనుకూలపడును ఎప్పుడైన తన తురీయాశ్రమమునకు తగిన వాక్యములను గాని, ఆహార నియమములను గాని, నివాస స్థల నియమములనుగాని, అతిక్రమించనీయక ఇది సంరక్షించును ఎప్పుడైన నియమాతిక్రమణ స్వభావము గలుగునపుడు తాను ఆశ్రయించియున్న ఆశ్రమము యొక్క పవిత్రతను గురించి చింతన చేయుచుండిన ధర్మవిరుద్ధ భావములు నశించిపోవును ఇట్టి ప్రజ్ఞావిశేషము లేనివాడు సన్న్యసించినను పతితుడే యగును అట్లు గాకుండుట కొఱకు అతి పావనమగు నీతురీ యాశ్రమము ఏర్పడినట్లు తోచుచున్నది

**నాశ్రమం కారణం ముక్తేర్దర్శనాని న కారణమ్ ।**
**తథైవ సర్వకర్మాణి జ్ఞానమేవ హి కారణమ్ ॥**

మోక్షముకొఱకు సన్న్యాసాశ్రమము కారణము గాదు ఆలాగున శాస్త్రపఠన మున్ను కారణము గాదు అదేరీతిగా బాహ్యకర్మలున్ను కారణములు గావు జ్ఞానమొక్కటియే కారణమగును

**స ఏవాత్మా స విజ్ఞేయః సర్వైరపి ముముక్షుభిః ।**
**తుర్మాత్మజ్ఞానహీనానాం న ముక్తిః స్యాత్కదాచన ॥**

ముముక్షువు లందరిచేతను తురీయుడగు నాయాత్మయే తెలిసికొన దగినది అట్టి తురీయమగు ఆత్మసాక్షాత్కారము ఎంత వరకు గలుగదో, అంత వరకు నెట్టివారికైన మోక్షము సిద్ధించదు ఇదే శాస్త్రముయొక్క సారము ఈ సన్న్యాస యోగమందేదైన మార్పు చేయవలసియుండిన తెలుపువారికి కృతజ్ఞుడను అంతేగాక మరుముద్రణమందు దానిని సవరణ చేయు ప్రీతిగలవాడ నగుదును

**ఓంతత్ సత్.** ఇట్లు మీచరాచర సుఖాభిలాషి

శ్రీమలయాళస్వామి



# సన్న్యాసయోగము

ఓమ్ ఆప్యాయన్తు మమాఙ్గాని వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బల మిన్ద్రియాణి చ-సర్వాణి సర్వం బ్రహ్మోపనిషదం మాఽహం బ్రహ్మ నిరాకుర్యాం మా మా బ్రహ్మనిరాకరోదనిరాకరణమస్త్వనిరాకరణం మే అస్తు తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

మమ = నాయొక్క, అంగాని = అవయవములును, వాక్ = వాక్కును, ప్రాణః = ప్రాణమును, చక్షుః = నేత్రమును, శ్రోత్రం = చెవియును, అథోబలం= అధోముఖ వృత్తియందు సామర్థ్యముగల మనస్సును, (అథో = అట్లే, బలం= బలమును,) సర్వాణి = అన్ని, ఇంద్రియాణి చ = ఇంద్రియములును, ఆప్యాయన్తు= తృప్తిపొందుగాక, శుద్ధములగునుగాక, ఉపనిషదం = వేదాన్తప్రతిపాద్యమైన, బ్రహ్మ = బ్రహ్మస్వరూపము, సర్వం = సకలమగును, అహం = నేను, బ్రహ్మ = ఆ పరమాత్మను, మా నిరాకుర్యాం = నిరాకరించ కుందునుగాక, మా = నన్ను, బ్రహ్మ = ఆపరమాత్మ, మా నిరాకరోత్= నిరాకరించక యుండు గాక, అనిరాకరణం= ఆదరము, అస్తు= కలుగుగాక, మే = నాకు, అనిరాకరణం = విశ్వాసము, (లక్ష్యభావము) అస్తు = కలుగుగాక, తత్ = ఆ, ఆత్మని = బ్రహ్మమందు, నిరతే = ఆసక్తిగల, మయి = నాయందు, యే = ఏ, ఉపనిషత్సు = వేదాంతములందు చెప్పబడిన, ధర్మాః = ధర్మములో। తే = ఆ శమదమాది సకలసుగుణములు, సంతు = ఉండుగాక, ఓమ్ = ప్రణవస్వరూపమగు పరబ్రహ్మమా! శాంతిశ్శాంతిశ్శాంతిః = విఘ్నములు పరిహరించుదువుగాక!

# బృహదారణ్యకము పంచమాధ్యాయము

ఈ కథ బ్రహ్మవిద్యా ప్రాప్తియొక్క యుపాయమును చూపించుటయే ప్రయోజనముగా కలది పూర్వము విదేహ దేశమునకు ప్రభువైన మండలాధిపతి యగు జనకమహారాజు కలడు ఆయన బహుదక్షిణమను పేరుగల యాగమును చేసెను ఆ యాగమునకు పిలువబడినవారును, చూడవలయునను కోరిక గలవారునగు కురుపాంచాల దేశాలలోని గొప్పగొప్ప విద్వాంసులు వచ్చిరి అప్పుడు జనకమహారాజు ఆ విద్వాంసుల సముదాయమును చూచి వీరిలో పరబ్రహ్మమును తెలిసిన వారెవరో, ఒకరా! లేక వీరందరా! యని తెలిసికొన నిచ్ఛ గలవాడై అట్లు తెలిసికొనుట కుపాయార్థమై ఒక్కొక్క గోవునకు ఒక్కొక్క కొమ్మునకు మూడుతులాలన్నర యెత్తుగల బంగారపు కొమ్ములను ప్రతిగోవునకు రెండు కొమ్ములయందు నమర్చి అట్టి వేయి గోవులను ఒక పశువులదొడ్డియందు నింపెను

జనకమహారాజు ఇట్లు వేయిగోవులను దొడ్డియందునుంచి పూజ్యాలగు ఓ బ్రాహ్మణులారా! మీలోపల బ్రహ్మవేత్త యగువాడు ఈ గోవులను తోలుకొని పోవలసినదని పలుకగా, ఆ బ్రాహ్మణులు ధైర్యము లేనివారైరి అప్పుడు యాజ్ఞ వల్క్యుడు తన సంబంధియగు సామశ్రవుడను శిష్యుని పిలిచి నీ వాగోవులను మన ఆశ్రమమునకు తోలుకొనిపొమ్మని చెప్పగా ఆశిష్యుడు గోవులను ఆశ్రమమునకు తోలుకొనిపోయెను అప్పు డాబ్రాహ్మణులంద రీయాజ్ఞవల్క్యుడు మన అందరిలో తాను బ్రహ్మవేత్తనని ఎట్లు పలికెనని కోపముగల వారైరి

ఇట్లుండగా యాగమును చేయుచున్న జనకమహారాజునకు ఋత్విక్కైన అశ్వలుడనువాడు ఈ యాజ్ఞవల్క్యుని గుర్చి ఓ యాజ్ఞ వల్క్యుడా! నీవే మాయందరిలో ఎట్లు బ్రహ్మవేత్తవు అయితివని యడిగెను ఇట్లడుగగా, నాయాజ్ఞవల్క్యుడు ఆ అశ్వలునిగూర్చి, మేము బ్రహ్మవేత్తకొరకు నమస్కరించు చున్నాము మేము బ్రహ్మవేత్తృత్వమునకు, పణముగా నుంచిన గోవులను గోకాములమై తోలుకొనిపోతిమిగాని, బ్రహ్మవేత్తృత్వము నందభిమానము కలిగి

తోలుకొని పోలేదు కనుక మేము గోవులను కోరువారమే యగుచున్నామని పరిహాసముగా పలికెను, ఇట్లు బ్రహ్మిష్ఠ పణమును గ్రహించుటవలన ఋత్విక్కగు నాయశ్వలుడు, ఆ యాజ్ఞవల్క్యుని ప్రశ్న చేసి యడుగుటకు మనస్సు కలవాడాయెను

ఇచ్చటనుండి యజ్ఞవిషయమై, బ్రహ్మవిద్యావిషయమై బ్రహ్మ జ్ఞానవిషయమై, ఈ యశ్వలుడు మొదలగు ఈ క్రింద పేర్కొనువారు, అనేక ప్రశ్నలడిగిరి వారడిగిన ప్రశ్నలు ఎట్టివో వానికి యాజ్ఞ వల్క్యుడిచ్చిన సమాధానము లెట్టివో ఈ బృహదారణ్యమున కనుగొనవచ్చును, అంతయు వ్రాయబూనిన గ్రంథవిస్తార మగునని తలంచి, యిచ్చట వ్రాయలేదు గార్గియొక్క బ్రహ్మవిద్యా మహిమను చూపుటకొరకు ఇది నిరూపించడమైనది గార్గి బ్రహ్మచారిణి యనియు, బ్రహ్మవిద్య యందెంతో నైపుణ్యము గలిగినవారనియు, జనులు తెలుసుకొనుట కొరకు ఈ ఘట్ట ముపకరించును

యాజ్ఞవల్క్యుని మహాఋషిమండలిలో ప్రశ్నించిన వారెవరో వారిని వినుడు 1 అశ్వలుడు, 2 ఆర్తభాగుడు, 3 జారత్కారవుడు, 4 భుజ్యావు, 5. ఉషస్తుడు 6. కహోళుడు, 7. ఉద్దాలకుడు, 8 శాకల్యుడు, వీరడిగిన నమస్త విధములగు ప్రశ్నములకు సమగ్రముగా నాయజ్ఞ వల్క్యుడు సమాధానము చెప్పిన తర్వాత సభయంతయు నిశ్చేష్టత గలిగి మౌనముగా నుండునపుడు వచక్నుని పుత్రిక యగు గార్గి లేచి సధైర్యముగా నిలిచి ఇట్లనియె!

**అథ హ వాచక్నవ్యువాచ బ్రాహ్మణా భగవన్తో హన్తాహ**
**మిమం ద్వౌ ప్రశ్నౌ ప్రక్ష్యామి తౌ చేన్మే వక్ష్యతి నవై జాతు**
**యుష్మాకమిమం కశ్చిద్బ్రహ్మోద్యం జేతేతి పృచ్ఛ గార్గీతి ॥**

పూజ్యులగు నో బ్రాహ్మణులారా! మీరంగీకరించి రేని, నేను ఈ యాజ్ఞ వల్క్యుని రెండు ప్రశ్నల నడిగెదను, ఆ ప్రశ్నలనుగూర్చి యాజ్ఞవల్క్యు డుత్తరమును చెప్పినయెడల మీలో నెవరున్న బ్రహ్మ సంబంధవాదమున నీ యాజ్ఞవల్క్యుని జయించువారు లేరు అని పలికి, బ్రాహ్మణులను ప్రార్థింపగా, బ్రాహ్మణులు ఓ గార్గీ! ఆ ప్రకారమే యడుగుమా! యని పలికిరి

**సా హోవాచాహం వై త్వా యాజ్ఞవల్క్య యధా కాశ్యో వా వైదేహో వో(గ పు(త ఉజ్జ్యం ధనురధిజ్యం కృత్వా ద్వౌ బాణవంతౌ సపత్నాతి వ్యాధినౌ హస్తేకృత్వోపోత్తిష్ఠే దేవ మేవాహం త్వాం ద్వాభ్యాం (ప్రశ్నాభ్యా ముపోదస్థాం తౌ మే (బ్రూహీతి పృచ్ఛ గార్గీతి ॥**

ఇట్లు గార్గి బ్రాహ్మణానుజ్ఞను పొంది యాజ్ఞవల్క్యుని అడిగెను ఓ యాజ్ఞవల్క్యుడా! కాశీ విదేహదేశములయందైన శూరవంశమునందు పుట్టిన రాజపుత్రుండు, ధనుస్సు నెక్కుబెట్టుకొని, శత్రువులను వ్యధ పెట్టునట్టి రెండు మంచి బాణములను హస్తమునందుంచుకొని ఎట్లు శత్రువును సమీపించునో ఆ ప్రకారముగానే, నేను నిన్ను రెండు శ్రేష్ఠములైన ప్రశ్నములతో సమీపించి యున్నాను, నీవు బ్రహ్మవేత్తవు అయితివేని, ఆ ప్రశ్నలకు సమాధానములను నాకు చెప్పుమా యని గార్గి యడుగగా నాయాజ్ఞవల్క్యుడు ఓ గార్గీ! ప్రశ్నను వేయుమా? యని మరల పలికెను

**సా హోవాచ యదూర్ధ్వం యాజ్ఞవల్క్య దివో యదవాక్పృధివ్యా యదన్తరా ద్యావాపృధివీ ఇమే యద్భూతం చ భవచ్చ భవిష్యచ్చేత్యాచక్షతే కస్మిం స్తదోతం చ (ప్రోతం చేతి॥**

ఓ యాజ్ఞవల్క్యుడా! బ్రహ్మాండముకంటె ఉపరిభాగమునందును, క్రింది భాగమునందును, మధ్యమునందును, భూతమును, వర్తమానమును, భవిష్యత్తును నగు ద్వైతమైన ఈ సమస్తము దేనియందు ఏకీభవించి యున్నదని ఆగమన్యాయమువలన చెప్పుదురో అట్టి సమస్తమును దేనియందు వస్త్రముయొక్క పడుగు పేకలు వలెనే ఏకముగా కల్పింపబడియున్నదని గార్గి యడిగెను

**స హోవాచ యదూర్ధ్వం గార్గి దివో యదవాక్పృధివ్యా యదంతరా ద్యావాపృధివీ ఇమే యద్భూతం చ భవచ్చ భవిష్యచ్చేత్యాచక్షత ఆకాశే తదోతం చ (ప్రోతం చేతి ॥**

ఓగార్గీ! బ్రహ్మాణ్డమునకంటె ఊర్ధ్వభాగమునందును, క్రిందిభాగము

నందును, మధ్యమునందును భూతమును, వర్తమానమును, భవిష్యత్తునునగు వ్యాకృతమునైన సూత్రాత్మకమగు జగత్తంతయు దేనియందు ఏకముగా కల్పింపబడియున్నదని చెప్పుదురో అట్టి సూత్రము అవ్యాకృతాకాశమునందు ఉత్పత్తిస్థితి లయకాలముల యందు వస్త్రముయొక్క పడుగుపేకలవలెనే ఏకముగా కల్పింపబడియున్నదని యాజ్ఞవల్క్యుడు పలికెను

**సా హోవాచ నమస్తేఽస్తు యాజ్ఞవల్క్య యో మ ఏతం వ్యవచోఽ వరాస్మై ధారయస్వేతి వృచ్ఛ గార్గీతి ॥**

ఓ యాజ్ఞవల్క్యుడా! నీవు, నేనడిగిన ప్రశ్నమును విశేషముగా నాకు చెప్పితివి, కనుక నీకొరకు నమస్కరించుచున్నాను ఇంకొక ప్రశ్న వేయుటకు నన్ను ధైర్యము గలదానినిగా జేయుము అని గార్గి పలుకగా ఓ గార్గీ! నీవు ప్రశ్నమును అడుగుమా! యని యాజ్ఞవల్క్యుడు పలికెను

**సా హోవాచ యదూర్ధ్వం యాజ్ఞవల్క్య! దివో యదవాక్పృథివ్యా యదన్తరా ద్యావాపృథివీ ఇమే యద్భూతం చ భవచ్చ భవష్యచ్చేత్యాచక్షతే కస్మింస్తదోతం చ ప్రోతం చేతి ॥**

ఓ యాజ్ఞవల్క్యుడా! బ్రహ్మాండముకంటె ఊర్ధ్వభాగమునందును, క్రింది భాగమునందును, మధ్యమునందును, భూతమును, వర్తమానమును, భవిష్యత్తును నగు నీ సమస్తమును ఏ సూత్రమని చెప్పుచున్నారో అది దేనియందు వస్త్రముయొక్క పడుగుపేకలవలెనే కల్పింపబడినది? యని గార్గి ప్రశ్న వేసెను

**స హోవాచ యదూర్ధ్వం గార్గి! దివోయదవాక్పృథివ్యా యదన్తరా ద్యావాపృథివీ ఇమే యద్భూతం చ భవచ్చ భవిష్యచ్చేత్యాచక్షత ఆకాశ ఏవ తదోతం చ ప్రోతం చేతి కస్మింన్ను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చేతి.**

ఓ గార్గీ! బ్రహ్మాండముయొక్క ఊర్ధ్వాధో భాగములయందును, మధ్యభాగమునందును, భూతమును, భవిష్యత్తును, వర్తమానమునగు ఈ సూత్రరూపమైన సమస్తమును దేనినిగా జెప్పుచున్నారో ఆ సూత్రరూపమగు సర్వమును అవ్యాకృతమగు ఆకాశమునందు పడుగు పేకలుగా గల్పింపబడి

యున్నదని యాజ్ఞవల్క్యుడు చెప్పగా గార్గి, అవ్యాకృతాకాశ స్వరూపము అవాచ్యము గనుక అప్రతిపత్తియని (పొందనశక్యమని) అవాచ్యమైన దానిని చెప్పిన యెడల విప్రతిపత్తియని రెండుదోషములు కలుగుచున్నవి ఆ దోషములను పరిహరించి చెప్పుట కశక్యమని తలంచి ప్రశ్న వేయుచున్నది ఓ యాజ్ఞవల్క్యుడా! ఆ అవ్యాకృతాకాశము దేనియందు పడుగు పేకలవలెనే కల్పింపబడియున్నదని ప్రశ్న వేసెను

**స హోవాచైతద్వై తదక్షరం గార్గి! బ్రాహ్మణా అభివదన్త్యస్థూల మనణ్వహ్రస్వ మదీర్ఘ మలోహిత మస్నేహ మచ్ఛాయ మతమోఽ వాయ్వనాకాశమసఙ్గమరసమగన్ధమచక్షుష్కమశ్రోత్ర మవాగమనోఽ తేజస్క మప్రాణ మముఖ మమాత్ర మనన్తరమబాహ్యం న తదశ్నాతి కించన న తదశ్నాతి కశ్చన॥**

ఓ గార్గీ! నీవాయవ్యాకృతాకాశము దేనియందు పడుగుపేకలవలె గల్పింపబడియున్నదని దేని నడిగితివో? అది నశింపనిది గనుక అక్షర స్వరూపమునుగా బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు ఇట్లు బ్రహ్మవేత్తలు పలుకుచున్నారని చెప్పుటచేత పూర్వము కలిగిన అప్రతిపత్తి విప్రత్తిపత్తులనెడి దోషద్వయమును పరిహరించుచు యాజ్ఞవల్క్యుడు పలుకగా గార్గి, ఓయాజ్ఞవల్క్యుడా? ఆ అక్షరమనునది ఏదియని ప్రశ్న వేసెను ఓ గార్గీ! ఆ అక్షరము స్థూలము కాదు, సూక్ష్మము గాదు, పొట్టిది కాదు ఇట్లు పదార్థ ధర్మములను ఈ నాలుగింటిని నిషేధించుటచేత ద్రవ్యము కాదు కనుక నశింపని అక్షరస్వరూపము, మరియు అగ్నియొక్క గుణమైన లోహితము కాదు, ఉదకములయొక్క గుణమైన స్నేహమును కాదు, ఛాయయు కాదు, తమస్సును కాదు, వాయువును గాదు, ఆకాశమును కాదు, లక్కవలెనే వేరువస్తువును అంటుకొనునది కాదు, రసమును కాదు, గంధమును కాదు, దీనికి నేత్రేంద్రియమును లేదు అగ్ని మొదలైన వాటికివలెనే ప్రకాశమును లేదు ప్రాణమును లేదు, ముఖమును లేదు, పరిమితియును లేదు, అంతరమును లేదు, బాహ్యమును లేదు, దేనిని తినునది గాదు, దీనిని నేదియు తినదు ఇట్లు ఆ యక్షరస్వరూపము సమస్త విశేషణ రహితమై, ఏకమును, అద్వితీయమునై యున్నదని యాజ్ఞవల్క్యుడు చెప్పెను

ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠత ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ద్యావాపృథివ్యౌ విధృతే తిష్ఠతః ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి నిమేషా ముహూర్తా అహోరాత్రాణ్యర్ధ మాసా మాసా ఋతవః సంవత్సరా ఇతి విధృతా స్తిష్ఠన్త్యేతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి ప్రాచ్యో నద్యః స్యన్దన్తే శ్వేతేభ్యః పర్వతేభ్యః ప్రతీచ్యోఽన్యాయాం యాం చ దిశమన్వేతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి దదతో మనుష్యాః ప్రశగ్ంసన్తి యజమానం దేవా దర్వీం పితరోఽన్వాయత్తాః ॥

ఇట్లు సర్వవిశేషణ శూన్యమైన అక్షరమున్నదని శ్రుతిచేత చెప్పబడినది ఇప్పుడాయక్షర ముండుటకు అనుమాన ప్రమాణమును చూపించుచున్నాడు ఓ గార్గీ! ఇంతకు పూర్వము చెప్పిన స్థూలాది ధర్మాతీతమును, సమీపమును, ప్రత్యక్షమును, సర్వాంతరమునగు పరబ్రహ్మమైన అక్షరస్వరూపమేది పొందబడినదో? దానియొక్క ఆజ్ఞవలన సూర్యచంద్రులు, ఆయాకాలమునందు తప్పకుండ ప్రకాశించుచున్నారు ఆదేప్రకారము భూమ్యన్తరిక్షములును అక్షర పరబ్రహ్మముయొక్క యాజ్ఞవలన వాటి వాటి మితిని మీరక నిలిచియున్నవి ఆ యక్షర పరబ్రహ్మముయొక్క ఆజ్ఞవలననే నిమేషము, ముహూర్తము, అహోరాత్రము, పక్షము, మాసము, సంవత్సరము మొదలైన భేదములు గల ఆయాకాలములును తప్పకుండ కలుగుచున్నవి హిమవంతము మొదలైన పర్వతములనుండి తూర్పుగా ప్రవహించునట్టి నదులు, తూర్పుగాను పశ్చిమముగా ప్రవహించునట్టి నదులును, పశ్చిమముగాను, ఇంక నాయాదిక్కులకు ప్రవహించెడి నదులు, ఆయా దిఙ్ముఖములుగాను, ఆ యక్షరపరబ్రహ్మముయొక్క యాజ్ఞవలననే తప్పక ప్రవహించుచున్నవి

ప్రమాణమును గుర్తెరిగిన మనుష్యులు దానార్హములగు బంగారము మొదలైన వాటిని అక్షర పరబ్రహ్మముయొక్క ఆజ్ఞవలన స్తుతించుచున్నారు దేవతలు పురోడాశము మొదలైన జీవనపదార్థముల నిమిత్తమై యజమానునిన్ని, పితృదేవతలను, దర్వీహోమమునున్ను అనుసరించి పొందుచున్నారు ఇట్లు అక్షరపరబ్రహ్మముయొక్క ఆజ్ఞవలననే ఈ సూర్యచంద్రులు మొదలైన వీరందఱు

తమతమ పనులయందు, రాజాజ్ఞవలన రాజ్యమువలెనే నియతముగా ప్రవర్తించుచున్నారు

**యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మింల్లోకే జుహోతి యజతే తపస్తప్యతే బహూని వర్షసహస్రాణ్యన్తవదేవాస్య తద్భవతి । యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాస్మాల్లోకాత్ప్రైతి స కృపణోఽథయ ఏతదక్షరం గార్గి విదిత్వాఽస్మాల్లోకాత్ప్రైతి స బ్రాహ్మణః ॥**

ఈ చెప్పెడి హేతువువల్లనున్ను, ఆయక్షరస్వరూప మున్నదని చూపించుచున్నాడు ఓ గార్గీ! యెవ డాయక్షర పరబ్రహ్మమును తెలిసికొనక యీ లోకమునందు హోమము చేయుచున్నాడో, యాగమును చేయుచున్నాడో, తపస్సును అనేక సంవత్సరములు చేయుచున్నాడో అట్టివానియొక్క ఆ కర్మఫలమంతయు, నాశము గలదియే యగుచున్నది ఎవడు ఈ అక్షర బ్రహ్మమును తెలిసికొనక యీ లోకమునుండి మరణమును పొంది పోవుచున్నాడో, వాడు, నీచుడై జననమరణ రూపసంసారకష్టము నెడతెగక పొందుచున్నాడు ఎవం డీయక్షర పరబ్రహ్మమును తెలిసికొని ఈ లోకమునుండి మరణమును, పొంది పోవుచున్నాడో, వాడు ఆ అక్షర పరబ్రహ్మస్వరూపియగు బ్రాహ్మణు డగుచున్నాడు అనగా అక్షర పరబ్రహ్మ మగుచున్నాడు

**తద్వా ఏతదక్షరం గార్గ్యదృష్టం ద్రష్ట్రశ్రుతగ్ం శ్రోత్రమతం మన్త్రవిజ్ఞాతం విజ్ఞాతృ నాన్యదతోఽస్తి॥ ద్రష్టృ నాన్య దతోఽస్తి శ్రోతృ నాన్యదతోఽస్తిమన్తృ నాన్యదతోఽస్తి విజ్ఞాత్రే తస్మిన్ను ఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చేతి ॥**

ఓ గార్గీ! ఆ ప్రసిద్ధమగు నీ అక్షరస్వరూపము, తాను చూపునకు విషయముగాక దృక్స్వరూపమును, శ్రోత్రమునకు విషయముగాక శ్రుతిస్వరూపమును, మనస్సునకు విషయముగాక తలంచు నదియును, బుద్ధికి విషయముగాక విజ్ఞాతృస్వరూపము నగుచున్నది మఱియు నిట్టి అక్షర పరబ్రహ్మ స్వరూపముకంటే వేఱు ద్రష్టయును, వేరే శ్రోతయును, వేఱు మన్తయును, వేరైన

విజ్ఞాతయును లేడు ఓ గార్గీ!ఇట్టి అక్షరస్వరూపమునందే అవ్యాకృతాకాశము వస్త్రము యొక్క పడుగుపేకలవలెనే, ఏకముగ కల్పింపబడియున్నది యని యాజ్ఞ వల్క్యుండు బోధించెను

సా హోవాచ బ్రాహ్మణా భగవన్త స్తదేవ బహుమన్యేధ్వం యద స్మాన్నమస్కారేణ ముచ్యేధ్వం నవైజాతు యుష్మాకమిమం కశ్చి ద్బ్రహ్మోద్యంజేతేతి తతో హ వాచక్నవ్యుపరరామ ॥

ఇతి శ్రీ బృహదారణ్యకే పంచమాధ్యాయే అష్టమం బ్రాహ్మణమ్

ఇట్లు యాజ్ఞవల్క్యుడు తాను వేసిన ప్రశ్నమును నిరూపించి చెప్పుట వలన గార్గి బ్రహ్మసభయందలి బ్రాహ్మణులనుగూర్చి పూజ్యులగు నో బ్రాహ్మణులారా! మీరు యాజ్ఞవల్క్యుని కొఱకు నమస్కరించి ముక్తులగుటనే విశేషముగా తలంచుడు మీలో బ్రహ్మవాదమున నీ యాజ్ఞవల్క్యుని నెప్పటికిని జయించు వాడొకడును లేడు అని చెప్పి గార్గి వేరొక ప్రశ్నను వేయక యూరక యుండెను

ఇట్లు బృహదారణ్యకమునందు పంచమాధ్యాయన అష్టమ బ్రహ్మణము

వేదముయొక్క శిరస్సగు బ్రహ్మవిద్యా స్వరూపమగు నుపనిషత్తునందు జనకమహారాజుచే సంరక్షింపబడిన యజ్ఞమున మహాఋషి మండలియందు వేదమునుగురించియు, వేదాన్తమును గురించియు, గార్గి పండితోత్తముడగు యాజ్ఞవల్క్యునితో శాస్త్రార్థము చేయుచుండినది చూచిన ఋషుల కాలములో నారీమణులుగూడ నెంత పాండిత్యము కలిగియుండిరో తెలిసికొనందగును



# బృహదారణ్యకోపనిషది చతుర్థాధ్యాయే
# చతుర్థబ్రాహ్మణ ప్రారంభః

**ఉ॥ మైత్రేయీతి హోవాచ యాజ్ఞవల్క్య ఉద్యాస్యన్వా అరేఽహ మస్మాత్స్థానాదస్మి హన్త తేఽనయా కాత్యాయన్యాఽన్తం కరవాణీతి॥1**

ఇంతకు పూర్వము తృతీయాధ్యాయమునందు అవిద్యావిషయమంతయు ఉపసంహారము చేయబడినది చతుర్థాధ్యాయమునందు బ్రహ్మవిద్యావిషయమైన ప్రత్యగాత్మను, "బ్రహ్మ తే బ్రువాణీతి, బ్రహ్మ జ్ఞాపయిష్యామీతి చ" అను ఈవాక్యములు ప్రస్తుతము చేసికొని (ఉపక్రమించుకొని), ఏకమును, అద్వితీయమును, సర్వ విశేషశూన్యమును అగు నా పరబ్రహ్మమును, క్రియాకారక ఫల స్వభావ అసత్యశబ్దవాచ్యాశేష భూతధర్మములయొక్క నిషేధముద్వారా నేతినేతియని తెలియజేయబడినది ఇట్టి పరబ్రహ్మవిద్యకు అంగముగా సన్న్యాసమును విధింపవలెననెడి యిచ్ఛచేత ఈ కథ ఉపక్రమింపబడుచున్నది

యాజ్ఞవల్క్య మహాఋషికి మైత్రేయి, కాత్యాయని అను ఇద్దరు భార్యలు కలరు వారిలో మొదటి భార్యయగు మైత్రేయిని, యాజ్ఞవల్క్య మహాఋషి పిలిచి ఓమైత్రేయీ! నేను ఈ గృహస్థాశ్రమమునుండి శ్రేష్ఠమగు సన్న్యాసాశ్రమమును పొందుట కిచ్ఛగలవాడ నగుచున్నాను కనుక నీయంగీకారమును కోరుచున్నాను మఱియు ఈ నా రెండవ భార్యయగు కాత్యాయనితో నీకు ధనవిభాగమును చేసెదనని పలికెను

**సా హోవాచ మైత్రేయీ యన్ను మ ఇయం భగోః సర్వా పృథివీ విత్తేన పూర్ణా స్యాత్కథం తేనామృతాస్యామితి నేతి హోవాచ యాజ్ఞవల్క్యో యథైవోపకరణవతాం జీవితం తథైవ తే జీవితం స్యాదమృతత్వస్య తు నాశాస్తి విత్తేనేతి ॥ 2**

ఇట్లు యాజ్ఞల్క్య మహాఋషిచేత పలుకబడిన ఆ మైత్రేయి ఓయాజ్ఞవల్క్య మహాఋషీ! సముద్రముచేత చుట్టబడిన ఈ సమస్త భూమియు ధనముచేత

నిండినదగునా? అట్టి ధనముచేత నేను ముక్తురాల నగుదు నాయని పలుకగా ఆయన అట్లు కాదని లోకమునందు సమస్త సాధనములు గలవారలకు సుఖజీవన మెట్లు గలుగునో, ఆ విధముగానే నీకును ధనముచేత సుఖజీవనము కలుగునుగాని, మనస్సుతో నైనను మోక్షేచ్ఛ లేదని పలికెను

**సా హోవాచ మైత్రేయీ యేనాహం నామృతాస్యాం కిమహం తేన కుర్యాం యదేవ భగవాన్వేద తదేవ మే బ్రూహీతి ॥ 3**

ఈ పూర్వము చెప్పిన ప్రకారము యాజ్ఞవల్క్య మహాఋషి చేత పలుకబడిన ఆ మైత్రేయి ఓ యాజ్ఞవల్క్యమహాఋషీ! నేను ఏధనముచేత ముక్తురాలను కానో, అట్టి ధనముతో నే నేమి చేయుదును? కనుక పూజ్యుడవగు నీవు మోక్షసాధనమని దేనిని తెలిసికొని యున్నావో, అట్టి మోక్షసాధనమునే నా కొఱకు చెప్పుమా యని పలికెను

**స హోవాచ యాజ్ఞవల్క్యః ప్రియా బతారే నః సతీ ప్రియం భాషస ఏహ్యాస్స్వ వ్యాఖ్యాస్యామి తే వ్యాచక్షాణస్యతు మే నిదిధ్యాసస్వేతి ॥ 4**

ఇట్లు మైత్రేయి విత్తసాధ్యమైన మోక్షసాధనమును తిరస్కరింపగా, ఆ యాజ్ఞవల్క్యమహాఋషి సంతోషించినవాడై, ఓ మైత్రేయీ! పూర్వము నాకు నీవు ఇష్టురాలవైతివి ఆహా! ఇప్పుడును, ఇష్టమునే పలుకుచున్నావు, రమ్మ, కూర్చుండుము, నీకు ఇష్టమును, మోక్షసాధనమునగు ఆత్మజ్ఞానమును చెప్పెదను, ఇట్లు చెప్పుచున్న నాయొక్క వాక్యములను అర్థముతో నిశ్చలముగా ధ్యానించుటకు కోరుమా యని పలికెను

**స హోవాచ న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవ త్యాత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి, నవా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవతి న వా అ రే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా భవన్త్యాత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవన్తి నవా అరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతి న వా అరే బ్రహ్మణః కామాయ బ్రహ్మ ప్రియం భవత్యాత్మనస్తు కామాయ**

బ్రహ్మ ప్రియం భవతి న వా అరే క్షత్రస్య కామాయ క్షత్రం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ క్షత్రం ప్రియం భవతి న వా అరే లోకానాం కామాయ లోకాః ప్రియా భవన్త్యాత్మనస్తు కామాయ లోకాః ప్రియా భవన్తి న వా అరే దేవానాం కామాయ దేవాః ప్రియా భవన్త్యాత్మనస్తు కామాయ దేవాః ప్రియా భవన్తి న వా అరే భూతానాం కామాయ భూతాని ప్రియాణి భవన్త్యాత్మనస్తు కామాయ భూతాని ప్రియాణి భవన్తి న వా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవత్యాత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవత్యాత్మావా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యో మైత్రేయ్యాత్మనోవా అరే దర్శనేన, శ్రవణేన, మత్యా, విజ్ఞానేనేదగ్ం సర్వం విదితమ్ ॥ 5

ఇట్లు ఆ యాజ్ఞవల్క్య మహాఋషి తన భార్యయగు మైత్రేయిని స్తుతించి, మోక్షసాధనమగు వైరాగ్యమును ఉపదేశించుటకు కోరినవాడై ఆ సన్న్యాసము కొఱకు జాయాపుత్రాదులనుండి విరాగమును పుట్టించుచున్నాడు ఓ మైత్రేయీ! లోకమునందు పెనిమిటియొక్క ప్రయోజనముకొఱకు భార్య పెనిమిటికి ప్రియురాలు గాదు, అట్లే భార్యకు పెమిమిటి ప్రియుడు కాడు మఱియేమనిన, ఆత్మ ప్రయోజనము కొఱకే భార్యకు పెనిమిటి ప్రియుడగుచున్నాడు ఆ ప్రకారముగానే జాయాపుత్ర విత్తాదు లన్నియును స్వాత్మప్రయోజముకొఱకే ప్రియము లగుచున్నవి కాన నిట్లు ఇతరమైన జాయాపుత్రాది సమస్తము నందుండెడి ప్రీతి, ఆత్మప్రాధాన్యమైనదేగాని, సహజమైనది కాదు కనుక ఆత్మప్రీతియే ముఖ్యమైనది అందువలన ఆత్మ రూపమే చూడదగినది ఆచార్యునివలన వినదగినది, మననము చేయదగినది, ధ్యానించదగినది యగుచున్నది ఇట్లు శ్రవణమనన నిదిధ్యాసనము లను సాధనములచేత ఆత్మ చూడదగిన దగుచున్నది ఆత్మయందు, అజ్ఞానముచేత, ఆరోపితజ్ఞాన విషయమైన, బ్రహ్మక్షత్రాది కర్మనిమిత్తకమగు, వర్ణాశ్రమాది లక్షణము త్రాటియందు సర్పజ్ఞానమువలె కలుగుచున్నది ఈ యజ్ఞానము ఆత్మస్వరూపముయొక్క శ్రవణమనన నిదిధ్యాసములచేత నివర్తించి సమస్తమును తెలియబడినదై, బ్రహ్మాత్మైక్య విషయమగు సమ్యగ్దర్శనము ( బ్రహ్మస్వరూపమే నేననెడి నిశ్చయ జ్ఞానము)

కలుగుచున్నదని యాజ్ఞవల్క్యమహాఋషి భార్యయగు మైత్రేయితో పలికెను

బ్రహ్మ తం పరాదాద్యోఽన్యత్రాత్మనో బ్రహ్మ వేద క్షత్రం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః క్షత్రం వేద లోకాస్తం పరాదుర్యోఽన్య త్రాత్మనో లోకాన్వేద దేవాస్తం పరాదుర్యోఽ న్యత్రాత్మనో దేవాన్వేద భూతాని తం పరాదుర్యోఽన్య త్రాత్మనో భూతాని వేద సర్వం తం పరాదాద్యోఽ న్యత్రాత్మనః సర్వం వేదేదం బ్రహ్మేదం క్షత్రమిమే లోకా ఇమేదేవా ఇమాని భూతానీదం సర్వం యదయమాత్మా ॥ 6

ఇంతకు పూర్వము శ్రవణ మనన నిదిధ్యాసములచేత, ఆత్మస్వరూపము తెలియబడిన యెడల సమస్తమును తెలియబడుచున్నదని చెప్పబడినది అదెట్లనగా? ఆత్మయే సర్వస్వరూపము కనుక ఆ సర్వస్వరూపమైన ఆత్మ తెలియబడగా! సర్వమును తెలియబడుచున్నది ఆత్మయే సర్వస్వరూప మెట్లగుననిన ఎవడు ఈ బ్రాహ్మణజాతిని, క్షత్రియ జాతిని, లోకములను, దేవతలను, భూతములను మరియు నితరమగు సమస్తమును ఆత్మ స్వరూపముకంటె వేరుగా జూచుచున్నాడో వానిని బ్రాహ్మణాది సమస్తమును అన్యముగానే చేయుచున్నది ఈ కనబడెడి బ్రహ్మక్షత్రాది సమస్తమును సృష్టికాలమునం దాత్మవలన పుట్టి లయకాలమునందు ఆత్మయందే లీనమై స్థితికాలము నం దాత్మ స్వరూపమై యున్నది కాబట్టి ఆత్మకంటె వేరుగా నేదియును తెలియబడదు ఇట్లు తెలియబడక పోవుటవలన సర్వమును ఆత్మస్వరూపమయ్యే యున్నది, కాన ఇట్లు ఆత్మను తెలిసికొని ఆత్మే తానగుట వలన సర్వము తెలియబడిన దగుచున్నది

స యథా దున్దుభేర్హన్యమానస్య న బాహ్యాఞ్ఛబ్దాన్ శక్నుయాద్గ్రహ ణాయ దున్దుభేస్తు గ్రహణేన దున్దుభ్యాఘాతస్య వా శబ్దో గృహీతః॥7

ఎట్లు ఈ సర్వము ఆత్మస్వరూపముగనే గ్రహించుటకు శక్యమగుచున్నది? యనిన సర్వమును చిన్మాత్రరూపమును అనుసరించి పొందుటవలన, అంతటను చిత్స్వరూపతయే తోచుచున్నది దీనికే దృష్టాంత మిక్కడ చెప్పబడుచున్నది. అదెట్లనగా? లోకము నందు దండము మొదలగు వానిచేత, భేర్యాదికము

కొట్టబడగా బాహ్యశబ్దములు ఆభేరీధ్వనిని అతిశయించినవి కాకపోవుటవలన, ఎట్లు గ్రహించుటకు శక్యములు కావో, భేరిని గ్రహించుటచేత, శబ్ద సామాన్య విశేషణముచేత ఇవిభేరీధ్వనులని గ్రహించుటకును, భేరీవాద్యమును తెలిసికొనుటచేత ఆ భేరి పొందియున్న శబ్దవిశేషములు ఇవియనియు గ్రహించుటకు నెట్లు శక్యము లగుచున్నవో!, ఆ ప్రకారముగానే ప్రజ్ఞాన స్వరూపముకంటె వేరుగా నేదియును లేకపోవుట వలన స్వప్నజాగరములయందు దానికంటె వేరగు నొకవస్తు విశేషము గ్రహింపబడదు కనుక ప్రజ్ఞాన స్వరూపమగు ఆత్మస్వరూపమును ఆత్మమాత్ర మగుట యుక్తమగుచున్నది

**న యథా శఙ్ఖస్య ధ్మాయమానస్య న బాహ్యాఞ్ఛబ్దాన్ శక్నుయాద్గ్రహణాయ శఙ్ఖస్యతు గ్రహణేన శఙ్ఖధ్మస్య వా శబ్దో గృహీతః ॥ 8**

ఆ భేరీ దృష్టాంతమువలెనే, ఇంకొక దృష్టాంత మిక్కడ చెప్పబడుచున్నది అదెట్లనిన? లోకమునందు ఏ ప్రకారముగా, శంఖము ధ్వనించు చుండగా బాహ్యములగు ధ్వనులు, ఆధ్వనిని అతిక్రమించినవి కాకపోవుటవలన ఎట్లు గ్రహించుటకు శక్యములుకావో, శంఖమును గ్రహించుటచే శంకము నూదుటచే గలిగిన శబ్దవిశేషములునెట్లు గ్రహింపబడిన వగునో, ఆ ప్రకారముగా ఆత్మస్వరూపము నతిక్రమించిన దేదియు లేకపోవుటవలన స్వప్నజాగరముల యందు ఆ యాత్మస్వరూపము కంటె వేరగు వస్తువిశేష మొక్కటియు గ్రహింపబడదు కనుక ఆత్మస్వరూపమును తెలిసికొనుటచే దానికంటె వేరగు విశేషమేదియు లేకపోవుటవలన సర్వము ఆత్మస్వరూప మగుచున్నది

**న యథావీణాయై వాద్యమానాయై న బాహ్యాఞ్ఛబ్దాన్ శక్నుయాద్గ్రహణాయ వీణాయై తు గ్రహణేన వీణావాదస్య వా శబ్దో గృహీతః ॥ 9**

ఈ పూర్వము చెప్పిన భేరీశంఖదృష్టాంతముల వలెనే ఇంకొక దృష్టాంతము చెప్పబడుచున్నది అదెట్లనిన లోకమునందు వీణ వాయించుచుండగా, అన్యశబ్దములు దాని నతిశయించినవి కాకపోవుటవలన, గ్రహించుటకెట్లు శక్యములు కావో? వీణను గ్రహించుటచేత వీణావాద్యముయొక్క విశేషములు

ఎట్లు గ్రహింపబడిన వగునో, ఆ ప్రకారముగా ఆత్మ నతిశయించిన దేదియు లేకపోవుటవలన సర్వము నాత్మే యగుచున్నది (ఈ చెప్పబడిన భేరీశంఖవీణలయొక్క సామాన్య విశేష శబ్దములు వాని యందంతర్భూతములై వాని నతిక్రమించునవి కాకపోవుటవలన వానికి వేరుగాక అవిగానే ఎట్లు గ్రహింపబడుచున్నవో ఆ ప్రకారముగానే స్థితికాలమునందు పరబ్రహ్మము, సామాన్యవిశేషములకు, వేఱుకాకపోవుటవలన సర్వము పరబ్రహ్మమాత్రముగానే తెలిసికొనుటకు శక్యమగుచున్నదని భావము)

**నయథార్ద్రైధాగ్నే రభ్యాహితా త్పృథగ్ధూమా వినిశ్చరం త్యేవం వా అరేఽ స్యమహతో భూతస్య నిశ్వసిత మేతద్యదృగ్వేదో యజుర్వేద: సామవేదోఽథర్వాఙ్గిరస ఇతిహాస: పురాణం విద్యా ఉపనిషదశ్లోకా: సూత్రాణ్యనువ్యాఖ్యానాని వాక్యానాన్యస్యైవైతాని సర్వాణి నిశ్వసితాని ॥**

ఉత్పత్తి కాలమునందు ఉత్పత్తికంటె పూర్వము సర్వము పరబ్రహ్మమేయని, తెలిసికొనుటకు శక్యమగుచున్నది అది యెట్లనగా? లోకమునందు అగ్ని సంబంధములగు అగ్నికణములు, పొగ, నిప్పు, జ్వాల, వీనియొక్క విభాగముకంటె పూర్వము అగ్నికి ఒకటే స్వరూప మగుట యెట్లో? ఆ ప్రకారముగానే నామ రూప వికారములుగల ఈ జగత్తుయొక్క యుత్పత్తికంటె పూర్వము ఈ జగత్తు ప్రజ్ఞాన ఘనస్వరూపమగు పరమాత్మయై యున్నది అని గ్రహించుట యుక్తము ఇట్లు ఏకస్వరూపమైన యా పరమాత్మయే ఈ సమస్తమునకు కారణమని ఇంతకు పూర్వము చెప్పబడియున్నది అదియెట్లనిన? అదియే ఇక్కడ వివరింపబడు చున్నది ఋగ్యజుస్సామాథర్వణములును, ఇతిహాసమును, పురాణమును, నృత్తగీతాది శాస్త్రములును, ఉపనిషత్తులును, మంత్రములును, పరమాత్మ స్వరూపమును తెలియజేసెడి వేదమునందలి వాక్యములును, మంత్రవివరణము లును, వ్యాఖ్యానములును, ఇవి యన్నియును, లోకమునందు పురుషునియొక్క నిశ్వాసములవలెనే అప్రయత్నముగా ఆ పరమాత్మయొక్క నిశ్వాసములవంటివై ఆ పరమాత్మవలన కలుగుచున్నవి. కనుక నీ సర్వము స్థితికాలమునందును, ఈ చెప్పిన అగ్ని దృష్టాంతముచే పరబ్రహ్మమాత్రమై యున్నది

స యథా సర్వాసామపాగ్ సముద్ర ఏకాయనమేవం సర్వేషాం స్పర్శానాం త్వగే కాయన మేవం సర్వేషాం రసానాం జిహ్వైకాయన మేవం సర్వేషాం గన్ధానాం నాసికైకాయన మేవం సర్వేషాం రూపాణాం చక్షు రేకాయన మేవం సర్వేషాం శబ్దానాం శ్రోత్రమేకాయన మేవం సర్వేషాం సంకల్పానాం మన ఏకాయన మేవం సర్వాసాం విద్యానాం హృదయ మేకాయమేవం సర్వేషాం కర్మణాం హస్తవేకాయన మేవం సర్వేషా మానందానాముపస్థ ఏకాయనమేవం సర్వేషాం విసర్గాణాం పాయు రేకాయన మేవం సర్వేషామధ్వనాం పాదావేకాయన మేవం సర్వేషాం వేదానాం వాగేకాయనమ్ ॥ 11

ఇట్లు ఈజగత్తు ప్రజ్ఞానఘన స్వరూపమగు నాత్మకంటె వేరుగా లేకపోవుటవలన జగత్తు, ఉత్పత్తి స్థితికాలములందు మాత్రమే పరమాత్మ స్వరూపమగుట కాదు ప్రళయ కాలమునందును ఆ పరమాత్మయందే లీనమగుచున్న నామరూప క్రియాత్మకమైన జగత్తు, నీటి బుగ్గలు, నురుగులు, మొదలైనవి నీటికి అన్యములు గాక నీరే యైనట్లు పరమాత్మ స్వరూపముకంటె వేరుకాకపోవుటవలన పరమాత్మ స్వరూపమేయని తెలిసికొనదగినది ఎట్లనిన? ఏ ప్రకారముగా నద్యాది వాపీకూప తటాకాదులను పొందియున్న సమస్తోదకముల కును సముద్రమాకరమై వేరుకాని ఏకస్వరూపమును పొందుచు వానిని తనయందే లీనపరచుకొనుచు, అవి తానే యై యున్నదో, ఈ ప్రకారముగానే మృదు కఠినాది సమస్త స్పర్శములకు త్వక్కును, మధురామ్లాది సమస్త రసములకును జిహ్వయును, సమస్తగంధములకు నాసికయును, సమస్తరూపములకు నేత్రమును, అన్ని శబ్దములకు శ్రోత్రమును, తలంపు లన్నిటికి మనస్సును, విద్యలన్నిటికి హృదయమును, కర్మలన్నిటికి హస్తములున్ను, ఆనందము లన్నిటికి ఉపస్థ (యోని) యును, విసర్గము లన్నిటికి పాయువును, మార్గము లన్నిటికి పాదములును, వేదము లన్నిటికి వాక్కును ఇవి తమతమ విషయములగు ఈ చెప్పబడిన శబ్దస్పర్శ రసగంధాదులు తమకు వేఱు కాకపోవుటవలన, వానితో నైక్యమును పొందుచు, వానిని తమయందే లీనపఱుచుకొనుచు, ఆ విషయములు

తామే యగుచున్నవో, ఇట్లే సర్వేంద్రియములును తమ విషయము లన్నిటితోను క్రమముగా ప్రళయమును పొంది మనోమాత్రమై మనస్సు విజ్ఞానమాత్రమై ఆ విజ్ఞానస్వరూపము నీటియందు సైన్ధవఘనమువలెనే నిరుపాధిక మగుటవలన ప్రజ్ఞానఘన స్వరూపమగు పరమాత్మయందు లీనమగుచున్నది

**స యథా సైన్ధవఖిల్య ఉదకేప్రాస్త ఉదకమేవానువిలీయేతన హా స్యోద్గ్రహణాయేవ స్యాత్ యతో యతస్త్వాదదీత లవణమే వైవం వా అర ఇదం మహద్భూత మనన్తమపారం విజ్ఞానఘున ఏవ ఏతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవానువినశ్యతి నప్రేత్య సంజ్ఞాస్తీత్యరే బ్రవీమీతి హోవాచ యాజ్ఞవల్క్యః ॥ 12**

ఇంతకు పూర్వము ఈ సమస్తము ఉత్పత్తి స్థితిలయములందు ప్రజ్ఞాన ఘనస్వరూపముకంటె వేఱుగా లేకపోవుటవలన ఆత్మ స్వరూపమేయని ప్రతిజ్ఞ చేయబడిన దానిని ఇంతవఱకు యుక్తివలన సాధించి బ్రహ్మవేత్తలకు బ్రహ్మవిద్యా నిమిత్తకమైన బుద్ధిపూర్వకమగు నీ ఆత్యంతిక ప్రళయమునందు దృష్టాంతము చెప్పబడుచున్నది అదెట్లనగా నీళ్లవలన బుట్టిన ఉప్పుఱాయి ఆ నీటి యందుంచబడినపుడు తిరిగి ఆ ఉప్పుఱాతినిగా నీటినుండి తీయుటకు ఎంతనిపుణుడైనను సమర్థుడుగాక ఆ నీటిని రుచిచూచి ఉప్పుగా తెలిసికొనుచున్నాడో, ఆ ప్రకారముగానే గొప్ప పారమార్థిక స్వరూపమును, నాశనము లేనిదియును, ప్రజ్ఞానఘన స్వరూపమైన ఈజీవాత్మయే, నీటివలన కలిగిన సూర్యచంద్రాది ప్రతిబింబమువలెను, స్వచ్ఛమగు స్ఫటికమునకు రక్తపీతాదివస్తు సంయోగమువలన కలిగిన రక్తపీతాది భావమువలెను, నామరూపాత్మకములై దేహేంద్రియ విషయాకారములుగా పరిణమించిన సచ్ఛబ్దవాచ్యములగు భూతములనుండి నీటివలన ఉప్పుగడ్డవలెనె (అజ్ఞానముచే నామరూపాత్మకమైనట్టి, ఆదేహేంద్రియ విషయాకారములుగా బరిణమించిన భూతములు) శాస్త్రాచార్యోపదేశముచేతనైన బ్రహ్మవిద్యచేత నదీ సముద్రములచే మిక్కిలి లీనపఱుపబడినవైన సలిల ఫేన బుద్బుదాదికమువలెనే నశించుచుండగా, అజ్ఞానముచే నామరూపాత్మమగు నాజీవభావముగూడ, సూర్యాది ప్రతిబింబము

లకు హేతువులగు నీళ్లను, స్ఫటికమునకు రక్తపీతాది వస్తుసంయోగము లేనప్పుడు, సూర్య చంద్ర స్ఫటికములు మొదలైన వానియొక్క ప్రతిబింబమువలెనే, నశించుచున్నది

ఇట్లు నశించి కేవల బింబభూతములైన సూర్యచంద్ర స్ఫటికములవలెనే, జీవాత్మ గూడ, బ్రహ్మజ్ఞానముచేత, భూతములు నశింపగా, తానున్ను నశించి, అంతము లేనిదియును దట్టమైనదియును స్వచ్ఛమైనదియునగు ప్రజ్ఞానఘన స్వరూపమగు పరమాత్మయై నిలుచును ఇట్లు ఓ మైత్రేయీ! దేహేంద్రియాది సముదాయమువలన ముక్తిని పొంది పరమాత్మస్వరూపమైన వానికి నేను, వీడు, నా పుత్రుడు, నాక్షేత్రము, నాధనము, నేను సుఖము గలవాడను, నేను దుఃఖము గలవాడును అనెడి యీ మొదలైన చిహ్నములు గల విశేషసంజ్ఞ లేదని యాజ్ఞవల్క్యమహాఋషి భార్యయైన మైత్రేయికొఱకు పరమార్థ స్వరూపమును బోధించెను

**సా హోవాచ మైత్రేయ్యత్రైవ మాభగవానమూముహన్న ప్రేత్య సంజ్ఞాస్తీతి స హో వాచ యాజ్ఞవల్క్యో న వా అరేఽహం మోహం బ్రవీమ్యలంవా అర ఇదం విజ్ఞానాయ॥ 13**

ఇట్లు పరమాత్మ స్వరూపము బోధింపబడిన ఆ మైత్రేయి ఓ యాజ్ఞ వల్క్యుడా! పరబ్రహ్మమునందు విరుద్ధధర్మము కలుగుటను చెప్పుచున్న నీ చేతను నాకు భ్రాంతి కలుగ జేయబడినది ఎట్లనగా పూర్వము జీవాత్మ విజ్ఞానఘన స్వరూపమేయని ప్రతిజ్ఞచేసి తిరిగి యాజీవాత్మకు, మరణమును పొందిన తరువాత నేను, వీడు, అనెడి ఈ మొదలైన చిహ్నముగల విశేషజ్ఞానము లేదని పలికితివి కనుక ఒకటియగు అగ్ని, శీతోష్ణములను విరుద్ధములగు రెండు ధర్మములు కలది కాదనెడి యభిప్రాయముచేత, నీవు చెప్పిన పరబ్రహ్మ విషయమై, మూఢురాల నైతినని పలికెను

ఇట్లు పలుకగా, యాజ్ఞవల్క్యుడు ఓ మైత్రేయీ! నేను ఒక ధర్మముగల వస్తువునందు అట్లు మోహరూపమైన వాక్యమును పలుకలేదు' నీవు భ్రాంతిచేత ఒక వస్తువును విరుద్ధధర్మము గలదానినిగా గ్రహించినావు ఎట్లనగా అజ్ఞానముచేత

కలిగిన, దేహేంద్రియ సంబంధమైన, ఆత్మకు దేహేంద్రియాత్మకమగు జీవభావము కలిగినది అది జ్ఞానముచేత నశింపగా, ఆజీవభావ నిమిత్తకమగు శరీరాది సంబంధమైన నేను వీడు అనెడి సంజ్ఞ, దేహేంద్రియ సంఘాతరూపమైన ఉపాధి లేకపోగా, ఉదకము మొదలైన ఆధారములు లేనప్పుడు చంద్రాది ప్రతిబింబములవలెనే నశించుచున్నది కేవల బింబభూతములైన చంద్రాదిత్యుల వలెనే అసంసారి బ్రహ్మస్వరూపమైన విజ్ఞానఘన స్వరూపమునకు నాశము లేదు అట్టి పరబ్రహ్మస్వరూపమే విజ్ఞానఘనమని చెప్పబడుచున్నది ఆ యాత్మ స్వరూపమే, ఈసమస్తమైన జగత్తుయొక్క నాశమునుండి నశింపక యుండునది ఇదియే, ఓ మైత్రేయి! ఇదివరకు నేను చెప్పిన అనన్తమును, అపారమునగు విజ్ఞానఘన స్వరూపమయిన ఆత్మ ఇది తెలిసికొనుటకు సమర్థమగుచున్నది

**యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి తదితర ఇతరం జిఘ్రతి తదితర ఇతరం శృణోతి తదితర ఇతర మభివదతి తదితర ఇతరం మనుతే తదితర ఇతరం విజానాతి యత్రవా అస్య సర్వమాత్మై వాభూత్తత్కేన కం జిఘ్రేత్త త్కేన కంపశ్యేత్తత్కేన కం శృణుయాత్త త్కేన క మభివదేత్త త్కేనకం మన్వీత తత్కేన కం విజానీయాత్ యే నేదం సర్వం విజానాతి తం కేన విజానీయాత్ విజ్ఞాతారమరే కేన విజానీయాదితి ॥ 14**

**ఇతి చతుర్థాధ్యాయే చతుర్థబ్రాహ్మణమ్**

ఓ మైత్రేయీ! ఇదియే ఇదివఱకు నేను చెప్పినదంతయును, అపారమునగు విజ్ఞానఘన స్వరూపమైన తెలిసికొనుటకు సమర్థమగుచున్నదని, యాజ్ఞవల్క్య మహాఋషి చెప్పెను. ఇప్పుడు ఇదివరకు విజ్ఞానఘన స్వరూపమని చెప్పిన కేవలాత్మకు అజ్ఞానమువలన నామరూప క్రియాత్మకమైన దేహేంద్రియాది సంబంధముచేత కలిగిన జీవభావమునందు, నేను, వీడు, అనెడి ఈ మొదలైన ద్వైతజ్ఞానము కలుగుచున్నది బ్రహ్మజ్ఞానముచేత, ఆ నామరూప క్రియాత్మకమగు, దేహేంద్రియాది సంబంధమువల్లనైన, జీవభావము నశింపగా, నేను, వీడు అనెడి మొదలైన ద్వైతజ్ఞానమున్ను నశించుచున్నదని నేను చెప్పిన వాక్యమునకు, ఓమైత్రేయీ! నీవు లోకమునందు అగ్నియందు విరుద్ధ ధర్మములగు శీతోష్ణములు

రెండును ఎట్లుండవో అట్లే విజ్ఞానఘన స్వరూపమైన ఆత్మకు ఒకప్పుడు నేను, వీడు అనెడి యీ మొదలైన ద్వైతజ్ఞానము కలుగుటయును, ఒకప్పుడు అద్వైతజ్ఞానమును లేదని చెప్పుటయును, విరుద్ధమని నీకు కలిగిన సందేహమునకు సమాధానమును చెప్పుచున్నాను వినుము

అవిద్యచేత కల్పింపబడిన దేహేంద్రియ సంఘాతోపాధివలన బుట్టిన జీవభావమునందు, ఆత్మతో సహాసర్వమున్ను ద్వైతముగానే అగుచున్నది అప్పుడు చూచుట, ఆఘ్రాణించుట, వినుట, పలుకుట, తలంచుట, తెలిసికొనుట ఈ మొదలైన ద్వైత జ్ఞానము కలుగుచున్నది ఎప్పుడు బ్రహ్మవేత్తకు బ్రహ్మజ్ఞానముచేత సర్వమును ఆత్మమాత్ర మగుచున్నదో అప్పుడు దేనిచేత దేనిని చూచును, దేనిచేత దేనిని ఆఘ్రాణించును, దేనిచేత దేనిని పలుకును, దేనిచేత దేనిని వినును, దేనిచేత దేనిని తలంచును, దేనిచేత దేనిని తెలిసికొనును, ఎవనిచేత సర్వమును తెలిసికొనబడుచున్నదో వానిని దేనిచేత తెలిసికొనవచ్చును? ఓ మైత్రేయీ! సర్వమును తెలిసికొనునది విజ్ఞానమయాత్మయే దానిని తెలిసికొనునది వేరొకటి లేకపోవుటవలన, జ్ఞానముచేత సర్వమును తానైనప్పుడు, బ్రహ్మవేత్తయొక్క ఈ సర్వమును తెలిసికొనెడి విజ్ఞాతృస్వరూపమగు విజ్ఞానమయాత్మ కేవల అద్వయ స్వరూపమయి విజ్ఞాన ఘనస్వరూప మగుచున్నది అప్పుడు అజ్ఞానమువలన కలిగెడి నేను, వీడు ఈ మొదలైన లక్షణములుగల విశేషజ్ఞాన సంజ్ఞ లేదని చెప్పుట విరోధము కాదని భార్యయైన మైత్రేయికి యాజ్ఞవల్క్య మహాఋషి ఉపదేశించెను

మరియు ఆత్మపురాణమునందు, ఈ యాజ్ఞవల్క్యమహర్షి సంన్యసించి నట్లు మైత్రేయికి గూడ సంన్యాస మొసంగినట్లు కలదు మఱియు పతివ్రతలగు నారీమణులు గ్రహించవలసిన యొక దివ్యోపదేశము దీనియందు నిగూఢ మయి యున్నది అదేమనగా? కాత్యాయనినుండి ధనవిభాగము చేసి యిచ్చెదనని యాజ్ఞవల్క్యుడు చెప్పగా, ధనమువల్ల నిరతిశయానందమగు మోక్షము గలుగునా? యని మైత్రేయి అడుగుటయు, తాము ఏ ఆత్మశాంతికొరకు నిరతిశయానంద ప్రాప్తికొరకు సంన్యసింప తలంచిరో అట్టి యాత్మజ్ఞాన మొసంగెడు సన్న్యాసమునే తనకు గూడ అనుగ్రహించవలయునని మైత్రేయి చెప్పెడు వాక్యము ఎంతమహిమ

గలదియో యాలోచింపదగినది తాను నడచునపుడు తననీడ గూడ తన్ను అనుసరించి వెళ్లునట్లు శ్రేష్ఠుడగు పతి యేకార్యము ననుసరించునో, సతియున్ను ఆలాగున అనువర్తించి యుండుటయే, పతివ్రతయగు మానినీమణియొక్క ధర్మమగును

మఱియు ఉత్తముండైన పురుషుడు భార్యను త్యజించి తాను మాత్రము మోక్షము కొరకు వెళ్ళుటయు, ధర్మము కాదనియు, తన్నాశ్రయించి జీవించుచూ వచ్చిన, భార్యలు గూడ ముముక్షుత్వము గలవారైనచో, తనవలెనే మోక్షము గలుగుటకు తగిన జ్ఞానోపదేశము చేసి, సన్న్యాసినిగా చేయవలసిన దనియు, నీగాథవల్ల బోధమగుచున్నది

మరియు యాజ్ఞవల్క్యుని యొక్క మొదటిభార్యయగు మైత్రేయియు వైరాగ్యము గలదగుటచే నేలాటి గృహకృత్య సంసారవిషయమై తొందర చేయకయు, తానంగీకరించుటచే గృహస్థాశ్రమ కార్యములను నిర్వహించుటకు కాత్యాయినిని వివాహము చేసుకొనుటయు, బుద్ధిమంతులైన స్త్రీలు పురుషులు ముఖ్యముగ గ్రహించవలసిన విషయమై యున్నది

ఇట్లు బృహదారణ్యకము చతుర్థాధ్యాయమునందు

చతుర్థబ్రాహ్మణము సమాప్తము

ఓమ్ తత్ సత్



# జీవన్ముక్తిప్రకాశిక

శ్రీ విద్యారణ్యస్వాములు రచించిన జీవన్ముక్తి ప్రకాశిక 1 వ ప్రకరణము 16వ పేజీలో స్త్రీలకు సన్న్యాసాధికారము గలదను విషయమును గురించి వ్రాసినది ఈ క్రింద నిరూపింపబడుచున్నది శ్రీ శంకరాచార్యులకు తరువాత విద్యారణ్య స్వాములవారికి సమానులు మరియొకరు ఉండియుండలేదనునది లోక విదితము, కావున దీనికి మించిన మరియొక ప్రమాణము అవసరము లేదని తలచెద

జీవన్ముక్తి ప్రకాశమున 1వ ప్రకరణము 16 వ పేజీలో

**న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః ।**

అను శ్రుతి యాగాది కర్మలచేత గాని, పుత్ర సంతానముచేతగాని, ధనము చేతగాని, దానముచేతగాని యెవడున్ను మోక్షము పొందలేదు కొందరు పుణ్యపురుషులు, కర్మత్యాగముచేతనే, (సన్న్యాసము చేతనే) మోక్షమును బొందిరి అని శ్రుత్యర్థము ఈ సన్న్యాసమునందు స్త్రీలకును అధికారము గలదు వివాహమునకు పూర్వమందుగాని భర్త చనిపోయిన తర్వాత గాని, స్త్రీలు సన్న్యాసమును గ్రహించ వచ్చునని కొన్ని శాస్త్రములు చెప్పియున్నవి భిక్షాచరణము, మోక్షశాస్త్ర శ్రవణము, బ్రహ్మస్వరూపధ్యానము, త్రిదండ కాషాయాది ధారణము మొదలగు యతి ధర్మములను స్త్రీలు గూడ నాచరింపవచ్చును ఈ యర్థము శాంతిపర్వాంతర్గత మోక్ష ధర్మములయందును, సులభా జనక సంవాద గ్రంధముయొక్క చతుర్ధరీటీకయను వ్యాఖ్యానమునందును విస్పష్టముగా వ్రాయబడియున్నది బృహదారణ్యకము మొదలగు వేదాంతములయందు గార్గి మొదలగు స్త్రీలు సన్న్యాసినులనియు, బ్రహ్మనిష్ఠులనియు చెప్పబడియున్నది కనుకనే యాజ్ఞ వల్క్యమహాముని తన భార్యయగు మైత్రేయీ దేవికి బ్రహ్మవిద్య నుపదేశించెను

ఓమ్ తత్ సత్



# సులభాజనక సంవాదము

## శ్రీమహాభారతే శాంతి పర్వాంతర్గత మోక్షధర్మ పర్వము

యుధిష్ఠిర ఉవాచ - యుధిష్ఠిరు డడిగెను

**అపరిత్యజ్య గార్హస్థ్యం కురురాజర్షిసత్తమ ।**
**కః ప్రాప్తో వినయం బుద్ధ్యా మోక్షతత్త్వం వదస్వ మే ॥ 1**

ఓ పితామహా! భీష్మా! గృహస్థధర్మమును విడువక స్వబుద్ధిచే మోక్ష తత్త్వమును బొందినవాడెవడైన గలడా?

**సన్న్యస్యతే యథాత్మాఽయం వ్యక్తస్యాత్మా యథా చ యత్ ।**
**పరం మోక్షస్య యచ్చాపి తన్మే బ్రూహి పితామహ ॥ 2**

ఓ భీష్మాచార్యా! ఆత్మసన్న్యాసమును, వ్యక్తాత్మ విధమును, మోక్షము యొక్క పరమకాష్ఠను నాకు తెలుపుము

భీష్మ ఉవాచ.- భీష్ముడు సమాధాన మిచ్చెను

**అత్రాప్యుదాహరంతీమమితిహాసం పురాతనమ్ ।**
**జనకస్య చ సంవాదం సులభాయాశ్చ భారత ॥ 3**

ఓ ధర్మరాజా! ప్రాచీనమగు జనకసులభా సంవాదమును ఇందుల కుదాహరణముగా తెలుపుదురు.

**సన్న్యాసఫలకః కశ్చిద్బభూవ నృపతిః పురా ।**
**మైథిలోజనకో నామ ధర్మధ్వజ ఇతి శ్రుతః ॥ 4**

పూర్వము మిథిలాపతియగు జనకుడు ధర్మధ్వజుడని ప్రసిద్ధుడై సన్న్యాస ఫలమును పొందియుండెను.

**న వేదే మోక్షశాస్త్రే చ స్వే చ శాస్త్రే కృతశ్రమః ।**
**ఇంద్రియాణి సమాధాయ శశాస వసుధామిమామ్ ॥ 5**

అతడు వేదమందును, వేదాంతమునందును రాజనీతియందును నిపుణుడై, యింద్రియములను లోబరచుకొని యీ భూమిని పాలించుచుండెను

తస్య వేదవిదః ప్రాజ్ఞాః శ్రుత్వా తాం సాధువృత్తతామ్ ।
లోకేషు స్పృహయంత్యన్యే పురుషాః పురుషేశ్వర! ॥ 6

వేదజ్ఞుడగు నతని సత్ప్రవర్తనమును పండితులు సయితము ఆదర్శముగా నుంచుకొనిరి

అథ ధర్మయుగే తస్మిన్ యోగధర్మ మనుష్ఠితా ।
మహీమనుచచారైకా సులభా నామ భిక్షుకీ ॥ 7

అంతట నా ధర్మయుగమున యోగానుష్ఠానముగల "సులభ"యను సన్న్యాసిని భూమియందంతయు సంచరించుచుండెను

తయా జగదిదం కృత్స్నమటంత్యా మిథిలేశ్వరః ।
తత్ర తత్ర శ్రుతో మోక్షే కథ్యమానస్త్రిదండిభిః ॥ 8

ఆమె అచ్చటచ్చట సన్న్యాసులచే జనకుని ధర్మసూక్ష్మ ప్రవర్తనమును వినెను

సాఽతిసూక్ష్మాం కథాం శ్రుత్వా తథ్యం నేతి ససంశయా ।
దర్శనే జాతసంకల్పా జనకస్య బభూవ హ ॥ 9

ఆమె ఆ విషయమున శంక గలదియై జనకుని చూడ దలచెను

తత్ర సా విప్రహాయాథ పూర్వరూపం హి యోగతః ।
అబిభ్రదనవద్యాంగీ రూపమన్యదనుత్తమమ్ ॥ 10

చక్షుర్నిమేషమాత్రేణ లఘ్వస్త్రగతిగామినీ ।
విదేహానాం పురీం సుభ్రూర్జగామ కమలేక్షణా ॥ 11

అంతట నామె యోగప్రభావమువలన పూర్వరూపమును విడిచి, అతిసుందరాకారమును ధరించి రెప్పపాటులో మిథిలానగరమునకు వచ్చెను.

సా ప్రాప్య మిథిలాం రమ్యాం ప్రభూతజనసంకులామ్ ।
భైక్షచర్యాపదేశేన దదర్శ మిథిలేశ్వరమ్ ॥ 12

అతి సుందరమైనదియు నగు ఆ నగరమున నామె భిక్షాటన నెపమున జనకుని దర్శించెను

రాజా తస్యాః పరం దృష్ట్వా సౌకుమార్యం వపుస్తదా ।
కేయం కన్య కుతో వేతి బభూవాగతవిస్మయః ॥ 13

జనకుడును నామె సౌకుమార్యమును వీక్షించి యీమె యెవరు? ఎవరి సంబంధురాలు? ఎచ్చటనుండి వచ్చెను? అని ఆశ్చర్యపడెను

తతోఽస్యాః స్వాగతం కృత్వా వ్యాదిశ్య చ వరాసనమ్ ।
పూజితాం పాదశౌచేన వరాన్నేనాప్యతర్పయత్ ॥ 14

అంతట నాజనకుడు ఆమెకు స్వాగతమిచ్చి, పీర మొసగి, పాదప్రక్షాళన మొనర్చి మృష్టాహారము నొసగెను

అథ భుక్తవతీ ప్రీత్యా రాజానం మంత్రిభిర్వృతమ్ ।
సర్వభాష్య విదాం మధ్యే చోదయామాస భిక్షుకీ ॥ 15

సులభయు భోజనానంతరము, మంత్రులతోడను సర్వభాషల నెరిగిన వేదాంతులలతో గూడుకొనియున్న జనకుని మనస్సును యోగప్రభావముచే ప్రవేశించెను

సులభాత్వస్య ధర్మేషు ముక్తో నేతి ససంశయా ।
సత్త్వం సత్త్వేన యోగజ్ఞా ప్రవివేశ మహీపతేః ॥ 16

నేత్రాభ్యాం నేత్రయోరస్య రశ్మీన్ సంయమ్య రశ్మిభిః ।
సాస్మ తం చోదయిష్యంతీ యోగ బంధైర్బబంధ హ ॥ 17

అతని మనస్సును మనస్సుచే ప్రవేశించి, నేత్రములను తన నేత్రముల చేతను, చూపులను తన చూపులచేతను యోగశక్తిచే బంధించెను

జనకోఽవ్యుత్స్మయన్ రాజా భావమస్యా విశేషయన్ ।
ప్రతిజగ్రాహ భావేన భావమస్యా నృపోత్తమ ॥ 18

జనకుడును నవ్వుచూ ఆమెభావమును గ్రహించెను

తదేకస్మిన్నధిష్ఠానే సంవాదః శ్రూయతామయమ్ ।
ఛత్రాదిషు విముక్తస్య ముక్తాయాశ్చ త్రిదండికే ॥ 19

రాజ్యచిహ్నములను ధరించి ముక్తుడైన జనకునకును, సన్న్యాస చిహ్నములను ధరించిన ముక్తురాలగు సులభకున్ను ఈ క్రిందివిధముగా సంవాదము జరిగెను

జనక ఉవాచ - జనకుడు పలికెను

భగవత్యాః క్వ చర్యేయం కృత్వా క్వ చ గమిష్యసి ।
కస్య చ త్వం కుతో వేతి పప్రచ్ఛైనాం మహీపతిః ॥ 20

శ్రుతే వయసి జాతౌ చ సద్భావో నాధిగమ్యతే ।
ఏష్వర్థేషూత్తరం తస్మాత్ప్రవేద్యం మత్సమాగమే ॥ 21

ఓ భగవతీ ! నీ వెచ్చట సంచరించెదవు, ఎచటికి బోయెదవు, ఎవరిదానవు, శాస్త్రజ్ఞానమునను, వయస్సునందును, జాతియందును, యుత్తమత్వము గోచరించుచున్నది కాన పై ప్రశ్నములకు సమాధానమిమ్ము

ఛత్రాదిషు విశేషేషు ముక్తం మాం విద్ధి తత్త్వతః ।
స త్వాం సంమంతు మిచ్ఛామి మానార్హా హి మతాసి మే ॥ 22

నన్ను రాజచిహ్నములు ధరించియు ముక్తుడైన వానినిగ నెరుంగుము, గౌరవార్హురాలవుగా తోచుటచే నిన్ను సత్కరింపగోరుచున్నాను

యస్మాచ్చైతన్మయా ప్రాప్తం జ్ఞానం వైశేషికం పురా ।
యస్య నాన్యః ప్రవక్తాఽస్తి మోక్షం తమపి మే శృణు ॥ 23

సాధారణులచే చెప్పుటకు నలవిగాని యీ విశేషజ్ఞానమును, మోక్షమును

నాకు లభించిన విధమును వచించెదను, వినుము

పరాశరసగోత్రస్య వృద్ధస్య సుమహాత్మనః ।
భిక్షోః పంచశిఖాస్యాహం శిష్యః పరమసమ్మతః ॥ 24

పరాశరగోత్ర సంజాతుండును, వృద్ధుడును, మహాత్ముడును అగు పంచశిఖ మునీశ్వరునకు నేను ప్రియశిష్యుడను

సాంఖ్యజ్ఞానే చ యోగేచ మహీపాలవిధౌ తథా ।
త్రివిధే మోక్షధర్మేఽస్మిన్ గతాధ్వా ఛిన్నసంశయః । 25

స యథా శాస్త్రదృష్టేన మార్గేణేహ పరిభ్రమన్ ।
వార్షికాంశ్చతురో మాసాన్ పురా మయి సుఖోషితః ॥ 26

సాంఖ్య జ్ఞాన యోగశాస్త్రములందును, రాజనీతియందును, మూడు విధములగు మోక్ష ధర్మమందును, నిస్సంశయమగు జ్ఞానమును గల యాపంచశిఖ మునీశ్వరుడు, శాస్త్రోక్త విధమున సంచరించుచూ నాలుగుమాసములు (చాతుర్మాస్యమున) నావద్ద సుఖముగ నుండెను

తేనాహం సాంఖ్యముఖ్యేన సుదృష్టార్థేన తత్త్వతః ।
శ్రావితస్త్రివిధం మోక్షం న చ రాజ్యాద్విచాలితః ॥ 27

అతడు సాంఖ్యాది శాస్త్రముల సహితముగా త్రివిధ మోక్షశాస్త్రమును యథార్థముగా బోధించెను. కాని నన్ను రాజ్యమునుండి తొలగింప లేదు

సోఽహం తామఖిలాం వృత్తిం త్రివిధాం మోక్షసంహితామ్ ।
ముక్తరాగశ్చరామ్యేకః పదే పరమకే స్థితః ॥ 28

నేను రాగరహితుడనై పరమపదము నాశ్రయించి, ఆ త్రివిధమగు మోక్షసంబంధమగు ప్రవర్తనము నాచరించుచున్నాను

వైరాగ్యం పునరేతస్య మోక్షస్య పరమో విధిః ।
జ్ఞానాదేవ చ వైరాగ్యం జాయతే యేన ముచ్యతే ॥ 29

ఈ మోక్షమునకు వైరాగ్యము మూలకారణము, వైరాగ్యమునకు జ్ఞానము హేతువు

జ్ఞానేన కురుతే యత్నం యత్నేన ప్రాప్యతే మహత్ ।
మహద్ద్వంద్వ ప్రమోక్షాయ సా సిద్ధిర్యా వయోతిగా ॥ 30

జ్ఞానముచే పురుషుడు ప్రయత్నించును యత్నముచే మహత్తు లభించును, మహత్తు ద్వంద్వ విమోచనమును గలిగించును, అదియే శాశ్వతమగు సిద్ధి

సేయం వరమికా బుద్ధేః ప్రాప్తా నిర్ద్వంద్వతా మయా ।
ఇహైవ గత మోహేన చరతా ముక్తసంగినా ॥ 31

మోహరహితుడనై ముక్తసంగుడనై సంసారముననే చరించుచూ నే నీ నిర్ద్వంద్వమైన బుద్ధిని పొందితిని

యథా క్షేత్రం మృదూభూతమద్భిరాప్లావితం యథా ।
జనయత్యంకురం కర్మ నృణాం తద్వత్పునర్భవమ్ ॥ 32

నీట తడుపబడిన భూమి మొలకలను కలిగించు విధమున కర్మ మనుజులకు పునర్జన్మమును కలిగించును

యథా చోత్తాపితం బీజం కపాలే యత్ర తత్ర వా ।
ప్రాప్యాప్యంకురహేతుత్వ మబీజత్వాన్నజాయతే ॥ 33

తద్వద్భగవతానేన శిఖాప్రోక్తేన భిక్షుణా ।
జ్ఞానం కృతమబీజం మే విషయేషు న జాయతే ॥ 34

మొలకకు కారణమైన దయ్యును బీజము వేయింపబడినదై మొలవనట్లు మహాత్ముడగు పంచశిఖమహర్షిచే నిర్బీజముగా చేయబడిన నాజ్ఞానము శబ్దాదివిషయమున ప్రవర్తించదు

నాభిరజ్యతి కస్మింశ్చిన్నానర్థే న పరిగ్రహే ।
నాభిరజ్యతి చైతేషు వ్యర్థత్వాద్రాగరోషయోః ॥ 35

ప్రీతి ద్వేషములు వ్యర్థమగుటవలన లాభమునందు ప్రీతియు, అనర్థమునందు ద్వేషము నాకు గలుగదు

యశ్చ మే దక్షిణం బాహుం చందనేన సముక్షయేత్ ।
సవ్యం వాస్యాపి యస్తక్షేత్సమావేతావుభౌ మమ ॥ 36

నా కుడి బాహువును చందనముచే బూయువాడును, ఎడమబాహువును కత్తిచే చెక్కువాడును నాకు సమానులే

సుఖీ సోఽహమవాప్తార్థః సమలోష్టాశ్మకాంచనః ।
ముక్తసంగః స్థితో రాజ్యే విశిష్టోఽన్యైస్త్రిదండిభిః ॥ 37

మట్టిగడ్డను, రాతిని, బంగారమును సమముగా దలచుచూ సంగ రహితుడనై నిత్య సుఖము గలిగి మునులతో సముడనై రాజ్యమును పాలించుచున్నాను

మోక్షే హి త్రివిధా నిష్ఠా దృష్టాఽన్యైర్మోక్షవిత్తమైః ।
జ్ఞానం లోకోత్తరం యచ్చ సర్వత్యాగశ్చ కర్మణామ్ । 38

జ్ఞాననిష్ఠాం వదంత్యేకే మోక్షశాస్త్రవిదో జనాః ॥
కర్మనిష్ఠాం తథైవాన్యే యతయః సూక్ష్మదర్శినః ॥ 39

ప్రహాయోభయమప్యేవం జ్ఞానం కర్మ చ కేవలమ్ ।
తృతీయేయం సమాఖ్యాతా నిష్ఠా తేన మహాత్మనా ॥ 40

సూక్ష్మజ్ఞానముగల మోక్ష శాస్త్రవేత్తలు కేవల జ్ఞానమును కేవల కర్మమును మోక్షసాధనములుగా తెలుపుదురు ఆ పంచశిఖ మహర్షిచే నీ రెండు మార్గములను విడిచి మూడవ మార్గ ముపదేశింపబడెను

యమే చ నియమే చైవ కామే ద్వేషే పరిగ్రహే ।
మానే దంభే తథా స్నేహే సదృశాస్తే కుటుంబిభిః ॥ 41

ఆ మార్గమున నడుచుకొనువారు యమ, నియమ, కామ, క్రోధ, పరిగ్రహ, మాన, దంభ, స్నేహముల విషయమున గృహస్థులతో సములు

త్రిదండాదిషు యద్యస్తి మోక్షో జ్ఞానేన కస్యచిత్ ।
ఛత్రాదిషు కథం న స్యాత్తుల్యహేతౌ పరిగ్రహే ॥ 42

ఒకనికి సన్న్యాస చిహ్నములచే మోక్షము గలుగుచో, రాజ్యచిహ్నములచే నేల గలుగరాదు?

అధిపత్యే తథా తుల్యే నిగ్రహానుగ్రహాత్మకే ।
రాజభిర్భిక్షుకాస్తుల్యా ముచ్యన్తే కేన హేతునా ॥ 43

రాజులకును, సన్న్యాసులకును నిగ్రహానుగ్రహ రూపమగు ఆధిపత్యము సమముగ నుండుటచే, వారు ఎట్లు ముక్తులగుదురు?

అథ సత్యాధిపత్యేఽపి జ్ఞానేనైవేహ కేవలమ్ ।
ముచ్యంతే సర్వపాపేభ్యో దేహే పరమకే స్థితాః ॥ 44

ఆధిపత్యము ఉన్నను లేకున్నను జ్ఞానముచేతనే సర్వపాపవిమోచనము గలుగుచున్నది

కాషాయధారణం మౌంఢ్యం త్రివిష్టబ్ధం కమండలుః ।
లింగాన్యుత్పథభూతాని న మోక్షాయేతి మే మతిః ॥ 45

కాషాయము, ముండనము, దండము, కమండలము మొదలగు చిహ్నములు మోక్షమునకు సాధనములు గావని నాయభిప్రాయము

యది సత్యపి లింగేఽస్మిన్ జ్ఞానమేవాత్ర కారణమ్ ।
నిర్మోక్షాయేహ దుఃఖస్య లింగమాత్రం నిరర్థకమ్ ॥ 46

ఈ చిహ్నము లున్నను జ్ఞానమే ముఖ్య కారణము. దుఃఖనివారణమునకు చిహ్నములు సాధనములు గావు

అథవా దుఃఖశైథిల్యం వీక్ష్య లింగే కృతా మతిః ।
కిం తదేవార్థసామాన్యం ఛత్రాదిషు న లక్ష్యతే ॥ 47

ఒకవేళ దుఃఖ నివారకములని చిహ్నములను ధరించుట యంటివేని

ఛత్రాది రాజచిహ్నముల యందును దుఃఖనివారకత్వము గలదు గదా?

ఆకించన్యేన మోక్షో௨స్తి కించన్యేనాస్తి బంధనమ్ ।
కించన్యేచేతరేచైవ జంతుర్జ్ఞానేన ముచ్యతే ॥ 48

సర్వపరిత్యాగముచే మోక్షము గలుగును సంగముచే బంధనము గలుగును త్యాగమునందును, సంగమునందును, సయితము జ్ఞానమున్ననే మోక్షము గలుగును

తస్మాద్ధర్మార్థకామేషు తథా రాజ్యపరిగ్రహే ।
బంధనాయతనేష్వేషు విద్ధ్యబంధే పదే స్థితమ్ ॥ 49

కాన బంధన కారణములైన ధర్మార్థకామముల యందును రాజ్యము నందును ప్రవర్తించుచుండియు, బంధరహితమైన స్థానమున నున్న వానినిగా నన్నెరుగుము

రాజ్యైశ్వర్యమయః పాశః స్నేహాయతన బంధనః ।
మోక్షాశ్మనిశితేనేహ చ్ఛిన్నస్త్యాగాసినా మయా ॥ 50

త్యాగమనెడి కత్తిని మోక్షమనెడి రాతిపై నూరి దానిచే రాజ్యైశ్వర్యమనెడి యినుపసంకెలను నరికితిని

సో௨హమేవం గతో ముక్తో జాతాస్థస్త్వయి భిక్షుకి! ।
అయథార్థం హి తే వర్ణం వక్ష్యామి శృణు తన్మమ ॥ 51

అట్లు ముక్తుడనైన నేను నీవిషయము నెరిగితిని

సౌకుమార్యం తథా రూపం వపురగ్ర్యం తథా వయః ।
తవైతాని సమస్తాని నియమశ్చేతి సంశయః ॥ 52

సౌకుమార్యము, చక్కదనము, శ్రేష్ఠమగు శరీరము, యౌవనము గలిగి సన్న్యాసిని వగుట, కామవికారము గలిగియుండుటయు నాకు సందేహమును గొలుపుచున్నది.

యచ్చాప్యననురూపం తే లింగస్యాస్య విచేష్టితమ్ ।
ముక్తోఽయం స్యాన్నవేతి స్యాద్ధర్షితో మత్పరిగ్రహః ॥ 53

ఇతడు ముక్తుడగునా, కాదా అని పరీక్షించుటకై నీ విట్లొనరించి యుండవచ్చును

న చ కామనమాయుక్తే యుక్తేఽప్యస్తి త్రిదండకమ్ ।
న రక్ష్యతే త్వయా చేదం విముక్తస్యాస్తి గోపనా ॥ 54

కాముకులకు దండాది చిహ్నము లేల నీవు సంన్యాస నియమము పాటించలేదు జీవన్ముక్తిని చెంత ఆత్మగోపనమెందుకు?

మత్పక్ష సంశ్రయాచ్చాయం శృణు యస్తే వ్యతిక్రమః ।
ఆశ్రయంత్యాః స్వభావేన మమ పూర్వపరిగ్రహమ్ ॥ 55

నీ విట్టి దుష్కార్యము నేల యొనరించితివి నా శరీరమున ప్రవేశించుటచే నీవొనర్చిన వ్యతిక్రమ మెట్టిదో వినుము

ప్రవేశస్తే కృతః కేన మమ రాష్ట్రే పురేఽపి హ ।
కస్య వా సన్నికర్షాత్త్వం ప్రవిష్టా హృదయం మమ ॥ 56

నా రాష్ట్రము నెట్లు జొచ్చితివి? నా పట్టణమున కెట్లు వచ్చితివి? ఎవని సంకేతముచే నా హృదయము నెట్లు ప్రవేశించితివి?

వర్ణప్రవరముఖ్యాఽసి బ్రాహ్మణీ క్షత్రియస్త్వహమ్ ।
నావయోరేకయోగోఽస్తి మాకృథా వర్ణసంకరమ్ ॥ 57

నీవు బ్రాహ్మణ స్త్రీవి, నేను క్షత్రియుడను, మన సంయోగము వలన వర్ణ సంకరమగును

వర్తసే మోక్షధర్మేణ త్వం గార్హస్థ్యేఽ హమాశ్రమే ।
అయం చాపి సుకష్టస్తే ద్వితీయో ఽఽశ్రమ సంకరః 58

నీవు సన్న్యాసినివి, నేను గృహస్థుడను కాన ఆశ్రమ సంకరము

మరియొకటియగును

నగోత్రాం వాఽనగోత్రాం వా న వేద త్వాం న వేత్థమామ్ ।
నగోత్రమావిశంత్యాస్తే తృతీయో గోత్ర నంకరః ॥ 59

నీ గోత్రము తెలియకుండుటచే సగోత్రవైనచో గోత్ర సంకరము మూడవది యగును

అథ జీవతి తే భర్తా ప్రోషితోఽవ్యథవా క్వచిత్ ।
అగమ్యా వరభార్యేతి చతుర్థో ధర్మనంకరః ॥ 60

నీవు పరభార్యవు కాన ధర్మసంకరము నాలుగవది యగును

సా త్వమేతాన్యకార్యాణి కార్యాపేక్షా వ్యవన్యసి ।
అవిజ్ఞానేన వా యుక్తా మిథ్యాజ్ఞానేన వా వునః ॥ 61

కాన నీవు జ్ఞానము లేకనో, మిథ్యాజ్ఞానము వలననో కామార్థినివై దుష్కార్యము నొనరింప నిశ్చయించితివి

అథవాఽపి న్వతంత్రాఽసి న్వదోషేణ హి కర్హిచిత్ ।
యది కించిత్ శ్రుతం తేఽస్తి సర్వం కృతమనర్థకమ్ ॥ 62

ఒక వేళ స్వతంత్ర వైనను నీ శాస్త్ర జ్ఞాన మంతయు చెడు త్రోవ త్రొక్కినది

ఇదమన్యత్తృతీయం తే భావన్పర్శ విఘాతకమ్ ।
దుష్టాయా లక్ష్యతే లింగం విప్రణ్యత్యాః ప్రకాశితమ్ ॥ 63

మరియు ప్రేమభావ భంజకమైన సన్న్యాస చిహ్నములు దుష్టురాలవగు నీచే ప్రకటింపబడినవి

న మయ్యేవాభినంధిస్తే జయైషిణ్యా జయే కృతః ।
యేయం మత్పరిషత్కృత్స్నా జేతుమిచ్ఛసి తామపి ॥ 64

నీకు నన్ను జయించుటయందేగాక, సభ్యులందరిని లోబరచుకొన వలయునని కోరిక యున్నది

తధార్ష్వత స్తతశ్చ త్వం దృష్టిం స్వాం ప్రతిముంచసి ।
మత్పక్షప్రతిఘా తాయ స్వపక్షోద్భావనాయ చ ॥ 65

నాపక్షమును నిరాకరించుటకును, నీభావమును పోషించుటకును నీ దృష్టిని ప్రసరింపజేసుకొనుచున్నావు

సా స్వేనామర్షజేన త్వ మృద్ధిమోహే న మోహితా ।
భూయస్సృజసి యోగాంస్త్వం విషామృతమివైకతామ్ ॥ 66

మరియు కోపయుక్తమగు మోహముతో గూడిన దానవై విషామృతములకు వలె నేకత్వము నాపాదించుచున్నావు

మాం ప్రాక్షీః సాధు జానీష్వ స్వశాస్త్రమనుపాలయ ।
కృతేయం హి విజిజ్ఞాసా ముక్తో నేతి త్వయా మమ ॥ 67

శాస్త్రము నతిక్రమించుటకు నన్ను పురిగొల్పితివి ఇతడు ముక్తుడు గాడని నీ వెంచి యుండవచ్చును

ఏతత్సర్వం ప్రతిచ్ఛన్నం మయి నార్హసి గూహితుమ్ ।
సా యది త్వం స్వకార్యేణ యద్యన్యస్య మహీపతేః ॥ 68

తత్త్వం నత్ర ప్రతిచ్ఛన్నా మయి నార్హసి గూహితుమ్ ।
న రాజానం మృషా గచ్ఛేన్న ద్విజాతిం కథంచన ॥
న స్త్రియం స్త్రిగుణోపేతాం హన్యుర్హ్యేతే మృషాగతాః । 69

ఇది యంతయు నావద్ద దాచజాలవు రాజును, బ్రాహ్మణుని, స్త్రీని కపటముతో సమీపింప రాదు అట్లగుచో వారు ఆపదను గూర్తురు

రాజ్ఞాం హి బలమైశ్వర్యం బ్రహ్మ బ్రహ్మవిదాం బలమ్ ॥
రూపయౌవన సౌభాగ్యం స్త్రీణాం బలమనుత్తమమ్ । 70

అత ఏతైర్బలైరేవ బలివస్స్వార్థమిచ్ఛతా ॥
ఆర్జవేనాభిగంతవ్యా వినాశాయ హ్యనార్జవమ్ । 71

సా త్వం జాతిం శ్రుతం వృత్తం భావం ప్రకృతి మాత్మనః ॥
కృత్యమాగమనే చైవ వక్తు మర్హసి తత్త్వతః । 72

రాజుల కైశ్వర్యమును, బ్రాహ్మణులకు వేదమును, స్త్రీలకు రూప యౌవన సౌభాగ్య సౌశీల్యాదులును సాటిలేని బలము కాన స్వార్థపరుడు సరళమగు భావముతో వారిని జేరవలయును కపట భావముతో చేరినచో ఆపద తప్పదు కాన నీకులమును, శాస్త్ర జ్ఞానమును, ప్రవర్తనమును, మనోభావమును, స్వభావమును, ఆగమన ప్రయోజనమును యధార్థముగా తెలుపవలయును

భీష్మఉవాచ - భీష్ముడు ధర్మజునితో నిట్లు చెప్పెను

ఇత్యేతైరశుభైర్వాక్యైరయుక్తైరసమంజసైః ।
ప్రత్యాదిష్టా నరేంద్రేణ సులభా న వ్యకంపత ॥ 73

ఉక్తవాక్యే తు నృపతౌ సులభా చారుదర్శనా ।
తతశ్చారుతరం వాక్యం ప్రచక్రామాథ భాషితుమ్ ॥ 74

ఇట్టి పరుషభాషణములచే జనకునిచే తిరస్కరింపబడియు సులభ చలింపక మనోహరమగు వచనముల నుడువుట కిట్లుపక్రమించెను

ఉపేతార్థమభిన్నార్థం న్యాయవృత్తం న చాధికమ్ ।
న శ్లక్ష్ణం న చ సందిగ్ధం వక్ష్యామి పరమం తతః ॥ 75

న గుర్వక్షరసంయుక్తం పరాఙ్ముఖసుఖం న చ ।
నావృతం న త్రివర్గేణ విరుద్ధం నావ్యసంస్కృతమ్ ॥ 76

న న్యూనం కష్టశబ్దం వా విక్రమాభిహితం న చ ।
న శేష మనుకల్పేన నిష్కారణ మహేతుకమ్ ॥ 77

అర్థసహితమును, అనుగతార్థమును, న్యాయయుక్తమును, అధికము కానిదియు, అశ్లక్షణమును, సందేహరహితమును, గుర్వక్షర సంయోగము లేనిదియు, పరాఙ్ముఖ సుఖము కానిదియు, అసత్యము కానిదియు, ధర్మాది విరుద్ధము కానిదియు, వ్యాకరణసంస్కార యుక్తమును, న్యూనపదము కానిదియు,

శ్రుతిపరుషము కానిదియు, క్రమసహితమును, అధ్యాహార దోషరహితమును, హేతుబద్ధమును అగు వాక్యమును నుడువుదును

వక్తా శ్రోతా చ వాక్యం చ యదా త్వవికలం నృప ।
సమమేతి వివక్షాయాం తదా సోఽర్థః ప్రకాశతే ॥ 78

వక్తయు, శ్రోతయు, వాక్యమును చెడదో, ఎప్పుడు వివక్షితార్థము సరిపడునో యపుడే యావాక్య మర్థవంతమగును

ఏవ మేవాత్మనాత్మానం యథాత్వమనుపశ్యసి ।
ఏవ మేవాత్మనాత్మాన మన్యస్మిన్ కిం న పశ్యసి ॥ 79

నీవు నీచే పరమాత్మను నీయందు చూచు రీతిని, ఇతరుని యందు సయితము నీవు ఆత్మ నేల సాక్షాత్కరింపవు?

యద్యాత్మని పరస్మింశ్చ సమతా మధ్యవస్యతి ।
అథ మాం కాసి కస్యేతి కిమర్థ మనుపృచ్ఛసి ॥ 80

నీయందును, నితరుని యందు నీకు సమత్వ మున్నచో నేల నన్ను ఎవతెవు? ఎవ్వరిదానవు? అని అడిగితివి

ఇదం మే స్యాదిదం నేతి ద్వంద్వైర్ముక్తస్య మైథిల! ।
కాఽసి కస్య కుతో వేతి వచనైః కిం ప్రయోజనమ్ ॥ 81

మిథిలాధిపా! ఇది నాది, ఇది నాది కాదు అను ద్వంద్వముల నతిక్రమించిన వానికి ఎవతెవు? ఎవ్వరితవు? ఎచ్చటి దానవు? అను మాటలచే నేమి లాభము?

రిపౌ మిత్రేఽథ మధ్యస్థే విజయే సంధివిగ్రహే ।
కృతవాన్యో మహీపాలః కిం తస్మిన్ ముక్తలక్షణమ్ ॥ 82

త్రివర్గం సప్తధా వ్యక్తం యో న వేదేహ కర్మసు ।
సంగవాన్యస్త్రివర్గేణ కిం తస్మిన్ ముక్తలక్షణమ్ ॥ 83

శత్రువునందు మిత్రుని విషయమును, మధ్యస్థుని గురించియు,

విజయుము ననుసంధి నుద్దేశించియు, వైరమునందును భేదబుద్ధిగల మహీపతియందు ముక్తలక్షణ మేముండును? ఈ ఏడువిధముల ప్రకటమగు ధర్మార్థకామముల నెరుగక వాటిచే కర్మలయందు సక్తుడగు నతని ముక్తలక్షణము లేముండును?

తదయుక్తస్య తే మోక్షే యోఽభిమానో భవేన్నృప ।
సుహృద్భిస్స నివార్యస్తే విరక్తస్యేవ భేషజమ్ ॥ 84

కాన యుక్తుడవుగాని నీకు గలిగిన మోక్షాభిమానము ప్రీతి లేనివానికి ఔషధమువలె నీ స్నేహితులచే నివారింపదగినది.

తాని తాని తు సంచిత్య సంగస్థానాన్యరిన్దమ ।
ఆత్మనాత్మని సంపశ్యేత్కి మన్యన్ముక్తలక్షణమ్ ॥ 85

ఆ యాసంగ విషయములను తనచే తనలోననే చూచుకొనుటయే ముక్త లక్షణము, ఇంతకన్న వేరు లక్షణము లేదు

ఇమాన్యన్యాని సూక్ష్మాణి మోక్షమాశ్రిత్య కానిచిత్ ।
చతురంగ ప్రవృత్తాని సంగస్థానాని మే శృణు ॥ 86

మోక్షవిషయమున రాజ్యసంబంధమున నేర్పడిన రంగస్థానములను కొన్నింటిని నుడివెదను వినుము.

య ఇమాం పృథివీం కృత్స్నామేకచ్ఛత్రాం ప్రశాస్తి హి ।
ఏక ఏవ స వై రాజా పురమధ్యావసత్యుత ॥ 87

ఈ సమస్త భూమి నేకచ్ఛత్రముగ పాలించు రాజు ఒక పట్టణము నధిష్ఠించియుండును

తత్పురే చైక మేవాస్య గృహం యదధితిష్ఠతి ।
గృహే శయనమప్యేకం నిశాయాం యత్ర లీయతే ॥ 88

ఆ పట్టణమునను ఒక యింటిని, ఆ యింటిలోను ఒక శయ్యను అతడు రాత్రిని గడుపుట కధిష్ఠించును,

శయ్యార్థం తస్య చావ్యత్ర స్త్రీ పూర్వమధితిష్ఠతి ।
తదనేన ప్రసంగేన ఫలేనైవేహ యుజ్యతే ॥ 89

ఆ పడకయందును తన ప్రియురాలికి సగమిచ్చి తాను సగమునే పొందును కాన నిందువలన నితనికి ఫలసంబంధము తప్పదు

ఏవమేవోపభోగేషు భోజనాచ్ఛాదనేషు చ ।
గుణేషు పరిమేయేషు నిగ్రహానుగ్రహం ప్రతి ॥ 90

పరతంత్ర స్సదా రాజా స్వల్పేష్వపి ప్రసజ్జతే ।
సంధివిగ్రహయోగే చ కుతో రాజ్ఞః స్వతంత్రతా ॥ 91

స్త్రీషు క్రీడావిహారేషు నిత్యమస్యాస్వతంత్రతా ।
మంత్రే చామాత్య సమితౌ కుతస్తస్య స్వతంత్రతా ॥ 92

యదా హ్యాజ్ఞాపయత్యన్యాం స్తత్రాస్యోక్తా స్వతంత్రతా ।
అవశః కార్యతే తత్ర తస్మిన్ తస్మిన్ క్షణే స్థితః ॥ 93

ఇట్టి ఉపభోగ వస్తువులందును భోజనవస్త్రాదుల విషయమున, పరిమితములగు గుణముల విషయముునను నిగ్రహానుగ్రహములను గూర్చియు రాజెల్లపుడును పరాధీనుడు స్వల్పమగు సంధి విగ్రహములందు సయితము అతడు కలుగ జేసికొనవలసి యుండగా నతనికి స్వాతంత్ర్యము (స్వేచ్ఛ) ఎక్కడిది కామినీ క్రీడా విహారములయందును, మంత్రాలోచనమునందును, మంత్రుల సభయందును ఇతనికి స్వాతంత్ర్య మెక్కడిది? ఇతరుల నాజ్ఞాపించునపుడు మాత్రమితనికి స్వాతంత్ర్యము గలదు కాన తనకు తెలియక నాచే నాయా కార్యముల నతడు చేయించును

స్వప్తు కామో న లభతే స్వప్తుం కార్యార్థిభిర్జనైః ।
శయనే చాప్యనుజ్ఞాతః సుప్త ఉత్థాప్యతేఽవశః ॥ 94

నిద్రింపదలచియు కార్యార్థులచే నిద్రానిరోధము గల్గింపబడి అవశుడై కనుగూర్కెనా మేల్కొల్పబడును.

స్నాహ్యాలభ పిబ ప్రాశ జుహుధ్య్యగ్నీన్యజేత్యపి ।
బ్రవీహి శృణు చాపీతి వివశః కార్యతే పరైః ॥ 95

స్నానము చేయుము, తీసికొమ్ము, త్రాగుము, తినుము, అగ్నిని వ్రేల్చుము, యాగము చేయుము, మాటలాడుము, వినుము అని అస్వతంత్రుడై చేయించును

అభిగమ్యాభిగమ్యైవం యాచంతే సతతం నరాః ।
న చాప్యుత్సహతే దాతుం విత్తరక్షీ మహాజనాన్ ॥ 96

దరిజేరి యెల్లపుడు మనుజులు యాచించుచుందురు కాని యితడు ధనము గూడబెట్టదలచి యందరకు దానము చేయడు

దానే కోశక్షయోహ్యస్య వైరం చాస్యాప్రయచ్ఛతః ।
క్షణేనాస్యోపవర్తంతే దోషా వైరాగ్యకారకాః ॥ 97

దానము చేయుచో ధనాగారము (బొక్కసము) క్షీణించును దానము చేయకున్నచో యాచకులతో వైరము గల్గును. కాన నడుగడుగునకు నితనికి వైరాగ్యజనకములగు దోషములు గోచరించును

ప్రాజ్ఞాన్ శూరాంస్తథైవాఢ్యానేకస్థానేఽపి శంకతే ।
భయమప్యభయే రాజ్ఞో యైశ్చ నిత్యముపాస్యతే ॥ 98

విజ్ఞానవంతులును, శూరులును, ధనవంతులునగు సేవకుల విషయమున భయహేతువు లేకున్నను అడుగడుగునకు శంకాభయములు గలుగుచుండును

తథా చైతే ప్రదుష్యంతి రాజన్ యే కీర్తితా మయా ।
తథైవాస్య భయం తేభ్యో జాయతే పశ్య యాదృశమ్ ॥ 99

కాగా పై విషయములవలన నితనికి గలుగు భయమెట్టిదో గమనింపుము

హతో దేశః పురం దగ్ధం ప్రధానః కుంజరో మృతః ।
లోకే సాధారణేష్వేషు మిథ్యాజ్ఞానేన తప్యతే ॥ 100

దేశము పాడయ్యెను, పట్టణము కాలెను, పట్టపుటేనుగు చచ్చెను అనెడి

యీ మొదలగు విషయములో విధ్యాజ్ఞానముచే దుఃఖించును

అముక్తో మానసైర్దుఃఖైరిచ్ఛాద్వేషభయోద్భవైః ।
శిరోరోగాదిభీ రోగై స్తథై వాభినియంతృభిః ॥ 101

ద్వంద్వైస్తైస్తైరుపహతః సర్వతః పరిశంకితః ।
బహుప్రత్యర్థికం రాజ్యముపాస్తే గణయన్నిశాః ॥ 102

ముక్తుడు గానివాడు ఇచ్ఛా ద్వేష భయములవలన గలిగిన మానసిక దుఃఖములచేతను, తలనొప్పి మొదలగు రోగములచేతను, స్తుతి, నింద, లాభనష్టాది ద్వంద్వములచేతను, పీడితుడై అన్నిటిని సందేహించుచు బహుశత్రువులు గల రాజ్యమును రోజులు లెక్కబెట్టుకొనుచు ననుభవించును

తదల్పసుఖమత్యర్థం బహుదుఃఖమసారవత్ ।
తృణాగ్నిజ్వలనప్రఖ్యం ఫేనబుద్బుదసన్నిభమ్ ॥ 103

కో రాజ్యమభిపద్యేత ప్రాప్య చోపశమం లభేత్ ।
మమేదమితి యచ్చేదం పురం రాష్ట్రం చ మన్యసే ॥ 104
బలం కోశమమాత్యాంశ్చ కస్యైతాని న వా నృప ।

కాన అత్యల్పసుఖము, బహుదుఃఖముగలదియు, నిస్సారమును, తృణాగ్నివలెను నురుగు బుడుగులవలె క్షణికమునగు రాజ్యమును ఎవడు స్వీకరించును? పో దానిచే నెవడు శాంతి నొందును పురరాష్ట్రాదులు నావి అని భావించుచున్నావు అవి ఎవరివి? ఎవరివి కావు.

నాస్త్యసాధారణో రాజా నాస్తి రాజ్యమరాజకమ్ ।
రాజ్యే సతి కుతో ధర్మోఽధర్మే సతి కుతః పరమ్ ॥ 105

అసాధారణుడు రాజు గాడు, రాజు లేని రాజ్యము లేదు రాజ్యపాలనవలన సత్యధర్మముల నెట్లాచరింప గలుగును? అధర్మమువలన పరమగతి చెడును.

యోఽప్యత్ర పరమో ధర్మః పవిత్రం రాజ్యరాజయోః ।
పృథివీ దక్షిణా యస్య సోఽశ్వమేధేన యుజ్యతే ॥ 106

ఇది రాజునకు రాజ్యమునకు పరమ ధర్మము రాజు భూమి నంతయు దక్షిణగా నర్పించి యశ్వమేధము చేయవలయును, ఇదియే పరమధర్మము

**సాహమేతాని కర్మాణి రాజదుఃఖాని మైధిల ।**
**సమర్థా శతశో వక్తు మథవాపి సహస్రశః ॥ 107**

ఇట్లు రాజదుఃఖములను వందలకొలది వేలకొలది చెప్పగలను

**స్వదేహే నాభిషంగో మే కుతః పరపరిగ్రహే ।**
**న మామేవంవిధాం యుక్తామీదృశం వక్తుమర్హసి ॥ 108**

నాకు నాదేహమునకే సంగము లేనప్పుడు ఇతరుని విషయమున సంగమెట్లు గలుగును? ఇట్టి యుక్తురాలగు నన్ను నిట్లనదగదు

**నను నామ త్వయా మోక్షః కృత్స్నః పంచశిఖాచ్ఛ్రుతః ।**
**సోపాయస్సోపనిషదః సోపాసంగస్సనిశ్చయః ॥ 109**

నీవు పంచశిఖమహర్షి వలన నుపాయముతోడను ప్రమాణ యుక్తముగను, ఉపాసనాయుక్తముగను, నిస్సందేహముగను మోక్షము నంతయు వింటివి గదా!

**తస్య తే ముక్తసంజ్ఞస్య పాశానాక్రమ్య తిష్ఠతః ।**
**ఛత్రాదిషు విశేషేషు పునస్సంగః కథం నృప ॥ 110**

ఓ రాజా! విను ముక్తుండందువు, బంధములను లోబరచుకొంటినందువు? అట్టి నీకు రాజచిహ్నములందేల సంగము గలిగెను

**శ్రుతం తేన శ్రుతం మన్యే మృషా వాపి శ్రుతం శ్రుతమ్ ।**
**యథా వా శ్రుతసంకాశం శ్రుతమన్యచ్ఛ్రుతం త్వయా ॥ 111**

నీవు శాస్త్రమును చదువలేదు, లేదా తప్పుటర్థము చేసికొంటివి కాదా! శాస్త్రతుల్యమగు మరియొక దానిని చదివితివి అట్లుగానిచో శాస్త్ర భిన్నమగు దానిని జదివితివి

అథాపీమాను సంజ్ఞాను లౌకికీమ ప్రతిష్ఠసే ।
అభిసంగావరోధాభ్యాం బద్ధస్త్వం ప్రాకృతో యథా ॥ 112

మరియు లౌకికములగు నీ రాజాది సంజ్ఞలయందు స్థిరబుద్ధిగలవాడ వగుటచే నీవు పామరునివలె సంగ నిరోధములచే కట్టువడితివి

సత్త్వేనానుప్రవేశో హి యోఽయం త్వయి కృతో మయా ।
కిం తవాపకృతం తత్ర యది ముక్తోఽసి సర్వశః ॥ 113

నీవే పూర్ణముక్తుడ వైనచో నేను యోగశక్తిచే నీయందు ప్రవేశించుటవలన తప్పేమి?

నియమో హ్యేష వర్ణేషు యతీనాం శూన్యవాసితా ।
శూన్యమావేశయంత్యా చ మయా కిం కస్య దూషితమ్ ॥ 114

యతులకు శూన్యస్థాన నివాసము విహితము గదా? శూన్యమగు నీయందాత్మ నావహింప జేసినందున నెవరి కెట్టి నష్టము కల్గించితిని?

న పాణిభ్యాం న బాహుభ్యాం పాదోరుభ్యాం న చానఘ ।
న గాత్రావయవైరన్యైః స్పృశామి త్వాం నరాధిప ॥ 115

రాజా! చేతులతోగాని, బాహువులతోగాని, కాళ్ళతోగాని, తొడలతోగాని, ఇతర గోత్రావయవములతో గాని నిన్ను తాకకుంటిని.

యథా పుష్కరవర్ణస్థం జలం తత్పర్ణమస్పృశత్ ।
తిష్ఠత్యస్పృశతీ తద్వత్త్వయి వత్స్యామి మైథిల ॥ 116

తామరాకులోని నీరువలె స్పర్శరహితనై నీయందుంటిని.

యది వాప్యస్పృశన్త్యా మే స్పర్శం జానాసి కించన ।
జ్ఞానం కృతమబీజం తే కథం తేనే హ భిక్షుణా ॥ 117

నేను తాకునపుడు నాస్పర్శమును నీ వెరుగుచో పంచశిఖమహర్షి నీజ్ఞానమును నిర్బీజ మొనర్చెననుట యెట్లు పొసగును?

న గార్హస్థ్యాచ్చ్యుత శ్చత్వం మోక్షం చానావ్య దుర్విదమ్ ।
ఉభయోరన్తరాళే వైవర్తసే మోక్షవార్తికః ॥ 118

గృహస్థ ధర్మభ్రష్టుడవై దుర్జ్ఞేయమగు మోక్షమును జేరక మోక్ష వ్యవహారమును మాత్రము చెప్పుచు రెంటికి గాకుంటివి

పృథక్త్వా దాశ్రమాణాం చ వర్ణాన్యత్వే తథైవ చ ।
పరస్పర పృథక్త్వాచ్చ కథం తే వర్ణసంకరః ॥ 119

ఆశ్రమములు వేరు, వర్ణములు వేరు, అందులోని యంతర్భాగములు వేరు, కాన వర్ణ సంకర మెక్కడిది?

నాస్మి వర్ణోత్తమాజాత్యా న వైశ్యా నవరా తథా ।
తవ రాజన్ సవర్ణాస్మి శుద్ధయోనిరవిప్లుతా ॥ 120

నేను బ్రాహ్మణిని గాను వైశ్యస్త్రీనిగాను, ఇంకను తక్కువజాతిదాననుగాను, నీకు సమానమగు క్షత్రియకులమున బుట్టితిని, అక్షతయోనిని (బ్రహ్మచారిణి)

ప్రధానో మనురాజర్షిర్వ్యక్తం తే శ్రోత్రమాగతః ।
కులే తస్య సముత్పన్నాం సులభాం నామ విద్ధి మామ్ ॥ 121

ప్రధానుడగు మనురాజర్షిని నీవు వినియుందువు అతనివంశమున బుట్టి సులభ యనుపేర బరగుదానినిగా నన్నెరుగుము

ద్రోణశ్చ శతశృంగశ్చ చక్ర ద్వారశ్చ పర్వతః ।
మమ సత్రేము పూర్వేషాం చితా మఘవతా సహ ॥ 122

నా పూర్వవంశజులు శతశృంగమునను, ద్రోణక్షేత్రమునను శక్ర ద్వార క్షేత్రమునను గొప్ప యాగము లొనరించిరి

సాఽహం తస్మిన్ కులే జాతా భర్తర్యసతి మద్విధే ।
వినీతా మోక్షధర్మేము చరామ్యేకా మునివ్రతమ్ ॥ 123

నేనట్టి కులమున బుట్టి నాకు తగిన భర్త (అనగా నావలె వైరాగ్యము గలిగి మునివృత్తియందుండు భర్త) లభింపనందున మోక్ష ధర్మము నభ్యసించి

సంన్యాసము నాచరించుచున్నాను

నాస్మి సత్రప్రతిచ్ఛన్నా న పరస్వాపహారిణీ ।
న ధర్మసంకరకరీ స్వధర్మే ఒస్మి ధృతవ్రతా ॥ 124

నాస్థిరా స్వప్రతిజ్ఞాయాం నాసమీక్ష్య ప్రవాదినీ ।
నాసమీక్ష్య గతా చేహ త్వత్సకాశం జనాధిప! ॥ 125

కాని నేను కపట ధర్మాచరణము గలదానిని గాదు పరధనాపహారిణిని, ధర్మసంకరకారిణిని గాను స్వధర్మమునందు నిశ్చిత బుద్ధిగలిగియున్నాను రాజా! ప్రతిజ్ఞను వదలు చలచిత్తురాలను గాను ఆలోచింపక మాటలాడను ఆలోచింపక యిచ్చటికి నీవద్దకు రాలేదు.

మోక్షే తే భావితాం బుద్ధిం శ్రుత్వాహం కుశలైషిణీ ।
తవ మోక్షస్య చాప్యస్య జిజ్ఞాసార్థ మిహాగతా ॥ 126

మోక్షవిషయమున నీబుద్ధిని విని దానిని తెలిసికొనుటకై యిచ్చటికి వచ్చితిని

న వర్గస్థా బ్రవీమ్యేతత్స్వపక్ష పరపక్షయోః । 127

ఈ మాటలు పక్షపాతముతో పలికినవి గావు

సాఒహం మాన ప్రదానేన వాగాతిథ్యేన చార్చితా ।
సుప్తా సుశరణం ప్రీతా శ్వో గమిష్యామి మైథిల! ॥ 128

గౌరవించుటచేతను వాగ్రూపమైన యాతిథ్యముచేతను నన్ను నీవర్చించితివి నీ దృఢజ్ఞానమునకు సంతోషించితిని, నీకు శుభమగు గాక యని ఆశీర్వదించి ఈ దినమిట నిదురించి రేపు పోయెద ననెను

భీష్మ ఉవాచ - భీష్ముడు పలికెను

ఇత్యేతాని స వాక్యాని హేతుమంత్యర్థవంతి చ ।
శ్రుత్వా నాధిజగౌ రాజా కించిదన్యదతః పరమ్ ॥ 129

ఇతి శాంతి పర్వాంతర్గత మోక్షధర్మ పర్వణి ఏకవింశత్యధిక త్రిశతతమో-ధ్యాయ.

ఇట్లు సహేతుకములును, అర్థవంతములును అగు నా వాక్యములను విని జనకుడు ఊరకుండెను

ఇది శాంతిపర్వములోని మోక్షధర్మపర్వములో 321 వ అధ్యాయము

ఈ క్రింద కనుబరచెడు పద్యములు మూలమునందు కనుపింపక పోయినను ఆంధ్రభారతమున నుండుటచేతను, సముచితమని తోచుటచేతను చేర్పబడమైనది

అని యిట్లు పలుకు పలుకులు
విని పలుకక యున్న జనకవిభునాననముం
గనుగొని సులభ నగుచు ని
ట్లనియె నతనితోడ గౌరవాన్వయముఖ్యా !

అగ్ని వెచ్చనోచల్లనో యని మనమున
గరము నందియ మందుట గాదె నిన్ను
నధిప! ముక్తుండవో కావొయని తలంచు
టది మదీయబాలిశభావమని తలంపు.

జనవర! నీనుభాషల ననత్య మొకండును లేదు నీవు న
మ్మనిగణ కీర్తనీయుడవు మోక్షము నీకఱచేతిలోనిదై
యునికి దృఢంబుగా గనియు నొండొక చందము మాటలాడితిన్
నిను నగుపింపగా వలసి నీదగు మన్నన శంక వాసినన్.

అవి యెల్ల ననత్యంబుల
నవనీశ్వర యరయ వచ్చుటది యొక్కడు ని
క్కువ మీయపరాధము భవ
దవిరళ సౌజన్యమగ్న మగుగాక తగన్.



గీతాశాస్త్రమందు శ్రీకృష్ణభగవానుడు సర్వజనులకున్ను బ్రహ్మవిద్యాధికారము గలదని యుపదేశించినది జూడుడు

**అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥ 4-36**

పాపులందరికంటెను నీవు మిక్కిలి పాపములను చేసిన వాడవగుదువేని, సమస్తమైన పాపమనే సముద్రమును జ్ఞానమనెడి తెప్పచేత లెస్సగా దాటగలవు.

జ్ఞానానుష్ఠానము ప్రారంభించుటకు ముందుగా చేసియుండు పాపము సముద్రమంత అపారముగా నుండినను, ఓడవలన సముద్రమును దాటునట్లు దాటవచ్చును ఇందువల్ల నెట్టి పాపాత్ముడైనను గూడ జ్ఞానమార్గ మవలంబింప వచ్చును

**యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 4-37**

ఓ యర్జునా! లెస్సగా మండుచున్న యగ్ని సమిధల నేలాగున సంపూర్ణముగా భస్మము చేయునో, అలాగుననే ఆత్మజ్ఞాన మనెడు నగ్ని సర్వకర్మములను సంపూర్ణముగా భస్మము చేయును

హోమాగ్ని సమిధలను, నవధాన్యములను, ఘృతము మొదలగు హోమద్రవ్యము లన్నిటిని నెట్లు భస్మ మొనర్చునో యాలాగున నాత్మజ్ఞానాగ్ని కర్మలనెడి కట్టెలను, సంస్కారము లనెడు బీజములను, వాసనలనెడి ఘృతమును భస్మమొనర్చును హోమాగ్ని యందు చక్కగ కట్టెలు, నవధాన్యములు, ఘృతము కాలిపోయిన మరల కొంచెమైనను నెట్లు మిగిలి యుండదో, ఆలాగున జ్ఞానాగ్నియందు దహించిన హృదయమైనచో, కర్మగాని, సంస్కారముగాని, జన్మాంతర వాసనలుగాని యుండగూడదు అదే దానికి గురుతు

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి ॥ 38**

ఈ లోకమందు జ్ఞానముతో తుల్యమైనదియు, పాపములను పోగొట్టి శుద్ధిని గలుగజేయునదియు మఱేదియు లేదు ధ్యానయోగాద్యనుష్ఠానము గలవాడు తనయం దాత్మస్వరూప జ్ఞానమును స్వయముగానే పొందుచున్నాడు

ఘటమందుగల దీపము, ఘటధ్వంస కాలమున నెట్లు స్వయముగా ప్రకాశించునో, మేఘావరణ సూర్యుడు మేఘము దొలంగునపుడెట్లు స్వయముగా ప్రకాశించునో, రాహుగ్రస్త చంద్రుడు గ్రహణ విమోచన కాలమున నెట్లు స్వయముగా వెలుగునో, యాలాగున ధ్యానాది సాధనలవల్ల ఆత్మయొక్క ఆవరణము దొలగునపుడు స్వయముగానే జ్ఞానమున్ను ఉదయించును

**అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్ ।**
**సాధురేవ సమన్తవ్య స్సమ్యగ్వ్యవసితో హి సః ॥ 9-30**

మిక్కిలి నిందితములైన కర్మలు గలవాడైనను, అన్యచింతలేనివాడై బ్రహ్మాత్మైక్యానుసంధానచిత్తము గలవాడై నన్ను (భగవంతుని) భజించునెడల వాడు స్థిరమైన మనోనిశ్చయము గలవాడు గనుక, వానిని శ్రేష్ఠుడనియే తలంచ వలయును

దృఢ విశ్వాసము గలిగి అన్యచింత లేనివాడై, తదేక ధ్యానపరుడైనచో, వాని పాపము లన్నియు నశించును అని యాస్తిక్య బుద్ధితో నాచరించువాడు త్వరలోనే పరమ సాధువగును

**క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।**
**కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 9-31**

పై చెప్పిన ప్రకారమున నతడు శీఘ్రముగా ధర్మముతో గూడిన చిత్తము గలవాడుగా నగుచున్నాడు. అనగా ధర్మాత్ము డగుచున్నాడు స్థిరమైన యుపశమనమును (శాంతిని) పొందుచున్నాడు ఓ యర్జునా! నాయొక్క భక్తుడు

ఎప్పటికిన్ని నశించడు అని అవిశ్వాసుల సభలో రెండు చేతులను పై కెత్తి ప్రతిజ్ఞ చేయుము

**మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథాశూద్రా స్తేఽపి యాన్తి పరాం గతిమ్ ॥ 9-32**

ఓ యర్జునా! పాపయోని సంభూతులైన వారెవరు గలరో వారున్ను, స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులున్ను, నన్ను ధ్యానించుచూ ఉత్తమమైన పదవిని (మోక్షమును) నిశ్చయముగా పొందుదురు

భగవంతుడు స్వయముగా నిట్లు చెప్పుటచే నీచజాతిలో బుట్టినవారైనన్ను, లేక యితర జాతిలో బుట్టి పాపకర్మలు చేయువారైనను బ్రహ్మజ్ఞానమున కర్హులగుదురా అని మరల ఏల సందేహించెదరు? రోగుల కొరకుగదా, ఔషధమున్ను , వైద్యులున్ను ఏర్పడినది రోగము లేనివారికొఱకు గాదు గదా! ఈ సత్యమెరింగినచో పాపులయొక్కయు, నీచజాతిలో పుట్టిన వారమని తలంచువారియొక్కయు, ఉద్ధారణ కొరకే బ్రహ్మవేత్త లేర్పడిరనియు, వారికే పాపవిమోచన పదమగు దివ్యత్వము నుపదేశించవలయు నను తత్త్వము గోచరమగును

సన్న్యాస విషయమై శ్రీకృష్ణభగవానుడు గీతలో గూడ తెలుపక పోలేదు కట్టకడకు సన్న్యాసము కావలయుననియే శ్రీకృష్ణాశయము అందువల్లనే శ్రీభగవద్గీతాన్త్యమున మోక్షసంన్యాసయోగ మువదేశించిరి శ్రీకృష్ణ ముఖాంబుజమునుండి స్వయముగా గీతను వినిన అర్జునాదులున్ను అంత్యకాలమున సర్వమును సన్న్యసించి ఏకాంత ప్రదేశములలో తపమొనర్చుచూ, బ్రహ్మధ్యానమును జేయుచూ శరీరములను వీడిపోవుటకు కారణమైనది మహాభారతము మహాప్రస్థాన పర్వమందు దీనిని కనందగును

**సర్వకర్మాణి మనసా సన్న్యస్యాఽస్తే సుఖం వశీ ।**
**నవద్వారే పురే దేహే నైవ కుర్వన్న కారయన్ ॥ 5-13**

ఇంద్రియనిగ్రహము గలవాడు మనస్సుచేత తొమ్మిది ద్వారములు గల

పట్టణమువంటి శరీరమునందు సమస్త కర్మములను విడిచిపెట్టి చేయకున్న వాడును చేయింప కున్నవాడును నై ఆనందము కలుగునట్లుగా నున్నాడు

అంతఃకరణశుద్ధి గలుగువరకు నిష్కామ కర్మయోగముతో గూడినవాడై, అంతఃకరణశుద్ధి గలుగునపుడు సర్వకర్మములను సంన్యసించి జ్ఞేయమగు బ్రహ్మమందు నిలుకడ కలుగుట కొరకున్ను, శ్రవణము చేసిన వేదాంతతత్త్వము యొక్క దృఢత్వము గలుగుటకొరకు మనన నిదిధ్యాసములను చేయవలసి యుండుటవల్ల నపుడు సర్వకర్మములనుండి విడుదల కలుగవలసి యున్నది

యదా హి చేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే ।
సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే ॥ 6-4

ఎపుడు శబ్దాది విషయములందును, కర్మలయందును ఆసక్తి నశించునో, అపుడు సమస్త సంకల్పములను, సర్వకర్మములను విడిచిన వాడగుటవల్ల యోగారూఢస్థితిని పొందినవాడని చెప్పబడుచున్నాడు

'యదా హి చేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే' ఇతి చెప్పుటవల్ల, ధ్యానాద్యనుష్ఠానమువల్ల, ఏ దశయందు నింద్రియములయొక్క అర్థములగు, అనగా విషయములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులలో నుండి మనస్సు విడుదలను పొందునో, ఆలాగున సర్వకర్మములనుండియు నుపరతి జెందిన చిత్తము గలుగునో, అపుడు జీవన్ముక్తిని పొందును అట్టి అవస్థ యింద్రియములకు గలుగువరకు విధ్యుక్త అనుష్ఠానములను చేయుచుండవలయును ఫలపత్రములు పరిపక్వావస్థకు వచ్చునపు డేలాగున స్వయముగా వృక్షములనుండి జారిపడి పోవునో, ఆలాగున జ్ఞానము పరిపక్వస్థితికి వచ్చునపుడు సర్వేంద్రియ విషయము లున్ను వదలిపోవును, ఇట్టి అవస్థ తమకు గలిగినదా? లేదా! అని ముముక్షువులు, సాధకులు ఆత్మలో విచారణ సలుపవలయును అట్లుగాక అనుష్ఠానము వదలి తిరుగుచుండిన, లేబ్రాయములో కోసి, ముగ్గ వేసిన పండ్లవలె నుండును ఆతని యొక్క స్థితి.

జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి ।
నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ప్రముచ్యతే ॥ 5-3

ఓ యర్జునా! యెవడైతే ద్వేషము లేనివాడో, కోరిక లేనివాడో సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములు లేనివాడో, అట్టివాడు నిత్య సంన్యాసి యనియే తెలియందగినవాడు అట్టి సన్న్యాసి అనాయాసముగా సమస్త బంధముల నుండి విడువబడుచున్నాడు

"జ్ఞేయస్స నిత్య సన్న్యాసీ" - ఈ శ్లోకములో చెప్పబడిన లక్షణములు గలవాడే నిత్యసన్న్యాసి యనియు, నేదోయొక కారణాంతరముచే నిజమైన సన్న్యాసి వలె ద్వంద్వములను సహించుకొని, యెల్లపుడు నిట్టి లక్షణములు లేనివాడు అనిత్య సన్న్యాసి యనియే గ్రహించందగినది కావున దేహవేష సంన్యాసము మాత్రము గాక, నిర్ద్వంద్వస్థితిగల సంన్యాసమే నిజమైన సన్న్యాస మగును.

ఓమ్ తత్సత్



# నిర్వాణ ప్రకరణము

ఈ చూడాలా శిఖిధ్వజోపాఖ్యానము యోగవాసిష్ఠ నిర్వాణ ప్రకరణము నందుగలదు ఇది చాల అధ్యాయములతో గూడి విస్తీర్ణమైన విషయము ఇచట సంగ్రహముగానే వ్రాయబడును లేనిచో గ్రంధబాహుళ్య మగును గృహస్థాశ్రమములో నుండు దంపతులు ఈ కధను చదువందగును అట్టైన స్త్రీలకు బ్రహ్మవిద్యాధికారము గలదా? అదిన్ని భర్త యుండునపుడే బ్రహ్మనిష్ఠ నభ్యసింపవచ్చునా? అను సందేహములు నివృత్తి కాగలవు ఈ కధయందు భార్య యోగశక్తివల్ల కుంభముని వేషమును ధరించి, భర్తయగు శిఖిధ్వజ మహారాజునకు బ్రహ్మవిద్యోపదేశము జేసినట్లుంటున్నది అది యెంతో మహత్తైన విషయము కానిచో యోగవాసిష్ఠములో వారల పేర్లను పేర్కొని యుండరు అదిన్నిగాక శ్రీవసిష్ఠమునీంద్రుడు శ్రీరామచంద్రునకు దశరధ మహారాజు సభలో చెప్పవలసియుండిన, అది యెంత గొప్పకార్యమై యుండునో యోచింపదగినది దీనిని సంపూర్ణముగా తెలిసికొన గోరువారు యోగవాసిష్ఠమున కనుకొనందగును

శ్రీ వసిష్ఠ ఉవాచ - శ్రీ వసిష్టులు పలికిరి

**ఇదం పూర్వం పరిత్యజ్య క్రోడీకృత్య మనః ఖగమ్ ।**
**శాన్తమాత్మని తిష్ఠ త్వం శిఖిధ్వజ ఇవాచలః ॥ 1**

శ్రీ వసిష్ఠుడు - ఓ రాఘవా! ఈ వైభవముల నన్నిటిని పరిత్యజించి మనోవిహంగమును (పక్షిని) హృదయమున నిరుద్ధ మొనర్చి, శాంతింపజేసి శిఖిధ్వజునివలె ఆత్మయందు నిశ్చలముగ నీవు వెలయుము.

శ్రీరామ ఉవాచ - శ్రీరాములు పలికిరి

**కోఽసౌ శిఖిధ్వజో నామ కథం వా లబ్ధవాన్పదమ్ ।**
**ఏతన్మే కథయ బ్రహ్మన్భూయో బోధవివృద్ధయే ॥ 2**

శ్రీరాముడు:- మునీంద్రా! ఆ శిఖిధ్వజు డెవడు? అతడు మోక్షము నెట్లు బడయగలిగెను? బ్రహ్మజ్ఞా! జ్ఞానాభివృద్ధికై నా కీ విషయములను వివరించి

చెప్పుడు

శ్రీవసిష్ఠ ఉవాచ -

మాళవానాం పురే శ్రీమాఞ్ఛిఖిధ్వజ ఇతీశ్వరః ।
ధైర్యౌదార్య దశాయుక్తః క్షమాశమదమాన్వితః ॥ 3

శూరః శుభసమాచారో మౌనీ గుణగణాకరః ।
ఆహర్తా సర్వయజ్ఞానాం జేతా సర్వధనుష్మతామ్ ॥ 4

శ్రీవసిష్ఠుడు - రామచంద్రా! ఆశిఖిధ్వజుడు జన్మించినది మాళవదేశ రాజధానియగు ఉజ్జయినీ పట్టణమున అతడు ధైర్య, ఔదార్య, క్షమా, శమద మాది గుణములతో నొప్పుచుండెను శూరుడునగు ఆ రాజు సదాచార, మౌనములు గల్గి గుణసమూహముల కాటపట్టై వెలయుచుండెను అతడు యజ్ఞముల నన్నిటిని ఒనర్చియుండెను వీరుల నందరిని జయించెను

సురాష్ట్రాధిపతేః కన్యాం యయాచే యౌవతాన్వితామ్ ।
నవయౌవనసంపన్నాం భార్యాత్వే విధినోత్తమామ్ ॥ 5

ఉపయేమే స తామాత్మసదృశీం ప్రతిమామివ ।
చూడాలేతి భువి ఖ్యాతా నామ్నా నృపతిసున్దరీ ॥ 6

సురాష్ట్రపతిని, యువతియు, చేటికాజన (పనికత్తెలచే) పరివృతయునగు అతని కన్యక (చూడాల) ను తమరాజుకిచ్చి వివాహ మొనర్పుమని మంత్రులు ప్రార్థించిరి అతడు సమ్మతింప అటుపిమ్మట శిఖిధ్వజుడు కేవలము తన ప్రతిమ యనదగు, ఆత్మానురూపయై యున్న సురాష్ట్రరాజకన్యకను వివాహము చేసికొనెను చూడాలయగు నాసతి మిగుల సౌందర్యము గలిగి యుండెను

సా తం భర్తారమాసాద్య రేజే ఫుల్లేవ పద్మినీ ।
నీలనీరజనేత్రాం తాం చూడాలాం స శిఖిధ్వజః ॥ 7

స్నేహాద్వికాసయామాస సూర్యో దేవో యథాబ్జినీమ్ ।

ఆమె శిఖిధ్వజుని భర్తగ బడసి వికసించిన పద్మసరస్సువలె శోభింపసాగెను

వారిరువురును గురు ద్విజులయెడల వినయమును, హితవాక్యముల బల్కుటయున్ను గాగల సద్వ్యవహారమును జూపుచుండిరి సూర్యుడు పద్మినిని వికసింపజేసినట్లు రాజు ఆమెను సంతసింపజేసెను

అధ యా తేషు బహుషు వర్షేష్వావృత్తిశాలిషు ।
శనైర్గలితతారుణ్యే భిన్నకుమ్భాదివాంభసి ॥ 8

తరఙ్గ నికరాకార భఙ్గురవ్యవహారిణి ।
పాతః పక్వఫలస్యేవ మరణం దుర్నివారణమ్ ॥ 9

అనంతరము చాల యేండ్లు గడువ, ఛిద్రయుక్త ఘటమునుండి నీరు మెల్లగ కారిపోవునట్లు వారి యౌవనముగూడ దిగజారిపోదొడగెను అపుడు వారిట్లు విచారణ యొనర్ప దొడగిరి. ఈ జీవుడు తరంగ సమూహములవలె భంగుర (క్షణిక) మగు శరీరమును గైకొని వ్యవహార పథమున పరిభ్రమించు చున్నాడు ఫలము పక్వమైన రాలిపోవుట అనివార్యమైనట్లు శరీరమునకు వినాశముగూడ తప్పనిసరి

ప్రావృషీవ లతా తుమ్బీ తృష్ణైకా దీర్ఘతాం గతా ।
శైలనద్యా రయ ఇవ సంప్రయాత్యేవ యౌవనమ్ ॥ 10

ఇంద్రజాల మివానత్యం జీవనం జీర్ణసంస్థితి ।
సుఖాని ప్రపలాయన్తే శరా ఇవ ధనుశ్చ్యుతాః । 11

పతన్తి చేతో దుఃఖాని తృష్ణా గృధ్ర ఇవామిషమ్ ।
బుద్బుదః ప్రావృషీవాప్సు శరీరం క్షణభంగురమ్ ॥ 12

భోగ తృష్ణ యొక్కటియే వర్షాకాలమునందలి సొరతీగెవలె పెరుగుచున్నది వర్షాకాలమునందలి సెలయేటివడితో యౌవనము పరుగిడుచున్నది శుష్కమగు నీ శరీరము ఇంద్రజాలమువలె అసత్యము ధనుస్సున సంబంధింపబడి విడువబడిన బాణములవలె సుఖము లన్నియును పారిపోవుచున్నవి. మాంసము మీద గ్రద్ద వ్రాలునట్లు త్రివిధతాపములు, తృష్ణ హృదయమున నావిర్భవించి, వ్యథను గలిగించుచున్నవి వర్షాకాలమునందు నీట కలుగు బుద్బుదములవలె

ఈ శరీరము క్షణభంగుర మైనది

చిరం విచారయామాస శాస్త్రమధ్యాత్మ సంమతమ్ ।
ఆత్మజ్ఞానైకమాత్రేణ సంసృత్యాఖ్యా విషూచికా ॥ 13

సంశామ్యతీతి నిశ్చిత్య తావాస్తాం తత్పరాయణౌ ।
తచ్చిత్తౌ తద్గతప్రాణౌ తన్నిష్ఠౌ తద్విదాశ్రయౌ ॥ 14

తదా తదర్చనపరౌ తదీహౌ తౌ విరేజతుః ।
తత్రైవాతి ఘనాభ్యాసౌ బోధయన్తౌ పరస్పరమ్ ॥ 15

తత్ప్రీతౌ తత్సమారమ్భావన్యోన్యం తౌ బభూవతుః ।
అథ సాఽవిరతం రామ రమణీయ పదక్రమాన్ ॥ 16

శ్రుత్వాఽధ్యాత్మవిదాం వక్త్రాచ్ఛాస్త్రార్థాంస్తారణక్షమాన్ ।
ఇత్థం విచారయామాస స్వమాత్మాన మహర్నిశమ్ ॥ 17

ఆ భార్యా భర్త లిట్లు చింతించి, జనన మరణాది దుర్దశా రూపదుఃఖమును మరల గలుగ జేయునిదియు, సంసారవ్యాధికి ఔషధమును నగునది ఆధ్యాత్మశాస్త్రమే యని నిశ్చయించుకొని అద్దానినే చాలకాల మభ్యసించిరి ఆత్మజ్ఞాన మొకదానివలననే సంసార విషూచిక శాంతించునని నిర్ణయ మొనర్చుకొని వారిరువురును ఆత్మజ్ఞాన పరాయణులైరి మఱియు బ్రహ్మపరులును, బ్రహ్మగత ప్రాణులను, బ్రహ్మగత చిత్తులును, బ్రహ్మనిష్ఠులును నగు ఆత్మ శాస్త్రవేత్తల శరణమును బొందిరి వారు ఆత్మజ్ఞానము నర్థించుచూ దానిని బడయ యత్నించుచూ వెలయదొడగిరి, గాఢతరాభ్యాస ఫలముగ వారు ఆత్మగత ప్రాణులై పరస్పరము ప్రబోధ మొనర్చుకొనుచూ, ఆ పరమాత్మయందే ప్రీతిని నిలిపిరి మరియు పరస్పరము చక్కగ అధ్యాత్మ శాస్త్రమును వినుచు, చింతించుచూ, బోధించుకొనుచూ, కేవల మాయత్నమునే ఒనర్చుచుండిరి ఓ రామచంద్రా! అధ్యాత్మ శాస్త్ర విదులకడ చూడాల సంసారసాగర తరణోపాయ యోగములను రమణీయపద శోభితములును నగు శాస్త్రార్థములను అనవరతము విని, రాత్రిందివము లిట్లు ఆత్మవిచారణ మొనర్పసాగెను

**జడం శూన్యమసత్కల్పం చైతన్యేన ప్రబోధ్యతే ।**
**ఇతి సంచిన్త్య చూడాలా కేనైషా చిత్రచేతనీ ॥ 18**

**ఇతి సంచిన్తయామాస చిరాయేత్థం వ్యబుధ్యత ।**
**అహో ను చిరకాలేన జ్ఞాతం జ్ఞేయమనామయమ్ ॥ 19**

ఇట్లు విచారించి ఏ యుపాయము నవలంబించిన అవిద్యావరణము దొలగి దృశ్య స్వప్నము నశించి చైతన్యమునకు ప్రబోధము లభింపగలదు? అని యామె చింతింపదొడంగెను పిదప చిరకాలమునకు ఆమె ఆత్మతత్త్వమును ఈ వర్ణింపబోవు ఈ విధమున గ్రహించి ఇట్లనుకొనదొడగెను ఆహా! ఎట్టి అదృష్టము! నిర్మలమగు జ్ఞానమును చాలకాలమునకు బిదప నేనిపుడు గ్రహింపగలిగితి!

యద్వై విజ్ఞేయతాం కృత్వా న కశ్చిద్దీయతే పునః ।

ఈ ఆత్మతత్త్వమును గ్రహింప గలిగిన, మరల ప్రచ్యుతి యనునది యుండదు

**అహో ను చిరకాలేన శాన్తాఽస్మివర నిర్వృతా । 20**

నేడెట్టి అదృష్టము, చాలకాలమునకు శాంతిని, నిర్వృతిని నేను బడసితిని!

వసిష్ఠ ఉవాచః -

**దినానుదినమిత్యేషా స్వాత్మారామతయా తయా ।**
**నిత్యమన్తర్ముఖతయా బభూవ ప్రకృతిస్థితా ॥ 21**

శ్రీవసిష్ఠుడు:- ఓ రామచంద్రా! ప్రతిదినము చూడాల తన ప్రసిద్ధమగు స్వాత్మారామత్వముచేతను, అంతర్ముఖ వృత్తి చేతను, తన స్వాభావికమైన ఆత్మ ప్రకృతియందు స్థితి గల్గియుండెను.

**పరితీర్ణభవామ్భోధిః శాన్తసందేహజాలికా ।**
**పరమాత్మమహాలాభపరిపూర్ణాన్తరాత్మనా ॥ 22**

విశ్రాన్తా సుచిరం శాన్తా ఘనలబ్ధ పదాన్తరే ।
సర్వోపమాత్ తతయా జగామావ్యపదేశ్యతామ్ ॥ 23

సంసార సముద్రమును దాటినదై, సందేహజాల వర్జితయై, పరమాత్మ జ్ఞానలాభముచేతను, పరిపూర్ణచిత్తముచేతను, జ్ఞానప్రాప్తమగు పరమపదమున ఆ చూడాల చిరకాలము విశ్రమించెను మఱియు, నుపమానము లన్నిటికి పరయైయుండుటచే నామె అనిర్వచనీయ యై యొప్పెను

ఇతి సా భామినీ తస్య చూడాలా వరవర్ణినీ ।
స్వల్పేనైవ హి కాలేన యయౌ విదితవేద్యతామ్ ॥ 24

ఇవ్విధమున శ్రేష్ఠ వర్ణముగల ఆ రాజపత్ని యగు చూడాల అత్యల్పకాలముననే ఆత్మజ్ఞాన సంయుక్త యయ్యెను

స్వవివేకఘనాభ్యాసవశాదతిశయేన సా ।
శుశుభే శోభనా పుష్పలతేవాభినవోద్గతా ॥ 25

స్వవివేకముయొక్క దృఢాభ్యాసముద్వారా పూర్ణానంద స్వరూప మావిర్భవింప చూడాల నూతన పుష్పలత వోలె చెన్నొందెను

అథ తామనవద్యాఙ్గీం కదాచిత్స శిఖిధ్వజః ।
అపూర్వశోభామాలోక్య స్మయమాన ఉవాచ హ ॥ 26

తదుపరి ఒక సమయమున అట్టి భవ్యశరీరధారిణియు, అపూర్వ శోభాయుక్తయునగు తన ప్రియురాలిని గాంచి చిరునగవుతో నా శిఖిధ్వజ భూపాలుం డిట్లనియె

భూయో యౌవనయుక్తేవ మణ్డితేవ పునః పునః ।
అధికం రాజసే తన్వి జగద్రాజవతీ యథా ॥ 27

ఓ కృశాంగీ! మఱల యౌవనముతో గూడిన దానివలెను, మఱల నలంకరించుకొనిన దానివలెను, పూర్ణచంద్రునితో గూడిన పృథివివలె నీవు అధిక శోభాయుక్తవై యున్నావు

**అభోగకృపణం శాన్తమూర్జితం సమతాం గతమ్ ।**
**గమ్భీరం చ ప్రశాన్తం చ చేతః పశ్యామి తే ప్రియే ॥ 28**

ప్రియా! నీ చిత్తము భోగాశావర్జితమై, శాంతమై, వివేక బలయుతమై, సమత్వమును బొందినదై, గంభీరమై, ప్రశాంతముగా నున్నట్లు నేను పరికించుచున్నాను

**రాజ్యాచ్చిన్తామణేర్వాపి త్రైలోక్యాద్వా త్వయాఽధికమ్ ।**
**అప్రాప్తం కిమనుప్రాప్తం నీలోత్పలవిలోచనే ॥ 29**

నీల కమలములవంటి నేత్రములుగల ఓ ప్రియా! రాజ్యముకంటెను, చింతామణికంటెను, త్రైలోక్యముకంటెను నధికమైన ఏ యప్రాప్త వస్తువును నీవు పొందితివి?

చూడాలోవాచ. -

**నాకించిత్కించి దాకారమిదం త్యక్త్వాఽహమాగతా ।**
**న కించిత్కించిదాకారం తేనాస్మి శ్రీమతీ స్థితా ॥ 30**

చూడాల - ప్రియుడవగు ఓ రాజా ! మూఢజన ప్రసిద్ధమగు దేహాత్మ భావమును ద్యజించి, సంపూర్ణమై, నిరాకారమైనట్టి బ్రహ్మాత్మభావమును జ్ఞానముచే నేను పొందితిని గాన శోభాయుక్తనై వెలయుచున్నాను

**తనువిద్వేషరాగాభిః ప్రజ్ఞాభిః శాస్త్రదృష్టిభిః**
**రమే సహ వయస్యాభిస్తేనాహం శ్రీమతీ స్థితా ॥ 31**

రాగద్వేషములు నశించినట్టి బుద్ధితోడను, శాస్త్రదృష్టియను సఖులతోడను, క్రీడించుచున్నాను గాన శోభావతినై యొప్పుచున్నాను

శిఖిధ్వజ ఉవాచః -

**అసంబద్ధ ప్రలాపాఽసి బాలాఽసి వరవర్ణినీ ।**
**రమసే రాజలీలాభీ రమస్వావనిపాత్మజే ॥ 32**

శిఖిధ్వజుడు - వరవర్ణినీ ! నీవు బాలికవు కనుకనే యిట్లసంబద్ధ ప్రలాపములు కావించుచువున్నావు ఓ రాజపుత్రీ! నీ వింతవరకు ఏ రాజ్యలీలలందు క్రీడించు చుంటివో ఇపుడును వాటియందే క్రీడింపుము

**యత్పశ్యామి న పశ్యామి తత్పశ్యామ్యన్యదేవ యత్ ।**
**ప్రలాప ఇత్యనంన్యస్య న కథం కిల శోభతే ॥ 33**

నేత్రాదీంద్రియములచే దేనిని గాంచుచున్నానో అది మిధ్య నేను గాంచునది అన్యవస్తువు ఇట్టి అసద్వాక్యములను ప్రలపించు వాడెట్లు శోభించును?

**కష్టం నాత్మని విశ్రాన్తో పద్వచాంసి న బుద్ధవాన్ ।**
**రాజేతి ఖిన్నా చూడాలా స్వవ్యాపార పరాఽభవత్ ॥ 34**

తదనంతరము చూడాల తన మనమున నిట్లనుకొనెను అయ్యో! దుఃఖకరమైన విషయము! రాజింకను ఆత్మయందు విశ్రాంతిని పొందలేదు నా వాక్యములను గ్రహింపకుండె - అని యిట్లు ఖిన్నయై మఱల యధారీతి తన యాత్మచింతనా వ్యాపారమున సంలగ్న యయ్యె

రాజదంపతులు ఉభయులున్ను ఏక కాలమందు గురువుల వల్ల బ్రహ్మోపదేశము పొందినను, శిఖిధ్వజుడు ప్రపంచవ్యవహారములు గలవా డగుట చేతను, దృశ్యవిషయ సంస్కారములు నశించనందుచేతను, ధ్యానానుష్ఠానములు సరిగా చేయకపోవుటచేతను, నిర్విషయానంద నిర్వాణపదవిని పొందక పోయెను చూడాలయో, ప్రాపంచిక వ్యవహారములు లేనిదగుటచేతను, జన్మాంతర సంస్కారములు నశించిన హృదయము గలదగుటచేతను, నిరంతరము ధ్యాన మనన నిదిధ్యాసనలు చేసి వచ్చినందుచేతను, అచిరకాలములోనే సర్వవృత్తి శూన్యమగు బ్రహ్మపదములో నిరతిశయానంద సౌఖ్యము నొందగలిగెను

**తదా తథాఙ్గ తత్రాథ తాదృగాశయయోస్తయోః ।**
**తాభిః పార్థివలీలాభిః కాలో బహుతిథో యయౌ ॥ 35**

ఓ రామచంద్రా! ఇట్టి యాశయములు కలిగియున్న వారిరువురకును రాజయోగ్యములగు ఆ యా లీలలందు చాలకాలము గడిచెను రాజు శత్రువులను

జయించుటకై రెండు మూడు సంవత్సరములు విదేశములకు వెడలెను అపుడు

ఏకదా నిత్యతృప్తాయా నిరిచ్ఛాయా అపి స్వయమ్ ।
చూడాలాయా బభూవేచ్ఛా లీలయా ఖగమాగమే ॥ 36

ఇట్లుండ నొక సమయమున నిత్యతృప్తయు, ఇచ్ఛారహితయు నైనను లీలార్థము చూడాలకు ఆకాశగమనమును గూర్చిన యిచ్ఛ స్వయముగా నుద్భవించెను

ఖగమాగమసిద్ధ్యర్థ మథ సా నృపకన్యకా ।
సర్వభోగాననాదృత్య సమాగమ్య చ నిర్జనమ్ ॥ 37

ఏకైవైకాంతనిరతా స్వాసనావస్థితాఙ్గికా ।
ఊర్ధ్వగ ప్రాణ పవన చిరాభ్యాసం చకార హ ॥ 38

పిదప ఆ రాజపుత్రి ఆకాశగమన సిద్ధికొఱకు సమస్త భోగములను త్యజించి ఏకాంతవాస నిరతయై, నిర్జనస్థానమున కరిగి ఏకాకినిగ, స్వాసనముపై అవయవములను దృఢపఱచుకొని ఊర్ధ్వగామియగు ప్రాణవాయువును ఖేచర సిద్ధ్యనుకూలత కొఱకు భ్రూమధ్యాది ప్రదేశములందు నిరోధించుట యను అభ్యాసమును చిరకాల మాచరించెను

శ్రీవసిష్ఠ ఉవాచః -

అణిమాది గుణైశ్వర్యయుక్తా సా నృపభామినీ ।
ఏవం బభూవ చూడాలా ఘనాభ్యాసవతీ సతీ ॥ 39

శ్రీవసిష్ఠుడు - ఓ రామచంద్రా! పైన దెల్పిన విధమున ప్రాణాయామాదుల యొక్క దృఢాభ్యాసముచే రాజపత్ని యగు చాడాల అణిమాది సిద్ధులయొక్క గుణములచే సంపన్నురాలాయెను.

యుద్ధములో శత్రుజయము నొంది తిరిగి వచ్చిన తర్వాత శిఖిధ్వజుడు ఆత్మసాక్షాత్కార జ్ఞానవిషయమై మరల మిక్కిలి వైరాగ్యము గలవాడాయెను

**నిత్యముద్దామవైరాగ్యః పరివ్రాడివ శాన్తధీః ।**
**ఖిద్యతే చ మహాభోగాన్ న భోక్తుం చ శ్రియః స్థితః ॥ 40**

నిరంతరము ప్రబల వైరాగ్య శీలుడును, సంన్యాసివలె శాంతబుద్ధియు నగు శిఖిధ్వజు డపుడు మహాభోగములను, రాజ్యసంపద ననుభవించుటయందు ఖేద మొందుచుండెను

**అథైకదైకాంతగతాం చూడాలామఙ్కమాగతామ్ ।**
**ఇదం మధురయా వాచా సమువాచ శిఖిధ్వజః ॥ 41**

అటుపిమ్మట నొకానొక సమయమున నేకాంతస్థానమున నంకముపై గూరుచున్న చూడాలనుగూర్చి మధురమైన వాక్కుతో శిఖిధ్వజుడిట్లనియె

శిఖిధ్వజ ఉవాచః -

**భుక్తం రాజ్యం చిరం కాలం భుక్తా విభవభూమయః ।**
**అధునాఽస్మి విరాగేణ యుక్తో గచ్ఛామి కాననమ్ ॥ 42**

శిఖిధ్వజుడు - ప్రియా! చిరకాలము రాజ్యమును అనేక విభవములను ననుభవించితిని, ఇక నిపుడు వైరాగ్యయుక్తుడనై వనమున కేగుచున్నాను

**యథా వివిక్తమేకాంతే మనో భవతి నిర్వృతమ్ ।**
**న తథా శశిబింబేషు న చ బ్రహ్మేంద్రసద్మను ॥ 43**

ఏకాంతమగు వనప్రదేశమున మనస్సెట్లు సుఖము నొందునో అట్లు చంద్రబింబములందుగాని, బ్రహ్మ ఇంద్రుల స్థానము లందుగాని, (బ్రహ్మలోక స్వర్గలోకము లందుగాని) సుఖము నొందదు,

**అస్మిన్వనమ్రప్రణే తన్వి! న విఘ్నం కర్తుమర్హసి ।**
**భర్తుర్విఘటయన్తీచ్ఛాం న స్వప్నేఽపి కులస్త్రియః ॥ 44**

సూక్ష్మాంగీ! ఇట్టి వనగమన మను నుత్తమ విచారమున నీవు నాకు విఘ్నము కలిగింపజనదు. కులస్త్రీ లెన్నటికిని తమ భర్తయొక్క కోర్కెకు బ్రతికూల మొనర్పరు గదా!

భవత్యా పాలయంత్యేహ రాజ్యే స్థాతవ్యముత్తమే ।
కుటుమ్బభారోద్వహనం పత్యౌ యాతే వ్రతం స్త్రియః ॥ 45

ఉత్తమురాలైన యో ప్రియా! ఈ రాజ్యమును పాలించుచూ నీ విచటనే యుండుము ఏలయనగా పతి వెడలిన తరువాత కుటుంబభారమును వహించుట (లేక రాజ్యపాలన మొనర్చుట) స్త్రీల వ్రతమై యున్నది (ఇట్లు చెప్పి ఆ రాజు నాటి అర్ధరాత్రి సమయమున లేచి రాజ్యము త్యజించి వెడలి పోయెను )

తతో మన్దర శైలస్య తటస్థం జనదుర్గమమ్ ।
ప్రాప కాననమత్యంత దూరస్థ జనతా పురమ్ ॥ 46

అనంతరము జననివాసమున కతి దూరమున నున్నదియు, మందరపర్వత తటముపై వర్తించుచున్నదియు, మనుజులకు దుర్గమ మైనదియు నగు అరణ్యము నొక దానిని చేరెను

తత్రైకస్మిన్సమే శుద్ధే స్థలే సలిలమాలితే ।
శీతలే శాద్వలశ్యామే స్నిగ్ధే సఫలపాదపే ॥ 47

సమఞ్జరీభిర్వల్లీభిః స చకారోటజాలయమ్ ।
ప్రావృట్ కాలః సవిద్యుద్భిర్నీలాభ్రైరివ పంజరమ్ ॥ 48

అచట జలముచే వేష్టితమై, శీతలమై, పచ్చని తృణములచే శ్యామలయుతమై, మనోహరమై, ఫలసహితములగు వృక్షములతో గూడిన దైనట్టి యొక స్థానమున వర్షాకాలమున మెఱపులతో గూడిన మేఘములచే పంజరము నిర్మింపబడునట్లు నూతన పల్లవ సహితములగు లతలచే నా రాజొక పర్ణశాలను నిర్మించెను

ఇతి దివ సమఖేదం మందరోపాన్త కచ్ఛే ।
విరచిత ఉటజేఽన్తర్మాలవేశో నినాయ ॥ 49

ఓ రామచంద్రా! మందరాచల తటమున నిర్మింపబడిన పర్ణశాలయందు స్థితుడై మాలవదేశాధిపుడగు శిఖిధ్వజుడు ఖేదరహితుడై జపాదులను గావించుచూ చాల దినములు గడిపెను

**బహునాత్ర కిముక్తేన వర్షాణ్యష్టాదశాఙ్గనా ।**
**చూఢాలోవాస సదనే వనగుచ్ఛే శిఖిధ్వజః ॥ 50**

వెయ్యేల, పదునెనిమిది వత్సరములవరకు చూడాల రాజ్యభవనము నందును, శిఖిధ్వజుడు వనసమూహముననుు వసించిరి

**భర్తుః కాషాయపాకం తదాలక్ష్య పాలితం చిరాత్ ।**
**తదా తస్యాథ యాతేషు వర్షేషు జరసా వనే ॥ 51**

అపుడు పతియొక్క రాగద్వేషాది కపాయము లెంతవరకు పరిపక్వముగాక యుండెనో అంతవరకు వేచియున్నదై

**తదా తస్యాత్మ కార్యస్య భవితవ్యతయా తథా ।**
**భర్తుః సమీపగమనే మమ కాలోఽయ మిత్యథ ॥ 52**

ఆ పిమ్మట చూడాల పతియొక్క బోధనరూపమగు ఆత్మకార్యము యొక్క భవితవ్యమునుబట్టి భర్త్న సమీపమునకు బోవుట కిది నాకు తగిన సమయమని యాలోచించి

**సంచిన్త్య మందరోపాన్తం గన్తుం బుద్ధిం చకార సా ।**

మందరపర్వతారణ్యమున కేగుటకై నిశ్చయించి వెడలెను

**ఇతి చిన్తయతీ వ్యోమ్నా చూడాలోల్లఙ్ఘ్యపర్వతాన్ ॥ 53**
**వనైకదేశే కస్మింశ్చిత్కృత పర్ణోటజే పతిమ్ ।**
**దృష్ట్వా యోగేన బుబుధే దేహాన్తరమివాస్థితమ్ ॥ 54**

ఇట్లు చింతించుచూ ఆ చూడాల యాకాశ మార్గము గుండ పర్వతము నుల్లంఘించి, యావనమునందలి యొకానొక ప్రదేశమున బర్ణశాలను నిర్మించుకొనియున్న తన పతిని గాంచి ఏకాగ్ర చిత్తముతో నవలోకింప నాతనిని అన్యదేహమందున్న వానివలె నెరింగెను

**ఇదం రూపం పరిత్యజ్య రూపేణాన్యేన కేనచిత్ । 55**
**సకాశమస్య గచ్ఛామి బోధం దాతుమనుత్తమమ్ ॥**

బాలేయం మమ కాన్తేతి మదుక్తం న కరోత్యలమ్ । 56

ఇక నిపు డీరూపమును వదలి మరియొక రూపమును ధరించి పతికి సర్వోత్తమ జ్ఞాన మొసగుటకై యాతని చెంతకు బోవుదును ఈ రూపముననే పోయినచో 'ఈ బాలిక నాప్రియయే' అని యెటింగినవాడై నావాక్యములను బూర్ణముగా విశ్వసింపకుండును

భర్తా కషాయపాకేన వరివక్వమతిః స్థితః ।
చేతన్యస్యాద్య విమలే స్వం తత్త్వం ప్రతిబిమ్బతి ।
ఇతి సంచిన్త్య చూడాలా బభూవ ద్విజదారకః ॥ 57

ఇపుడు నా పతి పరిపాకతచే బరిపక్వబుద్ధి కలిగియున్నాడు కావున ఈతని నిర్మలచిత్తమున ఆత్మతత్త్వము లెస్సగ ప్రతిఫలించును అని యిట్లు విచారించి చూడాల బ్రాహ్మణ కుమారు డాయెను కుంభముని వేషమును ధరించి సమీపించెను

శిఖిధ్వజ ఉవాచః -

దేవపుత్ర మహాభాగ కుత ఆగమనం కృతమ్ ।
దివసః సఫలో మన్యే యత్త్వామద్యాస్మి దృష్టవాన్ ॥ 58

ఇదమర్ఘ్యమిదం పాద్యం పుష్పాణీమాని మానద ।
ఇమాః ప్రగ్రథితా మాలా గృహ్యాన్తాం భద్రమస్తు తే ॥ 59

శిఖిధ్వజుడు - ఓ దేవర్షీ? తామెటనుండి ఏ తెంచితిరి? తమ దర్శనముచే నేటిదినము సఫలమ్మైనదని నమ్ముచున్నాను మానప్రదా? అర్ఘ్యపాద్య పుష్పమాలాదులను గైకొనుడు తమకు శుభమగు గాత!

సర్గే స్ఫురద్భిర్మత్పుణ్యైర్మన్యే సంప్రేషితో భవాన్ ।
అలక్ష్యైః సంభృతైరద్రౌ బృహద్వాతైరివామ్బుదః । 60

అద్య తిష్ఠామ్యహం సాధో ధన్యానాం ధురి ధర్మతః ।
అమృతస్యన్దివచసా యత్త్వయాఽస్మి సమాగతః ॥ 61

**న కేచన తథా భావాశ్చేతః శీతలయన్తి మే ।**
**రాజ్యలాభాదయోఽప్యేతే యథా సాధుసమాగమః ॥ 62**

ఓ దేవర్షీ! జన్మపరంపరా రూపమగు ఈ సంసారమున నాచే గావింపబడిన యదృశ్యములై దేదీప్యమానము లైనట్టి పుణ్యములచేతనే గొప్ప వాయువుచే మేఘమువలె, తా మీపర్వతముపైకి బంపబడినారు మహాత్మా? నేనిపుడు భాగ్యవంతులలో శ్రేష్ఠుడనై యొప్పుచున్నాను, ఏలననిన, అమృత ప్రవాహమువంటి వాక్యములను వచించు తమతోటి నాకు సాంగత్య మబ్బెను దేవా? తమవంటి మహాత్ములతోటి, సమాగమము చిత్తమును చల్లబఱుచు విధమున రాజ్యలాభాది మఱి యే యితర పదార్థమున్ను శాంతింప జేయజాలదు

**భ్రమన్నపి దిగంతేషు చరన్నపి పరం తపః ।**
**నాపాదయామి విశ్రాన్తిమేకాం నిధిమివాధనః ॥ 63**

తత్త్వజ్ఞా! దిగంతములందు సంచరించుచున్నను, ఉగ్రతప మొనరించు చున్నను గూడ దరిద్రుడు నిధిని బొందనట్లు నేనొకింత విశ్రాన్తినైనను పొందజాలకున్నాను

చూడాలోవాచ :-

**జ్ఞానమేవ పరం శ్రేయ ఇతి బ్రహ్మాదయోఽపి తే ।**
**ప్రాహుర్మహాన్తో రాజర్షే త్వం కిమజ్ఞానవాన్స్థితః ॥ 64**

కుంభముని వేషధారిణి యగు చూడాల - ఓ రాజర్షీ! బ్రహ్మాది మహాత్ము లందరును జ్ఞానమునే పరమశ్రేయముగ వచింప మీరజ్ఞానివలె నేలయుండి యున్నారు

**కోఽహం కథమిదం జాతం కథం శామ్యతి చేతి భోః ।**
**రాజన్నావేక్షసే కస్మాత్కిమజ్ఞ ఇవ తిష్ఠసి । 65**

ఓ రాజా! నేనెవడను? ఈ ప్రపంచ మెట్లుత్పన్న మైనది? ఏ ప్రకారమిది శమించును, ఈ మున్నగు విషయములను విచారింపక అజ్ఞానివలె నేల యున్నావు

**కథం బన్ధః కథం మోక్ష ఇతి ప్రశ్నానుదాహరన్ ।**
**పారావారవిదాం పాదాన్కస్మాద్రాజన్న సేవసే ॥ 66**

బంధమెట్లు కలుగును? మోక్షమెట్లు సంప్రాప్తించును, మున్నగు ప్రశ్నల గావించుచూ, శోధిత 'తత్త్వం' పదముయొక్క యఖండ వాక్యార్థము నెరింగిన మహాత్ముల చరణముల నేల సేవింపకుంటివి?

శిఖిధ్వజ ఉవాచ -

**యదుదారతమం వేత్సి యస్మిన్ జ్ఞాతే న శోచ్యతే ।**
**భవామి నిర్వృతో యేన తద్బ్రహ్మోపదిశాశు మే ॥ 66**

శిఖిధ్వజుడు - ఓ దేవపుత్రా! ఎద్దానిని తాము సర్వముకంటె శ్రేష్ఠమని నమ్ముచున్నారో, ఎద్దాని నెరుంగుటచే జీవుడిక మరల దుఃఖము నొందడో, దేనిచే నేను సుఖస్వరూపమున విశ్రమింతునో అట్టి బ్రహ్మముయొక్క యుపదేశమును నాకు శీఘ్రముగా గావింపుడు

కుమ్భ ఉవాచ -

**సర్వస్య బీజే సంత్యక్తే సర్వం త్యక్తం భవత్యలమ్ ।**
**సంభవాసంభవా ద్భూప! సర్వత్యాగో భవేదితి ॥ 67**

కుమ్భుడు - ఓ రాజా! సమస్తమునకు బీజమగు ఆ మనంబును బూర్ణముగ ద్యజించుటచే సర్వము లెస్సగ త్యజింప బడుచున్నది. కాన నపుడే సర్వత్యాగము సంభవ మగును అట్లు దానిని ద్యజింపకున్నచో సర్వత్యాగ మసంభవ మగును

**చిత్తే త్యక్తే లయం యాతి ద్వైతమైక్యం చ సర్వశః ।**
**శిష్యతే పరమం శాన్త మచ్ఛమేకమనామయమ్ ॥ 68**

చిత్తము త్యజింపబడగా ద్వైతమున్ను, ఐక్యమున్ను లయమొంది, కేవలము పరమశాంతము, స్వచ్ఛమై, నిరామయమై, ఏకమైనట్టి పరమాత్మయే శేషించును.

**అస్యాశ్చిత్తం విదుః క్షేత్రం సంసృతేః సస్యసంతతేః ।**
**క్షేత్రే త్వక్షేత్రతాం యాతే శాలేః క ఇవ సంభవః ॥ 69**

ఈ సంసారమను సస్యసమూహముయొక్క యుత్పత్తికి క్షేత్రము (భూమి) చిత్తమనియే చెప్పబడినది అట్టి క్షేత్రమే నశింప నిక ధాన్యమగు సంసార మెద్దానినుండి ప్రాదుర్భవించును?

**సర్వత్యాగో మహత్త్వస్య కారణం నిర్మలద్యుతేః ।**
**సర్వం త్యజసి చేద్యస్మాద్బుద్ధిస్థైర్యం బృహత్తమమ్ ॥ 70**

సర్వత్యాగమే గొప్పదై, నిర్మలమైనట్టి ప్రకాశమునకు గారణమై యున్నది ఏలయనిన సర్వమును ద్యజించినపుడే నీకు బుద్ధియొక్క స్థిరత్వమున్ను, సర్వోత్తమత్వమున్ను సంప్రాప్తించుచున్నది

**సర్వత్యాగః పరానన్దో దుఃఖమన్యత్సుదారుణమ్ ।**
**ఇత్యోమిత్యురరీకృత్య యదిచ్ఛసి తదాచర ॥ 71**

సర్వత్యాగమే పరమానన్దము, తద్భిన్నమగు సమస్తము దారుణమైన దుఃఖమే యగును ఇద్దానిని విచారించి ఓమ్ అనుపదముయొక్క అనర్థము నంగీకరించిన వాడవై, ఇక నీయిచ్ఛానుసార మాచరింపుము

శిఖిధ్వజ ఉవాచ -

**నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మహామునే! ।**
**స్థితోఽస్మి గత సందేహః విశ్రాన్తమతిరాత్మవాన్ ॥ 72**

**జ్ఞాతజ్ఞేయో మహామౌనీ! తీర్ణమాయామహార్ణవః ।**
**శాంతోఽహమనహం రూపో జ్ఞః స్థితోఽస్మి నిరామయః ॥ 73**

శిఖిధ్వజుడు - ఓ మహామునీ! తమ యనుగ్రహముచే నా యజ్ఞానము నశించినది ఆత్మస్వరూపముయొక్క స్మరణము గలిగినది ఇవుడు సంశయరహితుడనై ఆత్మయందు విశ్రాన్తి నొందియున్నాను

మహాత్మా! నేను జ్ఞేయపదార్థము నెరింగితిని, మాయారూప మహాసముద్రమును దాటితిని నేనిపుడు మహామౌనినై శాంతుడనై అహంకార వర్జితుడనై ఆత్మజ్ఞాన సంపన్నుడనై వికార రహితుడనై యున్నాను

అహోను సుచిరం కాలం ప్రభ్రాన్తోఽహం భవామ్బుధౌ ।
స్థానమక్షయమక్షుబ్ధమధునా ప్రాప్తవానహమ్ ॥ 74

ఆహా! అతిదీర్ఘ కాలమువఱకు నే నీ సంసారసాగరమున తిరుగాడితిని, ఇపుడు దుఃఖరహితమగు నక్షయస్థానమును పొందియున్నాను

కుమ్భ ఉవాచ :-

కచ్చిదస్మిన్పదే స్ఫారే శుద్ధే వితత నిర్మలే ।
సుతల్పే నిర్వకల్పానాం సుఖం విశ్రాన్తవానసి ॥ 75

కచ్చిదన్తః ప్రబుద్ధోఽసి కచ్చిద్భ్రాన్తిస్త్వయోజ్ఝితా ।
కచ్చిజ్జ్ఞేయం పరిజ్ఞాతం దృష్టం ద్రష్టవ్యమేవ వా ॥ 76

కుమ్భముని వేషధారిణియగు చూడాల - ఓ రాజా! మహత్తరమై, శుద్ధమై, వ్యాపకమై, నిర్మలమై, నిర్వికల్ప సమాధియం దుండు, యోగులకు నుత్తమశయ్యా భూతమైనట్టి నిరతిశయానంద దాయకమగు ఆత్మపదమున నీకు విశ్రాన్తి లభించినదా! నీ యంతఃకరణమున ప్రబోధ మైనదా నీవు భ్రాన్తిని వదలితివా? జ్ఞేయవస్తువు నెరింగితివా? చూడదగిన దానిని జూచితివా?

శిఖిధ్వజ ఉవాచ .-

భగవంస్త్వత్ప్రసాదేన మహావిభవ భూమికా ।
మహతీ పదవీ దృష్టా సర్వ స్యోర్ధ్వం స్థితా మయా ॥ 77

శిఖిధ్వజుడు - ఓ మహాత్మా ! తమ యనుగ్రహముచే మహావిభవరూపమగు భూమికను నేను బొందితిని, మహత్తరమైన ఆత్మపదవిని గాంచితిని. మఱియు సర్వోపస్థితి హిరణ్యగర్భుని యానందమువరకుగల విషయానందమునకు పై గల దశయందు స్థితినొంది యున్నాను.

జన్మనాపి మయా లబ్ధం యన్నామ న మహామృతమ్ ।
తదద్య త్వత్ప్రమానంగాత్తేనైవాపాదితం స్వయమ్ । 78

అనన్తమాద్య మమృతం చైతత్కమలలోచన ।
కథం నాసాదిత మభూత్పూర్వమాత్మపదం మయా ॥ 79

మహాత్మా! ఏ మహామృతమును నేను నాజీవిత మందెపుడును త్రాగక యుంటినో, అయ్యది నేడు తమ సాంగత్యముచే స్వయముగ నాకు లభించినది కమలనేత్రా! అనంతమై, ఆద్యమై, అమృత స్వరూపమైనట్టి యీ యాత్మపదమును బూర్వమే యేల పొందకుంటిని?

కుమ్భ ఉవాచ :-

మనస్యుపశమం యాతే త్యక్తభోగైషణే స్థితే ।
కషాయపాకే నివృత్తే సర్వేన్ద్రియ గణస్య చ । 80

యాన్తి చేతసి విశ్రాన్తిం విమలా దేశికోక్తయః ।
యథా సితాంశుకే శుద్ధే బిన్దవః కుంకుమాంభసః ॥ 81

కుమ్భుడు - ఓ రాజా! మనస్సు శమింప భోగములను గూర్చిన యీషణములు త్యజింపబడ, సర్వేన్ద్రియ సమూహము యొక్కయు, మనస్సుయొక్కయు కషాయములు నివృత్తములు కాగా, తెల్లని శుద్ధవస్త్రముపై కుంకుమ జలబిందువులవలె , నిర్మల చిత్తమున గురూపదేశ వాక్యములు విశ్రమించును (ఫలించును )

ఏతచ్ఛ్రుత్వా చ బుద్ధ్వా చ మత్వా చ మునినాయక ।
యథేచ్ఛసి తథా తిష్ఠ దృష్టే స్పష్టే పరేపదే ॥ 82

స్వర్గం గచ్ఛామ్యహం పర్వకాలేఽస్మి న్నారదో మునిః ।
బ్రహ్మలోకాత్సమాయాతో భవత్యమరసంసది ॥ 83

ఓ రాజా! దీనిని విని, ఎఱిగి, మననము గావించి, స్పష్టముగ గాంచబడిన పరమపదమున నీ యిష్టము వచ్చినట్లు స్థితి గలిగి యుండుము నేనిపుడు స్వర్గమునకు పోవుచున్నాను. ఏలయనగా నీ పర్వకాలమున బ్రహ్మలోకమునుండి నారదముని యింద్రసభకు వచ్చియుండును

శ్రీ వసిష్ఠ ఉవాచ

**శిఖిధ్వజం తం భర్తారం కుమ్భవేషేణ తేన సా ।**
**ప్రబోధ్యాన్తర్ధి మాగత్య తతార తరసా నభః ॥ 84**

**దేవపుత్రాకృతిం వ్యోమ్ని జహౌ మాయా వినిర్మితామ్ ।**
**విదగ్ధముగ్ధమాకారం స్త్రైణం జగ్రాహ సున్దరమ్ ॥ 85**

**నభసా స్వపురం ప్రావ వివేశాఽఽన్తః పురం క్షణాత్ ।**
**దృశ్యా బభూవ లోకస్య నృపకర్మ చకార చ ॥ 86**

శ్రీవసిష్టుడు - కుంభఋషి వేషమును ధరించిన చూడాల యిట్లు తన భర్తయగు శిఖిధ్వజున కుపదేశము గావించి అంతర్ధానయై వేగముగ నాకాశమార్గమున నెగసెను అట్లాకాశమున జని మాయారచితమగు దేవపుత్రుని యాకారమును ద్యజించి, సుందర స్త్రీ రూపమును ధరించెను పిదప ఆకాశమార్గము గుండా తన నగరమును జేరి క్షణకాలములో అంతఃపురమున ప్రవేశించి తదుపరి ప్రజాపాలనమను రాజ్యకార్యము నొనర్చెను

**వాసరత్రితయేనాథ పునరమ్బరమేత్య సా ।**
**బభూవ కుమ్భో యోగేన శిఖిధ్వజవనం యయౌ ॥ 87**

అటుపిమ్మట మూడుదినములు గడువగా మరల నాకాశమున ప్రవేశించి తనయోగశక్తిచే కుంభఋషిరూపమును ధరించి శిఖిధ్వజు డున్నట్టి వనమున కేగెను అత్తరి శిఖిధ్వజుడు ఇపుడు పూర్ణజ్ఞానము గలవాడాయెనని దలంచి

**ఆత్మవృత్తాన్తమఖిలం తమేనం స్మరయామ్యహమ్ ।**
**కుమ్భరూపమిదం త్యక్త్వా చూడాలైవ భవామ్యహమ్ ॥ 88**

కావున నీతని కిపుడు నా వృత్తాంత మంతయు స్మరింపజేసెదను మఱియు, నేనిపుడు కుంభరూపమును త్యజించి చూడాలరూపమునే ధరించెదను అని నిశ్చయించుకొని తన పూర్వరూపమగు చూడాలరూపము జూపి యాతనికి ఈ క్రింది విధముగా వచించెను

**సర్వత్రైక్యావబోధేన మౌర్ఖ్యక్షయభువాన్వితాః ।**
**నిరిచ్ఛాస్తావదాకాశవిశదాః సంస్థితా వయమ్ ॥ 89**

సర్వత్ర ఏకత్వజ్ఞానము కలిగియుండుటచే మనము అజ్ఞాన రహితులమై యున్నాము మఱియు ఇచ్ఛారహితులమై యాకాశమువలె స్వచ్ఛముగ వెలయుచున్నాము.

**యాదృగేషణ మస్మాకం తాదృశం తదనేషణమ్ । 90**

అట్టి మనకు రాజ్యాది భోగముల అపేక్షయు, అనపేక్షయు రెండును సమానమై యున్నవి అనగా ద్వంద్వములు నశించిన జీవన్ముక్తునికి వనమందుండినను, రాజగృహమందు నుండినను సమానమే ఈ రెండింటిలో వనమందుండిన తానొక్కడే ముక్తిని పొందినవాడగును రాజ్యమందుండిన ప్రజలుగూడ రాజుయొక్క వర్తనమును జూచి పవిత్రు లగుదురు కాన నగరిలోనికి వెళ్ళుదమని చెప్పి రాజునుకూడ పిలుచుకొనిపోయెను

**తస్మాన్మహేంద్ర శైలాచ్చలితః స మహీపతిః ।**
**పథి పశ్య న్గిరీన్దేశాన్నదీర్గ్రామాన్సజఙ్గలాన్ ॥ 91**

అట్లు రాజమహేంద్రపర్వతమునుండి యేగుచూ, మార్గమున పర్వతములను, దేశములను, నదులను, వనసహితములగు గ్రామములను జూచుచు బోయెను

రాజు వచ్చెడు వృత్తాంత మెరింగి

**తత్ర తే తస్య సామన్తాస్తదాగమనమాదృతాః ।**
**వివిదుర్జయ శబ్దేననిర్జగ్ముశ్చోదితాశయాః ॥ 92**

**లాజపుష్పాంజలివ్రాతైరావృష్టః పౌరయోషితామ్ ।**
**వణిఙ్మార్గమసౌ పశ్యన్పురం పరమనుత్తమమ్ ॥ 93**
**ప్రవిశ్యాథ గృహం తైస్తైః సంయుతం నృపమఙ్గలైః ॥**

మంత్రులున్ను, సామంతులున్ను ప్రసన్నులై యుత్కంఠతో గూడినవారై

యాతనిని సన్మానించుటకై పురమునుండి బయలుదేరిరి పురజనులచే చల్లబడిన లాజ (పేలాల) లతోటిన్ని, పుష్పాంజలితోటిన్ని కప్పబడిన యా రాజు ఉత్తరోత్తర మున నత్యుత్తమమగు వ్యాపారుల మార్గ మవలోకించుచు, రాజయోగ్యములగు మంగళములతో గూడియున్నదైన దన రాజభవనమును ప్రవేశించెను

**సమ్యక్సంమానయామాస ప్రణతం ప్రకృతిప్రజమ్ ।** 94

పిమ్మట రాజు మిక్కిలి యానందభరితుడై నమ్రులైన మంత్ర్యాది ప్రధానగణంబును బాగుగా సన్మానించెను

**పురోత్సవం భృశం కృత్వా దినసప్తకముత్తమమ్ ।**
**అకరోద్రాజ్యకార్యాణి స్వాని స్వాన్తః పురే నృపః ॥** 95

ఏడు దినముల వఱకు నగరమున గొప్ప యుత్సవము గావించి యారాజు ఆత్మభావముతోనుండి ప్రాప్తమైన రాజకార్యములను, అంతఃపురమునందు స్వాభిమతములగు కార్యములను చేసెను ఈలాగున దంపతులు బ్రహ్మవిచారము సేయుచు బహుకాలము సమదృష్టిచే రాజ్యమును పాలించి

**రాజ్యం తయా రమణ్యాపి నిర్వాణం పదమాప్తవాన్ ।**

56చూడాలతో సహ యాతడుండి నిర్వాణ పదమును పొందెను

**భుక్త్వా భోగాననేకాన్భువి సకల మహీపాలచూడామణిత్వే ।**
**స్థిత్వా వై దీర్ఘకాలం పరమమృతపదం ప్రాప్తవాన్సత్త్యశేషః ॥ 97**

శిఖిధ్వజనృపాలుడు దీర్ఘకాలమువరకు మహీపాలురయొక్క చూడామణి పదమున ప్రతిష్ఠితుడై, అనేక భోగముల ననుభవించి, సన్మాత్రమే శేషించియున్న వాడై, పరమమగు అమృత పదమును బొందెను

ఓమ్ తత్సత్
శాంతి శ్శాంతి శ్శాంతిః



# సన్న్యాసార్హత

సన్న్యాసమును గురించి నారద పరివ్రాజకోపనిషత్తునందును, సన్న్యాసోపనిషత్తునందును నిరూపింపబడియున్నది ఇది చతుర్ముఖ బ్రహ్మ శ్రీనారదమునికి నుపదేశించినది

**అథ షండః పతితోఽఙ్గవికలః స్త్రైణో బధిరోఽర్భకో మూకః**
**పాషండశ్చక్రీ లింగీ వైఖానసహరద్విజౌ, భృతకాధ్యాపకః**
**శిపివిష్టోఽనగ్నికో వైరాగ్యవన్తోఽప్యేతే న సన్న్యాసార్హాః ।**

1 షండుడు (నపుంసకుడు) 2 పతితుడు (వెలివేయబడినవాడు) 3 వికలాంగుడు, 4 స్త్రీలతో గూడినవాడు, 5 బధిరుడు (చెవిటివాడు) 6 అర్భకుడు (మైనరు తీరనివాడు) 7 మూగవాడు, 8 పాషండుడు(నాస్తికుడు) 9 చక్రధారి 10, లింగధారి, 11 వైఖానస బ్రాహ్మణుడు, 12 శివార్చకుడు 13 భృతకాధ్యాపకుడు (జీతము కొఱకు వేదము చెప్పువాడు) 14 శిపివిష్టుడు (రోగముచేత బట్టతల గలవాడు) 15 అనగ్నికుడు (అగ్నిహోత్రము చేయనివాడు)- వీరు వైరాగ్యము గలవారైనను సన్న్యాసమున కర్హులు గారు

ఇది యిచ్చట నిరూపించుటకు కారణ మేమన నెవరెవరు సన్న్యాసమున కర్హులు గారో, వారి పేర్లను నిరూపించునపుడు స్త్రీలు గూడ అనర్హులైనచో వారి పేరును గూడ నిరూపించి యుందురు అట్లు గానందుచేత స్త్రీలు గూడ సంన్యాసమున కర్హులే యని గ్రహించుకొనవలసి యున్నది ఏలన ఉపనిషత్కాలములోనే మైత్రేయీ, సులభాదులు సంన్యాసినులై యున్నట్లు శాస్త్రములో కనిపించుటవల్ల సంన్యాసమునకు తగిన యోగ్యతగల స్త్రీలు గూడ అర్హులనియే గ్రహించవలయును బౌద్ధయుగములో బుద్ధ మతమునందు సంన్యాసినులగు స్త్రీలుండిరి మహాగౌతమి, ఉత్పల మొదలగువారు స్త్రీ సంన్యాసినులకు నాయకురాండ్రై యుండిరి అంతేగాక వారు జీవించియున్నపుడే పరమ నిర్వాణస్థితిగూడ పొందినవారై యుండిరనియే బౌద్ధ గ్రంథములలో నిరూపించియున్నారు. నీతి యొక్క స్వరూపమే శ్రీ బుద్ధావతార మగుటవలన

స్త్రీలకుగూడ సంన్యాసాధికార మిచ్చినను నివాసస్థలము మాత్రము పురుష సంన్యాసులతో సంబంధము లేక వేరుగానే యుండెను శ్రీబుద్ధుని ధర్మబోధనా సమయమున స్త్రీల కేర్పరచిన స్థలమున వారున్ను వచ్చి శ్రవణము చేసుకొనేలాగున నేర్పాటు ఉండెను. తరువాత వారివారి స్థలములలోనికి వెళ్ళి ధ్యాన మననాదుల చేయుచుందురు

ఒక వేళ బౌద్ధమతము వేద మార్గమునకు సంబంధించినది గాదని కొందరు చెప్పినను మైత్రేయి, గార్గి, సులభాదులు సంన్యాసినులేయని అంగీకరించవలసియున్నది మరియు ఆత్మ పురాణమున, 'పౌతమసి' వలన ఒక సంన్యాసినుల సంఘ మేర్పడియుండినట్లున్ను, బహుకాలము జరిగిన పిమ్మట నా సంఘ మాగిపోయినట్లున్ను గలదు ఆ గురుపరంపరలో చేరిన చాలమంది పేర్లుగూడ నా గ్రంథమున గనందగును మరియు సంన్యాసోపనిషత్తున గూడ అనర్హులను గురించి పై చెప్పిన విధముగానే తెలుపడ మయినది ఇచట గూడ అనధికార సంఘములో స్త్రీలను పేర్కొనక పోవుటవల్ల వారున్ను అధికారులనియే గ్రహించవలసినది

మరియు సంన్యాసము లనేక విధములు గలవు వానిలో 1 వైరాగ్య సంన్యాసి, 2 జ్ఞానసంన్యాసి, 3 జ్ఞానవైరాగ్యసంన్యాసి, 4 కర్మసంన్యాసి. (అను భేదములు ముఖ్యములు)

### 1. వైరాగ్య సన్న్యాసి లక్షణము -

**దృష్టానుశ్రవిక విషయవైతృష్ణ్య మేత్య ప్రాక్పుణ్యకర్మ విశేషాత్సన్న్యస్తః స వైరాగ్య సంన్యాసీ ॥**

పూర్వ పుణ్య విశేష మహాబలముచే దృశ్యములోగల సమస్త విషయములను, జూచియు, వినియు విరక్తిగలవాడై సంన్యసించువాడు వైరాగ్య సంన్యాసి యనబడును

## 2. జ్ఞాన సన్న్యాసి లక్షణము -

శాస్త్ర జ్ఞానాత్పాపపుణ్యలోకానుభవ శ్రవణాత్ప్రపంచోపరతో దేహ వాసనాం శాస్త్రవాసనాం లోకవాసనాం త్యక్త్వా వమనాన్న మివ ప్రవృత్తిం సర్వం హేయం మత్వా సాధనచతుష్టయసంపన్నః యః సన్న్యస్యతి స ఏవ జ్ఞానసంన్యాసీ ॥

ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞానమువల్లను, పుణ్యపాపమయమగు లోకానుభవమును మహాత్ములవల్ల వినుటవలనను, ప్రాపంచిక విషయములనుండి యుపరతిని బొందినవాడును, లోకవాసనను, శాస్త్రవాసనను, దేహవాసనను విడిచి, వమనాన్నమువలె ప్రాకృత ప్రవృత్తు లన్నిటిని హేయముగా దలంచి, సాధన చతుష్టయ సంపన్నుడై యెవడు సన్న్యసించునో వాడే జ్ఞాన సంన్యాసి

## 3. జ్ఞానవైరాగ్య సంన్యాసి లక్షణము.

క్రమేణ సర్వ మభ్యస్య సర్వమనుభూయ జ్ఞానవైరాగ్యాభ్యాం స్వరూపానుసంధానేన దేహమాత్రావశిష్టః సన్న్యస్య జాతరూపధరో భవతి స జ్ఞానవైరాగ్యసంన్యాసీ॥

విధిప్రకారము గురుసన్నిధిలో నుండి వేదాన్త శ్రవణ ధ్యానాదుల సర్వమును అనుష్ఠించి, సర్వానుభవము గలవాడై, జ్ఞాన వైరాగ్యములచే స్వరూపాను సంధానపరుడై దేహమాత్రావశిష్టుడై సంన్యసించి, దిగంబర వృత్తిగలవాడు జ్ఞానవైరాగ్య సన్న్యాసి

## 4. కర్మ సన్న్యాసి లక్షణము.

బ్రహ్మచర్యం సమాప్య గృహీ భూత్వా వానప్రస్థాశ్రమమేత్య వైరాగ్యాభావేఽ ప్యాశ్రమ క్రమానుసారేణ యః సన్న్యస్యతి స కర్మసన్న్యాసీ॥

గురుకుల మందుండి బ్రహ్మచర్యవ్రతమును సమాప్తిచేసి గురు ఆజ్ఞానుసారము గృహస్థాశ్రమమున ప్రవేశించినవాడై తరువాత వానప్రస్థాశ్రమ మును బొంది, పరిపక్వమైన వైరాగ్యము గలగనప్పటికిన్ని, బ్రహ్మచర్యాది నాలుగు

ఆశ్రమములు పాలించుట క్రమవిహిత మగుటచే నెవడు సన్న్యసించున్నాడో వాడు కర్మ సన్న్యాసి

ఇకను సన్న్యాసము లనేకములు గలవు వానిలో వివిదిషా సన్న్యాసమనియు, విద్వత్సన్న్యాసమనియు రెండు ముఖ్యములు మరియు కుటీచక, బహూదక, హంస, పరమహంస, తురీయాతీత, అవధూతలని సన్న్యాసులలో ఆరు విధముల బేధములు కలవు కొన్ని శాస్త్రములలో కుటీచక, బహూదక, హంస, పరమహంస లని నాలుగు బేధములు మాత్రమే చెప్పబడినవి వీని లక్షణము లన్నియు, సన్న్యాసోపనిషదాదులలో చూడదగును అవి యిచట వ్రాయబూనిన గ్రంధ బాహుళ్య మగునని తలంచి విడచిపెట్టడమైనది మరియు క్రమపద్ధతి సన్న్యాసమని సామాన్యముగా గలదు పరమహంస పరివ్రాజకోపనిషత్తునందు నీ విషయము విపులముగా గనందగును

**సద్గురుసమీపే సకల విద్యాపరిశ్రమజ్ఞో భూత్వా విద్వాన్మోక్ష మార్థైక సాధనో బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్ గృహాద్వనీ భూత్వా ప్రవ్రజేత్॥**

సద్గురు సమీపమున సకల విద్యలను పరిశ్రమచే తెలుసుకొనియున్నవాడై, మోక్షమునకు ముఖ్యసాధనమగు బ్రహ్మచర్యమును సమాప్తిజేసి, గృహస్థాశ్రమ మును బొంది అట్టి గృహస్థాశ్రమములోనుండి వానప్రస్థమున ప్రవేశించి, తరువాత సంన్యసించుట క్రమసన్న్యాస మనంబడును ఈవానప్రస్థాశ్రమమున బ్రహ్మనిష్ఠార్హతయు, వైరాగ్యమున్ను గలిగియుండిన భార్య గూడ నుండవచ్చును అని స్మృతి తెలుపుచున్నది

**తవనస్థాశ్రమః ప్రోక్తస్తృతీయః పండితోత్తమైః ।**
**స భార్యో వా వ్యభార్యో వా తృతీయాశ్రమభాగ్భవేత్ ॥**

మూడవ ఆశ్రమమగు వానప్రస్థము తపస్సుకొఱకే యని బ్రహ్మనిష్ఠులచే చెప్పబడినది అత్తరి బ్రహ్మజిజ్ఞాస, విషయవిరక్తి గల భార్య తనతో గూడ నుండదలంచిన నుండవచ్చును భార్యలేకనుగూడ నుండవచ్చును

ఇక బ్రహ్మచర్యాది మూడుఆశ్రమములలో నేయాశ్రమములో

నున్నపుడైనను సంపూర్ణ వైరాగ్యము గలిగి బ్రహ్మజిజ్ఞాసా పరుడగుచో, అపుడు ఆ యాశ్రమమునుండియే తురీయాశ్రమమును పొందవచ్చును

**యది వేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేద్గృహాద్వా వనాద్వా.**

పై విధముగాక మరియొక మార్గము గలదు సంపూర్ణవిరక్తి బ్రహ్మచర్య మందుగాని, గృహస్థాశ్రమమందుగాని, వానప్రస్థాశ్రమమందుగాని యుండిన అచ్చోటినుండి సంన్యసింపవచ్చును

**యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేదితి.**

ఏ దినమునందు వైరాగ్యము జనించునో, ఆ దినమునందే సంన్యాసాశ్రమ మును గ్రహించవచ్చును అనగా ఆ దినమునుండియే ఆచార్యుని ప్రాపించి, సంన్యాసము స్వీకరింప వచ్చును

**సోపానవత్సరం ప్రాప్తుం భవిష్యత్యాశ్రమః క్రమః !**
**అత్యంతపక్వచిత్తస్య క్రమాపేక్షా న విద్యతే ॥**

ఆశ్రమ స్వీకరణము సోపానమువలె పరమపదప్రాప్తి కొఱకు నేర్పడినది. ఇది పిపీలికా న్యాయ మనంబడును పూర్వజన్మ విశేషముచేతగాని, లేక తపస్సు చేతగాని, హృదయము మిక్కిలి శుద్ధమైన వానికి నీ క్రమపద్ధతి నవలంబింప పనిలేదు ఇది విహంగన్యాయ మనంబడును

**తపసా దగ్ధపాపస్య పక్వచిత్తస్య యోగినః ।**
**చతుర్థ ఆశ్రమః కాలే స్వయమేవ భవిష్యతి ॥**

తపస్సుచేత సమస్త పాపములను దహించినవాడై పరిపక్వమైన మనస్సు గల యోగికి కాలము పరిపక్వ మగునపుడు తురీయాశ్రమము స్వయముగానే గలుగును. ఈ సంన్యాస మాత్మ సంన్యాసముచే గలుగవలసినదేగాని, దేహ సంన్యాసమువల్ల గలుగునది గాదు రాజు వేషము వేసినందుచే నేలాగున నొకడు రాజు (సార్వభౌముడు) గాజాలడో, ఆలాగున సంన్యాసవేషముచే మాత్రము ఎవడున్ను ముక్తిని పొందజాలడు

ఈ సంన్యాసము దేహ సన్న్యాసమనియు (అనగా బాహ్యసంన్యాస మనియు) ఆంతర సన్యాసమనియు, ఆత్మ సంన్న్యాసమనియు త్రివిధముగా ఉత్తరగీతయందు శ్రీకృష్ణ భగవాను డుపదేశించడమైనది బాహ్య సంన్యాస మనగా కేవలము సంన్యాస చిహ్నములను ధరించుట యగును ఆన్తర సంన్యాస మనగా త్యజించిన వస్తువులలో దేనియందును, మరల సంకల్పమైన గలుగక యుండుటయే ఆత్మసంన్యాస మనిన దేహేంద్రియాది బుద్ధి పర్యంతముగల అనాత్మ వస్తువులలో నే ఆత్మ భావము గలిగియుండెనో, అయ్యది లేకయుండుటయు, ఆత్మవస్తువై, ఆత్మవస్తువునందు పరమాత్మ భావము సదా గలిగియుండుటయే

సామాన్య వైరాగ్యము గలిగిగాని, లేక కారణాంతరముచే గాని బాహ్య సన్న్యాసమును సులభముగా జేసికొనవచ్చును. తపోధ్యానయోగాదులచే సర్వేంద్రియములు శుద్ధపడి ధ్యానబలముచేత ఏ సంకల్పము గలుగని నిస్సంకల్పస్థితియు పరిశ్రమచే కొంతకాలమునకు పొందవచ్చును. ఇదిన్ని సాధ్యమే యగును ఆత్మతోగల అనాత్మభావము మాత్రము పోవడము మహా ప్రయాసము అది బహుకాల ధ్యాన నిదిధ్యాసములచే మాత్రము దొలగును ఫలము పరిపక్వ కాలము వచ్చునపుడు చెట్లనుండి యెట్లు జారిపడునో, పరిపక్వమైన కొబ్బరి కాయలోగల జలము నశించునపుడెట్లు కురిడియై చిప్పనుండి వదలునో బాగుగా పండునపుడు చింతపండు ఏలాగున బెరడునుండి వేరుపడునో, కాలపరిపక్వత వచ్చునపుడు సర్పముయొక్క కుబుసము ఎట్లు స్వయముగా వదలిపోవునో, ఆలాగున చిరకాల బ్రహ్మచింతన వల్లనే అనాత్మ భావము తొలగును ఇది తొలగనిచో పొట్టుతో గూడిన వడ్లు మొదలగు ధాన్యములు ఎట్లు మొలకెత్తునో యాలాగున నిట్టి మనన శీలునకు గూడ పునర్జన్మము తప్పక గలుగును పొట్టుపోయిన తరువాత ఏ విత్తనమున్ను ఎట్లంకురింపదో, ఆలాగున ఆత్మకు గల అనాత్మయగు అజ్ఞానమను, ఆవరణము నశించిన మరల నట్టి జీవి జననమరణములను పొందడు



## ఉత్తరగీత చతుర్థాధ్యాయము.

**అంతస్సంగం బహిస్సంగ మాత్మసంగం పరిత్యజేత్ ।**
**సర్వసంగ నివృత్తాత్మా పశ్యేదాత్మాన మాత్మని ॥**

లోపలి సంబంధములను , బాహ్య సంబంధమును, మనస్సంబంధమును వదలివేయువలయును సకలవిధ బంధములను వదలినవాడై తన యందాత్మను చూడవలయును అనగా పరమాత్మకును తనకును భేదము లేదను స్థితి గలుగ వలయును.

మైత్రేయ్యుపనిషత్తునందు నుపదేశించినది జూడుడు

**యదా మనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు ।**
**తదైవ సన్న్యసేద్విద్వా నన్యథా పతితో భవేత్ ॥**

ఎపుడు సమస్త వస్తువులలోను వైరాగ్యము గలుగునో అపుడు విద్వాంసుడైన వాడు సన్న్యసింపవచ్చును అట్లు గానిచో తప్పక పతితు డగును

**కర్మత్యాగాన్న సన్న్యాసో న ప్రేషోచ్చారణేన తు ।**
**సంధౌ జీవాత్మనోరైక్యం సన్న్యాసః పరికీర్తితః ॥**

కర్మలను త్యజించుటవల్లగాని ప్రేషమంత్రోచ్చారణ పూర్వకముగా సన్న్యాసమును ధరించుటచేగాని సన్న్యాసి గాజాలడు జీవాత్మల ఐక్యమే (ఏకత్వావస్థయే) సన్న్యాసమని చెప్పబడును

**ద్రవ్యార్థమన్నవస్త్రార్థం యః ప్రతిష్ఠార్థమేవ వా ।**
**సన్న్యసేదుభయభ్రష్టః స ముక్తిం నాప్తు మర్హతి ॥**

ఎవడైతే ధనాభిలాషచేగాని, సన్న్యసించిన నన్న వస్త్రములు సులభముగా దొఱకుననిగాని, పూజ్యత గలుగునను భావముతో గాని సన్న్యసించునో యాతడు ఉభయభ్రష్టుడగును. అట్టివాడు ముక్తిని బొందజాలడు ఈ యుపనిషత్తు వాక్యము సన్న్యాసులందరు సదా జ్ఞాపకములో నుంచకొనదగినది

యధా కాష్ఠమయో హస్తీ యధా చర్మమయో మృగః ।
బ్రాహ్మణస్త్వనధీయా నస్త్రయస్తే నామధారకాః ॥ (మనుస్మృతి)

ఏలాగున కఱ్ఱతో జేయబడిన ఏనుగును, చర్మముతో జేయబడిన మృగమున్ను నామమాత్రమే యగునో, ఆలాగున అధ్యయనము, తపస్సు, లేని బ్రాహ్మణుడైనను, సంన్యాసియైనను పేరుకు మాత్రము బ్రాహ్మణుడని, సన్న్యాసియని, యందురేగాని ఫలము కొంచెమైనను బొందరు

యధా తండుల సంవర్కాన్నారికేళం వినశ్యతి ।
యధైవోదకసంవర్కాత్సమూలం మధు నశ్యతి ।
తధా శ్రవణజో బోధః కర్మయోగాద్వినశ్యతి ॥

ఏలాగున బియ్యముతో గూడిన కొబ్బరికాయ కుళ్ళిపోవునో, ఏలాగున జలము గలిసి తేనె చెడునో ఆలాగున వేదాంత శ్రవణముచే గలిగిన జ్ఞానబోధమున్ను కామ్యకర్మములగు విషయములతో గలిసిన నశించును ఇక నీ విషయమై విస్తరించి చెప్ప బూనలేదు ముముక్షువుల కింతే చాలునని తలంచి విరమించడమైనది



# ఆచారము

ప్రతివారున్ను వారివారి ఆశ్రమమునకు సంబంధించిన యాచరణవల్లనే పవిత్రులు గావలసియున్నారు అట్టి యాచరణయే యున్నత స్థితిని పొందుటకున్ను, నున్నత స్థితిని పొందినవారు పతనమును పొందక పోవుటకున్ను, జనులకు విశ్వాసము గలిగి ఆ సంఘములో జేరుటకున్ను, అందువల్లనే ఆ సంప్రదాయము వ్యాపకమగుటకున్ను కారణ మగుచున్నది మరియు విధిప్రకారము అనుష్ఠానమును జరుపుటకును, లోకాచార కర్మలనుండి విముక్తి గలుగుటకున్ను, నిర్భయముగా ధర్మమును లోకములో బోధించుటకున్ను నిస్సంగులై నిరపేక్షకులా, ప్రపంచములో సంచరించుటకున్ను మాత్రమే సంన్యాస మొకటి యేర్పడినదే

గాని, పై చెప్పిన కార్యములకు ఆటంకము కలుగనిచో సంన్యాసము అవసరము లేదు

అయితే గృహస్థాశ్రమములో నుండిన నెంత జ్ఞానియై యున్నప్పటికిన్ని వర్ణాశ్రమ ధర్మములను అవశ్యముగా పాలించుచుండవలయును. ఒకవేళ తనకు సంబంధము లేనప్పటికిన్ని తన దేహసంబంధుల గురించియైన తానున్ను అవలంబింపక పోయినచో, వారిగృహస్థాశ్రమ సంబంధ కులాచారములు జరుగవు దానికి భయపడియైన కులాచారమును తప్పనిసరిగా నంగీకరింప వలసియుండును పాశముతో కట్టబడిన పశువు ఏలాగున హద్దు దాటి పోవుటకున్ను, స్వేచ్ఛగా సంచరించుటకున్ను, విశాలవిశ్వములో విహరించుటకున్ను సాధ్యము గాదో, ఆలాగున గృహస్థాశ్రమములో నుండువాడు బ్రహ్మజ్ఞానియైనను కులాచారముల ననుసరింపవలసియున్నది

ఎంత బలము పరాక్రమము గల సింహమైనను, బోనులో పడిన నేలాగున నుండునో, ఆలాగున నెంత విజ్ఞానము గలిగిన వాడైనను గృహస్థాశ్రమమను హద్దులో నుండిన, నిర్భయముగా ధర్మబోధ చేయుటకు శక్తి గలిగి యుండడు సుందరమైన పంజరములో సుకుమారమైన ఆహారముతో, మనోహరమైన ప్రదేశములో నుంచబడిన పక్షియైనను, నేలాగున స్వేచ్ఛారహితమైన బంధనములో నుండవలసి యున్నదో, ఆలాగున గృహస్థాశ్రమములో నుండువాడు గూడ, నింద్రియ సౌఖ్యములు, సుందరభవనములు, హితమగు ఆహారములు గలిగి యుండినను పంజరములో గల పక్షివలెనే జీవించవలసి యుండును బోనులో బడని మృగరాజు ఏలాగున స్వేచ్ఛగా, గంభీర భావముతో అరణ్యములో సంచరింప గలుగునో, పంజరమునుండి బయటపడిన విహంగ మేలాగున నిష్టమైన వృక్షశాఖలో నుండి పావనమగు పవనము ననుభవింప గలుగునో, ఆలాగున గృహాది బంధనముల నుండి విముక్తుడైన జీవిగూడ ప్రశాంత ప్రసన్నజీవితమును గడుపగలుగును కావుననే సంన్యాసపద్ధతి ధర్మము ననుష్ఠించుటకున్ను, ధర్మమును లోకములో సంచరించి బోధించుటకున్ను ఏర్పడినదను తత్త్వమును గ్రహించియే, హిందూమతము నందేగాక బౌద్ధ, జైనాది మతస్థులున్ను, క్రైస్తవ

మహమ్మదాది మత ప్రవర్తకులున్ను ఈ సంన్యాస పద్ధతి నవలంబించుచున్నారు కావుననే అట్టి పుణ్యజీవులను, మతప్రబోధకులను, నిష్ఠాపరులను, ఆ యా మతస్థులు పవిత్రభావముతో నాదరించి, వారికి కావలసిన సహాయములు చేయుచున్నారు ఇక ఆచారమహిమను గురించి శాస్త్రములలో చెప్పబడిన కొన్ని ప్రమాణవాక్యములను నిరూపించెద

**ఆచారేణ నరో దేవి సుఖత్వముపజాయతే ।**
**అనాచారేణ పాపేన నాశం యాతి తథా ధ్రువమ్ ॥**

ఇది యీశ్వర వాక్యము, ఓ పార్వతీ! మనుజుడు సదాచారమువల్లనే ఇహపరసుఖములను పొందగలుగును అనాచారమగు పాపముచే నిశ్చయముగా నతడు నశించును ఆ సంఘముగూడ క్షయించును

**కృషికారో యథా దేవిచ్ఛన్నం బీజం సుసంస్థితమ్ ।**
**యాదృశం తు భవత్యేతత్తాదృశం ఫలమశ్నుతే ॥**

ఓ దేవీ! కృషికారుడు ఏ బీజమును భూమియందు నుంచుచున్నాడో, దాని ననుసరించిన ఫలము నేలాగున పొందుచున్నాడో, ఆలాగున మానవుని యొక్క ఆచరణ మంచిదిగాని, చెడ్డదిగాని అయియుండినచో దాని ననుసరించిన ఫలము నాతడు తప్పక పొందవలసి యుండును బీజమును పెట్టువారు సంన్యాసులైనను లేక గృహస్థులైనను, బ్రాహ్మణులైనను, లేక అబ్రాహ్మణులైనను, లేక పురుషులైనను, లేక స్త్రీలైనను, వారు వారు పెట్టిన బీజము ననుసరించిన ఫలము నేలాగున తప్పక పొందుదురో, ఆచరణయొక్క రహస్యమున్ను అట్టిదే

**ఉత్తమాం వృత్తిమాశ్రిత్య నీచవృత్తిం సమాశ్రితః ।**
**ఆరూఢపతితో జ్ఞేయః సర్వకర్మబహిష్కృతః ॥**

ఎవడైతే మిక్కిలి పావనమగు సన్న్యాసవృత్తి నవలంబించి నీచవృత్తి గలవాడగునో వానిని ఆరూఢపతితుడని తెలిసికొనదగినది. ఆరూఢపతితు డనగా నెత్తైన స్థానమును పొంది క్రిందకు జారి పడిపోయినవాడని అర్థము. అట్టి పతితుడు సమస్త పుణ్యకార్యముల నుండి బహిష్కరింపబడదగిన వాడు

ఫలం కతకవృక్షస్య యద్యప్యంబుప్రసాదకమ్ ।
న నామగ్రహణాదేవ తస్య వారి ప్రసీదతి॥

చిల్లగింజయొక్క పేరును చెప్పుటమాత్రముచే నేలాగున మలినజలము శుద్ధము గాజాలదో, ఆలాగున సన్న్యాసము గ్రహించుటచేతగాని, పేరుమార్చుట చేత గాని, ఆత్మ శుద్ధిని పొందజాలదు కతక రేణువు నందు మలిన జలమును శుద్ధపరచెడు శక్తి గలిగినప్పటికిన్ని నీటియందు దానిని అఱగదీయుట చేయనిచో నెట్లు శుద్ధము గాజాలదో వేషమున్ను పేరున్ను, మాత్రము గలిగి, తగిన అనుష్ఠానము లేనిచో అంతమాత్రమే గలుగును

అంతస్తిమిరనాశాయ శాబ్దబోధో నిరర్థకమ్ ।
న నశ్యతి తమో నామ కృతయా దీపవార్తయా ॥

రాత్రికాలమున గృహాన్తరాళములో గల చీకటి నశింపవలసియుండిన, దీపము వెలిగింపక, దీపముయొక్క పేర్లు ఎన్ని సార్లు ఉచ్చరించినను నేలాగున అంధకారము నశింపదో, ఆలాగున సంన్యాస వేషము వేయుటచేగాని, గొప్ప మహిమగల పేరులను పెట్టుకొనుటచేగాని, అంతరాత్మయందు చక్కని అనుష్ఠానము లేనిచో, హృదయాన్తరాళములో గల తమస్సు నశింపదు.

న శాస్త్ర మాత్రపాఠేన యోగసిద్ధిః ప్రజాయతే ।
న వేషధారణం సిద్ధేః కారణం న చ తత్కథా ॥

శాస్త్రపఠనము మాత్రముచే జ్ఞానసిద్ధి గలుగదు అలాగున వేషధారణము చేతనే జ్ఞానము సిద్ధింపదు. ఆలాగున మహిమాతిశయము గల పేర్లచేతను జ్ఞానము లభింపదు లేక, శాస్త్రము చదివి, యుపన్యాసము లిచ్చుటచేతను, గ్రంధకాలక్షేపము చేయుటచేతను దానికి తగిన ఆచరణ లేనిచో ఆత్మజ్ఞానము ప్రకాశింపదు

బ్రహ్మచారీ గృహస్థో వా వానప్రస్థోఽథ వా యతిః ।
యది హి స్యాత్స్వయతాత్మా న మానవః ముక్తిమాప్నుయాత్ ॥

బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, వానప్రస్థుడైనను, సంన్యాసియైనను, ఆత్మసంయమము గలిగి యుండిరేని తప్పక యిచ్చటనే జీవన్ముక్తిని పొందుదురు

**త్రిదండ ధారణం మౌనం జటాభారోఽథ ముండనమ్ ।**
**వల్కాలాజినసంవేష్టం వ్రతచర్యాభిషేచనమ్ ॥**
**సర్వాణ్యేతాని వై మిథ్యా యది భావో న నిర్మలః ॥**

త్రిదండధారణముగాని, మౌనముగాని, జటాధారణముగాని ముండనము గాని, వల్కలము(నారవస్త్రము)గాని, లేక కృష్ణాజినవ్యాఘ్రాజిన ధారణముగాని, ఏకాదశ్యాదివ్రతములుగాని, తీర్థయాత్ర మొదలగు పావన చిహ్నములుగాని గలవాడైనను, ఎవనియొక్క భావము నిర్మలమైనది గాదో అతనికి పై చెప్పిన అంగము లన్నియు వ్యర్థములే

**ముక్తిస్తు బ్రహ్మతత్త్వజ్ఞానా దేవాన్య న చాన్యథా ।**
**స్వప్రబోధం వినానైవ స్వస్వప్నోహీయతే కథమ్ ॥**

జీవన్ముక్తి బ్రహ్మతత్త్వజ్ఞాన మొక్కదానిచే మాత్రము గలుగునేగాని వేరువిధముగా గలుగదు స్వప్నావస్థలో నుండేవాడు జాగ్రదవస్థకు రానిచో, నేలాగున కలలు మిథ్యయను బోధము గలుగదో, ఆలాగున ఆత్మబోధము గలుగనిచో అజ్ఞానముచే గలిగెడు భ్రాంతులు స్వప్నములోవలె కలలు అను జ్ఞాన ముదయించదు

**నాస్తి శ్రద్ధానమం పుణ్యాం నాస్తి శ్రద్ధానమం సుఖమ్ ।**
**నాస్తి శ్రద్ధానమం తీర్థం నంసారే ప్రాణినాం నృప ॥**

ఓ రాజా! సంసారమందు ప్రాణికోట్లకు శ్రద్ధకు సమానమైన పుణ్యము లేదు శ్రద్ధకు సమమైన సుఖమున్ను లేదు శ్రద్ధకు సమానమైన తీర్థమును లేదు

**శ్రద్ధావినయ నంయుక్తః శాంతిదాన్త్యాది నంయుతః ।**
**యావత్ జ్ఞానోదయ స్తావద్వేదాన్తార్థం నిరూపయేత్ ॥**

శ్రద్ధా వినయములతో గూడినవాడును, శమదమాదులతో నుండువాడును,

నెంతవరకు ఆత్మజ్ఞానోదయము గలుగలేదో అంతవఱకు వేదాన్తార్థమగు బ్రహ్మమును పొందుటకు మనన నిదిధ్యాసములు చేయవలయును అంతవరకు బ్రహ్మవిచారమును మానరాదు

**ఇంద్రియేషు చ సర్వేషు వాగుపస్థౌ మహాబలౌ ।**
**ఆదౌ తయోర్జయే యత్నం కుర్యాద్యోగీ విశేషతః ॥**

ఇంద్రియము లన్నిటిలోను, జిహ్వేంద్రియమున్ను, గుహ్యేంద్రియమున్ను గొప్పబలము గలవి కావున యోగియైనవాడు ఈ రెండింద్రియములయొక్క జయముకొరకు విశేష ప్రయత్నమును చేయవలయును

**పృథివ్యాం యాన్తి భూతాని జిహ్వోపస్థ నిమిత్తకమ్ ।**
**జిహ్వోపస్థ పరిత్యాగే కో న ముచ్యేత బంధనాత్ ॥**

ప్రపంచములోగల సమస్తప్రాణికోట్లున్ను జిహ్వోపస్థల నిమిత్తము మాయలోబడి బంధనము నొందుచున్నవి ఈ జిహ్వేన్ద్రియ గుహ్యేంద్రియముల జయించినవాడు ఎవడు ముక్తుడు గాకుండును? పృథివ్యాం కిం ప్రయోజనమ్ అని పారాన్తరము అట్టివానికి లోకముతో నేమిసంబంధము? మనుష్యులేగాక, ప్రాణికోట్లే గాక, రాక్షసాసురులు, దేవతలతో సహా, యీ రెండింద్రియములచేతనే మాయయందు బద్ధులగుచున్నారు వాగింద్రియమున జ్ఞానేంద్రియమగు రసనేంద్రియమున్ను, కర్మేన్ద్రియమగు వాక్కున్ను గలదు ఆలాగున గుహ్యేన్ద్రియమందు విసర్జనమున్ను, మాయామోహ ఆనందమున్ను గలదు తక్కిన యింద్రియము లన్నిటిలోను ఒక్కొక్క వృత్తిమాత్రమే యున్నది ఈ రెండింటిలో నుండు అధికమగు ఒక్కొక్క దానిని త్యజించిన సర్వేంద్రియముల వలె సమత్వము గలుగును అప్పుడే సమరసజ్ఞానము బ్రహ్మనిష్ఠులకు సిద్ధించును

మరియు ఏ ద్వారమునుండి యీ జీవులన్నియు బుట్టుచున్నవో, ఆద్వారము ఎంతవరకు తెరువబడియుండునో అంతవరకు జీవులకు జననమరణములు తప్పవు ఎపు డాద్వారమును మూసి వేయుదురో, అట్టి జీవులకు మరల జనన మరణ రహితమగు స్థితి గలదా! లేదా! అను సంశయము గలవారు

దీనిని గురించి, చింతించిన స్వయముగా వారికే అర్థమగును ఈ రెండింద్రియములలో రసనేంద్రియమును జయించుట మరింత ప్రయాసము జిహ్వేంద్రియము యొక్క జయము గలుగనిచో, తక్కిన సర్వేంద్రియములను జయించినవాడై యున్నప్పటికిన్ని, ఇంద్రియ జయము గలవాడు గాజాలడు రసనేంద్రియ మొక్కటి జయించినచో, తక్కిన యింద్రియము లన్నిటిని జయించినవాడే యగునని శాస్త్రము

**తావజ్జితేన్ద్రియో న స్యాద్విజితాన్యేన్ద్రియః పుమాన్ ।**
**న జయేద్రసనం యావజ్జితం సర్వం జితే రసే ॥**

పురుషుడెంతవరకు రసనేంద్రియమును జయించలేదో అంతవరకు సర్వేంద్రియములను జయించినవాడైనను, ఇంద్రియజయము గలవాడు గాడు రసనేంద్రియ మొక్కటి జయించినచో, తక్కిన సర్వేంద్రియములను జయించిన వాడే యగును

**బహుజన్మకృతైః పుణ్యైర్వైరాగ్యం ఖలు జాయతే ।**
**వైరాగ్యేణ వినా జ్ఞానం కదాచిన్నైవజాయతే ॥**

జనులారా! సర్వవిషయములలో విరక్తి గలుగుట సామాన్యమైనది కాదు అనేక జన్మములలో జేసిన పుణ్యములయొక్క ప్రభావముచేతనే నిశ్చయముగా వైరాగ్యము గలుగును వైరాగ్యము వినా ఒకప్పుడున్ను ఆత్మజ్ఞాన సాక్షాత్కారము గలుగదు. ఇపుడు ఆచరణను గురించి చెప్పవలసిన ముఖ్య విషయము తెలుపడమైనది

**జపేచ్చ ప్రణవం నిత్యం జితాత్మా విజితేన్ద్రియః ।**
**పఠేద్యుపనిషద్వాక్యం వేదాన్తార్థాంశ్చ చిన్తయేత్ ॥**

సంన్యాసియైనవాడు మనస్సు మొదలుగాగల సర్వేంద్రియములను నిగ్రహించుకొని, నిత్యము అర్థసహితముగా ప్రణవము జపించవలెను ఆలాగున నుపనిషద్వాక్యమును పఠించుటయు, వేదాన్తార్థమగు బ్రహ్మమును చింతనమున్ను నిత్యము చేయవలయును

సర్వేషామేవ పాపానాం సంఘాతే సముపస్థితే ।
తారం ద్వాదశసాహస్రమభ్యసే చ్ఛేదనం హి తత్ ॥
యస్తు ద్వాదశ సాహస్రం ప్రణవం జపతేఽన్వహమ్ ॥

సమస్తములగు పాపములయొక్క సంఘాతముతో గూడుకొన్నప్పటికిన్ని ద్వాదశసహస్రము తారక మంత్రమగు ప్రణవమును పరమాత్మ భావముతో జపించినచో అదే ఆ పాపములన్నిటిని భస్మమొనర్చును ఏ బ్రహ్మనిష్ఠుడైతే ప్రతిదినమున్ను పండ్రెండువేలు ప్రణవమును బ్రహ్మభావముతో గూడి జపమొనర్చునో, అట్టివానికి సర్వదోషములు నశించి అచిరకాలములోనే బ్రహ్మసాక్షాత్కారము ప్రకాశించును "పరం బ్రహ్మ ప్రకాశతే" అని పాఠాంతరము

**ఓమ్ తత్ సత్, శాంతిశ్శాంతి శ్శాంతిః.**



# ఆత్మ పురాణము

## సప్తమాధ్యాయము.

ఈ యాత్మపురాణము శ్రీవిద్యారణ్య గురువరుని యాచార్యుండగు శంకరానంద మునీంద్రునిచే విరచితము ఇది 18 అధ్యాయములతో గూడినది ఇదివరలో ఆంధ్రానువాదము గలుగని మహోన్నతమగు అధ్యాత్మ శాస్త్రము దీనియందు బృహదారణ్యకోపనిషత్తునందుగల యాజ్ఞవల్క్య మైత్రేయీ సంవాదమునుగురించి చెప్పుచూ మైత్రేయికి గూడ సంన్యాసము నిచ్చునపుడు స్త్రీలకున్ను సంన్యాసాధికారము గలదని నిరూపించెడు భాగమును మాత్రము ఇచట తెలుపడమైనది విస్తారముగా చూడగోరువారు ఆత్మపురాణ సప్తమాధ్యాయమున జూడవచ్చును సంస్కృత శ్లోకమున్ను, సంస్కృత టీకయున్నుగల గ్రంథమొకటి గలదు హిందీ తాత్పర్యము మాత్రముగల మరియొక గ్రంథము గూడ నుంటున్నది సప్తమాధ్యాయమున

దేహేంద్రియైర్మనో యుక్తైర్భూతానామభయప్రదః ।
చచార వసుధాం కృత్స్నాం రవిచన్ద్ర విదేశితః ॥

శరీర వాఙ్మనస్సులచే సర్వప్రాణులకు అభయదానము నొసంగుచున్నవాడై, అమ్మునీశ్వరుడు సూర్య చంద్రులవలె రాగ ద్వేషాది రహితుడై భూలోకమునందు విచరించుచుండెను

యాజ్ఞవల్క్య యథా తద్వన్మైత్రేయ్యపి చచార హ ।
సంన్యాసలింగరహితా భువమాత్మ స్వరూపిణీ ॥

అట్లే బ్రహ్మవేత్తయగు మైత్రేయి కూడ సంన్యాసాశ్రమమును స్వీకరించి ఆత్మస్వరూపానుసంధాన పరాయణయై లోకమునందు సంచరించుచుండెను వారిద్దరికిన్ని విశేషమేమనగా మునీశ్వరుడు లింగసంన్యాసమును స్వీకరించెను మైత్రేయి అలింగ సంన్యాసమును స్వీకరించెను దండగ్రహణ సన్న్యాసమునకు లింగసంన్యాసమనియు, దండగ్రహణము లేక యొనర్చు సంన్యాసమునకు అలింగసన్న్యాసమనియు పేర్లు దీనిని విడిచి కాషాయ కమండలములతో గూడిన తక్కిన భిక్షాటనాది బాహ్య ధర్మములయందును, శమ దమాద్యంతర్ధర్మము లయందును ద్వివిధ సంన్యాసములును సమానములే దండమును ధరించెడు బ్రాహ్మణ సంన్యాసులకు గూడ దండమును త్యజించెడు కాలపరిమితి యొకటి కలదు. దండముండువఱకు కర్మము గలదు కాలపరిమితి అయిన తర్వాత విధిప్రకారము దండత్యాగమును జేసి దండరహితమైన కాషాయ కమండలములు గలది లింగ సంన్యాసమనియు, ఇవి లేనివై సర్వసంగ పరిత్యాగులై ఆత్మ సంన్యాసము గలవారిది అలింగ సంన్యాసుమనియు చెప్పబడును.

శిష్యుడు . - హే భగవన్! గురువర్యా! ఆ యాజ్ఞవల్క్యమునీశ్వరునివలె మైత్రేయి గూడ దండధారణమేల చేయ లేదు?

ద్విజోత్తమస్య లింగం స్యాచ్చతుర్థాశ్రమ వాసినః ।
వర్ణినామపి నాన్యేషాం కుత ఏతత్ స్త్రియో భవేత్ ॥

బ్రహ్మచర్యాదికం ధర్మం చతుర్థాశ్రమవాసినామ్ ।
యోషిదాద్యాశ్చ కుర్వంతు ఆశ్రమస్య విధారణమ్ ॥

గురువు -హేశిష్యా! దండగ్రహణ సంన్యాసమునకు బ్రాహ్మణు డొక్కడే యధికారి క్షత్రియ వైశ్యులకును, స్త్రీలకును నందు నధికారము లేదు పూర్వపుణ్య ప్రభావముచే నేయే క్షత్రియ వైశ్యులకును, త్రైవర్ణిక స్త్రీలకును, ఈ సంసారమందు ఉత్కట వైరాగ్య మేర్పడునో ఆ యా క్షత్రియ వైశ్యులు, స్త్రీలును అలింగ సంన్యాసమును స్వీకరించి, లింగ సంన్యాసులవలెనే అహింసా, బ్రహ్మచర్య సత్యాది సకల ధర్మములను సంపాదింపవలయును అహింసాది ధర్మములయందు సకలప్రాణులకును అధికారము గలదు

## అనుభూతి ప్రకాశము

ఈ గ్రంథముయొక్క పేరైన వినినవారు చాల అరుదుగానే యుందురు ఇది సంస్కృత మూలశ్లోకములను మాత్రము గలిగినది దీనికి సంస్కృత వ్యాఖ్యానము గాని, మరి యేభాషాంతరీకరణముగాని యిదివరకు ఉండలేదు సంస్కృతములో గల అనేక గ్రంథములకు హిందీ అనువాదము ఉన్నది ఈ అనుభూతి ప్రకాశము మూలముతో మాత్రముండుట చూచిన నీ గ్రంథము యొక్క కాఠిన్యము గోచరమగును దీనియందు 20 అధ్యాయములు గలవు 2805 శ్లోకములతో గూడినది ఇది యుపనిషత్తులలోగల వేదాంతముల సారముతో గూడినది దీనిని వ్రాసినవారు శ్రీవిద్యారణ్య గురువరుడు ఈలాటి లోకోన్నత గ్రంథముగూడ భాషాన్తరీకరణముగాక యుండుట నాలోచించిన నిప్పటికిన్ని బ్రహ్మవిద్యాగ్రస్థానమునకు లోకమెంత దూరముగా నుంటున్నదో విచారణీయము ఈ అనుభూతి ప్రకాశము సప్తదశాధ్యాయమున స్త్రీశూద్రులకు గూడ సంన్యాసాధికారము గలదని శ్రీ శంకర భగవత్పాదాచార్యు లంగీకరించినట్లు కనుపించుచున్నది ఆ శ్లోకముగూడ ప్రమాణముగా నిరూపింపబడుచున్నది అనుభూతి ప్రకాశమున సప్తదశాధ్యాయమున 163 శ్లో ॥

**విద్యాంగం తత్ఫలాత్మానం గార్గీవిదురయోరపి ।**
**స్త్రీశూద్రయో ర్భాష్యకారః సంన్యాస మనుమన్యతే ॥ (17-163)**

విద్యకంగమై, విద్యాఫలమైన సంన్యాసము స్త్రీ శూద్రులైన గార్గీ విదురులకు భాష్యకారు డంగీకరించెను అనగా బ్రహ్మజ్ఞానము కలుగకముందు, దానికై స్త్రీ శూద్రులు సంన్యసింప నర్హతలేదని వివిదిషా సంన్యాసమును నిషేధించి పూర్వ పుణ్యమువలన జ్ఞానముగలిగిన తరువాత స్త్రీ శూద్రులు విద్వత్సంన్యాసాశ్రమము నవలబింప నర్హులని సమ్మతించినాడని తాత్పర్యము భాష్యకారుడనగా శంకరభగవత్పాదులు

## బ్రహ్మ నిలయము

సంన్యాసాశ్రమమును గ్రహించువాడు తనయొక్క ఆత్మ పవిత్రతను మాత్రము చూచిన చాలదనియు, బ్రహ్మవేత్తలైన మహనీయులకు నే విధమగు అవమానము గలుగనీయక చూడవలయుననియు ఈ వాక్యము దెలుపుచున్నది అనగా తనయొక్క వర్తనమును చూచి మహనీయాత్ములగు వారు గూడ ఈలాగున నుందురని లోకము తలంచును కావున పూర్వులున్ను, ఆధునికులు నగు బ్రహ్మనిష్ఠులకు నే విధమైన చెడుమాటలు గలుగనీయక బహుజాగ్రత్తతో నుండవలయునని తాత్పర్యము

**అదూషయన్ సతాం మార్గం ధ్యానయుక్తో మహీం చరేత్ ।**
**శుచౌ దేశే సదా భిక్షుః స్వధర్మ మనుపాలయన్ ॥**

భిక్షువైనవాడు అనగా సంన్యాసియైనవాడు సత్పురుషుల మార్గమునకు నేలాటి దూషణమున్ను గలుగనీయక, సదా ధ్యానయుక్తుడై భూమియందు సంచరింపవలయును శుద్ధమైన ప్రదేశమందు మాత్రమే యెల్లపుడు నుండువాడై యతిధర్మమును లెస్సగా పాలించువాడై యుండవలయును “శుచౌ దేశే” అని విధించుటచే శుద్ధమైన యోగ్యమగు ప్రదేశమందు మాత్రమే యుండవలయును

**భైక్షాటనం చ మౌనిత్వం తపో ధ్యానం విశేషతః ।**
**సమ్యక్ జ్ఞానం చ వైరాగ్యం ధర్మోఽయం భిక్షుకే మతమ్ ॥**

భిక్షాటనము, మౌనము, తపస్సు, విశేషమైన ధ్యానము, నిజమైన జ్ఞానము, విషయవైరాగ్యమున్ను సంన్యాసియొక్క ధర్మమని వేదసమ్మతము

**పరమాత్మని యో రక్తో విరక్తోఽపరాత్మని ।**
**సర్వేషణ వినిర్ముక్త స్స భైక్ష్యం భోక్తుమర్హతి ॥**

పరమాత్మయందు నిరంతరము ఆసక్తిగల చిత్తము గలవాడై పరాత్మ కన్యమైన దేనిగుందును ఆసక్తి లేనివాడై సమస్తములైన యీషణాదులనుండి విముక్తుడై యుండు ఏ సంన్యాసి గలడో, అట్టి స్థితిలో నుండువాడు మాత్రమే భిక్షాటనమున కర్హుడు

**యస్మిన్‌శాంతి శ్శమశ్శౌచం సత్యం సంతోష ఆర్జవమ్ ।**
**అకించన్య మదంభశ్చ స కైవల్యాశ్రమే వసేత్ ॥**

ఎవనియందు ప్రకృతి రహితమైన ప్రశాంతియు, శమమనెడు అంతరింద్రియ నిగ్రహమున్ను, బాహ్యాభ్యంతర శుద్ధియు, సత్యమున్ను, ఎల్లపుడు సంతోషమును, ఋజుప్రవర్తనమును, విశాలభావమును, డాంబికము లేక యుండుటయును గలిగియుండునో వాడే కైవల్యాశ్రమమందు (బ్రహ్మనిలయమందు) నుండును

**అతీతాన్న స్మరేద్భోగాన్న తథా నాగతా నపి ।**
**ప్రాప్తాంశ్చ నాభినందేద్యః స కైవల్యాశ్రమే వసేత్ ॥**

ఎవడైతే యిదివరలో జరిగిపోయిన భోగములనున్ను స్మరింపడో, ఆలాగున రాబోయెడు భోగములగూర్చి తలంపడో, వర్తమానమందు ప్రాప్తమైన సుఖ దుఃఖములను గురించి హర్షించుటగాని, క్లేశము గలుగుటగాని గలిగియుండడో అట్టివాడు కైవల్యాశ్రమమందు (కైవల్య పదవియందు) నుండుట కర్హుడు

**అంతస్థానీంద్రియాణ్యంతర్బహిష్ఠాన్విషయాన్బహిః ।**
**శక్నోతి యస్సదా కర్తుం స కైవల్యాశ్రమే వసేత్ ॥**

ఎవడైతే అంతరింద్రియములను ఆంతరమందును, బాహ్యేంద్రియములను బాహ్యమందును, నిలుపుటకు సదా శక్తి గలిగి యుండునో, అట్టివాడు కైవల్యాశ్రమమందు (ముక్తిపదవియందు) నుండుట కర్హుడు అంతరింద్రియ నిగ్రహమగు శమమున్ను, బాహ్యేంద్రియ నిగ్రహమగు దమమున్ను ఎవడు గలిగియుండునో, లేక లోపల నుండెడు నింద్రియములను లోపలనే నిలుపుటయు, అనగా బాహ్యములోనికి రానివ్వకయు, బాహ్యములైన విషయములను లోపలికి అనగా మనస్సులోనికి రానివ్వక చేయగలుగునో, వాడే మోక్షస్థానమందు నుండుటకు తగినవాడు

ప్రాణే గతే యధా దేహః సుఖం దుఃఖం న విందతి ।
తధాచేత్ప్రాణయుక్తోఽపి న కైవల్యాశ్రమే వసేత్ ॥

ప్రాణరహితమైన దేహము ఏలాగున సుఖముచేగాని, దుఃఖముచేగాని, చలింపదో, ఆలాగున ప్రాణముతో గూడియున్నప్పుడు ఎవడైతే సుఖదుఃఖములనెడు ద్వంద్వములను పొందడో, వాడే కైవల్యాశ్రమమందు (బ్రహ్మపదమందు) నుండుటకు తగిన యోగ్యత గలవాడగును

ధృతిః క్షమాదమోఽస్తేయం శౌచమింద్రియనిగ్రహః ।
ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్ః ॥

ధర్మానుష్ఠానమందు ధైర్యమున్ను, క్షమయు, దమమున్ను, అస్తేయము (పరుల వస్తువును వారికి తెలియక గ్రహింపక యుండుటయు), బాహ్యాభ్యన్తర శుద్ధియు, ఇంద్రియనిగ్రహము, బ్రహ్మవిషయమును గ్రహించుటకు తగిన శుద్ధమైన బుద్ధియు, ఆత్మవిద్యయు, సత్యమున్ను, క్రోధరాహిత్యమున్ను - ఈ పదియున్ను ధర్మలక్షణ మగును

యస్య వాఙ్మనసీ శుద్ధే స్సమ్యగ్గుప్తే చ సర్వదా ।
స వై సర్వ మవాప్నోతి వేదాన్తోపగతం ఫలమ్ ।

ఎవనియొక్క వాక్కున్ను, మనస్సున్ను శుద్ధములై యుండునో అనగా మనస్సునందు తలంచినట్లు చెప్పుటయు, చెప్పినట్లు చేయునో, లెస్సగా నీ

రెండింద్రియములు (వాఙ్మనంబులు) ఎల్లపుడు నియమితములై యుండునో, వాడు వేదాన్తములో చెప్పబడిన సమస్తఫలమును పొందగలుగును అని నారదపరివ్రాజకోపనిషత్తు

**యధా చ మలినే వస్త్రే రంగశ్శుభతరో న హి ।**
**క్షాళనే హి కృతే శుద్ధే సర్వో రంగః ప్రసజ్జతే ॥**

ఏలాగున మలినమైన వస్త్రమందు రంగు శుద్ధముగా అంటుకొనదో, లేక ప్రకాశింపదో, దానిని శుద్ధముగా నుతకగా సర్వవిధములగు రంగులున్ను ఎట్లు పట్టుకొనునో, ఆలాగున అంతఃకరణములోగల మాలిన్యము నశించు పర్యంతము మనస్సునందు బ్రహ్మభావము స్థిరముగా నిలువజాలదు

**మలినో హి యధాఽఽదర్శో రూపాలోకస్య న క్షమః ।**
**తధాఽవిపక్వకరణ ఆత్మజ్ఞానస్య న క్షమః ॥**

మలినమైన అద్దమందు తనయొక్క స్వరూపము ఏలాగున శుద్ధముగా ప్రతిఫలించదో, చూచుటకున్ను సాధ్యపడదో, ఆలాగున పరిపక్వాన్తఃకరణము లేని హృదయమందు గూడ ఆత్మను దర్శించుటకు శక్తి గలుగదు

ఇపుడు శివానందలహరియందు శ్రీశంకర భగవత్పాదులు తెలిపిన రెండు శ్లోకములు అందరున్ను మిక్కిలి జాగరూకతతో గ్రహించదగినవి. సదా పఠనము చేయదగినవి

**వటుర్వా గేహీ వా యతిరపి జటీ వా తదితరో**
**నరో వా యః కశ్చిద్భవతు భవ కిం తేన భవతి ।**
**యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే**
**తదీయస్త్వం శంభో భవసి భవభారం చ వహసి ॥**

మానవుడు బ్రహ్మచారియైనను, గృహస్థుడైనను, సంన్యాసియైనను, జటాధారియగు వానప్రస్థుడైనను, మరియిక నెట్టివాడైనను కానిమ్ము అందుచేత ఓ సర్వేశ్వరా! ఏమి యగును, సకల భూతనాయకా! యెవని సంబంధమైన హృదయకమలము నీయందర్పితమై నీయధీన మైనదిగా నుండునో, వాని

సంబంధుడుగా నీవు అగుదువు ఓ శంకరా! వాని సంసార భారమంతయు నీవే భరింతువు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ సంన్యాసులలో నెవరైనను, అట్టి యాశ్రమములో దేనియందును చేరనివాడై యుండినను స్త్రీయైనను, ఎవరియొక్క మనస్సు పరమేశ్వరునియందు సంలగ్నమై యుండునో అట్టివారి సర్వభారము లున్ను ఆ దయామయుండగు సర్వేశ్వరుండు భరించి మోక్షమును గూడ గలుగజేయును

**గుహాయాం గేహే వా బహిరపి వనే వాఽద్రిశిఖరే**
**జలే వా వహ్నౌ వా వసతు వసతేః కిం వద ఫలమ్ ।**
**సదా యస్యైవాతః కరణమపి శంభో తవ పదే**
**స్థితం చేద్యోగోఽసౌ న చ పరమయోగీ స చ సుఖీ ॥**

కొండగుహయందో, స్వగృహమందో, బయట నెచ్చటనో, అరణ్యమునందో, పర్వతశిఖరమునందో, జలమునందో, పంచాగ్ని మధ్యమందో, నివసించుగాక! ఓ ఈశ్వరా! అట్లు నివసించిన మాత్రమున నేమి ఫలమో చెప్పుము అట్టి స్థలములో నుండు మాత్రముచే ఫలమేమియు లేదనుట ఎవనియొక్క మనస్సు ఎల్లపుడున్ను నీయొక్క పాదమునందే నిలిచియుండునో అట్లు నిలుచుటయే యోగము అట్టివాడే నిర్వికల్ప సమాధిగల పరమయోగియు, పరమానందము గలవాడును అగును. ఇట్లు చెప్పుటచే స్థానములు గొప్పవి కావనియు, మనస్సు పరమేశ్వరా యత్తముగా గలిగియుండిన, ఎవడైనను, ఎచ్చోటనైనను నుండినప్పటికిన్ని ముక్తి గలుగుటలో నేలాటి సందేహము లేదనియు తెలుపడమైనది. మఱియు దైవభక్తి సంపూర్ణముగా మొదటనే గలిగి యుండవలయుననియు, అట్లైన మాత్రమే సకల విఘ్నములున్ను నశించుననియు, అట్టివాని సమస్త భారములున్ను సర్వేశ్వరుండే వహించుననియు, మోక్షమును గలుగజేయుననియు నిరూపించడమైనది ఇందువల్ల సంన్యాసమే కావలయుననిగాని, వనములో నివసింపవలయు ననునదిగాని అవసరము లేదనియు, ప్రతికూల ముండిన మాత్రమే యత్యాశ్రమ మున్ను, ఏకాంతవాసమున్ను గావలసియున్నదని యిదివరలో నిరూపించిన శాస్త్ర ప్రమాణములచేతను, యుక్తులచేతను, అనుభవముచేతను తెలుపడమైనది

**బ్రహ్మ రాజన్యాభ్యాం శూద్రాయ చార్యా చ స్వాయ చారణాయ.**

ఈ వేదవాణి బ్రాహ్మణులకువలెనే క్షత్రియులకు, క్షత్రియుల కెట్లో అట్లు వైశ్యులకు, శూద్రులకు, తమ తమ పుత్రులకు, భృత్యులకు, అతిశూద్రులకు సయితము సమానముగా వర్తించును అని యజుర్వేదము

# పుణ్యము

ఎంతో మహత్తరమగు పుణ్యవిశేషమువల్లనే అంతఃకరణములోగల పాపము నశించి జీవులకు విషయవిరక్తి గలుగును పిమ్మట సర్వేశ్వరుని యందనన్య భక్తియు, దానివల్ల నాత్మజ్ఞానమున్ను, తరువాత సర్వసంగ పరిత్యాగమగు సంన్యాసమున్ను గలుగును ఈ విషయమై శ్రుతి స్మృతులు చెప్పిన కొన్ని వాక్యములు ఈ క్రింద నిరూపించడమైనది అట్టి మహాత్ముని గనిన తల్లియున్ను, తండ్రియున్ను ఎంతో పుణ్యజీవులై యుందురు అట్టి మాతా పితరులు గూడ నుత్తమ గతిని పొందగలరు

**జంతూనాం నరజన్మ దుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా**
**తస్మాద్వైదిక ధర్మమార్గపరతా విద్వత్త్వమస్మాత్పరమ్ ।**
**ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితిః**
**ముక్తిర్నో శతకోటిజన్మసుకృతైః పుణ్యైర్వినా లభ్యతే ॥**

ప్రాణికోట్లలో నరజన్మము మిక్కిలి దుర్లభమైనది అట్టి నరజన్మము లభించినను పురుషజన్మము మరింత పుణ్యవిశేషముచేతనే గలుగును దానిలో విప్రత్వము గలిగినను సత్యధర్మానుష్ఠానములు గలుగుట మరింత దుర్లభము దాని కంటెను విద్యా వినయత్వము గలుగుట మరింత దుర్లభము ఆత్మానాత్మ వివేచన జ్ఞానము గలుగుట మరింత దుర్లభము దానికంటెను బ్రహ్మాత్మానుభవ సిద్ధి గలుగుట మిక్కిలి దుర్లభము సమస్త సంసార బంధనములనుండి విముక్తి గలిగి, జీవన్ముక్తుడై సంన్యాసి యగుట నూరుకోట్ల జన్మలయం దార్జింపబడిన పుణ్య విశేషము వల్ల లభ్యమగునేగాని, మరి యేమార్గము చేతను గలుగునదిగాదు

అని శ్రీశంకర భగవత్పాదులు వివేక చూడామణియం దుపదేశించిరి

**కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వంభరా పుణ్యవతీ చ తేన ।**
**అపారసచ్చిత్సుఖసాగరేఽస్మిన్ లీనం పరే బ్రహ్మణి యస్య చేతః॥**

ఎవనియొక్క మనస్సు అఖండమగు సచ్చిదానంద పరబ్రహ్మమందు లీనమగుచున్నదో, అట్టివాడు జన్మించిన వంశము పావనమగును కన్నతల్లిగూడ కృతార్థురాలగును తండ్రియున్ను ధన్యుడగును అట్టి మహాత్ముని కనిన దేశమున్ను పావనమగును అని సూతసంహిత

**ధన్యా మాతా పితా ధన్యో గోత్రం ధన్యం కులోద్భవః ।**
**ధన్యా చ వసుధా దేవీ యత్ర స్యాద్గురుభక్తతా ॥**

మహాత్ముండు ఏ కులములో జన్మించి సన్న్యసించునో ఆ పుణ్యాత్ముని కన్నతల్లి పుణ్యాత్మురాలగును తండ్రియొక్క జన్మమున్ను ధన్యమగును అతడు జన్మించిన గోత్రమున్ను పుణ్యవంతమగును, అతడు జన్మించిన దేశమున్ను ధన్యత్వము నొందును

**షష్టిం కులాన్యతీతాని షష్టిమాగామికాని చ ।**
**కులాన్యుద్ధరతే ప్రాజ్ఞః సంన్యస్తమితి యో వదేత్ ॥**

ఎవడైతే నేను సంన్యసించితిని అని వచించునో, అనగా సంన్యాసియగునో, అతడు జన్మించిన వంశములో గల 60 తరముల పితరులున్ను, ఇక రాబోయెడు 60 తరముల పితరులున్ను ప్రేత లోకమునుండి యుద్ధరింపబడి పుణ్యలోకమును బొందుదురు అట్టి ప్రాజ్ఞుడు తన వంశము నుద్ధరించిన వాడగును

**నృత్యంతి పితరః సర్వే సంతుష్టాస్తస్య వంశజాః ।**
**దేవాశ్చ ఋషయస్తృప్తాః ప్రయాంతి పరమం పదమ్ ॥**

నిజమైన జ్ఞానము గలిగి యెవడు సంన్యసించునో అట్టి వాని వంశములో గల పితృ దేవతలందరు నానందభరితులై, నృత్యము చేయుచూ ప్రేతలోకమునుండి విముక్తి గలిగి స్వర్గలోకమునకు వెళ్ళుదురు అట్టి పుణ్యాత్ముని

జన్మమువల్ల దేవతలు ఆనందింతురు, ఋషులు సంతుష్టిగల వారగుదురు ఆ వంశములో జన్మించిన వారందరున్ను సద్గతిని పొందుదురు.

**యస్య గేహం సముద్దిశ్య జ్ఞానీ గచ్ఛతి సువ్రత ।**
**తస్య క్రీడంతి పితరో యాస్యామః పరమాం గతిమ్ ॥**

బ్రహ్మనిష్ఠుడగు జ్ఞాని యెవని యొక్క గృహావరణములో నడుగు పెట్టునో, అట్టి గృహస్థుని యొక్క వంశములో పుట్టిన పితృదేవతలందరు పుణ్యలోకమును పొందుదురు

**కుక్షౌ తిష్ఠతి యస్యాన్నం యోగాభ్యాసేన జీర్యతే ।**
**కులాంస్తారయతే తేషాం దశ పూర్వాన్దశాపరాన్ ॥**

పరమాత్మ ధ్యానము చేయువారి హృదయము నందుంచబడిన అన్నము, ధ్యానమనెడు జఠరాగ్నిచే జీర్ణమైనచో, దానివల్ల గలిగెడు ఫలము, ఆ అన్నము పెట్టినవారి పదితరముల మృతినొందిన వారిని, రాబోవు పదితరములలో మృతినొందు వారినిగూడ నుద్ధరించును అని ఉత్తరగీత "యోగాభ్యాసేన జీర్యతే" అని చెప్పుటచే కామాగ్నిచేగాని, వ్యవహారాగ్నిచేతగాని, వ్యర్థాగ్నిచేగాని గాక పరబ్రహ్మజ్ఞాన మనెడు జఠరాగ్నిచే జీర్ణము చేయువారికి పెట్టిన మాత్రమే అట్టి ఫలము గలుగును

**యతిర్యస్య గృహే భుఙ్క్తే తస్య భుఙ్క్తే హరిః స్వయమ్ ।**

ఎవనియొక్క యింటిలో యతి భిక్ష చేయునో వానియొక్క యింటిలో సాక్షాద్విష్ణువు భుజించి నట్లగును

**యతిహస్తే జలం దద్యాద్భైక్ష్యం దద్యాత్పునః పునః ।**
**తద్భైక్షం మేరుణా తుల్యం తజ్జలం సాగరోపమమ్ ॥**

యతిహస్తమందు భోజన సమయమున నిచ్చు ఆపోశనపు జలము సముద్రమువలె పెరుగును ఆలాగున యతికి పెట్టెడు భిక్షాన్నము గూడ మహా మేరు పర్వతమువలె పెరుగును మరల పుణ్యము వృద్ధియగునే గాని క్షయించదు

ప్రియేషు స్వేషు సుకృతమప్రియేషు చ దుష్కృతమ్ ।
విసృజ్య ధ్యానయోగేన బ్రహ్మాభ్యేతి సనాతనమ్ ॥

బ్రహ్మనిష్ఠుడగు యతివరుని నెవరు ప్రేమింతురో సుకృతమంతయు వారికి చెందును ఎవరు ద్వేషింతురో ఆ మహాత్ముని యందెపుడైన నేదైన పాపము గలిగియుండిన అది ఆ ద్వేషించిన వారికి వెళ్ళును అప్పుడు బ్రహ్మనిష్ఠుడు ధ్యానయోగ బలముచే పుణ్యాపాపముల రెండిటి నుండి విముక్తుడై పరబ్రహ్మమును పొందును

ముహూర్తమపి యోగచ్ఛేన్నాసాగ్రే మనసా సహ ।
సర్వం తరతి పాప్మానం తస్య జన్మశతార్జితమ్ ।

ఎవడైతే క్షణము సేపైనను నాసాగ్రమగు తురీయమందు మనస్సును నిలిపి, ధ్యానము చేయగలుగునో, అట్టివానియొక్క వందలకొలది జన్మములలో చేయబడిన పాపము లన్నియు నశించినవాడై బ్రహ్మమును పొందగలుగును

అత్యల్పోఽపి యథాఽదీపస్సుమహాన్నాశయేత్తమః ।
జ్ఞానాభ్యాసస్తథాల్పోఽపి మహత్పాపం వ్యపోహతి ॥

గృహాన్తరాళములో నిబిడమై యుండు గొప్పదగు చీకటిని చిన్నదగు దీపమేలాగున నశింపజేయునో, ఆలాగున బ్రహ్మజ్ఞానాభ్యాసము కొంచెమైనను చేయుచుండిన గొప్పదగు పాపమును నశింపజేయును

యథా వహ్నిర్మహాదీప్తశ్శుష్కమార్ద్రం చ నిర్దహేత్ ।
తథాశుభాశుభం కర్మజ్ఞానాగ్నిర్దహతి క్షణాత్ ॥

ఏలాగున బాగుగా మండుచుండెడి యగ్ని ఎండినదిన్ని, ఎండనిదిన్ని అగు కట్టెలను భస్మ మొనర్చునో, ఆలాగున పుణ్యాపాపములనెడు కర్మములను జ్ఞానాగ్ని భస్మ మొనర్చి ముక్తిని గలుగజేయును అని సూతసంహిత

సర్వేషా మేవ పాపానాం సంఘాతే సముపస్థితే ।
తారం ద్వాదశసాహస్రమభ్యసేచ్ఛేదనం హి తత్ ॥

సమస్తములైన పాపములయొక్క సంఘాతము గలిగి యున్నప్పటికిన్ని ఎవడైతే ద్వాదశసహస్రము ప్రణవమును జపించునో అట్టివాని ఆపాపము లన్నియు ఛేదింపబడును

## ఋషిత్వము

బ్రహ్మాండపురాణమునందు ఋషిత్వమును బొందిన కొందరి స్త్రీల పేర్లు నిరూపించడమైనది అనగా పురుషఋషులవలె స్త్రీలు గూడ ఋషిత్వమును పొందియుండిరి వారి పేర్లు క్రింద నిరూపించబడుచున్నవి

**చేతనాచేతనాన్యత్వ విజ్ఞానం జ్ఞానముచ్యతే ।**
**ప్రత్యంగానాం తు ధర్మస్య త్విత్యేతల్లక్షణం స్మృతమ్ ॥**

అచేతనరూపమై ప్రపంచవికారమున అవ్యక్తములైన ఏ విశేషములు గలవో, వాటిని తెలిసికొని, చేతనాచేతనములకు భేదమును తెలిసికొనుటయే జ్ఞాన మనంబడును ఇట్లు ధర్మముయొక్క ప్రత్యఙ్గముల లక్షణము చెప్పబడినది

**వివృత్తిసమకాలం తు బుద్ధ్యా వ్యక్తమృషిః స్వయమ్ ।**
**పరం హ్యర్షయతే యస్మాత్పరమర్షిత్వమస్య తత్ ॥**

నివృత్తి సమకాలమునందే ఋషి, (భూతములనుండి చెదిరిన కాలము) స్వబుద్ధిచేత స్వయముగనే అవ్యక్త (పరమాత్మ) రూపమును సమీపించి, మిక్కిలి హర్షమును పొందుచున్నాడు అందువలననే అతడు పరమర్షి యనబడును

**గత్యర్థాదృషతేర్ధాతో ర్నామనిర్వృత్తిరాదితః ।**
**యస్మాదేవ స్వయం భూత స్తస్మాచ్చాప్యృషితా స్మృతా ॥**

గత్యర్థకమైన ఋషధాతువునకు వికృతి యగుటచే, స్వయముగనే పుట్టుటచేతను ఋషియని చెప్పబడును

**అదితిర్దేవ మాతాచ జలాపా చైవ మానవీ ।**
**ఊర్వశీ విశ్వయోషా చ హ్యప్సరఃప్రవరే శుభే ।**

ముద్గలా చాతుజీవైవ తారా చైవ యశస్వినీ ।
లోపాముద్రా చ ధర్మజ్ఞా యా చ కోశీతికా స్మృతా ॥

ఏతాశ్చ బ్రహ్మవాదిన్య అప్సరో రూపసమ్మతాః ॥
ఇత్యేతా ముఖ్యశః ప్రోక్తా మయా చ ఋషిపుత్రకాః ॥

దేవమాతయైన అదితియు, మనుపత్నియైన జలాపయు, ఊర్వశి, విశ్వయోష యను అప్సరస్త్రీలును, ముద్గల, చాతుజీవ, యశ్వసినియైన తార, ప్రాతిమేఘ, మార్గ, సుజాత, మహాతప, ధర్మజ్ఞురాలైన లోపాముద్ర, కోశీతిక - వీరందురు బ్రహ్మవాదినులు. ఓ ఋషిపుత్రులారా! వీరు అప్సరసలవంటి రూపము గలవారుగా చెప్పబడిరి

వేదశాఖాప్రణయనా త్తత స్తే ఋషయః స్మృతాః ।
ఈశ్వరా మంత్రవక్తార ఋషయో ఋషికా స్మృతాః ॥

వారు వేద శాఖలను నిర్మించుటచే ఋషులనియు, ఈశ్వరులనియు, (అణిమాద్యష్టైశ్వర్యములు గలవారు) మంత్ర వక్తలనియు, ఋషికలనియు చెప్పబడిరి.

ఊర్వశి అను పేరుగల ఒకరు స్వర్గలోకమందు రంభాదుల సదృశ గుణము గలవారు గలరు ఇచట చెప్పిన యూర్వశి ఋషిత్వము నొందిన బ్రహ్మజ్ఞురాలని గ్రహించదగినది.



# ఆశయము

వర్తమాన కాలమున శ్రీకాశియందు విఖ్యాతి గాంచిన పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ స్వామి శంకరచైతన్య భారతీజీగారి నడుగగా వారిచ్చిన విషయము ఈ క్రింద ముద్రితము, వీరు శాస్త్రమందు అపార పాండిత్యము గలవారును, యతీశ్వరులును, శ్రీకాశీలో నుండువారును అగుటచే వీరి యాశయ మొకటిమాత్రమే చాలునని తలంచడమైనది

వారిచ్చిన సమాధానము

స్త్రీలకు శమదమాది సుగుణములు గలిగియుండినచో సంన్యాసమున కర్హత గలదను పక్షము శాస్త్రమందచటచట కాననగుచునే యున్నది కేవల బ్రాహ్మణ పక్షపాతులు కొందరు సంన్యాసాధికారము బ్రాహ్మణుల కగాని తదితరులకు లేదందురు వారికంటె కొంత సహృదయత గలవారు దండవిశిష్ట సంన్యాసము బ్రాహ్మణులకున్ను, తద్రహితమై కాషాయ కమండలువులతో గూడినది యితరులకున్ను నంగీకరించుచున్నారు

దండవిశిష్ట సంన్యాసము లింగమనియు, దండము లేక కాషాయ, కమండలువులు గలది అలింగమనియు, మఱియు దండ కమండలములు కాషాయ విశిష్టమైనదే లింగమనియు, తద్రహితమై కేవల సర్వసంగ పరిత్యాగియై, తీవ్రవైరాగ్యము గలిగియుండుట అలింగమనియు, శాస్త్రములలో నచటచట కనిపించుచున్నది (లింగమనగా చిహ్నమనియు, అలింగమనగా అట్టి చిహ్నము లేనిదనియు గ్రహించదగినది). పై చెప్పినవన్నియు వారివారి బుద్ధి ననుసరించి వ్రాసిరి కాన నీ విషయమై యెవరున్ను, ఇదమిత్థమని నిర్ణయింప వీలులేదు వ్యక్తిగతముగ మాత్రము వారి వారి యభిప్రాయమును వ్యక్తపరుప వీలగును

ఇపుడందరు సంన్యాసమును తీసికొనుచున్నారు వీరిలో నూటి కొకరైన యధార్థమగు సంన్యాస ధర్మము గలవారు లభించుట దుర్లభము కావున ప్రస్తుత కాలపరిస్థితి ననుసరించి యీ పై పక్షముల నాధారముగ దీసికొని, సంన్యాసమునకు ఒకరికి నధికారము గలదు, వేరొకరికి లేదు, అని సప్రమాణముగ నిరూపించుటకు సాధ్యము గాదు

ఎవరికి తీవ్రవైరాగ్యము గలుగునో వారి నీశ్వరుడు నిరోధించినను నిలువరు. వారు ఎటులేని సంన్యాసమును తీసికొనియే తీరెదరు అట్టివారు తీసికొన్నను సార్థకు లగుదురు లోకమునకు దానివల్ల క్షేమమే గలుగును కాన అట్టి అకుంఠిత వైరాగ్యశీలురే సంన్యాసమున కర్హులనిరి

మఱియు సంన్యాసులకు దండాది పరిత్యాగముతో బాటు వస్త్ర

పరిత్యాగమున్ను చెప్పబడినది. కేవలనగ్నరూపులయ్యే సంచరింపవలయునని యున్నది. "జాతరూపధర్మ" (పుట్టినప్పటి రూపమును ధరించిన వాడై) అని యీ విషయము జాబాల్యుపనిషత్తున గలదు. అయినను కాలపరిస్థితి ననుసరించి అయ్యది యుచితము గాదు తన కభిమానము లేకున్నను, తనను జూచి యితరులు లజ్జచెందుదురు గదా! కాన మానసంరక్షణకై స్వల్పవస్త్ర ధారణ మవసరము సర్వదా దేశకాల పరిస్థితి ననుసరించుట ముఖ్యము

శాస్త్రము మాత్రము స్త్రీలకు సంన్యాసాధికారమును నిషేధించుట లేదు దీనికి ప్రమాణం "యదహరేవ విరజేత్తదహరేవ ప్రజేత్" అని యుండుటచే అనగా నే దినమునందు సమస్తవిషయములనుండి విరక్తిగలుగునో, యా దినమునందే సంన్యసింపవచ్చును " అని శ్రుతి వచనము గలదు ఇచట వ్యక్తి విశేషముగాని, లింగవిశేషముగాని, నిర్దేశింపబడలేదు కాన తీవ్రవైరాగ్యముగల వ్యక్తి యెవరైనను సరే, సంన్యాసమున కధికారులే దీనివలన స్త్రీలకును అధికారము గలదని స్పష్టమగు చున్నది శాస్త్రమునందెచటేని "లింగవిశేషము గాని, వ్యక్తి విశేషముగాని, వివక్షితమైనచో, వాటిని తప్పక నిర్దేశించును.

ఎటులన మీమాంసా శాస్త్రమున "రాజా రాజసూయేన యజేత" అని ఒక వాక్యము గలదు " స్వర్గాభిలాషియగు రాజు రాజసూయ యాగమును జేయవలయునని తాత్పర్యము ఇచట రాజసూయ యాగమునకు క్షత్రియత్వవిశిష్ట రాజే అర్హుడు. కాన "రాజా" అని వ్యక్తి విశేషము నిర్దేశింపబడెను. ఇటులే "వర్షాసు రథకారో అగ్నీనాదధీత" అని యిచటను జాతి వివక్షితమైనందున "రథకారః" అని నిర్దేశింపబడెను అటులనే "యదహరేవ" అన్న చోటుననున్ను, వ్యక్తిగాని, లింగవిశేషముగాని, వివక్షితమైన యెడల తప్పక నిర్దేశించియే యుండును అటుల లేదు గాన, సర్వులకున్ను సంన్యాసము నందధికారము గలదని తెలియుచున్నది.

మఱియు పాణిని సూత్రములయందు (కౌముదిలో) "కుమారః శ్రమణాదిభిః" అని సూత్రము గలదు "కుమారశబ్దము శ్రమణాది శబ్దములతో సమాసమును బొందును" అని దీని కర్థము. దీని కుదాహరణముగా 'కుమారీ - శ్రమణా, కుమార శ్రమణా' అను రూపము నిచ్చెను ఇచట 'కుమారః - శ్రమణః

కుమారశ్రమణః' అని పుంలిఙ్గోదాహరణము నీయ.క. స్త్రీలింగరూపమునే నిర్దేశించినందున, పూర్వము స్త్రీలలో గూడ "సన్యాసినులు" గలరనియే తేలుచున్నది అటుల లేనిచో నిట్టి అనర్థోదాహరణమును పాణిని మహర్షి యిచ్చి యుండడు. (అనగా శ్రమణా అంటె సంన్యాసిని) కావున నిందువలన గూడ సంన్యాసమునకు స్త్రీలు అర్హులనియే తేలుచున్నది పూర్వము సంన్యాసిను లున్నటుల శాస్త్రముల లోను, ఉపనిషదాదుల లోను కాననగుచునే యున్నది కాన శాస్త్రదృష్టితో మాత్రము స్త్రీలకు సంన్యాసాధికార మెచటను నిషేధింపబడలేదు అయితే స్త్రీలు సంన్యాసమును దీసికొన్నచో వారికి సంన్యాసులతో సంబంధము అధికము గావచ్చును ఇరువురు నొకేచోట నున్నచో నుభయుల బ్రహ్మచర్యమునకును భంగము గలుగవచ్చును ఇది యొకటి మాత్రము నాయొక్క వ్యక్తిగతాభిప్రాయమే గాని శాస్త్రదృష్టితో చెప్పినది గాదు

స్త్రీలలో గూడ తీవ్రతర వైరాగ్యముగల వారెవ్వరేని ఉన్నచో, అట్టివారు మాత్రము, సంన్యాసమును గ్రహించి ఏకాంతముగా నిర్జన ప్రదేశమున కుటీరమును నిర్మించుకొని భిక్షావృత్తితో నైనను నుండుటకు మాత్రము ఏలాటి ఆటంకము లేదు

మఱియు దండ, కాషాయ, చిహ్నములు లేక, కేవల సర్వసంగ పరిత్యాగియై, గార్హస్థ్యమున నుండినను, సంన్యాసిగనే పరిగణింపబడును. దీనికి నీ విషయమై "జనకుని" ఉదాహరణముగా నిచ్చెదరు శ్రీ విద్యారణస్వాములవారు "జీవన్ముక్తిప్రకాశిక" అను గ్రంథమున దీనిని స్పష్టముగ నిరూపించిరి



# శిష్టాచార లక్షణము

(బ్రహ్మాండ పురాణమునుండి)

**దానం సత్యం తపో జ్ఞానం విద్యేజ్యా వ్రజనం దయా ।**
**అష్టౌ తాని చరిత్రాణి శిష్టాచారస్య లక్షణమ్ ॥** 1

దానము, సత్యము, తపస్సు, జ్ఞానము, విద్య, యాగము, సంన్యాసము, (విరక్తి) దయ - ఈ యెనిమిదియును శిష్టాచారమునకు లక్షణముగా వచించిరి

**దృష్ట్వా తు భూతమర్థం యః వృష్టో వై న నిగూహతి ।**
**యథాభూతప్రవాదస్తు ఇత్యేతత్సత్యలక్షణమ్ ॥ 2**

జరిగిన విషయమును చెప్పుమని అడుగ బడినవాడై గోపనము జేయక, భూతార్థమును (జరిగిన) చెప్పుటయే సత్యమునకు లక్షణము

**బ్రహ్మచర్యం జపో మౌనం నిరాహారత్వ మేవ చ ।**
**ఇత్యేతత్తపసో రూపం సుఘోరం సుదురాసదమ్ ॥ 3**

బ్రహ్మచర్యము, జపము, మౌనము, ఉపవాసము - ఇవి మిక్కిలి ఘోరమైన, సులభముగా పొందరాని తపస్సునకు స్వరూపము

**పశూనాం ద్రవ్యహవిషామృక్సామయజుషాం తథా ।**
**ఋత్విజాం దక్షిణానాం చ సంయోగో యజ్ఞ ఉచ్యతే ॥ 4**

పశు, ద్రవ్య, హవిస్సుల, ఋక్సామ యజూర్దక్షిణలయొక్క చేరికయే యాగమునకు లక్షణము

**ఆత్మవత్సర్వభూతేషు యా హితాయాహితాయ చ ।**
**ప్రవర్తన్తే సమా దృష్టిః కృత్స్నాఽప్యేషా దయా స్మృతా ॥ 5**

సుఖమందు, దుఃఖమందు తన కేలాగున నుండునో, అటువలెనే సమస్తజీవరాసులయందు సమానమైన దృష్టి గలిగి ప్రవర్తించుటయే పూర్ణదయ యని పేర్కొనబడుచున్నది

**ఆకృష్టో నిహతో వాఽపి నాక్రోశేద్యో న హంతి చ ।**
**వాఙ్మనః కర్మభిర్వేత్తి తితిక్షైషా క్షమా స్మృతా ॥ 6**

తన్ను లాగినను, కొట్టినను త్రికరణములచే అరవకుండుట, తిరిగి కొట్టకుండుట - క్షమ యనబడును

స్వామినా రక్ష్య మాణానాముత్సృష్టానాం చ సంభ్రమే ।
పరస్వానామనాదానమలోభ ఇతి కీర్త్యతే ॥ 7

అధిపతిచే కాపాడబడుచుండియు, తత్తరపాటు (త్వర) వలన జారిపోయిన పరధనము నాశింపకుండుటయే అలోభమనబడును

మైధునస్యానమాచారో న చింతానానుజల్పనమ్ ।
నివృత్తిర్బ్రహ్మచర్యం తదచ్ఛిద్రం తవ ఉచ్యతే ॥ 8

మైధునము చేయకుండుటయు, దాని విషయమై తలపక చర్చింపక సర్వదా నివృత్తుడగుట బ్రహ్మచర్యమనబడును అదియే అభేద్యమైన తపస్సనంబడును

ఆత్మార్థం వా పరార్థం వా చేంద్రియాణీహ యస్య వై ।
మిధ్యా న సంప్రవర్తన్తే శమస్యైతత్తు లక్షణమ్ ॥ 9

తన ప్రయోజనమునకుగాని, ఇతర ప్రయోజనమునకుగాని, యెవని యింద్రియములు అన్యధా ప్రవర్తింపవో, అదియే శమమునకు లక్షణము

యస్మాద్భషంతి తే ధీరా మహాంతం సర్వతోగుణైః
తస్మాన్మహర్షయః ప్రోక్తా బుద్ధేః పరమదర్శినా ॥ 10

ఎందువలన ధీరులు అన్ని గుణములచేతను, మహత్తును (బ్రహ్మమును) పొందుచున్నారో, అందువలననే బుద్ధిమంతులచేత వారు మహర్షు లనబడిరి.

యద్యదిష్టతమం ద్రవ్యం న్యాయేనైవాగతం చ యత్ ।
తత్తద్గుణవతే దేయమిత్యేతద్దాన లక్షణమ్ః 11

తనకు మిక్కిలి యిష్టమైనట్టియు, న్యాయార్జిత మైనదియు నగు ద్రవ్యమును గుణవంతుడైన సత్పాత్రునకు ఇచ్చుటయే దానమనంబడును

దానం త్రివిధమిత్యేత త్కనిష్ఠజ్యేష్ఠ మధ్యమమ్ ।
తత్ర నైశ్రేయసం జ్యేష్ఠం కనిష్ఠం స్వార్థసిద్ధయే ॥ 12

దానము కనిష్ఠ, జ్యేష్ఠ, మధ్యమములని మూడు విధములు, వాటిలో

జ్యేష్ఠము మోక్షసాధనమునకు, కనిష్ఠము స్వార్థసిద్ధికొఱకు చేయబడును

కారుణ్యాత్సర్వభూతేషు సంవిభాగస్తు మధ్యమః ।
శ్రుతిస్మృతిభ్యాం విహితో ధర్మో వర్ణాశ్రమాత్మకః ॥ 13
శిష్టాచారావిరుద్ధశ్చ ధర్మః సత్సాధుసమ్మతః ।

సర్వ జీవరాసులయందు దయాదృష్టివలన నివ్వబడుదానమే మధ్యమ మనబడును. శిష్టాచారమునకు అవిరుద్ధముగను, సత్సాధువులకు సమ్మతముగను, శ్రుతిస్మృతుల చేత విధింపబడిన ధర్మమే వర్ణాశ్రమ ధర్మమనబడును.

అప్రద్వేషో హ్యనిష్టేషు తథేష్టానభినందనమ్ ॥ 14
ప్రీతి తాప విషాదేభ్యో వినివృత్తిర్విరక్తతా ।
సంన్యాసః కర్మణాం న్యాసః కృతానామకృతైః సహ ॥ 15

ఇష్టముకాని వాటిని ద్వేషింపకుండుటయు, ఇష్టవస్తువు నభిలషింప కుండుటయు ప్రీతి, తాప దుఃఖముల నతిక్రమించుటయు విరక్తి యనబడును చేయబడిన కర్మలను చేయబడనట్టి కర్మలతో సహ విడిచి పెట్టుటయే సంన్యాస మనబడును,

కుశలాకుశలానాంతు ప్రహాణం న్యాస ఉచ్యతే ।
అవ్యక్తా యే విశేషాస్తే వికారేఽస్మిన్నచేతనే ॥ 16
చేతనాచేతనావ్యత్య విజ్ఞానం జ్ఞానముచ్యతే ।
ప్రత్యంగానాం తు ధర్మస్య త్విత్యేల్లక్షణం స్మృతమ్ ॥ 17

కుశలాకుశలములను (క్షేమాపాయములను) గణింపకుండుటయే న్యాస మనబడును.అచేతనరూపమైన యీ ప్రపంచ వికారమున అవ్యక్తములైన ఏ విశేషములుగలవో, వాటిని తెలిసికొని, చేతనాచేతనములకు భేదమును తెలిసికొనుటయే జ్ఞానమనబడను ఇట్లు ధర్మముయొక్క ప్రత్యఙ్గముల లక్షణము చెప్పబడినది

సన్న్యాసయోగము సమాప్తము



# శ్రీనిర్వాణనిలయము

## పీఠిక

ఓ ప్రాజ్ఞులారా! ఈ గ్రంధము పరమనిర్వాణస్థితిలో నుండు మహనీ యాత్ముల‌ను గుఱించిన దగుటచే అట్టిస్థితిలో నుండువారెటుల నుండవల యునో, అది దీనివలన తేట తెల్లమగును కావుననే దీనికి "నిర్వాణనిలయ" మని నామకరణము చేయబడినది నిర్వాణ మనియు, నిర్వికల్పసమాధి యనియు, బ్రహ్మసాక్షాత్కార మనియు, అనునస్క మనియు, పరిపూర్ణమనియు, జీవన్ముక్తి యనియు, విదేహముక్తి యనియు, ఆత్మసాక్షాత్కారమనియు చెప్పు పేర్ల న్నియు ఒక పదానికే పర్యాయపదములని శాస్త్రము నిర్ణయించుచున్నది

రాజయోగః సమాధిశ్చ ఉన్మనీ చ మనోన్మనీ ।
అమరత్వం లయస్తత్త్వం శూన్యాశూన్యం పరంపదమ్ ॥
అమనస్కం తథాఽద్వైతం నిరాలమ్బం నిరంజనమ్ ।
జీవన్ముక్తిశ్చ సహజా తుర్యా చేత్యేకవాచకాః ॥

1 రాజయోగము, 2 సమాధి, 3 ఉన్మని 4 మనోన్మని, 5 అమర త్వము, 6 లయము, 7 తత్త్వము, 8 శూన్యాశూన్యము, 9. పరమపదము, 10. అమనస్కము, 11 అద్వైతము, 12 నిరాలమ్బము, 13 నిరంజనము, 14 జీవన్ముక్తి, 15 సహజము, 16 తుర్యము- అను నీ పదునారు ఒక బ్రహ్మసాక్షాత్కారము అనే నిర్వాణమునకే, నిర్వికల్పమునకే పేర్లు

### సమాధి లక్షణము

సలిలే సైన్ధవం యద్వత్సామ్యం భవతి యోగతః ।
తథా చ మనసోఽఽైక్యం సమాధిరభిధీయతే ॥

యదా సంక్షీయతే ప్రాణో మానసం చ ప్రలీయతే ।
తదా సమరసత్వం చ సమాధిరభిధీయతే ॥

తత్సమం చ ద్వయోరైక్యం జీవాత్మపరమాత్మనోః ।
ప్రనష్టసర్వసంల్పస్సమాధిస్సోఽభిధీయతే ।

ఎట్లు జలమునందు లవణము చేరుటవలన జలముయొక్క సామ్యమును, అనగా నైక్యమును పొందుచున్నదో, అట్లు ఆత్మకున్ను, మనస్సుకును గలుగునట్టి యైక్యము సమాధి యనంబడును ఎప్పుడు ప్రాణము లయము జెంది మనస్సున్ను అణగుచున్నదో, అప్పుడు గలుగు సమరసత్వము సమాధి యనబడును జీవాత్మ పరమాత్మలనెడి రెంటియొక్క యైక్యమగు సంబంధము గల్గి సకల సంకల్పములును నశించుటయు సమాధి యనబడును ఈపర్యాయ శబ్దము లన్నియు ఇది ఉదకము, జలము, తోయము, వారి అని ఒకే జలమునకు ఎన్నియో పేర్లు ఉన్నట్లు ఉండునని గ్రహించుకొనవలయును ఐతే పేర్లు మాత్రము వేరు వేరుగా నుండినను స్వచ్ఛమగు జలము మాత్ర మేలాగున ఒకే విధముగా ఉండవలయునో, అలాగున ఈ జీవన్ముక్తి స్థితియు అందరికిని ఒకే విధము గానే యుండవలయును ఈ పేర్లు అన్నియు ఒక్కొక్క సంప్రదాయ సంబంధ నామములేగాని మఱియొకటి కాదు ఎట్లన జలమనియు, నీళ్లనియు,పాని యనియు తణ్ణీ యనియు, వెళ్ళమనియు, నీరనియు, వారియనియు, వత్తు, యనియు ఒక్కొక్క భాషలో నామధేయములు వేరువేరుగా నుండినను, జల మొక్కటియే అగునట్లు జీవన్ముక్త స్థితి ఒకే విధముగా నుండును అట్టి నిర్వాణస్థితిలో ప్రాకృతగుణములు రహితములై యుండును అట్టి మహాత్ముని యందు ప్రాకృతగుణములుగాని, ప్రకృతి స్వభావములుగాని, ప్రకృతి వాసనలుగాని యుండరాదు అదియే దీని యొక్క నిర్ణయము

అట్లుగాక ప్రాకృతగుణము లుండిన అట్టి యాత్మ ఇంకను ముక్తిని పొందలేదనియే గ్రహించుకొనవలయు, "యధా భర్జితబీజస్య" అనియు, "వాసనాతృణపావకః" అనియు, 'పరిపక్వఫలమివ" అనియు, "యథామధు" అనియు, "యధామృతం" అనియు శాస్త్రములు దృష్టాంతములను తెలుపుచున్నవి అనగా, 1 వేగిన విత్తనము ఎట్లు అంకురించదో 2 విషయ వాసన యను

శుష్కతృణమునకు అగ్ని ఎట్టిదో 3 బాగుగా పండిన మామిడిపండ్లు ఏలాగున మధుర మయములై యుండునో, 4 తేనె యేలాగు అంతటా తీపిగా నుండునో, 5 అమృత మేలాగున మధురరసమై యుండునో, ఆలాగున నుండుననియు శాస్త్రము తెలుపుచున్నది ఈ పదము లన్నిటికి ఈ గ్రంధములో ప్రమాణశ్లోకములు గలవు అచ్చట చూచుకొనవచ్చును

ఇకను స్ఫుటముచేసిన బంగారమువలెను, నిరావరణ సూర్యచంద్రాదు లవలెను, శుభ్రముగా ఉతికిన తెల్లవస్త్రము వలెను, అగ్నిదగ్ధపాశమువలెను, మూలికచే స్ఫుట మొనరించిన తామ్రము స్వర్ణమగునటుల నుండుననియు దృష్టాంతములు చూపబడినవి. దీనికి సంబంధించిన శాస్త్రములు గూడ ఈ గ్రంధమందు చూడందగును ఆలాగున మూడు గుణములకు అతీతమగుట వల్లనే ఆత్మ గుణత్రయరహిత మగుననియు ఉపదేశించబడినది ఇట్టి స్వచ్ఛస్థితి లేని కారణమువల్లనే సాధువులపై, సన్న్యాసులపై, యోగులపై, యోగినులపై, తాపసులపై, భక్తులపై, భక్తురాండ్రపై, విద్వాంసుల పై, విదుషీమణులపై జనులకు విశ్వాసము లేకపోవుచున్నది దీనివల్ల విద్యావం తులకున్ను, గౌరవనీయులకున్ను, ప్రజ్ఞావంతులకున్ను, భూపాలురకున్ను పైజెప్పిన వారలపై విశ్వాసము లేకపోవుటచే, బ్రహ్మవిద్యలో వారికి ప్రవేశము లేక పోవుచున్నారు దీనివల్ల పైజెప్పిన గృహస్థజనులు తరింపక పోవుటయే గాక, తరణాసక్తిగల నిస్సహాయులయొక్క అనుష్ఠానమునకున్ను, విద్యాభ్యాసమున కున్ను సహాయముకూడ చేయక పోవుచున్నారు ఇది లోకమునకెంత పతన హేతువో ప్రజ్ఞావంతులు తెలిసికొందురుగాక!

కావున, నీదురవస్థయగు దుష్టపిశాచము భారతదేశమునుండి తొలగిపోవలసి యుండిన, సాధువులపై జనులకు విశ్వాసము గలుగ వలసి యుండిన, పతనమగు బ్రహ్మవిద్య మరల ఉద్ధరింపబడవలసి యుండిన, ప్రతిభక్తుడున్ను గురువున్ను, సాధువున్ను, సత్యప్రవర్తకులై, ధర్మాచరణ పరులై, విషయవిరక్తులై, శుద్ధాత్మజ్ఞానము గలుగువరకు అనుష్ఠానపరులై యుండిన చాలును, అప్పుడు జనులకు విశ్వాసము గలుగును దానిచే వారున్ను

తరింతురు తరించవలయునని తలంపు గలవారికి కావలసిన సహాయము గూడ ఒనర్తురు అందువల్ల ఉభయులుకూడ తరించగలరు, ఉభయ లోకములుగూడ ఉద్ధరింపబడును భగవత్కృప యుభయులకున్ను గల్గును మోక్షముగూడ ఉభయులున్ను పొందగలరు, ధర్మము వృద్ధినొందును, అధర్మమణగును

పాఠకలోకమునకు మఱియొక విజ్ఞాపనముగూడ చేయవలసియున్నది అదేమనగా, ఇదివరలో వ్రాసియుండు గ్రంథములలోగల అత్యవసర ప్రమాణ శ్లోకముల కన్నింటిని దీనిలోగూడ తత్తదనుగుణ స్థలములలో చేర్చవలసి వచ్చెను శాస్త్రప్రమాణనిరూపణ లేని గ్రంథము, సాక్ష్యములేని న్యాయస్థాన విచారణ వంటిది యగును కావుననే ఋషులున్ను, శ్రీ శంకరభగవత్పాదులు మొదలుగాగల వారందఱున్ను ఆలాగున శ్రుతిస్మృతులను నిరూపించుచు వచ్చిరి అయితే కొందఱీలాగునతలంతురు అదేమనగా, ఇదంతయు ఇతరగ్రంథముల నుండి సంగ్రహించినది గదా! అటుల వేదప్రమాణమును నిరూపింపకపోయిన దీనికి శాస్త్రప్రమాణమేమి గలదు? ఇది వారి ఇష్టానుసారముగా వ్రాయడ మైనదనిగూడ చెప్పుదురు అయితే ఇది పండిత స్వభావము కాదు పామరవాక్యమని విజ్ఞులెఱింగియే యున్నారు విజ్ఞులు రాజహంసమువలె సారగ్రాహు లగుటచే, దీనిలో గల నిస్సార మేదైన ఉండిన, త్యజించి సారమును గ్రహింతురని తలంచెద మఱియు దీనియందు ఏదైన కొఱతపడిన భాగముగాని, లేక లోపముగాని గల్గియుండిన, తెలుపువారికి కృతజ్ఞుడను అంతియే గాక, మరుముద్రణములో దానిని చేర్చి ముద్రించే లాగున నిరీక్షించువాడను పరమ కారుణికుడగు సర్వేశ్వరుడున్ను, పరమ పావనులగు ఋషివర్యులున్ను ఆనందింతురు గాక

లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు

ఇట్లు మీ చరాచర సుఖాభిలాషి

**శ్రీ మలయాళస్వామి.**

**ఓం శివమ్**



# శ్రీనిర్వాణనిలయము

## ప్రథమ పటలము

జ్ఞాతృజ్ఞానజ్ఞేయభేదః పరే నాత్మని విద్యతే ।
చిదానందైకరూపత్వాద్దీప్యతే స్వయమేవ తత్ ॥

చిదానందైకరూపత్వాత్ - చిత్ = జ్ఞానస్వరూపిగాను, ఆనంద = ఆనంద స్వరూపిగాను, ఏకత్వాత్=కేవల స్వరూపిగాను, ఉండుటవల్ల, పరే ఆత్మని = పరమాత్మయందు, జ్ఞాతృజ్ఞానజ్ఞేయభేదః = జ్ఞాతృ = జ్ఞాతయొక్కయు, జ్ఞాన = జ్ఞానముయొక్కయు, జ్ఞేయ = తెలియదగిన విషయముయొక్కయు, భేదః = వ్యత్యాసము, న విద్యతే = లేదు, తత్ = ఆయాత్మ, స్వయమేవ - తనకు తానే, దీప్యతే = ప్రకాశించుచున్నది

జ్ఞానస్వరూపిగాను, ఆనందస్వరూపిగాను, కేవలస్వరూపిగాను నుండుటవల్ల పరమాత్మయందు జ్ఞాతృజ్ఞానజ్ఞేయ భేదము లేదు ఆ యాత్మ తనకు దానే ప్రకాశించుచున్నది

విశేషార్థము ॥ దీపాది ప్రకాశములు పరులచే ప్రకాశింప జేయబడినట్లు, ఆత్మ పరులచే ప్రకాశింపజేయబడునది కాదు అది సూర్యుడేలాగున స్వయంప్రకాశకుడై యుంటున్నాడో, ఈ యాత్మయు తనకు దానే స్వయముగ ప్రకాశించుచున్నది దీనికి పరప్రకాశ మవసరము లేదు ఇది త్రిపుటిరహితము త్రిపుటియనగా - 1 జ్ఞాత, 2 జ్ఞానము, 3 జ్ఞేయములు దీనికి తెలివి, తెలుసుకొనుట, తెలుసుకొనందగినది అనియు, ద్రష్ట, దర్శనము, దృశ్యము ఆలాగున ధ్యాత, ధ్యానము, ధ్యేయము అను వ్యత్యాసము లేదు

కావుననే ఆ బ్రహ్మవస్తువు త్రిపుటిరహితమని శాస్త్రములు తెలుపుచున్నవి జీవన్ముక్తులు తమ కట్టిస్థితి గల్గినదా, లేదా యని బాగుగా తమలో దాము విచారణ జేసికొనవలెను అట్లయిన ముక్తుల మైతిమా లేదా యను స్థితి తెలుసుకొనగలరు

**ఏకం చిన్మాత్రమస్తీహ శుద్ధం సౌమ్యమలక్షితమ్ ।**
**సూక్ష్మాత్సూక్ష్మతరం శాన్తం న జగన్నజగత్క్రియా ॥**

ఏకమై, శుద్ధమై, అలక్షితమై, సూక్ష్మముకంటెను సూక్ష్మమై, మహత్తుకంటెను మహత్తై శాంతమైనట్టి చిన్మాత్రవస్తువే యీ ప్రపంచమున గలదు జగత్తుగాని, యద్దాని క్రియగాని వాస్తవముగ లేవు

**యదా తు జ్ఞానదీపేన సమ్యగాలోక ఆగతః ।**
**సంకల్పమోహో జీవస్య క్షీయతే శరదభ్రవత్ ॥**

జ్ఞానదీపముచే నెపుడు సమ్యక్ ప్రకాశమును బొందునో, అపుడు ఆజీవునకు శరత్కాలమేఘము వలె సంకల్పము యొక్క మోహము క్షయించును

శరత్కాలము రాగా ఆకాశవీధిలో మేఘము నశించి నిర్మలముగా నుండునట్లు, ఆత్మజ్ఞానోదయము గల్గిన యట్టి హృదయమున మఱల సంకల్పమోహము లుండవు అదే దానికి గురుతు, వర్షఋతువునందు ఆకాశము మేఘాకులమై యుండునట్లు, ఎవరి హృదయములో విషయ మోహాది సంకల్పము లుండునో అతడింకను ఆత్మప్రకాశమను శరత్కాలమునకు వచ్చినవాడు కాడు ముక్తుడని తలంచువాడు దీనిని ఆలోచించందగును

**నిద్రావ్యపగమే జన్తుర్యథా స్వప్నం న పశ్యతి ।**
**జీవోఽపి భావితే సత్యే తథా దేహం న పశ్యతి ॥**

నిద్రనుండి మేల్కాంచిన పిదప, ప్రాణి స్వప్నమును జూడనట్లు సత్యస్వరూపమగు ఆత్మ నెఱింగిన పిమ్మట, జీవుడిక దేహభ్రాంతిని పొందకుండును

కలలో కన్న వస్తువు లన్నియు, జాగ్రదవస్థలోనికి వచ్చిన పిమ్మట మిథ్యయని యెట్లు తెలుసుకొనుచుండునో, యాలాగున సత్యజ్ఞానానందాత్మ యుధయించునప్పుడు జ్ఞానభ్రమ లన్నియు నశించును నిద్రలో తానెవడు, ఎచ్చటనున్నాడు దేనికొఱకు వచ్చెనను జ్ఞాన మెట్లుండదో, మేల్కొనిన తరువాత తాను, పలానవాడు, పలాన స్థలములో ఉంటున్నాడు, పలానదాని కొఱకు వచ్చియున్నాడను జ్ఞానమెట్లు గల్గియుండునో, జీవన్ముక్తుడుగూడ ఆలాగుననే యుండవలయును

**శాన్తిమాయాతి దేహోఽయం సర్వసంకల్పసంక్షయాత్ ।**
**తదా రాఘవ నిశ్శేషం దీపస్తైలక్షయే యథా ॥**

ఓ రాఘవా! సంకల్పక్షయముచే, నీ స్థూలదేహాభిమానము తైలరహిత దీపమువలె శమించును

అవిద్యాబుద్ధి నిలిచి యుండుటకు, అజ్ఞానవాసనారూపమగు తైలముం డుటయే కారణము తైలము నశించిన దీపమారునట్లు, యజ్ఞాన రూపమగు విషయవాసన నశించిన, మఱల అవిద్యకు నిలకడ యుండదు కావున వాసనాక్షయము తనకు గలిగినదా? లేదా? యని ముక్తులమని తలంచువారు యోచించుకొనందగినది అని యోగవాసిష్ఠము

## నిర్వాణశబ్దము యొక్కయర్థము

నిర్వాణశబ్దప్రయోగము బౌద్ధమతగ్రంధములలో ఎక్కువగా కన్పట్టుచు న్నది అయితే ఉపనిషత్తులలోను, గీతలయందును, శ్రీయోగవాసిష్ఠము నందును నిర్వాణపదములు అనేకములు గలవు అష్టోత్తరశతోపనిషత్తులలో నిర్వాణోపనిషత్తని యొకటి గలదు యోగవాసిష్ఠమున ఉత్తరార్ధమంతయు నిర్వాణప్రకరణముగా వర్ణింపబడియున్నది గీతలో ఐదు శ్లోకములయందు నిర్వాణ పదము ప్రయోగించబడియున్నది శ్రీశంకరాచార్యులు నిర్వాణషట్క మని ఆరు శ్లోకములు వ్రాసియున్నారు ఆస్తిక నాస్తిక మతస్థు లందఱున్ను నిర్వాణశబ్దమును ప్రయోగించుచున్నారు అందరును నిర్వాణమునకు మోక్ష

మనియు, ముక్తియనియు, కైవల్యమనియు ఒకే విధమగు అర్థమునే యంగీకరించియున్నారు ప్రకృతిబన్ధము నుండి విమోచనము గలుగుటయే ముక్తియని యందురు, ఇది అందఱికిని సమ్మతము ముక్తివిషయమై ఆయా మతస్థులలో కొంత తారతమ్యము గలదు అయితే జననమరణ దుఃఖమగు సంసారము నుండి విడుదల పొందుట మోక్షమని అందఱును అంగీకరించి యున్నారు ఈ విషయమై ద్వైతాద్వైత విశిష్టాద్వైతులును, శైవవైష్ణవాది మతస్థు లందఱును, బౌద్ధజైన క్రైస్తవ మహమ్మదాది మతములవారున్ను, జననమరణ భవపాశము నుండి విముక్తి గల్గి శోకరహితమగు నిరతిశయానంద శాశ్వతపదవిని మోక్షమని యంగీకరించియున్నారు. అమరకోశ నిఘంటువున ఈ అర్థము గలదు

ధీవర్గము ముక్తిః కైవల్యనిర్వాణ శ్రేయో నిశ్శ్రేయసామృతం మోక్షోఽపవర్గః

1 ముక్తి, 2 కైవల్యము, 3 నిర్వాణము, 4 శ్రేయస్సు 5 నిశ్శ్రేయస్సు, 6 అమృతము, 7 మోక్షము, 8 అపవర్గము- ఈ ఎనిమిదియు మోక్షముయొక్క పేర్లు, నిర్వాణము యొక్క ధాత్వర్థము "నిర్వాన్తి నిర్గచ్ఛన్తి దుఃఖాదయో అస్మిన్నితి = దీని యందు దుఃఖాదులు నిర్గతమవును" అనగా జీవునికి అజ్ఞాన సంబంధమగు ఎన్ని విధములగు క్లేశములు, బంధములు, ఆవరణములు గలవో, అవన్నియు వదలిపోయిన స్థితి యేది గలదో అదియే నిర్వాణము అట్టి ముక్తాత్మునకు మరల ప్రకృతి సంస్కారములుగాని, జన్మాంతరవాసనలు గాని, త్రిగుణములుగాని, సంచిత, ఆగామి, ప్రారబ్ధాది కర్మలు గానివి యేవియు నుండకూడదు మరల కర్మశేష ముండిన ఆ ఆత్మను ఎట్లు విముక్తాత్మయని చెప్పనగును? ఈ సత్యమును తెలుపుటకొఱకే ఈ గ్రంథమును వ్రాయ తలంపుగల్గినది నిర్+ విద+జ్ఞానే, షష్ నిర్వేదః ఈ శబ్దమునకు మూడు అర్థములు గలవు, 1 అనుతాపే 2 ఔదాసీన్యే, 3 వైరాగ్యే, 1 అనుతాపము, 2 ఔదాసీన్యము, 3 వైరాగ్యము

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ ! నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాఽస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥

శ్రీ శంకరాచార్యాః - బ్రహ్మనిర్వాణం, బ్రహ్మనిర్వృతిం, మోక్షం॥ శ్రీ నీల

కంఠవ్యాఖ్యా (చతుర్ధరీ) నిర్గతం వానం గమనం। యస్మిన్ ప్రాప్యే బ్రహ్మణి నిర్వాణం ॥ ఏప్రాప్యమగు పరబ్రహ్మమందు లోకాంతర గమనము లేదో, యేపర బ్రహ్మప్రాప్తిపొందిన మరల జనన మరణగమనము లుండవో, అదియే నిర్వాణము

**న తస్యప్రాణా ఉత్క్రామంత్యత్రైవ సమవలీయంతే**
**బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి ॥**

ఆబ్రహ్మజ్ఞానియొక్క ప్రాణములు లోకాంతరమునకు వెడలిపోవు ఈ బ్రహ్మమునందే లీనమగుచున్నవి బ్రహ్మస్వరూపుడై బ్రహ్మమునే పొందు చున్నాడు. అనగా బ్రహ్మస్వరూపు డగుటయే బ్రహ్మమును పొందుట యగును దానికి పూర్వముండిన జీవోపాధులు, జీవభావములు జీవునికి సంబంధించిన త్రిగుణములు వదలిపోవడమే బ్రహ్మప్రాప్తియగు నిర్వాణ మగును

శ్రీ మధుసూదనవ్యాఖ్యా - బ్రహ్మనిర్వాణం, బ్రహ్మణి నిర్వాణం నిర్వృతిం బ్రహ్మరూపం నిర్వాణమితి వా ॥ - బ్రహ్మయందు నిర్వాణము, నిర్వృతి, బ్రహ్మరూపమే నిర్వాణము

శ్రీధరీవ్యాఖ్యా - బ్రహ్మణి నిర్వాణం లయం॥ - బ్రహ్మయందు లయమ గుట నిర్వాణ మనబడును

**యోఽన్తస్సుఖోఽ న్త రారామస్తథాఽన్తర్జ్యోతిరే వయః ।**
**స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ (గీ, 5-24)**

**బ్రహ్మనిర్వాణం**

శ్రీ శ్రీశంకరాచార్యః - బ్రహ్మనిర్వాణం బ్రహ్మణి నిర్వృతిం మోక్షం।

శ్రీ నీలకంఠవ్యాఖ్య - బ్రహ్మనిర్వాణం గత్వాప్రాప్య పరమానందం బ్రహ్మ ॥

శ్రీ శంకరాచార్యులు, శ్రీ నీలకంఠులు, శ్రీ మధుసూదన సరస్వతి,

శ్రీభాష్యోత్కర్షదీపిక, శ్రీధరులు - వీరందఱును ఒకేవిధమగు అర్థమునేచెప్పిరి అందువల్ల వారి వ్యాఖ్యలన్నియు ఇచ్చట చెప్పబడ లేదు

**లభన్తే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః ।**
**ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః ॥** (గీ, 5-25)

దీనిలోగూడ "బ్రహ్మనిర్వాణ"పదము గలదు అయితే ఋషులనియు, క్షీణకల్మషులనియు, రెండు పదములు ప్రయోగింపబడి యున్నవి ఋషి శబ్దమునకు అనేక అర్థము లుండినను, ఇంద్రియాతీత జ్ఞానము గలవారని ముఖ్యార్థము, క్షీణకల్మషులు - అవిద్యాసంబంధ సకల మాయామాలి న్యము నశించినవారని యర్థము అట్టివారే బ్రహ్మనిర్వాణమును పొందగలరు

**కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।**
**అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥**

దీనిలోగల "కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసాం, విదితాత్మనాం" అని ప్రయోగింపబడిన పదముల యర్థములను ముక్తులని తలంచువారు భాష్యగ్రంథములలో బాగుగా తెలిసికొనవలయును అట్టివారే బ్రహ్మనిర్వాణమును పొందగలరు

**యుఞ్జన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః ।**
**శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥**

దీనియందు "యుంజన్నేవం, సదాత్మానం, యోగీ, నియతమానసః" అని ప్రయోగింపబడిన పదములయొక్క అర్థమునుగూడ ఇప్పుడు ముక్తులని తలంచువారు టీకా తాత్పర్యాది గ్రంథములలో లెస్సగా చూచి మననము చేసికొనవలసినది

శ్రీశంకరాచార్యః - నిర్వాణపరమాం, నిర్వాణం మోక్షః తత్పరమా నిష్ఠా యస్యాః శాంతేః సా నిర్వాణపరమా - ఎచ్చట ప్రకృతి శమించియుండునో అదియే పరమ నిర్వాణము దానియందు గల నిష్ఠయే నిర్వాణమని గూడ

గ్రహించుకొనవలయును తక్కిన భాష్యకర్తలుగూడ ఈలాగుననే వ్రాసియున్నారు

శ్రీనీలకంఠవ్యాఖ్యా- నిర్వాణం మోక్షః తదేవ పరమానిష్ఠా యస్యాశ్శాంతేః

నిఘంటువులు

1 నిర్వాణం నిర్వృతౌ మోక్షే వినాశే గజమజ్జనే (వైజయంతీ, (త్ర్యక్షరకాండే)

2 నిర్వాణమస్తం గమనే నిర్వృతౌ గజమజ్జనే, అపవర్గే చ (విశ్వప్రకాశః)

3 కైవల్యం నిర్వాణం నిశ్శ్రేయసమమృతమక్షరం బ్రహ్మ।
అపునర్భవోఽపవర్గోముక్తిర్మోక్షో మహానందః ॥
సనాతనం ధ్రువం నిత్యం శాశ్వతం స్యాదనశ్వరం
(హలాయుధః - 1-124)

4 నిర్వాణ మోక్షనిర్వృత్యోర్విఘాతే కరిమజ్జనే (అనేకార్థ సంగ్రహే తృతీయః కాండః)

5 నిర్వాణమస్తంగమనం నిర్వాణం గజమజ్జనమ్।
నిర్వాణమపవర్గోఽపి నిర్వాణం నిర్వృతిం విదుః (శాశ్వతకోశః 18శ్లో॥)

6 నిర్వాణమస్తంగమనే నిర్వృతౌ గజమజ్జనే। సంగమేప్యవర్గేచ (మేదినీ),

7 నిర్వాణో మునివహ్న్యాదౌ (అమరః తృ.కాం, విశేష్య నిఘ్నవర్గః)

8 నిర్వాణం మోక్షనిర్వృత్యోః విధానే కరిమజ్జనే (హైమః)

సర్వమతములవారు నిర్వాణపదమునకు "మోక్షము" అని అర్థము చెప్పుటలో నేకీభవింతురు కాని ఆ మోక్షముయొక్క స్వరూపవిషయమున మాత్రము ఒక్కొక్కరు ఒక్కొక్క మార్గమును అవలంబింతురు ఇందు శంకరాచార్యులవారు "విద్వాన్ శాస్త్రాచార్యోపదేశజనిత జ్ఞానదీపప్రకాశితం సద్బ్రహ్మాత్మానం ప్రవిశ్య నావర్తతే" = విద్వాంసుడు శాస్త్రముయొక్కయు,

ఆచార్యుల యొక్కయు, ఉపదేశజన్యమగు జ్ఞానదీపముచే ప్రకాశితమగు సద్బ్రహ్మస్వ రూపమగు ఆత్మను బొంది, తిరుగా రానేరడు, ఇదియే మోక్షము అని చెప్పుదురు రామానుజాచార్యుల వారు, ముక్తుడు వైకుంఠమున శ్రీమన్నారాయ ణునితో సమానమగు ఐశ్వర్యాదికము గలవాడై యుండును ఇదియే మోక్షమని వచింతురు మధ్వాచార్యులవారు పై విషయము నంగీకరించుచు, సాధనభేదమునుబట్టి ముక్తియందును భేదము గలదని యంగీకరింతురు బౌద్ధులు, ఏవిధమగు క్లేశములు లేని (జననమరణాది దుఃఖములు లేని) ఆనందస్థితియే మోక్షమందురు యోగులు ప్రకృతి సంబంధమును వదలి పురుషుడు కేవలుడై యుండుటయే మోక్షమని పలుకుదురు

తైలక్షయే యధా దీపో నిర్వాణమధిగచ్ఛతి ।
కర్మక్షయే తధా జన్తుర్నిర్వాణ మధిగచ్ఛతి ॥

తైలము నశించునప్పుడు దీపమేలాగున స్వయముగా ఆరిపోవునో, అలాగున కర్మము లన్నియు నశించునప్పుడు జీవునియొక్క ఆవరణము లన్నియు, కర్మ లన్నియు నశించిపోవును అట్టి ప్రకృతినుండి విముక్తిని పొందిన జీవుడు తనయొక్క నిజస్వరూపమున నిలుచు టేది గలదో అదియే నిర్వాణ మనబడును

## యోగవాసిష్ఠము

సర్వమేవపరిత్యజ్య మహామౌనీ భవానఘ ।
నిర్వాణవాన్నిర్మనసః క్షీణచిత్తః ప్రశాన్తధీః ॥

పాపరహితుడవగు రామచంద్రా ! నీవు సమస్తవాదములను పరిత్యజించి (లేక దృశ్యమంతటిని బారద్రోలి) మనోవర్జితుడవై, శాంత చిత్తుడవై, నిర్వాణ యుక్తుడవై, ప్రశాంతబుద్ధిగల్గి మహామౌనివై ఆత్మయందే స్థితిగల్గి య  ్డుము

**అహమంశే విదా క్షీణే సర్వమేవ క్షయం గతమ్ ।**
**న కించిచ్చ క్వచిత్తీక్ష్ణణం నిర్వాణైకఘనం స్థితమ్ ॥**

తత్త్వబోధచే అహం దేహాభిమాన అంశము క్షయింప మమత్వాంశమగు జగత్తంతయునుగూడ క్షయించిపోవును కాని యథార్థముగ నేదియు క్షయించుట లేదు ఏలననగా సర్వత్ర నిర్వాణఘనమై ఏకమైనట్టి ఆత్మయే స్థితిగల్గియున్నది

**విద్ధి చిన్మాత్రమేవేదమసద్రూపోపమం తతమ్ ।**
**తేనాలం మౌనమాస్స్వైవం సర్వ నిర్వాణమాత్రకమ్ ॥**

ఓ రామచంద్రా ! అసద్రూపమును బోలి వ్యాపించినట్టి చిన్మాత్రముగనే నీవీసమస్తమును నెఱుంగుము అట్లు సర్వము నిర్వాణరూపమగు ఆత్మమాత్ర ముగనే యెఱిగినవాడవై మౌనముగ నుండుము

**యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్ ।**
**తృష్ణాక్షయసుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్ ॥**

ప్రపంచములో సర్వసంకల్పప్రాప్తియగు సుఖమేది కలదో, స్వర్గలోక మందు ఏదైతే మహత్తైన దివ్యసుఖము గలదో, అవి యన్నియు అన్తఃకరణ ములో గల తృష్ణ నశించిన సంయమియొక్క నిర్వాణ సుఖములో పదునాఱవ భాగముయొక్క సుఖమునైనా కలుగజేయజాలవు

**దర్శనాదర్శనే హిత్వా స్వయం కేవలరూపతః ।**
**యస్తిష్ఠతి స తు బ్రహ్మ బ్రహ్మ న బ్రహ్మవిత్స్వయమ్ ॥**

దర్శనాదర్శనములను రెండింటిని విడచినవాడై యెవడైతే స్వయముగా కేవలాత్మ స్వరూపుడై నిలిచియుండునో అతడు బ్రహ్మవేత్తగాడు మరేమన స్వయముగా బ్రహ్మయే యగుచున్నాడు అట్టి స్థితియే నిర్వాణము బ్రహ్మవేత్త యని చెప్పినచో బ్రహ్మము నెఱింగివాడే యని యర్థము ఏర్పడును అచ్చట త్రిపుటి గలదు అట్టి త్రిపుటి లేని స్థితియే కేవలాత్మ స్థితి యగును

**ప్రజ్ఞా ప్రతిష్ఠా భూతానాం ప్రజ్ఞా లాభః పరో మతః ।**
**ప్రజ్ఞా నిశ్శ్రేయసీ లోకే ప్రజ్ఞా స్వర్గో మతస్సతామ్ ॥**

సమస్తప్రాణికోట్లకు ప్రజ్ఞానము ప్రతిష్ఠితమై యున్నది ఇదే మహావాక్యములలో ప్రజ్ఞానం బ్రహ్మయని తెలుపుటకు కారణము అట్టి ప్రజ్ఞాన లాభమునకు పరమైన లాభము మఱియొండు లేదు అట్టి ప్రజ్ఞాప్రాప్తియే లోకమున మోక్ష మనంబడును దానికి నిర్వాణమని పేరు గూడ గలదు ఇదియే సత్పురుషులకు నిత్యసుఖమని మతము

**నిర్వేదాదేవ నిర్వాణం న చ కించిద్విచిన్తయేత్ ।**
**సుఖం వై బ్రాహ్మణో బ్రహ్మ నిర్వేదేనాధిగచ్ఛతి ॥**

నిర్వేదమువల్లనే నిర్వాణము సిద్ధించుచున్నది దీనియందు మఱల చింతింప నక్కఱలేదు నిర్వేదముచేతనే బ్రహ్మనిష్ఠుడు శాశ్వత సుఖమగు బ్రహ్మమును పొందుచున్నాడు నిర్వేదమనగా హృదయము లోగల సర్వ ఆవరణములు నశించు స్థితియే యగును అట్టిదే నిర్వాణము అని శాంతిపర్వము

**యథా స్వనుష్ఠితం ధ్యానం తథా కుర్వన్తి యోగినః ।**
**మహర్షయో జ్ఞానతృప్తా నిర్వాణగతమానసాః ॥**

ఏలాగున మహాఋషులు ధ్యానమందు మంచినిష్ఠ గలవారై యున్నారో, యోగులుగూడ అలాటి నిష్ఠ గలవారై యున్నారు వారందఱును, జ్ఞానముచే సంతృప్తులగుచున్నారు. వారిమనస్సులో గల వృత్తులన్నియు విలీనములయినవి అట్టి స్థితియే నిర్వాణము అని వ్యాసమతము

**సమ్యక్తత్త్వావబోధేన దుర్బోధే క్షయమాగతే।**
**గలితే వాసనావేశే విశోకం ప్రాప్యతే పదమ్ ॥**

తత్త్వావబోధము చక్కగా గలిగిన దుర్బోధములగు సంస్కార వాసనలు అన్నియు వదలిపోవును అప్పుడు శోకరహితమగు బ్రహ్మపదము లభింప గల్గును ఇప్పుడు కుంభముని రూపధారిణియగు, చూడాల రాజర్షియగు

శిఖిధ్వజున^పరమనిర్వాణ స్వరూపమును గూర్చి చెప్పినదానిని చూడుడు శ్రీ యోగ వాసిష్ఠము -

**చిన్మాత్రమమలం శాన్తమాభాతం పరమం నభః ।**
**సమస్తకలనోన్ముక్తం యుక్తం పరమయా ధియా ॥**

**యదేకోదితమత్యచ్ఛం శాన్తమాతతముజ్జ్వలమ్।**
**పరమాత్మాత్మకం తేజస్తిమితం జ్ఞప్తిమాత్రకమ్ ॥**

అయ్యది చిన్మాత్రమై, నిర్మలమై, శాంతమై, ప్రకాశమయమై, అతిసూక్ష్మ మగు చిదాకాశమై, సమస్తకల్పనా విముక్తమై, నిజస్వరూపమును సాక్షాత్కరించు నట్టి బుద్ధితో గూడినదై, ఏకమై, అతిస్వచ్ఛమై, సర్వత్రవ్యాప్తమై, ఉజ్జ్వలమై, పరమాత్మమయమై, గంభీరమై, తేజోరూపమై, జ్ఞప్తిమాత్రమై యుండును

**అప్రతర్క్యమవిజ్ఞేయం సమం శివమనిన్దితమ్ ।**
**బ్రహ్మనిర్వాణమాపూర్ణమాపూర్ణోదితసంవిదా ।**

మఱియు ఆపరమాత్మయగు బ్రహ్మము తర్కించుటకు యోగ్యము కానిదై, అవిజ్ఞేయమై, సర్వత్ర యేక రసమై, శివమై, అనిందితమై, నిర్వాణరూపమై, సర్వత్ర యుదయించిన నిజబోధచే పూర్ణమై యొప్పును

**ముహూర్తమేవ నిర్వాణం యది చేతః పరే పదే ।**
**తత్తత్పరిణతం విద్ధి తత్రైవాస్వాదమాగతమ్ ॥**

మనస్సు పరమపదమున ముహూర్త కాలము విశ్రాంతి నొందినను బ్రహ్మాకారముగ పరిణత మగును దానిచే మనస్సు నిరతిశయమగు ఆనందాస్వాదమును బొంది మరల లేవ నిచ్ఛగొనదు మనస్సు వృత్తిరహితమై బ్రహ్మాకారవృత్తి గలది యగుటయే నిర్వాణ మనంబడును అట్టి మనస్సు నుండి మరల వృత్తులుగాని గుణములుగాని పుట్టవు

**యది సాంఖ్యేన విశ్రాన్తం చేతో యోగేన వాఽపి తే ।**
**క్షణం తత్సత్త్వతాం యాతం న భూయ ఇహ జాయతే ॥**

నీ మనస్సు సాంఖ్యయోగము ననుసరించిగాని, లేనిచో యోగమార్గము ననుసరించిగాని విశ్రాన్తినొంది క్షణమైనను ఆత్మతత్త్వముతో ఐక్యమును పొందియుండిన మరల ఉత్పన్నము గాదని గ్రహింపుము

**విగలితాత్మపదం విగలన్మనః సుభగసత్త్వమితీహ హి కథ్యతే ।**
**న పునరేతి కలామలినం పదం కనకతామి వ తామ్రముపాగతమ్ ॥**

సౌభాగ్యశాలుడవగు రామచంద్రా ! నేను చెప్పిన త్రివిధోపాయముల నాశ్రయించి పొందబడు జీవన్ముక్తిస్థితియందు జాగ్రత్స్వప్న సుషుప్తులను అవస్థలును, భ్రాన్తియును, దాని బీజములును, మనస్సును గూడ నశింప, దగ్ధప టమునుబోలు సత్త్వము మాత్రమే మిగులును వాసనాబీజములు లేకుండు టవలన నయ్యది రాగద్వేషాదులకు లోనై సంసారకారణము కాజాలదు స్పర్శ వేదివలన బంగారముగ మార్చబడిన రాగివలె ఈసత్త్వము మరల కళంకమును బొందదు

ముక్తాత్ముని యొక్క స్వరూప మిందు వర్ణించడమైనది స్పర్శవేదిచే తామ్రము బంగారమైన, మరల దానినుండి చిలుము ఎట్లు పుట్టజాలదో, అలా గున జీవత్వమునుండి బ్రహ్మత్వము నొందిన ఆత్మనుండి మరల విషయ ములు గలుగకూడదు ముక్తాత్ముడు సువర్ణమువంటి వాడనియు, బద్ధాత్ముడు తామ్రమువంటి వాడనియు గ్రహించుకొనవలయును

**క్షీయన్తే సర్వదుఃఖాని త్రుట్యన్తి గ్రన్థయోఽభితః ।**
**సంశయాశ్శమతాం యాన్తి సర్వ కర్మాణి చానఘ ॥**

పాపరహితుడా! అప్పుడు దుఃఖము లన్నియు తొలగిపోవును సంసార గ్రంధులు విడిపోవును సంశయము లన్నియు ఛిన్నము లగును, కర్మలన్నియు పై జెప్పినవానివలె శమావస్థను పొందును అనగా అవియు వాటివలె నశించిపో వును

**జ్ఞేయం విదురథాత్మానం సంశుద్ధం జ్ఞప్తిరూపిణమ్ ।**
**స చ సర్వగతో నిత్యం నాస్తమేతి న చోదయమ్ ॥**

పరమ పవిత్రమును, జ్ఞప్తి రూపమును, సర్వగతమును, జననమరణ ములను ఉదయాస్తమయములు లేనిదియును, నిత్యమును నగు ఆత్మనే జ్ఞేయ మందురు ముండకశ్రుతియు ఈ లాగున తెలుపుచున్నది

**భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః ।**
**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥**

పరాపరమగు పరబ్రహ్మసాక్షాత్కారము గలుగునప్పుడు హృదయ గ్రంధు లన్నియు భేదింపబడును సర్వసంశయములు ఛిన్నము లగును కర్మలన్నియు క్షీణించిపోవును

వేదమిాలాగున చెప్పుచుండగా బ్రహ్మవేత్తలకు గుణములతో, వృత్తులతో సంబంధము లేదని అమాయకులతో చెప్పి సమర్థించుకొనుట ఎంత అధర్మమో యూహించుకొనుడు

శిఖిధ్వజుడు తన స్వానుభవమును తెలుపుచున్నాడు

**నిష్కలఙ్కా సమా శుద్ధా నిరహంకారరూపిణీ ।**
**శుద్ధసంవేదనాకారా శివం సన్మాత్రమచ్యుతమ్ ॥**

అయ్యది కళంకరహితము, సమస్వరూపము, శుద్ధము, అహంకార వివర్జి తము, శుద్ధసంవేదనమే దానిస్వరూపము అయ్యది భూమానంద స్వరూప మగుటవలన పరమ మంగళమయము. సన్మాత్రము అది స్వస్వరూపమగు భూమానంద మంగళ స్వభావమునుండి విచ్యుతి గానందువలన, అచ్యుత మన బడుచున్నది

**నిర్వామి భ్రమనిర్ముక్తమాసే నిర్మన్దరాబ్ధివత్ ।**
**అసదాభాసమత్యచ్ఛమనన్తమజమచ్యుతమ్ ॥**

నేను భ్రమరహితమగు నిర్వాణమును బొందుచున్నాను మందర పర్వ తము లేని సముద్రమువలె నేనిపుడు నిశ్చలభావమున వెలయుచున్నాను ఈ ఆత్మాకాశమున దృశ్యాభాస అనునదేమియును లేదు ఇది అత్యన్తనిర్మలము,

అజము (బ్రహ్మరహితము), అచ్యుతము

శిఖిధ్వజుడు పరమనిర్వికల్పసమాధిలో పొందిన స్థితియు ఈ నిర్వాణమే సమాధినిగురించి గీతలో శ్రీకృష్ణభగవానుడు ఉపదేశించినదిన్ని చూడుడు -

**యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।**
**యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః ॥**

నియమింపబడిన చిత్తముగలవాడును, ధ్యానయోగమును అభ్యసించు వాడును అగు ఆత్మధ్యానయోగియొక్క మనస్సున, గాలిలేని చోటనుండెడు దీపమువలె జ్ఞేయస్వరూపమగు ఆత్మజ్యోతి వెలుగుచుండునని ఉపమానము చెప్పబడినది

**రూపాలోకమనస్కారా నీరసాగమభావనా ।**
**సమ్యగ్జ్ఞానావబోధస్య నిర్వాణం వై విదుర్బుధాః ॥**

సమ్యక్ జ్ఞానోదయముచే బాహ్యరూపాలోకములున్ను, ఆంతరిక మనః కల్పనలున్ను, అన్నియు సారరహితముగ తోచును అట్టి స్థితినే నిర్వాణము (మోక్షము) అని విజ్ఞులు పల్కుదురు

**చిత్తే త్యక్తే లయం యాతి ద్వైతమైక్యం చ సర్వతః ।**
**శిష్యతే పరమం శాన్తమచ్ఛమేకమనామయమ్ ॥**

చిత్తము త్యజింపబడగా ద్వైతము, ఐక్యమున్ను అంతట లయమొంది, పరమశాంతమై, స్వచ్ఛమై, నిరామయమై, ఏకమైనట్టి పరమాత్మయే శేషించును

**ఆత్మజ్ఞానం వినా సారో నాధిర్నశ్యతి రాఘవ ।**
**భూయో రజ్జ్వవబోధేన రజ్జుసర్పో హి నశ్యతి ॥**

ఓ రాఘవా! ఆత్మజ్ఞానము లేక సారము, అనగా జన్మాది వికారములకు మూలమగు భవవ్యాధి నశింపదు, రజ్జువుయొక్క జ్ఞానము పూర్ణముగ లేనిచో సర్పభ్రాన్తి నశింపదు గదా!

యో న నిర్వాసనో మానం సర్వధర్మపరోఽపి సన్ ।
సర్వజ్ఞోఽప్యతిబద్ధాత్మా పంజరస్థో యథా హరిః ॥
యస్యాస్తి వాసనాబీజమత్యల్పం చితిభూమిగమ్ ।
బృహత్సంజాయతే తస్య పునః సంసృతికాననమ్ ॥

అభ్యాసాద్ధృది రూఢేన సత్యసంబోధ వహ్నినా ।
నిర్దగ్ధం వాసనాబీజం న భూయః పరిరోహతి ॥

దగ్ధన్తు వాసనాబీజం న నిమజ్జతి వస్తుషు ।
సుఖదుఃఖాదిషు స్వచ్ఛం పద్మపత్రమివాంభసి ॥

వాసనారాహిత్యమును పొందనివాడు సర్వధర్మముల నాచరించు చున్నను, సర్వశాస్త్రవేత్త యైనను, పంజరమునందలి చిలుకవలె నత్యంతము బద్ధుడే యగుచున్నాడు చిత్తభూమియందు అతిసూక్ష్మమగు వాసనాబీజము మిగిలియున్నను దానివలన సంసారారణ్యము విశాలమై, గొప్పదై విస్తరించును

సత్యజ్ఞానమను అగ్నిని హృదయమున అభ్యాసమువలన నిల్పి వాసనాబీజమును సంపూర్ణముగా దగ్ధమొనరించిన మరల నంకురించుటకు అవకాశ ముండదు

స్వచ్ఛమగు పద్మపత్రము (తామరాకు) నీట మునుగనట్లు, దగ్ధమైన వాసనాబీజముగల మనస్సు మరల సుఖదుఃఖముల నొసగు వస్తువుల యందు జిక్కుకొనదు

అవిద్యాం ప్రకృతిం విద్ధి గుణత్రితయధర్మిణీమ్ ।
ఏషైవ సంసృతిర్జన్తోరస్యాః పారం పరం పదమ్ ॥

గుణత్రయ ధర్మములతో గూడుకొనిన ప్రకృతియే అవిద్యయని గ్రహింపుము ఇదియే జీవులయొక్క జననమరణ సంసార దుఃఖమునకు హేతువు దీని పారముననే పరమపదమగు మోక్షము వెలయుచున్నది

**వివేకవిశదం చేతః సత్త్వమిత్యభిధీయతే ।**
**భూయః ఫలతి నో మోహం దగ్ధబీజమివాంకురమ్ ॥**

వివేక జ్ఞానోదయమైన చిత్తము సత్త్వ మనబడు చున్నది దగ్ధబీజమున అంకురము జన్మింపజాలనట్లు అందు మరల మోహముద్భవింప జాలదు

**ప్రాప్తప్రాప్యో భవాన్నామ సత్త్వభావముపాగతమ్ ।**
**చిత్తం జ్ఞానాగ్నినా దగ్ధం న భూయః పరిరోహతి ॥**

జ్ఞానాగ్నిచే దగ్ధమై సత్త్వభావమునొంది కృతకృత్యత నందిన చిత్తము మరల నుద్భవింపదు

**జ్ఞస్య చిత్తం న చిత్తాఖ్యం జ్ఞచిత్తం సత్త్వముచ్యతే ।**
**నామార్థాన్యత్వభాక్చిత్తం బోధాత్తామ్రమనువర్ణవత్ ॥**

జ్ఞానియొక్క చిత్తము చిత్త మనబడదు, సత్త్వ మనబడును చిత్తమే నామ, రూప, అర్థముల భేదమును గలుగజేయునది అగును ఆ చిత్తము బోధచే సత్త్వమగును, ఎటులనగా, స్పర్శవేదిచే తామ్రము స్వర్ణమగునట్లు ఉండును

**మూఢం చిత్తం చిత్తమాహుః ప్రబుద్ధం సత్త్వముచ్యతే ।**
**అప్రబుద్ధా హి చిత్తస్థాః సత్త్వస్థాస్తు మహాధియః ॥**

మూఢులచిత్తమునే చిత్త మందురు జ్ఞానుల చిత్తమును సత్త్వ మందురు అజ్ఞానులేచిత్తమందుందురు జ్ఞానులగుమహాబుద్ధిమంతులు సత్త్వ మందుందురు

**భూయః ప్రజాయతే చిత్తం సత్త్వం భూయో న జాయతే ।**
**అప్రబుద్ధస్య బన్ధోఽస్తి న ప్రబుద్ధస్య భూపతే ॥**

ఓ రాజా! జ్ఞానము పొందని చిత్తము మరల మరల ఉత్పన్న మగును జ్ఞానముగల సత్త్వమగు చిత్తము అటులుత్పన్నము గాదు అజ్ఞానికి బంధము కలదు జ్ఞానికి బంధము లేదు

అజ్ఞాని చిత్తము తామ్రము వంటిది జ్ఞానిచిత్తము స్ఫుటము వేసిన తామ్రము బంగార మగునటుల యుండును తామ్రమునకు చిలుము గలదు స్వర్ణమునకు చిలుముండదు అజ్ఞాని చిత్తము త్రాడువంటిది జ్ఞానిచిత్తము అగ్నిదగ్ధపాశము వంటిది కాలనిత్రాడు బన్ధనమునకు ఉపయోగపడును కాలినత్రాడు త్రాడురూపముగా కనుపించినను బన్ధనమునకు నుపయోగ పడదు జ్ఞానము లేని చిత్తము పచ్చివిత్తనము వంటిది జ్ఞానముగల చిత్తము వేగిన విత్తనమువంటిది పచ్చివిత్తనము అంకురించును ఉడికినవిత్తనము అంకురించదు చూచినప్పుడు రెండున్ను ఒకే విధముగా నుండినను వృత్తి యందు భేదము గలదు ఆలాగున ఆత్మజ్ఞానియు, అజ్ఞానియు శరీరాద్యవయ వములచేతను, అన్నపానాది క్రియలచేతను ఒకేవిధముగ కనుపించినను, జ్ఞాని వృత్తిరహితుడై యుండును అజ్ఞాని వృత్తిసహితుడై యుండును ఈ రెండు గుణములచే జ్ఞానాజ్ఞానులను విభజించి తెలిసికొనవచ్చును

## యోగవాసిష్ఠము - నిర్వాణప్రకరణము

**బ్రహ్మేదం ఘనమజరాద్యనన్త మేకం సంకల్పస్ఫురణమవిద్యమానమేవ ।**
**బుద్ధ్వైవం వ్యపగత మానమేయ మోహో నిర్వాణం పరివిహరన్విశోకమాస్స్వ ॥**

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగా శేషించిన ఆత్మవస్తువు ఆనందఘనమై, అనంతమై, జరాది వికార రహితమై, జీవజగద్రూపములు సంకల్పము యొక్క స్ఫురణమాత్రములేయై, అసత్తై (లేనివై) పఱగుచున్నవి ఇట్లు ఆత్మతత్త్వము నెఱింగి ప్రమాతృ ప్రమాణ ప్రమేయాది త్రిపుటీ మోహమును బారద్రోలి నిర్వాణమగు బ్రహ్మమే అయి నిరతిశయ బృహద్రూపముచే నంతట వ్యాపించి విహరించుచు దుఃఖరహితుడవై చెన్నొందుము

**తదభావాజ్జగన్నాస్తి చిత్త్వం జగదభావతః ।**
**శిష్టం నిర్వాణమేవాతః శాన్తమాస్స్వ యథా సుఖమ్ ॥**

ఓవిద్యాధరా! అహంకారమను బీజమే లేనపుడిక నద్దాని కార్యమగు జగ

త్తును లేకయే యున్నదగును కావున జగజ్జీవాదుల అభావముచే శేషించునట్టి చిద్రూపమైన నిర్వాణస్వరూపమున శాంతముగను, సుఖపూర్వకముగను నుండుము

**ప్రబోధ్యమానోఽపి మయా భూయోభూయస్తత స్తతః ।**
**న పపాత పురో దృశ్యే పరం నిర్వాణమాగతః ॥**

అపుడు నేనాతనిని మరలమరల ఇటునటుండి మేల్కొలిపినను పరమ నిర్వాణదశను బొందిన యాతడు, మరల శబ్దాది విషయముల వైపునకు బడక యుండెను

**ఆసనే శయనే యానే స్థితో యత్నైర్న బోధ్యతే ।**
**నిద్రాలురివ నిర్వాణమనోమనన నిర్వృతః ।**

మనస్సంకల్పరహితుడై షష్ఠాది భూమికలం దారూఢుడై అట్టి జ్ఞాని, ఆసన, శయన, వాహనములపై గూర్చొని నిర్వాణదశను బొందియున్నవాడై నిద్రాళువువలె యత్నములచేతను గూడ మేల్కొలుప బడకుండును

**కర్మ కుర్వన్న కుర్వన్వా వీతరాగో నిరామయః ।**
**నిర్మనా నిత్యనిర్వాణః పుమానాత్మని తిష్ఠతి ॥**

వీతరాగుడును, మనోవికార రహితుడునగు జ్ఞాని కర్మలను చేయుచున్నను, లేక చేయక యున్నను సదా అమనస్కుడై నిత్యనిర్వాణ రూపుడై (మోక్షమును పొందిన వాడై) ఆత్మయందే స్థితి గల్గియుండును

**స్పన్దనేఽస్పన్దనే చైవ యత్పాషాణవదాసితమ్ ।**
**అజడస్యైవ తద్విద్ధి నిర్వాణమజరం పరమ్ ॥**

చేష్టయందును, తదభావమందును, శిలవలె నిశ్చలమైనట్టి చైతన్యము యొక్క ప్రశాంతస్థితి యేది గలదో అద్దానినే నీవు అజరమైన నిర్వాణపదమని యెఱుగుము

**తత్రాహన్తా న చ త్వత్తా నానహన్తా న చాన్యతా ।**
**కేవలం కేవలీభావో నిర్వాణమమలం శివమ్ ॥**

ఆ ఆత్మపదమున అహంత్వము (నేననుభావము) గాని త్వంత్వము (నీవను భావము) గాని, అనహంత్వముగాని, అన్యత్వము గాని లేవు కేవలము కేవలీభావమైన నిర్వాణరూప మైనట్టి నిర్మలమగు శివరూపమైన ఆత్మయే గలదు

**అహన్తామలముత్సృజ్య నిర్వాణః ఖమివానలః ।**
**స దేహ మపదేహం వా జ్ఞస్తిష్ఠతి గతజ్వరః ॥**

ఈ అహంభావమను మాలిన్యమును బూర్ణముగ ద్యజించి ఆకాశము వలె నిర్మలుడై మోక్షరూపుడై వెలయు జ్ఞాని దేహముతో గూడియున్నను, లేక దేహరహితుడైనను, సదా సంతాప వర్జితుడయ్యే వెలయును

**నిర్వాణైకతయాజ్ఞస్య వాసనైవ న వాసనా ।**
**రేఖా దామోపమా త్వబ్దేరూర్మ్యాది న జలేతరత్ ॥**

నిర్వాణరూపమగు ఆత్మతో ఏకత్వము నొందియుండుటచేతను, దగ్ధరజ్జువువలె బాధిత మగుటచేతను, తరంగాదులు సముద్రజలము కంటె అన్యము కానట్లు, జ్ఞానియొక్క వాసనయున్ను ఆత్మకంటె వేఱు గాకయున్నది కాన నది వాసన గానేరదు

**ఇష్టానిష్టోపలమ్భేషు శాన్తో వ్యవహరన్నపి ।**
**శవవన్నాన్యతామన్తర్నిర్వాణోఽనుభవత్యలమ్ ॥**

ఎవడు ఇష్టానిష్టముల సంప్రాప్తమందు శవమువలె శాంత చిత్తుడై సమముగ నుండునో, అట్టి జీవన్ముక్తుడు వ్యవహరించుచున్నను భిన్నత్వము నొకింతైనను దానియందనుభవింపకుండును

**అథవా శాన్తతైవాఽస్య నిర్వాణస్యావశిష్యతే ।**
**నిర్వాసనః కిల మునిః కథం వ్యవహరత్యసౌ ॥**

సప్తభూమికలను బొందినట్టి జ్ఞానికి గేవలము శాంతత్వమే శేషించును ఏలయనగా వాసనారహితుడగు ఆ ముని ఎట్లు వ్యవహరింపగలడు ?

**యావత్తస్య న నిర్వాణం పరిపోషముపాపగతమ్ ।**
**తావద్వ్యవహరత్యస్తరాగ ద్వేషభయోదయః ॥**

సప్తభూమికాపర్యన్తము విశ్రాంతియొక్క దృఢత్వ మెంతవరకు సంప్రాప్తింప లేదో, అంతవఱకు జ్ఞాని రాగద్వేషరహితుడై, సంసారోదయ వర్జితు డై, వ్యవహారము సల్పుచుండును

**వీతరాగ భయక్రోధో నిర్వాణశ్శాన్తమానసః ।**
**శిలేవాప్యశిలీభూతో మునిస్తిష్ఠతి నిత్యశః ॥**

తురీయపదమును పొందిన మునీశ్వరుడు రాగద్వేషభయ క్రోధవర్జితుడై, మోక్షరూపుడై, శాంతమనస్కుడై, నిత్యము శిలవలె నిశ్చలముగ నున్నను కేవలము చిద్రూపుడయ్యే వెలయును

**జీవితస్య యధా బాల్యం దృష్టం ప్రాధమకల్పికమ్ ।**
**నిర్వాణస్య తధా భోగసంత్యాగో రాగశాన్తిదః ॥**

ఆయువుయొక్క మొదటినియమము బాల్యావస్థ యైనట్లు రాగాదుల శమనమును గలుగజేయునట్టి భోగత్యాగము నిర్వాణముయొక్క ప్రధమ నియమమై యున్నది

**అహం జగదిదం భ్రాన్తిర్నాస్త్యేవ పరమే పదే ।**
**ఇదం శాన్తమనాలమ్బం సర్వం నిర్వాణమవ్యయమ్ ॥**

శుద్ధమగు పరమపదమున అహంభావము యొక్కగాని, జగత్తుయొక్క గాని, ఇచ్ఛాదులయొక్కగాని, భ్రాన్తి లేనేలేదు ఇదియంతయు సదా శాంతమై, నిరాధారమై, అవ్యయమై,నిర్వాణరూప మైనట్టి చిదాకాశమే అయియున్నది

**ఇచ్ఛామాత్రం హి సంసారో నిర్వాణం తదవేదనమ్ ।**
**ఇచ్ఛానుత్పాదనే యత్నః క్రియతాం కిం వృధా భ్రమైః ॥**

ఓ రామచంద్రా! ఇచ్ఛామాత్రమే సంసారము ఇచ్ఛయొక్క అభావమే నిర్వాణము కాబట్టి ఇచ్ఛ నుత్పన్నము గాకుండ జేయుటయందే ప్రయత్న మాచరింపుము తక్కిన వ్యర్థ ప్రయత్నములచే నేమిప్రయోజనము?

**పరం విషయవైతృష్ణ్యం వజ్రధ్యానం ప్రసాధ్యతామ్ ।**
**భేదే విగలితే జ్ఞానాదన్య ధ్యాన తృణేన కిమ్? ॥**

ఓ రామచంద్రా! సంపూర్ణమగు విషయ తృష్ణారాహిత్యమున్ను, జ్ఞానముచే సమస్తభేదము నశించుటయు, వజ్రమువలె దృఢమైనట్టి యుత్తమ ధ్యానమగును అట్టి ధ్యానమునే సంపాదింపవలెను తృణ సమానములగు ఇతర ధ్యానములచే నేమి ప్రయోజనము?

**ఉపాయ ఏకః శాస్త్రార్థో ద్వితీయో జ్ఞసమాగమః ।**
**ధ్యానం తృతీయం నిర్వాణే శ్రేష్ఠస్తత్రోత్తరోత్తరః ॥**

అట్టి బ్రహ్మమందు విశ్రాంతి నొందుటకై, అనగా నిర్వాణ ప్రాప్తికై మొదటి యుపాయము అధ్యాత్మ శాస్త్రార్థములను నిరంతర మభ్యసించుట, రెండవది విజ్ఞుల సహవాసము మూడవది ధ్యానము ఇందు ఉత్తరోత్తరముగా నొక దానికంటె నొకటి శ్రేష్ఠమై యొప్పుచున్నది

**చిత్రాగ్నినేవ బోధేన తేన జాడ్యం న శామ్యతి ।**
**నిర్మూలాపి జగద్భ్రాన్తిర్యేనాశు న విలీయతే ॥**

చిత్రమందలి యగ్నిచే శీతలము నివారింపబడనట్లు, పై పై జ్ఞానముచే మూలాజ్ఞాన మెన్నటికిని శమింపనేరదు మఱియు నట్టి ఆపాతజ్ఞానముచే జగద్భ్రాన్తి శీఘ్రముగ నిర్మూల మైనట్లు తోచినను వాస్తవముగా నిర్మూలము కానిదే యగును

**శ్రుతపార జపాన్తేషు సమాధి నిరతో భవేత్ ।**
**సమాధి విరతః శ్రాంతః శ్రుతపార జపాంశ్చరేత్ ।**

సాధకుండగువాడు వేదాంతశ్రవణము, ఉపనిషదాదుల పఠనము, ప్రణ

వాదుల జపము మున్నగునవి గావించిన పిదప సమాధి యందు తత్పరుండై యుండవలెను సమాధినుండి లేచిన పిదప, మరల యథావిధముగ శ్రవణపరన జపాదుల గావింపవలయును

**బోధాత్మైష ఉ న్తరాత్మైవ పరమః పరమేశ్వరః ।**
**అస్యైవ వాచకో నామ ప్రణవో వేదసమ్మతః ॥**

బోధరూపుడగు ఈ యంతరాత్మయే ఉత్తముడగు పరమేశ్వరుడై యున్నాడు వేదసమ్మతమగు ప్రణవమను నామమే యాతని వాచకమై యొప్పుచున్నది

**చిత్తం హి జీవన్ముక్తానాం నాస్త్యంకుర ఇవాత్మనామ్ ॥**

రాతి నుండి అంకురము కలుగనటుల జీవన్ముక్తులకు చిత్తవృత్తులు లేవు

**పునర్జననయోగ్యా యా వాసనా ఘనవాసనా ।**
**సా ప్రోక్తా చిత్తశబ్దేన న సాతద్‌జ్ఞస్య విద్యతే ।**

మరల మరల ఉత్పన్న మగునట్టి ఘనీభూతమగు వాసన యేది కలదో అదియే చిత్తశబ్దముచే చెప్పబడినది అయ్యది జ్ఞానికి లేదు

వేమన యోగీన్ద్రుడుగూడ నిర్వాణశబ్దమును ప్రయోగించి యున్నారు నిర్వాణమనియు, నిర్వికల్పసమాధియనియు, బ్రహ్మసాక్షాత్కార మనియు, నిర్విషయమనియు, నిర్వాసమనియు ఒకే యర్థము లోనే యుపయోగించి యున్నారు యోగవాసిష్ఠమున్ను ప్రయోగించినది చూడుడు

**అగమ్యా వచసాం శాన్తా సా సీమా భవభూమిషు ।**
**కైశ్చిత్సా శివమిత్యుక్తా కైశ్చిద్బ్రహ్మేత్యుదాహృతా ॥**

**కైశ్చిత్ప్రకృతిపుంభావ వివేక ఇతి భావితా ।**
**అన్యైరస్యన్యథా నానాభేదైరాత్మవికల్పితైః ॥**

సప్తజ్ఞాన భూమికల కెల్ల ఎల్లయై యొప్పు ప్రశాంతమగు ఈ యేడవ

భూమిక వాక్కులకు విషయము కానిదై యున్నది కొందఱు దానిని శివమ నియు, మఱికొందరు బ్రహ్మమనియు చెప్పుదురు ఇక కొందఱు ప్రకృతి పురుషుల యైక్యస్థితినిగూర్చిన వివేకమని భావింతురు అట్లే తక్కినవారును నిజకల్పితములగు వివిధ భేదములచే స్వర్గమని, వైకుంఠమని, కైలాసమని, నిర్వాణమని, నిర్వికల్పసమాధియని, శివజీవైక్యమని, మోక్షమని పలువిధములుగా పేర్కొనుచున్నారు

అతిసూక్ష్మదృష్టిలోనను
మతికింపుగ శివునిగూర్చి మఱియొకటైనన్
బ్రతిలేని మోక్ష మది యగు
సతతపు నిర్వాణపదవి సౌఖ్యము వేమా!

ఉన్న నిర్వాణ నిజచర్యగన్నవాడు
తన్ను తనలోన జూచెడి తత్త్వమెరిగి
సన్నుతించుచు బరమాత్మ సమతమతిని
గన్నుగానని వాడేమి గాంచువేమ!

ప్రణవ మెఱుగ నతడు భక్తుడు తాగాడు
జ్యోతి జూడ నతడు జోగి గాడు
నిత్య మెఱుగ నతడు నిర్వాణి కాడయా
విశ్వదాభిరామ వినుర వేమ!



# నిర్వికల్ప సమాధి స్వరూపము

ఈగ్రంథము కేవలము నిర్వాణపదమును గురించిన దగుటచే సారాత్ సారము, గుహ్యాద్గుహ్యము, గూఢాద్గూఢము మాత్రము ప్రతిపాదింపబడును కావున నిర్వికల్పసమాధియొక్క స్వరూపము మాత్రమే ఇచ్చోట నిర్ణీత మగును తక్కిన యమాదిధ్యానమున పరకుగల ఏడంగములున్ను ఇదివరలో

వ్రాయబడిన గ్రంథములలో తెలుపబడిన వగుటచే నిచ్చట నిరూపింపబడవు ఆ ఏడంగములు ఓంకారాది గ్రంథాలలో ముముక్షువులు చూచుకొనవచ్చును యథార్థముగా చెప్పిన నిర్వికల్పసమాధియు, బ్రహ్మసాక్షాత్కారజ్ఞానమున్ను ఒక్కటియే ఇవి రెండున్ను వస్త్రమునకు పడుగుపేకలవలె సంబంధపడి యుంటున్నవి ఒక్కదానిని విడిచి ఇంకొక్కటి శోభించుట లేదు దీపప్రకాశము వంటిది ఆ జ్ఞానమనియు, ఆ దీపమును సంరక్షించుటకు చిమ్ని యెటు వంటిదో, అట్టిదియే యోగమనియు గ్రహించుకొనవలయు దీపప్రకాశము రాత్రికాలమున గృహాన్తరాళములో గల తమస్సు తొలగుటకున్ను, వస్తువు లన్నియు లెస్సగా గోచరించుటకున్ను కారణ మగును అయితే చిమ్ని యొకటి లేనిచో గాలిచే దీపము చలించవచ్చును లేక ఆరిపోవచ్చును అయితే చిమ్ని మాత్రముండి దీపకాన్తి లేకపోయిన చీకటి తొలగదు, వస్తువున్ను కనుపించదు కావుననే యోగకర్తలున్ను, జ్ఞానకర్తలున్ను ఈలాగున వచించిరి

**యోగహీనం కథం జ్ఞానం మోక్షదం భవతీహ భోః ।**
**యోగోఽపి జ్ఞానహీనస్తు న క్షమో మోక్షకర్మణి ॥**
**తస్మాద్జ్ఞానం చ యోగం చ ముముక్షుర్దృఢమభ్యసేత్ ॥**

ఇదియొక మహాత్ముని దగ్గఱకు ఒక ముముక్షువు వెళ్ళి అడిగిన ప్రశ్నగా ఉన్నది ఓ ప్రభువా ! ఈ లోకమున అష్టాంగయోగానుష్ఠానము లేనివానికి మోక్షమును గలిగించెడు జ్ఞానమెటుల సిద్ధించును? ఆలాగున అధ్యాత్మజ్ఞానము లేనివానికి వట్టి యోగసాధన మాత్రముచే మోక్షమందు అనగా, ఆత్మజ్ఞాన మందు ఎటుల సమర్థత గలుగును? దీనికి సమాధానముగ ఆ ఋషి ఇటుల వచించెను ఓ సౌమ్యుడా! నీవు చెప్పిన రెండు కారణములవల్ల యోగసిద్ధి గాని గలుగవలసి యుండినచో, ముముక్షు వైనవాడు రెండింటిని తప్పక అభ్యసింపవ లయు అయితే ఆధ్యాత్మిక జ్ఞాన మొకటియే ముక్తిని గలుగజేయు నని శాస్త్ర నిర్ణయము అయితే అట్టి ఆత్మజ్ఞానము గలుగుటకున్ను, అది నిరావరణముగా ప్రకాశించుటకున్ను, ఇంద్రియములనుండి విలక్షణముగా వెలుగుటకున్ను కొంత యోగసాధన అందరికిని ఆవశ్యకము అంతియే

చాలును అణిమాది సిద్ధులకొఱకు చేయవలసిన కఠినసాధనములగు యోగములు అంత అవసరములు కావు ఇంతమాత్రము యోగానుష్ఠానము పరమ ఋషుల కందఱికిని కనుపడుచున్నది

వర్తమానయుగములో ఉండిన శ్రీ శంకర రామానుజ మధ్వాచార్యుల వారలకున్ను, శ్రీనారాయణగురు దయానంద రామకృష్ణ వివేకానంద రామతీర్థా దులకున్ను గలిగియున్నట్లు వారి చరిత్రము తెల్పుచున్నది ఇంద్రియముల నిరోధము గల్గి ద్వంద్వములను సహించి బ్రహ్మోస్మియను స్థితిలో నిలుచుటకు యోగానుష్ఠానము ఎంతయో సహాయపడును దీనికి యోగశాస్త్రములో చెప్పబడిన షట్క్రియలతో సంబంధము లేదు యమ నియమములు తప్పక అందఱికి నుండవలయును అవి ఆచరణమాత్రమును తెల్పుచుండును మరల ముఖ్యమగుకొన్ని సిద్ధాధ్యాసనాదులున్ను, కొంత ప్రాణాయామమున్ను ఉండిన చాలును బ్రహ్మచర్యము, తపస్సు, భగవద్భక్తి - అందఱికిన్ని సమానముగానే యుండవలయును దీనిపై ప్రత్యాహార ధారణ ధ్యానములు అభ్యసించిన, గాలిలేని ప్రదేశములో నిశ్చలముగా వెలుగుచుండు దీపమువలె స్వరూపసాక్షాత్కార జ్ఞానజ్యోతి వెలుగుచుండును బ్రహ్మసాక్షాత్కా రజ్ఞానమున్ను, నిర్వికల్పసమాధి యోగసిద్ధియున్ను ఒకటియే యని ఇదివరలో తెలుపఁబడినది అట్టి నిర్వికల్ప సమాధిని పొందిన వారికిని, బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గల్గినవారికిని మరల సంస్కారపు గుర్తులుగాని, విషయగుణము లుగాని, త్రిగుణములుగాని యుండునా? లేదా? అనువిషయమునే యీ గ్రంథము నిర్ణ యించబూనినది దీనియొక్క నిర్ణయము సామాన్యజనులకు తెలిసికొనుటకు తగిన గ్రంథములు స్వభాషలో లేనందుచే సందేహపడు చున్నారు

మీలో చాలామందిన్ని అగ్నిహోత్రమును చూచియున్నారు దానియందు హోత నవధాన్యములను నవవిధసమిధలను ఘృతముతో సహా హోమించును. అతడు ఏకాగ్రతతో అగ్నియొక్క సప్తజిహ్వలను కనిపెట్టి హోమించినయెడల ఆ ధాన్యములు, సమిధలు అన్నియు భస్మములైపోవును అట్లు అప్రమత్తుడై హవన

క్రియ జరుపకపోయిన, బహిర్దృష్టి గలవాడై చేసినయెడల నవవిధ ధాన్యములలో కొన్ని అగ్నిలో పడక అచ్చటచ్చట పడియుండిన, ఆభస్మమును పడవైచిన, వాన కురియునప్పుడు భస్మముకాని విత్తనము లన్నియు మొలకెత్తును బీజములు దహింపబడకుండుటకు ఇదియే దృష్టాంతము

ఆలాగున ఆత్మయజ్ఞమును గురించిగూడ ఋషులు తెల్పియున్నారు చిత్తనిరోధము గల్గి ధ్యేయాకారమగు జ్ఞేయవస్తువులలో నిలుకడ గల్గి యోగియైనను సరి లేక ఆత్మ జ్ఞానియైనను సరి వారికి మరల సంస్కారము లనియెడు బీజములుగాని, కర్మయనెడు కట్టెలుగాని భస్మములైపోవును అట్లు కానివారికి మరల సంస్కారములు, వాసనలు, గుణములు గల్గియుండును వేగని విత్తన ములు అంకురించునట్లు సంస్కారశేషము గలవారందఱికిని పునర్జన్మము గల్గుట నిక్కము ఈ సత్యమే ఇచ్చట తెలుపబడును

ఊర్ధ్వపూర్ణమధఃపూర్ణం మధ్యపూర్ణం శివాత్మకమ్ ।
సాక్షాద్విధిముఖో హ్యేష సమాధిః పారమార్థికః ॥

మీదను, క్రిందను, నడుమను, నిండియున్నట్టి సర్వపరిపూర్ణ బ్రహ్మాకారదశయే శాస్త్రసిద్ధమైన విధిరూప సమాధి యగును అంతయు విష్ణుమయమనిగాని, శివమయమనిగాని బ్రహ్మమయమని గాని చెప్పెడు దివ్యవాక్యములు దీనికి సంబంధించినవే ఇది భక్తియోగమునకును, ధ్యానయోగమునకును, జ్ఞానయోగమునకును సంబంధించిన పరమార్థ సత్యమని నమ్మదగినది నిష్కామకర్మ యోగము పైజెప్పిన మూడుయోగములలోను అంతర్భూతములు అత్తఱి తన యుపాస్య దైవస్వరూపమునకు అన్యముగా మఱియేమియు నుండగూడదు ఉండిన దృశ్య విలయము కాలేదు దృశ్యవిలయము కానిచో త్రిపుటి రహితము కాదు త్రిపుటిరహితము కానిచో దృక్ దృశ్య దర్శనములు గల్గియుండును అది పరిపూర్ణజ్ఞానము గాదు అపరిపూర్ణజ్ఞానమే యగును కావుననే ఈ శ్లోకమున 'ఊర్ధ్వపూర్ణమధః పూర్ణః మధ్యపూర్ణం శివాత్మకమ్'' అని ప్రయోగించిరి అనగా ఆదిమధ్యాన్తభేదము లేక, ఒకే శివస్వరూపముగా అనుభవము గలుగవలయును ఇట్టి అవస్థయే సాక్షాత్

వేదముఖమునుండి యేర్పడిన పరిపూర్ణ సమాధి యగును. అయితే ముముక్షువులకు, సాధకులకు, జిజ్ఞాసువులకు, అభ్యాసు లకు, భక్తులకు అన్ని గుణములు నశించి యుండవు అట్టి అర్థము అభ్యాసి, జిజ్ఞాసువు, ముముక్షువు, సాధకుడు అను శబ్దములలో వ్యక్తమగుచున్నది అట్టి స్థితిలో ఉండు అధికజనులున్ను, తమ్ములను జీవన్ముక్తుల మనియు, బ్రహ్మసాక్షాత్కారము పొందిన వారల మనియు, నిర్వికల్ప సమాధి సిద్ధించిన వారమనియు, విదేహముక్తుల మనియు తలంచుట చేతనే యీపొరబాట్లన్ని యు గలుగుచున్నవి దానికి కారణము గూడ గలదు అదేమన, వర్తమాన యుగములో నిర్వికల్పసమాధి పొందిన యోగిగాని, బ్రహ్మసాక్షాత్కారము గల్గిన ఆత్మజ్ఞానిగాని, పరమ ఏకాన్తభక్తిగల్గిన భక్తుడుగాని అరుదు అయినందుచేత, అట్టివారిని చూపెట్టి చెప్పుటకు మనకు లేకపోయెను ఒకవేళ ఒకరిద్దఱు ఉండినను, విస్తారముగా లేకపోవుటచేత మనకు సాక్షిగా నిరూపణము చేయుటకు అవకాశము లేకపోయెను

**ప్రశాంతవృత్తికం చిత్తం పరమానంద దీపకమ్ ।**

**అసంప్రజ్ఞాతనామాఽయం సమాధిర్యోగినాం ప్రియః ॥**

ఎప్పుడు మనస్సు ప్రశాంతమై, బ్రహ్మాకారవృత్తి గలదై ప్రకాశమై యుంటున్నదో అప్పుడు ఆ సమాధి యోగనిష్ఠులకు ప్రియమైన అసంప్రజ్ఞాత సమాధియను పేరుగలది యగుచున్నది దీని యందు "ప్రశాంతవృత్తికం చిత్తం" అని చెప్పుటచే ప్రకృతి వృత్తులు సంపూర్ణముగా నశించినవై శుద్ధమైనదని గ్రహించుకొనవలయును సమాధిలో నిర్వికల్పసమాధియనియు, సవికల్పసమాధియనియు, నిర్బీజసమాధి యనియు, సబీజసమాధి యనియు, సాలంబసమాధి యనియు, నిరాలంబ సమాధి యనియు - అని కొన్ని పేర్లు గలవు అవస్థలును గలవు ఇచ్చట నిర్వికల్ప నిర్బీజ నిరాలంబ సమాధులు మాత్రము గ్రహించబడినవి అదియే పరమకాష్ఠ, పునరావృత్తిరహితమగు కైవల్యము తక్కినవి పునర్జన్మమును గలుగజేయును అయినను ఉత్తమలోక ప్రాప్తియు, మరల ఉత్తమోత్తమ జన్మమున్ను వీరికి గల్గును

ధ్యాతృధ్యానే సంవిహాయ నివాతస్థిత దీపవత్ ।
ధ్యేయైకగోచరం చిత్తం సమాధిరభిధీయతే ॥

ధ్యానము, ధ్యాత యను వృత్తి లేక ధ్యేయమైన బ్రహ్మస్వరూప మొందిన చిత్తమే సమాధి భ్రమరకీటక న్యాయమున ధ్యానింపగా ధ్యాతయే ధ్యేయాకార మగు బ్రహ్మాకార మొందును అదియే సమాధి యనబడును

ఇచట శ్రవణ, మనన, నిదిధ్యాసములనుగూడ త్యజించి సాక్షాత్కారస్థితియే నిరూపింపబడినది బీజము అంకురించి వృక్షమగునటుల, ఆబీజమే వృక్షాకారముగా మారునటుల, నిదిధ్యాసనము సుస్థిర మగునప్పుడు బ్రహ్మాకారమై మారుచుండును అగుచో సమాధియనియు, వ్యుత్థాన మనియు చెప్పునదంతయు సామాన్యబుద్ధిగల వారికి గ్రహణకొఱకు అని తెలిసికొన వలయును అట్లు కానిచో సామాన్యజనులు అనుష్ఠింప జాలరు బుద్ధికిని భ్రమ గలుగును నిజముగా చెప్పిన ఆత్మయందు ధారణధ్యాన సమాధులుగాని, వ్యుత్థానముగాని లేదు అవన్నియు అంతఃకరణముయొక్కయు, మనస్సుయొక్కయు, బుద్ధియొక్కయు సంకోచ వికాసములేగాని, (హృదయముయొక్క ధర్మముగాని) ఆత్మధర్మము గాదు ఆత్మ యెల్లప్పుడును స్వప్రకాశమై, నిరావరణమై, జననమరణ ధర్మములు లేనిదై, సనాతనమై, స్వయంజ్ఞాన స్వరూపమై యుంటున్నదే యగును చిన్నపిల్లవారికి ఏదైన ఒక లెక్కను గుణింపమని చెప్పునప్పుడు వ్రేళ్ళచే లెక్క పెట్టించునటుల, మనోబుద్ధీంద్రియముల కతీతమై వెలుగుచుండు ఆత్మను బోధించునప్పుడు సామాన్యజనులకు అగ్రాహ్యమగుటచే మనస్సు శుద్ధమగుటకున్ను, ఏకాగ్రత గల్గుటకున్ను ఈ ధర్మము లన్నిటిని శాస్త్రము తెలుపుచున్నది. కావుననే ఈలాటిస్థలములలో మోక్షోపాయమని వచించుట

ఉపాయమనగా నేరులో గ్రహింప శక్తిలేని వారికి మఱియొక ప్రకారముగా చెప్పుట యని అర్థము అదెట్టిది అనగా, చిన్నపిల్లవారలకు విషజ్వరమువచ్చినప్పుడు చేదుమాత్రను ఇవ్వవలసి వచ్చిన బెల్లములోపల ఔషధమునుపెట్టి మందుపేరు చెప్పక బెల్లము పేరు చెప్పేలాగున ఉండును

అట్లుగాక ఇది విషజ్వరము అదిగో చేదుమాత్ర, దీనిని భుజించిన రోగశాంతి గలుగునని చెపితిచో ఆ బాలుడు భుజించునా? శాస్త్రములలో ఈలాంటి ధర్మములు కొన్ని అంగీకరింపబడియున్నవి దీనికి గుడౌషధన్యాయమని పేరు

**నైతజ్జాగ్రన్నచైవ స్వప్నంసంకల్పా నామభావనాత్ ।**
**సుషుప్తిభావో నాప్యేతదభావాజ్జడతాస్థితేః ॥**

బ్రహ్మాకారముగా మనస్సు పరిణమించుటచే, నితర సంకల్పములు లేకయుండుటచే సమాధి స్వప్నావస్థ కాదు దృశ్యము స్ఫురింపనందుచేత జాగ్రదవస్థగాదు సుషుప్తియగు జడత్వము కానందుచేత నిద్రావస్థ గాదు కేవలతురీయమై జాగ్రత్స్వప్న సుషుప్తి మూర్ఛాద్యవస్థలకు విలక్షణమై యున్నది

**సత్త్వావబోధ ఏవాసౌ వాసనాతృణపావకః ।**
**ప్రోక్తస్సమాధిశబ్దే న నతు తూష్ణీమవస్థితిః ॥**

అసత్యములైన జగత్పరేశ్వరాదిభేదమును నిరసించి సత్యమైన బ్రహ్మజ్ఞానము నెఱుంగుట సత్త్వావబోధము సత్త్వమనగా సద్ధర్మము తానే బ్రహ్మయని, యితర మెద్దియు లేదని యెఱుగుట యనెడు నీ సత్త్వావ బోధము సమాది, యగును

ఇది సమస్తవాసనలనెడు తృణములకు ప్రజ్వలితమైన అగ్నివంటిదగుట చేత వాసనలును నశింపజేయును జాగ్రత్స్వప్న సుషుప్తులును, ఆలస్యము మొదలయిన వానివలన నూరక యుండుటయును సమాధి కాదు శరీరమును మఱచుటయు సమాధికాదు కర్తృత్వాద్యభిమానము లేక తానే బ్రహ్మమని నిశ్చయించుట సమాధి కొన్ని రోగములచే నేమియును తెలియకపోవుట సమాధి కాదు ఇంద్రియ నిరోధముచే వృత్తు లడంగి యుండుటయు సమాధి కాదు కావుననే "సత్త్వావబోదాఏవాసౌ వాసనా తృణపావకః" అని మూలములో ప్రయోగించిరి ఆత్మతత్త్వావబోధము గలిగియుండుట సమాధియనియు, అది వృత్తులు, సంస్కారములు, వాసనలు అనెడి శుష్కతృణములకు, శుష్కపత్రములకు నూడ్చి కుప్పవేసిన కుప్పలకు, మహాప్రజ్జ్వలించెడు అగ్నియని వర్ణించుటకు

హేతువైనది అందువల్ల వృత్తులు, గుణములు, సంస్కారములు, సమాధినిష్ఠ గల, బ్రహ్మసాక్షాత్కారముగల మహాత్ముల యెడ ఉండవని తెలిసికొన వలయును వసంతకాల మధ్యాహ్న ప్రకాశ సూర్యుని చీకటి యేలాగున ఆవరింపజాలదో, ఆలాగున హృదయాకాశమున నిరావరణ ఆత్మ ప్రబోధ భాస్కరుడు ఉదయించి యుండు ఋషివంటి వారలను ప్రకృతి ఆవరింప జాలదు

**బహువ్యాకులచిత్తానాం విచారే తత్త్వధీర్నహి ।**
**యోగో ముఖ్య స్తతస్తేషాం ధీదర్పస్తేన నశ్యతి ॥**

అనేక విషయములలో చంచల స్వభావము గలవారికి మహావాక్య విచారణ యందు బుద్ధికి ప్రవేశము గలుగదు వీరికి యోగసాధన ముఖ్యము దానిచే మనోబుద్ధ్యాదుల చలనము నశించును ఇదియే యోగశాస్త్రముయొక్క రహస్యము

**స్వానుభూతిరసావేశాద్దృశ్యశబ్దానపేక్షితః ।**
**నిర్వికల్ప సమాధిస్స్యాన్నివాతస్థిత దీపవత్ ॥**

స్వానుభవమయిన యానందముతో గూడినదియును, దృశ్యము శబ్దము అను రెండు (సవికల్ప) సమాధులను అపేక్షింపనిదియును, గాలి లేని స్థలమందుంచిన దీపమువలె నిశ్చలమైనదియును అయినట్టి ఆత్మస్వరూప స్థితియందే నిలుకడ గలిగి యుండుటయే నిర్వికల్పసమాధి యగును

**యత్సమత్వం తయోరత్ర జీవాత్మ పరమాత్మనోః ।**
**సమస్త నష్టసంకల్పః సమాధిరభిధీయతే ॥**

ఎప్పుడు జీవాత్మపరమాత్మలకు ఐక్యము (సమత్వము) కలుగుచున్నదో, అప్పుడు సకలసంకల్పములును నశించిపోవుచున్నవి అట్టి జీవాత్మపరమాత్మల ఐక్యమే సమాధియని చెప్పబడుచున్నది ఇచ్చట జీవాత్మపరమాత్మలు ఐక్యమని, యోగశాస్త్రరీతిగా పరమాత్మయందు జీవాత్మ కల్పితమని తెలిసికొ నుటయే ఐక్యశబ్దార్థమని జ్ఞానశాస్త్రరీతిగాను తెలిసికొనవలయును

**సలిలే సైంధవం యద్వత్ సామ్యం భవతి యోగతః ।**
**తథాఽఽత్మ మనసోరైక్యం సమాధిరభిధీయతే ॥**

ఏ ప్రకారముగా నీటియందు ఉప్పు కరిగి (జలమయమై) సామ్యము నొందిన దగుచున్నదో, అట్లు మనస్సున్ను ఆత్మలో లీనమై ఆత్మమయమై యుండుట సమాధియని చెప్పబడుచున్నది ఇచ్చట మనోలయము యోగశాస్త్రానుసారముగను, ఆత్మవిచారణచే వృత్తులు, సంస్కారములు నశించు నప్పుడు మనస్సనునది మరియొకటి లేదని అనుభవము గలుగుటయే జ్ఞానశాస్త్రానుసారముగను గ్రహించుకొనవలయును అయితే మనస్సు లేనిచో ఆత్మజ్ఞానులు ఎట్లు వ్యవహారమును జరుపగలరని సందేహింప నవసరము లేదు వారి మనస్సు వృత్తిరహితమై దగ్ధపటన్యాయముగా నుండును అట్టి చిత్తమునకు చిత్తమని పేరులేదు సత్త్వమనియే వ్యవహరింతురు యోగవాసిష్ఠమున దీనిని విస్తారముగా కనందగును ఇప్పుడు శ్రీభగవద్గీతలో చెప్పిన విషయమును తెలిపెద దీనిచే బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గలవారికి కర్మలుగాని, సంస్కారములు గాని యుండవని మీరు తెలిసికొనగలరు

**యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున! ।**
**జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥**

ఓ యర్జునుడా! లెస్సగా మండుచున్న యగ్ని కట్టెలను ఏలాగున సంపూర్ణముగా భస్మము చేయునో, అలాగుననే జ్ఞానమనెడి యగ్ని సర్వకర్మలను సంపూర్ణముగా భస్మము చేయును

దీనివల్ల జ్ఞానాగ్ని ప్రజ్వలించిన సర్వకర్మలు, సంస్కారములు, వాసనలు భస్మము లగునని గోచరించుచున్నది

**యథా వహ్నిర్మహాదీప్తశ్శుష్కమార్ద్రం చ నిర్దహేత్ ।**
**తథా శుభాశుభం కర్మ జ్ఞానాగ్నిర్దహతి క్షణాత్ ।**

ఏలాగున గొప్పగా వెలుగుచుండు అగ్నిహోత్రుడు ఎండినట్టియు, ఎండనట్టియు కట్టెలను దహింప జేయుచున్నాడో, ఆలాగున జ్ఞానాగ్ని ప్రజ్వలించిన

శుభాశుభ కర్మ లన్నిటిని త్వరలోనే భస్మ మొనర్చును

**యధా భర్జితబీజస్య ప్రరోహిత్వం వినశ్యతి ।**
**తథాఽఽత్మజ్ఞానినో నిత్యం జగద్బుద్ధిర్విలీయతే ॥**

ఏలాగున వేయించబడిన విత్తనముయొక్క అంకురము నశించియుండునో, అలాగున ఆత్మజ్ఞాన ముదయించిన జ్ఞానియొక్క దృశ్యగుణములు నశించియుండును అదియే జ్ఞానము గలిగినందులకు గుఱుతు

**అగ్ని సంగాద్యధా లోహమగ్నిత్వమధిగచ్ఛతి ।**
**ఆత్మసఙ్గాత్తథా గచ్ఛత్యాత్మతామింద్రియాదికమ్॥**

కొలిమిలోపెట్టి ఊదుచున్న లోహము లన్నియు నేలాగున అగ్నిమయములైపోవునో, అలాగున ఆత్మజ్ఞానాగ్ని ప్రజ్వలించిన మహాత్ముని మనస్సు, బుద్ధి మొదలగు ఇంద్రియము లన్నియు ఆత్మమయములైయుండును కావుననే ఆత్మజ్ఞానుల ఇంద్రియములుగూడ ఆత్మమయములై యుండునని చెప్పెడు రహస్యము

**బీజాన్యగ్న్యుపదగ్ధాని న రోహన్తి యధా పునః ।**
**జ్ఞానదగ్ధ్వైస్తథా క్లేశైర్నాత్మా సంబధ్యతే పునః ॥**

అగ్నియందు దహించబడిన బీజములు మరల ఏలాగున మొలకలెత్తవో, ఆలాగున జ్ఞానాగ్నియందు దగ్ధమైన హృదయములో కర్మక్లేశము లన్నియు నశించియుండును ఇదియే జ్ఞానముదయించిన దానికి గుర్తు

**యధా పర్వతమాదీప్తం నాశ్రయన్తి మృగద్విజాః ।**
**తద్వద్బ్రహ్మవిదో దోషా నాశ్రయన్తి కదాచన ॥**

ఏలాగున కాలుచున్న పర్వతమును మృగములుగాని, పక్షులుగాని చేరవో, ఆలాగున బ్రహ్మాత్మజ్ఞానము వెలుగుచుండు మహనీయాత్ముని ప్రాకృతగుణములు జేరవు కొండలు కాలునప్పుడు దానిలో గల మృగపక్ష్యాదులు పారిపోవుటయేగాక ఇతరములున్ను ఎట్లు చేరవో, అచ్చోప్పున

జ్ఞానాగ్ని రగులుచున్న హృదయములో ఇది వరకు ఆశ్రయించి యుండు ప్రాకృతగుణములు నశించునవేగాక క్రొత్తగుణములున్ను చేరవు

అగ్నావపధ్వ ృతం సర్వమగ్నిరేవ భవేద్యథా ।
విదితం విదితం వేద్యం సంవిదేవ భవేత్తథా ॥

కర్పూరో దీపసంసర్గాద్దీప ఏవ భవేద్యథా ।
వేద్యవేదన సంసర్గాత్సంవిదేవ భవేత్తథా ॥

సంవిదితం సంవిదితం సవిన్మయమేవ భవతి సంవేద్యమ్ ।
ఆగ్నావాహిత మాహిత మగ్నిమయం కిం న జాయతే కాష్ఠమ్ ॥

అగ్నియందు హోమము చేయబడిన నేయి యంతయు నెట్లగ్నియే యగునో, అట్లు తెలియదగిన స్వస్వరూప జ్ఞానానుభవము గలుగగా గలుగగా జ్ఞానస్వరూపియగు బ్రహ్మత్వమునే పొందును కర్పూరము దీపపు సంబంధము వలన నెట్లు దీపమగునో, అట్లే తెలియదగిన బ్రహ్మస్వరూప జ్ఞానానుభవము వలన జ్ఞానస్వరూపియగు బ్రహ్మత్వమునే పొందును

అగ్నియందు కట్టెలను వేసి కొంతసేపుంచిన నెట్లు క్రమముగా నవి యగ్ని యగునో, అట్లు స్వస్వరూపమును గురూపదేశ ప్రకారము భావింప భావింప జ్ఞానస్వరూపియగు తానే బ్రహ్మము (తాను) అగును

బ్రహ్మనిష్ఠులారా! దీనికన్న ఇంక పరమప్రమాణము మీ కేది కావలయును? హోమగుండము మండకయుండిన మాత్రము గదా నవ ధాన్యాదులు బూడిదగాక యుండును? ఆలాగున హృదయవేదిక యందు బ్రహ్మజ్ఞానాగ్ని వెలుగనివారి హృదయమున ప్రకృతి గుణములు ఉండునని యిప్పుడైనా మీరు ఏల తెలిసికొనగూడదు?

సంసారజసుఖాసక్తం బ్రహ్మజ్ఞోఽస్మీతి వాదినమ్ ।
కర్మబ్రహోభయభ్రష్టం తం త్యజేదన్త్యజం యధా ॥

సంసారసంబంధ విషయ సుఖములతో కూడినవాడై యుండి ఎవడైతే

నేను బ్రహ్మజ్ఞుడనని వచించునో అట్టివానిని కర్మమందును, బ్రహ్మమందును భ్రష్టునిగా తలంచవలయును అట్టివానిని యజ్ఞకార్యములలో అన్త్యజునివలె త్యజించవలయును కర్మకాండశాస్త్రమును అనుసరించక పోవుటవలనను, జ్ఞానశాస్త్రములో చెప్పినట్లు ఆచరింపక పోవుటచేతను కర్మబ్రహ్మోభయ భ్రష్టుడని అట్టి వానిని గుఱించి శాస్త్రము తెలుపుచున్నది

**అకృత్వా వృత్తివిలయమజ్ఞాత్వా బ్రహ్మ కేవలమ్ ।**
**అహం బ్రహ్మేతి యో బ్రూతే తస్య జిహ్వాం వికర్తయేత్ ॥**

అన్తఃకరణములో వృత్తులన్నింటిని విలయము నొందించకయు, సాక్షాద్బ్రహ్మమును అనుభవము చేసికొనకయు ఎవడైతే నేను బ్రహ్మమయితి నని చెప్పునో, అట్టివాని జిహ్వాచ్ఛేదనమును చేయవలయునని శ్రీశంకరాచార్యులు వచించిరి

**ఆత్మా క్షేత్రజ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।**
**తైరేవ తు వినిర్ముక్తః పరమాత్మేత్యుదాహృతః ।**

జీవాత్మయనియు, క్షేత్రజ్ఞుడనియు, సాక్షి యనియు, ప్రకృతి సంబంధ త్రిగుణములతో కూడ నుండునంతవరకు మాత్రమే చెప్పబడును పాకృతములగు త్రిగుణముల నుండి విముక్తిని పొందినప్పుడు పరమాత్మయని వ్యవహరింప బడును ఇదియే జీవాత్మ పరమాత్మలకు గల భేదమని విజ్ఞులు తెలిసికొనవలయును

**త్రిషు ధామసు యత్తుల్యం సామాన్యం వేత్తి నిశ్చితః ।**
**స పూజ్యస్సర్వభూతానాం వన్ద్యశ్చైష మహామునిః ॥**

జాగ్రత్స్వప్న సుషుప్తులనెడు మూడవస్థలకు సాక్షిసమానముగా నే ఆత్మగలదో, దానిని నిశ్చయముగా నెఱింగిన వాడెవడో, ఆ మహాత్ముడు సర్వులకును పూజ్యుడు, సర్వప్రాణులలోను అతడధికుడు, అతడందఱిచేతను వంద్యుడు, అతడే మహామునియు అని తెలియందగినది

**బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః శూద్రశ్చండాల ఏవ చ ।**

**దృఢాభ్యాసకరో నిత్యం పునర్జన్మ న విన్దతి ॥**

బ్రాహ్మణుడైనను, క్షత్రియుడైనను, వైశ్యుడైనను, శూద్రుడైనను, అంత్యజుడైనను బ్రహ్మాభ్యాసమునందు దృఢత్వము గల్గియుండిన అతడు ముక్తుడే అతనికి పునర్జన్మము లేదు

**ఉత్పన్నాత్మావబోధస్య అద్వేష్టృత్వాదయో గుణాః ।**
**అయత్నతో భవన్త్యస్య న తు సాధనరూపిణః ॥**

ఎవనికైతే ఆత్మజ్ఞానోదయము గలుగునో, అట్టి పుణ్యాత్మునకు భగవద్గీత పండ్రెండవ అధ్యాయమున చెప్పిన పరమభక్తులకు గలుగు అద్వేష్టృత్వాది గుణము లన్నియు యత్నము లేకనే సంభవించును ప్రత్యేకముగా వాడు దానికొఱకు ఏసాధనము చేయనవసరము లేదు అనగా సాధకునకు అనుష్ఠానరూపముగాను, ముక్తాత్మునకు అవి స్వయముగాను నుండునని భావము కావున తమను ఎవరు ముక్తులని తలంచుచున్నారో వారు అద్వేష్టృత్వాది గుణములు సంపూర్ణముగా గలిగియుందురని భావము దీనిని గీతలో 12-వ అధ్యాయములో కాననగును

**అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢం భవేత్ ।**
**శమాది సహితస్తావదభ్యసేచ్ఛ్రవణాదికమ్ ॥**

మహావాక్యార్థబోధము సుదృఢముగా ఎంతవరకు గలుగలేదో, అంత వఱకు శమదమాదులతో కూడినవాడై శ్రవణ, మనన, నిదిధ్యాసములను తప్పక చేయవలయును గురుముఖము నుండి శ్రవణము చేయబడిన అహంబ్రహ్మేతి మహావాక్యార్థము యొక్క దృఢత్వము గలుగువరకు శమాదు లతోగూడిన యభ్యాసము చేయవలయును రోగియగువాడు సంపూర్ణారో గ్యము గలుగువరకు ఉత్తమ పథ్యముతో ఔషధసేవను చేయవలయును గదా.

సమాధినిగుఱించి శ్రీ పతఞ్జలిమహర్షి నిర్ణయమును నిరూపించెద

**సూ: త దేవార్థమాత్రానిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః ॥**

ధ్యానము నిరన్తరాభ్యాసవశమున ధ్యేయాకారముగ పరిణమించి తన ధ్యానరూపమును తోపనీయక, నీటిలో బడిన లవణము నీరుగా పరిణమించి లవణాకారమును గనుపఱపని చందమున నుండునేని, యట్టి యవస్థయే సమాధి యనబడును

కాని ధ్యానమునందు ధ్యాతృధ్యానధ్యేయములు గలిసిన త్రిపుటి భాసించును సమాధియందన్ననో, ధ్యేయముమాత్రము భాసించును ఇంతమాత్రమే ధ్యానసమాధులకు భేదము

ఇది బీజము వృక్షమై పరిణమించునప్పుడు బీజము శూన్య మగునట్లు ఉండును ఈవిషయమై కొన్ని సంప్రదాయస్థులు ఎఱుక నశించవలయుననియు, అదియే పరిపూర్ణమనియు వచింతురు దీనినే కొందరు ఆఖరున శూన్యమే మిగులుచున్నదనియు, అదియే నిర్వాణమనియు నుడువుదురు ఇచ్చట అన్తఃకరణ ప్రతిబింబ చిదాభాసుని శూన్యత్వమే శూన్యశబ్దమునకు అర్థమని గ్రహించుకొనవలయును కావుననే ఇదివరలో తెలిసిన మూల సూత్రములో

**ధ్యాతృధ్యానే సంవిహాయ నివాతస్థిత దీపవత్ ।**
**ధ్యేయైకగోచరం చిత్తం సమాధిరభిధీయతే ॥**

అని వర్ణించడమైనది కావుననే సూతసంహితయందు సనకాది ఋషులకు మహేశ్వరుండిటుల ఉపదేశించినది

**సమాధి నిర్ధూత మలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్ ।**
**నశక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదన్తఃకరణేన గృహ్యతే ॥**

సమాధిచేత చక్కగా శుద్ధము చేయబడినదియును, ఆత్మయందుంచబడినదియును అగు మనస్సునకు నే బ్రహ్మసుఖము గలుగుచున్నదో దానిని వాక్కుచే చెప్పుటకు సాధ్యము గాదు. అనుభవముచేతనే గ్రహింపనగును

**అర్థమాత్రం తు యద్గ్రాహ్యం చిత్తమాదాయ పార్థివ! ।**

**అర్థస్వరూపవద్భాతి సమాధిస్సో౽భిధీయతే ॥**

చిత్తమును సమాధానపరచుకొని ప్రణవార్థ పరబ్రహ్మమును మాత్రము గ్రహించునదై, ప్రణవార్థస్వరూపమై ప్రకాశించెడు స్థితి యేది గలదో, అదియే సమాధి యనబడును

**త్రయ మేకత్ర సంయమః ॥**

ఏక విషయకమగు ధారణాధ్యానసమాధులు మూడును కలసి యోగ శాస్త్ర పరిభాషచే సంయమమని వ్యవహరింపబడును అనగా నేవిషయమున ధారణ మొనర్పబడునో యావిషయముననే ధ్యానమును, సమాధియు గలిగెనేని సంయమము అగునుగాని, యొక విషయమున ధారణయును, తదన్యవిష యమున ధ్యానమును, మరొక విషయమున సమాధియు గలిగెనేని యీత్రయము సంయమ మనబడదు

**తజ్జయాత్ప్రజ్ఞాలోకః ॥**

సంయమము నభ్యసించుచు నందు దార్ఢ్యమును సంపాదించిన యోగికి సంయమము దృఢతను నొందుకొలదియు సమాధిప్రజ్ఞ యంతకంత కు విశదమగుచుండును అనగా నతిసూక్ష్మ వ్యవహితాద్యర్థములకు పరప్రత్యక్షీ కరణ సామర్థ్యము వృద్ధి జెందుచుండును అనగా ఏ వస్తువు గూడ అడ్డులేక గోచరమగును

**వివేకవిశదం చేతః సత్త్వమిత్యభిధీయతే ।**
**భూయః ఫలతి నో మోహం దగ్ధబీజమివాఙ్కురమ్ ॥**

వివేకజ్ఞానోదయమైన చిత్తము సత్త్వమనుబడుచున్నది దగ్ధబీజమున అంకురము జన్మింపజాలనట్లు అందు మరలమోహము వాసనలు, ప్రకృతి గుణములు ఉద్భవింపజాలవు

**ప్రాప్తప్రాప్యో భవాన్నామ సత్త్వభావముపాగతమ్ ।**
**చిత్తం జ్ఞానాగ్నినా దగ్ధం న భూయః పరిరోహతి ।**

జ్ఞానాగ్నిచే దగ్ధమై సత్త్వభావమునంది కృతకృత్యత నందిన చిత్తమున మరల ప్రాకృతగుణము లావిర్భవింపవు చిత్తమే నశించిన మరల వృత్తులెటుల జన్మించును? వృక్షమే కాలిపోయిన మరల దానియందు ఫల పల్లవ పుష్ప లతాదు లెట్లు అంకురించును?



## ఆత్మ దేహత్రయసాక్షి

దేహత్రయమునకు ఆత్మ సాక్షి యను విషయమై పరిపూర్ణబోధకులలో కొందఱు, అచలమార్గోపదేశకులలో మఱికొందఱున్ను ఆలాగున ప్రశ్నింతురు- అదేమనగా దేహత్రయమునకు ఆత్మ సాక్షియైన జాగ్రదవస్థవలె స్వప్నములోను, సుషుప్తిలోను సాక్షిగా ఉండవలసినది గదా! అలాగున మీకు స్వప్నములోను, సుషుప్తిలోను సాక్షిత్వ ముంటున్నదా?

ఈ విషయమై స్వప్నావస్థలో గల మనోవృత్తులకున్ను, సుషుప్తిలో ఏమియు తెలియనట్టి యవస్థకున్ను బాగుగ సుఖముగా నిద్రించితినను అనుభవ ముండుటచే అప్పుడు గూడ సాక్షిగా ఆత్మ యుంటున్నదని శాస్త్రము తెలుపుచున్నది నిజముగా అయ్యదియే సత్యము అంతమాత్రము వారికి తెల్పిన చాలును

ఐనచో ఈ సాక్షిత్వము మీకు జాగ్రదవస్థలోనికి వచ్చిన తర్వాత గదా చెప్పగల్గుచు ఉన్నదనియు, సుషుప్తిలో ఉండునప్పుడుగాని, స్వప్నస్థితిలో ఉన్నప్పుడుగాని మీకు తెలియదు గదాయని వారు ప్రశ్నింతురు అప్పుడు వారికి సమాధానమును వచించుట కొంత కష్టము ఈలాటి ప్రశ్న ఎవరిపై వేయుదురు అనగా మంచి అనుష్ఠానము, తపస్సును, కరుణయున్ను, శాంతియున్ను, బ్రహ్మనిష్ఠయున్ను గలవారిపైననే వేయుదురు దీనికి సరియగు సమాధానమును చెప్పనిచో మీకు విచారణ జ్ఞానము లేదు,ఏదో మూఢ విశ్వాసము గల్గి తపస్సనియు, ధ్యానమనియు చెప్పుచు కాలము గడుపుచున్న వారలని హేళనగా మాట్లాడుదురు వారిని గురించి విచారించిన ఏలాటి

ఆచరణము ఉండదు మాటలు మాత్రము బాగుగా నేర్చికొని యుందురు అంతియేగాని బ్రహ్మనిష్ఠులకు సంబంధించిన బ్రహ్మచర్యము గాని, విరక్తిగాని, భూతదయగాని వారలలో చాలామందికి ఉండదు కావుననే యీ ప్రశ్నలను వేయుచుందురు ఆమాటలను విని బ్రహ్మనిష్ఠులు, పరమభక్తులు సంశయింప నక్కఱలేదు

సుషుప్త్యవస్థలో మనస్సు మొదలగు ఇంద్రియములు మూలప్రకృతి యందు లీనమై యుండుటచే అప్పుడు ఆత్మ సాక్షియై యుండియు చెప్పుటకు సాధ్యము గాకపోయినదేగాని సాక్షియగు ఆత్మ తెలిసికొనక పోవుటచేత గాదు అలాగున స్వప్నావస్థలో మనస్సున్ను, ఇంద్రియములున్ను స్వవశములో లేనందుచే, అత్తఱి స్వప్నవృత్తాంతమును చెప్ప సాధ్యము కాకపోయినదే కాని సాక్షిత్వము లేకపోవుటచే చెప్పకపోవుట కాదు జాగ్రదవస్థలోను, తురీయావస్థ లోను ఇంద్రియమనస్సులు స్వాధీనములై యుండుట వల్ల అత్తఱి జరుగు చుండు వృత్తాన్తములు చెప్పుటకు సాధ్యము లగుచున్నవి

పైచెప్పిన విధముగ ప్రశ్నించువారిని ఇట్లడుగవలయు జాగ్రదవస్థ స్థితి ఎట్టిది? ఆలాగున సుషుప్తితురీయముల స్థితులు ఎటువంటివి? వాని ధర్మము లెట్టివి? ఈ విషయమై శాస్త్రమేమి చెప్పుచున్నది? అని అడిగిన చాలును అప్పుడు మూడవస్థల లక్షణములు ఇట్లుండగా, సాక్షిత్వమునకు హాని యేమి? అట్లుగాక మూడవస్థలలో గల స్థితిని మూడవస్థలలోను తెలిసి చెప్పవలసి యుండిన జాగ్రత్స్వప్నసుషుప్తులని వ్యవహారమెట్లు చెప్పవచ్చును? ఆయవస్థ జాగ్రదవస్థయని చెప్పవలసినదేగాక స్వప్నసుషుప్తులని చెప్పరాదు అదియును గాక వారితో మీరు నిద్రించినప్పుడు మీ దగ్గఱకు నేను వచ్చి మీతో కొన్నిమాటలు చెప్పెద మీ సమీప మందుండు కొన్ని వస్తువులను ఎత్తుకొని వెళ్లెద అత్తఱి మీరు జాగ్రదవస్థలలోవలె తెలిసికొనిన మీకు స్వప్నసుషు ప్త్యవస్థలు లేవని నిర్ణయించుకొనవచ్చును దీనికి ఒడంబడిన వారివాక్యములు సత్యముల నిర్ణయించుకొనవచ్చును అట్లుగానిచో వారివాక్యము లసత్యములు పవిత్రాత్ములగు భక్తులను, సాధువులను భ్రమపరచుటకు చెప్పెడు వాక్యము

లని గ్రహించుకొనవలయును

అదియున్నుగాక వారిలో కొందఱు పవిత్రాత్ములై బ్రహ్మనిష్ఠులగు పుణ్యాత్ములను తమకు శిష్యులనుగా చేసికొనుటకున్ను ఈలాగున భ్రమను కలిగింతురు స్వప్నసుషుప్తుల స్థితి యెట్టిదనగా కొందఱికి హృదయ స్తంభనమగు వ్యాధి గలదు లేక స్వల్పమూర్ఛా రోగమున్ను గలదు ఎవరైనను పలుకరించిన మాటలు చెప్పుటకు నోరు స్వాధీనములో ఉండదు చేతితో సంజ్ఞ చూపుటకు తలంపు గలిగినను కరములు స్వాధీనములో ఉండవు కన్ను తెరచి చూచుచుండినను ఇంద్రియములు స్వాధీనములో లేనిచో ఏమియు చేయజాలరు కొంతసేపు పోయిన తర్వాత ఇంద్రియముల స్వాధీనములోనికి వచ్చినప్పుడు మూర్ఛావస్థలో గల్గిన సంగతు లన్నియు స్పష్టముగా వచింతురు మూర్ఛావస్థలో అన్నియును నాకు తెలుసును కాని ఇంద్రియములు అస్వాధీనము లగుటచే నేమియు చెప్పజాల నయితినని వచింతురు స్వప్నసుషుప్తుల స్థితియు ఇటువంటిదే

మఱియు ఈ విషయమై వేదాంతశాస్త్రములో నొక గాధ గలదు అదేమన, ఒక నారీమణి నూతినుండి నీరు చేదుకొనునప్పుడు శిరస్సు వంచి యుండుటచే కంఠములోగల స్వర్ణహార మొకటి బావిలో పడిపోయెను అది చాలా లోతుగల నుయ్యిగా ఉండెను వెంటనే నీటిలో మునిగెడు స్వభావము గల పల్లెవానిని ఒకనిని పిలిచి బావిలో పడిపోయిన ఆభరణములను తెచ్చియిచ్చిన మంచి బహుమానమని చెప్పుటచే అతడు వెంటనే ఆ నూతిలో దిగి అడుగున వెతుకునప్పుడు ఆభరణము దొరికెను సంతోషమును పట్టజాలక అతడు వెంటనే పై నుండు వారికి తెలుపదలంచినను జలాగాధ భాగమున నోరాడపోవుటవల్ల పైకి వచ్చిన తర్వాత చెప్పినట్లు, స్వప్నసుషుప్తుల స్థితి గ్రహించుకొనవయును అంతియేకాని అవస్థాత్రయమునకు సాక్షిత్వము లేక పోవుటచే స్వప్నసుషుప్తులలో చెప్పకపోవుట లేదు ఇదియే దీనిలో గల రహస్యము శ్రుతియు ఈలాగుననే తెల్పుచున్నది

జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।

**తద్బ్రహ్మ ఉహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥**

జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలకు, సాక్షియై యేఆత్మ ప్రకాశింప జేయుచున్నాడో, ఆ ఆత్మయే బ్రహ్మమనియు, తన నిజస్వరూపమనియు తెలిసికొనిన నాడు సర్వబంధములనుండి విముక్తు డగుచున్నాడు ఆత్మబోధ మనుస్మృతి యు ఈ లాగున వచించుచున్నది

**దేహేంద్రియమనో బుద్ధి ప్రకృతిభ్యో విలక్షణమ్ ।**
**తద్వృత్తిసాక్షిణం విద్యాదాత్మానం రాజవత్సదా ॥**

శరీరేంద్రియ మనోబుద్ధి ప్రకృతులకంటె వేఱయిన మనోబుద్ధి చిత్తాహంకార రూపమయిన అంతఃకరణ వృత్తులకు సంబంధింపక చూచుచుండు ఆత్మను, రాజునువలె ఎల్లప్పుడును తెలిసికొనవలసినది

ప్రభువు సింహాసనారూఢుడై ధర్మాధర్మములను విచార చేయునప్పుడు వాదప్రతివాదులయొక్కయు, న్యాయవాదుల యొక్కయు, మంత్రుల యొక్కయు అభిప్రాయములను వారితో సంబంధము లేక విలక్ష ణముగా ఉండి యేలాగున సత్యాసత్యములను తెలిసికొనుచున్నాడో, ఆలాగున దేహమనెడు రాజధానిలో మనో బుద్ధీంద్రియ దేహదృశ్య ధర్మములను ఆత్మ సాక్షిగా ఉండి తెలిసికొనుచున్నాడు మఱియు శ్రీశంకరులు ఇటుల వచించిరి

**యత్సుషుప్తౌ నిర్విషయ ఆత్మానందో௨నుభూయతే।**
**శ్రుతిః ప్రత్యక్షమైతిహ్యమనుమానం చ జాగ్రతి ॥**

సుషుప్త్యవస్థయందు సర్వ విషయశూన్యమై సుఖవిశేషానుభవము గలుగుచున్నది అదియే ఆత్మానందము ఇట్టి ఆత్మానంద స్వరూపమును ప్రత్యక్షముచేతను, ఐతిహ్యమువలను, అనుమానప్రమాణముచేతను తెలియదగునని శ్రుతి చెప్పుచున్నది

కావున ఈ విషయములో 1 శ్రుతియున్ను, 2 ప్రత్యక్షమున్ను, 3 ఐతిహ్యమున్ను, 4 అనుమాన ప్రమాణమున్ను సిద్ధములై యున్నవి మఱియు

జాగ్రత్యుద్భూత బాహ్యేంద్రియవిషయసముల్లాససాక్షీ శివోఽహం ।
స్వప్నే దృష్టప్రపంచ ప్రతిఫలనమనోవృత్తి సాక్షీ శివోఽహమ్ ।
సుప్తౌ చిత్తే ప్రలీనే ప్రబలతమమహామోహసాక్షీ శివోఽహం ।
నిత్యానన్దే తురీయే విగత కలిమలస్పర్శసాక్షీ శివోఽహమ్ ।

జాగ్రదవస్థయందు జనించిన బాహ్యేంద్రియ విషయ సముదాయమునకు సాక్షి యైనట్టి శివస్వరూపుడగు పరమాత్మను నేను, మఱియు స్వప్నమందు గాంచబడిన ప్రపంచ ప్రతిఫలన రూపమగు మనో వృత్తులకు సాక్షియైన శివస్వరూపుడను నేను, సుషుప్తియందు చిత్తము లయింప ప్రబలతమమగు మహా అజ్ఞానమునకు సాక్షియైన శివరూపుడగు ఆత్మను నేను, మఱియు నిత్యానందమునకు నెలవగు తురీయమందు మాయాదోష రహితుడనై, స్వయంప్రకాశమై, సర్వసాక్షియై వెలుగు శివస్వరూపుడగు ఆత్మయే నేను

ఈ విషయమై మూడు దేహముల ధర్మములను, గుణములను, అవస్థలను వ్రాయంబూనిన, గ్రంధము పెరుగునని తలంచి విడువడమైనది ఇది వేదసారమగు నిర్వాణపదమునుగుఱించి చెప్పుటచే చాలా సంక్షిప్తముగా నుండును (1) స్థూల దేహముయొక్క 24 తత్త్వములను, (2) సూక్ష్మదేహము యొక్క 17 తత్త్వములను, (3) కారణదేహముయొక్క మూలావిద్య యగు ఏకత్వమున్ను, తురీయమగు స్వప్రకాశాత్మయొక్క స్వానుభూతియున్ను, సామాన్యముగ బ్రహ్మవేత్తలందఱును ఎఱింగి యుండుటచే విస్తరించ బూనలేదు

మఱియు, మూగియగువాడు పంచభక్ష్య పరమాన్నాదులను భుజించి తృప్తినొందిన సుఖమున్ను, ఆకలి శాంతియున్ను, అనుభవమును గల్గియుండినను, వాగింద్రియము లేమిచే వానికి ఇతరులకు, తనకు గల్గిన ఆనందమును తెలుపజాలకపోయినను, అనుభవ సౌఖ్యమున్ను, క్షుద్బాధానివృత్తియును ఎటుల అనుభవగోచరమై యుండునో, ఆలాగున స్వప్నసుషుప్తులలో అస్వాధీన ఇంద్రియములను గల్గియుండుటచే అత్తఱి చెప్పకపోయినవేగాని మరి యొకటి గాదు మఱియు స్వప్నములో గల వృత్తాంతము లన్నియు ప్రజ్ఞగలవారు

మరురోజున ఎట్లు చెప్పుచున్నారో, అది వారికి అనుభవమునకు లేకపోయిన ఎట్లు చెప్పగలరు? కావున దీనియందు సాక్షిత్వమునకు ఏలాటి హానియు లేదు

ఇకను వినుడు కొందఱిని భూతము పట్టుకొని రొమ్మును అదిమిపట్టుకొని యుండును అత్తఱి వారు ఎంత మాట్లాదలంచినను, కంటితో వికారపు చూపులను చూపినను, వాగ్బంధనమున్ను హృదయ స్తంభనమున్ను గల్గియుండినందుచే, తమ యాశయమును తెలుపజాలక పోవుచున్నారు దయ్యము వదలిపోయిన తర్వాత వారికి స్మృతి వచ్చిన పిమ్మట జరిగిన సంగతు లన్నిటిని చెప్పుచున్నారు అప్పుడు ఎట్లు చెప్పగలిగిరి? ఇంకను వినుడు, మీలో ఎవరైన రాత్రికాలమున నాటకములుగాని, సినిమాలుగాని, అత్యద్భుత విషయములుగాని చూచిన మఱుసటి దినమున ఎట్లు మీ మిత్రులకు తెలుపుచుందురో, దానికి స్మృతిజ్ఞానమని పేరు సాక్షియగు ఆత్మ అత్తఱి ప్రకాశవంతమై లేనిచో ఎట్లు తెలిసికొని చెప్పగల్గును? ఆలాగున సుషుప్తులలో స్మృతిజ్ఞానము లేనిచో సుషుప్త్యవస్థను జాగ్రదవస్థలో ఎట్లు చెప్పగల్గరు? కావున నీలాటి విషయములలో ఏలాటి సందేహమున్ను పడనవసరము లేదు

బ్రహ్మనిష్ఠులకు తగిన ఆచరణ లేకపోవుటచే, చెప్పుటకు మాత్రము నేర్చుకొన్నందుచే వారికి మోక్షము గాని, ఆత్మశాంతిగాని గలుగదు ఆమాట లన్నియు ఫోనోగ్రాఫు పెట్టె పాడెడు సంగీతరసము వంటిది దానివల్ల ఆ పెట్టె యెంత ఆనందమును పొందునో వీరికిని అంత మాత్రమే గల్గును ఆ పెట్టెకు గల్గెడు మోక్ష మెట్టిదో, వీరికి గల్గెడు మోక్షము అట్టిదే ఒకడు రేడియో ద్వారా శబ్ద ప్రసారణమును చేయుచుఁడుండిన, ఆ యంత్రము చెడిపోవుటవల్ల ఎన్నియో విధములుగ శబ్ద ప్రసారణము చేయజూచినను చేయజాలకపోవుటచే ఆ మనుజుడు అత్తఱి లేనివాడనిగాని, నిద్రించియుండు వాడనిగాని, దానిని తెలిసికొనజాలని వాడనిగాని చెప్పువారు ఎవరైన ఉండినచో, అట్టివారు మాత్రమే సుషుప్తిలోను, స్వప్నములోను గల విషయములను అప్పుడు చెప్పక పోవుటచే వారికి సాక్షిత్వము జ్ఞానము లేదని చెప్పువారలు ఈ విషయమై

ఉత్తరగీత తెల్పుదానిని చూడుడు

**అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః ।**
**యో వై బ్రహ్మ న జానాతి దర్వీపాకరసం యథా ।**

మానవుడు చతుర్వేదంబులు చదివియును, ధర్మశాస్త్రంబులనేకములను జదివియును, అనేక పదార్థము గల పాత్రలలో తిరుగుచుండు గరిటె ఏలాగున వానిలోగల రసమును తెలిసికొనజాలక పోవుచున్నదో అలాగున చక్కని అనుష్ఠానముచే ఆత్మప్రాప్తి గలుగువరకు యత్నించని వానియొక్క వాక్యములును పై విధముగానే యుండును

## కఠోపనిషత్తు

**అవిద్యాయామన్తరే వర్తమానాః స్వయంధీరాః పండితం మన్యమానాః ।**
**దంద్రమ్యమాణాః పరియన్తి మూఢాః అన్ధేనైవ నీయమానా యథాన్ధాః ।**

అవిద్యకమగు విషయాదులలో పొరలుచుండి తమకు తామే గొప్ప ప్రజ్ఞావంతులమనియు, తామే బ్రహ్మవేత్తలనియు తలంచు వారిగతి యెట్టిదనగా, గ్రుడ్డివానిని ఆధారముచేసికొని ప్రయాణమును చేసెడు మఱి యొక గ్రుడ్డివానిగతి యెట్టిదో, వీరి మోక్షముయొక్క గమ్యస్థానమున్ను అటువంటిదే

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥**

ఎప్పుడు నీయొక్క మనస్సు అజ్ఞానమనెడు కల్మషమును దాటగలదో అప్పుడు వినందగిన యర్థమును, విన్న అర్థమును తెలిసికొనగలవు అప్పుడే నిజమైన వైరాగ్యము, లేక వేదనిర్ణయార్థమును ఎఱుంగ గల్గును

మూలప్రకృతిని, అవిద్యను, అజ్ఞానమును దాటిన తర్వాత మాత్రమే ఇదివరలో మహాత్ములవల్ల శ్రవణము జేసినదాని యర్థము గోచరించును చదివిన వేదాంతగ్రంథములయొక్క సారమున్ను అప్పుడే తెలియగల్గును మరల దానికన్న ఇక తెలియందగిన విషయము లేదనికూడ బోధపడును అని

గీతాచార్యుడు ఉపదేశించెను

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

జీవుడు దేహోత్పత్తికి కారణభూతము లయిన సత్త్వరజస్తమోగుణముల నతిక్రమించి పుట్టుక, చావు, ముసలితనము, దుఃఖములు మొదలగువాని జెందక, జీవన్ముక్తుడై నాలో నైక్యమును పొందుచున్నాడు

ఈ యధ్యాయమున మూడుగుణముల వర్ణించునప్పుడు సత్త్వగుణ మును గూడ త్రిగుణములతో జేరినదిగా వర్ణించబడినది అయ్యది గూడనశించి విశుద్ధసత్త్వములో ప్రవేశించినప్పుడే మోక్షమని భగవానుడు ఉపదేశించి యుండగా, ఇప్పుడు గల బ్రహ్మవిచారము చేయువారలలో తమోగుణాం శమున్ను, రజోగుణాంశమున్ను కొందఱిలో కన్పడుచుండగా, ఇక వీరెప్పుడు ముక్తిని పొందగలరు? ఇట్టి యవస్థ జీవించి యున్నప్పుడే గల్గవలయునని భగవాను డుపదేశించెను ఎంతకాలమువఱకు జీవించి యుండగలమా యని ఎవరికిని తెలియ సాధ్యము కాదు మరియు ఈ క్షణమో, యుత్తరక్షణమో మాపో,రేపో అట్టి యవస్థలు కల్గునని తెలియ సాధ్యము కాదు కావున నిప్పుడే త్రిగుణములను బన్ధములను త్రుంచుటకు యత్నించవలయును

**శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।**
**కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ॥**

ఏ పురుషుడు బ్రతికియున్నప్పుడే కామక్రోధములయొక్క వేగమును సహింప శక్తిగల్గియున్నాడో (జయించునో) అట్టి సాధకుడు యోగసిద్ధిగల వాడును, శాశ్వతమైన సౌఖ్యము గలవాడును నగుచున్నాడు

**ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।**
**నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ।**

ఎవరియొక్క మనస్సు సకలభూతములయందును బ్రహ్మము సమముగా నున్నదను విషయమునందు నిశ్చయరూపమై యున్నదో అట్టివారు ఈ లోకమునందే జన్మమును జయించిన వారగుచున్నారు మఱియు బ్రహ్మము ప్రకృతిదోష రహితమైనది కనుక అట్టిదోష రహితులు సదా బ్రహ్మమునందు నున్నవారగుచున్నారు

బ్రహ్మము ఏలాగున ప్రకృతిదోషరహిత మైనదో ఆలాగున ప్రకృతిగుణములు నశించిన జీవుడే బ్రహ్మమందైక్య మగును నీటిలో నీరున్ను, తైలములో తైలమున్ను ఐక్యమగునేగాని, జలములో తైలమున్ను, తైలములో జలమున్ను, ఎటుల ఆవశ్యము గాదో ఆలాగున బ్రహ్మమెటువంటి పరిశుద్ధమైనదో జీవుడున్ను అట్టి పరిశుద్ధావస్థ గల్గునప్పుడే మోక్ష మొందును నిప్పులో నిప్పు ఐక్యమగునేగాని, నీరేలాగున నైక్యము గాదో అలాగున జ్ఞానజ్యోతిస్వ రూపుడగు ఈశ్వరునితో అట్టి జ్ఞానస్వరూపుడగు జీవుడే ఏకత్వమును బడయును బంగారువ్యాపారమును జేయువారు మలినబంగారమును గొని స్ఫుటమువేసిన తర్వాత శుద్ధియయిన పిమ్మట మాత్రమే అసలు బంగారులో కలుపుదురు ఆలాగున ప్రకృతిగుణముగల జీవుడు తపస్స్వాధ్యాయములచే శుద్ధుడయిన మాత్రమే బ్రహ్మమం దేకత్వము నొందగల్గును



## శాంతిపర్వము

**యే చ సంశాంతరజసః సంశాంతతమసశ్చ యే ।**
**సత్త్వే స్థితా మహాత్మానో దుర్గాణ్యతితరన్తి తే ॥**

ఎవరైతే లెస్సగా శాంతినొందిన రజోగుణమున్ను, తమోగుణమున్ను గలవారలో, సత్యస్వరూపమగు ఆత్మయందు నిల్కడ గల మహాత్ము లెవరో అట్టివారు సర్వవిఘ్నములను నతిత్వరలో తరింపగలరు

**తమో రజశ్చ సత్త్వం చ విద్ధి జీవగుణాత్మకమ్ ।**
**జీవమాత్మగుణం విద్యాదాత్మానం పరమాత్మనః ॥**

గీతయందు శ్రీకృష్ణభగవానుడు చెప్పినట్లే వ్యాసులున్ను శాంతిపర్వమున ఉపదేశించిరి తమస్సు, రజస్సు, సత్త్వము అను త్రిగుణములతో గూడిఉన్నప్పు డే జీవుడు అను అవస్థ యుండును ఈ గుణములకు విలక్ష ణునిగా ఆత్మను పరమాత్మస్వరూపునిగా తెలిసికొనవలయును అనగా మూడు గుణములు ఆత్మయందు లేనటుల గ్రహించి త్రిగుణరహితునిగా నెఱుంగ వలయును

**బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థో ఽథ భిక్షుకః ।**
**యథోక్తచారిణస్సర్వే గచ్ఛన్తి పరమాం గతిమ్ ॥**

పై చెప్పబడిన ప్రకారము త్రిగుణము రహిత మొనర్చిన వారు బ్రహ్మ చారియైనను, గృహస్థుడైనను, వానప్రస్థుడైనను, సన్న్యాసియైనను, స్త్రీయైనను, మరియెవరైనను సర్వోత్కృష్టమగు బ్రహ్మపదమును పొందుదురు

**యావానాత్మని వేదాత్మా తావానాత్మా పరాత్మని ।**
**య ఏవం స తతో వేద సోఽమృతత్వాయ కల్పతే ॥**

ఎప్పుడు తన ఆత్మను పరమాత్మస్వరూపునిగా తెలిసికొనుచున్నాడో, అప్పటినుండి ఆ యాత్మ పరమాత్మయందు నిలకడ గల్గియుండును ఈలాగున నెవడైతే యెల్లప్పుడు తెలిసికొనుచున్నాడో అట్టివాడే మోక్షమున కర్హుడగును అనగా ఆత్మపరమాత్మల యేకత్వము నెంతవరకు తెలిసికొన లేదో యంతవరకు కైవల్యపదమున కర్హుడు కాడు

**సంసారార్ణవమగ్నానాం జన్తూనామవివేకినామ్ ।**
**అగతీనాం గతిస్సాక్షాత్ జ్ఞానమేవ హి కేవలమ్ ॥**

జననమరణరూపమగు భవార్ణవమున మునిగిన వారికిన్ని అవివేకులగు మానవులకున్ను, ఏ సహాయములేని వారికిన్ని కేవలము ఆత్మజ్ఞాన మొక్క టియే గతి యగును అనగా దరిజేర్చును

**అయమాత్మా స్వయం జ్యోతిర్మహానందమయశ్శివః ।**
**అయోగినః పరోక్షస్స్యాదపరోక్షశ్చ యోగినః ॥**

ఈ యాత్మ స్వయం జ్యోతి స్స్వరూపము, మహానందమయము, ప్రకృతి దోషములు లేని శివస్వరూపము, యోగనిష్ఠ లేనివారికి అప్రత్యక్షము, యోగనిష్ఠ గలవారికి ప్రత్యక్షము



# నిర్వికల్పసమాధి - బ్రహ్మసాక్షాత్కారము

నిర్వికల్పసమాధియందుగాని, బ్రహ్మసాక్షాత్కారమందుగాని అహంప్రత్యయము గలుగునా? అనగా, అహంప్రతీతి యుండునా? అని యనేకులు శంకింతురు ఇట్టి శంకానివారణార్థమై ఈ ప్రకరణ మిచ్చోట వ్రాయబడుచున్నది శ్రీశంకరాచార్యులు నిర్వాణషట్కమందీలాగున ఆరుశ్లోకములు చెప్పిరి

మనోబుద్ధ్యహంకార చిత్తాదినాహం
న శ్రోత్రం న జిహ్వా న చ ఘ్రాణనేత్రే ।
న చ వ్యోమ భూమిర్న తేజో న వాయు
శ్చిదానందరూపశ్శివోఽహంశివోఽహమ్ ॥

మనోబుద్ధి చిత్తాహంకారములు నేనుకాను, శ్రోత్రముగాని, జిహ్వాగాని, ఘ్రాణముగాని, నేత్రములుగాని నేను కాను ఆకాశముగాని, భూమిగాని, అగ్నిగాని, వాయువుగాని నేను కాను చిదానందరూపుడగు శివస్వరూపుడనే నేను, శివస్వరూపుడనే నేను తక్కిన అయిదు శ్లోకములను గ్రంథాన్తరమున పఠించుకొనవచ్చును ఇది బ్రహ్మనుసంధానపరులకు చాల మంచిది

దీనియందు నిర్వాణస్తుతిలో శివోఽహమని, తన సాక్షాత్స్వరూపము వెలుగుచున్నదని గోచరమగుచున్నది "అహంబ్రహ్మాఽస్మి"అను మహావాక్యమునందును అహం ప్రత్యయము కన్పడుచున్నది అది యేలాగున అద్వైత మగును? అట్టిది యెట్లు నిర్వికల్పసమాధి యగును? అని శంకించు వారుగూడ గలరు

అహంబ్రహ్మోఽస్మి మంత్రోఽయం చిత్తబంధం వినాశయేత్ ।
అహంబ్రహ్మోఽస్మి మంత్రోఽయం బుద్ధివ్యాధిం వినాశయేత్ ।
అహంబ్రహ్మోఽస్మి మంత్రోఽయం సంకల్పాదీన్వినాశయేత్ ।
అహంబ్రహ్మోఽస్మి మంత్రోఽయం కోటిదోషం వినాశయేత్ ।

ఈలాగున ఉపనిషత్తు ఉద్ఘోషించుచున్నది

అహంబ్రహ్మోఽస్మి అను ఈ మంత్రము చిత్తముయొక్కబంధమును నశింపజేయుచున్నది అహంబ్రహ్మోఽస్మి యను ఈ మంత్రము బుద్ధి యొక్క అవిద్యారోగమును విలయము నొందించుచున్నది అహంబ్రహ్మోఽస్మి యను నీ మంత్రము సంకల్పము లన్నిటిని రహితముగ జేయుచున్నది అహం బ్రహ్మోఽస్మి యను మంత్రము కోటిదోషములను వినాశ మొనరించు చున్నది

మహావాక్యమనగా, అన్ని వాక్యములకన్న, అన్ని మంత్రములకన్న గొప్పదని భావము దానికన్న గొప్పది మఱియొకటి లేదు అది నదులన్నిటికి సముద్రము వంటిది అది ప్రకాశము లన్నిటికి సూర్యునివంటిది తీర్థములన్ని టికి గంగానదివంటిది

పైజెప్పిన మహావాక్యములో సంశయము గలుగుటకు కారణము శ్రోత్రియుడగు బ్రహ్మనిష్ఠుని వద్ద బ్రహ్మవిచారమును చేయక గలిగెడు మనోదోషమే యగును అహంప్రత్యయము లేనిచో అది జడమే యగును సుషుప్తిలోను, మూర్ఛలోను అహంప్రతీతి లేదు కావున అట్టి స్థితియే నిర్వికల్ప సమాధి యనియు, బ్రహ్మసాక్షాత్కార స్థితియనియు చెప్పవలసివచ్చును మఱియు స్తంభముగాని, విగ్రహముగాని మహానిర్వికల్ప సమాధియందును, బ్రహ్మసాక్షా త్కార స్థితియందును ఉంటున్నదని చెప్పుట యెంత బాగుండును అయితే అహంప్రత్యయమందు మూడంతస్తులు గలవు దీని భేదము తెలిసికొనక పోవుట వలననే యిట్టి సందేహము గలుగుచున్నది వివేకచూడా మణిని చూడుడు.

దేహోఽహమిత్యేవ జడస్యబుద్ధిర్దేహే చ జీవే విదుషస్త్వహంధీః ।

**వివేకవిజ్ఞానవతో మహాత్మనో బ్రహ్మాఽహమిత్యేవ మతిస్సదాత్మని ॥**

ఆత్మానాత్మ వివేకశూన్యుడగు మూఢుడు దేహమే యాత్మయని తలంచును కొద్ది శాస్త్రము జదివి యాచరణలేని పండితుడు చిదాభాసుడగు జీవుడే (ఆత్మ) తానని అనుకొనును దృఢమగు అపరోక్షజ్ఞానము గల మహాత్ముడు "అహం బ్రహ్మాఽస్మి" యనెడి బుద్ధితో బ్రహ్మమే తానని అనుకొనును ఇట్టి స్థితిలో ఉండువానిని గురించియే"అహంబ్రహ్మాఽస్మి"యను వాక్యము విధించబడెను ఇట్టి అనుభవము లేకపోయిన మహావాక్యమందుగల "అహంబ్రహ్మాఽస్మి" అనువాక్యము నెట్లు అర్థమును చేయగలరు? స్వానుభవ మెటుల సిద్ధించును? ముముక్షువుల కేలాగున బోధింపగలరు? బ్రహ్మవిద్యా పరంపర లోకమున ఏలాగున సృష్ట్యారంభమునుండి ప్రవర్తించి వచ్చెను మహాకల్పము వఱకు ఇది యేలాగున గురుశిష్య మార్గమున నడచును? ఏమి బ్రహ్మము జడమా? ఆత్మయు జడమా? ఆత్మజ్ఞానియు జడుడా?

**దేహాత్మజ్ఞానవజ్జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్ ।**
**ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే ॥**

అజ్ఞుడైనవానికి దేహమే తాననుజ్ఞానము దృఢముగా ఏలాగున గల్గియున్నదో, ఆలాగున నేను దేహము గాను, నిత్యముక్త స్వయంప్రకాశమగు బ్రహ్మమే యను జ్ఞానము ఎవనికి దృఢముగా గలిగియుంటున్నదో, అతడు ముక్తిని గురించి యిచ్ఛయింపక యున్నను ముక్తుడే యగును మనస్సు బుద్ధి యెంత శుద్ధములై యుండిన ఏకాగ్రతగల్గి యుండిన అట్టి భావనచేయుటకు అర్హత గల్గియుండునో ముముక్షువులు గ్రహించు కొనవలయును వస్త్రము శుద్ధముగా నున్నప్పటికిని ఏ యే రంగులలో అద్దినచో వస్త్రములయొక్క తెలుపు కనబడక ఏలాగున రంగులరూపమై వెలయుచుండునో, ఆలాగున మానవుల యొక్క భావన ననుసరించి ఆత్మయు అలాగున ఉండునని తోచే శక్తి మాయయందు గలదు.

**వపుస్తుషాదిభిః కోశైర్యుక్తం యుక్త్యవఘాతతః ।**

ఆత్మానమాంతరం శుద్ధం వివిచ్యాత్తణ్డులం యథా ॥

ధాన్యమును దంచి యేలాగున పొట్టును తొలగించి బియ్యమును వేరు పరచుచున్నారో, ఆలాగున పంచకోశములతో గూడిన ఆత్మను విచార ణచేతను, తపస్సుచేతను వేరుపఱచుకొనవలయు పొట్టుపోయిన తర్వాత ఆ బియ్యమేాన మొలకెత్తదో, ఆలాగున ప్రకృతినుండి వేఱుపరచబడిన ఆత్మకు మరల జననమరణము లుండవు

జీవన్ముక్తిస్తు తద్విద్యాత్పూర్వోపాధిగుణాంస్త్యజేత్ ।
స సచ్చిదాది ధర్మత్వాద్భజే భ్రమరకీటవత్ ॥

ఆత్మజ్ఞాని ముందున్న స్థూల సూక్ష్మకారణోపాధులను సత్త్వరజస్త మోగుణములను విడిచిపెట్టుచున్నా డనునది యేదిగలదో, అది జీవన్ముక్తియని తెలియవలయును అటువంటి యవస్థగల జ్ఞాని సచ్చిదానందాది ధర్మములు గలవాడగుటవల్ల పురుగు ఏలాగున తుమ్మెదను భావించి క్రిమిధర్మమును విడిచి భ్రమరమగు చున్నదో ఆలాగున చిరకాల మాత్మచింతనచేత జీవత్వము నశించి శివత్వమును పొందుచున్నాడు ఈ యవస్థ గల్గుటకు చిరకాలానుష్ఠాన ముండవలయును చింతకా గున పండు అగునప్పుడు బెరడునుండి వేరుపడుచున్నదో, పండు కొబ్బరి   జలము నశించినప్పుడు కురిడియై కొబ్బెర చిప్పనుండి వదలిపోవుచున్నదో, సర్పమేలాగున కాలము వచ్చునప్పుడు కుబుసము నుండి వదలిపోవుచున్నదో ఈ జీవుడును జ్ఞానతపస్సులవలన కాలము పరిపక్వ మగునప్పుడు బంధనమునుండి విముక్తు డగుచున్నాడు అదియే మోక్షము పత్తికాయ యేలాగున పక్వమగునప్పుడు పగిలి తెల్లని దూదిని వెలువరచుచున్నదో, టెంకాయగెల పరిపక్వకాలమున పగిలి పూలతో శోభించుచున్నదో, అరటిగెలయొక్క ఆవరణమగు రేకులు ఒక్కొక్కటి స్వయముగా వదలిపోయి కాయలేలాగున శోభించుచున్నవో, కాలము పరిక్వమగునప్పుడు గ్రుడ్లనుండి భేదించికొని పక్షులేలాగున లేచిపోవుచుండునో ఆలాగున సాధన పరిపక్వ మగునప్పుడు ఈ జీవాత్మయు అన్ని బంధముల నుండి విముక్తి గల్గి సత్యజ్ఞానానందమయుడై ప్రకాశించుచుండును

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి ॥**

ఆత్మజ్ఞానమునకు సమాన మయినదియు, పావన మైనదియు, పాపశోధన క్రమమయినదియు ఈ లోకమందు మఱియొకటి లేదు అట్టి జ్ఞానము తపో బలముచే ఆత్మపరిశుద్ధ మగునప్పుడు స్వయముగా తనలోనే తాను పొందుచున్నాడు అని గీతయందు శ్రీకృష్ణభగవాను డుపదేశించెను దీనివల్ల ఆత్మ జ్ఞానము మఱియొక దేశములో గాని, లోకములోగాని పొందబడునది కాదనియు, అంతఃకరణము పరిపక్వ మగునప్పుడు తనలోనే స్వయముగా పొందబడు చున్నదనియు తెలుపడమైనది అట్టి జ్ఞానప్రాప్తికి కాలనిర్ణయము దీనియందు చేయలేదు ఏలననగా పూర్వజన్మ అనుష్ఠాన పక్వాపక్వతల ననుసరించి దీర్ఘకాలముగాని, స్వల్పకాలముగాని పట్టవచ్చును ఇదియే సరియగు యుపదేశ మగును కట్టకడకు జీవన్ముక్తి గల్గువరకు అనుష్ఠానము చేయుచుండ వలయును అదియే సరియగు సత్యము ఇక వేదాంత పంచదశిలో చెప్పిన కొన్ని వాక్యములను తెలిపెద

**ఏక ఏవాత్మా మంతవ్యో జాగ్రత్స్వప్నసుషుప్తిషు ।**
**స్థానత్రయ వ్యతీతస్యపునర్జన్మ న విద్యతే ॥**

జాగరితావస్థయందును, స్వప్నావస్థయందును, సుషుప్త్యవస్థయందును ఒక్కడగు ఆత్మయే తెలియదగిన వాడగును జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలకంటే అన్యత్వము నొందిన యాత్మకు మరల జననము లేదు

**స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి।**
**నాస్యాబ్రహ్మవిత్కులే భవతి । తరతి శోకం తరతి**
**పాప్మానం గుహా గ్రంథిభ్యో విముక్తో ఽమృతో భవతి ॥**

ఆ పరబ్రహ్మము నెవడెరుగునో వాడే పరబ్రహ్మ మగుచున్నాడనియు, వాని కులమందు బ్రహ్మవేత్త కానివాడు జన్మింపడనియు, దుఃఖమును దాటుచున్నాడనియు, పాపమును తరించుచున్నాడనియు, పంచకోశరూప

గుహవలనను, కామప్రకోపరూప హృదయగ్రంధుల వలనను ముక్తుడగుచు అమృతరూపు డగుచున్నాడనియు శ్రుతి తెల్పుచున్నది

**భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా ।**
**పుమాంస్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్ ॥**

నిశ్చయబుద్ధి గలవానిచేత ఏ వస్తువు తీవ్రవేగముచేత (రేయింబవళ్ళు) భావింపబడుచున్నదో, ఆజ్ఞేయవస్తువుగా (అపరోక్షముగా దెలియదగిన బ్రహ్మముగా) భ్రమరకీటమువలె అగుచున్నాడు పురుగు ఏలాగున తుమ్మెదను భావించి భావించి భ్రమర రూపముగా మారుచుండునో, ఆలాగుల జీవాత్మను పరమాత్మముగా ఎడతెగక భావించుటవల్ల ఆ పరమాత్మరూపమే యగుచుండును కావుననే శాస్త్రములో శ్రవణమాత్రముచే తృప్తినొంద కూడదనియు, మనన నిదిధ్యాసములు బాగుగా చేయవలయు ననియు చెప్పెడి రహస్యము

నిజముగా ఆలోచించిన మతములన్నియు భావనారూపములే అటు కానిచో శైవవైష్ణవభేదములు, ఇతర మతభేదములు గూడ కనుపించుట కవకాశములేదు ఒకడాత్మను దుఃఖరూపిగాను, మఱియొకడు జీవరూపిగాను, ఇంకొకడు శివరూపముగాను భావించుటకు కారణమేమి? భావనాశక్తిచేత జీవాత్మ పరమాత్మస్థితిని పొందుచుండును ఆ భావన యెటులుండవలయు ననగా మామిడికాయ మొదలగు వాటిని ఊరగాయ వేయగా అవి కొంత కాలమునకు ఏలాగున లవణరసముగా మారుచుండునో, ఆలాగున పిండితో చేయబడిన మిఠాయి వస్తువులు చక్కెరపాకములో ఊరుటవల్ల ఎట్లు మధుర ములుగా మారుచుండునో, అట్లు నిరన్తర ధ్యానము వల్ల జీవాత్మలో గల ప్రకృతిసంబంధ దుఃఖము లన్నియు నశించి ఆనందమయములై మారు చుండును

ప్రపంచములో కనుపించెడి మతస్థు లందఱు పూర్వము ఒక మతముననుండి మఱియొక మతములోనికి మాఱినవారే అనగా

హిందువులలో అనేకులు మహమ్మదీయ మతములోనికి మార్చబడిరి కొన్ని తరములు జరిగిన పిమ్మట వారందఱున్ను అసలు మహ్మాదీయులని దృఢనిశ్చయము గలవారైరి పంజాబు మొదలగు ప్రదేశములలోగల అధిక మహమ్మదీయులును హిందువులై యుండెడివారే ఇప్పుడు వారు అసలు ముస్లీములని దృఢవిశ్వాసము గల్గియున్నారు ఆలాగున క్రైస్తవులలోను, బౌద్ధులలోను ఊహించుకొన వచ్చును అట్లే శైవులు కొందరు వైష్ణవులుగాను, వైష్ణవులు కొందఱు శైవులుగాను మారియున్నారు తరములు గడిచిపోవుటచే వైష్ణవులు తాము విష్ణుమతస్థుల మనియు, శైవులు తమను శివమతస్థుల మనియు నమ్ముచున్నారు

అలాగున ఒక ఆంజనేయ విగ్రహము గాని, ఆదిశేష విగ్రహముగాని, నందీశ్వరవిగ్రహముగాని యుండిన దానిని పగులగొట్టి కరిగించిన శ్రీరామ విగ్రహముగాని, నారాయణ విగ్రహముగాని, ఈశ్వర విగ్రహముగాని, మఱి యే విగ్రహముగాని యేలాగున చేయవచ్చునో, అలాగున భావనాశక్తి చేత పూర్వపు స్వభావమును మార్పుచేసికొని నవీనరూపమును చేసికొనవచ్చును ఆలాగున ఒకమిషనుగాని, చక్రమునుగాని, ఆయుధమునుగాని కఱిగించి మఱియొక యంత్రమునుగాని, చక్రమునుగాని, ఆయుధమును గాని చేయవచ్చును ఆలాగున బ్రహ్మనిష్ఠులు తమకు పూర్వముగా ఏర్పడి యుండు జాత్యాది నామరూపములను భావనాశక్తిచేత విలయము నొందించి, గొప్పఋషిసన్తతి వారమనియు, పరమాత్మ స్వరూపులమనియు భావించవలయును అప్పుడట్టి స్థితి తప్పక గల్గును

గృహస్థాశ్రమములో ఉండువారు యత్యాశ్రమమును స్వీకరించిన తాను సన్న్యాసి యని ఎట్లు దృఢభావము గల్గియుందురో, యీ మార్పున్ను ఆలాటిదే యగును

మఱియు ఒక ఇన్స్పెక్టరుగాని, సూపర్నెంటుగాని, కలెక్టర్‌గాని యుండిన విరోధులతో ఏదైన వాదప్రతివాదములు వచ్చినప్పుడు నేను ఉద్యోగస్థుడగు ఒక ఇన్స్పెక్టర్ అనిగాని, లేక పోలీసుడిపార్టుమెంటు సూపర్నెంటనిగాని, ప్రభుత్వము

వారిచే నియమించబడిన కలెక్టర్ అనిగాని యెటుల పౌరుషముతో పలుకు చుందురో, యిట్టి భావము వారికి ఎటుల గల్గెను? తమ్ముకొంతకాలము ఆలాగున తలంచుటచేత ఆ భావము ఇప్పుడు రూఢిపడెను ఆలాగున ముముక్షువు లందఱున్ను తమ పూర్వజాతి గుణము లుండిన త్యజించి నూతనముగా ఏ యనుష్ఠాన ధర్మపద్ధతిలో ఉంటున్నారో, అట్టి పరమ ఋషు లవంశములో ఉండువారనియు, తమ ఆత్మలనుగూడ దైవస్వరూపము లనియు దృఢభావన కొంతకాలము చేసిన తప్పక అట్టి స్థితి గల్గును ఇదియే భావనావిశేషముయొక్క మహిమ యని మరువకూడదు

**మూషాసిక్తం యధాతామ్రం తన్నిభం జాయతే తధా ।**
**రూపాదీన్యాప్నువచ్చిత్తం తన్నిభం దృశ్యతే ధ్రువమ్ ॥**

మూసయందు కఱుగబోసిన కంచు ఒక్కటియే అయినను కరువులు (అచ్చులు) ఏయే రూపములుగా ఉండునో వానిలో పోయబడిన కంచున్ను ఆయారూపములతో కూడిన విగ్రహములుగానే ఏర్పడునటుల నామరూప ములులేని పరమాత్మను సాధకులు తమ హృదయములలో ఏలాగున భావింతురో ఆలాటి భావనలే యేర్పడును ఇది నైష్కర్మ్యసిద్ధిలో సురేశ్వరాచా ర్యులు తెలిపిన దృష్టాంతము

**నానోపాధివశాదేవ జాతినామాశ్రమాదయః ।**
**ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాదిభేదవత్ ॥**

ఆత్మావరణ భూతములైన పలుదెఱగులైన శరీరములవలననే ఉదక మందు రుచి, రంగును మొదలుగా గల భేదముల వలెను, పరమాత్మయందు కులము, పేరు, బ్రహ్మచర్యము మొదలయిన ఆశ్రమములు మొదలుగా గలవి కల్పింపబడినవి అని శ్రీ శంకరులు ఆత్మబోధలో తెలిపిరి [illegible] దృష్టాన్తము లన్నియు సామాన్యబుద్ధి గలవారు గ్రహించుటకొఱకు తెలుపడమైనది జలము నిర్మలముగా ఉండినను ఎఱుపు, నలుపు, పచ్చని రంగులతో కలియు నప్పుడు ఆయారూపములుగా కన్పించునట్లున్ను, ఉప్పు, పులుపు

చేదు, తీపి పదార్థములతో చేరునప్పుడు ఆయా రుచులుగా గోచరించునట్లున్ను ఈ ఆత్మగూడ శుద్ధజ్ఞాన స్వరూపముగా ఉన్నప్పటికిని మానవునియొక్క కల్పనారూపములచే ఆత్మజ్ఞానము మరుగుపడి దృశ్యజ్ఞానరూపముగా పరిణమించును నిజముగా విచారించిన ఆత్మయందు ఈ మార్పులెవ్వియు గలిగియుండలేదు అదెల్లప్పుడు ఆత్మమయముగాను, జ్ఞానమయముగాను, శివమయముగాను, పరిణామరహితముగాను, ఏకముగాను ఉంటున్నది అదియే నీయొక్క స్వరూపమని తత్త్వమసి మహావాక్యము ఉపదేశించు చున్నది ఆలాగున బ్రహ్మాఽస్మియను భావనచేయుటకు మనఃపరిపక్వము లేనివారికే పై జెప్పిన దృష్టాన్తములను చెప్పి వారికి గల సంశయములను నివర్తించుటకొఱకు శ్రుతి యీలాటి యుదాహరణ లన్నియు నిరూపించుటకు యత్నించడమైనది నిజముగా చెప్పిన అద్వైత బ్రహ్మసాక్షాత్కారసిద్ధి గల్గుటకు వివర్తవాద మొకటియే సరిగా తత్త్వము తెలుపునదిగా ఉంటున్నది

> రజ్జుసర్పవదాత్మానం జీవం జ్ఞాత్వా భయం వహేత్ ।
> నాహం జీవః పరాత్మేతి జ్ఞాతశ్చేన్నిర్భయో భవేత్ ॥

త్రాడును పామునువలె సత్యజ్ఞానానంద స్వరూపియగు నాత్మను కించిద్జ్ఞనిగా భ్రమించి భయమును పొందుచున్నాడు అప్పుడు వివేకముచేత నేను కించిజ్జ్ఞుడనుగాను, ఇక నేమన పరబ్రహ్మమని గుర్తెఱిగి నట్లాయెనా అవిద్యాదులవలన గలుగు భయమెంతమాత్రమును లేనివాడు కాగలడు విచారసాగరమున అహంబ్రహ్మాఽస్మి అని గల అహం ప్రత్యయమునుగూర్చి తెల్పినది చూడదగినది

జ్ఞానమునకు సాక్షాత్సాధనము శ్రౌతసంబంధమయిన వేదాంత వాక్యమే ఆ వేదాంతవాక్యయు రెండువిధములుగా నున్నది ఒకటి అవాంతరవాక్యము రెండవది మహావాక్యము అనగా పరమాత్మ యొక్క లేక జీవునియొక్క స్వరూపమును బోధించునట్టి వాక్యము అవాన్తరవాక్యము మఱియు జీవపరమాత్మలయొక్క యేకత్వమును బోధించునట్టి వాక్యము మహావాక్యము (అవాంతర వాక్యము వలన పరోక్షజ్ఞానము, మఱియు

మహావాక్యమువలన అపరోక్షజ్ఞానము గల్గును) "బ్రహ్మమున్నది" అను నీ జ్ఞానము పరోక్షజ్ఞానమని, "నేను బ్రహ్మము" అను నీ జ్ఞానము అపరోక్షజ్ఞానమని ఎఱుంగవలయును

## ముక్తలక్షణము

"స్థూల సూక్ష్మ కారణ శరీరములకన్న భిన్నమయిన తన స్వరూపము సాక్షాత్పరబ్రహ్మముగా నున్నది", ఈ ప్రకారముగా అహం బుద్ధిచే పరబ్రహ్మ స్వరూపముయొక్క అపరోక్షజ్ఞానము ఎవరికి గల్గినదో వానిని ముక్తుడందురు

## సమాధి నిరూపణము

వ్యుత్థాన సంస్కారముయొక్క తిరస్కారము, మఱియు నిరోధసంస్కారముయొక్క ప్రకటత గల అంతఃకరణముయొక్క ఏకాగ్రతా రూపపరిణామమును సమాధి యందురు ఆ సమాధి ద్వివిధము మొదటిది సవికల్పము రెండవది నిర్వికల్పము వానిలో 1 జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూప త్రిపుటీభావ సహితమయిన అద్వితీయ బ్రహ్మమునందలి అన్తఃకరణవృత్తియొక్క స్థితిని సవికల్పమందురు ఆ సవికల్పసమాధియు శబ్దానువిద్ధ, శబ్దాననువిద్ధ భేదమువలన ద్వివిధము వీనిలో "అహం బ్రహ్మాస్మి" అను నీ శబ్దముచేత 1 అనువిద్ధము (అనగా మిశ్రమయినది) శబ్దానువిద్ధము శబ్దరహిత మయినది శబ్దాననువిద్ధము 2 త్రిపుటీజ్ఞానరహితమగు అఖండ బ్రహ్మాకారవృత్తిని నిర్వికల్పమందురు

ఈరీతిగా సవికల్ప నిర్వికల్ప భేదముచేత సమాధి ద్వివిధము వీనిలో సవికల్పసమాధి సాధనరూపముగాను, నిర్వికల్పసమాధి ఫల రూపముగాను ఉన్నది సాధన రూపమయిన సవికల్ప సమాధియందు త్రిపుటీరూపద్వైతము ప్రతీత మయినను అద్వైతము బ్రహ్మరూపము చేత ప్రతీతమయియున్నది మృత్తికా వికారమును మృత్తికారూపమని యెఱుంగుట వలన వివేకికి ఎట్లు మృత్తికావికార మయిన ఘటాదికము ప్రతీత మయినను మృత్తికారూపముచేతనే ప్రతీతమగునో, అట్లు సవికల్పసమాధియందు త్రిపుటీద్వైతము,

బ్రహ్మ రూపముచేతనే ప్రతీతమగుచున్నది నిర్వికల్పసమాధియందు సవికల్పసమాధివలె త్రిపుటీ రూపద్వైతము విద్యమాన మయినను దానియొక్క ప్రతీతి గలుగదు ఎట్లు జలమందు వైచిన లవణము అచ్చట విద్యమానముగా ఉండినను పైన జలముండుటవలన నేత్రముచేత లవణము ప్రతీతము గానేరదో, అట్లు నిర్వికల్ప సమాధియందు త్రిపుటి ప్రతీతము కానేరదు ఈరీతిగ సవికల్పసమాధియందు బ్రహ్మరూపముచేత, త్రిపుటీద్వైతము యొక్క ప్రతీతి గలదు మఱియు నిర్వికల్పసమాధియందు దానియొక్క ప్రతీతి లేదు రెంటియందిట్టి విలక్షణత గలదు

అద్వైతావస్థాన సమాధికి సుషుప్తికి గల భేదము అద్వైతావస్థానరూప సమాధికిని సుషుప్తికిని ఈ భేదము గలదు సుషుప్తియందు వృత్తియొక్క లయము అజ్ఞానమందు అగును అద్వైతావస్థాన సమాధియందు వృత్తియొక్క లయము బ్రహ్మప్రకాశమం దగుచున్నది సుషుప్తియొక్క ఆనందము, అజ్ఞానావృతము ఉక్తసమాధియందు నిరావరణ బ్రహ్మానందమే ప్రకట మగుచున్నది ఇక ఈ సమాధి విషయమై పాతంజల యోగశాస్త్ర విభూతిపాద మున విస్తారముగా కనందగును ఇది బాగుగా తెలిసికొనదగిన విషయమే ఈ గ్రంథము అతి సంగ్రహ మగుటచే విస్తరింపబూనలేదు

ఇక పంచదశిలో గల మహావాక్య అహం ప్రత్యయమును గుఱించి కొద్దిగా తెలిపెద పై జెప్పిన నిర్వికల్పసమాధివలె, ఈ మహావాక్య చతుష్ట యము గూడ ప్రజ్ఞాశాలురు గ్రహించదగినదే అప్పుడే నిర్వికల్పసమాధికిని బ్రహ్మసాక్షాత్కారమునకున్ను ఒకటే యర్థమని గోచరించును అదిన్ని ఇచ్చట సంక్షిప్తముగానే వ్రాయబడును ప్రశ్నోత్తరమాణిక్యమాలాది గ్రంథములలో విస్తరించి తెలిపియుండుటచే అదే మరల ఇచ్చోట వ్రాసిన చర్వితచర్వణ మగును అయినను సందర్భానుగుణముగ కొంచెము తెలుపబడుచున్నది

**1 ప్రజ్ఞానం బ్రహ్మ = ఋగ్వేదము ఐతరేయోపనిషత్తు**

**యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ ।**

స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞానముదీరితమ్ ॥

టీ॥ యేన = చక్షువుద్వారా వ్యాపించిన అంతఃకరణవృత్తితో కూడినట్టి యే చైతన్యముచేత, ఇదం = చూచుటకు యోగ్యమయిన యీ రూపాదికమును, ఈక్షతే = పురుషుడు చూచుచున్నాడో, శృణోతి = కర్ణము ద్వారా శబ్దములను వినుచున్నాడో, జిఘ్రతి = ఘ్రాణముద్వారా గంధముల నాఘ్రాణించుచున్నాడో, స్వాదు+అస్వాదూ = రుచియు అరుచులను, విజానాతి = జిహ్వాచే ఎరుగు చున్నాడో, తత్ = ఆచైతన్యము, ప్రజ్ఞానం = ప్రజ్ఞానమని, ఉదీరితం = చెప్పబడుచున్నది

చర్మముద్వారా స్పర్శమును గ్రహించుచున్నాదో అనునదియు దీనితో చేర్చవలయును ఈ ప్రజ్ఞానము బాగుగా తెలిసికొని రూఢిపరచిన మాత్రమే ఆ ప్రజ్ఞానమే బ్రహ్మమను రెండవ శ్లోకముయొక్క అర్ధము రూఢిపడును అట్లైన మాత్రమే మానవులకు ధైర్యము గల్గును అది అరూఢమయినపుడు బ్రాహ్మణ సమారాధనలో బ్రాహ్మణు డగునా, కాదా అని సంశయము గలవానిని మేనేజర్ అడిగిన, బ్రాహ్మణు డయిననేను బ్రాహ్మణుడని ధైర్యముగా చెప్పుటకు ఎట్లు శక్తిమంతుడగునో, బ్రాహ్మణుడు కానివాడైనచో, బ్రాహ్మణుడు కానివాడు ఏలాగున బ్రాహ్మణుడనని చెప్పుటలో సంశయమున్ను, భయమున్ను గలవాడగునో, అట్లే ఈ ప్రజ్ఞానం బ్రహ్మమను వాక్యమువల్ల అందఱికిని బ్రాహ్మణునికి వలె ధైర్యము గలుగుచుండును ఒకవేళ బ్రాహ్మణేతరుడు బ్రాహ్మణుడని చెప్పినను దానికి సంబంధించిన గోత్ర, సూత్ర, ప్రవర, వేదశాఖలను అడుగునప్పుడు సంపూర్ణముగా తెలియకపోయినచో నెట్లు బాధకు కారణమగు చున్నదో, ఆలాగున ప్రజ్ఞానం బ్రహ్మమను వాక్యములో గూడ నిర్భయత్వము గలుగవలసియుండిన దానికి సంబంధించిన శాస్త్రాను ష్ఠానములు బాగుగా గల్గియుండవలయును లేనిచో అవిద్యచే భయము గల్గును ఈ బోధ యొకటియే కారుచీకటిని ప్రచండభాస్కరుడు పారద్రోలునట్లు, అవిద్యను అవిద్యాకార్యములను హృదయమునుండి పరుగెత్తింప జేయును.

**చతుర్ముఖేంద్రదేవేషు మనుష్యాశ్వగవాదిషు ।**
**చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి ॥**

టీ చతుర్ముఖేన్ద్ర దేవేషు - చతుర్ముఖ = బ్రహ్మదేవునియందును, ఇంద్ర దేవేషు =ఇంద్రాది దేవతలయందును, మనుష్యాశ్వగవాదిషు-మనుష్య = మనుష్యులయందును, అశ్వ = గుఱ్ఱముల యందును, గో+ఆదిషు = గోవు మొదలగు వానియందును గల, ఏకం = ఒకటియగు, చైతన్యం = చైతన్యము, బ్రహ్మ = బ్రహ్మమగును, అతః = ఈ కారణమువలన, మయ్యపి = నా దేహమందుగల, ప్రజ్ఞానం = ప్రజ్ఞానము, బ్రహ్మ = బ్రహ్మమగును

ఈ బోధము దృఢముగా గలిగిన, ఉద్యోగుల సంఘమందు దానికి సంబంధించిన అర్హత గలవాడు తనకును అట్టి యుద్యోగమునకు అర్హత గలదని సధైర్యముగ ఎట్లు వాదింపచ్చునో, అర్హత లేనివాడు ఎటుల వాదింపజాలడో, ఈ ప్రజ్ఞానమే బ్రహ్మమను బోధకల్గిన ముక్తి విషయములోను అంతధైర్యము గల్గును ప్రపంచములోను అంత ధీరత్వము గల్గును ఇది "సూత్రే మణిగణా ఇవ" "దృశ్యతే జలచంద్రవత్" అను అర్థమును నిరూపణము గావించుచున్నది అట్టి ప్రజ్ఞాన బ్రహ్మమను బోధ గల్గునప్పుడు నిర్భయుడై సధైర్యముగ అట్టి బ్రహ్మమే తాననియు, అందఱిలో నుండెడు ప్రజ్ఞానమే బ్రహ్మమని బోధించుటకును శక్తి గలవాడగును ఇది ముముక్షువులగు స్త్రీ పురుష లెల్లరును అవగాహనమును చేసికొనవలసిన ముఖ్యవిషయము లేనిచో జాతి వర్ణాశ్రమ స్త్రీ పురుషాది దేహకల్పిత అజ్ఞానము తప్పక బాధించును అప్పుడు భయము గూడ అట్టి ఆత్మను ఆవరించును ఇట్టి మహాశక్తి ఆత్మానుభవమున నుండుట చేత శ్రీరామతీర్థ వివేకానందాదులు లోకమంతటను బ్రహ్మబోధను సల్పు శక్తిమంతులైరి

అహం బ్రహ్మాఽస్మి = యజుర్వేదము, బృహదారణ్యాకోపనిషత్తు

**పరిపూర్ణః పరాత్మాఽ స్మిన్దేహే విద్యాధికారిణి ।**
**బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహమితీర్యతే ॥**

టీ॥ పరిపూర్ణః = పరిచ్ఛిన్నత్వము లేని పరమాత్మ, అస్మిన్ = ఈ మాయాకల్పిత జగత్తునందు, విద్యాధికారిణి - విద్యా = జ్ఞానసంపాదనమునకు, అధికారిణి = యోగ్యమగు, దేహే = మనుష్యాది శరీరమందు, బుద్దేః = బుద్ధికి, సాక్షితయా = సాక్షిభావముచేత, స్థిత్వా = ఉండి, స్ఫురన్ = ప్రకాశించు చున్నవాడగుచు, అహమితి = నేనని, ఈర్యతే = చెప్పబడుచున్నాడు.

ఇచ్చోట బ్రహ్మసాక్షాత్కారస్థితిలో అహం ప్రత్యయము గలదా, లేదా యని సందేహముయొక్క నివృత్తి యగుచున్నది కావుననే యాప్రకారముగా మొదటనే " దేహమనియు, జీవోఽహమనియు, బ్రహ్మాహమనియు" అహంశబ్దమును మూడుభాగములుగా చేయడ మయినది ఇచ్చట బ్రహ్మసాక్షాత్కారముగల ఆత్మజ్ఞాని అహంశబ్దమును తన ఆత్మయందు పరమాత్మ భావనలో సమన్వయ పరచుచున్నాడు

**స్వతః పూర్ణః పరాత్మాఽత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః ।**
**అస్మీత్యైక్యపరామర్శ స్తేన బ్రహ్మ భవామ్యహమ్ ॥**

టీ॥ స్వతః = స్వాభావికముగా, పూర్ణః = అపరిచ్ఛిన్నుడగు, పరాత్మా = పూర్వోక్తపరమాత్మ, అత్ర = ఈ మహావాక్యమునందు, బ్రహ్మశబ్దేన - బ్రహ్మ = బ్రహ్మమనెడి, శబ్దేన = పదముచేత, వర్ణితః = లక్షణావృత్తిచేత చెప్పబడు చున్నాడు అస్మీతి = ఐతిననెడి పదము, ఐక్య పరామర్శః, ఐక్య = ఏకత్వమును, పరామర్శః = తెలుపుచున్న దగును తేన = అందుచేత, అహం = నేను, బ్రహ్మ = బ్రహ్మము, భవామి = అగుచున్నాను

దీనియందు చెప్పబడిన బ్రహ్మాకారవృత్తి రూఢమగువఱకు మనన నిదిధ్యాసనాదులను చేయవలయును. సాధకునికి ఈ రెండువాక్యములే చాలును

3 **"తత్త్వమసి"** అనువాక్యమున్ను, 4 **"అయమాత్మాబ్రహ్మ"** అను వాక్యమున్ను, ఈ రెండున్ను బోధన వాక్యము లగుటచే, అనగా ఆచార్యుండు ముముక్షువులకు బోధించెడు వాక్యము లగుటచే ఇచ్చట చేర్చలేదు వేదాంత పంచదశి, ఐదవప్రకరణమందు దీనిని విశదముగా కనందగును

**అపరోక్షాత్మవిజ్ఞానం శాబ్దం దేశికపూర్వకమ్ ।**
**సంసార కారకాజ్ఞానతమసశ్చణ్డభాస్కరః ॥**

ఆచార్యునివలన తత్త్వమస్యాది వేదాంతవిచారణద్వారా కల్గిన బ్రహ్మ సాక్షాత్కార రూపమగు అపరోక్షజ్ఞానము సంసార కారణమయిన అజ్ఞానమనెడి చీకటికి మధ్యాహ్నకాల సూర్యుని వంటిది యగును

**స ఆత్మా స చ విజ్ఞేయ స్సర్వైరపి ముముక్షుభిః ।**
**తుర్యాత్మజ్ఞానహీనానాం న ముక్తిస్స్యా ద్యదృదాచన ॥**

ముముక్షువు లందఱిచేతను ఆ ఆత్మవస్తువే లెస్సగా తెలిసి కొనందగినది అట్టి తురీయాత్మ జ్ఞానమును పొందనివారు ఇతరములగు యెన్ని సాధనలు చేసినను మోక్షమును బడయజాలరు

**శ్రుతేశ్శతగుణం విద్యాన్మననం మననాదపి ।**
**నిదిధ్యాసం లక్షగుణమనన్తం నిర్వికల్పకమ్ ॥** (వివేక చూడామణి)

గురుముఖమున వేదాంతవాక్యశ్రవణమును చేయుట యుత్తమము శ్రవణముకంటె మననము నూరురెట్లధికఫలము నిచ్చును మననముకంటె నిదిధ్యాసనము లక్షరెట్లధికఫలము నిచ్చును నిదిధ్యాసనముకంటె నిర్వికల్ప సమాధి అనన్తఫలము నొసంగును

బ్రహ్మవిద్యకు పతనము గల్గుటకు కారణమిచ్చోట నిరూపింపబడినది ఇప్పుడు ముముక్షువులలో చాలామందియు వేదాంత శ్రవణముచే తృప్తిని పొందుచున్నారు వారలలో కొద్దిమంది మాత్రమే మననము జేయువారై యున్నారు నిశ్శేషవాసనారహిత బ్రహ్మసాక్షాత్కారము వఱకు నిదిధ్యాసనమును చేయువారు అరుదయిరి, అదే పూర్వఋషులయొక్క స్థానమును ఇప్పుడుండువారు అధిష్ఠించక పోవుటకు హేతువు,

**ప్రథమం శ్రవణం కృత్వా ద్వితేయే మననం తథా ।**
**నిదిధ్యాసనకం పశ్చాత్సాక్షాత్కారస్తదా భవేత్ ॥**

అని కపిలమహర్షి వచనము 1 మొదట శ్రవణము, 2 మరల మననము, 3 ఆపై నిదిధ్యాసనము, ఈ నిదిధ్యాసమందుమాత్రమే బ్రహ్మ సాక్షాత్కారము గల్గును అప్పుడే యీ బ్రహ్మవిద్య పూర్తియగును అట్లు గానిచో అపూర్ణమే యగును

**శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః**
**శృణ్వన్తోఽపిబహవోఽయం న విద్యుః ।**
**ఆశ్చర్యోక్తా కుశలోస్యఽలబ్ధాఽఽ**
**శ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ॥**

ఈ బ్రహ్మతత్త్వమును గుఱించి వినుటకైనను అనేకవేల జనులలో ఒక్కడైనా లభించుట దుర్లభము ఆలాగున వేలకొలది శ్రవణము చేయువారలో అట్టి ఆత్మను తెలిసికొనినవాడు దుర్లభుడు ఈ బ్రహ్మమునుగూర్చి చెప్పువాడు గూడ లభించుట ఆశ్చర్యము, అనగా దుర్లభుడు ఒకవేళ చెప్పువాడు దొరికినను నిపుణుడు లభించుటకూడ పరమాశ్చర్యము అనగా దుర్లభుడు ఒకవేళ అట్టివాడు దొరికినను బ్రహ్మనిష్ఠుల పరంపరానుగతము గల అనుష్ఠానము గల వాడును దొరకుట దుర్లభము అదియు ఆశ్చర్యమే కావుననే బ్రహ్మజ్ఞానము అభివృద్ధికి వచ్చుటకు మార్గము లేకపోవుచున్నది

మరియు ప్రపంచములోగల న్యాయ వ్యాకరణ జ్యోతిషాది విద్యల నన్నిటిని అభ్యసించి పూర్ణత్వము నొందుటకు అన్తఃకరణశుద్ధి, విషయవిరక్తి, సత్యవచనము, ధర్మానుష్ఠానము, శమదమాదిగుణములు కల్గియుండవలయునని నియమము లేదు కాబట్టియే అట్టి శాస్త్రములలో అధికజనులకున్ను ప్రవేశము గల్గుచున్నది. ఈ బ్రహ్మవిద్యయో అట్టిది కాదు ప్రారంభములోనే బ్రహ్మచర్యము, తపస్సు, చిత్తశుద్ధి, మనస్సుయొక్క ఏకాగ్రత, విషయ వైరాగ్యము గల్గవలయునని విధించుటచే దీనియందు సామాన్య జనులకు ప్రవేశము లేకపోవుచున్నది పూర్వపుణ్యముచే ఆత్మశుద్ధి గలవారై దైవానుగ్రహము గల్గిన వారికిమాత్రమే దీనియందు అభిలాష జనించును అయితే ఇది యింత ప్రయాసముగా నుండినను దీని ఫలమునకు అంత ప్రభావము గలదు

తక్కిన విద్యలు ఇంతప్రయాసము లేనందుచేతనే దానిచే గల్గెడు ఫలము స్వల్ప మగుచున్నది అందుచేతనే శ్రీకృష్ణభగవానుడు కూడా "అధ్యాత్మవిద్యా విద్యానాం" అని వాక్రుచ్చియున్నాడు విద్యలన్నిటిలోను బ్రహ్మవిద్య గొప్పదని యు, అది సాక్షాద్విష్ణుస్వరూపమనియు చెప్పుటకు కారణమిదే మఱియు గీతలో శ్రీభగవానుడు స్వయముగా ఇట్లు వచించెను

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥**

మనుష్యులలో, వేలకొలది సంఖ్యలలో ఒకానొకడు ఆత్మజ్ఞానము కొఱకు యత్నించుచున్నాడు అట్లు యత్నశీలురలో ఒకానొకడు మాత్రమే నిర్విఘ్నముగ అభీష్టసిద్ధిని పూర్తిచేయుచున్నాడు అట్లు సిద్ధిని పొందినవారలలో ఒకానొకడు మాత్రమే నిజముగా పరమాత్మను తెలిసికొని ముక్తుడగుచున్నాడు నిర్వికల్ప సమాధియందు, బ్రహ్మసాక్షాత్కారజ్ఞానమందు అహంప్రత్యయము గలదా? లేదా? అను విషయమై శ్రీశంకరాచార్యులవారి యనుభవవాక్యమున్ను, శ్రుతిస్మృతుల యాశయమున్ను తెలుపబడెను. ఇక ఈ విషయమై శ్రీయోగవాసిష్ఠమున గల వసిష్ఠమునీంద్రుల యాశయమున్ను తెలిపెద

**త్రివిధో రాఘవాస్తీహ త్వహంకారో జగత్త్రయే ।**
**ద్వౌ శ్రేష్ఠావితరస్త్యాజ్యః శృణు త్వం కథయామి తే ॥**

ఓ రామా! ఈ జగంబున మూడువిధములగు అహంకారములు గలవు వానిలో మొదటివి రెండు శ్రేష్ఠములు మూడవది శ్రేష్ఠము గాదు. అయ్యది త్యజింపదగినది వాటినిగూర్చి వచించుచున్నాను వినుము

**అహం సర్వమిదం విశ్వం పరమాత్మాఽహమచ్యుతః ।**
**నాన్యదస్తీతి పరమో విజ్ఞేయా సా హ్యహంకృతిః ॥**
**మోక్షాయైషా న బన్ధాయ జీవన్ముక్తస్య విద్యతే ।**

ఈ జగత్తంతయు పరమాత్మమయమే, అట్టి పరమాత్మయే నేను నాకన్యముగ జగత్తుననదే లేదు అను నీ యహంకారము సర్వోత్తమమని

యెఱుంగవలెను ఈ యహంకారము మోక్షమునే గలుగజేయునుగాని బన్ధనము గాదు ఇయ్యది జీవన్ముక్తున కుండును

సర్వస్మాద్వ్యతిరిక్తోఽహం వాలాగ్రశతకల్పితః ॥
ఇతి యా సంవిదేషాఽసౌ ద్వితీయాఽహంకృతిశ్శుభా ।
మోక్షాయైషా న బన్ధాయ జీవన్ముక్తస్య విద్యతే ॥

నేనన్నిటికంటె భిన్నమై (సాక్షిస్వరూపుడనై) కేశాగ్రభాగముయొక్క నూఱవభాగముకంటెను సూక్ష్మమై యున్నాను ఇట్టి మనోనిశ్చయమున్ను శుభాహంకృతియే యగును ఈ రెండవ యహంకారమున్ను మోక్షమునే కలుగజేయును బన్ధమును కాదు ఇదియు జీవన్ముక్తున కుండవచ్చును

ముందు చెప్పబడినది అద్వైతము ననుసరించి, యీ రెండవది ద్వైతవిశిష్టాద్వైతముల ననుసరించి యని గ్రహించుకొనవలయును శైవ వైష్ణవ సాంఖ్యయోగాది మతము లన్నియు ఈ పద్ధతినే యనుసరించి యుండును

అహంకారాభిధా యా సా కల్ప్యతే న తు వాస్తవీ ।
పాణిపాదాది మాత్రోఽయమహమిత్యేష నిశ్చయః ॥
అహంకార స్తృతీయోఽసౌ లౌకికస్తుచ్ఛ ఏవ సః ।
వర్జ్య ఏవ దురాత్మాఽసౌ శత్రురేవ పరస్స్మృతః ॥

నిర్వికల్ప సమాధియందున్నవారికి రెండహంకారములు కేవలము కల్పనామాత్రములేగాని, వాస్తవములు గావు అవి వ్యహారముకొఱకు మాత్రము ప్రయోగించబడినవి ఇక హస్తపాదాదియుక్తమగు దేహముమాత్రమే నేనను నిశ్చయములౌకికమును, తుచ్ఛమును నగు మూడవ యహంకార మనబడును ఇది నీచమైనది మఱియు నియ్యది ఆత్మజ్ఞానమునకు ప్రబల శత్రువని వచింప బడినది కాన త్యజింపదగును

ఈ మూడవ యహంకారము తప్పక బన్ధము గలుగజేయును ఇది ముముక్షావస్థలో నుండువారికైనను నుండకూడదు

**కృశోఽతిదుఃఖీ బద్ధోఽహం హస్తపాదాదిమానహమ్ ।**
**ఇతి భావానురూపేణ వ్యవహారేణ బధ్యతే ॥**

నేను దుర్బలుండను, అతిదుఃఖిని, బద్ధుడను, హస్తపాదాద్యవయవ సహితుడనని తన్ను భావించుచు, తదనురూపముగ వ్యవహించుచు నుండు జీవుడు బన్ధనమున తగుల్కొనును

**నాహం దుఃఖీ న మే దేహో బంధః కస్యాత్మనః స్థితః ।**
**ఇతి భావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే ॥**

నేను దుఃఖినిగాను, నాకు దేహమే లేదు,ఇక బంధమెవ్వనికి అను నిట్టి యుత్తమభావనలు గల్గి వ్యవహరించువాడు ముక్తుడగును

**సంశాన్తాహంకృతేర్జ్ఞస్తోర్భోగా రోగా మహామతే ।**
**న స్వదన్తే సుతృ ప్తస్య యథా ప్రతివిషా రసాః ॥**

మహామతివగు నో రామా! అహంకారము శమించిన పూర్ణతృప్తుడగు జ్ఞాని భోగము లన్నిటిని రోగములుగ తలంచును అదెటులనగా విషమిశ్రిత రసము వోలె జ్ఞానికి రుచింపకుండును అనగా దీనినతడు పాచిపోయిన క్షీరాన్న మునువలె తలంచును

**తస్మాద్వాసనయా బద్ధం ముక్తం నిర్వాసనం మనః ।**
**రామ నిర్వాసనీభావమాహరస్వ వివేకతః ॥**

కాన, ఓ రామా! వాసనాయుక్తమగు మనస్సు బద్ధముగను, వాసనా రహిత మగునది ముక్తమును నగును అందుచే నీవవశ్యము వాసనారాహిత్య మును కలుగజేసికొనుము

**సమ్యగాలోకనాత్సత్యాద్వాసనా ప్రవిలీయతే ।**
**వాసనావిలయే చేతః శమమాయాతి దీపవత్ ॥**

సత్యవస్తువును బాగుగ విచారించుటచే వాసనలు లెస్సగ నివర్తించును వాసనలు నశించుటచే మనస్సున్ను, తైలము నశించిన దీపమువలె ప్రశమన

మొందును

**మనో నిర్మలతాం యాతం శుభసన్తానవారిభిః ।**
**బ్రాహ్మీం దృష్టిముపాధత్తే రాగం శుక్లపటో యథా ॥**

శుభ్రము చేయబడిన తెల్లనివస్త్రము రంజకద్రవ్యవర్ణమును గ్రహించు నట్లు సమాధ్యభ్యాసజనితమగు ధర్మవృద్ధి యనుజలముచే నైర్మల్య మొందిన మనస్సు బ్రహ్మసంబంధమగు దృష్టిని గ్రహించును

**ఆత్మైవేదం జగదితి వినా భావేన దుఃఖదా ।**
**దృశ్యశ్రీరన్యథా త్వేషా భోగమోక్షప్రదాయినీ ॥**

ఈ జగత్తంతయు ఆత్మస్వరూపమే యనుభావము గల్గియుండనిచో, దృశ్యము దుఃఖప్రదమే యగును కాని అంతయు ఆత్మస్వరూపమేయను జ్ఞానముచే నయ్యది ఇహపర సౌఖ్యముల రెండింటిని ప్రసాదించును (భుక్తిముక్తులను గలుగజేయును )

జీవన్ముక్తులకు దృష్టాదృష్ట ఫలములు రెండు నుపనిషత్తులలో వర్ణింప బడినవి ఇహములో తనకు కావలసిన సర్వసౌఖ్యములున్ను, తాను తలంచిన కార్యము లన్నియు సిద్ధించును పరమందు ముక్తియు సిద్ధించును ప్రాకృత జనులు పరమును తెలిసికొనజాలరు వారికి వర్తమాన స్థితిమాత్రమే గోచరించును కావున బ్రహ్మనిష్ఠునికి గల ప్రభావము సిద్ధులను చూచియైనా వారు జ్ఞానమార్గములో ప్రవర్తింపగలరని తలంచుటే ఈశ్వరుండాలాగున చేయుటకు కారణము మఱియు బ్రహ్మనిష్ఠులలో కొందఱు మందబుద్ధి గలవారైనచో ఈశ్వరుని కరుణచే ఇట్టి దివ్యావస్థ తనకు గలుగునని తలంచి మఱింత భక్తి శ్రద్ధగలవారై ప్రవర్తించుటకు అనుకూలము గలవాడగును ఇచ్చుటనే యింత ప్రభావము సర్వేశ్వరుడు గలుగజేయుటచే ఈ మోక్షము నకున్ను ఏలాటి కొఱంతయు గలుగదని దృఢవిశ్వాసము గల్గుటకు ఇది హేతువగును.



# నిర్వాణ ప్రాప్తికాలము

**ముక్తి రేషోచ్యతే రామ! బ్రహ్మైతత్వముదాహృతమ్ ।**
**నిర్వాణమేతత్కథితం శృణు తత్ప్రాప్యతే కథమ్ ॥**

రామా! ముక్తియని చెప్పబడునదే బ్రహ్మము, నిర్వాణముగూడనై యున్నది దీనిని బడయగల యుపాయమును చెప్పెద వినుము నిర్వాణ మనియు, ముక్తియనియు, బ్రహ్మసాక్షాత్కారమనియు ఒకటేయని మొదటనే తెల్పబడినది దీనియొక్క ప్రాప్తికాల నిర్ణయము ఎవరును నిశ్చయించియుండలేదు ఏలననగా! పూర్వజన్మ సంస్కారము ననుసరించి యది యుండును పూర్వ జన్మములో చాలవరకు పరిపక్వస్థితికి వచ్చియుండు ఆత్మయైనచో, ఈ జన్మములో త్వరలోనే సిద్ధించును వామదేవుడు, శుకుడు, గర్భములోనే యుండి బ్రహ్మసాక్షాత్కారమును పొందినటుల శాస్త్రములో గలదు కపిలవ్యాసాదులు,జన్మమునుండియే తపోవనమునకేగి జీవన్ముక్తిని బడసిరి విశ్వామిత్ర యాజ్ఞవల్క్యాదులు కొంతకాలము, గృహస్థాశ్రమములోనుండి మరల తపోనిష్ఠులై మోక్షమును బడసిరి

అదెటులన శ్రీతిరుపతి వేంకటేశ్వర దర్శనార్థమై చనువారు 7 కొండలను ఎక్కవలయును ఒకడు 7 కొండలను ఎక్కి సాయంకాలమునకు దేవాలయము దగ్గరకు జేరెను మఱియొకడు 6 కొండలెక్కినప్పటికి సూర్యుడస్తమించెను. అతడు రాత్రి యచ్చోటనే మండపములో నుండిపోయెను అలాగున మఱియొకరు 5 కొండలను ఇంకొకడు 3 కొండలను వేఱొకడు 1పర్వతమును ఎక్కిరి ఇతరుడొకడు శేషాచలముయొక్క అడుగు భాగమున నుండెను మరుసటి దినమున సూర్యోదయమైన వెంటనే, శ్రీ వేంకటేశ్వర దేవాలయము తలుపుతీయగానే నిన్నటిదినమున దేవాలయము దగ్గరకువచ్చి యుండువానికి వెంటనే దర్శన మాయెను 6-వ కొండలోనుండు వాడు వచ్చునప్పటికి 8 గంటల సమయ మాయెను అదేరీతిగా క్రింద క్రింద ఉండువారు వచ్చుటకు కాలమధిక మయినటుల ఈ నిర్వాణప్రాప్తికిగూడ

పూర్వజన్మములో సప్తజ్ఞాన భూమికలయందు ఎంతవఱకు వచ్చియుండెనో మరల ఈ జన్మమున నచ్చోటనుండి ప్రయాణము చేసిన చాలును ఒక్కొక్క జ్ఞాన భూమికలో ప్రవేశించినవారికి అంతకంతకు ప్రకృతి రాహిత్యమున్ను నిర్విషయత్వమున్ను ఆత్మప్రకాశమున్ను గల్గి యుండును అదే దానికి గుఱుతు ఈ రీతిగా యోగమార్గములోగూడ పూర్వజన్మములోగల సంస్కార పరిణామము ననుసరించి ప్రత్యాహార ధారణ ధ్యానము లలోగూడ ఎంతవరకు వచ్చియుండునో, యంత త్వరితముగను, యాలస్యముగను నిర్వాణము సమాధిస్థితి గల్గుటకున్ను కాలముయొక్క హెచ్చుతగ్గులు పట్టును

ఈ లాగున నున్నతవిద్యాభ్యాసములో గూడ నుంటున్నది కదా? ఒక కాలేజిలో చేరిన విద్యార్థులలో కొందరి దివరలో బి ఎ కాని, మఱి కొందరు యఫ్ ఎ కాని, వేఱుకొందరు మెట్రిక్యులేషన్, ఇక కొందఱు దానికన్న క్రిందతరగ తిలోను చదివి యుండిన విద్యపూర్తియగు ఎం ఎ ప్యాసు కావలసియుండిన కాలమున మార్పు ఏలాగున గల్గియుండునో, ఈ బ్రహ్మవిద్య పూర్తియగు మోక్షము లోను, నంతపరిణామ వ్యత్యాసము లుండును

కావున జ్ఞానశాస్త్రమగు సప్తజ్ఞానభూమికలయొక్కయు యోగశాస్త్రమగు అష్టాంగ యోగములయొక్కయు, స్థితులను గూర్చి విచారించిన మన మిప్పుడు సప్తజ్ఞానభూమికలలో ఏ భూమియందుంటున్నాము ఆలాగున అష్టాంగ యోగములలో ఎంతవరకు వెళ్ళియున్నాము అనుసంగతి తెలికసికొనవచ్చును ఇదియే శాస్త్రవిచారణచే గల్గెడు ఉపయోగము ఎట్లన మనమొక దూరప్రయాణము చేయుచుండిన మనము చదివియుండిన నిప్పటికి ఎన్ని మైళ్ళ దూరముగా వచ్చితిమి అను విషయమును మైలురాతిలోగల లెక్కలను చూచి తెలిసికొనవచ్చునుగదా! అదియునుగాక నాల్గుమార్గములు చేరిన స్థలములలో వ్రాసిపెట్టిన చేచూపెడు పలకపై ఈ మార్గము పలాని ప్రదేశమునకు పోవుచున్నది అది యిచటనుండి ఎన్నిమైళ్ళు దూరముగా నుంటున్నదని యెటుల తెలిసికొనవచ్చునో యింతమాత్రము విద్యచే

ఉపకారము గల్గును

అయితే మైలు లెక్కను మాత్రమెఱింగిన చాలదు అంతదూరము నడువవలయును అట్లగుచో మాత్రమే గమ్యస్థానమును చేరగలము ఆలాగున విద్యను మాత్రము చదివిన మాత్రము చాలదు దానిలో చెప్పినటుల నాచరింప వలయును అప్పుడే అది ప్రయోజనపడును అనికూడ ముముక్షువులు జ్ఞాపకములోనుంచి ప్రవర్తించవలయును మోక్షవిషయమై కాలనిర్ణయము చేయ సాధ్యపడదనియే సర్వశాస్త్రములును ఐక్యకంఠముగా చెప్పుచున్నది గీతయందు శ్రీకృష్ణభగవానుడున్ను ఈలాగుననే వచించెను

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥**

దీనియర్థ మిదివరలో వ్రాయబడినదియే"యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి" అని చెప్పుటచే ఎప్పుడైతే యజ్ఞాన కలుషిత మోహము నుండి బుద్ధి దాటిపోవునో, యప్పుడే ప్రకృతినుండి విముక్తిని పొందగలదు

**న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**
**తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి ॥**

ఈ లోకమునందు జ్ఞానముతో సమానమైనదియు, పావనమైనదియు, మఱియొకటి లేదు గదా! అట్టి జ్ఞానమును అనుష్ఠానముచే యోగసిద్ధినిపొంది వాడు కాలమాసన్న మగునప్పుడు తనయందు తనంతటనే పొందుచున్నాడు ఇచ్చోటను అనుష్ఠానముచే కాలము పరిపక్వ మగునప్పుడు తనలో జీవబ్రహ్మల ఏకత్వమను జ్ఞానము గలుగునని తెలుపడమైనది తన నేత్ర రోగమును ఇచ్చటనే బాగుపరచకపోయిన మరి యే కాశి బదరికాశ్రమాది స్థలములలోనికి వెళ్ళినను అచ్చటను ఏలాగున ఏమియు చూడజాలడో ఆలాగున పుణ్యాశ్రమములుగాని, పుణ్యక్షేత్రములుగాని, పుణ్యావనములుగాని వెళ్ళినను అందు డేలాగున చూడజాలడో అట్టి స్థితియే వీరికిగూడ కల్గును అయితే నేత్రరోగ నివృత్తి కొఱకెచ్చట అనుకూలమో యంతమాత్రము చూచుకొనవచ్చును

అంతియే విశేషముగాని నేత్రవ్యాధిచికిత్స చేసికొనక ఎచ్చటనుండినను లాభము లేదని మాత్రము తెలిసికొనవలయు

**శ్రవణాదిభిరుద్దీప్త జ్ఞానాగ్నిపరితాపితః ।**
**జీవస్సర్వమలాన్ముక్తస్స్వర్ణవద్ద్యోతతే స్వయమ్ ॥**

సాధన చతుష్టయ సంపన్నుడై శ్రవణ, మనన, నిదిధ్యాసనాదులచే మిక్కిలి ప్రకాశింప జేయబడిన జ్ఞానమను తేజస్సుచేత శోధింపబడిన జీవాత్మ సమస్తసంసారములకు హేతువైన యజ్ఞానమువలన విడివడినవాడై మలిన బంగారము స్ఫుటము చేయునప్పుడు మాలిన్యము నశించి స్వయముగా శుద్ధ బంగారమై ప్రకాశించునటుల ఉండునని ఆత్మవిషయములో తెలిసికొనదగినది

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వన్తం భానుమంధవత్ ॥**

ఆత్మజ్ఞానమను నేత్రము గలవాడు సమస్తమందు వ్యాపించియుండు సచ్చిదానంద స్వరూపాత్మను తననుగా జూచుచున్నాడు దేహాదులే ఆత్మ యను అజ్ఞాననేత్రము గలవాడు ప్రకాశించుచుండు సూర్యుని గ్రుడ్డివాని వలెనే చూడకపోవును

అన్ధునకు సూర్యుడు కనుపింపక పోయినను నేత్రము గలవారికి కానుపింపక పోవునా !

**వివిక్తదేశ ఆసీనో విరాగో విజితేన్ద్రియః ।**
**భావయేదేకమాత్మానం తమనంతమనన్యధీః ॥**

ఏకాన్త ప్రదేశమున కూర్చున్నవాడై, దేనియందును ఆశలేనివాడై, ఇన్ద్రియములను జయించినవాడై, ఆత్మవ్యతిరిక్త వస్తువునందు మనస్సును పోనీయనివాడై, ఏకమైనట్టి దేశ, కాల, వస్తు, పరిచ్ఛేదశూన్యుడైన [illegible] స్వరూపమగు బ్రహ్మము ఆత్మగ దృఢపడువరకు ధ్యానము చేయవలయును అనగా భావించవలయును

**అవచ్ఛిన్న ఇవాజ్ఞానాత్తన్నాశే సతికేవలః ।**
**స్వయం ప్రకాశతే హ్యాత్మా మేఘాపాయేஉంశుమానివ ।**

అజ్ఞానమువలన పరమాత్మ తనయాత్మ కన్యుడుగా తోచుచున్నాడు అవిద్యయొక్క వినాశము గలుగుచుండగా అద్వితీయుడగుచూ మేఘావరణము వదలిపోయినపుడు సూర్యునివలె తాను స్వయముగా వెలుగుచున్నాడు కదా! ఇచ్చట సూర్యుని ఎవరున్ను వెలిగించబనిలేదు అయ్యది స్వయంప్రకాశమై యున్నది గాలిచే మేఘము వదలి పోయిన చాలును ఆలాగున ఆత్మ స్వయం ప్రకాశమైనది అవిద్యావరణమువలన ప్రకాశించుట లేదు కావున అన్తఃకరణము లోగల అజ్ఞానదోషమును విచారణజ్ఞానముచే తొలగించిన చాలును అని ఆత్మబోధము గీతలోను శ్రీకృష్ణభగవానుం డీలాగున తెలుపుచున్నాడు

**ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః।**
**అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥**

మిక్కిలి పట్టుదలతో ధ్యానానుష్ఠానములను జేయుచున్న యోగనిష్ఠుడు సంపూర్ణాంతఃకరణ శుద్ధిగలవాడై అనేక జన్మములయందు అభ్యసించుటవలన పొందదగిన యోగనిష్ఠను పొందుచున్నాడు అందువలన సర్వోత్తమమగు ముక్తిని బడయుచున్నాడు దీనివలనను ముక్తి విషయమై కాలనిర్ణయము లేదనియు, అయ్యది తన ప్రయత్నము ననుసరించి యుండుననియు తెలియ దగినది మనము కాశ్యాది దూరప్రదేశములకు ప్రయాణము చేయవలసియున్న పాదచారులమై, లేక ఎద్దుబండ్లలో ప్రయాణము జేసిన, చాలారోజులు పట్టును రైల్వేప్యాసింజరైన పై జెప్పిన దానికన్న త్వరలోను, మెయిల్‌అయిన దానికన్న శీఘ్రముగాను, విమానమయిన అతిత్వరలోను, ఎటుల చేరగలమో, ఆలాగున మనయొక్క భక్తివైరాగ్య తీవ్రానుష్ఠానములను బట్టి త్వరలోనే, మోక్షమును పొంద వచ్చును. ఈలాగుననే, యోగకర్తయగు పతంజలిమునియు నుపదేశించెను

**స తు దీర్ఘకాలనైరన్తర్య సత్కారాసేవితో దృఢభూమిః ।**

స తు = ఆయోగసిద్ధియన్ననో, చాలకాలము వఱకును, ఎడతెగకయు, తపముచేతను, బ్రహ్మచర్యముతోడ శ్రద్ధతోడను, విద్యచేతను, అనుష్ఠింప బడినదై దృఢస్థితి గలదిగా నగును ఇందువల్లను, యోగారూఢస్థితి గలుగవలసి యుండిన, చిరకాలానుష్ఠాన ముండవలయునని విశదమగుచున్నది

**తత్ర స్థితౌ యత్నో ఽభ్యాసః ।**

అట్టి ఆత్మభావనలో మనస్సును స్థిరమగుటకు ధ్యానధారణాదులలో ఎడతెగని ప్రయత్నము గల్గియుండుటయే అభ్యాసము

**నిర్విచారవైశారద్యేఽధ్యాత్మ ప్రసాదః ।**

నిర్విచార సమాధియందు స్థితి గలుగగా యోగికి అధ్యాత్మ ప్రకాశము గలుగును రజస్తమోగుణముల యాధిక్యముచే, నపరిశుద్ధియు, ఆవరణ రూప మగు మురికియు దొలగి పోయినందున స్వప్రకాశ మగునాత్మ ప్రకటిత మగును

**తజ్జ స్సంస్కారోఽన్య సంస్కార ప్రతిబంధీ ।**

ఆ నిర్విచార ధ్యానముచే గలిగిన శుద్ధసంస్కారము చిత్తవిక్షేపమునకు కారణమగు జన్మ జన్మాంతరములనుండి వచ్చుచుండు రజస్తమస్సులతో గూడిన ప్రకృతి సంస్కారములను తిరస్కరించును అనగా దగ్గఱకు రానీయక తొలగించును ఇదియే ఆచరణచే గలిగెడు ఫలితము

**తస్యా పి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజ స్సమాధిః ।**

ఆత్మప్రజ్ఞా జ్ఞానసంస్కారము దృఢపడగా, పురాతన సంస్కారము లన్నియు నిరోధింపబడుటవలన నిర్బీజ, నిర్వికల్ప సమాధి సిద్ధించును

**సమాధిభావనార్థః క్లేశతమూకరణార్థశ్చ ।**

సమాధి భావనాసిద్ధి రూఢిపడి రాగా అవిద్యాది క్లేశములు క్షీణించు చుండును ఇదియే సాధకులు తమలో చూచుచుండవలసిన విషయము

శుక్లపక్షచంద్రుడు వృద్ధికి రాగా రాగా వెన్నెల ఎక్కువగుటయు, చీకటి నశించుటయు ఏటుల ఉండునో, అనుష్ఠానపరులకు ఆలాగున ప్రకృతి గుణక్షయమున్ను, సత్త్వాదిజ్ఞాన గుణావిర్భావమున్ను శాంతియు, ప్రసన్నతయు కలుగవలయును

**యోగాంగానుష్ఠానాదశుద్ధిక్షయే జ్ఞానదీప్తిరావివేకఖ్యాతేః ।**

యోగాంగానుష్ఠానమువలన, రజస్తమః ప్రయుక్త విపర్యయ జ్ఞానరూప మలము నశింపగా వివేకఖ్యాతిగలిగి సమ్యక్ జ్ఞాన మభివ్యక్త మగును

**బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే ।**
**వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥**

అనేక జన్మములలో ఆచరించుచు వచ్చిన అనుష్ఠానబలమువలన అన్తః కరణము శుద్ధమై, కడపట సమస్తమును వాసుదేవమయమను జ్ఞానము గలవాడగుచు నన్ను పొందుచున్నాడు అట్టి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడు అని గీత

ఇచట భక్తులకు నొక సందేహము పొడముట కవకాశము గలదు అదేమన "బహూనాం జన్మనామన్తే"అని చెప్పుటలో, అనేక జన్మములు జరిగిన పిమ్మట జ్ఞానము గల్గి ముక్తి సిద్ధించునని చెప్పుటచే ఇప్పుడెచట మోక్షము గల్గును? లేక ఒకే జన్మములో గలుగునదా మోక్షము? అని చెప్పువారు గూడ గలరు దీనివల్ల తన తీవ్ర వైరాగ్యానుష్ఠానమునకు ఆటంకము గలుగును దీని యర్థ మది గాదు అనేక జన్మములనుండి పుణ్యకర్మ దైవానుష్ఠానము చేసి వచ్చినందుచే ఇప్పటికి విషయములో విరక్తిగల్గి అన్తఃకరణశుద్ధి గల్గి జ్ఞానము పొందవలయునని దృఢబుద్ధి గలిగినటుల తలంచవలయును

ఇప్పుడు మోక్షద్వారము దగ్గఱకు వచ్చువారికి ఇక ఆవరణమను నొక దోషము మాత్రమే గలదు అనగా సంకల్పరాహిత్యము గల్గి స్వప్రబోధము ఉదయించిన జాలును దానికి ఓంకారముగాని, మహావాక్యముగాని, నిశ్చింతతో ఏకాన్తమున కొద్దికాలమునుండి ధ్యానమొనరించిన చాలును. మఱియు తాను

పొందదలంచిన యుద్యోగ మెంత గొప్పదో, దానికి అంత ఎక్కువ కాలము చదుపవలసి యున్నదిగదా యని ముముక్షువులు హృదయమున నుంచికొని యనుష్ఠానము చేయవలయును

మఱియు ఏ వృక్షమునుండి యెక్కువ ఫలము ఎక్కువ కాలమువరకు గల్గునో అది ఫలించుటకున్ను ఎక్కువ కాలము పట్టునుగదా! కూరగాయల చెట్లు వంగ, బెండ, మొదలయినవి త్వరలో ఫలించును ఫలమున్ను స్వల్పము అరటిచెట్టు సంవత్సరమునకు ఫలమిచ్చును ఇది పై జెప్పిన కూరగాయల చెట్లకన్న ఎక్కువ విలువను గలుగజేయును పనస, మామిడి, కొబ్బరి చెట్లు ఫలించుటకు మరింత ఎక్కువకాలము పట్టును ఇవి ఫలములను ఇవ్వ ప్రారంభించిన చాలా సంవత్సరములు ఫలము నిచ్చునవేగాక, అధికవిలువను గూడ గలుగజేయును కావున మనహృదయ ములో పెట్టినది బ్రహ్మబీజము ఇది ఫలింప ప్రారంభించిన అనన్తానందమగు జ్ఞానఫలము అనన్తకల్పములు దాటిపోయినను తరుగని బ్రహ్మానందము నిచ్చును గదా! దీనియొక్క మహిమాతిశయము తెలిసికొనిన మనమిప్పటికి చేసిన త్యాగము అనుష్ఠానము చాల స్వల్పమని అర్థమగును మఱియు కారణరూపమగు వృక్షమునుండి యేర్పడిన కార్యరూపమగు బీజము, మరల కారణరూపమగు వటవృక్షమై మారుటకు ఎంతకాలము పట్టునో మీరే యూహించుకొనవచ్చును

అదియునుగాక బీజము పంచభూతాత్మక మగుటచే పంచభూతముల సహాయమున్ను గలుగవలయును ఇచట పంచశీలములు 1 వైరాగ్యము, 2 భక్తి, 3 ధ్యానము 4. వేదాంతవిచారణ, 5 తపస్సు అనునవి సరిగా నుండిన మాత్రమే పూర్ణత్వము పొందగలము వృక్షమున కేలాగున భూసత్త్వము, జల సత్త్వము, అగ్నిసత్త్వము, వాయుసత్త్వము,ఆకాశసత్త్వము - ఎటు లవసరములో జీవత్వోపాధి పోయి పూర్ణబ్రహ్మప్రబోధము గలుగుటకున్ను పై జెప్పిన యైదు సాధనములున్ను గల్గియుండవలయునని ముముక్షువులు నిరన్తరము జ్ఞాపకములో నుంచి అనుష్ఠించవయును దీనియందు మరియొక రహస్యము గూడ గలదు వృక్షశాస్త్ర ప్రకారము ఒక్కొక్క చెట్టున్ను ఇంతకాలమునకు

ఫలించునని నియమము గలదు అయితే సరియగు పోషణ లేనిచో పురుగుల యొక్కగాని పశువులయొక్కగాని బాధ గలిగిన ఫలించుటకు మఱింత ఎక్కువ కాలము పట్టును ఆలాగున మీ యాచరణములో కొఱంత జనించినను, ప్రకృతిగుణములగు పురుగులు హృదయమున ప్రవేశించినను, క్రోధాదులగు పశువులు మేసిపోయినను మీరనుకొన్న కాలమునకు బ్రహ్మా నందఫలము గలుగదనికూడ జ్ఞాపకములో నుంచవలయును యతి ధర్మసంగ్రహమున తెలిపినది చూడుడు

**జపాద్జ్ఞానాత్తథా ధ్యానాన్నాన్యద్భిక్షోస్తు శోధనమ్ ।**
**తస్మాత్త్రాని సదా కుర్యాద్యతిశ్శుద్ధ్యర్థ మాత్మనః ॥**

ఆత్మశుద్ధికొఱకు, ప్రణవాది జపముకన్నను, ఆత్మవిచారణ జ్ఞానము కన్నను, పరమాత్మధ్యానముకన్నను మించినది నివృత్తి మార్గమందు యత్నించు వారికి మఱియొకటి లేదు కావున నీ మూడింటిని తప్పక యెల్లప్పుడును బ్రహ్మనిష్ఠలు చేయుచుండవలయును ఇచ్చట జ్ఞానశబ్దమునకు ఉపనిషత్ప్ర రనమని అర్థమును గ్రహించుకొనవలయును

**యో వై వాఙ్మనసీ సమ్యగసంయచ్ఛన్ధియా యతిః ।**
**తస్య వ్రతం తపో జ్ఞానం స్రవత్యాశు ఘటామ్బువత్ ॥**

ఎవడైతే వాక్, మనస్సులను, బుద్ధితో సహా లెస్సగా సంయమ మొనర్పడో, అతని వ్రతము తపస్సు, జ్ఞానము, రంధ్రము పడిన ఘటము నుండి జలము కారిపోవునటుల నశించిపోవును ఇట్టి సంయమన స్థితి గల్గిన ప్పుడే, త్రిపుటియొక్క ఏకత్వము సిద్ధించును 1 మనస్సులో ఎటుల తలంచునో, ఆలాగున వాక్కుతో చెప్పుటయు, వాక్కుతో చెప్పినటుల, దేహేంద్రియములచే చేయించుటయు గలిగినప్పుడే సంయమనమని చెప్పబడును ఇంత ప్రయాసము మఱియొకటి లేదు ఆచరణలో పెట్టినప్పుడే దీనియొక్క ప్రయాసము తెలియనగును అయితే ఎంతవఱకు వీనియొక్క ఏకత్వము గలుగలేదో అంతవఱకు దీపమును వెలిగించ దలంచువాడు చీకటి

గదిలో నొకమూలలో, ప్రమిదయు, ఇంకొక మూలలో వత్తియు, మఱియొక మూలలో చమురున్ను పెట్టి దీపమును వెలిగించజూచిన, అయ్యది ఎప్పుడైనను వెలుగునా? వెలుగనిచో చీకటి తొలగునా? మనోవాక్కాయ కర్మల ఏకత్వము లేనివారు, హృదయములో జ్ఞానజ్యోతిని వెలిగించుటకు చేసెడు ప్రయత్న మున్ను అట్టిదే

**అబ్రువం యదహం తాత ఆత్మసాక్షికమంజసా ।**
**నైవ స్త్రీ న పుమానేతన్నైవ చేదం నపుంసకమ్ ॥**

ఓనాయనా! నేను ఆత్మసాక్షిగా సత్యముగా, యాత్మస్వరూప జ్ఞానమును తెలిపితినో, అట్టి పరమాత్మస్వరూపము, స్త్రీయు, పురుషుడు, నపుంసకుడు కాదు ఏయే యుపాధిని యాత్మ గ్రహించునో, ఆ యా రూపమును ధరించుచుండును

**అపి వర్ణావకృష్టస్తు నారీ వా ధర్మకాంక్షిణీ ।**
**తావప్యేతేన మార్గేణ గచ్ఛేతాం పరమాం గతిమ్ ॥**

తక్కువజాతిలో, జన్మించిన వాడైనను లేక స్త్రీ యైనను ఈ జ్ఞానమనెడు ధర్మమార్గమును అనుష్ఠించి వచ్చినచో తప్పక వారున్ను సర్వోత్కృష్టమయిన బ్రహ్మపదమును, పొందగలరు దీనియందు ఏలాటి సంశయము లేదు అని భీష్ముడు ధర్మజునకు శాంతిపర్వమున ప్రమాణము చేసి చెప్పెను అట్టివారే మోక్షము పొందగలరు అని చెప్పునప్పుడు, తక్కినవారిని గుఱించి మరల చెప్పవలయునా అని భావము ఇదే రీతిగా దీనియందు నొక శ్లోకము గలదు

**మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః ।**
**స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాం గతిమ్ ॥**

ఓ యర్జునా! పాపజన్మము గలవారెవరు గలరో, అట్టి వారున్ను, స్త్రీలున్ను, వైశ్యులున్ను, శూద్రులున్ను, నన్ను ఆశ్రయించి సర్వోత్కృష్టమగు విష్ణుపదమును (మోక్షమును) పొందుచున్నారు ఇట్లుండగా తదితరులను గూర్చి చెప్పవలయునా అని యూహార్థము

చిరకాల సాధనవల్లనే యోగవాసిష్ఠమున చెప్పబడిన చూడాల గూడ, ఆత్మశాంతిని పొందినట్లు వర్ణించడమైనది

**ఇతి సంచిన్తయామాస చిరాయేత్థం వ్యబుద్ధ్యత ।**
**అహోను చిరకాలేన జ్ఞాతం జ్ఞేయమనామయమ్ ॥**

చిరకాలమునకు తర్వాత, ఆ చూడాల ఆత్మతత్త్వమును (వర్ణింపబోవు విధమున) గ్రహించి ఇట్లనుకొన దొడగెను ఆహా! ఎట్టి అదృష్టము! నిర్మలమగు జ్ఞానమును చాల కాలమునకు పిదప నే నిపుడు గ్రహింపగల్గితిని

**ఆత్మన్యేవాత్మభావేన సర్వవ్యాపి నిరఞ్జనమ్ ।**
**చిన్మాత్ర మమలోఽస్మీతి జ్ఞానాదిత్యేన నశ్యతి ॥**

ఆత్మయందు పరమాత్మ భావన చేయుటచేత నుదయించునట్టి సర్వవ్యాప్తియై, నిరంజనమై, నిర్మలమైనట్టి, చిన్మాత్రమే నేనను జ్ఞానరూప సూర్యునిచేతనే ఆ యజ్ఞానము నశించును

**సర్వసంగపరిత్యాగః సర్వద్వన్ద్వ సహిష్ణుతా ।**
**సర్వభూత సమత్వం చ మోక్షస్య విధి పుత్రక ॥**

శ్రీవ్యాసులు తమ ఆత్మ పుత్రుడగు శుకునకు ఈ తత్త్వము నుపదేశించెను ఓ కుమారుడా! మోక్షమునకు సమస్తసంగమునుండి విముక్తియు, సకల ద్వంద్వములను సహించుటయు, సర్వభూతములయందు సమత్వము గల్గియుండుటయే ముఖ్యకారణ మగును ఇట్టి స్థితి గలుగునప్పుడు మోక్షము కరతలామలకముగ సిద్ధించును

**యత్ర రాగాదిరహితా వాసుదేవ పరాయణాః ।**
**తత్ర సన్నిహితో విష్ణుర్యతస్తీర్థమయో హి సః ॥**

ఎవరైతే విషయరాగాది రహితులై యున్నారో, ఎవరు శ్రీవాసుదేవ నారాయణ పరబ్రహ్మ పరాయణులై యుందురో, వారియెదుట సాక్షాద్విష్ణు మూర్తియు సాన్నిధ్యము గల్గియుండును విష్ణుమూర్తి యేలాగున తీర్థమయుడో,

ఆలాగున అట్టివారుగూడ తీర్థస్వరూపు లగుదురు అనగా ఇతరులను తరింపజేయగల వారగుదురు అదియును అట్టివారి సాన్నిధ్యము సర్వతీర్థమున స్నానమాచ రించిన ఫలమునుగూడ కలుగజేయును ఈ ఆత్మతత్త్వప్రాప్తియు చాలాకాల మొనర్చిన సాధనమువల్లనే లభింపబడునని శ్రీ వేమన యోగీంద్రుడు గూడ తెలిపెను

**వెదకి వెదకి వెదకి వేసారి వేసారి, తిరిగి తిరిగి తిరిగి దిమ్మతిరిగి**
**బొమ్మలాటజూచి పోబడి గంటిరా, విశ్వదాభిరామ వినుర వేమ! ॥**
**వెదకవెదక దొరకు వేదాంత వేద్యుండువెదుకువాని తాను వెదకుచుండు**
**వెదక నేర్చినట్టి వెరవర్లు గలరొకో, విశ్వదాభిరామ వినురవేమ! ॥**



# నిర్వాణ సుఖము

**మిథస్సంపన్న యోర్ద్రష్టృదృశ్యయోరేకసంఖ్యయోః ।**
**ద్వయాభావే స్థితిం యాతి నిర్వాణమవశిష్యతే ॥**

పరస్పరసాపేక్షములగు ద్రష్టృదృశ్యములు విలయ మగుచో, మిగులు నదే నిర్వాణము ద్రష్టృదృశ్యదర్శనములగు త్రిపుటి నశించిన స్థితి యేది గలదో, అదియే నిర్వాణము అదియే బ్రహ్మసాక్షాత్కారము త్రిపుటిని గుఱించి యీ గ్రంథముయొక్క ప్రప్రథమమున వ్రాయబడియున్నది నిర్వాణమున్నను, మోక్షమనియు, ఒకేయర్థమను విషయమై యిదివరలో తెలుపడమైనది కదా! దీని యందంత మహిమ లేనిచో, రాజాధిరాజులు రాజ్యసౌఖ్యము లన్నిటిని తృణీకరించి వానప్రస్థాశ్రమమునకు వెళ్ళెదరా ? వనమున తపశ్చర్యలను శీలింతురా? కట్టకడకు ధర్మరాజాదులు సార్వభౌమత్వమును సంపాదించియు ఆఖరున నిర్వాసనాస్థితియగు నిర్వాణమును పొందుటకై వనమున కేగిరి ఇది భారత మహాప్రస్థానపర్వమున చూడనగును ఆలాగున శ్రీగౌతమ బుద్ధుడు దేవేంద్ర సుఖమునకు మించిన రాజ్యసౌఖ్యమును తుచ్ఛమని తలంచి భిక్షుకవృత్తి నవలంబించునా? ఆలాగున సర్వశాస్త్ర పారంగతులున్ను, సర్వజ్ఞులగు శ్రీశంక

రాచార్యులున్ను, మధ్వాచార్యులున్ను,రామానుజాచార్యులున్ను, పారివ్రాజక మార్గము నవలంబింతురా! అదేరీతిగా వర్తమాన కాలములో నుండిన పాశ్చాత్య విద్యా పారంగతులును, ప్రజ్ఞానిధులును, సర్వాంగ సుందరులును, నవయౌవ నారంభాధిష్ఠాన కాలమున శ్రీవివేకానందులు, శ్రీ రామతీర్థులు అవలంబించిన యత్యాశ్రమమునుగూర్చి యాలోచించుకొనుడు ఇకను పెక్కండ్రను విచారించిన దీనిలో గల మహిమ గోచరించును ఈ విషయమై ఉత్కృష్ట శాస్త్రములో చెప్పిన కొన్ని ప్రమాణ వాక్యములను తెలిపెద

**నాతః సుఖతరం కించిత్త్రిషు లోకేషు విద్యతే ।**
**వీతతృష్ణస్య కామేభ్యో ముక్తసంగస్య యత్సుఖమ్ ॥**

కామాది సమస్త విషయములనుండి విడువబడినవాడును, ప్రపంచ సంగమునుండి విముక్తుడైన వానికిన్ని ఎట్టి యాత్మసుఖము గలదో దానికి సదృశమగు సౌఖ్యము మూడు లోకములలోను మఱియొకటి కొంచెమైనను లేదు

**న తత్సుఖం సురేన్ద్రస్య న సుఖం చక్రవర్తినామ్ ।**
**యత్సుఖం వీతరాగస్య మునేరేకాన్తవాసినః ॥**

ఏకాంతవాసియై, రాగరహితుడై మౌన (మనన) శీలుడగు మహాత్మునకు ఎట్టి బ్రహ్మానంద సుఖము గలదో, నట్టిసుఖము దేవేన్ద్రునికిగాని, చక్రవర్తు లకుగాని లేనేలేదు అట్లుండగా ఇక సామాన్య మనుష్యులనుగూర్చి మఱి చెప్పవలయునా?

**రసం బ్రహ్మ పిబేద్యశ్చ తృప్తో యః పరమాత్మని ।**
**ఇన్ద్రం చ మన్యతే భృత్యం నృపాణాం తత్ర కా కథా ॥**

ఏ మహాత్ముడు బ్రహ్మానందరసము ననుభవించి పరమాత్మ ధ్యానమందు తృప్తు డగుచున్నాడో, అట్టి మహాత్ముడు దేవేన్ద్రుని గూడ కడుపేద వానివలెను, భృత్యుని వలెను తలంచును అట్లుండ మహారాజుల స్థితిని గాని, వారల సౌఖ్యమునుగాని గురించి మరల ఏమి తలంచును?

న చేన్ద్రస్య సుఖం కించిన్నసుఖం చక్రవర్తినామ్ ।
సుఖమస్తి విరక్తస్య మునేరేకాన్తవాసినః ॥

న సుఖం దేవరాజస్య న సుఖం చక్రవర్తినామ్ ।
యాదృశం వీతరాగస్య మునేరేకాంతవాసినః ॥

ఏకాంతమందుండి బ్రహ్మనిష్ఠనుజేయు విషయ విరక్తునకు ఎట్టి ఆత్మ సుఖము గలదో అటువంటి సుఖములో కొంతభాగ మైనను దేవేన్ద్రునికిగాని, చక్రవర్తులకుగాని లేదు అని శివతత్త్వజ్ఞానము రెండవ శ్లోకము గురుగీత యందు పరమశివుండు పార్వతి కుపదేశించెను రెండింటికి ఒకటే యర్థము ఈ యాత్మైక జ్ఞానవిషయమై శ్రీమద్భాగవతము ప్రహ్లాదుని వాక్యములను వినుడు

మందార మకరన్ద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికల దూగు
రాయంచ జనునె తరంగిణులకు
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేన్దు చన్ద్రికా స్ఫురితచకోరం
బరుగునే సాన్ద్రనీహారములకు

అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబు జేరనేర్చు?
వినుతగుణశీల మాటలు వేయు నేల?

ఆత్మసుఖముయొక్కయు, ప్రకృతిసుఖముయొక్కయు, భేదమును గుఱించి యిచ్చోట తెలుపబడుచున్నది మందార పుష్పములో గల తేనెను గ్రోలుచుండు తుమ్మెద మంగచెట్లు మొదలగు ముండ్లచెట్లలోగల బంక

కొఱకు వెడలునా? స్వర్గనదియందు విహరించెడు రాజహంసము బురదనీరు నిండిన కాలువలకు వెళ్లునా? లేత మామిడిచిగురులను తినుచుండు కోయిల ముండ్లతో కూడిన చెట్లను ప్రవేశించునా? పూర్ణచంద్రు డుదయించు సమయమున చన్ద్రికా రసాస్వాదనమును జేయు చకోరపక్షి దట్టమైన మంచును జేరునా? ఆలాగున సాక్షాత్ శ్రీ మన్నారాయణ చరణారవిందామృత పానమును చేసెడు చిత్తము ఏలాగున ఇతరవిషయములకై చనును? ఈ పద్యమును బాగుగా ఆలోచించిన యాత్మసుఖ మేలాటిదో, ప్రాకృతసుఖ మెట్టిదో తెలసికొనవచ్చును ఈ విషయమై వేదాంత డిండిమమందు శ్రీశంకరులు వచించినది చూడుడు

**సుఖమల్పం బహుక్లేశో విషయ గ్రాహిణాం నృణామ్ ।**
**అనంతం బ్రహ్మనిష్ఠానా మితి వేదాంత డిండిమః ॥**

విషయాసక్తి గలవారికి సుఖము మొట్టమొదట స్వల్పముగా కనుపించి నను అనంతరము దుఃఖ మధికము బ్రహ్మనిష్ఠుల కారంభమున స్వల్పముగా క్లేశము కనుపించినను కట్టకడకు కలిగెడు సుఖము అనన్తము అని వేదాంతభేరి ఘోషించుచున్నది

**అసత్యస్సర్వసంసారో రసాభాసాది దూషితః ।**
**ఉపేక్ష్యో బ్రహ్మ విజ్ఞేయమితి వేదాంతడిండిమః ॥**

ఈ సమస్తసంసారమును లేనిది అనగా మిధ్యాకల్పితము గాని వాస్తవము కాదు అందును రసాభాసాది దోషములతో గూడినది ఆభాస మనగా మొదట తోచి తరువాత లేనిది రసాభాస మనగా మొదట సుఖకర ముగా దోచి చివరకు దుఃఖమునే గలుగజేయునది కనుక సంసారమును ఉపేక్షింపవలయును బ్రహ్మమును తెలియవలయు నని వేదారతడిండిమము, వేదాంతడిండిమ మనగా వేదాంతమనెడు భేరి యనియర్థము రసాభాస మనగా విషము కలిసిన క్షీరాన్నము వంటిది మొదట మధురముగా కనబడినను తర్వాత ప్రాణాంతక మగును విషయసుఖము లన్నియు ఇట్టివేయని ముముక్షు

వులు గ్రహించు కొనవలయును అది ఎరతో గూడిన గాలమువంటిది మత్స్యములు మాంసము నభిలషించి మ్రింగుటచే గాలము గొంతులో తగుల్కొని మృత్యువుపాలగు నటులుండును ఈ విషయమై వాసిష్ఠమున చెప్పినది చూడుడు

**దక్షిణాం కకుభం గచ్ఛన్కః ప్రాప్నోత్యుత్తరాం దిశమ్ ।**
**సంకల్పార్థపరైరేవ సంకల్పార్థోఽవగమ్యతే ॥**

దక్షిణదిక్కునకు ప్రయాణ మొనరించి ఎవరైనను ఉత్తరదిక్కును పొందగలరా? ఎవరు దేనియందు సంకల్పనిష్ఠ గల్గియున్నారో, వారు దానిని పొందగలరు అనగా విషయ సంకల్పము గలవారు నిర్విషయములచే పొందదగిన బ్రహ్మము నెటుల పొందగలరు? దక్షిణదిక్కునకు విడువబడిన బాణము ఉత్తరదిక్కున లక్ష్యము నెటుల భేదించగల్గును? ఈ విషయమై శ్రీయేసు క్రీస్తు ఈ లాగున ఒక భుక్తిముక్తి సుఖము కావలయునని యడిగిన జిజ్ఞాసువు కొఱకు చెప్పెను అదేమన ఒకేరేవునుండి ఏకకాలమున ఉత్తరదక్షిణ ప్రదేశములకు వెళ్ళెడు రెండునావలపై ఒకడు ఎటుల ప్రయాణము చేయగల్గును? ఈ అర్థమును ముముక్షువులు బాగుగా విచారణ చేసిన ప్రవృత్తినివృత్తి మార్గముల సత్యము తెలిసికొనగలరు శ్రీకృష్ణభగవానుడు గీతలో ఈలాగున చెప్పిరి

**యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్ ।**
**తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధి ప్రసాదజమ్ ॥**

సత్యధర్మ బ్రహ్మనిష్ఠాదులు ప్రప్రథమమున విషమువలె విషమస్థితిగా కనుపించినను పరిణామము గలిగి రాగా రాగా అవి అమృతసమానములుగా మారుచుండును అట్టి పరమాత్మ విషయకమైన బుద్ధియొక్క నైర్మల్యము వలన గలిగిన సుఖము సాత్త్వికమని యోగులచే చెప్పబడుచున్నది

**విషయేంద్రియ సంయోగా ద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।**
**పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥**

విషయములచే ఇంద్రియములద్వారా ఏ సుఖము కలుగునో అది ప్రథమమున అమృతమువలె కనుపించినను, పరిణామావస్థ గలిగి రాగా రాగా కాలకూట విషమువలె నగును అట్టి ఇంద్రియసుఖము రాజసుఖమని బ్రహ్మవేత్తలచే తలంచబడెను

**యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।**
**అద్యన్తవన్తః కౌన్తేయ ! న తేసు రమతే బుధః ॥**

విషయేన్ద్రియ సంయోగమువలన బుట్టిన సుఖానుభవములు దుఃఖమునకు కారణము లయినవి ఆద్యంతములు గలవి అని తలంచి నిర్మలబుద్ధి గలవాడు విషయసుఖములపై ఆసక్తికొనడు ఆద్యంతమనగా, ఒక క్షణముండి యుత్తరక్షణమున నశించునది, "దుఃఖయోనయః" అని ప్రయోగించుటచే ఊరకనే నశించునవేగాక అనేక దుఃఖములను గూడ గలిగించియే నశించునని భావము

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥**

బాహ్యవిషయముల యందాసక్తిలేని యే పురుషుడు తన యాత్మ యందు ఏ సుఖమును పొందుచున్నాడో, అట్టి పురుషుడు బ్రహ్మనిష్ఠయయిన సమాధితో గూడుకొనిన మనస్సు గలవాడై అక్షయమగు బ్రహ్మానందము ననుభవించుచున్నాడు

**మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ! శీతోష్ణసుఖదుఃఖదాః ।**
**ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత! ॥**

ఓ యర్జునా! ఇంద్రియములకు శబ్దాదివిషయములతోడ గలిగెడు సంబంధములు, శీతోష్ణములను తన్మూలకముగా సుఖదుఃఖములను కలుగజేయునవియు, రాకపోకలు గలవియు, స్థిరములు గానివియు నగుచున్నవి కావున దానిని సహించుకొనుము

బ్రహ్మనిష్ఠుల బలమంతయు ద్వన్ద్వములను సహించుకొనుటలోనే గలదు లేక స్వరూపస్థితినుండి జారనీయక చూచుటలోనే కన్పడును. అట్టి జ్ఞేయ బ్రహ్మమునుండి యంతఃకరణము లోనికి గాని, ఇంద్రియములలోనికి గాని, దేహములలోనికి గాని, దృశ్యములోనికి గాని జారినచో అదియే సంసారసాగరములోనికి జారిపడుట యని తెలియవలయును ఇచ్చట తన మనోబలము, సంయమబలము, శ్రవణబలము చూపందగును జనబాహుళ్య ము గల ప్రధానవీధియందు మోటారు నడుపు డ్రైవర్‌వలెను, గాలివానలో పడవ నడుపు చుక్కానివానివలెను బ్రహ్మనిష్ఠ లుండవలయును మోటార్ డ్రైవరు కనురెప్పపాటులో అజాగ్రత్త గలిగిన ప్రమాదమును జెందును బ్రహ్మనిష్ఠుల దృష్టియు ఆలాగున నుండవలయును మఱియు ఆత్మబోధము ఉపదేశించు నది చూడుడు

**యల్లాభాన్నాపరో లాభో యత్సుఖాన్నాపరం సుఖమ్ ।**
**యజ్జ్ఞానాన్నాపరం జ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్ ॥**

ఏ సచ్చిదానంద స్వరూపముయొక్క లాభముకంటే వేఱే యధికమగు లాభము లేదో, ఏబ్రహ్మముయొక్క ఆనందము కంటే వేఱే యధికానందము లేదో, ఏ బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము కంటే వేఱే అధికమయిన జ్ఞానము లేదో అది పరిపూర్ణ బ్రహ్మమని నిశ్చయముగా తెలిసికొనవలయును

**అఖండానందరూపస్య తస్యానందలవాశ్రితాః ।**
**బ్రహ్మాద్యాస్తారతమ్యేవ భవన్త్యానందినో లవాః ॥**

బ్రహ్మవిష్ణు మహేశ్వర ఇన్ద్రాదు లెల్లరును పరిచ్ఛిన్నానందమును గలవారుగాను, అల్పానందము గలవారుగను ఉండుటవలన వారి యానం దములు, అఖండానందమగు ఆత్మానందమునకు సమములు గావని తెలిసికొనవలయును ఇప్పుడు బృహదారణ్యకోపనిషత్తునందు తెలుపబడిన బ్రహ్మనిష్ఠుని యొక్క నిరతిశయానంద సుఖ మెటువంటిదో, నిరూపింపబడు చున్నది దీనిని తెలిసిన ఋషులు పొందిన బ్రహ్మసుఖ మెట్టిదో అర్థమగును

**స యో మనుష్యాణాగ్ రాద్ధః సమృద్ధో భవత్యన్యేషామధిపతి స్సర్వై ర్మానుష్యై ర్భోగైస్సమ్పన్నతమః స మనుష్యాణాం పరమ ఆనన్దోఽథ' యే శతం మనుష్యాణా మానన్దాఃస ఏకః పితౄణాం జితలోకానా మానన్దోఽథ యే శతం పితౄణాం జితలోకానామానన్దాః స ఏకో గంధర్వలోక అనన్దోఽథ.**

మనుష్యాణాం = మనుష్యులలో,రాద్ధః = సంసిద్ధుడగు, (సమగ్రమైన అవయవములు గలవాడగు) స, యః = ఒకానొకడైన జనుడు, సమృద్ధః = సంపత్తిగలవాడును (ఉపభోగోపకరణ సంపత్తిగల వాడును), అన్యేషాం = ఇతరులకు, అధిపతిః = స్వతన్త్ర ప్రభువునై, సర్వైః = సమస్తములయిన, మానుష్యైః = మనుష్యసంబంధములగు, భోగైః = భోగముల చేతను, సమ్పన్న తమః = సమ్పన్నులగువారిలో అతిశయముగా సమ్పన్నుండగు వాడుగ, భవతి = అగుచున్నాడు

ఇది పూర్ణమైన మనుష్యానందముయొక్క పర్యవసాన మగును అనగా సర్వావయవ సమన్వితుడై సర్వసౌభాగ్యవంతుడై, సార్వభౌముడై యుండువాని ఆనందము మనుష్యానందము యొక్క అంతమని గ్రహించదగినది

అథ = అనన్తరము, మనుష్యాణాం = మనుష్యులయొక్క, శతం = నూటింతలగు, ఆనన్దాః = ఆనన్దములు, యే = ఏవియో (తే = అవి), జితలో కానాం = జయింపబడిన లోకములుగల, పితౄణాం = పితృదేవతలయొక్క, ఏకః = ఒకటియగు, సః = ఆ, ఆనన్దః = ఆనందము, (భవతి = అగుచున్నది) అట్టి పూర్ణమనుష్యానందముల నూరురెట్లు గలది పితృదేవతల యానంద మగుచున్నది

అథ = అనన్తరము, జితలోకానాం = జయింపబడిన లోకములు గల, పితౄణాం = పితృదేవతలయొక్క, శతం = నూటింత లయిన, ఆనన్దాః = ఆనందములు, యే = ఏవియో, (తే = అవి) ఏకః = ఒకటి యగు,గంధర్వలోక ఆనందః, గంధర్వలోక = గంధర్వలోకము యొక్క, ఆనన్దః = ఆనందము (భవతి = అగుచున్నది).

ఈ పితృదేవతల నూరురెట్ల ఆనందము గంధర్వలోకము యొక్క ఒక ఆనంద మగుచున్నది అనగా గంధర్వుల యానంద మగుచున్నదని భావము

**యే శతం గన్ధర్వలోక ఆనన్దాః స ఏకః కర్మదేవానాం**
**అనన్దో యే కర్మణా దేవత్వ మభిసమ్పద్యన్తే ।**

అధ = అనంతరము, శతం = నూఱింతలయిన, గన్ధర్వలోక ఆనన్దాః , గన్ధర్వలోక = గన్ధర్వలోకముయొక్క, ఆనందాః = ఆనందములు, యే = ఏవియో, (తే = అవి) యే = ఎవరు, కర్మణా = కర్మచేత, దేవత్వం = దేవత్వమును, అభిసమ్పద్యన్తే = పొందుచున్నారో, తేషాం = అటువంటి, కర్మదేవానాం = కర్మదేవతలయొక్క ఏకః = ఒకటియగు, సః= ఆ, ఆనన్దః = ఆనందము, (భవతి = అగుచున్నది)

గన్ధర్వుల ఆనందము నూరుపాళ్ళు చేరినది కర్మదేవతల ఒక యానంద మగుచున్నది కర్మదేవతలనగా మనుష్య లోకములో యజ్ఞాది కామ్యకర్మలచే పొందబడిన దేవత్వము గలవారని భావము

**అధ యే శతం కర్మదేవానా మానన్దాః స ఏక, ఆజాన దేవానామానన్దో యశ్చ శ్రోత్రియోఽవృజినోఽకామహతోఽధ ॥**

అధ = అనన్తరము, కర్మదేవానాం = కర్మచేత దేవత్వముపొందిన వారలయొక్క, శతం = నూఱింతలయిన, అనన్దాః = ఆనందములు, యే = ఏవియో (తే = అవి) ఆజానదేవానాం = ఆజానదేవతలయొక్క (పుట్టుకతోడనే దేవత్వమును పొందినవారు ఆజానదేవు లనబడుదురు) ఏకః = ఒక్కటియగు, సః = ఆ, ఆనన్దః = ఆనందము, (భవతి = అగుచున్నది) అవృజినః = పాపము లేనివాడును, అకామహతః = కామహతుడు కానివాడునగు జనుడు, (ఆశలేని జనుడు) యః = ఎవడో (సః = వాడు ఆజానదేవతలతో సమానమైన ఆనందము గలవాడగుచున్నాడు)

కర్మదేవతలయొక్క నూఱింతల యానందము ఆజానదేవతల యానంద మగుచున్నది ఆజాన దేవతలనగా పుట్టుకతోనే దేవత్వము గలవారు

వారియానందము ఎట్టిదో, అట్టి ఆనందము శ్రోత్రియుని ఆనందమగు చున్నది శ్రోత్రియుడనగా సంపూర్ణార్థముతోగూడ వేదాధ్యయనము చేసిన వాడును, పాపరహితుడును అగును

**యే శతమాజానదేవానామానన్దాః స ఏకః**

**ప్రజాపతిలోక ఆనన్దో యశ్చశ్రోత్రియోఽవృజినోఽకామహతోఽథ ॥**

అథ = అనన్తరము, ఆజానదేవానాం = ఆజానదేవతలయొక్క, శతం = నూటింతలయిన, ఆనందాః = ఆనందములు, ఏ = ఏవియో (తే = అవి) ఏకః = ఒక్కటియగు, సః = ఆ, ప్రజాపతిలోక ఆనన్దః, ప్రజాపతిలోక = ప్రజాపతిలోకముయొక్క, ఆనందః=ఆనందము, (భవతి=అగుచున్నది ) శ్రోత్రియః = శ్రోత్రియుడును, అవృజినః = పాపము లేనివాడును అకామహతః = కామహతుడు కానివాడును నగుజనుడు (ఆశలేనివాడు నగు జనుడు) యః = ఎవడో (సః = వాడు - ప్రజాపతితో సమానమైన ఆనందము గలవాడగుచున్నాడు) ఆజానదేవతలయొక్క నూరు ఆనరిదములు ప్రజాపతి యొక్క ఆనంద మగుచున్నది

ఈలాగున శ్రోత్రియునియొక్క ఆనందము ఉపమానముగా నుండును పైజెప్పిన ఆజానదేవతల సమానానందముగల స్థలములోగూడ ఒక శ్రోత్రియుని నిరూపించడమైనది అతనికిని ఈతనికిని భేదమేమన మొదటి శ్రోత్రియుడు ప్రపంచపు కోరికలు లేనివాడు ఇప్పుడు వర్ణింపబడిన శ్రోత్రియుడు దేవలోక ఆనందమునుకూడ కోరనివాడు అని భావము

**యే శతం ప్రజాపతిలోక ఆనందాః స ఏకో బ్రహ్మలోక ఆనన్దో యశ్చ**

**శ్రోత్రియోఽవృజినోఽకామహతోఽథైష ఏవ పరమ ఆనన్దః ॥**

అథ = అనన్తరము, ప్రజాపతిలోకే = ప్రజాపతిలోకముయొక్క శతం = నూటింతలయిన, ఆనన్దాః = ఆనందములు, యే = ఏవియో, (తే = అవి), ఏకః = ఒక్కటియైన, సః = ఆ, బ్రహ్మలోక ఆనందః, బ్రహ్మలోక = బ్రహ్మలోకముయొక్క, ఆనందః, ఆనందము (భవతి = అగుచున్నది)

శ్రోత్రియః = శ్రోత్రియుడును, అవృజినః = పాపములేనివాడును, అకామహతః = కామహతుడు కానివాడును నగుజనుడు, యః = ఎవడో, సః = వాడు, హిరణ్యగర్భానందముతో సమానమయిన ఆనందము గలవాడగుచున్నాడు ఇకమీదట ఆనందము నెన్నుటకు శక్యము కాదు అథ = అనన్తరము, ఏష ఏవ = ఇది అపరితమైన, అవర్ణనీయమైన ఆనందమే పరమః = శేష్ఠమయిన, ఆనందః = ఆనందము, ఇచ్చటచెప్పబడిన శ్రోత్రియుడు విరాట్పురుషుని ఆనందమునుగూడ కోరనివాడని గ్రహించవలయును ఇట్లు యాజ్ఞవల్క్యుడు జనకుని గుఱించి చెప్పెను

శంకరభాష్యమ్ = అతఃపరం గణితనివృత్తిః ఏష పరమ ఆనన్ద ఇత్యుక్తః యస్య చ పరమానన్దస్య బ్రహ్మలోకాద్యానన్దా మాత్రాః ఉదధేరివ విప్రుషః ॥

ఇకమీదట లెక్కింప శక్యము కాదు ఇట్టి గణనాతీతమగు ఆనందమే పరమానందము అనగా పరబ్రహ్మానందము అట్టి పరమానంద సాగరమున బ్రహ్మలోకాద్యానందములు నీటి బిందువులవలె లేశములు మాత్రమే అదియే మహాత్ములగు వారి పరబ్రహ్మానందము

**సలిల ఏకో ద్రష్టాఽద్వైతో భవత్యేష బ్రహ్మలోకః**
**సమ్రాడితి హైవ మమశశాస యాజ్ఞవల్క్య ఏషాస్య పరమాగతి**
**రేషాస్య పరమాస్పదేషోస్య పరమో లోక ఏషోఽస్యపరమ**
**ఆనన్ద ఏతస్యైవానన్ద స్యాన్యాని భూతాని మాత్రామువజీవన్తి ॥**

సలిలే = ఉదకమునందు (సలిలమివ = ఉదకమువలెనె, స్వచ్ఛమైన ఉదకము ఉదకమునందు వలెనె సుషుప్తియందు), ఏకః = రెండవది, ద్రష్టా = ద్రష్టయగుఆత్మ, అద్వైతః = చూడదగిన రెండవ వస్తువు లేనిది,భవతి = అగుచున్నది హే సమ్రాట్ = జనక మహారాజా! ఏషః = ఈ ఆత్మ, బ్రహ్మలోకః = బ్రహ్మస్వరూపమాత్ర మైనలోకము, ఇతి హ = ఈ ప్రకారముగానే, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యఋుషి, ఏనం = ఈజనకమహా రాజును గూర్చి, అనుశశాస = అనుసరించి శిక్షించెను (బోధించెను) అస్య = ఈ

విజ్ఞానమయాత్మకు, ఏషా = ఇది, అస్య = ఈ విజ్ఞానమయాత్మకు, పరమా = శ్రేష్ఠమైన, గతిః = పొందదగిన స్థానము, ఏషా = ఇది, పరమా = శ్రేష్ఠమైన, సమ్పత్ = సమ్పత్తు (ధనము), ఏషః + అస్య = ఈ విజ్ఞానమ యాత్మకు, పరమః = శ్రేష్టమైన, లోకః= లోకము, ఏషః = ఇది, అస్య = ఈ విజ్ఞాన యాత్మకు పరమః = శ్రేష్టమైన, ఆనన్దః = ఆనందము, అన్యాని = ఇతరములయిన, భూతాని = భూతములు, ఏతస్యై వ్యానన్దస్య = ఈ ఆనందముయొక్కయే, మాత్రాం = కళను (అంశమును), ఉపజీవన్తి = అనుసరించి జీవించుచున్నవి

ఇచ్చట నేపరమానందప్రాప్తి తెలుపబడినదో, దానినే శ్రీపతంజలి మహర్షియు నిర్వికల్పసమాధి యని నిరూపించెను

**ప్రసంఖ్యానేஉప్యకుసీదస్య సర్వదా వివేకఖ్యాతి ర్ధర్మ మేఘస్సమాధిః ॥**

ప్రసంఖ్యానే, అపి = అవివేకజ్ఞానమందు సయితము, అకుసీదస్య = లాభమపేక్షింపనివానికి, సర్వదా = నిరన్తరముగ, వివేకఖ్యాతిః = వివేకజ్ఞాన ముండును గాన, ధర్మమేఘః = ధర్మమేఘ మనెడు, సమాధిః = సమాధి యబ్బును

ఇట్టి సమాధియను బ్రహ్మనిలయమును పొందినవారు మఱియొక లాభము నుద్దేశింపక, మేఘము ఫలమును కోరక వర్షించునటుల జ్ఞానామృత వృష్టిని ప్రపంచములో కురిపించవలయును మఱియు అట్టి నిర్వికల్ప సమాధి స్థితిలో నుండు మహాత్మునకు మేఘము కుంభవృష్టిని కురియునటుల బ్రహ్మానందవర్షమును కురిపించును

**తతః క్లేశకర్మ నివృత్తిః ॥**

తతః = ఆధర్మమేఘ సమాధివలన, క్లేశకర్మ నివృత్తిః = సర్వవిధ క్లేశములయొక్కయు, కర్మలయొక్కయు నివృత్తి గల్గును అట్టి యోగియు జీవించియుండియు ముక్తు డగును

**తదా సర్వావరణమలాపేతస్య జ్ఞానస్యానన్త్యాత్ జ్ఞేయమల్పమ్ ॥**

తదా = అ ధర్మమేఘ సమాధి యబ్బిన కాలమున, సర్వావరణ మలాపేతస్య, సర్వ = సకలమగు, ఆవరణమల = చిత్తనిష్టక్లేశ కర్మరూపములగు ఆచ్ఛాదనములనుండి, అపేతస్య = తొలగిన, జ్ఞానస్య = జ్ఞానమునకు, ఆనన్త్యాత్ = పరిమితి లేకుండుట వలన, జ్ఞేయం - జ్ఞేయమగు బాహ్యావస్తువు లన్నియు, అల్పం = పరిచ్ఛిన్నములై అల్పములగదోచును

క్లేశములు, కర్మలు అను మలములు, చిత్తము నావరించి యుండును జీవన్ముక్తావస్థలో నా క్లేశకర్మములును, మలములు తొలగిపోయినంతనే, చిత్తమపరిచ్ఛిన్నమై యుండును కాన, జ్ఞేయములగు బాహ్యావస్తువు లన్నియు, పరిచ్ఛిన్నములై యల్పములుగ దోచును

**తతః కృతార్థానాం పరిణామక్రమ సమాప్తిర్గుణానామ్ ॥**

తతః = ఆ ధర్మమేఘసమాధి యుదయించుటవలన, కృతార్థానాం = సమాప్త కర్తవ్యములగు, గుణానాం = గుణములకు, పరిణామ క్రమసమాప్తిః = పరిణామక్రమ = ఏక్రమమున కార్యోత్పాదనరూప పరిణామము గలిగెనో యాక్రమమునకు, సమాప్తిః = ముగింపు, గల్గుచున్నది

వివేకజ్ఞానముయొక్క పరాకాష్ఠారూప మయిన, ధర్మమేఘ సమాధి యుదయించి నంతటనే, సమాప్తకర్తవ్యములగు కృతార్థములగు గుణములు మరల నాయోగికి శరీరము నారంభింపజాలవు ఇచ్చట జీవుడు, సర్వపరిణామములు లేనివాడై, ముక్తుడై పరిపూర్ణ బ్రహ్మత్వమును పొందుచున్నాడు అట్టి జీవన్ముక్తుడగు మహనీయాత్మునికి మరల జన్మము లేదు ఏలననగా! జన్మమునకు కారణమగు ప్రకృతి సంపూర్ణముగ నశించిపోయినది ఈ ధర్మమేఘమును గురించి విద్యారణ్యస్వాములు వేదాన్తపంచదశిలో తెల్పినదిన్ని చూడుడు

**అనాదావిహ సంసారే సంచితాః కర్మకోటయః ।**
**అనేన విలయం యాన్తి శుద్ధో ధర్మో వివర్ధతే ॥**

అనాదిగా ఈ సంసారమునందు సంపాదింపబడిన, శుభాశుభ కర్మకోట్లు ఈ నిర్వికల్పసమాధిచే నాశమును పొందుచున్నవి పరిశుద్ధమైన అవిద్యానివర్తక బ్రహ్మసాక్షాత్కార భూత ధర్మము వృద్ధి పొందుచున్నది

**ధర్మమేఘ మిమం ప్రాహు స్సమాధిం యోగవిత్తమాః ।**
**వర్షత్యేష యతో ధర్మామృతధారాస్సహస్రశః ॥**

బ్రహ్మజ్ఞానులగు మహాత్ములు ఈ నిర్వికల్ప సమాధిని, ధర్మమేఘము నుగా చెప్పుదురు మేఘము వర్షబిందువులను వర్షించి నటుల, ఈ నిర్వికల్ప సమాధి పుణ్యలక్షణము లయిన జ్ఞానామృత ధారలను సహస్ర సంఖ్యాకముగా వర్షించుచున్నది ఇదే విషయమును శ్రీకృష్ణభగవానులు గీతలో చెప్పినది గాంచుడు

**సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్ ।**
**వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥**

అంతము లేనిదియును, శుద్ధమగు బుద్ధిచేతనే తెలియందగినదియు, ఇంద్రియములకు గోచరము కానిదియు, అయిన ఆనన్ద మెద్ది గలదో, అటువంటి బ్రహ్మసుఖము నేకాలమున పొందుచున్నాడో, అప్పుడు అటుల తెలిసికొన్న ధ్యానయోగి ధ్యానమందున్న వాడగుచు, తత్త్వస్వరూపము నుండి చలింపనే చలింపడు ఇచట అట్టి సుఖస్వరూపమగు ఆత్మ ఇంద్రియములకు అతీతమనియు, మలినేన్ద్రియములకు గోచరము కాదనియు, శుద్ధమగు బుద్ధిగల వారు తెలిసికొనందగినది అనియు గ్రహించవలయును

**యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।**
**యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే ॥**

ఏ ఆత్మసుఖమును పొంది మఱియొక లాభమును అనగా సుఖమును అంతకంటె అతిశయమైన దానినిగా తలంపడో, ఆ ఆత్మానుభవమందైతే యున్నవాడై గొప్ప దుఃఖము తటస్థించినను చలింపడు. బ్రహ్మానందము గలవానికి బ్రహ్మాది లోకములుగూడ తృణముగా తోచును అదియే యథార్థ

థ్యమైన ఆత్మానందము గలిగిన దానికి గుర్తు

**తం విద్యాద్దుఃఖ సంయోగ వియోగం యోగసంజ్ఞితమ్ ।**
**స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥**

దుఃఖసంబంధ రాహిత్యమైన దానిని యోగమనెడు పేరుగల దానినిగా నెఱుంగ వలయును అట్టి యోగము విషయ రహితమగు మనస్సుచే సాధించి పొందవలయునని పూనికతో పొందదగినదిగా నుంటున్నది

ఇచ్చటగూడ సర్వవిధ దుఃఖములనుండి విముక్తిని బడయుటయు నిరతిశయానంద సుఖము గలుగుటయు యోగముయొక్క పర్యవసాన స్థితియని గ్రహించవలయును ఇదియే కైవల్యము అ 6 ఆంగిరస ఋషి దీనిని గురించి చెప్పినదానిని చూడుడు

**సూర్యఖద్యోతయోర్యద్వమేరు సర్షపయోరివ ।**
**అన్తరం హి మహద్దృష్టం తథా భిక్షుగృహస్థయోః ॥**

సూర్యప్రకాశమునకున్ను మిణుగురుపురుగు కాంతికిన్ని, మహామేరు పర్వతమునకున్ను ఆవగింజకున్ను, ఎంత తారతమ్యము గలదో, విషయ సుఖమునకున్ను ఆత్మసుఖమునకు అంతవ్యత్యాసము గలదు అని గ్రహింపనగును



# ద్వితీయ పటలము

## నిర్వాణమార్గము

దీనియందు పరమ బ్రహ్మనిర్వాణము పొందేపద్ధతి సంగ్రహాముగ తెలుపబడును. దీనిని తెలిసికొనుటకు 24 తత్త్వములతో కూడిన సాంఖ్య శాస్త్రము చాల ఉపయోగపడును. అప్పుడే ఆత్మానాత్మలతత్త్వము బోధపడును. అట్టి బోధ జనించిన వ్యష్టికి బుద్ధిపరముగాను, సమష్టికి అవ్యక్త పరముగా నుండు ఆత్మ పరాత్మల యొక్క ఏకత్వసిద్ధి కలుగును. అదియే యుత్తమ జ్ఞానమని శ్రీకృష్ణమతము.

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।**
**క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ ॥**

ఓ యర్జునా! సమస్త దేహములందుండెడు క్షేత్రజ్ఞుని (ఆత్మను) నన్నుగా (బ్రహ్మమునుగా) నెఱుంగుము. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క జ్ఞానము (తెలిసి కొనుట) ఏది గలదో, అదియే యుత్తమమగు జ్ఞానమని నామత మగును.

ఇది సులభముగా నే ప్రకారము పొందవచ్చునో అది గీత మూడవ అధ్యాయాన్తమున స్వయముగా భగవంతుడే తెలిపెను.

**ఇంద్రియాణి పరాణ్యాహురిన్ద్రియేభ్యః పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః ॥**

ఈ విషయమును చెప్పునప్పుడు లేక చింతించు సమయమున మనస్సు ఏలాగున ఒక్కొక్క దానిని దాటిపోవుచున్నదో,అట్టి భావన గల్గిన మాత్రమే అన్నిటికన్న పరమగు నిర్వాణస్థితిలో నిల్వగల్గును.

దృశ్యముకన్న దేహము సూక్ష్మ మయినది, శ్రేష్ఠమయినది. అట్టి దేహము కన్నను ఇంద్రియములు సూక్ష్మములు, శ్రేష్ఠములు. ఇంద్రియముల కన్న

మనస్సు సూక్ష్మము, శ్రేష్ఠమైనది మనస్సు కన్న బుద్ధి సూక్ష్మమైనది, శ్రేష్ఠమైనది బుద్ధికన్న యెవడు శ్రేష్ఠుడో, దానిని ఆత్మయని బ్రహ్మవేత్తలు గ్రహించి యున్నారు ఓ అర్జునా! బుద్ధి కన్నను సూక్ష్మమై అధికుడై యుండు ఆత్మను ఎఱింగి అట్టి ఆత్మవల్లనే పరమాత్మ భావనయందు సుస్థిరత గల్గి కామరూప మయినదియు సాధనారహితులచే జయింప ప్రయాస మయినదియు నగు ప్రకృతియను శత్రువును త్యజింపుము, లేక వధింపుము అనగా సంకల్పాత్మ కమగు మాయను త్రోసివేయుము ఇట్టి స్థితి గల్గిన మాత్రమే తన శరీరమగు క్షేత్రమున దేవుని ప్రతిష్ఠించిన వాడగును అట్లు కానిచో సుందర మగు దేవాలయమును నిర్మించి ప్రతిష్ఠచేయని వానియొక్క ప్రయోజనము లేని స్థితియే మనుష్యజన్మము ఎత్తిన వారికి గూడ గల్గును ఈ స్థితి కల్గిన మంచి చుక్కాని గలవాడు అపాయము లేక సముద్రముయొక్క ఆవలి తీరమున చేరునటుల శరీరమను నావలోగల ఆత్మను సంసారసాగరమును దాటించి మోక్షపుదరిని చేర్చునటుల నుండును అట్లు కానిచో, చుక్కానివాడు లేని పడవ సముద్రములో విడువబడి గమ్యస్థానమును చేరక అలలచే కొట్టుకొని మునుగునటుల భవసాగరములో మునుంగుట నిక్కము

**ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్రమిత్యభిధీయతే ।**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥**

ఓ యర్జునా ! ఈ దేహము క్షేత్రమని చెప్పబడుచున్నది ఈ శరీర ధర్మమును ఎవడెరుంగుచున్నాడో, వానిని క్షేత్రజ్ఞుడని ఆ విషయము నెఱింగిన మునులు చెప్పుదురు. ఇచట సాక్షాద్భగవంతుడే క్షేత్రజ్ఞుడు అనగా జీవాత్మయే పరమాత్మయని స్వయముగా తెలిపినాడు ఇక ఈవిషయమై ఏల సంశయింప వలయును? ఇట్టి స్థితి పొందదగినవాని లక్షణము, ద్వితీయాధ్యాయమున స్థితప్రజ్ఞుని లక్షణమున తెలిపియున్నారు ఆ భాగము చూచుకొన వలయును దానియొక్క సార మంతయు ఒకే శ్లోకమున శ్రీకృష్ణభగవానుడు తెలిపి యున్నాడు

**ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ! మనోగతాన్ ।**

**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥**

మనోగతములగు సమస్త సంకల్పములను ఎప్పుడు ప్రయత్నపూర్వకము గా విడుచుచున్నాడో, అప్పుడు తన ఆత్మచే తన యాత్మ యందే ఆనందించు వాడగుచు నిశ్చలజ్ఞానము గలవాడని చెప్పబడుచున్నాడు ఇట్టి స్థితి కలిగేలా గున యత్నించుకొనవలయును అదియే జీవుల గమ్యస్థానము ప్రకృతినుండి విముక్తి యనియు తెలియందగినది

ఈ అధ్యాయాంత్యము వఱకు నీ శ్లోకమునకు సహాయముగానే తక్కిన వన్నియు తెలుపబడినవి

మూడవ అధ్యాయమున అట్టి మహాత్ముని యొక్క స్థితి తెలుపబడినది

**యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సన్తుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥**

ఏ బ్రహ్మనిష్ఠుడైతే తనయాత్మయందు రమించువాడును, తన యాత్మలోనే తృప్తిని జెందువాడును, తన యాత్మయందే ఆనందించువాడును అగునో, అట్టి యాత్మారామునకు చేయందగినది మఱియొకటి మిగిలి యుండలేదు

చేయవలసిన యనుష్ఠానాది కార్యము లన్నియు చేసిన వానికే అట్టి స్థితి కల్గును ఎవడైతే కృతకృత్యు డగునో అనగా తాననుష్ఠించవలసిన కృత్యము లన్నిటిని కొఱతలేక అనుష్ఠించునో, వాడే కృతకృత్యుడు అట్టి కృతకృత్యుడు కృతార్థుడగును అనగా ముక్తుడగును ఇదే విషయమును కఠోపనిషత్తులో యమధర్మరాజు నచికేతుని కొఱకుపదేశించెను

**ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః ।**
**మనసస్తు పరా బుద్ధి ర్బుద్ధేరాత్మా మహాన్ పరః ।**
**మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః ।**
**పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా పరా గతిః ॥**

గీతలో చెప్పిన విధముగానే యిచ్చోటను గ్రహించుకొనవలయు ఇంద్రి యార్థములకన్న ఇంద్రియములు సూక్ష్మములు (శ్రేష్ఠములు) అట్టివాని కన్న మనస్సు పరమయినది (సూక్ష్మమయినది) అట్టి మనస్సుకన్న బుద్ధి శ్రేష్ఠము (సూక్ష్మము) అట్టి బుద్ధి కన్న అన్తఃకరణ ప్రతిబింబిత చిదాత్మసూక్ష్మము (శ్రేష్ఠము) అట్టి మహత్త్వముతో కూడిన అవ్యక్తము (మూలప్రకృతి) గొప్పది. ఏలననగా, ప్రకృతి ప్రతిబింబించిన బ్రహ్మచైతన్యమే జీవుడని వ్యవహరింప బడును కావున నది యుపాధిగత మైనది అట్టి యుపాధి రహితమగు ఆత్మయే సర్వోత్కృష్టము (శుద్ధము) పై చెప్పబడిన అన్నిటికన్నను పరమైనది. అట్టి శుద్ధాత్మయగు ముక్తాత్మునికన్న శ్రేష్ఠమైనది మఱియొకటి లేదు అదియే పరమ కాష్ఠ కాష్ఠ యనగా నిష్ఠయొక్క పర్యవసానము అదియే పరాగతి అనగా సర్వోత్కృష్ట మగుగతి అనగా మోక్షమని గ్రహించు కొనవలయును

**ఏష సర్వేషు భూతేషు గూఢో ఽ ఽ త్మా న ప్రకాశతే ।**
**దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥**

ఈ ఆత్మ సమస్తభూతములలోను గూఢముగా నుండుటచే అందఱికిని గోచరించుట లేదు అట్లున్నను అనుష్ఠానముగలిగి యెవరి బుద్ధి ఏకాగ్రత గల్గి శుద్ధమై సూక్ష్మమై నిర్విషయము గలదై యుంటున్నదో, అట్టి సూక్ష్మదర్శులగు ఋషులవంటి వారివలన దర్శించుటకు యోగ్యమైనది అట్టియాత్మ యే ప్రకారము గూఢమో అది యిచట తెల్పబడుచున్నది గూఢమని గోప్యమని సూక్ష్మమని రహస్యమని చెప్పుటచే ఎవరున్ను వినతగనిదనిగాని, చూడగూడ దగనిదనిగాని, తెలిసికొన కూడదనిగాని తలంచవలదు

**తిలేషు తైలం దధినీవ సర్పిరాపస్స్రోతస్స్వరణీషు చాగ్నిః ।**
**ఏవమాత్మని గృహ్యతే ఽ సౌ సత్యేనైనం తపసా యో ఽ నుపశ్యతి ॥**

నువ్వులయందు నూనెవలెను, పెరుగునందు వెన్నవలెను, భూగర్భ మందు జలధారవలెను, అరణులందు అగ్నివలెను, తనయం దీఆత్మ నిగూ ఢమై యున్నది. దానిని సత్యప్రవర్తనచేతను, తపస్సు చేతను, సాధకుడు గాంచ

గల్గుచున్నాడు ఆత్మ యీలాగున ఈ దేహములో దేహరూపముగ నుంటు దని తెలుపుటయే గూఢ శబ్దార్థమగును నువ్వులు గానుగలో ఆడుటచేత నూనెయు, పెరుగును తరచుటచే వెన్నయు, భూమిని త్రవ్వుటచే జలమున ఆరణిని మథించుటచేత అగ్నియు ఎట్లు ప్రత్యక్షముగా గోచరించుచున్న ఆలాగున సత్యతపస్సులు గలవారు పరమాత్మను దర్శింపగలరు దీని వ దేహమున కన్యముగా ఆత్మ యొకటి యుండిన ఏల కనిపించుట లేదనియ ఈ జగన్నిర్మాణ కర్తయగు ఈశ్వరు డొకడుండిన ఏల గోచరించు లేదనియు చెప్పువారికి సరియగు సమాధానము లభించడ మగును

**నావిరతో దుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః ।**
**నాశాన్తమానసో వాఽపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్ ॥**

ఎవడయితే దుర్వృత్తినుండి విరమింపని మనస్సుగలవాడై యున్నాడ ఎవడైతే మనశ్శాంతి గలుగని వాడై యున్నాడో, ఎవడైతే మనస్సును సమా యందు లయింప జేయనివాడై యున్నాడో, అట్టి వానికి ఈ ఆత్మ లభించున గాదు మరల ఎవరికి లభించు ననగా, దృశ్యవృత్తినుండి విరమించిన వానికి మనస్సమాధానము సిద్ధించిన వానికిని, మనస్సును ధ్యానమందు లయపరచి వానికిని ప్రజ్ఞానమే బ్రహ్మయని తెలిపెడు మహావాక్య విచారణచేత ఈ ఆ లభింపబడును ఇదే రీతిగ శ్రీవ్యాసమహర్షియు, శాంతిపర్వమందు తెలిం బరచిరి.

**ఇన్ద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యః పరమం మనః ।**
**మనసస్తు పరా బుద్ధిః బుద్ధేరాత్మా మహాన్ పరః ॥**

**మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పరతో ఽమృతమ్ ।**
**అమృతాన్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః ॥**

ఇంద్రియములకన్న అర్థము శ్రేష్ఠము ఇంద్రియార్థము కన్న మనస శ్రేష్ఠము మనస్సు కన్న బుద్ధి శ్రేష్ఠము బుద్ధికన్నను చిదాభాసుడు శ్రేష్ఠుడు అ చిదాభాసునికన్న మూలప్రకృతి అధికమైనది అట్టి అవ్యక్తముకన్న అవ

తుండగు ఆత్మ శ్రేష్ఠుడు, అధికమైన వాడు అట్టి యమృతుడగు అనగా ముక్తు డగు ఆత్మకన్న పరమైనది మఱియేమియు కొంచెమైనను లేదు అదియే పరమ కాష్ఠ యగును అదియే సర్వోత్కృష్టమగు గతియు, మోక్షమున్ను అగుచున్నది

జలబిందువులు కొన్ని చేరి చిన్నకాలువయై అట్టి చిన్న కాలువలు కొన్ని చేరి పెద్ద కాలువయై, అట్టి పెద్ద కాలువలు కొన్ని చేరి యుపనదియై అట్టి చిన్న నదులు కొన్ని చేరి గొప్పనదియై, అట్టి గొప్పనదు లనేకములై సముద్ర మగునటుల పై జెప్పిన ఇంద్రియ ఇంద్రియార్థములకన్న ఒక్కొక్కటి గొప్పదిగా పరిణమించి కట్టకడపట సాగర మగునటుల దీని స్థితియు తెలిసికొన వలయును అయితే జలబిందువులనుండి మహానదియై పరిణమించి సముద్రము చేరువరకు నెటుల గమనము గల్గియుండునో సముద్రములో చేరిన పిమ్మట నేలాగున గమనమాగిపోవునో, అలాగున మహాసముద్రమువంటి పరమాత్మ నుండి యేర్పడిన జీవరాసులు క్రమక్రముగా సాధనలు చేసి ఒక్కొక్క ఆవరణమును దాటి కట్టకడకు 'అనంతానందమగు శివమగు, అద్వై ్వతమగు, అమృతమువఱకు, చేరవలయును అప్పుడు ఈ జీవునియొక్క ప్రయాణమున్ను పూర్తియగును కావుననే "సా కాష్ఠా సా పరాగతిః" అని కట్టక డకు తెలుపబడెను

యోగవాసిష్ఠమున మనుమహర్షి ఇక్ష్వాకు మహారాజునకు నుపదేశించినది చూడుడు

## ఇక్ష్వాకు వచనము

**అహం కథం చ విషమాదస్మాత్సంసృతివిభ్రమాత్ ।**
**విముచ్యేయ ఘనాస్తీర్ణాజ్జాలాదివ విహంగమః ॥**

నే నీ భయంకరమైన సంసార విభ్రమమునుండి విశాలమైన వలలో చిక్కుకొనిన పక్షివలె నెట్లు విముక్తి నొందగలను?

## మనువచనము

**మనస్షష్ఠేన్ద్రియాతీతం యత్స్యాదపి న కించన ।**
**అవినాశం తదస్తీహ తత్పదాత్మేతి కథ్యతే ॥**

ఏది మనస్సుకంటెను తక్కిన పఞ్చేన్ద్రియముల కంటెను అతీతమై యున్నదో, ఏది ఇంద్రియములచే నూహింప నలవికానిదో, ఏది నాశరహిత మైనదో, అదిమాత్రము ఇట గలదు అదియే సద్రూపమగు ఆత్మయని చెప్పబడుచున్నది

**పదార్థమాత్రం దేహాదిధియా సంత్యజ్య దూరతః ।**
**ఆశీతలాన్తఃకరణో నిత్యమాత్మమయో భవ ॥**

ఓ రాజా! పదార్థమాత్రమగు దేహాదులను బుద్ధిచే దూరముగ త్యజించి పూర్ణశీతలాన్తః కరణుడవై నిత్యము ఆత్మమయుడవు కమ్ము

**దేహోఽహ మితి యా బుద్ధిః సా సంసారనిబన్ధనీ ।**
**న కదాచిదియం బుద్ధిరాదేయా హి ముముక్షుభిః ॥**

నేను దేహము అను ఈ బుద్ధి సంసారమున బన్ధించునదై యున్నది కావున ముముక్షువు లెన్నటికి నట్టి బుద్ధిని గ్రహింపగూడదు ఆత్మస్వరూపమునకు మరుపున్ను కలుగజేయ గూడదు ఇదియే జీవన్ముక్తి యగును

**న కిఞ్చిన్మాత్ర చిన్మాత్రరూపోఽస్మి గగనాదణుః ।**
**ఇతి యా శాశ్వతీ బుద్ధి స్సా న సంసారబన్ధనీ ॥**

నేను అన్య మెద్దియును గాను ఆకాశముకంటెను, సూక్ష్మమైన చిన్మాత్రుడను అను నిరన్తర ఆత్మబుద్ధి సంసారమున బంధింపనిదై ముక్తిదాయకమైనది

**అనాత్మన్యాత్మతా మస్మి న్దేహాదౌదృశ్యజాలకే ।**
**త్యక్త్వా సత్త్వముపారూఢో గూఢ స్తిష్ఠ యథా సుఖమ్ ॥**

అనాత్మరూపమగు దేహాది దృశ్యసమూహమున నాత్మ బుద్ధిని వదలి నిర్వాసనాభావమున, అరూఢుడవై గూఢరూపమున సుఖపూర్వకముగ నుండును

**స్వయమస్య తథా శక్తిరుదేత్యాబధ్యతే యయా ।**
**స్వయమస్య తథా శక్తి రుదేత్యున్ముచ్యతే యయా ॥**

దేనిచే జీవుడు బంధింపబడునో, అట్టి శక్తి వానియందు స్వయముగా అవిద్యచే యుదయించుచున్నది. మఱియు, దేనిచే నాతడు ముక్తుడగు నో,అట్టి శక్తియు వానియందు స్వయముగా విద్యచే (జ్ఞానముచే) నావిర్భవించుచున్నది

చీకటిచే వస్తువు కనబడకపోవుటయు, ప్రకాశముచే కనుపించుటయు, ఎటుల లోకములో స్వయముగ నున్నదో విద్యావిద్యలస్థితి యాలాగున నుండును

**చిదాదర్శమయం సర్వం జగదిత్యేవ భావయన్ ।**
**యస్తిష్ఠత్యుపశాన్తేచ్ఛ స్స బ్రహ్మకవచ స్సుఖీ ॥**

ఈ జగత్తంతయు చిదాదర్శమయమని భావించుచు నెవడు కోర్కెలు నశించినవాడై యుండునో, అట్టివాడు అజ్ఞాన బాణములచే భేదింప నలవికాని బ్రహ్మమే వజ్రకవచముగ గల్గియుండును గాన, నాతడే శాశ్వతసుఖి యగును

**ఇదం రమ్యమిదం నేతి బీజం తే దుఃఖసన్తతేః ।**
**తస్మి న్సామ్యాగ్నినా దగ్ధే దుఃఖస్యావసరః కుతః ॥**

ఇది రమ్యము ఇది అరమ్యము అను నీప్రకారమగు ద్వంద్వ కల్పనయే నీయొక్క దుఃఖసమూహమునకు బీజమై యున్నది సమత్వమను నగ్నిచే ఆ బీజము దహింపబడగా నిక దుఃఖమునకు చోటెచట?

**రాజన్న భావనాస్త్రేణ రమ్యారమ్య విభాగితా ।**
**పౌరుషాతిశయేనాశు స్వేనైవాన్తర్విలూయతామ్ ॥**

ఓ రాజా ! సమాధియొక్క యభ్యాసమువలన సర్వదృశ్య విలయమను

నస్త్రముచే మహాపురుష ప్రయత్నము ద్వారా రమ్యారమ్య కల్పనను శీఘ్రముగా నీయన్తః కరణమున ఛేదించుము

**అభావనేవ భావనం విలూయ కర్మకాననమ్ ।**
**పరం సమేత్య తానవం విశోక ఏవ తిష్ఠ భోః ॥**

పుత్రకా! అభావనచే (సర్వదృశ్య విలయముచే) భావనను (దృశ్యస్మరణమును) కర్మయను అరణ్యమును ఛేదించి అతి సూక్ష్మమగు బ్రహ్మమును పొంది దుఃఖరహితుడవై యుండుము

**భరితభువనా భోగో భూత్వా విభాగ బహిష్కృతో**
**గలితకలనాభాసోల్లాసో వివేకవిలాసవాన్ ।**
**అధిగత పరానన్ద స్సన్ద శ్చిరాయ నిరామయః**
**శమసమసిత స్వచ్ఛాభోగో భవాభయ చిద్వపుః ॥**

పుత్రా! నీవు మొట్టమొదట వివేకమను విలాసముతో గూడియుండి పిమ్మట సమాధిచే నశించిన బాహ్యకల్పనాభాసము గలవాడవై, పూర్ణాత్మచే జగమంతట వ్యాపించిన శరీరము గల్గి విభాగరహితుడవై, పరమానందమును బొంది శాశ్వతముగ సంసారరోగ వర్జితుడవై, శాంతమై, సమమై, స్వచ్ఛమయినట్టి చిన్మాత్రదేహంబు గలవాడవై, సంసారభయ రహితుడవై యుండుము

ఇక ఆత్మయొక్క యధార్థస్వరూపమును కేనోపనిషత్తున తెలిపిన విధమును చూడుడు ఈ సత్యము తెలిసికొనిన ధ్యానకాలములో మనస్సును ఎచ్చట నిలువవలయును? ఎచ్చట నిలిపిన నిశ్చలత్వము గలుగును? నిర్మలత్వము సిద్ధించును? నిరతిశయ సుఖము లభించును? అను విషయము లన్నియు దీనివలన గోచరము లగును

**శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో య**
**ద్వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః ।**
**చక్షుషశ్చక్షు రతిముచ్య ధీరాః**
**ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి ॥**

యత్ = ఏకారణమువలన, శ్రోత్రస్య = శ్రోత్రేంద్రియమునకు, శ్రోత్రం = శ్రోత్రముగాను, యస్మాత్ = ఏ కారణమువలన, మనసః = మనస్సునకు, మనః = మనస్సుగాను, వాచః = వాగింద్రియమునకు, వాచః = వాక్కుగాను, ప్రాణస్య = ప్రాణమునకు, ప్రాణః = ప్రాణముగాను, చక్షుషః = నేత్రమునకు, చక్షుః = నేత్రముగాను, ధీరాః = వివేకధీరులు, అతిముచ్య = శ్రోత్రేంద్రియాదులం దిదివరకు, తమ యవివేకముచే నుంచబడియున్న ఆత్మభావమును విడిచి, అస్మాత్ లోకాత్ = ఈ లోకమునుండి, ప్రేత్య = విడువబడి, అమృతాః = మరణము లేనివారుగ, భవన్తి = అగుచున్నారు

**న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనః ।**
**న విద్మో న విజానీమో యథైతదనుశిష్యాత్ ॥**

తత్ర = ఆ పరబ్రహ్మమందు, చక్షుః = నేత్రము, న గచ్ఛతి = వెళ్లదు, వాక్ = వాక్కు, న గచ్ఛతి = వెళ్లదు, మనః =మనస్సు, నో గచ్ఛతి = వెళ్లదు, అతః = ఈ కారణమువలన, న విద్మః = తెలిసికొనజాలము న విజానీమః = తెలిసికొనలేము, (తర్హి = అయితే), ఏతత్ = ఈ బ్రహ్మము, యథా = ఏ విధముగా, అనుశిష్యాత్ = (గురువుగాని, శాస్త్రముగాని, శిష్యునికి ) తెలియజేసినదో (ఆ విధమును దెలియలేక యున్నాము ) ఇది శిష్య వచనము

గురువాక్యము

**యద్వాచా ఽనభ్యుదితం యేన వాగభ్యుద్యతే ।**
**త దేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

యత్ =ఏబ్రహ్మస్వరూపము,వాచా=వాక్కుచే,అనభ్యుదితం= ప్రకాశింపబడదో, యేన = ఏ స్వయంప్రకాశ స్వరూపమగు బ్రహ్మముచే, వాక్ = వాగింద్రియము, అభ్యుద్యతే = ప్రకాశింపజేయబడునో, తదేవ = అదియే, బ్రహ్మ = బ్రహ్మమని, త్వం = నీవు, విద్ధి = తెలిసికొనుము యత్ = ఏవస్తువు, ఇదమ్ఇతి = ఈబ్రహ్మమని, ఉపాసతే = ఉపాసించుచున్నారో, తత్ = అది,

ఇదమ్ = ఈ బ్రహ్మ, న = కాదు

సర్వేంద్రియములకు సాక్షియై సర్వేంద్రియములను ఏ చైతన్యము ప్రకాశింపజేయుచున్నదో అదియే బ్రహ్మము కాని నామ, రూప, ఉపాధులతో గూడిన యేవస్తువున్ను బ్రహ్మము కాదని భావము కావుననే మహావాక్యములలో మొట్టమొదట "ప్రజ్ఞానం బ్రహ్మ" అని యుపదేశించిరి

**యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి ।**
**తేదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

యత్=ఏబ్రహ్మస్వరూపమును, చక్షుషా=నేత్రముచే, న పశ్యతి=చూడ వీలుగాదో, యేన = యే బ్రహ్మముచే, చక్షూంషి = నేత్రేంద్రియములును, పశ్యతి = చూచునో, తత్, ఏవ = అదియే, బ్రహ్మ = బ్రహ్మమని, త్వం = నీవు, విద్ధి = తెలిసికొనుము, యత్ = ఏ వస్తువును, ఇదమ్ = ఈ బ్రహ్మమని, ఉపాసతే =ఉపాసనచేయుచున్నారో, తత్ = అది, ఇదం = ఈ బ్రహ్మస్వరూప ము, న =కాదు, ఇదియు పై జెప్పిన విధముగా ప్రజ్ఞానమే బ్రహ్మమని నిరూపణ చేయుచున్నది

**యచ్ఛ్రోత్రేణ శృణోతి యేన శ్రోత్ర మిదం శ్రుతమ్ ।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే ॥**

యత్=ఏబ్రహ్మము,శ్రోత్రేణ = శ్రోత్రేంద్రియము చేత న శృణోతి = వినుట కలవి కాదో, యేన = శ్రుతం = ఏ వస్తువుచేత, ఇదం శ్రోత్రం = ఈ శ్రోత్రేంద్రియము శ్రుతమ్ = వినుచున్నదో, తదేవ=అదియే, బ్రహ్మ = బ్రహ్మ మని, త్వం = నీవు, విద్ధి = తెలిసికొనుము, యత్ = ఏ వస్తువును, ఇదం = ఈ బ్రహ్మమని, ఉపాసతే = ఉపాసించుచున్నారో, తత్ = ఆ బ్రహ్మము, ఇదమ్ = ఈ బ్రహ్మము, న = కాదు

ఇదియు ప్రజ్ఞాన స్వరూపమే బ్రహ్మముగా వర్ణించుచున్నది

**యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే ।**

**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే ॥**

యత్ = ఏ బ్రహ్మము, ప్రాణేన = ప్రాణవాయువుచే, న ప్రాణితి = ఉచ్ఛ్వాస నిశ్వాసములను చేయదో, యేన = ఏ బ్రహ్మముచే, ప్రాణః ప్రాణము, ప్రణీయతే = చేష్ట గలదిగా నగుచున్నదో, తదేవ = అదియే, బ్రహ్మ = బ్రహ్మమని, త్వం = నీవు, విద్ధి = తెలిసికొనుము, యత్ = ఏవస్తువు ను,ఇదమ్=ఈనిర్గుణ నిరవయవ బ్రహ్మముగా, ఉపాసతే=ఉపాసించుచు న్నారో, తత్ = ఆవస్తువు, ఇదమ్ = ఈనిర్గుణబ్రహ్మము, న = కాదు

ఇచ్చటను, ప్రజ్ఞానమే బ్రహ్మముకాని తదితర వస్తువులు బ్రహ్మము కావని తెలుపడమైనది

ఇపుడు దీనియందు వ్రాసిన వాక్యముల నన్నిటిని ఏకాగ్రతతో విచారణచేసిన ఆత్మవస్తువు ఏదియో, బ్రహ్మమెట్టిదో, నిర్వికల్ప సమాధిస్థితి యెట్టిదో, నిర్వాణస్థితి ఏలాగున నుండునో, ఇవియన్నియు సూక్ష్మబుద్ధి గలవారికిని, అన్తఃకరణశుద్ధి గలవారికిని గోచరించును



# ఆహార నియమము

సాధకుని సాధనా విషయములలో ఆహార నియమముగూడ ఒక ప్రధానాంగమని జ్ఞాపకములో నుంచవలయును అయినచో, తన ఆహారముచే ఇతరులకు బాధ కలుగ జేయనిదియు, తన యనుష్ఠానమునకు భంగకరము కానిదియు నై యుండవలయును అదియును సామాన్యముగాను, అంతట దొరకువస్తువుగాను, సాధ్యమయినంత తక్కువ వెలకు లభించెడు వస్తువు గాను ఉండవలయును అప్పుడే అన్నిచోట్ల ఉండువారికి బీదవారికిని అనుష్ఠానములో ప్రవేశించుట కనుకూల ముండును కడుపు ఎక్కువ నిండిన సమయముననను, ఆకలితో నిండా తపించు సమయముననను సాధన కనుకూల ముండదు ఈ రెండింటియొక్క మధ్యస్థితిలో నుండులాగున

సాధకుడు ఎల్లప్పుడును దృష్టి నుంచి ప్రవర్తించవలయును ఈ విషయమై శ్రీకృష్ణభగవాను డుపదేశించినది చూడుడు

**నాత్యశ్నతస్తు యోగో౽ స్తి న చైకాన్తమనశ్నతః ।**
**న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥**

ఓ యర్జునా! అధికముగా భోజనము చేయువానికిని బొత్తిగా, భుజింపని వానికి అధికముగా నిద్రించువానికిని బొత్తిగా నిద్రింపని వానికిని యోగము సిద్ధింపదు

ఇతర యోగశాస్త్రములలో చెప్పిన దానిని కూడ గాంచుడు

**ద్వౌ భాగౌ పూరయేదన్నైస్తోయేనైకం ప్రపూరయేత్ ।**
**మారుతస్య ప్రచారార్థం చతుర్థమవశేషయేత్ ॥**

ముముక్షువు లందఱు ఉదరమును సగము భాగము అన్నము చేతను, పాతికభాగము జలముచేతను, నింపి పాతికభాగము గాలి సంచారార్థముగా నుంచు వారు నిరంకుశ బ్రహ్మనిష్ఠయందు సర్వదా యుండవచ్చును వీరికి నే వ్యాధియు సంభవించదు

**ఆత్మసమ్మిత మాహార మాహారేదాత్మవాన్యతిః !**
**ఆత్యన్తక్షుధితస్యాపి సమాధిర్నైవ జాయతే ॥**

ఆత్మనిష్ఠయందు ప్రయత్నము గలవాడు తన ఆత్మకు ఎంత వరకు తృప్తియని తోచునో, అంతవరకే భోజనము చేయవలయును మిక్కిలి ఆకలితో కూడిన వానికిని (మిక్కుటముగా భుజించిన వానికిని), ధ్యానమందు సమాధి సిద్ధి సిద్ధించదు

**మితాశనో భవేన్నిత్యం భిక్షుర్మోక్ష పరాయణః ।**
**కామక్రోధాదయో దోషా న భవన్తి మితాశనాత్ ॥**

మోక్షాసక్తిగల నరుడు నిత్యమును, మితాన్నపానాదులను భుజించు స్వభావము గలిగి యుండవలయును ఆలాగున మితాశన స్వభావము

గలవానికి కామ,క్రోధ, లోభ, మోహాది దోషములు గలుగవు

**హితం మితం సదాశ్నీయాద్యత్సుఖే నైన జీర్యతే ।**
**ధాతుః ప్రకుప్యతే యేన తదన్నం వర్జయేద్యతిః ॥**

ఆహారము మితముగాను, శుద్ధ మయినదిగాను, ప్రీతికరమయినది గాను ఎల్లప్పుడును ఉండవలయును ఏ ఆహారము భుజించిన సుఖముగాను, త్వరితముగాను జీర్ణమగునో, అట్టి ఆహారమునే భుజించవలయును ఏ ఆహారము భుజించిన ధాతుప్రకోపము గల్గునో అట్టి అన్నమునుగాని, ఇతర పదార్థములనుగాని, బ్రహ్మనిష్ఠు డొకప్పుడును భుజింపగూడదు

**యదుహా వా ఆత్మ సమ్మితమన్నం తదవతి తన్న హినస్తి**
**యద్భూయో హినస్తి తద్యత్కనీయో వ తదవతి ॥**

ఎంత అన్నము దేహమునకు చాలునో, అంత అన్నము తన్ను కాపాడును దానికన్న అధికముగా తిను అన్నము దేహమునకు కీడు గలుగ జేయును. దానికన్న తక్కువయగు అన్నము దేహమును సంరక్షించుట లేదు అని శతపథ బ్రాహ్మణము

తన శరీరమునకు మితమగు అన్నము, అమృతమువలె తన దేహమును సంరక్షించును అమితముగా తినిన యన్నము విషముగా పరిణమించి శరీర మును శిక్షించును తనకు చాలని అన్నమైనా దేహసంరక్షణను సరియగా చేయ జాలదు బుద్ధిమంతు డీమూడు విషయములను గ్రహించి భోజనము చేయ వలయును. అన్నమని చెప్పుటచే బియ్యపు అన్నము, గోధుమరొట్టె అని గ్రహిం చిన చాలదు “అద భక్షణే” అను ధాతువునుండి అన్న శబ్దమేర్పడినది కనుక భక్షించున దంతయు అన్నమనియే తలంచవలయును అపక్వాహారములుగాని స్వయంప్రకృతి సిద్ధఫలమూలాదులుగాని, క్షీరాదులు గాని ఇవన్నియు అన్న శబ్దములో చేరినవే యగును.

అయితే, ఈ స్థూలమయిన సాత్త్వికాన్నములతో మాత్రము తాను శుద్ధాన్నమును భుజించుచున్నానని తలంచి గర్వించకూడదు ఈ స్థూలాన్నము

స్థూలదేహమునకు మాత్రమే సంబంధించి యుండును అవతల, సూక్ష్మదేహ మొక్కటి గలదు దానికి సూక్ష్మాన్న ముండవలయును అది సత్యము, శాంతము, కరుణ, విరక్తి, దైవభావన, మొదలగునవే యగును ఇవి లేనిచో, సాత్త్విక అన్నముచే గొప్పప్రయోజన మేమియు గలుగదు ఈ స్థూలదేహమును ఈ సూక్ష్మదేహమే నడుపుచుండును కావున ఇది చాలా బలవత్తరముగా నుండవలయును

దీనితోను తృప్తిపడకూడదు ఇక దీనిపై కారణ దేహమొకటి కలదు అది సూక్ష్మదేహ పోషణకరమగు సత్యశాంత తపస్సులచే శుద్ధము గాదు అది జ్ఞానముచేతనే శుద్ధముగాను, బలవత్తరముగాను ఏర్పడవలయును ఈ స్థూలసూక్ష్మశరీరముల రెంటికిని అదియే కారణ మగుటచే దానికి కారణ దేహమను పేరు గలిగెను అది దైవజ్ఞానముచే, ఆత్మజ్ఞానముచే బ్రహ్మనిష్ఠచే శుద్ధము గావలయును ఈసూక్ష్మకారణ దేహములను శుద్ధపరచుటకు తెలియకపోవుటచేతనే స్థూలమైన సాత్త్వికాహారమును భుజించు వారలలో చాలమందికి ఆత్మజ్ఞానము, దయ, విరక్తి, కలుగకపోవుచున్నది కావుననే, హింసార్జితాహారముచే జ్ఞానము గలుగునది నిజమైనచో, హింసా రహితమగు ఆహారమును భుజించు వారందఱున్ను జ్ఞానులై యుండవలయును గదా! అను ప్రశ్నలకు కారణమగు చున్నది

మఱియు, ఈ సాత్త్వికాహార విషయమై ఒక సూక్ష్మమగు రహస్యము గలదు వస్తువుమాత్రము శుద్ధముగా నుండిన చాలదు అది వచ్చు మార్గముగూడ శుద్ధముగా నుండవలయును. అసత్య, అన్యాయ, అధర్మ మార్గములతో వచ్చిన సాత్త్విక వస్తువు లయినను లేక, అసత్య అధర్మ అన్యాయములతో వచ్చిన డబ్బుచే కొనెడు వస్తువులు శుద్ధము లయినను అవి అశుద్ధము,పాపము అనికూడ బుద్ధి మంతులు- తెలిసికొనవలయును. ప్రతిశబ్దమునకున్ను స్థూలమనియు సూక్ష్మమనియు, బాహ్యమనియు, అంతర మనియు రెండర్థములు గలవు కావున ప్రజ్ఞావంతులు ఈ రెండర్థములను జ్ఞాపకములో నుంచి అన్ని కార్యములను చేయవలయును స్థూలదృష్టి గల

వారికి స్థూలార్ధమే గోచరించును సూక్ష్మదృష్టి గలవారికి మాత్రమే సూక్ష్మార్థము గోచరించును సన్న్యాసమునకున్ను ఈ స్థూలసూక్ష్మ అర్ధములను గ్రహించు కొనవలయును

ఇది యుత్తరగీతలో తెలుపడమైనది స్థూలదేహ సన్న్యాసము అనగా దేహసన్న్యాసము దేహసంబంధ సన్న్యాసముచే తృప్తిని జెందకూడదు సంకల్పసన్న్యాసము, అనగా మానసిక సన్న్యాసము గల్గియుండ వలయును దీని వల్లను కృతార్థుడనయితినని తలంచవలదు కారణదేహ సన్న్యాసము గూడచేయవలయును అనగా అవిద్యారాహిత్యమును చేయవలయును అది అనాత్మ దేహేంద్రియాదులలో ఆత్మభావన గలుగజేయుచుండును దానికే కారణదేహమనియు, మూలావిద్య యనియు, ప్రకృతియనియు అజ్ఞాన మనియు పేర్లు ఈ సన్న్యాసము గలుగునప్పుడే కృతార్థుడగును అయితే స్థూలదేహ సన్న్యాసము సూక్ష్మదేహ సన్న్యాసమునకును, సూక్ష్మదేహ సంబంధమగు మానసికసన్న్యాసము కారణదేహ సన్న్యాసమునకున్ను ఒక దానికి మఱియొకటి సహాయము గలుగజేయుచుండును నాలుగంతస్తులు కట్టదలచిన సౌధమునకు మొదటినుండి ఒక్కొక్కటి యేలాగున సహాయము గలిగియుండునో, నాల్గవ ఆశ్రమమగు తురీయాశ్రమమునకు తురీయస్థితిలో నిలుచుటకు ఈ యొక్కొక్క సన్న్యాసమున్ను సహాయ పడుచుండును

**అన్తస్సంగం బహిస్సంగమాత్మసంగం పరిత్యజేత్ ।**
**సర్వసంగనివృత్తాత్మా పశ్యేదాత్మానమాత్మని ॥**

దీనియర్థము పై నుదాహరించినదే కావున, దేహసన్న్యాసముమాత్రము చేసిన వారలు ఈ మూడువిషయములను బాగుగా జ్ఞాపకమున నుంచవల యును శాంతి పర్వమున ఆహారమును గురించి చెప్పినది చూడుడు

**సాయం ప్రాతర్మనుష్యాణామశనం దేవనిర్మితమ్ ।**
**నాన్తరం భోజనం దృష్టముపవాసీ తథా భవేత్ ॥**

మనుష్యులకు దైవనిర్మితమగు భోజనము - ఉదయము, సాయం కాలము రెండుసార్లు మాత్రమే యేర్పడినది అనగా మధ్యాహ్నము లోపల

ఒకసారియు, సాయంకాలమున ఒక పర్యాయము మాత్రమే యుండవల యును అట్టివాని కేలాటి వ్యాధియు నుండదు అయితే రెండువేళల తప్ప ఇతర సమయములలో నేమియు భుజింపని వాడు ఉపవాస ఫలమును పొందగల్గును అనగా ఉపవాసివంటి వాడని యర్థము

సుశ్రుతమున చెప్పినది చూడుడు ఏ ఆహారము, మనుజుడు భుజించునో, అదియే శరీరేంద్రియ మనస్సులుగా మారుచుండును కావున ఆహారమునందు జాగ్రత్తపడిన మాత్రమే దేహము, ఇంద్రియములు,మనస్సు, బుద్ధి - యివన్నియు శుద్ధము లగును

**రసాద్రక్తం తతో మాంసం మాంసాన్మేదః ప్రజాయతే ।**
**మేదసోఽస్థి తతో మజ్జా మజ్జాయాశ్శుక్రసంభవః ॥**

భుజించిన పదార్థములు మొదట రసముగా మాఱును దానినుండి రక్తము, రక్తమునుండి మాంసము, మాంసమునుండి మేదస్సు, మేదస్సు నుండి అస్థి, నరములు, నరములనుండి మజ్జ, మజ్జయను దానినుండి యీ యన్నింటియొక్కయు సారమగు నేడవదియైన వీర్యమనెడు పదార్థము తయారు అగుచున్నది

మఱియు చరకసంహితయందు చెప్పబడినది చూడుడు

**అన్నం పుంసాఽశితం త్రేధా జాయతే జఠరాగ్నినా ।**
**మలం స్థవిష్ఠో భాగస్స్యాన్మధ్యమో మాంసతాం వ్రజేత్ ।**
**మనః కనిష్ఠో భాగస్స్యాత్తస్మా దన్నమయం వపుః (మనః) ॥**

జీవులు భజించెడు అన్నపానాదులు జఠరాగ్నివలన మూడుభాగ ములుగా మారుచుండును స్థూలభాగము మలమూత్రములుగాను, మధ్య భాగము రక్త మాంసములుగాను,కనిష్ఠభాగము మనస్సుగాను మారుచుండును కావున ఆహారముచేతనే స్థూలసూక్ష్మదేహము లేర్పడుచున్నవి

**మోక్షధర్మేషు నియతో లఘ్వాహారో జితేంద్రియః ।**
**ప్రాప్నోతి బ్రహ్మణః స్థానం తత్పరం ప్రకృతేర్ధ్రువమ్ ॥**

మోక్షమార్గమందు ప్రవర్తించువాడు నియమశీలుడై యుక్తాహారుడై, జితేన్ద్రియుడై యుండెనేని ప్రకృతికి పరమై, శాశ్వతమై యుండు పరబ్రహ్మస్థానమును పొందుచున్నాడు

**ఏకవారం చరేద్భైక్ష్యం న ప్రసజ్యేత విస్తరే ॥**
**భైక్ష్యప్రసక్తో హి యతిర్విషయేష్వపి సజ్జతి ॥**

సన్న్యాసియగువాడు ఏకకాలము మాత్రమే భోజనము చేయవలయును. అధికముగా తినుటయే పనిపెట్టకూడదు అధికముగా తినుటలో ఆసక్తి గలవాడు నిశ్చయముగా విషయవిరక్తి లేనివాడై, విషయలోలు డగును అట్టివానికి ఇంద్రియనిగ్రహ ముండదు మితాహారముయొక్క లక్షణము క్రింద తెలుపబడుచున్నది

**సుస్నిగ్ధమధురాహారః చతుర్థాంశ వివర్జితః ।**
**భుజ్యతే శివసంప్రీత్యై మితాహారీ స ఉచ్యతే ॥**

చమురుతో సంబంధించినదియు, తీపితో గూడినదియునయిన ఆహారమును ఉదరముయొక్క నాల్గవభాగము ఖాళీగా నుండులాగున భుజించుట అనగా రెండుపాళ్లు ఆహారాది పదార్థములున్ను, పాతికపాలు నీళ్లున్ను, వాయుసంచారార్థమై నాల్గవభాగము ఖాళీగా నుండవలయును. ఆహారము ఈశ్వరప్రీతి కరమగు కార్యముల జేయుటకొఱకు నుండవలయునని, భుజించెడు సమయమున భగవత్ప్రీతికొఱకు దైవభావము గలిగియుండవలయును ఈలాగున భుజించునదే మితాహార మనబడును భగవదారాధనకు యోగ్య మయినది లేక భగదారాధన మయిన దనియు గ్రహించవలయును



# తృతీయ పటలము

## నిర్వాణసాధన

**సత్త్వపురుషయో శ్శుద్ధిసామ్యే కైవల్యమ్ ॥**

సత్త్వ పురుషయోః = బుద్ధికిని, పురుషునకును (జీవాత్మకును), శుద్ధిసామ్యే = శుద్ధియొక్క తుల్యత్వము కలుగునప్పుడు, కైవల్యం = కైవల్యము (మోక్షము) కలుగును

సత్త్వమనగా బుద్ధియనియు, అన్తఃకరణమనియు తెలియందగినది, పురుషుడు అనగా జీవాత్మ యనబడును ఈ రెంటికి ఏకకాలమున శుద్ధి కలుగునప్పుడు మోక్ష మనబడును తపస్సుచే లేక యోగాద్యనుష్ఠానముచే బుద్ధియందుగల ప్రకృతివాసన, త్రిగుణములు, సంస్కారము, విషయవాసన- ఇవి యన్నియు నశించవలయును ఇది బుద్ధిమల మనిగాని, అన్తఃకరణ మాలిన్య మనిగాని చెప్పబడును ఇక జీవాత్మమల మేమనగా తాను శుద్ధమై,జ్ఞానస్వరూపియై పరమాత్మస్వరూపియై యుండియు, అవిద్యాభ్రాంతి వలన అజ్ఞుడనియు, జనన మరణములతో కూడిన వాడనియు,పుణ్యపాప కర్మఫలముల ననుభవించు వాడనియు, కించిద్జ్ఞుడనియు తలంచుచుండు ను ఇదియే జీవుని యొక్క మాలిన్యము ఇది శమదమాది గుణములు గల్గి బ్రహ్మనిష్ఠులగు గురువులయొద్ద వేదాంతశ్రవణ మనన నిదిధ్యాసములచే నశించవలయును

ఇచ్చట ముముక్షువులు గ్రహించవలసిన యొక ముఖ్యవిషయము గలదు అదేమనగా వర్తమానకాలములో నుండు రాజయోగు లనంబడు కొందఱు గురువులు మనస్సుతో, దానిగుణములతో, ఇంద్రియములతో, దాని విషయములతో, దేహముతో, దాని ధర్మములతో మీకు ఏమి పని గలదు? ఆత్మస్వరూపముపై జెప్పబడిన వాటికన్నిటికి సాక్షిగదా! దాని కీగుణము లేమైన

అంటునా? కావున ఆత్మవిచారణము చేసికొనిన చాలునని చెప్పుదురు దాని వలననే మోక్షమయినచో, శ్రీపతంజలి మహర్షి సత్త్వమునకున్ను, పురుషున కున్ను ఏకకాలములో శుద్ధి గల్గునప్పుడే కైవల్యము సిద్ధించునని యేల చెప్ప వలయును? అంతేగాక శ్రీవ్యాస, శుక, కపిల, వాల్మీక్యాది మహర్షులు చిర కాలము తపోధ్యానాదు లేల నొనరించవలయును? చిమ్ని పొగతో నిండియున్న ప్పుడు దానియందుగల దీపమేలాగున ప్రకాశింపజాలదో, ఆలాగున అన్తఃకరణ మాలిన్యము గల్గియుండువరకు ఆత్మ, నిరావరణముగా ప్రకాశింప జాలదు

అయితే-ఈ విషయమై పై జెప్పబడిన గురువులుఇటులగూడ వచిం తురు అదేమనగా?ఆకాశమండలములో ప్రకాశించు సూర్యుని ప్రకాశముచే ప్రపంచములోగల శుద్ధాశుద్ధ వస్తువు లన్నియు ప్రకాశించుచున్నను, సూర్యకిరణ ములు పై జెప్పిన వాటన్నిటిలోను వ్యాపించి యున్నను సూర్యునికి మంచి చెడుగులచే కళంక మేదైన గల్గునా? ఆలాగున చిదాకాశమందు జ్ఞాన భాస్కరుడై వెలుగుచుండు ఆత్మకు ఈ పుణ్యాపాప కర్మలచేగాని, శుద్ధాశుద్ధ గుణములచే గాని ఏమియు బాధ గలుగదు సామాన్యజనులు ఈ వాక్యము లలో నమ్మకము గలిగి సాధారణ ధర్మనిష్ఠలోగల గృహస్థులయొక్క ఆచరణ నైనను అనుష్ఠింపక యున్నారు ఇందువల్ల లోకములో బ్రహ్మనిష్ఠులపై, సాధువు లపై, సన్న్యాసులపై, భక్తులపై విశ్వాసము గలుగకపోవుటయే గాక బ్రహ్మ విద్యయొక్క యుత్కర్షత్వముగూడ తెలియకపోవుచున్నది

అయితే వారు సూర్యుని గురించిచెప్పిన దృష్టాన్తము సరియైనది కాదు ఏలనన సూర్యుని కిరణము శుద్ధాశుద్ధ వస్తువు లన్నిటినిలోను వ్యాపించి యున్నను ఆ వస్తువుల చేసూర్యుడు క్లేశము పొందుట లేదు వీరలు అట్లు గాదు తాపత్రయముచేతను అజ్ఞానముచేతను, రాగద్వేషాదులచేతను, స్తుతినిందలచేతను, ద్వంద్వములచేతను, లాభనష్టములచేతను, రుచి యరుచులనెడు ద్వంద్వములచేతను, తపించుచున్నారు. పై జెప్పిన ద్వంద్వ ములు వారి ఆత్మను తాకనిచో వారు చెప్పినది నిజము అది యంగీకరించ దగినదే జీవన్ముక్తుని గురించి యీ దృష్టాన్తము వేదాంతశాస్త్రములలో

అచ్చుటచ్చుట కన్నట్టుచున్నది అది జీవన్ముక్తులగు బ్రహ్మాత్మానుభవము గల మహనీయాత్ములను గురించి వర్ణించడమైనది అయితే అట్టివారు ఎంతో పవిత్రాత్ములు, కరుణా స్వరూపులు, ధర్మనిష్ఠులై దేనినింటక నిస్సంగులై ఒందురు

**ంధా చ మలినే వస్త్రే రంగ శ్శుభతరో న హి !**
**ఙాళనే హి కృతే శుద్ధే సర్వో రంగః ప్రసజ్జతే ॥**

ఏలాగున మలినవస్త్రము రంగులో దద్దిన శుద్ధముగా పట్టుకొనజాలదో, దానిని శుద్ధముగా ఉతికినచో నే విధమైన రంగైనను ఏలాగున పట్టుకొనునో, అనగా రంగు వదలిపోదో,ఆలాగున బుద్ధియందుగల మాలిన్యము తొలగిన మాత్రమే ఆత్మభావన చేయగల్గును అట్లుకానిచో,మురికివస్త్రము రంగు ఐక్యము కానటుల ఆత్మైక్యము గలుగదు

**స్వాధ్యాయాద్యోగమాసీత యోగాత్స్వాధ్యాయమానయేత్ ।**
**స్వాధ్యాయ యోగ సంపత్త్యా పరమాత్మా ప్రకాశతే ॥**

ఓంకార ధ్యానపరమగు జ్ఞానముచే, యోగమును పరిశీలించవలయును యోగసాధనచే ప్రణవధ్యాన పరమగు జ్ఞానము నభ్యసించ వలయును జ్ఞాన, యోగ సంబంధమగు సంపత్తులవలననే పరమాత్మ ప్రకాశించును యోగమందు తపస్సు అంతర్భూతము

**మలినోహి యధాఽఽదర్శో రూపాలోకస్య న క్షమః ।**
**తధాఽవిపక్వకరణ ఆత్మజ్ఞానస్య న క్షమః ॥**

ఏలాగున మలినమగు అద్దము తన స్వరూపమును ప్రకాశింప జేయుటకు శక్తిలేని దగుచున్నదో, ఆలాగున పరిపక్వముచే, శుద్ధముకాని అన్తః కరణము గలవాడు తన సాక్షాత్స్వరూప జ్ఞానమును దర్శించుటకు శక్తుడు కాడు

**అభ్యాసవైరాగ్యభ్యాం తన్నిరోధః ॥**

అభ్యాసవైరాగ్యాభ్యాం = దృఢతరమగు అభ్యాసముచేతను, వైరాగ్యము చేతను, తత్ = ఆ వృత్తియొక్క, నిరోధః = నిరోధము గల్గును

దృఢమైన అభ్యాసముచేతను, శుద్ధమైన వైరాగ్యము చేతను మనో నిగ్రహము గల్గును అనగా ఆత్మశుద్ధి సిద్ధించును

**తీవ్ర సంవేగానామాసన్నః ॥**

తీవ్రసంవేగానాం = త్వరలోనే, ఆత్మప్రాప్తి గలుగవలయునని ఆసక్తితో అనుష్ఠానమును చేయువారికి, ఆసన్నః = సమాధి లాభము, సమాధిఫలమున్ను, ఈశ్వరదర్శనమున్ను, మోక్షమున్ను దగ్గరలోనే యుంటున్నది అనగా మోక్షము దగ్గరగా నుంటున్నది అనుష్ఠానములో ఎంత తీవ్రత గల్గియుండునో, అంత త్వరలోనే మోక్షమునకు దగ్గఱలోనే వారు చేరుచుందురు

**వీతరాగవిషయం వా చిత్తమ్ ॥**

వీతరాగవిషయం = వీతరాగులగు యోగుల చిత్తము బ్రహ్మసాక్షాత్కారమును పొందుటకు సమర్థత గలది యగును అట్టి చిత్తమే నిర్వికల్పసమాధిని పొందుటకు యోగ్యత గలిగియుండును అట్టి చిత్తము మాత్రమే నిర్వికల్ప సమాధియందు నిలకడ గల్గియుండును వీతరాగవిషయ మనగా అన్తః కరణములోగల సర్వరాగదోషములు తొలగిపోయిన శుద్ధమగు చిత్తమనియు, మనస్సనియు గ్రహించదగినది

**తపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని క్రియాయోగాః ॥**

తపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని=తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము(అనుమూడున్ను),క్రియాయోగాః = క్రియాయోగము లనబడును 1 తపస్సు, 2 స్వాధ్యాయము, 3 ఈశ్వరప్రణిధానము ఈ మూడు క్రియలున్ను యోగమునకు (ఆత్మజ్ఞానమునకు) సాధనములు

1 అన్తఃకరణములోగల దోషములను దహింప జేయుటయే తపస్సన బడును 2 ప్రణవధ్యానము, ఉపనిషత్పఠనము, స్వాధ్యాయ మనబడును 3

ఈశ్వరునియందు అనన్యమగు భక్తి గల్గి తాను చేయు కర్మలన్నిటిని ఈశ్వరార్పణము చేయుటయు, ఈశ్వర ప్రణిధాన మనబడును కావున, తపస్సుచేతనైనను, ఉపనిషత్తుయొక్క పరనముచేత నైనను, ఈశ్వరునియందు అచంచలమగు భక్తిచేతనైనను ముక్తి గల్గును

ఈశ్వర ప్రణిధానాద్వా ॥

ఈశ్వర ప్రణిధానాత్ = ఈశ్వరోపసానమున, కైవల్యప్రాప్తి శీఘ్రముగా గల్గును కావున తపస్సుచేతగాని, యోగసాధనము చేతగాని, వేదాంత విచారణ చేతగాని, అనన్యభక్తిచేతగాని, ముక్తి లభించునని చెప్పుటలో సందేహము లేదు వీనియందు ఎవరెవరికి ఏది అనుష్ఠించుటకు సాధ్యమో దానిని పరిశీలించుకొనవచ్చును

కాయేన్ద్రియసిద్ధి రశుద్ధిక్షయాత్తపసః ॥

తపసః = దృఢమగు తపోఽనుష్ఠానమువలన, అశుద్ధిక్షయాత్ = అశుద్ధి సంజ్ఞకమై ఆవరణరూపమగు రాజస తామస మాలిన్యము నశించుట మూలమున, కాయేన్ద్రియసిద్ధిః = కాయసిద్ధియు, ఇన్ద్రియ సిద్ధియు (గలుగును)

ఇత్తళి,మొదలగు పాత్రలకు కళాయి వేయవలసి యుండిన దాని యందు గల చిలుము మొదలయిన వాటిని శుద్ధముగా తోమిన మాత్రమే కళాయి పట్టును ఆలాగున రాగి మొదలగు కలశములకు బంగారు మలాము వేయవ లసియుండిన అదిన్ని చిలుము మొదలయినవి తోమి శుద్ధపరచిన మాత్రమే సువర్ణము అంటుకొనును కావున తపోధ్యానవ్రతాదులచే అంతః కరణము శుద్ధమైన మాత్రమే బ్రహ్మభావనము హృదయమున దృఢముగా నాటుకొనును మఱియు నిర్వికల్ప సమాధిసిద్ధియు, ఈశ్వరునియందు గల అనన్యభక్తియను ఉపాసనవలన గలుగునని శ్రీ పతంజలి మహర్షియొక్క సిద్ధాన్తము

సమాధి సిద్ధి రీశ్వరప్రణిధానాత్ ॥

ఈశ్వరప్రణిధానాత్ = ఈశ్వరుని యందు గల భక్తి విశేషములవలనను సర్వకర్మలు ఈశ్వరునియందు సమర్పించుట వలనను, సమాధిసిద్ధిః = సమాధిసిద్ధి గలుగును

ఈ సత్యము తెలియకనే ఈశ్వరభక్తి సరిగా లేనివారై తపో యోగసాధనలు చేయుదురు వ్యాధి యొకటియైనను, ఔషధము లనేకములు, సరియగు ఔషధమేదైన ఒకటి దానికి విధింపబడిన పథ్యములతోడ అనుష్ఠించిన రోగము శమించును ఆయుర్వేదపు మందుగాని, యూనాని మందుగాని, సిద్ధౌషధముగాని, ఇంగ్లీషు ఔషధముగాని యుండినను విరోధ మేమియు లేదు మలబద్ధక నివృత్తికొఱకు పై జెప్పిన విధానము ననుసరించి చూర్ణముగాని, భస్మముగాని, కషాయముగాని, లేహ్యముగాని, మాత్రగాని యుండుటలో తప్పేమియు లేదు దుర్మలములు మాత్రము శుద్ధముగ బహిర్గతము లయిన చాలును ఈ సత్యమును తెలియకనే కొందఱు తపస్సుచేతనే మోక్షమనియు, యోగముచేతనే ముక్తియనియు, జ్ఞానము చేతనే కైవల్యమనియు నిష్కామ కర్మముచేతనే జీవన్ముక్తియు,భక్తిచేతనే ఆత్మసాక్షా త్కారము గలుగుననియు వాదింతురు పైజెప్పిన వానిలో దేనియందు విశ్వాసము గలదో అద్దానిని నాచరించిన చాలును ఈసత్యమును పతంజలి మునియే నిర్ణయించినారు

**జన్మౌషధిమంత్ర తపస్సమాధిజాస్సిద్ధయః ॥**

జన్మౌషధిమంత్ర తపస్సమాధిజాః = జన్మము వలనను, ఓషధులవలన ను, మంత్రములవలనను, తపమువలనను, యోగ సమాధివలనను గలిగిన, సిద్ధయః = సిద్ధులు గలవు

జన్మముచేతనే కపిలాదులు సిద్ధు లయిరి 2 దివ్యవనమూలిక, ఘుటిక, పాదరసాదులచే అగస్త్యాదులు సిద్ధు లయిరి దివ్యమంత్ర ప్రభావముచే నారదాదులు సిద్ధులయిరి తపశ్శక్తిచే విశ్వామిత్రాదులు సిద్ధులయిరి యోగసిద్ధిచే దత్తాత్రేయాదులు ముక్తు లయిరి దీనివలన నెవరెవరికి దేని

యందు ప్రీతిగల్గుచుండునో, అది వారి జన్మాంతర సంస్కారరూపము ఆలాగున ప్రేరణ చేయుచున్నదని తెలిసికొనవలయును

**తతః క్షీయతే ప్రకాశావరణమ్ ॥**

తతః = పై జెప్పబడిన తపోధ్యాన యోగాదుల వలన, ప్రకాశావరణం , ప్రకాశ = ప్రకాశరూపమగు ఆత్మజ్ఞానముయొక్క, ఆవరణం = ఆచ్ఛాదకమగు నజ్ఞానము, క్షీయతే = క్షీణించును

జన్మాంతర పాపకర్మచేతను, ఇతర సంస్కారములచేతను, అవిద్య చేతను, ఆత్మ ఆవరణము గలిగియుండును అట్టి దోషము పై చెప్పబడిన అనుష్ఠానమువలన వదలిపోవు నప్పుడు మేఘము తొలగిన సూర్యునివలె నిరావరణముగా నాత్మ ప్రకాశించును

**ధారణాసు చ యోగ్యతా మనసః ॥**

మనసః = మనస్సునకు, ధారణాసు = బ్రహ్మానుసంధాన దృఢమగు ధారణలయందు, యోగ్యతా = అర్హత గలుగును

అన్తఃకరణము శుద్ధమగునప్పుడు పరమాత్మను ధారణచేయుటకు మనస్సునకు యోగ్యత గలుగును

**తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్ ॥**

తత్ర=అట్టిపరబ్రహ్మమునందు,ప్రత్యయైకతానతా,ప్రత్యయ= ధ్యేయాలంబనమగు చిత్తవృత్తికి, ఏకతానతా = ఏకాగ్రతయే, ధ్యానమ్ = ధ్యానమనబడును

నిరావరణమగు సూర్యునియందుగాని, చంద్రునియందుగాని దృష్టి నిగిడించి చూచుచుండిన ఆ సూర్యబింబముగాని, చంద్రబింబముగాని మాత్రమే గోచరించునట్లు,ధ్యాతయొక్క, అన్తఃకరణము నశించిన తనయొక్క ధ్యేయాకారమగు బ్రహ్మముగాని, ఈశ్వర స్వరూపముగాని, ఇక ఏదైన యుపా సనామూర్తిగాని మాత్రమే కన్పించెడు స్థితిగల్గిన ధ్యానము రూఢిపడినటుల

నిశ్చయించుకొనవచ్చును ఆకాశమందెచ్చటైనను మబ్బుండి సూర్యచంద్రాదు లకు అడ్డువచ్చినప్పుడు ఆ సూర్యచంద్రబింబాదులు ఏలాగున మరుగుపడు చుండునో, ఆలాగున హృదయాకాశమున ఏదైన సంకల్పము లుండుటచేతనే ధ్యేయాకారమగు యాత్మ మరుగుపడుట జరుగును

మానవ హృదయము మూడువిధములుగా నుండును ఆకాశ మేలా గున వర్ష శరత్ వసంతాది ఋతుభేదములచే భిన్నముగా నుండునో, అనగా వర్షకాలమున దట్టముగా మబ్బు ఉండుటచే సూర్యచంద్రులు బొత్తిగా కనిపిం చరు శరత్కాలమున తెల్లనిమబ్బు ఉండుటచే సూర్యచంద్రులు అప్పుడప్పుడు కొంచెము కొంచెముగా కనుపింతురు వసంతకాలమున ఆకాశము స్వచ్ఛ ముగా నుండుటచే సూర్యచంద్రులు స్పష్టముగా కనుపింతురు ఆలాగున కేవల అజ్ఞాని హృదయములో ప్రపంచవాసనలు నిండి నిబిడీకృతమై యుండుటచే ఆత్మ, ఈశ్వరుడు అని భావనయే గలుగదు జిజ్ఞాసావస్థ గలుగునప్పుడు ధ్యానమందు, ఏకాన్తమందు, ఆత్మవిచారణయందు దైవభావము పరోక్షముగా స్పష్టముగా నున్నట్లు భావన గల్గును ఒక్కొక్కప్పుడు కలుగ కనే పోవచ్చును హృదయమున నిర్వాసనస్థితి గల్గి ధ్యానమందు నిరూఢత్వము గలుగునప్పుడు విస్పష్టముగ ఆత్మయు లేక ఈశ్వరుడు గోచరించును దృఢమయిన యనుభవము గురించియు, ఇప్పుడు నిర్వాణస్థితిని బడయుటకు తగిన సాధన స్థలమును గురించియు, సాధన పద్ధతిని గురించియు సంగ్రహముగా తెలిపెద ఇది శ్రీకృష్ణభగవానులు గీతలో తెల్పినది

**శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।**
**నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్ ॥**
**తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః ।**
**ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగమాత్మవిశుద్ధయే ॥**

పరిశుద్ధమైన స్థలంబున మిక్కిలి యెత్తుగా నుండనిదియు,మిక్కిలి పొట్టిగా నుండనిదియు, దర్భలపైన చర్మము (కృష్ణాజినము లేక పులిచర్మము), ఆపైన వస్త్రము గలిగినదియు, స్థిరమైన ఆసనమును తన నిమిత్తము

వేసికొనవలయును ఆ స్థిరాసనమందు కూర్చుండి మనస్సును నిశ్చలముగాజేసి మనస్సుయొక్కయు, ఇంద్రియముల యొక్కయు వ్యాపారము లేనివాడగుచు, ఆత్మ విశుద్ధికొఱకు యోగసాధనము (పరబ్రహ్మ ధ్యానమును) అభ్యసింపవలెను

దీని యందు ధ్యానము చేయువారికి శుభ్రమగు ప్రదేశ మావశ్యకమని తెలుపడమైనది స్త్రీలు, పురుషులు,సంసారులు మొదలగు వారందఱికి నుపయోగపడ వలయునని తలంచియే శ్రీకృష్ణభగవానులు అట్లు చెప్పడమె నది. కొందఱు నిర్జన ప్రదేశము, దేవాలయము, నదీతీరము,పర్వతగుహ మొదలగువానిని తెలిపియున్నారు మరల ఆసనము స్థిరముగా నుండవలయు నని తెలిపిరి పద్మాసనాదులలో ఏదైన నొక ఆసనమున ఎక్కువసేపు ఉండు లాగుననున్ను, ఆసనమునకు ఉపయోగ పరచెడు పీఠము మొదలయినవి యుండిన అవి కదలనివిగాను ఉండవలయును

**సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।**
**సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥**

శరీర శిరః కంఠములను సమముగాను,నిశ్చలముగాను ధరించుచున్న వాడగుచు సుస్థిర స్వభావము గలవాడై తన భ్రూమధ్యమును చూచి ఇతర దృశ్యములును దేనిని చూడని వాడగుచు ధ్యానపరుడై యుండవలయు శిరః కంఠహృదయములను చక్కగా వంకర లేకుండా నిల్పినమాత్రమే సుషుమ్నా నాడి ఋజుత్వము గలిగియుండును అట్లుండు వారికి ఇతర సంకల్పములు ఏమియు గలుగవు అభ్యాసకాలమున చిత్తము చలింపక యుండుటకు భ్రూమధ్యము చెప్పినను రాగా రాగా భ్రూమధ్యము మొదలగు ప్రదేశములను, మనస్సు మొదలగు వృత్తులను ప్రకాశింపజేయు సాక్షియైన తన స్వరూపమందే మనస్సును నిలుపవలయును అనగా స్వస్వరూపస్థితిలోనే నిలుకడగల్గి యుండవలయును అచ్చట జీవాత్మను పరమాత్మస్వరూపునిగా భావించ వలయును

**మృద్వాసనే సమాసీనో జితచిత్తేన్ద్రియ క్లమః ।**
**ఓమిత్యుచ్చారయేత్తావన్మనో యావత్ప్రసీదతి ॥**

మెత్తని యాసనముపై కూర్చుండి,యింద్రియాది వృత్తులను నిశ్చలముగా చేసుకొని, మనస్సు లీనమై బ్రహ్మాకారమగు పర్యన్తము ఓంకార మన్త్రమును పరమాత్మపరముగా భావనచే ధ్యానించవలయును మెత్తని ఆసనములో కూర్చుండనిచో పాదమునకు నొప్పి తగులును అట్లైన అప్పుడప్పుడు కాలు మార్చుకొని యుండవలసివచ్చును అది నిశ్చలత్వమునకు హానికర మగును. మఱియు గీతలో ధ్యానముయొక్క పరమకాష్ఠను బోధించిన భాగమునున్ను చూడుడు

**సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।**
**మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥**

సకలేన్ద్రియములను చక్కగా నియమించి, మనస్సును హృదయము నందు నిరోధించి, తన ప్రాణమును మూర్ధస్థానమునందుంచి, యోగస్థైర్యము నాఆశ్రయించిన వాడగుచో సర్వోత్తమమయిన గతిని పొందుచున్నాడు

**ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।**
**యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥**

బ్రహ్మవాచకమయిన "ఓమ్"అనునట్టి యేకాక్షరమును ఉచ్చరించుచున్న వాడై నన్ను (పరమాత్మను) చింతించుచున్నవాడై శరీరమును ఎవడు విడుచుచు ఎవడు పోవుచున్నాడో అతడు సర్వోత్తమమైన మోక్షమును (విష్ణుపదమును) పొందుచున్నాడు "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్" అని చెప్పుటచే ప్రణవమును మాత్రము ఉచ్చరించిన చాలదనియు, "మామనుస్మరన్" ప్రణవార్థమగు పరమాత్మనుగూడ భావన చేయుచుండవలయుననియు తెలుపబడినది అలాగున చేయని కారణముచేతనే ప్రస్తుతము ప్రణవోపాసనా పరులై కొందఱుండినను పూర్వఋషులస్థితి వీరికి కలుగక పోయినది మందుమాత్రము కూర్చి గుండువేయక కాల్చిన

మరఫిరంగి ధ్వనిని మాత్రము గలుగజేయునేకాని లక్ష్యము నెట్లు భేదింప జాలదో, లోపల గింజలేని వట్టి టెంకలనుమాత్రము ఎన్ని నాటినను తరువై ఫలపల్లవ పుష్పాదులను ఎట్లు ఇవ్వజాలవో, ఆలాగున ప్రతిమంత్రమున్ను దాని అర్థమగు దైవభావముతో కలిపి జపించనిచో, స్మరించనిచో, దానివలన గలిగెడు ఫలమునుగూడ పొందజాలరు మఱియు యోగశాస్త్రమున విధించిన విధానమునుగూడ తెలిపెద

**త్రిరున్నతం స్థాప్య సమం శరీరం హృదీన్ద్రియాణి మనసా సన్నివేశ్య ।**
**బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్ స్రోతాంసి సర్వాణి భయావహాని ॥**

సాధకుడు హృదయము, కంఠము, శిరస్సును కొంచెము పైకి ఎత్తుగా నుంచి, శరీరమును సమముగా జేసికొని ఇన్ద్రియముల నన్నిటిని మనస్సుతో సహ ఆత్మయందు నిలిపి ఓంకారధ్యాన మనెడు నావచే సర్వ భయములకు హేతువులయిన సంసార ప్రవాహముల నన్నింటిని దాటవలయును "బ్రహ్మోడుపము" అనగా పరబ్రహ్మధ్యానము లేక తద్భావనారూపమగు నావయని గ్రహించుకొనవయును

**సమే శుచౌ శర్కరవహ్ని వాలుకా**
**వివర్జితే శబ్ద జలాశయాదిభిః ।**
**మనోఽనుకూలే న తు చక్షు పీడనే (నేత్ర)**
**గుహానివాతాశ్రయణే ప్రయాజయేత్ ॥**

ఇప్పుడు బ్రహ్మనిష్ఠుని నివాసస్థలమునుగూర్చి తెలుపబడుచున్నది శుచి యయినదియు, సమమయినదియు, వేడిగల గులకరాళ్ళు, అగ్ని, వేడియిసుక లేనిదియు, మంచిపక్షుల మనోహర ధ్వనులు గలదియు, మంచి జలాశయా దులతో కూడినదియు, ఎచ్చట చూచినను మనస్సునకు అనుకూల మయినదియు, నేత్రవికార మయిన రూపములు ఏవియు లేనిదియు, చల్లని అనుకూల మయిన వాతావరణము గలదియు నగు గుహాదులతో కూడిన స్థలము నేర్పరచుకొనవలయును 1 గోమయముచే అలకబడిన రేగడమట్టి

గలది శ్రేష్ఠము 2 కాంక్రీటు, సిమెంటుగలది మధ్యమము, 3 రాళ్ళుగలది అధమము, దీనియందు శరీర తేజస్సును ఆకర్షించెడు గుణమున్నది మట్టి శరీర దోషమును ఆకర్షించి తేజస్సును వృద్ధిచేయు గుణము గలిగియున్నది

**శుద్ధే చిత్తే చిదానందస్స్వయమేవ ప్రకాశతే ।**

**తద్బ్రహ్మోఽహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥**

అన్తఃకరణములోగల సకల మాలిన్యములు నశించిన చిత్తమందు జ్ఞానస్వరూపియగు ఆత్మ స్వయముగానే ప్రకాశించును అట్టి యాత్మవస్తువునే బ్రహ్మముగా తెలిసికొనినవాడు సమస్తబంధముల నుండి విముక్తుడై బ్రహ్మపదము నొందును.

**అనాత్మభూతే దేహాదావాత్మబుద్ధిస్తు దేహినామ్ ।**

**సా ఽవిద్యా తత్కృతో బంధ స్తన్నాశే మోక్ష ఉచ్యతే ॥**

అనాత్మభూతములగు దేహాదులయందు ఆత్మబుద్ధి యేది గలదో అదియే జీవులకు అవిద్య యని చెప్పబడును దానివలననే బంధమున్ను గలుగుచున్నది అది ఎప్పుడు నశించునో అప్పుడు మోక్షము గల్గును

**ముక్తిస్తు బ్రహ్మతత్త్వస్య జ్ఞానాదేవాస్య నాన్యథా ।**
**స్వప్రబోధం వినానైవ స్వస్వప్నో హీయతే కథమ్ ॥**

ఈముముక్షువు అయినవానికి బ్రహ్మతత్త్వజ్ఞానము యొక్కదానిచేతనే మోక్షము గల్గును. మరి దేనివలనను ముక్తి సిద్ధించదు ఎట్లనగా, కలలో కనిన వస్తువు లన్నియు నశ్వరములను జ్ఞానము జాగ్రదవస్థకు వచ్చిన పిమ్మట మాత్రము గదా గల్గును ?

**దృక్స్వరూపే స్థిరం కుర్యాదదృశ్యం దృశ్యమేవ హి ।**
**తదేవ త్వం విజానీయాద్జ్ఞానం జ్ఞేయం పరంపదమ్ ॥**

అట్టి దృశ్యరహితమగు బ్రహ్మాకారస్థితి యెటుల గల్గునో, దానియొక్క స్థితి ఇచ్చట తెలుపబడినది దృక్స్వరూపమగు తన యాత్మయందు నిలకడ కల్గి

భావించిన ఈ దృశ్యమంతయు అదృశ్య మగును అనగా వివర్త వాదదృష్టితో చూచినప్పుడు ఈ దృశ్యము గూడ బ్రహ్మముకన్న అన్యము కాదను జ్ఞానము గలుగును అదియే నీయొక్క యధార్థ స్వరూపము. అదియే జ్ఞానము జ్ఞేయము, పరమ పదమనియు తెలిసికొనుము వివర్తవాదమనగా 'రజ్జుసర్పన్యాయ మని గ్రహించుకొనవలయును

**ప్రజ్ఞామాత్రమిదం సర్వం నావ్యద ప్తీతి నిశ్చయః ।**
**తేదేవ త్వం తదేవ త్వం తదేవ త్వం మహామునే! ॥**

ఈ కనిపించెడు దృశ్యమంతయు ప్రజ్ఞామాత్ర స్వరూపమే అనగా జ్ఞానస్వరూపమే అట్టి జ్ఞానమునకు అన్యమయినది మఱియొకటి కొంచెమైనను లేదని వేదాంత శ్రవణ, గురువాక్యమనన, నిదిధ్యాసనలచే నిశ్చయించుకొనుము ఓ మహామునీ! గొప్పమనన శీలుడా! యధార్థముగా అదియే నీవు, అదియే నీవు, ఈ విషయములో సంశయింపకుము



# శివజీవైక్యము

శ్రీ సీతారామాంజనేయములో జీవన్ముక్తుని స్థితిని గుఱించిన ఈ క్రిందిపద్యముల నిజార్థమును తెలిసికొనక, సంసారములో విషయములతో గూడియుండినను జీవన్ముక్తుని అయ్యది ఏమియు చేయజాలదని వచించుచు ఈ క్రిందవ్రాయబడు రెండు పద్యములను చదువుచుందురు

**శివజీవైక్య సమాధి జెందు విలసచ్చిన్మాత్ర తత్త్వంబు దా**
**నవలీలం గని పూర్ణుడై పిదప మాయాసంస్కృతిం జెందినం**
**దవులన్నేర్చునె యోగి పాలు పెరుగై ద్రచ్చంగ వేత్రైన యా**
**నవనీతంబిక జల్లలో గలియునే నానా ప్రకారంబులన్ ॥**

ఆత్మజ్ఞాని గృహస్థాశ్రమములో ఉండినప్పటికిని బద్ధుడు కాడనియు, అతనిమనస్సు విషయములలో కలియదనియు తెలుపబడినది పాలును

పెరుగుచేసి తరచితీసిన వెన్నపూస మరల మజ్జిగలో నుండినను దానిలో కలియదని దృష్టాన్తముగా తెలుపడమైనది ఇది బ్రహ్మనిష్ఠు లందఱిచేతను అంగీకరింపదగిన విషయమే వారివారి సంస్కారముల ననుసరించి కొందఱు బ్రహ్మచర్యాశ్రమములో నుండియు, మఱికొందఱు గృహస్థాశ్రమములో నుండియు, మఱికొందఱు వానప్రస్థాశ్రమములో నుండియు, ఇక కొందఱు సన్న్యాసాశ్రమములో నుండియు ముక్తులగుదురు అయితే ముక్తులయిన వారందఱును ప్రకృతినుండి దూరులు, ప్రాకృతవిషయములు వారికుండవు మనస్సు పరిణామము గలుగక విషయములలో ప్రవృత్తి గలుగదు

మఱియు ఆత్మజ్ఞాని విషయమును విషము వలెనె తలంచును మంచి పదార్థ మయినను విషయుక్తమై యుండునని తెలిసిన ఎవరును భుజింపరు. తెలియకనే భుజింతురు మజ్జిగలోనుండు వెన్న దానిలో కలియనటుల నుండునని దీనిసారము అగుచో దానిలో కలిసిపోయినదానిని వెన్నయని ఎటుల చెప్పవచ్చును? తెల్లని సున్నమున్ను వెన్నయు నొకేవిధముగా నుంటున్నవి తెల్లసున్నము నీటిలో కరిగిపోవును ఆలాగున నిజముగా ఆత్మజ్ఞానము గలవారైనచో విషయరహితులై యుందురు విషయములలో విలీనమయిన స్వభావము గలవారైనచో పేరుతోను, రూపముతోను ముక్తులు అని చెప్పవచ్చునుకాని అది వేదాంతశాస్త్ర సమ్మతము కాదు

జీవన్ముక్తుని గుఱించి యు, బద్ధాత్ముని గుఱించియు చెప్పునప్పుడు శాస్త్రము కాలిన కుండను, కాలని కుండను దృష్టాన్తముగా నిరూపించియున్నది దానినిపక్వాపక్వ ఘటములుగా వర్ణించడమైనది కాలిన కుండ నీటిలోనుంచిన కరుగదు. కాలని కుండ నీటిచేతడిసిన, లేక నీటిలో నుంచిన కరుగును కుండ కావలసియుండిన కుమ్మరివారి ఆవములో అగ్నియందు కాలవలయును పచ్చికుండ అట్టి స్థితిని పొందలేదు అందువల్లనే నీటితో సంబంధపడునప్పుడు తన స్వరూపము లేకపోవుచున్నది

పైజెప్పిన "శివజీవైక్య" మను పద్యము నాధారపరచుకొని కొందరు గురువులు బ్రహ్మనిష్ఠుల వర్తనమునుండి చెడువృత్తులలో విషయ ప్రవృత్తిలో

నుండియు' తమకు బంధము లేదని ప్రలాపము చేయుచుందురు దీనివల్ల విద్యావంతులకున్ను, ప్రజ్ఞావంతులకున్ను గౌరవనీయులకున్ను సాధువులపై, సన్న్యాసులపై, గురువులపై విశ్వాసము లేకపోవుచున్నది ఈ తృతీయాశ్వాసమున ఈ అమనస్కమున ఆద్యంతము గల వాక్యములను విచారణచేయక పోవుటచేతనే యిట్టి ప్రమాదము గలుగుచున్నది బ్రహ్మనిష్ఠుడు నిర్విషయుడనియు, నిస్సంగు డనియు, ప్రకృతిదోష రహితుడనియు, జితేన్ద్రియుడనియు గల పద్యములను సమన్వయపరచి చింతన చేయకపోవుటచేతనే ప్రమాదము గలుగచున్నది

**చారువివేకి యసార మహాసంసారము జెంది యసంగత నుండున్**
**నీరజపత్రము నీరము నేప్రొద్దారయ నంటియు నంటనిభంగిన్.**

ఈ పద్యములోనే 'సంసారము జెంది యసంతగత నుండున్' అను పద్యమును దీర్ఘముగా నాలోచించిన నిజార్థమును తెలియగలరు "అసంగత నుండున్" అను పదమువలననే సంస్కారబలముచే గృహస్థాశ్రమములో నుండినను విషయముల నంటకనే యుండునని స్పష్టముగా తెలియుచున్నది

అదెటులన దృష్టాన్తముగూడ నిరూపిత మాయెను తామరాకు నీటిలో నుండినను జలముతో నంటక యుండునటుల ఉండునని నిరూపింపబడెను అయితే నీరు అంటుచుండిన దానిని తామరాకని ఎటుల నమ్మవచ్చును? అది తామరాకు కాదు మఱియొక ఆకుగా నుండవచ్చునని నిశ్చయించుకొనవచ్చునుగదా? మీలో ఎవరైనా పద్మసరోవరమునకు వెళ్ళి ఆకుపై చేతితోగాని, చెంబుతోగాని నీళ్లను పోసి చూడుడు లేక వాన కురియునప్పుడు ఆ సరస్సునకు వెళ్లి పద్మపత్రమునకు దగ్గర వెళ్ళి చూడుడు అప్పుడు మీకిది స్పష్టముగా తెలియగలదు ఆకుపై పడిన జలబిందువులు ముత్యములవలె ఆకుపై నిలువక జారిపోవుచుండును అలాగున జీవన్ముక్తుని హృదయమున ఏ విషయములున్ను అంటజాలవు ఇదియే ఉత్కృష్టమైన వేదాంతశాస్త్రము ఉపదేశించెడు రహస్యము

అట్టి నిస్సంగులై, పవిత్రాత్ములై, జ్ఞానాత్ములై, అమృతాత్ములై యుండవలసినవారిలో దుర్విషయదోషములు కనిపించుటచేతనే బ్రహ్మవిద్య యందు గొప్పవారికి విశ్వాసము లేకపోవుచున్నది ఇందువలననే బ్రహ్మవిద్య పతన మొందుచున్నది అందువలన గొప్పవారు తరించకపోవుట యే గాక నిస్సహాయులై తరణాసక్తిగల జిజ్ఞాసువులకు ఏ విధసహాయమున్ను చేయక పోవుచున్నారు అందువలన గృహస్థులున్ను,శుభేచ్ఛ గలవారున్ను తరించకపోవు చున్నారు ఈ దోషము నివర్తించిన మాత్రమే బ్రహ్మవిద్య యుద్ధరింపబడును అప్పుడే భారతదేశము పూర్విక ఋషి కాలమువలె బ్రహ్మజ్ఞానముచే శోభాయ మానమై యుండును దీనికి ప్రతిముముక్షువున్ను, సాధువున్ను, సన్న్యాసి యున్ను, గురువున్ను, ఉపదేశమును బడసిన ప్రతి స్త్రీ పురుషుడున్ను కంకణబద్ధులై తన జీవితములో ఏలాటి లోపము గలుగక వర్తించులాగున దృఢవ్రతమును ధరించుకొనవలయు ఇదియే నిజమగు గురుసేవయు, దైవసేవయు, లోకసేవయు అగును అట్టివారు పరమ ఋషులయొక్కయు, సర్వేశ్వరునియొక్కయు అనుగ్రహమునకు పాత్రులై ఈ జన్మమునే తరింతురు ఈ విషయమై ఈ తృతీయాశ్వాసమున చెప్పిన పవిత్ర పద్యములను చూడుడు

**కొందఱాత్మతత్త్వము నెఱుంగుదు మటంచు**
**గర్వులై నిక్కి చిత్తనిగ్రహము లేమి**
**నుపరతి సుఖంబు గావక విపుల విషయ**
**రాగలోలత జెడుదురూరక మహాత్మ!**

**జ్ఞానవిజ్ఞానయుతుడయ్యు సంతతంబు**
**నాత్మభావవ లేకున్న యతని యింద్రి**
**యంబులు మనంబు తమకు వశంబు జేసి**
**విషయసుఖముల చవిజూపి వెతల బెట్టు.**

**ఆత్మతేజంబు వీక్షించు నతని మాన**
**సేంద్రియంబులు చేష్టల నెడల విడిచి**

యొదిగి చెదరక కదలక యూరకుండు
సింగముల గన్న మృగముల భంగి ననఘ!

చక్కెరయును లవణంబును
గ్రక్కున నుదకములయందు గరగినరీతిన్
మిక్కిలి తను గను ఘనమది
చొక్కు చునానందజలధి మునిసి నశించున్.

ఇతరసంకల్పములు లేక యెపుడు దాను
సచ్చిదాత్ముడనని సుప్రసన్నవృత్తి
దన్ను గనువాని చిత్తంబు దనకుదాన
పొలియు దనయంద నింధనానలము పగిది.

ఇనుడస్తమించు తఱి నా
తని కిరణము లతనితోడ దగ జనురీతిం
బెనుమానసంబు పొలిసిన
మునుకొని తద్దయయ వికారములు పొలియుగడున్.

వనితానందన చందనాది విషయవ్రాతంబులం బొంది చ
య్యన నంతంతకు జొక్కు నెమ్మనము బ్రహ్మానందవారాశి వా
సన యొక్కించుక సోకనేని బ్రవినాశంబొందు నానాద్రు పు
ష్పనటద్భృంగము చంపక ప్రసవసంప్రాప్తి గూలుం గతిన్ .

ఈ పద్యముల యర్థము సీతారామాంజనేయములో చూచి గ్రహింప వచ్చును ఇచ్చట వ్రాయబూనిన గ్రంధము పెరుగునని తలంచి విడువబడి నది ఆత్మజ్ఞానియందు విషయములుగాని, వృత్తులుగాని, విషయ సంకల్ప ములు గాని గల్గుట కవకాశము లేదని పై తెల్పిన పద్యములచేతనే మీరు తెలిసికొనవచ్చును సామాన్యముగా ఆత్మసాక్షిగా నుండుటచే విషయములు, వృత్తులు, సంకల్పములు, దృశ్యములు గావున ఆత్మకు బంధము లేదని సాంఖ్యవిచారకులు, అనగా పంచీకరణ ప్రవర్తకులే చెప్పెదరు అసలు

సాంఖ్యము కపిల మహర్షిది, ఆ మహానుభావుడు మూడు గుణములు నశించ వలయునని యుపదేశించెను అంతియే గాదు ప్రకృతినుండి విముక్తిని పొంద వలయుననియు చెప్పెను దానికొఱకే దీర్ఘకాలము పాతాళమువంటి గుహలో తప మొనర్ప వలసి వచ్చెను

ఇప్పుడు పంచీకరణమును మాత్రము తెలిసికొనిన చాలుననియు, గుణములకున్ను ఆత్మకున్ను ఏసంబంధము లేదని చెప్పువారు ఏర్పడిన ప్పటినుండియు వేదాంతమునకు పతనము గల్గెను వీరు వేదాంతశాస్త్రములో సగముమాత్రమే వెళ్ళి అనగా దృగ్దృశ్యముల విచారణమాత్రమే చేసిరి దృగ్దృశ్యముల ఏకత్వమును చేయలేదు "నేతి నేతీతి" వాక్యములచే 24 తత్త్వములను, కొందరి మత ప్రకారము 25 తత్త్వములను మాత్రమే శోధించి విడిచిపెట్టిరి ఇది అధ్యారోపవాదము వఱకే చెల్లును మరల అపవాద వాదమార్గమును శోధించకపోయిరి ఇది దృశ్యమును దృక్కులో (ఆత్మలో) లయపరచెడు మార్గము అప్పుడు అంతయునొక బ్రహ్మమాత్రముగానే యుండును బ్రహ్మమునందు ప్రకృతిగాని, తద్గుణములు గాని, సంకల్పములు గాని, సంస్కారములుగాని యుండవు అట్టి దృఢాభ్యాస బలముచే దృశ్యమును గూడ ఆత్మస్వరూపముగా (దైవరూపముగా) చూచుశక్తి గలుగునప్పుడు దైవమున కన్యముగా మఱియేమియు నుండకూడదని తలంచి దృశ్యరాహిత్య మొనర్చును. ఇదియే వేదాన్తము, ఇదియే పరమాద్వైతము అని ముముక్షువులు గ్రహించుకొనవలయును

ఉత్సవములుగాని, గొప్పసభలుగాని జరుగుచున్నప్పుడు ప్రారంభమున ధ్వజారోహణమును చేయుదురు ధ్వజస్తంభముపై ఎంత వరకు తనమత చిహ్నమగు జెండా యుండునో అంతవరకు ఉత్సవము పూర్తికాలేదనియు, ధ్వజావరోహణము చేయునప్పుడే అయ్యది పూర్తియయినదియు ఎటుల గ్రహించుకొనవచ్చునో, అదియే అధ్యారోప అపవాదములయొక్క గుర్తులని గ్రహించుకొవచ్చును మఱియు ప్రాతఃకాలములో తనయొక్క ఛాయ దీర్ఘముగా కనుపించినను సూర్యుండు పైకి రాగా రాగా తన నీడయు

క్రమక్రమముగా తగ్గుచు సరిగా మధ్యాహ్నమునకు నీడ యేలాగున లేకపోవునో, అలాగున అధ్యారోప, అపవాదములయొక్క ధర్మమని విజ్ఞులు గ్రహించుకొన వలయును ఈ విషయమై వేదాంతడిండిమము ఘోషించినది జూడుడు

**పరమే బ్రహ్మణి స్వస్మిన్ ప్రవిలాప్యాఖిలం జగత్ ।**
**గాయన్నద్వైతమానన్దమాస్తే వేదాంతడిండిమః ॥**

పరబ్రహ్మమైన తనయందు నిఖిల ప్రపంచమును లయింపజేసి విద్వాంసుడు అద్వైతానందమును గానము చేయుచున్నాడని వేదాంతభేరి ధ్వనించుచున్నది

**ప్రతిలోమానులోమాభ్యాం విశ్వారోపాపవాదయోః ।**
**చిన్తనే శిష్యతే తత్త్వమితి వేదాంతడిండిమః ॥**

ప్రతిలోమానులోమములచేత ప్రపంచముయొక్క అధ్యారోపాపవాదములు చేయగా శేషించినది తత్త్వమని వేదాంతడిండిమము ఇచ్చట భావము 'అధ్యారోపాపవాదాభ్యాం జ్ఞాతవ్యస్తత్త్వ నిర్ణయః" అను ప్రకారము ప్రపంచముయొక్కఅధ్యారోపాపవాదములచేత తత్త్వనిర్ణయము చేయవలయును అధ్యారోప మనగా - "శుక్తికాయాం రజతవత్, రజౌ సర్పవత్, స్థాణౌ పురుషవత్ నిష్ప్రపంచాత్మ వస్తుని ప్రపంచారోపః " అర్థము - ముత్తెపు చిప్పలను చూచి వెండి యనుకొన్నట్లున్ను, రాత్రిలో త్రాడునుచూచి సర్పమనుకొన్నట్లున్ను, స్థాణువును అనగా కొయ్యస్తంభమును జూచి పురుషుడు అనుకొన్నట్లున్ను పరమాత్మను చూచి ప్రపంచ మనుకొనుట ఈ అధ్యారోపము అజ్ఞానమువలన గల్గును అనగా వస్తుస్వరూపమును తెలిసికొనలేక ఆవస్తువునే ప్రపంచముగా భావించుట యని భావము అపవాదమనగా శుక్తికయందు రజతమున్ను, రజ్జువునందు సర్పమున్ను, స్థాణువునందు పురుషుడున్ను ఎట్లు లేవో అట్లుగానే నిష్ప్రపంచాత్మయందును ప్రపంచము లేదను కొనుట అనగా కారణ వ్యతిరేకముగా కార్యముండదు గనుక సచ్చిదానంద స్వరూపాత్మయందు అనృత, జడ, దుఃఖరూప ప్రపంచము లేదనుకొనుట యని భావము " యా

మా, సా మాయా,యా న విద్యతే సా అవిద్యా" అను వ్యుత్పత్తిని బట్టి, యా = ఏది, మా = లేదో, సా = అది, మాయా = మాయ యనబడును యా = ఏది, న విద్యతే = లేదో, సా = అది, అవిద్యా = లేనిది, అను అర్థముప్రకారము మాయ లేనిది కనుక మాయాకల్పిత జగమున్ను లేనిదే అయియున్నది ప్రతిలోమ మనగా క్రిందినుంచి పైకిపోవుట, అనగా ప్రపంచమును నిరసించి బ్రహ్మమును మిగుల్చుట, అనులోమమనగా పై నుంచి క్రిందికివచ్చుట, అనగాబ్రహ్మమునందు ప్రపంచమును ఆరోపించుట కాబట్టి ఇట్టి అధ్యారోపాపవాదముల చేతను విచారణచేయుగా "నేతి నేతి" అను అతద్వ్యావృత్తిరూపముగా ప్రపంచమును నిరసించగా మిగులు నదియే తత్త్వము అనగా ఆత్మవస్తువు అని భావము అతద్వ్యావృత్తి యనగా, అతత్ = ప్రపంచము, వ్యావృత్తి=దాని నిరసనము అని అర్థము

దంతిరూపంబుచే నొప్పు దారువరయ
దారు వగుగాక పరికింప దంతియగునె
విశ్వరూపంబుచే దోచు విష్ణుమూర్తి
విష్ణుడగుగాక పరికింప విశ్వమగునె?

వారణమంచు భ్రాంతు డగువానికి దారువు తోపదాక్రియన్
దారువటంచు గాంచు విహితజ్ఞునకుం బరికింప గల్గునే
వారణమట్లు సర్వమనువానికి బ్రహ్మము గానుపింప ద
ట్లారక బ్రహ్మమందు గను యోగికి సర్వము గల్గి తోచునే ?

ఘటశరావాది మృత్కార్య జాతంబుల
నెంచి మృత్తికయని కాంచు పగిది
నమల కుండల కిరీటాది భూషణముల
స్వర్ణంబని యెఱుంగు చందమునను
నసికుంతశూలచక్రాదికంబుల నెల్ల
నినుమని యరసి కన్గొనివభంగి
బలుపారు ఫేనబుద్బుద తరంగంబుల

## మంచినీరని విలోకించు రీతి

**దనరు బహువిధపటముల తంతు వనుచు**
**దెలియు కైవడి మొదలి సందియము విడిచి**
**భ్రాన్తిని దొలంగి సర్వంబు బ్రహ్మమనుచు**
**సుఖముగా సంతతంబును జూడు మనఘ!**

ఇప్పుడు ఈ వ్యాసము ముగియింప దలంచుటచే యోగశాస్త్ర కర్త యగు శ్రీ పతంజలి మహర్షి తన గ్రంధమున కైవల్యాపాదమున కట్టకడకు సూత్రించిన వాక్యము ఇచ్చట ఉద్ధరింపబడుచున్నది

**పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతిప్రసవః**
**కైవల్యం స్వరూపప్రతిష్ఠా వా చితిశక్తిరితి ॥**

పురుషునకు భోగాపవర్గరూప పురుషార్థములను సంపాదించి కృతార్థము లయినవి కాన నిక నేవిధమగు పురుషార్థమును లేక కార్య కారణ స్వరూపమగు గుణములు స్వకారణ లయమూలమున క్రమ క్రమముగా ప్రధానమున లయము జెందుటయే కైవల్యము. అనగా వ్యుత్థానసంస్కారములును, సమాధి సంస్కారములును, నిరోధ సంస్కారములును స్వకారణమగు మనస్సున లయించి, మనస్సు స్వకారణమగు బుద్ధియందు లయించి,యా బుద్ధి గుణస్వ రూపమగు ప్రధానమున లయించి, ఆ ప్రధానము పరబ్రహ్మమున లయించుట కైవల్యమనబడును. బుద్ధిసత్త్వ సంబంధ మపుడపుడు గలుగకుండుట వలన బురుషుడు నిరన్తరమును కేవలము చితిశక్తి మాత్రుడుగ నుండుట స్వరూప ప్రతిష్ఠ యనబడును. స్వరూపప్రతిష్ఠ యనగా నాత్మయొక్క వాస్తవస్వరూపము ఇట్టి స్వరూప ప్రతిష్ఠయు కైవల్య మనబడును నిర్వాణము యొక్క పరమకాష్ఠను శ్రీయోగవాసిష్ఠమున నిరూపించినదియు చూడందగును

**నిత్యోదితం విమలరూప మనన్తమాద్యం**
**బ్రహ్మాస్మి నేతరకలాకలనం హి కిఞ్చిత్ ।**

**ఇత్యేవ భావయ నిరఞ్జనతాముపేతో**
**నిర్వాణమే హి సకలామలశాన్తవృత్తిః ॥**

ఓ రామచంద్రా! పంచకోశ వివర్జితమును,అవస్థాత్రయ రహితము నగు నిరంజనరూపమును నీవుబొంది నిత్యోదితమై, విమలరూపమై, అనంతమై ఆద్యమైనట్టి బ్రహ్మమే సమస్తమునై ఉన్నది అన్యమగు కల్పన యెద్దియును లేదని భావించుచు సమస్తకల్పనా రూపమలము శమించినవాడవై నిర్వాణ పదమును బొందుము



# సర్వసార సంగ్రహము

**శ్రవణం కీర్తనం శంభోర్మననం చ మహత్తరమ్ ।**
**త్రయం సాధనముక్తం చ విద్యతే వేదసమ్మతమ్ ॥**

ఈశ్వర శ్రవణము, కీర్తనము, మననము అను ఈ మూడున్ను మహత్తరము లయిన మోక్షసాధనములని వేదసమ్మతము. ఇది భక్తిరూపము గను, వేదాంత జ్ఞానరూపముగను నుంటున్నది అని సనత్కుమార మహర్షి యమునాతీరమున వ్యాసమహర్షి కుపదేశించెను

**మోక్షో విషయవైరస్యం బంధో వైషయికో రసః ।**
**ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు ॥**

విషయములలో గల వైరాగ్యమే మోక్షము విషయములలో గల ఆసక్తియే బంధము ఇది యొకటియే శాస్త్రములచేతను, గురువులచేతను, మనస్సు చేతను తెలిసికొనందగినది ఆవల మీయిష్ట మేలాగుననో అలాగున చేయుడు, అని అష్టావక్రమునీన్ద్రుడు జనకమహారాజు నుద్దేశించి అష్టావక్రగీతయందు తెలిపెను

**యథా ఉయం కమఠో ఉంగాని సంకోచయతి సర్వతః ।**

**విషయేభ్యస్తథా ఖాని సంకోచయేద్యోగతత్పరః ॥**

ఏలాగున తాబేలు తనకు ఇచ్ఛవచ్చినప్పుడు సర్వావయవములను లోనికి ముడుచుకొనునో, ఆలాగున ధ్యానతత్పరుడు దృశ్య విషయములనుండి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది అన్ని యింద్రియములను లోనికి ముడుచు కొనవలయును అట్టివాడే యోగియు ఇన్ద్రియనిగ్రహము గలవాడును అగును అని గణేశగీత ఇదేరీతిగ శ్రీకృష్ణభగవానుడున్ను గీతలో స్థితప్రజ్ఞుని లక్షణములను గురించి యుపదేశించెను

**యదా సంహరతే చాఽయం కూర్మోఽఙ్గానీవ సర్వశః ।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥**

దీనియర్థము పై జెప్పినదే ఇట్టి లక్షణము గలవాడే దృఢ ప్రజ్ఞగలవా డగును అనగా అచంచలమైన జ్ఞానము గలవాడు ఈలాగున నుండును

**యదా హ్యజ్ఞాన కాలుష్యం జన్తోర్బుద్ధిః క్రమిష్యతి ।**
**తదాఽసౌ యాతి వైరాగ్యం వేదవాక్యాదిషు క్రమాత్ ॥**

సాధనానుష్ఠానముచే ఎవని బుద్ధి అజ్ఞానకాలుష్యమును అతిక్రమిం చునో, అప్పుడు వేదములలో చెప్పబడిన సర్వవిషయములలోను వైరాగ్యమును పొందిన వాడగును అనగా త్రిగుణములలో విరక్తిని పొందిన వాడగును త్రిగు ణాతీత స్థితిని పొందగల్గును అని గణేశగీత ఇదే ప్రకారము భగవద్గీతయం దును ఒక శ్లోకము గలదు

**యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥**

దీనియర్థము గూడ పైజెప్పిన విధముగానే యున్నది ఎప్పుడైతే మాయామాలిన్యమును జీవుడు దాటునో, అప్పుడే ఇదివరలో గురువులచేతను, శాస్త్రములచేతను వినిన దానియొక్క యర్థము గోచరించును అంతియే కాదు, ఇక వినదగిన దానియొక్క అర్థము గూడ స్ఫురించును కావున ముముక్షువులు

ప్రకృతిని రహిత మొనర్చుటకు ముందుగా ప్రయత్నించవలయు అట్లు కానిచో ఎన్ని శాస్త్రములు చదివినను, మహాత్ములవల్ల నెంతో శ్రవణము చేసినను ప్రయోజనము కలుగదు

**నాసమాన సహాయేషు నివసేద్యోగవిత్క్వచిత్ ।**
**వసేత్సమానశీలేషు సుశీలేషు తపస్విషు ॥**

ధ్యానయోగి తనకు సమానమైన స్వభావము గలవారుండు స్థలములో నుండవలయును అట్లు సమానగుణము లేని స్థలములో నొకప్పుడును నుండరాదు నిర్మల శీలమును, పుణ్యస్వభావమును,తపస్సును గల వారుండు ప్రదేశమే యుత్తమ మయినది

**ముహూర్తమపి నాసీత దేశే సోపద్రవే యతిః ।**
**ఉపద్రుతే తు మనసి సమాధిర్నైవ జాయతే ॥**

ఒక ముహూర్తసమయమైనను యుపద్రవముగల స్థలములో ధ్యాన యోగి నివసింపగూడదు బాధగల స్థలములో నుండిన నిర్వికల్పసమాధి సిద్ధింపదు

**యత్తీర్థమనుసంప్రాప్య చిత్తమస్య ప్రసీదతి ।**
**తత్ర తిష్ఠేన్నరో విద్వాన్మోక్షమార్గే వ్యవస్థితః ॥**

ఏ ప్రదేశమున నే జలాశయమున నుండిన మనస్సునకు ప్రసన్నత గలుగునో, మోక్షమార్గమందు నిష్ఠగల బుద్ధిమంతుడు అట్టి స్థలములోనే నివసింపవలయును. పుణ్యక్షేత్ర మయినను పుణ్యభూమి యయినను, పుణ్యతీర్థ మయినను, పుణ్యాశ్రమ మైనను దేహమునకు గాని, మనస్సునకు గాని అనుకూలమున్ను, ప్రశాంతతయున్ను లేని స్థలములో నివసింప గూడదని యోగశాస్త్రము

**ముహూర్తమపి యో గచ్ఛేన్నాసాగ్రే మనసా సహ ।**
**సర్వం తరతి పాప్మానం తస్య జన్మ శతార్జితమ్ ॥**

జ్ఞానయోగమున ఒక ముహూర్త సమయమైనను నాసాగ్రమందు (సుషుమ్నాగ్రమందు) నిశ్చలముగా మనస్సును నిలిపెనేని, అట్టి నిష్ఠగలవాడు అనేక జన్మార్జితంబు లయిన సకలవిధ పాపములనుండి విడివడును అని యుత్తరగీతయందు శ్రీకృష్ణభగవా డర్జునుని కొఱకుపదేశించెను

**సత్యం తపో బ్రహ్మచర్యం విద్యాధికృతికారణమ్ ।**
**ముఖ్యాధికారీ విద్యాయాం వరిష్ఠో బ్రహ్మవిద్భవేత్ ॥**

సత్యము,తపస్సు, బ్రహ్మచర్యము ఇవి బ్రహ్మవిద్యయం దధికారమును కలిగించును ఈ విద్యయందు బ్రహ్మవిత్తు ముఖ్యాధికారి యగును

**శ్రవణం మననం ధ్యానం విద్యాయాస్సాధనం త్రయమ్ ।**
**అజ్ఞానం సంశయో భ్రాన్తి రిత్యేతేషాం నివర్తకమ్ ॥**

శ్రవణము, మననము,ధ్యానము బ్రహ్మవిద్యకు ముఖ్య సాధన త్రయ మగును శ్రవణముచేత అజ్ఞానము, మననముచే సందేహము, నిదిధ్యాసలచే మాయాభ్రాన్తియు నివర్తించును

**శ్రవణాన్మననాద్ధ్యానాదవ్యపాయాద్గురూదితాత్ ।**
**అజ్ఞానసంశయౌ జహ్యాద్విపరీతాం చ భావనామ్ ॥**

శ్రవణము,మననము, ధ్యానము, గురువుచెప్పిన సాధనము - వీటివలన అజ్ఞానము, సంశయము, విపరీతభావనయు దొలగును

**యత్తు పుణ్యయుగే సర్వభావో న తు కలావితి ।**
**తదసత్ బోధసాధ్యస్య పుణ్యాకాలానపేక్షణాత్ ॥**

కృతత్రేతాది పుణ్యయుగములలో మాత్రమే బ్రహ్మాత్మసాక్షాత్కార జ్ఞానము గలుగును కలియుగ మందట్టిజ్ఞానము గలుగదు అని చెప్పెడి వాక్యములు సత్యము గావు. ఎందుకనగా, జీవులయొక్క పరిపక్వ కాలముచేతనే బోధయందు ఆసక్తి గల్గును బ్రహ్మనిష్ఠచే అట్టి బోధ యెప్పుడు గలుగునో, దానికి యుగాదుల సంబంధము లేదు పుణ్యాగుణము లెప్పుడు గల్గునో

అదియే పుణ్యయుగ మగును అనగా అదియే కృతయుగము

**అనాత్మన్యరుచిశ్చిత్తే రుచిశ్చాత్మని చేద్భవేత్ ।**
**పుణ్యపుంజేన శుద్ధం తచ్చిత్తమేకాగ్ర్యమర్హతి ॥**

ఆత్మకానిదానియందు మనస్సున రుచిలేక పోవుటయు, ఆత్మయందభిరుచి గలుగుటయు ఏది గలదో, అది మహాపుణ్యముచే గలుగును ఆ శుద్ధచిత్తమేకాగ్ర్యమును గలిగించును

**పండేతి బుద్ధేర్నామైతత్సా జాతా యస్య నామతః ।**
**స పండితస్తస్య కర్మ పాండిత్యం శ్రవణాస్తు తత్ ॥**

పండా యనగా జ్ఞానమునకు పేరు ఎవని పేరుతో నది పుట్టినదో యాతడు పండితుడు అతని జ్ఞానకర్మ పాండిత్యము అది వేదాంతశ్రవణము

**సోఢ్వాఽపి కర్మవిక్షేపం చిత్తైకాగ్రే క్షమో యది**
**తదా వేత్తు గృహస్థోఽపి ప్రవ్రజత్వన్యథాపుమాన్ ॥**

అనుకూలమయిన భార్య లభించి, ప్రపంచకర్మలచే గలిగెడు విక్షేపమును సహించి,చిత్తము నేకాగ్ర్యము చేయ సమర్థు డయ్యనేని గృహస్థుడయినను యాత్మజ్ఞానమును పొందగల్గును అట్లు కానప్పుడు పురుషుడు సన్న్యసించుగాక

**నైవ జన్మని సర్వస్మిన్విద్యాఽసౌ సులభాఽపి తు ।**
**శిష్యలక్షణ సంపూర్ణ జన్మన్యేవ హి లక్ష్యతే ॥**

అన్ని జన్మములయం దీవిద్య సులభము గాదు, శిష్యలక్షణములు సంపూర్ణముగా నున్న జన్మమునందే కనబడుచున్నవి

**విషయాసంగరూపో యః పాప్మాసావాసురత్వతః ।**
**విద్యేచ్ఛాం ప్రతిబధ్నాతి సోఽయమాదౌ నివర్త్యతామ్ ॥**

విషయముల యందాసక్తి యనెడు నేపాపము గలదో అది అసురము,

అనగా రాక్షసునివంటిది కనుక జ్ఞానవిద్యయం దిచ్చును నాటంకపెట్టును కావున దానిని మొదట నివారింపవలసియున్నది అనగా విషయేచ్ఛ రాక్షసత్వ మని గ్రహింపనగును అని శ్రీవిద్యారణ్యగురుండు అనుభూతి ప్రకాశమున నుపదేశించెను ఆలాగున శ్రీకృష్ణభగవానుడు గీతలోను అర్జునునికి తెలిపెను

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥

రజోగుణమువలన పుట్టినదియు, తృప్తినొందనిదియు నగు కామము, మహాపాతకమునకు హేతువు అయినదియు నగు క్రోధమున్ను ఆత్మజ్ఞాన మునకు ప్రబలశత్రువులు ఇచ్చట కామమును అగ్నిగాను, మహాపాప స్వరూప ముగాను వర్ణించడమైనది అగ్ని యేలాగున సమిధలచే తృప్తిని చెందదో, ఆలాగున నీ కామమున్ను భోగముచే తృప్తిచెందక పెరుగును కాని త్యాగము చేత శమించును

ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణానలేన చ ॥

ఓ యర్జునా! ఎంత ప్రయత్నముతో నిండింప జూచినను నిండని దియు,అగ్నివలె తృప్తిని జెందనిదియు, కామమే రూపమయి నదియు, జ్ఞానికి సర్వకాలమందును శత్రువు అయినదియు నగు ఈ కామముచేత జ్ఞానము ఆవరింపబడియున్నది పై శ్లోకమున కామమును అగ్నిరూపముగా వర్ణించ డమైనది ఈ శ్లోకమున అగ్నిరూపముగాను, సముద్రరూపముగాను వర్ణించి నారు సముద్ర మేలాగున అనేక నదులద్వారా జలమును త్రాగినను తృప్తిని పొందక యుంటున్నదో, ఆలాగున నీ కామమున్ను నవద్వారములతోను దశేన్ద్రియములతోను సృష్ట్యారంభమున నుండి విషయములు అను నదులను పానము చేసి యిప్పటివరకు తృప్తిని పొందకనే యుంటున్నది

ధూమేనావ్రియతే వహ్నిర్యథాఽఽదర్శో ఽమలేన చ ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్ ॥

ఈ కామము ఆత్మను ఏలాగున ఆవరించుచున్నదో ఇచ్చట నిరూపింప బడుచున్నది చిమ్నిలో గలిగెడు పొగచేత దీపమున్ను, మాలిన్యముచే అద్దమున్ను, మావిచేత గర్భస్థశిశువున్ను ఆవరింపబడు నటుల కామముచే ఆత్మ జ్ఞానమున్ను ఆవృతమయి యున్నది

**తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ! ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥**

ఓ యర్జునా! ఏ కారణమువలన కామము ఆత్మను మోహింప జేయుచున్నదో, ఆకారణమువలన నీవు మొదటనే ఇంద్రియములను నిగ్రహించి, జ్ఞానమును విజ్ఞానమును నశింపజేయునదియు, పాపస్వరూపము గలదియు నయిన యీ కామమును ప్రయత్న పూర్వకముగా విడువుము, వధింపుము, నశింపజేయుము

**ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ ॥**

ప్రతి ఇంద్రియముయొక్క విషయములందు రాగద్వేషము లున్నవి కాబట్టి ఆ రాగద్వేషములకు అధీనము కాకూడదు ఏలయనగా, అవి ఈ పురుషునకు శత్రువులు ఈ శ్రీ కృష్ణవాక్యమును భక్తులందఱున్ను, ముముక్షువు లందరున్ను బాగుగా జ్ఞాపకములో నుంచవలయును

ఇప్పుడు శ్రీవ్యాసభగవానులు చెప్పిన వాక్యమును తెలిపెద

**కామబంధనమేవేదం నాన్యదస్తీహ బంధనమ్ ।**

**కామబంధనముక్తో హి నేహ భూయోఽభిజాయతే ॥**

ఈ జీవునికి కామమే సంసారమందు బంధన మగును ఇది యొకటి తప్ప ఇహలోకములో బంధించునది మఱియొకటి లేదు కామ బంధమునుండి ముక్తుడయినవాడు ఇచ్చట మరల జన్మమెత్తడు జన్మరహితమగు ముక్తిని పొందగల్గును

**కామబంధనమే వేదం వ్యాసోఽప్యాహ పదేపదే ।**

ఈ కామబంధనమే బంధమని శ్రీవ్యాసభగవానుడు 'పదే పదే' అనగా పలుమార్లు చెప్పినారు

సీతారామాంజనేయములో, సంసారములో నుండి వ్యవహారము గడుపువాడు ఏలాగున బ్రహ్మచింతనగాని, భగవచ్చింతన గాని చేయుటకు సాధ్యపడునో అని చెప్పిన విషయము క్రింద తెలుపబడుచున్నది

**పరపురుషానురక్తి గల భామిని యెల్లపనుల్ గృహంబునం**
**బొరిబొరి జేయుచుం బ్రియుని పొందు సుఖంబుగ జూచురీతి భా**
**స్వరపర తత్త్వవేది నిజవర్ణనిజాశ్రమయోగ్యధర్మముల్**
**నిరతము సల్పుచుం బరమనిర్మలసౌఖ్యము గాంచు నెమ్మదిన్.**

ఈ దృష్టాన్తము అంతమంచిది కానప్పటికిని ప్రాకృత జనులకు ఇట్టి దృష్టాన్తము చాల అనుకూలమని తలంచి, బ్రహ్మవిచారము భగవచ్చి న్తనచేయు నారీమణులుగూడ సులభముగా ఇది తెలిసికొని భగవద్ధ్యానము చేయుటకు అనుకూలమని తలంచియే ఈలాగున మహనీయులు నిరూపింతురు ఇదే ప్రకారము వేదాంతపంచదశియందు విద్యారణ్యస్వాముల వారు గూడ తెలిపిరి దానిని చూడుడు

**పరవ్యసనినీ నారీ వ్యగ్రాఽపి గృహకర్మణి ।**
**త దేదవాస్వాదయత్యంతః పరసంగరసాయనమ్ ॥**

పరపురుష సంగమమందు కామజనిత వ్యసనము గల వనిత గృహ విషయ కార్యములను జేయుచుండినను పరపరుష సంగమముచేత గలిగెడు ఆసుఖవిశేషమునే సర్వదా చింతించుచుండును సామాన్యముగా భగవద్ధ్యా నమును, దైవచింతనమును చేయుటకు అనుకూలము తక్కువగల నారీమణు లకు ఇది యెంతో మంచి యుపదేశము దేహేన్ద్రియములతో తత్కర్మలు చేయుచుండినను మనస్సుతో భగవంతుని సదా ధ్యానము చేసికొని తరించ వచ్చును మనస్సే మానవునకు ప్రధానముకాని దేహేన్ద్రియములు కావని

తెలిసికొని ఆత్మజ్ఞానము చేసికొని తరించవచ్చును



## యోగవాసిష్ఠము

**జీవన్ముక్తా మహాత్మానో నిత్యతృప్తా మహాధియః ।**
**ఆచారైరనుగన్తవ్యా న భోగకృపణాశ్శఠాః ॥**

నిత్య తృప్తులును, మహాధీశాలురును,జీవన్ముక్తులునగు మహాత్ముల యాచరణనే అనుసరించవలెను కాని భోగపరాయణుల యొక్కయు, ప్రాకృత గుణములు గలవారియొక్కయు, మోసకృత్యముగల వారియొక్కయు మార్గమును అనుసరించకూడదు

**వాసనాయాస్తథా వహ్నే ఋణవ్యాధి ద్విషామపి ।**
**స్నేహవైర విషాణాం యశ్శేషస్స్వల్పో ఽపి బాధతే ॥**

విషయవాసన, అగ్ని, ఋణము,శత్రువు, వ్యాధి,అనురాగము, (విషయానురాగము) వైరము, విషము- ఇవి కొంచెమైనను మిగిలియున్నను మహానర్థకకారణము లగుచున్నవి అందువలన వాటిని నిశ్శేషముగా రహిత మొనర్చవలయును

**అధ్యాత్మవిద్యా విద్యానాం ప్రధానం తత్కధాశ్రయమ్ ।**
**శాస్త్రం సచ్ఛాస్త్రమిత్యాహుర్ముచ్యతే తద్విచారణాత్ ॥**

అధ్యాత్మవిద్య విద్యలన్నిటిలో శ్రేష్ఠమైనది ఇట్టి ఆత్మవిద్యను నుడువు శాస్త్రమే సచ్ఛాస్త్రము ఇట్టి శాస్త్రమును పఠించిన ముక్తి లభించును విద్యాశబ్దమునకు, దేనివలన అవిద్య నశించునో అదియే అర్థమగును వేమన యోగీంద్రుడు చెప్పిన పద్యసారములను చూడుడు

**అక్షరపుటడవి జొరకయె**
**యక్షరమగు మహిమగాన నవనిం దొలుతా**
**నక్షరమును జపియించిన**

**నక్షయముగ నదియె చాలు నరయము వేమా!**

మొట్టమొదట అక్షరాభ్యాస కాలమున చెప్పిన ఓ, న, మః, శి, వా, యః, సి, ద్ధం, న, మః అని యుపదేశింపబడిన వానిలో మొదటి యక్షరమగు ఓంకారమును జపించిన అదియే అక్షయమగు బ్రహ్మసుఖమును గలుగ జేయును దేనికిని ఏది ఆదియో అదియే అంతమని గ్రహించదగినది

**దానమిజ్యా తపశ్శౌచం తీర్థం వేదాశ్రుతం తథా ।**
**అశాన్తమనసః పుంసః సర్వమేతదపార్థకమ్ ॥**

శాంతిలేని మానవునియొక్క దానము, యజ్ఞము, తపస్సు శౌచము, తీర్థాటనము, వేదాధ్యయనము, శాస్త్రశ్రవణము- ఆలాగున ఇక ఏ యే పవిత్రకర్మలు గలవో అవన్నియు అప్రయోజనములు, కావున మనశ్శాంతిని చేసికొనుటలో ప్రయత్నము చేయవలయును

**ఆధ్యాత్మవిధితత్త్వజ్ఞః క్షాంతశ్శక్తో జితేన్ద్రియః ।**
**ఋజుశ్చ సత్యవాదీ చ తస్మాత్సర్వత్ర పూజితః ॥**

అధ్యాత్మశాస్త్రవిధిని నెఱింగినవాడును, క్షమగలవాడును, ఆత్మశక్తి గలవాడును, జితేన్ద్రియుడును, ఋజుప్రవర్తనగల వాడును, సత్యవాదియు ఎల్లప్పుడును, ఎచ్చోటను పూజ్యుడగును



# భిక్షువర్గము

**సన్న్యాసి నామధేయములు**

భిక్షుః పరివ్రాట్కర్మన్దీ పారాశర్యపి మస్కరీ ॥ (అమరకోశః) 1 భిక్షతే, భిక్షుః = భిక్షాన్నమును భుజించి బ్రహ్మనిష్ఠచేయుచు జ్ఞానమును బోధించువాడు 2 పరిత్యజ్య సర్వం వ్రజతీతి, పరివ్రాట్ = అన్నిటిని పరిత్యజించి పోవువాడు 3 కర్మన్దీ, కర్మంద ఋషిప్రోక్త సూత్రమధీత ఇతి,

కర్మందీ = కర్మందుడను ఋషి చెప్పిన సూత్రముల నధ్యయనము చేయువాడు 4 పారాశర్యప్రోక్త సూత్రమధీతే, పారాశరీ = వేదవ్యాసులు చెప్పిన సూత్రముల నధ్యయనము చేయువాడు 5 మస్కరో వేణుదండః సోఽస్యాఽస్తీతి, మస్కరీ = వేణుదండము గలవాడు,లేక మాకరణశీలః కామ్యకర్మ ప్రతిషేధపరో వా, మస్కరీ = కామ్యకర్మములను నిషేధించు స్వభావము గలవాడు శ్రీ బుద్ధభగవానుడు ధర్మపదమున చెప్పిన భిక్షుధర్మములను చూడుడు

జేతవనము ఐదువందల భిక్షువులు

చక్ఖునాసంవరో సాధు సాధు సోతేన సంవరో ।
ఘాణేనసంవరో సాధు సాధు జివ్హాయ సంవరో ॥
చక్షుషా సంవరస్సాధుః సాధుశ్శ్రోత్రేణ సంవరః ।
ఘ్రాణేన సంవరస్సాధుః సాధుః జివ్హాయా సంవరః ॥ 1

నేత్రేంద్రియ సంయమము శుభప్రదమైనది అట్లనే శ్రోత్ర జిహ్వాఘ్రాణంబుల సంయమమును శుభప్రదమైనదే

కాయేన సంవరో సాధు సాధు వాచాయ సంవరో ।
మనసా సంవరో సాధు సాధుసబ్బత్థసంవరో ।
సబ్బత్థసంబుతో భిక్ఖూ సబ్బదుక్ఖాపముచ్చతి ॥ 2

కాయేన సంవరస్సాధుః సాధుః వాచాయసంవరః ।
మనసా సంవరస్సాధుః సాధుస్సర్వత్ర సంవరః ।
సర్వత్ర సంవృతో భిక్షుః సర్వదుఃఖాత్ప్రముచ్యతే ॥

మనోవాక్కాయముల సంయమము శ్రేయస్కరమైనది అట్లనే సర్వేంద్రియముల సంయమమును శ్రేయోదాయకమైనదే యగును సర్వేంద్రియ సంయమముగల భిక్షువు దుఃఖము లన్నింటి నుండి విముక్తు డగును

జేతవనము హంసఘాతకుడు (భిక్షువు)

హత్థసఞ్ఞతో పాదసఞ్ఞతోవాచాయసఞ్ఞతో సఞ్ఞతుత్తమో ।

ఆజ్ఝత్తరతో సమాహితో ఏకో సన్తుసితో తమాహుంభిక్ఖూ ॥
హస్తసంయతః పాదసంయతో వాచాసంయతః సంయతోత్తమః ।
అధ్యాత్మరతః సమాహితఏకః సన్తుష్టస్తమాహుర్భిక్షుమ్ ॥ 3

హస్తపాదముల సంయమము, వాక్సంయమము గలవాడును, ఉత్తమ సంయమియు, అధ్యాత్మనిరతుడును, సమాధియుక్తుడును, ఏకాకియు, సన్తుష్టుడును నగువాడు భిక్షువనబడును

జేతవనము కోకాలియుడు

యో ముఖసఞ్ఞతో భిక్ఖూ మన్తభాణీ అనుద్ధతో ।
అత్థం ధమ్మఞ్చ దీపేతి మధురం తస్స భాసితమ్ ॥
యో ముఖసంయతో భిక్షుర్మంత్రభాణీ అనుద్ధతః ।
అర్థం ధర్మంచ దీపయతి మధురం తస్య భాషితమ్ ॥ 4

వాక్సంయమము గలవాడును, లెస్సగా విచారించి పల్కువాడును, గర్వము లేనివాడును, ధర్మార్థముల ప్రకాశింప జేయువాడును నగు వాని భాషణము మధురముగా నుండును

జేతవనము ధమ్మారాముడు(వృద్ధ భిక్షువు)

ధమ్మారామో ధమ్మరతో ధమ్మ అనువిచిన్తయం ।
ధమ్మం అనుస్సరం భిక్ఖూ సద్ధమ్మా న పరిహాయతి ॥

ధర్మారామో ధర్మరతో ధర్మం అనువిచిన్తయన్ ।
ధర్మమనుస్మరన్ భిక్షుః సద్ధర్మాన్న పరిహీయతే ॥ 5

ధర్మనిరతుడై, ధర్మమును గూర్చి చింతించుచు, ధర్మమునే యనుస్మరించుచు నుండు భిక్షువు సద్ధర్మమునుండి చ్యుతుడు గాక యుండును

రాజగృహము (వేణువనము) విపక్ష (సేవకుడు) భిక్షువు

సలాభం నాతిమఞ్ఞేయ నాఞ్ఞే సంపిహయంచరే ।
అఞ్ఞేసం పిహయం భిక్ఖూ సమాధిం నాధిగచ్ఛతి ॥ 6

స్వలాభం నాతిమన్యేత నాన్యేషాం స్పృహయన్ చరేత్ ।
అన్యేషాం స్పృహయన్ భిక్షుః సమాధిం నాధిగచ్ఛతి ॥

తనకు లభించిన పదార్థ మల్పమయినను భిక్షు వద్దానిని నిరసన భావముతో జూడరాదు మఱియు అన్యులకు ప్రాప్తించిన ఉత్తమ వస్తువు నవలోకించి మత్సరగ్రస్తుడు కారాదు అన్యులయెడ విద్వేషము గల భిక్షువు చిత్తైకాగ్రత నెన్నటికిని పొందనేరడు

అప్పలాభోఽపి చే భిక్ఖూ సలాభం నాతిమఞ్ఞతి ॥
తంవేదేవా ప్రశంసన్తి శుద్ధాఽజీవం అతన్ద్రితమ్ ॥
అల్పలాభోఽపి చేద్భిక్షుస్స్వలాభం నాఽతిమన్యతే ।
తం వై దేవాః ప్రశంసన్తి శుద్ధాఽజీవం అతన్ద్రితమ్ ॥ 7

అల్పమైనను భిక్షువు తనకు లభించినదానికి నిరసింపరాదు శుద్ధజీవితము గలవానిని, అప్రమత్తుని దేవతలు ప్రశంసించెదరు

జేతవనము ఐదుగురు అగ్రదాయక భిక్షువులు

సబ్బసోనామ రూపస్మిం యస్సనత్థి మమాయితమ్ ।
అసతా చ న సోచతి సవే భిక్ఖూతి వుచ్చతి ॥

సర్వశో నామరూపే యస్య నా స్తి మమాయితమ్ ।
అసతి చ న శోచతి సవై భిక్షురిత్యుచ్యతే ॥ 8

నామరూపములందు (జగత్తున) మమత్వ మేమియు లేని వాడును, ఏమియు లభింపకున్నను దుఖింపనివాడును భిక్షువనబడును

మేత్తావిహారీ యో భిక్ఖూ పసన్నో బుద్ధసాసనే ।
అధిగచ్ఛే పదం శాన్తం సఙ్ఖారూపసమం సుఖమ్ ॥

**మైత్రీ విహారీ యో భిక్షుః ప్రసన్నబుద్ధశాసనే ।**
**అధిగచ్ఛేత్పదం స న్తం సంస్కారోపశమం సుఖమ్ ॥ 9**

మైత్ర భావముగల్గి వర్తించుచు ఏ భిక్షువు బుద్ధోపదేశమున శ్రద్ధ గల్గియుండునో, అతడు సర్వసంస్కారములను శమింపజేయునదియు, ప్రశాంత మును, సుఖమయమును నగు దివ్యపదము (నిర్వాణము) నొందును

**సిఞ్చ భిక్ఖూ ఇమం నావం సిత్తాతే లహుమేస్సతి ।**
**ఛేత్వా రాగఞ్చ దోసఞ్చ తతో నిబ్బాణమేహిసి ॥**

**సించ భిక్షో ఇమాం నావం సిక్తాతే లఘుత్వం ఏష్యతి ।**
**ఛిత్వా రాగఞ్చ ద్వేషఞ్చ తతో నిర్వాణమేష్యసి ॥ 10**

ఓ శ్రావకా! ఈ (జీవ) నౌకను భావ (రాగద్వేష) విముక్తము గావింపుము అప్పుడే అయ్యది తేలికయై గమ్యస్థానమును శీఘ్రముగ చేరగలదు. రాగద్వేషములను వినాశ మొనర్చినచో త్వరలో నిర్వాణమును నొందగలవు

**పంచఛిన్దే పఞ్చజహే పఞ్చవుత్తరి భావయే ।**
**పఞ్చసఙ్గాతిగో భిక్ఖూ ఓఘతిణ్ణోతి వుచ్చతి ॥**

**పఞ్చఛిన్ది పంచ జహీహి పఞ్చోత్తం భావయ ।**
**పంచసఙ్గా ఉ తిగో భిక్షుః ఓఘతీర్ణ ఇత్యుచ్యతే ॥ 11**

ఐదింటిని (1) ఛేదింపుము, ఐదింటిని (2) త్యజింపుము, పిమ్మట ఐదింటిని (3) భావింపుము, ఐదింటి (4) సంసర్గము నతిక్రమించుట- భిక్షువు "ఓఘతీర్ణుడు" సంసారప్రవాహములను (5) దాటిన వాడు అని చెప్పబడును

1 రూపము, రాగము,అభిమానము, గర్వము, అవిద్య

2 అహంకారము,సందేహము, కఠినవ్రతానుష్ఠానము, భోగాసక్తి, హింస

3 శ్రద్ధ, వీర్యము, స్మృతి , సమాధి, ప్రజ్ఞ

4 రాగము, ద్వేషము, అభిమానము, అసత్యభావన

5 కామము, సంసారదృష్టిఅవిద్య

ఝాయ భిక్ఖు మాచపాయదో మాతేకామగుణే భమస్సుచిత్తమ్ ।
యాలోహగులం గిలీపమత్తో మాకందీ దుక్ఖమిదన్తిడయ్హమానో ॥
ధ్యాయ భిక్షో మా చప్రమాదః మా తే కామగుణే భ్రమతు చిత్తమ్ ।
మాలోహ గోలంగిలప్రమత్తః మాక్రన్దీః దుఃఖమిదమితి దహ్యామానః ॥ 12

ఓ శ్రావకా ! నీవు ధ్యానమగ్నుడవు కమ్ము, ప్రమత్తతను వీడుము, నీ చిత్తము భోగచక్రమున తగుల్కొనకుండుగాక, ప్రమత్తుడవై తప్తలోహపిండ మును మ్రింగకుందువుగాక, దగ్ధుండ వగుచు పిదప, అయ్యో! ఇది దుఃఖమని హాహాకారము లిడకుందువుగాక!

నత్థి ఝానం అపఞ్ఞస్స పఞ్ఞానత్థి అఝాయతో ।
యమ్హి ఝానఞ్చ పఞ్ఞాచ సవేనిబ్బాణసన్తికే ॥

నాస్తి ధ్యానమప్రజ్ఞస్య ప్రజ్ఞానాస్త్యధ్యాయతః ।
యస్మిన్ ధ్యానంచ ప్రజ్ఞా చ స వై నిర్వాణాన్తికే । 13

ప్రజ్ఞాహీనునకు ధ్యానము సిద్ధింపదు ధ్యానము (ఏకాగ్రత) ఒనర్పని వానికి ప్రజ్ఞ కలుగదు ప్రజ్ఞాధ్యానములు రెండును గలవాడు నిర్వాణపదమును సమీపించిన వాడగును

సుఞ్ఞాగారం పవిట్ఠస్స సన్త చిత్తస్స భిక్ఖునో ।
అమానుసీ రతీహోతి సమ్మాధమ్మం విపస్సతో ॥
శూన్యాగారం ప్రవిష్టస్య శాన్తచిత్తస్య భిక్షోః ।
అమానుషీ రతిర్భవతి సమ్యగ్ ధర్మం విపశ్యతః ॥ 14

ఏకాంతప్రదేశము నాశ్రయించి, శాంతచిత్తుడై ధర్మమును లెస్సగ సాక్షాత్కరించుకొనిన భిక్షువునకు అలౌకికానంద ముదయించును

యతోయతో సమ్మసతి ఖన్ధానాం ఉదయవ్యయమ్ ।

**లభతీ పీతి పామొజ్జం అమయతంతం విజానతమ్ ॥**
**యతో యతస్సంమ్మృశతి స్కన్ధానాం ఉదయవ్యయమ్ ।**
**లభతే ప్రీతిప్రామోద్యం అమృతం తద్విజానతామ్ ॥ 15**

పంచస్కంధముల (రూపము, వేదన, సంజ్ఞ, సంస్కారము, విజ్ఞానముల) యుత్పత్తి వినాశముల గూర్చి విచారించిన కొలది జ్ఞానుల కనుభవైకవేద్యమగు ఆనందామృతమును మనుజుడు పొందుచుండును

**తత్రాయమాది భవతి ఇధపఞ్ఞస్సభిక్ఖునో ।**
**ఇన్ద్రియగుత్తీ సన్తుట్ఠీ పాతిమోక్ఖేచ సంవరో ।**

**మిత్తే భజస్సు కల్యాణే సుద్ధాజీవే అతన్దితే ॥**
**తత్రాయమాదిర్భవతీహ ప్రజ్ఞస్య భిక్షోః ।**

**ఇన్ద్రియగుప్తిః సన్తుష్టిః ప్రాతిమోక్షేచ సంవరః ।**
**మిత్రాణి భజస్వ కల్యాణాని శుద్ధాజీవాన్యతన్ద్రితాని ॥ 16**

ప్రాజ్ఞుడగు భిక్షువు ప్రధమమున ఇంద్రియసంయమము, సన్తుష్టి గల్గియుండవలయును. మఱియు ప్రాతిమోక్షమును (భిక్షువుల యాచారనియామాదులను) కాపాడవలెను ఇందులకై యాతడు అప్రమత్తులును, శుద్ధజీవిక గలవారును నగు సన్మిత్రులనే సేవించవలెను

**పటిసన్థారవుత్తస్స ఆచారకుసలో సియా ।**
**తతో పామొజ్జబహులో దుక్ఖస్సన్తం కరిస్సతి ॥**

**ప్రతిసంస్తారవృత్తస్యా ఉచారకుశలస్స్యాత్ ।**
**తతః ప్రామోద్య బహులో దుఃఖస్యాన్తం కరిష్యతి ॥ 17**

పరోపకారనిరతుడును, సేవాపరాయణుడును, ధర్మాచరణమందును, నియమ పాలనమందును, నిపుణుడును నగువాడు ఆనందయుతుడై దుఃఖవినాశన మొనర్చుకొనును

జేతవనము ఐదువందల భిక్షువులు

వస్సికా వియ పుప్ఫాని మద్దవాని పముఞ్చతి ।
ఏవం రాగఞ్చ దోసఞ్చ విప్పముఞ్చేథ భిక్ఖవో ॥
వర్షికా ఇవ పుష్పాణి మర్దితాని ప్రముంచతి ।
ఏవం రాగఞ్చ ద్వేషఞ్చ విప్రముంచత భిక్షవః ॥ 18

వాడిన పుష్పములను వసంతకాల లత పరిత్యజించు విధమున, ఓ శ్రావకులారా! మీరు రాగద్వేషములను పరిత్యజింపుడు

జేతవనము శాన్తకాయుడు(భిక్షువు)

సన్తకాయో సన్తవాచో సన్తవా సుసమాహితో ।
వన్తలోకామిసో భిక్ఖూ ఉపసన్తోతి వుచ్చతి ॥
శాన్తకాయో శాన్తవాక్ శాన్తిమాన్ సుసమాహితః ।
వాన్తలోకామిషో భిక్షుః ఉపశాన్త ఇత్యుచ్యతే ॥ 19

వాక్కాయములు ప్రశమన మొందినవాడును, ఉత్తమ సమాధి యుక్తుడును, శాంతియుతుడును, విషయవాసనలను పరిత్యజించినవాడును నగు భిక్షువు ఉపశాన్తు డనబడును

జేతవనము లంగూలుడు(భిక్షువు)

అత్తనాచోదయత్తానం పటివాసే అత్తమత్తనా ।
సో అత్త గుత్తో సతిమా సుఖం భిక్ఖూ విహాహిసి ॥
ఆత్మనా చోదయేదాత్మానం ప్రతివసేదాత్మానం ఆత్మనా ।
స ఆత్మగుప్తః స్మృతిమాన్ సుఖం భిక్షో విహరిష్యసి ॥ 20

తన్ను తానే ప్రేరణ మొనర్చువాడును, తన్ను తానే కార్యమందు సంలగ్న మొనర్చు కొనువాడును, తన్ను తానే సంరక్షించు కొనువాడును, ప్రజ్ఞాయుతుడును నగుభిక్షువు సుఖముగా విహరించును

అత్తాహి అత్తనోనాథో అత్తాహి అత్తనోగతి ।
తస్మా సఞ్ఞమయత్తానం అస్సం భద్రం వవాణిజో ॥

**ఆత్మా హ్యాత్మనో నాథ ఆత్మా హ్మాత్మనో గతిః ।**
**తస్మాత్ సంయమమాత్మానం అశ్వం భద్రమివ వణిక్ ॥ 21**

తనకు తానే ప్రభువు తన గతికి తానే కారకుడు కాన సుందరమగు అశ్వమును వణిజుడు స్వాధీనపరచుకొనులాగున మనుజుడు తన్ను సంయమ మొనర్చుకొనవలయును

రాజగృహము (వేణువనము) వక్కలి (భిక్షువు)

**పామోజ్జ బహులో భిక్ఖూ పసన్నో బుద్ధ సాసనే ।**
**అధిగచ్ఛే పరం సన్తం సజ్ ఖారూపసమం సుఖమ్ ॥**
**ప్రామోద్య బహులో భిక్షుః ప్రసన్నో బుద్ధ శాసనే ।**
**అధిగచ్ఛేత్ పదం శాన్తం సంస్కారోపశమం సుఖమ్ ॥ 22**

బుద్ధోపదేశమును ప్రసన్న హృదయుడై యాచరించుచు మిగుల యానందముతో గూడి వర్తించు భిక్షువు సంస్కారము లన్నిటిని నశింపజేసికొని సుఖవంతుడై ప్రశాన్తపదము (నిర్వాపదము) నొందును

శ్రావస్తి (పూర్వారామము) సుమనుడు(సామణేరుడు)

**యోహ వేదహరో భిక్ఖూ యుఞ్జతే బుద్ధ సాసనే ।**
**సో ఇమం లోకం సభాసేతి అబ్భాముత్తో వ చన్దిమా ।**
**యోహ వైదహరో భిక్షుర్యుం క్తే బుద్ధ శాసనే ।**
**స ఇమం లోకం ప్రభాసయత్యభ్రాన్ముక్త ఇవ చన్ద్రమాః ॥ 23**

యౌవన కాలమందే బుద్ధధర్మమున మగ్నుడై యుండు భిక్షువు మేఘవినిర్ముక్తుడగు చంద్రునివలె లోకమును ప్రకాశింపజేయును

నిర్వాణనిలయము సంపూర్ణము

ఓమ్ తత్ సత్ ఓమ్

